# శ్రీ మలయాళ సద్గురు గ్రంథావళి

## పందొమ్మిదవ సంపుటము

**ఓంకారసత్రయాగము, సాంఖ్యయోగము, గీతాశయము,**
**ప్రచార ప్రాశస్త్యము, యథార్థ భారతి (చిన్నపొత్తము),**
**ప్రమాదము వొందకుడు, ముక్తిసోపానము,**
**సమాధిచేయు విధానము**


ప్రకాశకులు

**శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ సంఘము**

**శ్రీవ్యాసాశ్రమము**

చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్

2001

# నివేదన

శ్రీవ్యాసాశ్రమం ప్రచురిస్తున్న ఆధ్యాత్మిక గ్రంధాలు పాఠకలోకానికి సుపరిచితాలే ఈ గ్రంధాలను భక్తులు మిక్కిలి శ్రద్ధతో పఠిస్తున్నారు ఆధ్యాత్మిక సారస్వత ప్రచారం ద్వారా సాటి లేని సేవ చేసే సంస్థగా ఆశ్రమం ప్రసిద్ధి వహించింది

మహర్షి - సద్గురు శ్రీ మలయాళస్వాములవారు స్వయంగా రచించిన గ్రంధాలు ఆశ్రమప్రచురణలలో అత్యంత విశిష్టమైనవి అవి పలు సార్లు ముద్రణ పొంది అనన్య సామాన్యమైన ప్రచారం పొందాయి జిజ్ఞాసు జనానీకంలో జడత్వాన్ని తొలగించి చైతన్యం కల్గించడంలో విజయం సాధించాయి

శ్రీవారి రచనలు ప్రస్తుతం వివిధ పరిమాణాలలో నానాగ్రంధాలుగా ముద్రింపబడివున్నాయి వీటినన్నింటిని ఒకే పరిమాణం కల గ్రంధ రాశిగా ''శ్రీమలయాళ సద్గురు గ్రంధావళి'' అన్న పేరుతో ముద్రించడం మంచిదని అభిజ్ఞులు సూచించారు ఈ సూచనను పూజ్యశ్రీ విద్యానందగిరి స్వాములవారు ఆమోదించారు

శ్రీవారు గోగర్భములో తపస్సు చేసే సమయం 1919లో రచించిన శుష్కవేదాంత తమోభాస్కరం ఇందులో మొదటి సంపుటమవుతుంది ఇంచుమించు ఆగ్రంధాన్ని పోలిన పరిమాణంలోనే తక్కిన సంపుటా

లుంటాయి ఇలా ప్రచురిస్తే ఒక్కొక్కటి సుమారు నాలుగువందల పుటలు గల సంపుటాలు ఇరువదికి పైగా సిద్ధమవుతాయి

2001వ సంవత్సరంలో జరుగనున్న శ్రీవ్యాసాశ్రమవజ్రోత్సవ శుభసందర్భంలో పై సంపుటాలను విడుదల చేయాలని శ్రీస్వాములవారి సమ్మతితో వజ్రోత్సవ నిర్వాహక సంఘం వారు నిర్ణయించారు ఈ సంపుటాల క్రోడీకరణ, ముద్రణ **శ్రీ సముద్రాల లక్ష్మణయ్య** గారి సంపాదకత్వం క్రింద జరుగుతున్నది

భగవదనుగ్రహంతో, శ్రీసద్గురుదేవుల ఆశీర్వాదంతో, భక్తుల ప్రోత్సాహంతో ఈ గ్రంథ ప్రచురణ ప్రణాళిక విజయవంతం కాగలదని ఆశిస్తున్నాము

శ్రీ వ్యాసాశ్రమం

ప్రకాశకులు





# తొలిపలుకు

శ్రీమలయాళ సద్గురు గ్రంధావళిలో ఇది పందొమ్మిదవ సంపుటము. ఇందులో ఈక్రింద పేర్కొన్న గ్రంధాలను క్రోడీకరించడం జరిగింది

1. ఓంకార సత్రయాగము, 2 సాంఖ్యాయోగము, 3 గీతాశయము, 4.ప్రచారప్రాశస్త్యము, 5 యధార్థభారతి - చిన్నపాత్రము, 6. ప్రమాదము నొందకుడు, 7 భగవద్గీతాష్టాదశాధ్యాయ ముక్తిసోపానము మరియు 8. సమాధి చేయు విధానము

28-3-1940 నుండి 17-4-1940 వరకు 21రోజులు శ్రీసద్గురు స్వాములవారు కృష్ణాతీరమందలి 'దోనేపూడి' గ్రామములో ఓంకార సత్రయాగం నిర్వహించారు అప్పుడు భగవద్గీతనూ, ఉత్తరగీతనూ వివరిస్తూ ప్రవచనాలు చేశారు కొందరు భక్తులు ఆప్రవచనాలను వ్రాసుకొన్నారు. అలా వ్రాసినవారిలో శ్రీపరబ్రహ్మానంద స్వాములవారు ముఖ్యులు శ్రీ బ్రహ్మచారి ఆనందమోహన్ గారు (పూజ్యశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు) ఆ వ్రాత ప్రతులను సేకరించి వాటికి 'ఓంకారసత్రయాగం' అన్న పేరుతో గ్రంధరూపం కల్పించారు

'సాంఖ్యయోగము' అన్న గ్రంధం రాజమండ్రిలో 1931లో జరిగిన సనాతన ధర్మసభ పంచమవార్షికోత్సవములో శ్రీవారు సాంఖ్యతత్త్వముపై కావించిన ప్రబోధం శ్రీకొత్త వెంకటరత్నంగారు శ్రీవారి ప్రబోధాన్ని గ్రంధంగా రూపొందించారు నాటి సభలో బ్రహ్మశ్రీ కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు శ్రీవారిని స్తుతిస్తూ సంస్కృతములో వ్రాసిన పంచరత్నాలు, శ్రీమతి నందివాడ శేషమాంబగారు తెలుగులో రచించిన పద్యరత్నాలు గ్రంధం చివర పొందుపరచడమైనది

నిష్కామకర్మయోగమొక్కటే గీతాశయమని చెప్పువారి వాదం అంగీకార యోగ్యం కాదంటూ శ్రీస్వాములవారు గీత సర్వయోగ సమన్వయాత్మకమైన గ్రంధరాజమని 'గీతాశయము'లో యుక్తియుక్తంగా నిరూపించారు

'ప్రచారప్రాశస్త్యము' శ్రీస్వాములవారు తమ చివరి దశలో వ్రాసిన గ్రంథం ఏదైనా ఒక విషయం వ్యాప్తి పొందాలంటే దానికి సరియైన ప్రచారం అవసరమంటూ ప్రాచీనకాలంలో రామాయణ - భారత - భాగవతాది గ్రంథాలు ప్రచారం ద్వారా ఎలా వ్యాప్తి చెందాయో ఇందులో వివరించారు

'యధార్థభారతి - చిన్నపొత్తము' లో కర్మ, యుగము, వర్ణము, ఆశ్రమము మొదలైన అంశాల యధార్థ స్థితిని శ్రీగురుదేవులు చాలా నిపుణంగా నిరూపిస్తూ ఆయా విషయాలపై ప్రజలకుగల మూఢవిశ్వాసాలను దూరీకరించారు

'తత్త్వమసి' అన్న మహావాక్యాన్ని ఒక్కసారి శ్రవణంచేస్తే చాలు అనేవారి అభిప్రాయం సరి కాదంటూ శ్రీస్వాములవారు శ్రవణ మనన నిదిధ్యాసలు దీర్ఘకాలం అనుష్ఠిస్తేగాని వాసనాక్షయ మనోనాశాలు సిద్ధించవని అనేక ప్రమాణాలతో 'ప్రమాదము నొందకుడు' అన్న పుస్తకములో విశదీకరించారు

'భక్తవద్గీతాష్టాదశాధ్యాయ ముక్తి సోపానం' అన్న చిన్న గ్రంథంలో సోపానాష్టాదశంతో పరబ్రహ్మప్రాప్తి (సోపానాష్టాదశైరేవం పరం బ్రహ్మాధి గచ్ఛతి) అన్న ద్వితీయ గీతా మాహాత్మ్యంలోని వచనాన్ని గ్రహించి శ్రీవారు మోక్షసౌధాన్ని అధిరోహించడానికి గీతలోని 18 అధ్యాయాలలో ఒక్కొక్క అధ్యాయము నుండి ఒక్కొక్క శ్లోకం చొప్పున 18 శ్లోకాలను సోపానాలుగా నిరూపించారు

మహనీయుల శరీరాలను వారిదేహ వియోగానంతరం ఎలా సమాధి చేయాలి అన్న భక్తుల సంశయాలను నివారించడానికి వ్రాసిన పుస్తకం 'సమాధి చేయు విధానము'

ఈ రీతిగా శ్రీసద్గురు స్వాములవారు వివిధ విషయాలపై వ్రాసిన గ్రంథాలు సాధకులకు ఎంతో ఉద్బోధాన్ని కలిగిస్తున్నాయి

శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవాల సందర్భంలో శ్రీమలయాళ సద్గురు స్వాములవారి రచనల నన్నింటినీ క్రోడీకరించి "శ్రీమలయాళ సద్గురు గ్రంథావళి" అన్న పేరుతో ఇరువది సంపుటాలుగా ప్రచురించే సదవకాశం లభించడం శుభావహం ఆత్మోన్నతిని ప్రసాదించే ఈగ్రంథావళిని భక్తులు ఆదరంతో పఠించి కృతకృత్యులై శ్రీసద్గురు దేవుని అనుగ్రహానికి పాత్రు లగుదురుగాక!

శ్రీవ్యాసాశ్రమము — సముద్రాల లక్ష్మణయ్య

**17-12-2000**

# విషయ సూచిక


౧ నివేదన

౨ తొలిపలుకు

౩ విషయ సూచిక

**1. ఓంకారసత్రయాగము (1-286)**

పీఠిక 1

ఉత్తరగీత 217

అనుబంధము 253

**2.సాంఖ్యయోగము(287-346)**

పీఠిక 289

సాంఖ్యయోగము 293

స్థూలపంచీకృత భూత వివరణము 315

పృథ్వీతత్త్వపంచక వివరణము 316

జలతత్త్వ పంచకము 316

అగ్ని తత్త్వపంచకము 316

వాయు " 316

ఆకాశ " 317

చతుర్వింశతి తత్త్వములు 318

షట్త్రింశ త్తత్త్వములు 318

షణ్ణవతి తత్త్వార్థ వివరణము 320

జ్ఞానేంద్రియాలు 320

కర్మేంద్రియాలు 321

సాంఖ్యవిచారణము 331

పంచరత్నములు 343

పద్యరత్నములు 344

**3.గీతాశయము(347-420)**

గీతాశయము 347

శ్రీగురుశ్శరణం 349

గీతాశయము 351

భారతము - మహాప్రస్థానిక పర్వము 365

భాగవతము - ఏకాదశస్కంధము 383

ఉత్తరగీత 401

**4. ప్రచార ప్రాశస్త్యము (421-479)**

మున్నుడి 423

పీఠిక 425

ప్రచార ప్రాశస్త్యము 427

సూతసంహిత 441

ప్రచార ప్రభావము (భాగవత ప్రథమస్కంధము) 446

శ్రీసీతారామాంజనేయ సంవాదము రామనామ ప్రభావము 458

శ్రీరామచంద్రామాయణ మాహాత్మ్యము 460

శ్రీమహాభారత ప్రశస్తి 463
శ్రీమద్భాగవత మాహాత్మ్యము 464
శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రము
నందలి ఉత్తరపీఠిక 468
అర్ధేశ్వర స్తుతి ప్రార్థనా 471
ఆపస్తంబసూత్రము 475
పరోపకార లక్షణము 477
సన్న్యాసి లక్షణము 478

## 5. యథార్థభారతి
## (చిన్నపాత్తము) (481-514)

మంగళము 483
కర్మనిర్ణయము 483
యుగనిర్ణయము 490
వర్ణ నిర్ణయము 493
ఆశ్రమ నిర్ణయము 495
జననమరణముల నిర్ణయము 497
బాల్యయౌవనాది నిర్ణయము 499
చతుర్విధజీవరాసుల నిర్ణయము 500
దేవమానవుల నిర్ణయము 502
అవస్థాత్రయ నిర్ణయము 503
స్త్రీపురుషుల నిర్ణయము 505
సర్వసంగ్రహము 507

## 6. ప్రమాదము నొందకుడు
## (515-553)

అవతారిక 517
బ్రహ్మనిష్ఠులలోగల ప్రమాదము 519
విశుద్ధసత్త్వము 522
నిరంతరాభ్యాసము 525
శ్రవణము 527
యాజ్ఞవల్క్యమహర్షి 529
అష్టావక్రమహాముని 532
శుష్కవేదాంతులు 533
యోగతత్త్వోపనిషత్తు 535
పంచదశి ధ్యానదీపము 536
అనుభూతిప్రకాశము 538
సోఽహము 539
ప్రశ్న 541
జ్ఞానము 542
జీవన్ముక్తికి సాధనములు 543
యోగవాసిష్ఠము 547
విచారసాగరము 549
అధికారి 551

భగవద్గీష్టాదశాధ్యాయ

## 7. ముక్తిసోపానము
## (555-566)

పీఠిక 555
ముక్తిసోపానము 561

## 8. సమాధిచేయు విధానము
## (567-577)

అవతారిక 569
సమాధిచేయు విధానము 571
సమాధి స్థాపన చేసెడి విధానము 572
పూజావిధానము 575
కర్మకాండము 575
పూజాసంగ్రహము 577

ఓంకారసత్రయాగము ·

# పీఠిక

తొల్లి నైమిశారణ్యమున గోమతీపుణ్యస్రవంతీ సలిలధారలచే నిత్యము పునీతంబొనర్పబడుచుండినట్టి పవిత్ర తీర్థస్థలంబున ద్వాదశవార్షికంబైన యాగంబొండు గావింపబడ, నయ్యవసరమున ఆసేతుహిమాచల పర్యంత ముగల ఋషి, మునిగణంబంతయు విచ్చేసియుండ, నపుడు సూతాది పరమ భాగవతోత్తము లెల్లరు అష్టాదశపురాణాదులను భక్తకోటికెల్ల బోధించి, తద్రూపమున జ్ఞానామృతమంతయు జనులకు వెదజల్లి యుండిరి కాలక్రమ మున నట్టియాగములు లోకమున నరుదయ్యెను 'శ్రేయాన్ద్రవ్యమయాద్య జ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప' అని ద్రవ్యయజ్ఞములకంటె జ్ఞానయజ్ఞము లధిక మాహాత్మ్యము గలవనియు, సర్వోత్కృష్టము లనియు శ్రీకృష్ణపరమాత్మ వచించి యుండినను, జనసామాన్యముయొక్క దృష్టి మఱల వాటిపైకే బోవు చుండెను ఇక్కారణమున అధ్యాత్మబోధలు ప్రజలలో వ్యాప్తియగుట కను వగు నవకాశము లభింపమి, బ్రహ్మవిద్య పతనమొంద నారంభించెను

కాని సర్వేశ్వరుని కృపాతిరేకంబున ఇపుడిపుడు జనులలో కొంత ప్రబోధమేర్పడ, అధ్యాత్మవిద్యాప్రాశస్త్యమును గుర్తెఱింగిన మహనీయులు కొందఱు పతితబ్రహ్మవిద్యను పునరుద్ధరించుటకై కృతనిశ్చయులైరి పరమా ర్థతత్త్వమును సర్వజనులకు సులభముగ బోధించుటకుగాను, నిగూఢవేద రహస్యముల తామాచరించి యితరులచే నాచరింప జేయుటకు గాను, భక్త సమావేశములను, జ్ఞానసభలను, సత్రయాగములను వారు గావించుచున్నారు

కొలది దినముల క్రిందటనే కృష్ణానదీతీరమున దోనేపూడియను గ్రామమున ఓంకారసత్రయాగము 28 3 1940 నుండి 17 4 1940 వఱకు 21 దినములు జరుపబడెను అత్తఱి నచట సమావేశమైన భక్తజనులకు, ముముక్షువులకు శ్రీశ్రీశ్రీ మలయాళస్వాములవారు పెక్కుధర్మబోధల నొనర్చిరి, శ్రీవారు ప్రతిదినము ఉదయము గీతాతత్త్వమును గూర్చియు, పతంజలి యోగసూత్రములను గూర్చియు, సాయంసమయమున ఓంకార మహిమను గూర్చియు తేటతెల్లముగ వచించి భక్తులెల్లర నానందాబ్ధి నోలలాడించిరి

ప్రస్తుతకాలమున నధ్యాత్మలోకమున, వేరుపురుగువలె దాపురించుచున్న శుష్కవేదాంతమును సమూలముగ విచ్ఛేదమొనర్చు విధానమును గూర్చియు, తన్మతానుయాయులగు కుతార్కికుల శుష్కవచనములను ఖండించుట గూర్చియు, ఆత్మలోకమున సమున్నతి వడయుటకై వలసిన యుపాయంబుల గూర్చియు శాస్త్రప్రమాణ [illegible]యుక్తులద్వారా శ్రీస్వాములవారపుడు సెలవిచ్చిన [illegible] చున్నయవి కాని యెట్టిబోధయైనను గ్రంథరూపమున స్థిరాకృతి బడసిననే పలువురకు శ్రేయోదాయకమగునని యెంచి అయ్యోంకారసత్రయాగమున శ్రీస్వాములవారు గావించిన హితబోధలెల్లను, సదుపదేశ దివ్యప్రసంగముల నన్నిటిని నొకచోజేర్చి ముద్రించ దలంచితిమి బోధనాసమయమున వారి ముఖతః వెలువడిన వాక్యామృత ధారాప్రవాహమును సమగ్రరూపమున నందుకొని లిఖించుకొనుట కెవరికిని సాధ్యము గాకపోయినను, అచటచట మాత్రము కొందఱు భక్తులిద్దానిని లిఖితరూపమున స్థిరపఱచిరి వాటి నన్నిటిని సేకరించి 'ఓంకారసత్ర యాగము'ను నీ గ్రంథరూపమున భక్త జనుల యుపయోగార్థమై వెలుగు పఱచుచున్నాము. ముఖ్యముగ యీడువు గల్గు శ్రీ[illegible] శ్రీ[illegible] హ్మానందస్వాముల [illegible] మాకు చాల సహాయము [illegible]భించినందున వారికెంతయో కృతజ్ఞులము

సర్వులకు నుపకరించులాగు ఈ గ్రంథ[illegible] శైలిలో వ్రాయబడినది మూలసిద్ధాంత[illegible] స్వాములవారు తఱచు దృష్టాంత దార్ష్టాంతములను, ఉపమానములను, కథలను, యుక్తులను పెక్కింటిని తెలుపుచుందురు వాటినన్నిటిని సాధ్యమైనంత వరకిందులో జేర్చితిమి. కాననియ్యది సహేతుకముగను, యుక్తియుతముగను, మనోరంజకముగను గూడ నొప్పుగలదు ఆధ్యాత్మజ్ఞాన పిపాసులెల్లరు ఈ గ్రంథము నామూలాగ్రము పఠించి యందలి బోధనామృతసారమును హృద్గత మొనర్చుకొని విజ్ఞానప్రాప్తినొంది ధన్యులయ్యెదరుగాక!

**బ్రహ్మచారి ఆనందమోహన్.**



# ఓంకార సత్రయాగము.

## శ్రీమలయాళస్వాములవారి ధర్మబోధ.

(ప్రమాది సం ఫాల్గుణ బ 5 గురువారము విక్రమ సం చైత్ర శుద్ధ 10 బుధవారము)

28-3-1940నుండి 17-4-1940 వరకు

దోనేపూడిలో జరిగిన ఓంకారసత్రయాగమున బోధించినది

### 1వ రోజు 28-3-1940

**ఓమ్ గీతాకల్పతరుం భజే భగవతా కృష్ణేన సంరోపితం**
**వేదవ్యాసవివర్ధితం శ్రుతిశిరోబీజం ప్రబోధాంకురమ్।**
**నానాశాస్త్రరహస్యశాఖమరతిక్షాన్తిప్రవాళాఙ్కితం**
**కృష్ణాంఘ్రిద్వయభక్తిపుష్పసురభిం మోక్షప్రదం జ్ఞానినామ్॥**

గీతాప్రాశస్త్యమును దెల్పు శ్లోకమిది ఇందు గీత కల్పవృక్షముగా వర్ణింపబడెను. కామధేనువు, కల్పవృక్షము, చింతామణియను మూడు వస్తువులు దేవతలవద్ద గలవు వాటిని దేవతలేగాక ప్రయత్నముచే మానవులైనను సంపాదించుకొనవచ్చును వసిష్ఠుల యాశ్రమమున కామధేనువున్నట్లు మనము వినియున్నాము గదా! వీటి యంతరార్థమేమన, వికల్పము లన్నియు నశించి నిర్వికల్పస్థితి నొందువాడే కల్పవృక్షమను సిద్ధి బడసెననియు, కామన లన్నియు నశించి నిష్కామస్థితి నొందువాడే కామధేనువను సిద్ధి బడయగల్గెననియు, చింతలెవ్వియు లేక నిశ్చింతావస్థ నొందినవాడే చింతామణి యను సిద్ధి బొందెననియు ఎఱుంగవలెను

గీతాకల్పతరుం భజే – గీతయను కల్పవృక్షమును నేను భజించెదను ఆ కల్పవృక్ష మెటువంటిదనగా, భగవతా కృష్ణేన సంరోపితమ్ – భగవంతుడైన శ్రీకృష్ణపరమాత్మచేత నాటబడినదై యున్నది సామాన్యముగా నొక యుద్యానమును స్థాపించునపుడుగాని, తోటను నిర్మించునపుడు గాని, యొక్క పుణ్యపురుషుడగు మహనీయునిచే ప్రప్రథమమున నొక వృక్షమునట నాటింపింతురు అట్లనే, భవిష్యత్కాలమున అనంత శాఖోప

శాఖలుగ విస్తరించి మానవకోట్ల సంసారతాపము నెల్ల నడంచి ఆత్మశాంతి యను వినిర్మలచ్ఛాయ నొసంగి సంతృప్తిపఱుపనున్న యీ గీతా కల్పవృక్షము ప్రప్రథమమున శ్రీకృష్ణపరమాత్మచే లోకమున నాటఁబడెను వేద వ్యాసవివర్ధితమ్ - వేదవ్యాసులచే నది వృద్ధినొందింపబడెను చెట్టును పెట్టినం తమాత్రాన పని పూర్తికాలేదు దానిని పోషించి వృద్ధిపఱచువారు కూడ నుండవలెను. అట్లనే కృష్ణపరమాత్మచే నాటబడిన యీ గీతాకల్పవృక్ష మును, అనగా భగవానునిచే రణరంగమున నర్జునునకు బోధింపబడిన సూత్ర వాక్యములను, గైకొని శ్రీవ్యాసమహర్షి యమునానదీ మధ్యస్థ ద్వీపమునందు నేకాంత మున గూర్చుండి బాగుగ చింతనజేసి శ్రుతార్థమును విస్తరించి ఛందోబద్ధ మొనర్చి శ్లోకరూపేణ లోకమునకు బహిర్గతమొనర్చెను అదియే నేడు దాదాపు 700శ్లోకములతో గూడి విఖ్యాతిగాంచిన ఈమన గీతా శాస్త్రము ఇవ్విషయ మెఱుంగని సామాన్యప్రజ్ఞగల కొందఱు రణరంగమున నంత స్వల్పకాలమున 700శ్లోకములతో గూడిన విస్తారమగు నీ గీతాశాస్త్ర మంతయు కృష్ణపరమాత్మ యర్జునున కెట్లు బోధింపగల్గెనని ప్రశ్నింతురు అట్టివారు తమ యల్ప మానవప్రజ్ఞతో దైవప్రజ్ఞను కొలుచువారే యగుదురు అఘటనా ఘటనా సమర్థులగు ఈశ్వరీయ శక్తిగల మహాత్ముల కసాధ్య మగునది యెద్దియు నుండదు పోనిండు, మఱియొక విధముగ విచారించినను కృష్ణపరమాత్మ సూత్రప్రాయముగ వచించిన దానిని వ్యాసభగవానులు తదుపరి విస్తారముగ వ్రాసియుండిరనియు నిశ్చయింప వచ్చును గొప్పవటవృక్ష మంతయు నొక సన్నని బీజమున నెట్లిమిడి యుండునో అట్లనే అతివిశాలమగు అర్థము ఒక్క సూత్రములో నిమిడియుండును సూత్రముయొక్క నిర్వచనమేమనగా

**అల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతో ముఖమ్ ।**
**అస్తోభమనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః ॥**

అల్పాక్షరములు గలదియు, సందిగ్ధము కానిదియు, సారవంత మైనదియు, పెక్కు అర్థములు గలదియు, ఎదిరి లేనిదియు, లోపరహితమైన

దియు సూత్రమనంబడును ఇపుడు సంస్కృతమున చదువబడు పాణిని వ్యాకరణముకూడ మొదట సూత్రప్రాయముగ నున్నదే చిదంబరమున నటరాజేశ్వరుడగు శివుడు తన డమరుకమును వాయించినపుడు ఉద్భవించిన పదునాలుగు ధ్వనులను గైకొని పాణినిమహర్షి అష్టాధ్యాయి యను గొప్ప వ్యాకరణగ్రంధమును వ్రాసెను దానికి కాత్యాయనుడు వార్తికముల నిర్మించెను పతంజలి దానికే గొప్ప భాష్యమును విరచించెను ఇట్లు సూత్రప్రాయముగ నున్న దానిని మహనీయులు వారివారి ప్రజ్ఞాతిశయంబులచే విస్తరించి వ్రాసిరి ఇట్లుండ నిక 'వ్యాసో నారాయణో హరిః'- అన్నట్లు సాక్షాన్నారాయణుని అవరావతారుడైన వ్యాసభగవానునకు, కృష్ణపరమాత్ముని సూత్రవాక్యములను విస్తరించి వ్రాయుటయందు ప్రయాసమేల?

'శ్రుతిశిరో బీజం' ఆ గీతాకల్పవృక్షమునకు బీజము శ్రుతిశిరస్సు అనగా ఉపనిషత్తులు కనుకనే 'సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః' అని గీత ఉపనిషత్సారముగ పేర్కొనబడినది కాన గీత కృష్ణపరమాత్మ సొంతముగ కల్పించినది కాదనియు, ఉపనిషత్తులనే యాధారము చేసికొని వచించినదనియు, వేదమంత్రములు సామాన్యులకు దురవగాహమైనందున సర్వులను తరింపజేయు నుద్దేశ్యముతో వాని సారమంతయు సుబోధకమగునట్లు సులభశైలిలో వచించెననియు దీనిచే స్పష్టమగుచున్నది

'ప్రబోధాఙ్కురమ్' ఇంకను ఆగీతాకల్పతరు వెటువంటిదనగా, సాక్షాత్కారజ్ఞానమే అంకురముగా గలదియు, నానాశాస్త్ర రహస్యశాఖమ్- వృక్షమునకు శాఖలవలె సకలశాస్త్రరహస్యములే శాఖలుగా గల్గినదియు, అరతిక్షాన్తిప్రవాళాంకితమ్ – విషయాసక్తి లేకుండుట, ఓర్పు, (తితిక్ష) యనునవే చిగుళ్లుగా గలదియు, కృష్ణాంఘ్రిద్వయభక్తిపుష్పసురభిం- కృష్ణపరమాత్మయొక్క పాదకమలములందలి భక్తియే సుగంధపుష్పముగా గలదియు, మోక్షప్రదం జ్ఞానినామ్ – జ్ఞానులకు బంధరాహిత్యమను ముక్తిఫలమును గలుగజేయునదియునై యున్నది

2 ఎన్ని పూజ్యములున్నను ప్రక్కన ఒక సంఖ్య లేనిచో వాటి కేమా

త్రము విలువ యెట్లుండదో, అట్లనే దేహేంద్రియ ప్రాణమనంబులును, దృశ్య పదార్థములున్ను ఆత్మయను చైతన్యముచేతనే ప్రకాశింపజేయబడుచున్నవి కావున అది లేనిచో శూన్యములగును దేహేంద్రియములు జడములు గనుక స్వప్రకా శనాశక్తి గలవి కావు.

3 నీరున్ను, నూనెయున్ను కలువనట్లు, హీనగుణములు కలిగిన వారు అనుష్ఠానరహితులు పవిత్రాత్ములతో నెన్నటికి కలియజాలరు. ఒక వేళ నీటిని, నూనెను ఒకపాత్రలో కలబోసి యుంచినను నూనె పైకిన్ని నీరు క్రిందకున్ను చేరుకొనునట్లు పవిత్రాత్ములు ధ్యేయైక స్థితిగలవారు ఎల్లప్పుడు ఉచ్ఛస్థానమునే యలంకరించుచుందురు కాన మమ్ములను గౌరవించలేదని యెవరున్ను తలంపరాదు అట్టి గౌరవమునకు తగిన యోగ్యత, పవిత్రత సంపాదించుకొనిన చాలును. లోకమే మీకు బ్రహ్మరథము పట్టును

4 ఆధ్యాత్మికరంగమున ముముక్షువులు ప్రారంభముననే కఠిన సాధన లవలంబింపరాదు ఒక మిణుగురు నిప్పు దొఱికిన వెంటనే దానిపై పెద్దపెద్ద కట్టెలు పడవైచిన అది చల్లారిపోవును కాన జప, వ్రత, స్వాధ్యాయ, పూజనాది చిన్న చిన్న పుడకలు వేయుట ద్వారా వైరాగ్యస్ఫులింగమును క్రమశః ప్రజ్వలింపజేయవలెనేగాని కఠిన తపశ్చర్యలచే దాని నణగద్రొక్కి నశింపజేయరాదు దీపపు వత్తిని మెల్లగా పై కెత్తి మితముగా నుంచవలెనేగాని ఒకే పర్యాయము పెంచి పెద్దది చేసినచో చిమ్ని మసిబట్టును లేక పగిలి పోవును. దూరదేశమునకు నడచిపోవునపుడు త్వరత్వరగా పరుగెత్తినచో, కొంతదూర మేగు సరికి అలవు వచ్చి, దేహమునకు అధికశ్రమ కలుగును. ముందు ప్రయాణమునకు ఆటంకమున్ను గలుగవచ్చును అట్లుగాక మెల్లగా శక్తివంచన లేక నడచుచుపోయిన కొంతకాలమునకు నిరాటంకముగా గమ్య స్థానము చేరవచ్చును సాధకు లీవిషయము ముఖ్యముగా గమనింపవలెను

కొందఱు కొంతవైరాగ్యమును చేపట్టి యిల్లు విడిచి ఏకాంతమున జేరి ఆహారాదులను మాని వైచి, తీవ్రముగ ప్రాణాయామాది యోగసాధనలకు గడంగుదురు వెంటనే యేరక్తభేదులో ప్రారంభమగును. దేహమందశక్తత

యేర్పడును ధ్యానచింతనాదులకు శక్తి చాలకుండును. దానిజూచి యిక జనులేమి తలంచుదురనగా, ఓహో అధ్యాత్మవిషయములందు ప్రవర్తించి నందువలననే ఈతని కీగతిపట్టినది కాన వానినుండి విడుదల బొందవలయు నందురు మఱికొందఱు 'ఈతడు పూర్వము భుజించుచుండిన పదార్థము లను వర్జించినందువలననే యిట్టి రుగ్మత గలిగినది కాన వాటిని మఱల యధారీతి భుజించుచు వచ్చిన తొలగు'నని వచింతురు ఇక దైవవిషయము లందు తన కున్న కొంత యుత్సాహము తగ్గిపోవును ఇట్లు సర్వవిధంబుల నాటంకమే గలుగును గాన ముముక్షువు ఆధ్యాత్మిక క్షేత్రమున కడు జాగరూకుడై మెలంగుచు, ప్రారంభముననే తీవ్రసాధనల నవలంబింపక, క్రమమార్గముననే వర్తించవలెను ఒకే పర్యాయము స్టీమ్ వృద్ధి చేసిన ఇంజనుబాయిలర్ యేమైన నిలుచునా?

5 'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ' అన్నట్లు మనస్సు కూడా ఆత్మస్థానమును జేరలేక తిరిగివచ్చునట! ఆస్థానములో బృహస్పతి కూడ వాచాలుడు కాకపోవును. శుక్రాచార్యునివంటి మనీషులు కూడ నచట తూష్ణీంభావమును పొందుదురు. దానిమహిమ యటువంటిది అట్టి దివ్యప్ర కాశమును ప్రపంచములో వ్యాపింపజేయదగిన అనుభవజ్ఞులు లేనికారణముననే లోకమున కట్టి పతనము గలిగినది. పాత్ర మంచిదైనను అందు కళాయి లేనిచో దానిలో వండిన పప్పువులుసు చిలుమెత్తి నిరుపయోగ మగునట్లు, ఏనాడు జనులు అపవిత్రులై, విషయాసక్తులై క్రూరకృత్యముల సల్పుచు అసన్మార్గమున నిర్భయముగ వర్తించుచు, పైకిమాత్రము పవిత్రులవలె నటించుచుందురో నాడే లోకము పతనమొందును.

6 కృష్ణ, గోదావరి మున్నగు నదులయొక్క కాలువలను అప్పు డప్పుడు రిపేర్ చేయకపోయినచో అవి చెడి, తద్వారా జలము ప్రవహించక పైరు పంట లెట్లు నశించిపోవునో, అలాగున దివ్యచైతన్య శక్తి కలిగించు ప్రబోధకు లెపుడు లేకపోయిరో అపుడే ప్రపంచములో జ్ఞానశక్తి సన్నగిల్లినది. హృదయ క్షేత్రమున శాంతి, కరుణ, సత్యము, అహింస, దయ, పుణ్యశీలము

మున్నగు ఉత్తమ సస్యములన్నియు వర్షము లేని పైరువలె ఆత్మ జ్ఞానాభావముచే నెండిపోయినవి కనుకనే శుష్కవాదములు పెరిగినవి విశాలమైన రోడ్డైనను ప్రతిసంవత్సరము రిపేర్ చేయనిచో వృక్షములు పెరిగి క్రమముగ నది యరణ్యమై గమనయోగ్యము ఎట్లు కాకపోవునో, అట్లే అధ్యాత్మిక ప్రబోధకులు లేని కారణముచేతనే గమ్యస్థాన మిదమిత్థమని స్పష్టముగా జూపు ననుభూతిపరులు లేకుండుటంబట్టియు, జనులందు కామక్రోధాది దుర్గుణంబులు పెరిగి గమ్యస్థానము తెలియకపోవుటకు హేతువగుచున్నది. అదంతయు జనుల దోషము కాదు. సరియైన బోధకులు లేని కారణమే యగును

7. మఱియు, మేఘజలమెంత స్వచ్ఛమైనను చవిటినేలపై బడిన యోగ్యముగాక అనారోగ్యమునకు నెట్లు హేతువగునో, అట్లనే అతి స్వచ్ఛ మైన వేదాంతబోధ యైనను రాగద్వేషాదియుతములగు కలుష హృదయము లోబడి చెడిపోయి విపరీతఫలము నొసంగుచున్నది. క్షీరాన్నమెంత పవిత్ర మైనను పాసిపోయినచో దానిని చూడనైన చూడక దూరముగ నెట్లు పారవైతురో, అట్లనే అమృతసమానమైన వేదాంతమునకును ప్రపంచములో నట్టి హీనస్థితి సంభవించినది. అది బ్రహ్మవేత్తలగు వారి తప్పే యగునుగాని ప్రజల దోషము కాదు క్షీరాన్నమును చక్కని స్థితియందుంచని దోషము పాచకునిదే యగును. కాని భోక్తలది కానేరదు గదా! కనుకనే గొప్పగొప్ప మేధాసంపత్తి గలవారలకు, విద్వాంసులకు, ధర్మశీలురకు శ్రీమంతులకు భక్తులపై, బ్రహ్మ వేత్తలపై, సాధువులపై అవిశ్వాస మేర్పడుచున్నది. సామాన్య గృహస్థుని కుండవలసిన యోగ్యతకూడ లేనిచో నిక నా సాధువుల స్థితి యేమని చెప్పవచ్చును.

గృహస్థాశ్రమములో నుండు వారిని సరియైన మార్గములోనికి నడుపవలసిన వారు గృహస్థాశ్రమములో నుండువారిచేతనే బోధింపబడు చుండు కాలము వచ్చినదనిన నిక వారి హీనావాస్థను గూర్చి యేమని చెప్పవచ్చును! ఆహా! ఇది యెట్టి దీనావస్థయో యోచింపదగినది ఇందతయు

గృహస్థుల దోషము కాదు, సాధువులు బ్రహ్మవేత్తలగు వారియొక్కయు, భక్తులయొక్కయు లోపమే యగును అయితే అందఱున్ను ఆలాగున నున్నారని తలంపవలదు ఒక విదేశీయుడు హిందూ దేశమున పెద్దపెద్ద పట్టణములలోగల మురికి కాలువలను జూచి పవిత్రమైన గంగ, గోదావరి, కృష్ణ మున్నగునవి కూడా యట్లనే యుండునని యూహించిన, వాని యోగ్యత యెట్టిదో పైవిధమున తలంచువారి యోగ్యతయు అట్లనే యుండును కాన ఎందరో పుణ్యపురుషులున్ను, అనుభవజ్ఞులున్ను కూడ గలరు. అందఱును పైవిధమున నున్నారని తలంచుట పొరబాటు అట్టి రకమువారు గూడ గలరని మాత్రమే విజ్ఞులు తలంచి యూరకుందురు

8 మనస్సును ఏకాగ్రపఱచి భావయుక్తముగా చేయు జపమే ఎక్కువగ ఫలించును కాన ఎంతవఱకు మంత్రాధిష్ఠానదేవత ప్రత్యక్షము కాలేదో, ఎంతవఱకు ఏకాగ్రత సిద్ధింపలేదో, ఎంతవఱకు మంత్రార్థము భావనకు రాలేదో, అంతవఱకు జపమాలను త్రిప్పకుడు. అట్లనే అర్చన చేయునపు డున్ను, అనన్యభక్తియుతమై ఇతర విషయములు స్ఫురింపక, మనస్సు కేవలము అర్చింపబడు మూర్తియందే లగ్నమైనపుడు మాత్రమే పుష్పమును మూర్తిపై వదలవలెను. అపుడే తాను చేసిన జపముగాని, పూజగాని పూర్ణఫలమును గలుగజేయును

9 సాధకులకు సాధనాదులందు కాలనియమ మేల యుండవల యునని కొందఱు ప్రశ్నింతురు నిజమే భూమిపై నడచునపుడుగాని, నీటిపై బోవునపుడుగాని, మార్గము సరిగా నున్నదా లేదా యని చూడవలసివచ్చునే గాని ఆకాశముపైన సంచరించినచో చూడబనిలేదు అయితే అట్లు విమానా దులపై సంచరించు వారెందఱు గలరు? రైళ్లపై, బండ్లపై పోవువారెందఱు గలరు? దీనిని మీరే యోచించుకొనుడు ప్రపంచములో నొక రహస్యము గలదు. తనకు లేని ప్రభావమునుగూర్చి చెప్పుకొన్నచో తనకు రానున్న ప్రభావము కూడ రానేరదు కాన ప్రారంభావస్థయందే నిస్త్రైగుణ్య పదమందు జరించు యవధూతలతో తమ్ములను బోల్చుకొనక, కాలనియమాదుల నను

మున్నగు ఉత్తమ సస్యములన్నియు వర్షము లేని పైరువలె ఆత్మ జ్ఞానాభావముచే నెండిపోయినవి కనుకనే శుష్కవాదములు పెరిగినవి విశాలమైన రోడ్డైనను ప్రతిసంవత్సరము రిపేర్ చేయనిచో వృక్షములు పెరిగి క్రమముగ నది యరణ్యమై గమనయోగ్యము ఎట్లు కాకపోవునో, అట్లే అధ్యాత్మిక ప్రబోధకులు లేని కారణముచేతనే గమ్యస్థాన మిదమిత్థమని స్పష్టముగా జూపు ననుభూతిపరులు లేకుండుటంబట్టియు, జనులందు కామక్రోధాది దుర్గుణంబులు పెరిగి గమ్యస్థానము తెలియకపోవుటకు హేతువగుచున్నది. అదంతయు జనుల దోషము కాదు. సరియైన బోధకులు లేని కారణమే యగును

7. మఱియు, మేఘజలమెంత స్వచ్ఛమైనను చవిటినేలపై బడిన యోగ్యముగాక అనారోగ్యమునకు నెట్లు హేతువగునో, అట్లనే అతి స్వచ్ఛ మైన వేదాంతబోధ యైనను రాగద్వేషాదియుతములగు కలుష హృదయము లోబడి చెడిపోయి విపరీతఫలము నొసంగుచున్నది. క్షీరాన్నమెంత పవిత్ర మైనను పాసిపోయినచో దానిని చూడనైన చూడక దూరముగ నెట్లు పారవైతురో, అట్లనే అమృతసమానమైన వేదాంతమునకును ప్రపంచములో నట్టి హీనస్థితి సంభవించినది. అది బ్రహ్మవేత్తలగు వారి తప్పే యగునుగాని ప్రజల దోషము కాదు క్షీరాన్నమును చక్కని స్థితియందుంచని దోషము పాచకునిదే యగును. కాని భోక్తలది కానేరదు గదా! కనుకనే గొప్పగొప్ప మేధాసంపత్తి గలవారలకు, విద్వాంసులకు, ధర్మశీలురకు శ్రీమంతులకు భక్తులపై, బ్రహ్మవేత్తలపై, సాధువులపై అవిశ్వాస మేర్పడుచున్నది. సామాన్య గృహస్థుని కుండవలసిన యోగ్యతకూడ లేనిచో నిక నా సాధువుల స్థితి యేమని చెప్పవచ్చును.

గృహస్థాశ్రమములో నుండు వారిని సరియైన మార్గములోనికి నడుపవలసిన వారు గృహస్థాశ్రమములో నుండువారిచేతనే బోధింపబడు చుండు కాలము వచ్చినదనిన నిక వారి హీనావాస్థను గూర్చి యేమని చెప్పవచ్చును! ఆహా! ఇది యెట్టి దీనావస్థయో యోచింపదగినది ఇందతయు

యుతమగు కాలము ధ్యానాదుల కనుకూల మైనది కాదు. సత్త్వగుణమయ కాలమే యుక్తమైనది. ఋషులందఱును, పరమభాగవతోత్తము లందఱున్ను యక్కాలమున తమ చిత్తముల పరమాత్మవైపునకు కేంద్రీకరించుదురుగాన ఆ సమయము ధ్యానాదుల కత్యంతోపయుక్తమైనది ప్రవాహవేగమున కనుకూలముగ వాయువు వీచునపుడు నావయొక్క గమనమింకను త్వరితమగు చందమున, అట్టి కాలమున ధ్యానము చేయుచు రాగా రాగా జీవుడు తురీయమగు ఆత్మవిశ్రాంతియను రేవులోనికి శీఘ్రముగా చేరగల్గును. ఈ తత్త్వమునే దివ్యజ్ఞానసంఘము వారెక్కువగ నమ్ముచుందురు

11. అయితే ' ఆ దివ్య (ఆత్మ) జ్ఞానము మా హృదయములలో ఏల నిలచుటలేదని కొందఱు సంశయింపవచ్చును ఋషులు చెప్పిన విద్య (బ్రహ్మవిద్య) వైజ్ఞానికమే (Scientific) గాని బూటకము గాదు కాని దానిని విప్పి చెప్పునట్టి అనుభవజ్ఞులవలననే దాని నెఱుంగవలసియుండును. స్వయముగ తెలిసికొన యత్నించిన ప్రమాదము సంభవించును జనుల హృదయ గుహలలో నాబ్రహ్మవిద్య యేల ప్రవేశించుట లేదో కారణము చెప్పెద, వినుడు. ఏయింట్లో రేడియో యంత్రముండునో, అయింట్లో జపాన్, అమెరికా, ఇంగ్లాండు, జర్మనీ మున్నగు నన్నిచోట్లను పాడునట్టి పాటలన్నియు స్పష్టముగా వినిపించును రేడియో యంత్రము లేనిచో, ఆ పాడునట్టి చోటునకు సమీపమున నున్న ఇంటిలో నైనను, ఆ పాట వినిపించదు. అదే విధముగ, ఎవరు తమ హృదయమును రేడియోయంత్రమును ఈశ్వరోన్ముఖ మొనర్తురో, అట్టివారికే యాఋషుల దివ్యవాణి వినిపించును. అట్లు చేయనిచో తాము ఎచట వసించినను, భూలోక మందున్నను లేక చంద్రలోక మందున్నను, అంగారక, బుధ, సూర్యాది గోళము లందున్నను, ఆఋషివాణి దైవవాణి వినరాదు

వాస్తవముగా విచారించిన ఆ రేడియో యంత్రముకూడా జడమైనదే మనస్సో! దాని కంటె నింకను విశేషశక్తి గల్గినది అది బ్రహ్మాండము లంతట వ్యాపించి యున్న వస్తువు కాన నట్టి మనస్సును శుద్ధపఱచి సర్వేశ్వరశక్తిలో

నెక్యమొనర్చిన, నిక సంకల్పమాత్రము చేతనే మనుజుడు సమస్త కార్యము లను చేయగల్గును. అయితే దానితో కలియవలెనన్న, అదియును దాని వలె శుద్ధమై, నిష్కళమై, తేజోవలయమై యుండవలెను లేనిచో కలి యదు ఎలెక్ట్రిక్‌కరెంటులో ఏ పదార్థమున్ను కలియనేరదు. ఏలన, దానియం దేది పడినను క్షణములో దానినది భస్మీకృత మొనర్చివేయును. తెల్లకిరసనా యిలు, నీరు చూచుట కొకేవిధముగ నున్నను, కలియనట్లు ఈశ్వరస్థితి జీవు నకు కలుగనంతవఱకున్ను ప్రాకృతమైన సంస్కారము లుండును. అంత వఱకున్ను, జ్ఞేయమగు ఆత్మలో నాతనికి నిలుకడ కలుగనేరదు ఒక వేళ కలి గించుకొనుటకు యత్నించినను నిలువక క్రిందకు దిగిపోవును. దీపము వెలి గించునపుడు ప్రమిదెలోని చమురులో నీరుపడిన ఆ దీపము వెలుగజాలనట్లు, హృదయమందు విషయవాసనాదు లణుమాత్రమైన నున్నచో జ్ఞానజ్యోతి ప్రకాశింపదు. అట్టి వాసనాదోషము లున్నంతవఱకు దేవతలైనను, ఇంద్రుడై నను, త్రిమూర్తులైనను కూడ ఆత్మ నెఱుంగజాలకుందురు ఇదే వేదాం తము మనకు బోధించు పవిత్రబోధ.

12. ఇంకొక రహస్యము కూడ కలదు. ప్రతిదినము నియమపూ ర్వకముగ ధ్యానాదులను శీలించుచు వచ్చిన, కొంతకాలమునకు నిర్యత్నము గనే మనస్సు ఆ సమయమునకు మనలను అప్రాకృతమగు దైవస్థితిలోనికి తీసికొని వెళ్లుచుండును. దృష్టాంతమునకు – ప్రతిదినము ప్రాతఃకాలమున నియమపూర్వకముగ బహిర్భూమికి జనువారిని (సకాలమున నియమితా హారాదులను గ్రహించుచు వచ్చిన) ప్రకృతియే ఆసమయమున అక్కార్య మునకై పురికొల్పుచుండును. ఇది యందఱకు విదితమేగదా. అట్లనే నియమపూర్వకముగ ఆహారమును గ్రహించు వారికి ఆ భుజించుకాలముననే సరిగా జఠరాగ్ని ప్రజ్వరిల్లును.

ఈశక్తి మనుష్యమాత్రులకే కాదు పశు పక్ష్యాదులకు కూడను గల్గియున్నది. కొన్నిదినములు పిల్లికిగాని, కుక్కకుగాని, ఉడుత, పక్షి, పావురమునకుగాని ప్రతిదినము ఏదో ఒక సమయమున ఆహారమిచ్చుచు

వచ్చిన ఇక ప్రతిదినము సరిగ ఆకాలమునకే అవి యట వచ్చి చేరుచుండును. వాటికా సమయమెట్లు తెలిసెను? గడియారము లేవైన వాటికి గలవా? ఆ లగ్న నిశ్చయమును వాటికెవరు తెలిపినారు? కాన ఆసన, ధ్యాననిష్ఠాదులను ప్రతిదినము నియమపూర్వకముగ ననుష్ఠించుచుండిన, క్రమముగ నప్రయత్నముగనే యాసమయమునకు మనస్సు ధ్యేయాకారస్థితిలోని బోవుచుండును ఒక రైలింజను ముందునకు సాగిన, తక్కిన పెట్టెలన్నియు దానిననుసరించియే సాగునట్లు, నియతిబద్ధులైనచో, ఆ నియతియే మనలను గమ్యస్థానము చేర్చగలదు.

ప్రతిముముక్షువు టైముప్రకారము ధ్యానానుష్ఠానములు జరుపు చున్నచో ఆ టైమునకు అప్రయత్నముగనే మనసు అనుష్ఠానము వైపునకు తిరుగును. జడమైన గడియారమే సకాలమునకు గంటల కొట్టుచుండుట లేదా? బొంబాయి మొదలగు పట్టణప్రదేశములలో సుమారు 15 నిమిషముల కొకతూరి ఎలెక్ట్రిక్ మిషన్లద్వారా జలము తనంతట నదియే పడి మరుగుదొడ్ల నన్నిటిని శుభ్రము చేయుచుండుటలేదా? అట్లనే నిద్రాహారాదులను నియమపూర్వకముగా గ్రహించుచు మీ జీవితముల నెపుడు నియమబద్ధము లుగా నొనర్చెదరో అపుడానియతియే అ ప్రయత్నముగ మిమ్ములను భవసాగరమును దాటింపగలదు. కాన నియతిని ప్రాణమువలె సంరక్షింప వలెను. సంసారమను నదిని దాటుట కది యొకటియే వంతెన ఆచరణ యొక్క మహిమ అటువంటిది

13 ఎచట రోగులుందురో అచటనే వైద్యులుండవలెను అట్లనే యెచట భవరోగు లుందురో అచటనే భవరోగభిషక్కులగు బ్రహ్మజ్ఞాను లుండవలెనని శ్రీ యేసుక్రీస్తు సెలవిచ్చిరి

14 అనుష్ఠానము మఱువరాదు అదియే మిమ్ములను రక్షించును. బాల్యకాలమునాటి నాయనుభవమునుగూర్చి యొకింత చెప్పెద. చిన్న కాల మున మాతల్లిదండ్రులు నన్ను పాఠశాలకు బంపిరి కొంతకాలమునకు సంస్కృతము అభ్యసించవలెనను తలంపు గల్గినది. కాని యందులకు

మాతాపితరు లొప్పుకొనలేదు అయినను హఠము పట్టితిని నీ యిష్టము వచ్చిన చోట చదువుకొమ్మని అప్పుడు వారు చెప్పిరి అంతనొక దేవాలయమున పూజాదికార్యముల నిర్వహించుచు, నొకయాచార్యునివద్ద సంస్కృతవిద్య నభ్యసింపదొడగితిని ఏరోజు పాఠము ఆరోజు పూర్తిగ వల్లించినపిదపనే ఆ రాత్రిభోజనమునకు వెళ్లువాడను ఉదయమున్ను పూజాదికార్యములను సమాప్తి గావించుకొని, ఆపిదప పాఠమునకుబోయి, చిన్నవారలకు నేనున్ను పాఠము చెప్పి అటుపిమ్మట మఱల ధ్యానముచేసిన, పిదపనే భుజించెడి స్వభావము గలవాడను

చిన్నకాలమునుండి ధ్యానమునందే నాకెక్కువ ప్రీతి యుండెడిది ధ్యానమైన తరువాతనే భుజించెడి స్వభావము గలదు. కనుక, ఒక్కొక్కపుడు రాత్రులయందు 12, లేక 1 గంటకు భోజనము చేసినరోజు లెన్నియో గలవు ఒక్కొక్కపుడు ధ్యానముపూర్తి యగుసరికి తెల్లవారెడిది. వేడియెక్కువై నిద్ర వచ్చునేమోయని, శిరస్సుపై అప్పుడప్పుడు చన్నీళ్లతో తడిపిన వస్త్రము పెట్టుకొని ధ్యానము సల్పితిని

కాని దానిచేతను సంతృప్తి గల్గనందుచే నెచటికైన నేకాంత ప్రదేశము నకు వెళ్ళి తపస్సు చేయవలెనను బుద్ధిపొడమ, పాదచారినై, ఆసేతు హిమాచలము కొంతకాలము తీర్థయాత్రచేసి దినమునకు కనీసము 20మైళ్ళు చొప్పున పర్యటనము చేసి తుదకు తిరుపతి చేరితిని ఇది వఱకెవరైన మహర్షులు, యోగిపుంగవులు తపస్సు చేసిన స్థలమైనచో ననుకూలముగ నుండునని యెంచి గోగర్భమున ప్రవేశించితిని భోగము లున్నచోట యోగ మభివృద్ధి కాదు. యోగము వృద్ధినొందవలెనన్న స్వల్పాహారము గైకొన వలెను బొత్తిగా ఆహారమున్ను మానరాదు అట్లు యుక్తాహారాదులు గల్గి ఘంటలకొలది ప్రణవ, పంచాక్షరీ, అష్టాక్షర్యాది మంత్రముల జపించుచు ధ్యానాద్యనుష్ఠానములను చాలకాలము సల్పితిని కాని అప్పటికిని యథార్థ మగు సత్యము బోధపడక చాల దుఃఖించితిని

తుదకు ప్రాణము విసిగి ఆత్మహత్య యొనర్చుకొనుటకు సంసిద్ధుడ

నైతిని ఒకవిధమయిన పాషాణమును మ్రింగి జీవితము నంతమొందింప దలంచితిని, కాని అట్లుచేసిన ప్రాణ వియోగకాలమున భగవత్స్మృతి యుండదేమోయను సంశయము మఱల బాధింప, తిరిగి యింకొక యుపాయము నాలోచించితిని కొండపై నుండి జారి పడి ప్రాణవియోగ మొందదలంచితిని కాని మఱల దానినుండియు చిత్తమును మఱల్చుకొని యప్పటినుండియు మూడువత్సరములు తదేకనిష్ఠతో ధ్యానము సల్పితిని. ఈశ్వరానుగ్రహముచే ప్రణవాదిమంత్రధ్యానములచే తత్కాలమునకు ఆత్మశాంతి దివ్యప్రబోధము నాకు గల్గెను

ఇయ్యది పొగడ్తకై చెప్పుట కాదు నిజముగా నాకాలమున ధ్యానాదులందు ఒక రోజు మేము గావించిన యత్నము నిప్పటి సామాన్యులు ఒకసంవత్సరమైనను చేయజాలరు రోజున కొక లక్షరూపాయలు సంపా దించి బ్యాంకులో వైచుచున్నానను విశ్వాస మపుడు నాకుండెడిది దాని వడ్డీయే యిపుడు పరులకు నుయోగపడుచున్నది ఋష్యాదులు ఎంతయో కష్టపడి, ఎన్నియో శ్రమలకోర్చి, ఎన్నియో విఘ్నముల నెదుర్కొని ధ్యానాను ష్ఠానములను సల్పిరి కనుకనే వారు మహాప్రబోధకులై 'తీర్ణాస్స్వయం భీమభవార్ణవం జనానహేతునాஉన్యానపి తారయన్తః' అనునట్లు తాము తరించి ధన్యులగుటయే గాక అనేక ముముక్షువులను కూడ తరింపజేసి కృతార్థులైరి తామనుష్ఠించి యితరుల ననుష్ఠింపజేసిరి

15 ఇపుడట్టి యనుష్ఠానము చాలా అరుదైనందుచేతనే వేదాంతమునకు పతనము గల్గినది కాన ముఖ్యముగ తురీయాశ్రమపరులు, తాము పూర్వపు ఋషులవలె ధ్యానాదుల తీవ్రముగ సల్పి తాము తరించి లోకమును తరింపజేయవలెనను దృఢనిశ్చయము గల్గియున్నచో, లోకములో సాధువులందు సోదరీసోదరులకు విశ్వాసశ్రద్ధ లంకురించును మఱియు వారి వాక్యములందు నమ్మకము గలిగి ఋష్యాదుల వచనము లందును, ఉపనిషద్వాక్యములందును, ఈశ్వరధ్యాన పూజాదులందును విశ్వాసబుద్ధి గలవారై ధన్యులు కాగలరు

16 " నిత్యస్సర్వగతస్స్థాణు రచలోఽయం సనాతనః" సనాతన ధర్మమనగా అన్నిటికిని మొదటిదియైన ధర్మము సృష్టి స్థితి లయములకును సర్వదేశకాలములకును మూలమగునట్టి యే సచ్చిదానంద స్వరూపము గలదో ఆనిత్య సత్యస్వరూపము నెఱుంగుటకై ధ్యానయోగాద్యనుష్ఠానము లవలంబించుచు ప్రజ్ఞావంతులై యుండవలెను అట్టి సనాతన ఆత్మతత్త్వ మును దెలియుటకొఱకే యీ సనాతనజ్ఞానసభ యిప్పటికి పదునాలుగు సంవత్సరముల నుండియు జరుపబడుచున్నది ఋష్యాదుల యనుష్ఠానము మనమున్ను గలియున్నచో అట్టి స్వరూపులము మనమున్ను కాగలము

17 ఒకటియను సంఖ్య ప్రక్కన సున్నయుంచిన పదియగును మఱి యొక సున్ననుంచిన నూఱగును, ఇంకొక సున్న నుంచిన వెయ్యి అగును ఇంకొక సున్ననుంచిన పదివేలగును మఱియొక సున్ననుంచిన లక్ష యగును ఆరీతిగనే యేకమగు ఆత్మయందు క్రమముగ మనస్సు చేరినయెడల సంకల్ప వికల్పములు గలదగును (రెండవసున్నయును) బుద్ధినుంచి యెడల ఆసంకల్పమునే నిశ్చయించునదగును (మూడవ సున్నయును) జ్ఞానేంద్రియ ముల నుంచినయెడల దృశ్యప్రపంచముతో సంబంధము గల్గియుండును నాల్గవదగు కర్మేంద్రియముల నుంచిన ఆయా కర్మేంద్రియ వ్యాపారములు గల్గియుండును. అయిదవదగు దృశ్యము నుంచిన విషయాదులందు జిక్కు కొని, పెక్కుతలంపులు గల్గి అధోగతిని పొందును ఇదియే సృష్టిక్రమము కాని ఒక్కొక్క సున్నను తీసి వేయుచు వచ్చిన ఒకటియను సంఖ్య శేషించు నట్లు మనస్సును అంతరమునకు త్రిప్పుచు వచ్చిన క్రమశః దాని చేష్టలుడిగి, వృత్తులు సన్నగిలి, ఏకమగు ప్రత్యగాత్మయందు లయింప ఆత్మ యొక్కటి మాత్రమే శేషించును ఇదియే లయయోగ మనంబడును ,ధ్యానపద్ధతియు నిదియే



**౨.వ రోజు ౨౯-౩-౧౯౪౦**

**18."అశోచ్యానన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే!।**
**గతాసూనగతాసూంశ్చ నానుశోచ న్తి పణ్డితాః ॥ (2-11)**

అను శ్లోకమునుండి యథార్థముగ గీతాబోధ ప్రారంభమయ్యెను

**అనన్యాశ్చి న్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే। ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ (9-22)**

అనునది గీతామధ్యమశ్లోకము

**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥ (18-66)**

అను శ్లోకముతో గీతాబోధ అంతమయ్యెను

19 హృదయకమలమను యంత్రముపై 'సోఽహం' (ఆ పరమాత్మయే నేను) అను అజపాగాయత్రీ మంత్రము నధిష్ఠింపజేసి యద్దానిని నిరతము జపముచేయుచున్నచో, మంత్రార్థము నవగాహన మొనర్చుకొని చింతన చేయుచున్నచో, నచిరకాలములోనే ఆత్మానుభూతి సంప్రాప్తమగును (★ఆ రెండక్షరములే ధనాకర్షణ జనాకర్షణ బీజాక్షరములు)

20 ''పఠనం పాఠనం శ్రుతం'' – అన్నట్లు భగవద్గీత చదివిన వారికి, చెప్పువారికి, వినువారికిగూడ ఫలితముగలదు కాన కొంచెము బిగ్గఅగా చదివిన, వినువారికిగూడ పుణ్యము గలుగజేసిన వారమగుదుము ★★'విధినాఽవిధినా వాఽపి' భక్తిశ్రద్ధలతో గూడి గీతాపారాయణాదులు చేయువారికి స్వరలోపాదులు మొమ్మొదట సంభవించినను అంత ప్రమాదము లేదు. భక్తియే ప్రధానము కాని స్వరలోపము లేకుండ క్రమముగ నభ్యసించుటయే యుత్తమము సంస్కృతము ఖర్జూరకాయవంటిది. ఖర్జూరకాయ మొదట నమలు నప్పుడు కఠినముగా నుండి క్రమముగ మెత్త

---

★'మీ కేదైన ధనాకర్షణ,గలుగ జేయు మలయాళ మంత్రము వచ్చి యుం డునా' యని శ్రీస్వాములవారిని కొందఱడిగినపుడు శ్రీవారొసంగిన జవాబు

★★ గీతాపారాయణ సమయమున కొందఱు గీతను మెల్లమెల్లగా చదువుచుండ శ్రీస్వాములవారు వారలంగూర్చి వచించిన వాక్యములు

బడి ద్రవమగునపుడు అమృతతుల్య మగునట్లు సంస్కృతభాషయు ప్రారంభమున కఠినముగాను, ఉచ్చరించుటకు కష్టసాధ్యముగాను నుండినను క్రమముగ నభ్యసించినకొలది అలవడి అతిమధురమై, శ్రావ్యమై యొప్పారును

21 భగవద్గీతయన, భగవంతు డొనర్చిన గానము. దేహేంద్రియాది విషయములందు తగుల్కొనిన ప్రాకృతస్వభావముగల అర్జునుడను జీవునకు ఆత్మసంయమము నుపదేశించి జీవన్ముక్తునిగ చేసినదే యీ గీత రణరంగమున నిరుత్సాహయుతుడై రథముపై గూలియున్న యర్జునునియొక్క యధోదృష్టిని నూర్ధ్వదృష్టిగా పరిణమింపజేసి, ఆత్మోన్ముఖ మొనర్చినదే యీగీత.

22 ఈ మధ్య 'నాష్ట' అను క్రొత్తపదము మన ప్రాంతములోనికి జొరబడ్డది ఆ పదము ఇదివఱకు మన ప్రాంతములో లేదు నిఘంటువులోను అది కనుపించదు అది అరవదేశం నుంచి వచ్చినట్లుగా తోస్తున్నది దాని యర్థము ఉదయం 8గం॥లకు ఫలాహారము పుచ్చుకొనుట యని పూర్వపు ఋషులకు అట్టివాడుక లేనందుచే వారి బోధలలో ఆ పదమెచ్చటను కనుపించి యుండలేదు కాని, నిష్ఠను భ్రష్టమొనర్చునదే నాష్టయనినచో నింకను మంచిది ఏలయన, సాధువులు, సన్న్యాసులు భక్తులు, మున్నగు వారు ధ్యాననిష్ఠాదుల సల్పుకొను సమయమగు ఉదయం 8గంటలకు నాష్టను ఉపక్రమించినచో నింక వారి నిష్ఠ వినష్టముగాక యుండునా? సాధువులు గాని, సన్న్యాసులుగాని, భక్తులుగాని సామాన్యముగా పదునొకండు పండ్రెండు గంటలపుడు భుజించిన మంచిది ఏలన, అప్పటికి నిష్ఠాదులు పూర్తియగును జఠరాగ్ని బాగుగా ప్రజ్వరిల్లును అతిథి, అభ్యాగతులు కూడ వచ్చి చేరుదురు ఆకలి లేనపుడు భుజించిన జిహ్వ అనేకరుచులను కోరుచుండును అపుడు దానికి వారు దాసులు కావలసియుందురు.

23 మన జీవితమంతయు నిద్దఱు దొంగలపహరించుకొనిపోవుచున్నారు వారు నిద్రాహారాలే. నిద్ర వచ్చినప్పుడు పరుండుట ఆకలి కలిగినపుడు భుజించుట యలవఱచుకొన్నచో నిక నారెండును జయింపబడినట్లే

అట్లు గాక మనమే నిద్రను ఆహ్వానించిన, – దిండున్నదా, పరుపున్నదా, గాలి తగులుచున్నదా,– ఈ విధముగా సవాళ్లు వేయును లేకున్న ఏరాతిమీద పరుండినను గాఢనిద్ర పట్టిపోవును అట్లే, మనమే ఆకలిని పిలిచిన మంచి కూరలున్నవా, పచ్చళ్ళున్నవా, ఊరగాయలున్నవా, అప్పడములున్నవా యని ఇవ్విధముగ వేధించును అట్లుగాకున్న ఏ అంబలియో, గంజియో, సంకటియో యైనను సంతృప్తి కరముగానే యుండును ఇదియే యిందలి రహస్యము ఇట్లీ రెంటిని జయించిన నిక మన జీవితము నిరపాయముగా గడచిపోవును ఒక్కసారి భుజించువాడు అనశనుడనియు, నిద్ర వచ్చినపుడు పరుండువాడు అస్వప్నుడనియు చెప్పబడును వారే నిద్రాహారములను జయించువారు ఒక పాత్రలో బియ్యము ఉడుకునప్పుడు, ఉడుకుట పూర్తిగాక మునుపే అందు మఱల మఱల బియ్యము వైచిన వృధా యగునట్లు మనదేహమను పాత్రయందును ఏకభుక్తమైన పిదప మఱల మధ్య మధ్య పదార్థములను వైచుచుండిన నవి పులిసి అనారోగ్యము గల్గి వ్యాధి సంభవించును

24 మనస్సును పరమాత్మయందు లీనము చేయుట మనస్సుయొక్క తపస్సు, భజనకీర్తనాదులను జేయుట వాక్ తపస్సు, ఆశ్రమసేవ, దేశసేవ మొదలగునవి చేయుట శారీరక తపస్సు ఈ మూడు తపస్సులు చేసిన త్రికర ణములు శుద్ధమగును ఋష్యాదులు ఈ త్రివిధశుద్ధులు బడసినవారే అన్ని జాతులవారున్ను, మతములవారున్ను, స్త్రీలున్ను, పురుషులును కూడ వీటి నాచరించవచ్చును

25. **ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు ।**
**బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ ॥**

**ఇంద్రియాణి హయా నాహుర్విషయాం స్తేషు గోచరాన్ ।**
**ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః ॥**

(కఠోపనిషత్తు)

శరీరమే రథము, ఆత్మయే రథికుడు, బుద్ధి సారథి, మనస్సు కళ్లెము ఇంద్రియములు గుఱ్ఱములు, దృశ్యవిషయములు బాట, సామాన్యముగా ఒకటి, రెండు గుఱ్ఱములుగల బండినే జనసమూహముగల రోడ్డుపై నడుపుట ఎంతయో ప్రయాసము! అట్లైన నిక 10 గుఱ్ఱములు కట్టబడిన ఈశరీరరథము నడుపుటకు సారథికెంత చాతుర్య ముండవలెను? అవియు, అన్ని ఒకే వైపునకు కట్టబడియుండలేదు కొన్ని ముందు(నేత్రాదులు), కొన్ని వెనుక, కొన్నిప్రక్కల(కర్ణాదులు), కొన్ని క్రింద, కొన్ని పైన ఇవ్విధమున – ఈ ఇంద్రియహయములు శరీరరథమునకు కట్టబడియున్నవి తర్ఫీదు లేని గుఱ్ఱములైనచో బండిని త్రోవలో పడగొట్టి రథికున కపాయము గల్గించి, గమ్యస్థాన మెట్లు చేర్పజాలకుండునో, అట్లే వశీకృతముకాని యింద్రియము లైనచో జీవుని స్వస్థానమును జేర్పజాలకుండును కనుకనే 'తస్మాత్త్వమిం ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ' అనగా ఇంద్రియములనే మొమ్మొదట – నిగ్రహించుకొనుమని భగవాను లానతిచ్చిరి కాన, ఇంద్రియములను జయించి బుద్ధిని అతిసూక్ష్మ మొనర్చి కడుజాగరూకతతో వర్తించిననే, జీవుడు స్వస్థానమగు ఆత్మను జేరగలడు

26 సంజయుడనగా, సమ్యక్ జయుడు – లెస్సగ సర్వేంద్రియము లను జయించినవాడని యర్థము ఆతడు సూతపుత్రుడు అబ్రాహ్మణుడు మొట్టమొదట నాతడే గీతను లోకమునకు బోధించినవాడు సంజయత్వ నునునది ఒక బిరుదు ఇంద్రియాదుల సమ్యక్ జయత్వము గలవా రందఱును ఆ సంజయపదవికి అర్హులే

27 ఏకాంతమున గాక రణరంగమందు సర్వజన మధ్యముననే భగవానులు గీతనుపదేశించి యుండగా ఇక దానియందు దాపరికమేల? రహస్యమేల? స్త్రీ పురుషాదు లందఱును,సర్వజాతులవారును నిరాటంక ముగా దానిని పఠించి, యనుష్ఠించి తరింపవచ్చును

28 ఆదిలో భగవద్భక్తుల సంఘమందు ఐదుగురే యుండిరి వారే పంచభూతములు (పృథివి జలము, సూర్యుడు (అగ్ని), వాయువు, ఆకా

శము) వారే భగవంతుని అంతరంగికభక్తులు ఆ సంఘములో జేరదలంచిన వారందఱున్ను ఆ పంచభూతములవలె సమబుద్ధిగల్గి యుండవలెను పృథివి సర్వజీవులకును సమముగనే ఫలించుచుండును, జలమందఱకును నొకేవిధమున తృప్తిని గలిగించుచుండును సూర్యాగ్నులు సమముగనే ప్రకాశోష్ణతల నొసంగుచుందురు శత్రుమిత్ర భేదములేక వాయువంద ఱకును సమముగనే వీచుచుండును అట్లనే ఆకాశమందఱకు నొకేరీతి యవ కాశము గలుగజేయుచున్నది ఇవ్విధమున సర్వజీవరాసులయెడ సమదృష్టి, ప్రేమగలవారే నిజమైన భక్తులగుదురు వారే భగవంతుని అంతరంగికభక్త కోటిలో జేరినవారు, వారే ఈశ్వరప్రియులు, తదితరులు భక్తులు కాదు, భుక్తులే

29 నిజమైన యోధులకు, యుద్ధము వచ్చినదంటే మహా సంతోషము వారు నిర్భీకముగా సమరమున ప్రవేశింతురు. కాని భీరువులు మాత్రము యుద్ధమున వెనుకకు తగ్గుదురు అట్లనే నిజమైన భగవద్భక్తుల యొక్క, గురుభక్తులయొక్క, ధర్మబోధకులయొక్క లక్షణమేమన, వారట్టి దైవ, గురుకార్యములు సంప్రాప్తించినపుడు తదితరకార్యము లన్నింటిని వదలి తదేకనిష్ఠతో వాటినే నెరవేర్చుచు ఆనందభరితులై యుందురు ఆహా! మాకిట్టి పుణ్యకార్యము సంప్రాప్తించినది అని తలంచుచు వారెంతయో మోదము బడ యుచుందురు తదితరులకు మాత్ర మాకార్యము మహాభార మనిపించును

30 సామాన్యముగా యుద్ధమునకు జనువారు జయాకాంక్షచే ప్రాణములనైన సరకుగొనక, శత్రువుల శరాఘాతముల కించుకైన జంకక ఖడ్గప్రహారములు జరుగుచున్నను బాంబులు వర్షించుచున్నను, అస్త్ర శస్త్రములు పైబడుచున్నను ముందునకే బోవుచుందురు నశ్వరమైన ఒక చిన్న రాజ్యమునకయ్యే వారంత త్యాగము, నిర్భీకత జూపుచుండనిక శాశ్వ తమైన మోక్షపదవికై, ఆత్మసామ్రాజ్యాధిపత్యమునకై వెయ్యేల, స్వారాజ్యము నకై యెంత త్యాగము, నిర్భయత్వము గల్గి యుండవలసియుండును? ఈ బ్రహ్మాండమందు, లేక ఈ నక్షత్రగోళములలో, లేక ఈనవగ్రహ కూటమిలో

మన యీ భూమి అణువుకంటెను న్యూనమైనదే యగును అట్టిదానిలో ఒక చిన్న భూఖండలేశము కొఱకే మనుజులు తమ ప్రాణములనుకూడ నర్పించు చుండ నిక సమస్త బ్రహ్మాండాధిపత్యము నొసంగి విశ్వమున కేకైకప్రభువుగ జేయు ఆత్మవిభూతికై యెంత త్యాగ మొనర్పవలసియుండునో మీరే యోచించుకొనుడు

31 తన దేహమను పట్టణములోగల సర్వేంద్రియములను నిగ్రహించినచో నిక ప్రపంచమంతయు నిగ్రహించినట్లే యగును ఏలన, ఎపుడు వ్యష్టిత్వము నశించునో, అపుడు మిగులునది సమష్టిత్వము, లేక ఈశ్వరత్వము కాన తనకు తాను గురువైనచో లోకమున కంతకునుకూడ గురు వగును.

32 సన్నని వటబీజమునందు గొప్పదైన వటవృక్షము ఇమిడి యున్నట్లు, చిన్న భూతద్దమునందు విశాలమైన పర్వతములు, క్షేత్రములు ఇమిడి యున్నట్లు, పరమేశ్వరునియందు ఈసర్వమున్ను ఇమిడియున్నది అనగా సర్వేశ్వరుడు చరాచరము లందంతట వ్యాపించి యున్నాడని యర్థము

33 ★ఒక తెరకలవాడు భార్యాబిడ్డలను పోషింపలేక సన్న్యసించెను ఆతడు చాలా రూపవంతుడు ఆదేశపు రాజునకొక సందేహము పొడమెను, ద్వైతము సరియా, లేక అద్వైతము సరియా యని ఆతడు దానిని గూర్చి తన యాచార్యుని ప్రశ్నించెను కాని యాతడద్దానికి ప్రత్యుత్తర మీయ సమర్థుడు కాకపోయెను అయినను తన గురుత్వము పోవునేమోయని భయపడి యెవరి చేనైన నా ప్రశ్నకుత్తర మిప్పించవలెనని యత్నించుచుండ నింతలో పైవచించిన సాధువు వానికి గనుపించెను ఆసాధుమూర్తిని కొన్ని ధర్మములను గూర్చి ప్రశ్నించెను గాని సరియైన సమాధానము రాలేదు. అందులకాతడు, మీరు మాత్రము మౌనముగా నుండుడని వచించి యా స్వామిని రాజాగారి వద్దకు తీసికొని పోయి—రాజా! మాగురువుగారు వచ్చిరి, వారు చాతుర్మాస్య

★ పొట్టకూటిసన్న్యాసమును గూర్చి శ్రీవారు సెలవిచ్చిన యొకానొక కథ,

మౌనదీక్ష నవలంబించుచున్నారు కాన మాట్లాడరని చెప్ప నంత నా రాజు దానిని మిగుల గౌరవించి, సంజ్ఞచే(అంగుళీకము జూపి) ఒకటా, రెండా(ద్వైతము సరియా లేక అద్వైతము సరియా) యని ప్రశ్నించెను రెండు కాదు ఒకటే యని అతడున్ను సంజ్ఞచే జూపెను రాజునకు సంశయము తీరి వానిని బహురీతుల సత్కరించి పంపెను కాని యధార్థ ముగా నా సాధువునకు అద్వైత జ్ఞానము కలిగికాదు అట్లు చెప్పుట మీరు ఒకయెద్దు గానుగ వారా లేక రెండెద్దుల గానుగవారా యని రాజు అడిగెనని తలంచి యాతడు తాను ఒకెద్దుగా నుగవాడే యని సంజ్ఞ చే ఒకటి చూపెనట!

34 ఒకడు కుటుంబభారము వహింపలేక తనకు తానే సన్న్యసించెను ఒకదినమున నొక మహాసాధ్వి వానిని తన గృహమున కాహ్వానించి భిక్షచేసి, తదనంతరము గీత నొక పట్టువస్త్రముచే జుట్టి కాగితములోనుంచి తీసికొని వచ్చి స్వామీ! గీతను పుచ్చుకొనుడు(గ్రైకొని బోధింపుడు) అని ప్రార్థింపనంత ఆతడది యేమో ఫలాహారమని తలంచి, ఇపుడు కాదు తరువాత పుచ్చు కొనెద ననెను ఆహా గీతయననేమో తెలియని వారు కూడ సాధువులలో కొందఱు కలరు గదా!

35 అజ్ఞానవృత్తులను అంతర్యమున నణగద్రొక్కక బాహ్యమున మాత్రము డాంబికముగా మనోవాక్కాయముల నిగ్రహమును ప్రదర్శించుట తమోగుణతపస్సె యగును ఇతరులను మోసపుచ్చవలెనని చేయు తపస్సుకూడా తామసతపస్సె యగును తీర్థప్రసాదముల నేమియు గైకొనక యోగము చేసినచో, ఆకటిబాధచే జీవుడు తపనపడి, శరీరము కృశింప, వ్యాధిగ్రస్తుడగును అట్టి తపస్సున్ను తామసతపస్సె యగును దానిచే యోగసిద్ధి గలుగదు పది చిల్లులు గల కుండలో నీరుపోసిన నిలువనట్లు భక్తి, జ్ఞాన, వైరాగ్య, ఇంద్రియ నిగ్రహములు లేని యోగము యోగికి సిద్ధిని గలుగ జేయజాలదు అట్లుగాక, ఇంద్రియనిగ్రహము, బ్రహ్మచర్యము, భక్తిజ్ఞాన ధ్యానాదులు గలిగి యోగము సల్పెనేని, ఆయోగ మంతకంతకు వృద్ధియై భోగాదులందు విరస్వతము జనింప, త్వరలో జీవుడు పరబ్రహ్మైక్యము

నొందగలడు.

36 ఒక బీజమును మంచి భూమిలో నాటి నీరు కొంచెము కొంచెముగా పోయుచున్నయెడల, అది క్రుళ్ళిపోక, మొలకెత్తి క్రమముగా పెరుగుచుండును అత్తటి ఎఱువు, నీరు విశేషముగా జేర్చవచ్చును వృక్షము అభివృద్ధియగు కొలది అధికమగు ఎఱువును, నీటిని భరించగలదు అపుడది క్రమశః శాఖోపశాఖలుగ విస్తరించి పుష్ప పత్రఫలపల్లవాదులతో శోభించును అట్లుగాక భూమియందు విత్తనము పెట్టినదాదిగ ఎరువు, నీరు విశేషముగా నుంచుచు వచ్చిన అయ్యది క్రుళ్ళి నశించిపోవును ఒక వేళ మొలచినను నభివృద్ధి నొందక క్రమేణ క్షీణించిపోవును అట్లే భూమియందు బీజముంచి ఒక పర్యాయము నీరుపోసి మఱల నెన్నడు పోయకున్నను మొలక మొలచినప్పటికి చెమ్మ లేనందుచే వేరు ఎండి వృక్షము నశించిపోవును ఆరీతిగనే గురుని సన్నిధిజేరి మంత్రోపదేశ మొందినను, ధ్యానానుష్ఠాన భక్తి వైరాగ్యాదులు లేనిచో జ్ఞానాభివృద్ధి కానేరదు ఇక తీర్థప్రసాదములను విశేషముగా పుచ్చుకొ నుచు వచ్చిన, ఆయాసము మెండయి నిద్ర జాస్తియై యోగదశనుండి భోగదశకు దిగిపోవును కాన సాధకుడు కడు జాగరూకుడై యుక్తాహార, వివి క్తవాస, బ్రహ్మచింతనములను సల్పుచు క్రమముగ సాధింపవలసియుండును

37 ఇడా, పింగళ సుషుమ్నలను మూడునాడులు ముఖ్యముగ శరీరమునందు గలవు అందులో సుషుమ్న ప్రధానమైనది అది బ్రహ్మరంధ్రము వఱకు వ్యాపించియుండును ఈసుషుమ్నా మార్గమున మనస్సును సంయమనము చేసిన, అచ్చట ప్రణవనాదము వినవచ్చుచుండును. నాదబ్రహ్మమునందు మనస్సును లీనముచేసినచో నిక బాహ్యప్రపంచవినోదమున భ్రమ నివృత్తియగును తదుపరి అభ్యాసయోగముచే క్రమముగ నాదబిందు కళాతీతమగు ప్రత్యగాత్మయందు చిత్తమేక మగును ఇదియే చిత్తైకాగ్రత యోగశ్చిత్తవృత్తి నిరోధః - అను పతంజలి యోగసూత్రముయొక్క ముఖ్యాభిప్రాయ మిదియే

38 శ్రీ శంకరాచార్యుల వారికి ప్రధానులగు శిష్యులు నలుగురు గలరు వారిలో నొకరు గొప్ప పాండిత్య ప్రకర్ష గలవారు మఱియొకరు గొప్ప తపస్సంపన్నులు ఇంకొకరు విశేషబోధనాశక్తి గలవారు మరొకరు గురుభక్తి మిక్కుటముగ గలవారై ఆశ్రమసేవ, సాధుసేవ, అతిథి అభ్యాగతుల సంరక్షణము గావించుచునుండినవారు శ్రీపద్మపాదాచార్యుల వారు ఈ నల్గుఱిలో మొదటి ముగ్గురకు మాత్రము పీఠస్థాన మలంకరింప నభిలాష గలదు. ఈస్థితిని గ్రహించి శంకరు లొకదినమున నొక దొన్నెపై గంగానది యావలితీరము జేరి ఈవలి తీరమున నున్న శిష్యులను – దాహము తీసికొని రమ్మని సంజ్ఞ చేసి పిలిచెను తక్కిన ముగ్గురును ఆవలితీరమున కేగుటకు దోనె తెడ్లు మున్నగువాటికై వెదకుచుండిరి కాని పద్మపాదులు గురువాక్యమును వినుటతోడనే దాహమునకై నీటిని గైకొని తెప్పలేకనే (గురువాక్యమందు నమ్మికగల్గి) గంగకడ్డుపడి నీటిపై నడచిపోవుచుండ నాతని యొక్కొక్క పాదము క్రింద నొక్కొక్క తామరపుష్పము ఉద్భవించెను కనుకనే యాతడు పద్మపాదు డని ప్రసిద్ధికెక్కెను అట్లాతడు ఏరుదాటి, గురుసన్నిధిజేరి జలపాత్ర శ్రీవారి కొసంగెను అపుడు తక్కిన శిష్యులందఱున్ను పద్మపాదుల గురుభక్త్యతిశయంబుల గుర్తెఱింగి లజ్జితులైరి అంత పద్మపాదులనే పీఠాధ్యక్షులుగ జేయుట కియ్యకొనిరి

39 ★ అందఱును మనస్సును ఏకాగ్రపఱచి, తాబేలు తన సకలావయవములను లోనికి ముడుచుకొనునట్లు సర్వేంద్రియములను నిగ్రహించుకొని ఓంకారము యొక్క నాల్గవపాదమైన తురీయస్థానములోనికి ప్రవేశించవలెను

**తైలధారామివాచ్ఛిన్నం దీర్ఘఘంటా నిదవత్।**
**ఉపాస్యం ప్రణవస్యాగ్రం యస్తం వేద స వేదవిత్॥**

అనునట్లు తైలధారవలె నెడతెగక భావానుసంధానము చేయుచు మనస్సును నూర్ధ్వముఖ మొనర్చి, ప్రణవనాదమందు మనస్సును లీనపఱచి తురీయమందెవరు నివసించుచున్నారో, అట్టివారే వేదము నెఱింగివారు

★ నాటి సంధ్యాకాలము గావించిన బోధ

నామసంకీర్తనాదులు వాక్ క్రియలు తాళవాద్యనర్తనాదులు కాయిక క్రియలు చింతన, ధ్యానాదులు మానసిక క్రియలు ఈ మూటికంటెను పరమై, సర్వేంద్రియముల కతీతమై ప్రణవాగ్రమైనట్టి నాల్గవ పాదమగు తురీయానందము ఏ స్థానమున ననుభూత మొనర్పబడునో, ఏస్థానమునుండి చెప్పిననది తెలియబడునో అదియే వేదము త్రివిధావస్థలు త్రివిధదేహములు, త్రివిధపాదములు - అన్నియు ప్రకృతి లక్షణములే తురీయమగు ప్రత్యగాత్మ వీటికి విలక్షణమై యుండును అది అంతర్ముఖ లక్ష్యాను సంధానపరులకే తెలియును తంతివార్త పంపునపుడు దానిని పంపువారున్ను, గ్రహించువారున్ను ఆపరీక్షయందు తీర్ణులైనవారైననే ఆ వార్త తెలియగలదు

40. చింతనాప్రవాహము ఇసుకలో మోట తోలినట్లుండును అనగా మోటను త్రెంపులేక తోలుచున్ననే జలము ప్రవహించుచుండునుగాని, ఆగినచో వెంటనే నీరంతయు ఆయిసుకలో నింకిపోవునట్లు మనశ్శక్తియు స్వస్థానమునకు చేరునపుడు మధ్యలో త్రెంపు గల్గిన చేరజాలదు కనుకనే గొప్ప గొప్ప వక్తలు ఉపన్యసించునపుడు వారి చింతనా ప్రవాహమున కడ్డు కల్గింపక అందఱును నిశ్శబ్దముగాను, నిశ్చలముగాను నుందురు

41 దృశ్యమునకు సమీపము దేహము దానికి సమీపము కర్మేంద్రియములు, దానికి జ్ఞానేంద్రియములు, దానికి మనస్సు; దానికి ప్రత్యగాత్మ - ఈరీతిగా చాల మెట్లు గలవు ప్రణవాగ్రమైన ఆ ప్రత్యగాత్మను, వేదముయొక్క అంత్యమును ప్రారంభముననే యవగాహన మొనర్చుకొనుట కష్టసాధ్యముగాన క్రమేణ జపములు, కీర్తనలు, భజనలు, పురాణకథలు మున్నగు వాటిని సాధనలుగా నేర్పఱచిరి

42 'మెయిల్' వచ్చుటకు ముందుగనే అందఱును టికెట్లుకొని ప్లాటు ఫారముపై సిద్ధముగా నుండునట్లు, దేహవియోగకాలము వచ్చుటకు మునుపే పరబ్రహ్మసాక్షాత్కారమను టిక్కెట్టు కొని సిద్ధముగా నుండవలెను

43 ఒక స్టేషనునకు అర్ధరాత్రి మెయిల్ బండి వచ్చు మామూలైనచో

38 శ్రీ శంకరాచార్యుల వారికి ప్రధానులగు శిష్యులు నలుగురు గలరు వారిలో నొకరు గొప్ప పాండిత్య ప్రకర్ష గలవారు మఱియొకరు గొప్ప తపస్సంపన్నులు ఇంకొకరు విశేషబోధనాశక్తి గలవారు మరొకరు గురుభక్తి మిక్కుటముగ గలవారై ఆశ్రమసేవ, సాధుసేవ, అతిథి అభ్యాగతుల సంరక్ష ణము గావించుచునుండినవారు శ్రీపద్మపాదాచార్యుల వారు ఈ నల్గురిలో మొదటి ముగ్గురకు మాత్రము పీఠస్థాన మలంకరింప నభిలాష గలదు. ఈస్థి తిని గ్రహించి శంకరు లొకదినమున నొక దొన్నెపై గంగానది యావలితీరము జేరి ఈవలి తీరమున నున్న శిష్యులను – దాహము తీసికొని రమ్మని సంజ్ఞ చేసి పిలిచెను తక్కిన ముగ్గురును ఆవలితీరమున కేగుటకు దోనె తెడ్లు మున్న గువాటికై వెదకుచుండిరి కాని పద్మపాదులు గురువాక్యమును వినుటతోడనే దాహమునకై నీటిని గైకొని తెప్పలేకనే (గురువాక్యమందు నమ్మికగల్గి) గంగకడ్డుపడి నీటిపై నడచిపోవుచుండ నాతని యొక్కొక్క పాదము క్రింద నొక్కొక్క తామరపుష్పము ఉద్భవించెను కనుకనే యాతడు పద్మపాదు డని ప్రసిద్ధికెక్కెను అట్లాతడు ఏరుదాటి, గురుసన్నిధిజేరి జలపాత్ర శ్రీవారి కొసంగెను అపుడు తక్కిన శిష్యులందఱును పద్మపాదుల గురుభక్త్యతి శయంబుల గుర్తెఱింగి లజ్జితులైరి అంత పద్మపాదులనే పీఠాధ్యక్షులుగ జేయుట కియ్యకొనిరి

39 ★ అందఱును మనస్సును ఏకాగ్రపఱచి, తాబేలు తన సకలావయ వములను లోనికి ముడుచుకొనునట్లు సర్వేంద్రియములను నిగ్రహించుకొని ఓంకారము యొక్క నాల్గవపాదమైన తురీయస్థానములోనికి ప్రవేశించవలెను

**తైలధారామివాచ్ఛిన్నం దీర్ఘఘంటా నిదవత్।**
**ఉపాస్యం ప్రణవస్యాగ్రం యస్తం వేద స వేదవిత్॥**

అనునట్లు తైలధారవలె నెడతెగక భావానుసంధానము చేయుచు మనస్సును నూర్ధ్వముఖ మొనర్చి, ప్రణవనాదమందు మనస్సును లీనపఱచి తురీయమందెవరు నివసించుచున్నారో, అట్టివారే వేదము నెఱింగివారు

★ నాటి సంధ్యాకాలము గావించిన బోధ

యొసంగును

47 రాత్రిళ్లు కుక్కలుగాని, నక్కలుగాని స్వప్నములో ఏదో ఒకటి అరచినచో అది యేమో అనుకొని అన్నియు అరచుట ప్రారంభించును అట్లే సంఘములో ఒకరు లోపము చేసిన, తక్కిన వారు కూడా దాని ననుసరించుట చాల పొరబాటు

48 భోగమునకును, యోగమునకును ఉత్తరధ్రువ, దక్షిణ ధ్రువములకు గల తారతమ్యము గలదు

49 సింహము - ఏనుగు, గరుడపక్షి - సర్పము లోకేస్థలములో నుండ నట్లు యోగ భోగములు రెండును నొక్కరియందు నుండజాలవు యోగ మపేక్షించెదరా భోగములను వర్జింపుడు, భోగము లాశించెదరా, యోగమునకు తిలోదక మిండు

50 రోగియైనవాడు ఆయుర్వేదములో జెప్పబడిన మందులన్నియు తినబనిలేదు దాహము గలవాడు ప్రపంచములో నున్న అన్ని నదీనద సరోవరముల నీరు త్రాగనక్కరలేదు అట్లే మోక్షేచ్ఛగలవాడు వేదమున జెప్పబడిన ధర్మములన్నిటిని అనుష్ఠింప బనిలేదు కాని రోగియగువాడు ఏయొక్క ఔషధమునైన సేవింపకున్నచో నాతని రోగమెట్లు శమించదో, దాహము గల వాడు ఏ యొక్క బావినీరో, నదినీరో త్రాగకున్నచో నాతని దాహమున్ను ఎట్లు ఉపశమింపదో, అట్లే భవరోగము గలవాడున్ను ఏయొక్క ధర్మమునైన పూర్తిగ ననుష్ఠించనిచో నాతని అజ్ఞానవ్యాధిన్ని శమించదు తన హృదయ క్షేత్రములో ఏయొక్కటైన ధర్మబీజమును పెట్టి శాంతి, శమ దమాదులను జలముచే పోషించుచు నున్నచో నచిరకాలములోనే యది గొప్పవృక్షాకారము నొంది మోక్షఫలము ఫలించగలదు కాన ప్రాణము పోయినను సరే, ఏదో యొక ధర్మమును (భక్తియో, జ్ఞానమో, యోగమో, నిష్కామ కర్మమో దేనినో యొకదానిని) తన జీవితమున పూర్ణముగ ననుష్ఠింప ప్రతిముముక్షువు బద్ధకంకణుడై యుండవలెను అట్లు దృఢవ్రతుడైననే ప్రకృతి వానికి త్రోవ యిచ్చును

51 చెట్టు మొలకగా నున్నపుడు దాని చుట్టు కంచె, లేక ప్రహరి యున్ననే బాగుగ సంరక్షింపబడును లేనిచో పశువులు మేసివేయును అట్లనే అభ్యాసకాలములో భక్తిజ్ఞానయోగాదులను నంకురము ఎంతబాగుగ పోషింపబడినను వైరాగ్యమను ప్రహరి లేనిచో క్రమశః అది హరించిపోవును

52 ఇల్లు కట్టుటకై కొయ్యలు మున్నగునవి తెచ్చినపుడు వాటిలో కొన్ని వంకఱగాను, కొన్ని కుఱుచగాను, కొన్ని లావుగాను నుండును అపుడు వడ్రంగి బాడిస, ఉలి మొదలగు పరికరములతో వాటిని బాగుగ చెక్కి గృహనిర్మాణమునకు తగినవిగ జేయును అట్లు ప్రాకృతజీవులను బ్రహ్మనిష్ఠుడగు గురువు తగిన యుపదేశ, సాధనముల ద్వారా, క్రమశిక్షణద్వారా అప్రాకృతస్థితిలోనికి దీసికొనివచ్చి ముక్తిధామ ప్రవేశమునకు యోగ్యులను నొనర్చును

53 భగవద్గీత చదివినను, అంతరార్థము తెలిసికొన పోయినచో ధన పేటిక దొరకి తాళపుచెవి లేకున్నట్లుండును అపు డాధనమువలన నెంత ప్రయోజన ముండునో పైదానివలనను అంతే ప్రయోజన ముండునని గ్రహింపవలెను భగవద్గీత నిత్యము పారాయణ మొనర్చినను అనుష్ఠానము లేనిచో, తురీయానందము లభింపజాలదు భవబంధరహితులు గానేరరు

54 సూర్యప్రకాశ మంతటను వ్యాపించియున్నను మట్టియందు గాని, గోడయందుగాని, పలకయందుగాను ప్రతిఫలింపదు నిర్మలమైన అద్దము నందు శుద్ధమైన నీటియందు మాత్రమే ప్రతిఫలించును అట్లే సర్వేశ్వరు డంతట నిండియున్నను విశుద్ధాంతఃకరణములందే బాగుగ ప్రకాశించును.

55 వేసవికాలమున అరణ్యములో గొప్పగొప్ప వృక్షముల తొఱ్ఱలలో అగ్ని రగుల్కొని ప్రజ్వలింప, క్రమముగ నావృక్షపు ఆకులు, కొమ్మలు, చిగుళ్లు వాడి యెట్లు రాలిపోవునో, అలాగున ఎవరి హృదయబిలమందు జ్ఞానాగ్ని ప్రజ్వరిల్లునో వారి సర్వేంద్రియ వ్యాపారములును సన్నగిలి, వాసనలు, సంస్కారములు ధ్వంసమైపోవును అట్టివారికి నింకను వాసన లున్నవని నమ్మకూడదు ఇంద్రియాంతః కరణాది వృత్తు లున్నంతవఱకు

నింకను యోగానుష్ఠానము సిద్ధించ లేదని, జీవన్ముక్తి కలుగలేదని నమ్మ వలెను కాన ప్రప్రథమమున నంతఃకరణాది వృత్తులను జ్ఞానాగ్ని యందు విలయము చేసికొనుడు

56 తురీయాతీతమగు నిర్వికల్పసమాధియందు మాత్రము ప్రారబ్ధ, ఆగామి, సంచితములు లేవు ఏలన, త్రిగుణాతీతమగు ప్రత్యగాత్మయందు ప్రారబ్ధాదు లుండవు గదా

57 కొందరు బాల్యమున తమోగుణదశయందున్ను, కౌమారమున రజోగుణదశయందును యౌవనమున సత్త్వదశయందును వార్ధక్యమున విశుద్ధసత్త్వ దశయందును నుండి జీవన్ముక్తు లగుచున్నారు

58 ఓంకారము పూజకు ముఖ్యము తక్కిన విగ్రహము లన్నియు దీని తరువాతివే సవికల్పమునుండి నిర్వికల్పములోనికిని పోవుటకు ప్రణ వము సాధనము అందును మంత్రార్థమే ముఖ్యమైనది వాచకమునకన్న ఉపాంశువు వెయ్యి రెట్లధికఫలము గలది ఉపాంశువుకన్న మానసికము ఇంకను వెయ్యి రెట్లధిక ఫలము నిచ్చునది 'అనన్తం నిర్వికల్పకమ్' అనగా నిర్వికల్పధ్యానఫల మనంతమని యర్థము అదియే ఆరూఢస్థితి

59 ప్రణవమంత్ర మొకటితప్ప తక్కిన మంత్రము లెవ్వియు అద్వైత సిద్ధిని గలుగజేయజాలవు అవన్నియు సాధనములు మాత్రమే యగును కాన ఓంకార మంత్రోచ్చరణ చేయువారు గొప్పవృక్షము యొక్క మొదలంట నీరుపోసిన వారగుదురు. సర్వచరాచరములకును మూలమైనట్టి ప్రణవ మంత్రముచ్చరించినచో సర్వదేవతలను పూజించినట్లే యగును 'తస్య వాచకః ప్రణవః' అని పతంజలి మహర్షి కూడ ఆప్రణవమే పరబ్రహ్మవాచకమని సెలవిచ్చియున్నారు

పిపీలికాది బ్రహ్మపర్యంతము గల సర్వోపాధులం దున్నట్టి చైతన్యమే ప్రజ్ఞాన మనబడును ఆ చైతన్యమే తానని, తనకన్యముగ నేదియు లేదని యెవడట్టి చైతన్యమున సంయమన మొనర్చునో అతడు సర్వమును పూజిం

51 చెట్టు మొలకగా నున్నపుడు దాని చుట్టు కంచె, లేక ప్రహరి యున్ననే బాగుగ సంరక్షింపబడును లేనిచో పశువులు మేసివేయును అట్లనే అభ్యాసకాలములో భక్తిజ్ఞానయోగాదులను నంకురము ఎంతబాగుగ పోషింపబడినను వైరాగ్యమను ప్రహరి లేనిచో క్రమశః అది హరించిపోవును

52 ఇల్లు కట్టుటకై కొయ్యలు మున్నగునవి తెచ్చినపుడు వాటిలో కొన్ని వంకఱగాను, కొన్ని కుఱుచగాను, కొన్ని లావుగాను నుండును అపుడు వడ్రంగి బాడిస, ఉలి మొదలగు పరికరములతో వాటిని బాగుగ చెక్కి గృహనిర్మాణమునకు తగినవిగ జేయును అట్లు ప్రాకృతజీవులను బ్రహ్మనిష్ఠుడగు గురువు తగిన యుపదేశ, సాధనముల ద్వారా, క్రమశిక్షణద్వారా అప్రాకృతస్థితిలోనికి దీసికొనివచ్చి ముక్తిధామ ప్రవేశమునకు యోగ్యులను నొనర్చును

53 భగవద్గీత చదివినను, అంతరార్థము తెలిసికొన పోయినచో ధన పేటిక దొరకి తాళపుచెవి లేకున్నట్లుండును అపు డాధనమువలన నెంత ప్రయోజన ముండునో పైదానివలనను అంతే ప్రయోజన ముండునని గ్రహింపవలెను భగవద్గీత నిత్యము పారాయణ మొనర్చినను అనుష్ఠానము లేనిచో, తురీయానందము లభింపజాలదు భవబంధరహితులు గానేరరు

54 సూర్యప్రకాశ మంతటను వ్యాపించియున్నను మట్టియందు గాని, గోడయందుగాని, పలకయందుగాను ప్రతిఫలింపదు నిర్మలమైన అద్దము నందు శుద్ధమైన నీటియందు మాత్రమే ప్రతిఫలించును అట్లే సర్వేశ్వరు డంతట నిండియున్నను విశుద్ధాంతఃకరణములందే బాగుగ ప్రకాశించును.

55 వేసవికాలమున అరణ్యములో గొప్పగొప్ప వృక్షముల తొఱ్ఱలలో అగ్ని రగుల్కొని ప్రజ్వలింప, క్రమముగ నావృక్షపు ఆకులు, కొమ్మలు, చిగుళ్లు వాడి యెట్లు రాలిపోవునో, అలాగున ఎవరి హృదయబిలమందు జ్ఞానాగ్ని ప్రజ్వరిల్లునో వారి సర్వేంద్రియ వ్యాపారములును సన్నగిలి, వాసనలు, సంస్కారములు ధ్వంసమైపోవును అట్టివారికి నింకను వాసన లున్నవని నమ్మకూడదు ఇంద్రియాంతః కరణాది వృత్తు లున్నంతవఱకు

చేసియుండిరని తలంచి వారెట్లు ఆనందింతురో, ఆలాగున అజ్ఞాన వృత్తులలోనున్న మనుజాలను బ్రహ్మవేత్తలు ఆయావృత్తుల నుండి తొలగించుటకు యత్నించునపుడు వారికి కొంత మనఃక్లేశము గలిగినపుడు కొంత కాలమున కవి తమ భావిశ్రేయస్సుకొఱకే యని వారు గ్రహించి యాఋషుల ఔదార్యము నెంతయో కొనియాడుదురు రోగాదులు గల్గినపుడు డాక్టర్లు సరియైన ఆహారము పెట్టరు అట్లు చేయుట మన బాగుకొఱకే యని రోగులు తలంచవలెను రోగము నిర్మూలమైనచో, ఆ డాక్టర్లే వారికి అనగా రోగు లడుగక మునుపే సరియైన యాహారము తెచ్చిపెట్టుదురు అట్లే అజ్ఞానావస్థయందున్న జీవులకు భవరోగ నిరావరణకై మహర్షులు కొన్ని కఠిన సాధనలు నియోగించినపుడు అవన్నియు తమ శ్రేయస్సుకొఱకే యని వారు తలంచ వలసియుండును

63 బుద్ధదేవుడిట్లు చెప్పెను గాలికి నెదురుగా దుమ్ము విసరిన అది విసరినవాని కండ్లలోనే పడునట్లు మనదృష్టి బహిర్ముఖముగా నుంచిన బాహ్యా వ్యాపారము లన్నియు మన యంతఃకరణములోనే నిలుచును ఒక రాతిని పై కెగురవేసిన అది మఱల నతివేగముగ అచ్చోటనే పడి బాధ గలుగజేయును అట్లనే మన మితరులకు క్లేశము గలుగజేయు కార్యము చేసిన అది మనకే యొకపుడు సంభవించును మన మేమి విత్తనము నాటిన ఆఫలమే యనుభ వించగలము కనుకనే భావి విపత్తులనుండి తొలగించుటకొఱకే దీర్ఘదర్శు లును, కరుణాళువులును నైన మహర్షులు సర్వజీవులకును శ్రేయము గలు గునట్లు ఆయాసాధనల నుపదేశించిరి

64 అయితే, లోకములో కొందఱు తామెట్టి క్రూరకృత్యములు సల్పి నను, ఎట్టి దౌష్ట్య మాచరించినను సుఖమునే పొందుచున్నార మనియు, తమకేమియు నష్టము రాలేదనియు వచింతురు అట్లనే మఱికొందరు తాము ధర్మబుద్ధి గల్గి పుణ్యకర్మల నాచరించుచు సదాచరణ గల్గియున్నార మనియు, కాని తమ కెన్నియో కష్టములు గల్గుచున్న వనియు వచింతురు అట్లొకపుడు గలుగవచ్చును మనమిపుడు భుజించు ఆహారము గత సంవత్సరము పైరు

చేసిన ధాన్యమై యున్నది ఇపుడు పైరు చేసినది ఇంక కొంతకాలమున కుప యోగమునకు వచ్చును అట్లనే తాను పూర్వమాచరించిన కర్మయొక్క ఫలమునే జీవుడిపు డనుభవించుచున్నాడు అది పుణ్యవంతమైనచో సుఖమును, పాపవంతమైనచో దుఃఖమును అనుభవించుచున్నాడు. ఇపుడు పుణ్యకర్మ లాచరించిన, దాని ఫలమునుగూడ కొంతకాలమున కాతడు పొందియే తీరును కాన శాస్త్రవాక్య మసంగతము కాదు 'గహనా కర్మణోగతిః' అనునట్లు కర్మయొక్క రహస్య మతినిగూఢమైనది పరిణామకాలమందే అది స్పష్టముగ గోచరించును తననీడ నెట్లు తాను వేఱుపఱుపజాలడో ఆలాగున తన కర్మ నుండియు జీవుడు వేఱుపడజాలడు బండి నడుచునప్పుడు ఎద్దు వెంటనే బండియు వచ్చునట్లు జీవుడు తానెట కేగునో అచటకు తన కర్మయు వెంబడించి వచ్చును నియతి అనుల్లంఘనీయ మైనది, త్రిమూర్తులైనను దానిని మార్చ జాలరు

65 వేదాంతశాస్త్ర ప్రకారము కర్మయోగమైన తరువాత జ్ఞానయోగము బోధించవలసి యుండును అట్లుగాక గీతయందు రెండవ అధ్యాయమున సాంఖ్యయోగ మనంబడు జ్ఞానతత్త్వము నుపదేశించిన పిదప ని మూడవ అధ్యాయమున కర్మయోగ ముపదేశింపబడెను ఇది క్రమవిరుద్ధము కదా యని కొందరడుగవచ్చును జ్ఞానియైన తరువాత కర్మనుగూర్చి వానికేల ఉపదేశింపవలెను? సత్కర్మాదుల నొనర్చి అంతఃకరణశుద్ధి బడసి తద్ద్వారా జ్ఞానము పొందవలసియుండును గదా! అట్లైన, జ్ఞానము పొందిన వెనుక మఱల కర్మలను గూర్చి యుపదేశింపనేల? అని సంశయింపవచ్చును ఇందులకు సమాధాన మేమన 1 జ్ఞానము పొందిన తరువాతగూడ నిష్కామకర్మ (ఫలాపేక్షలేని కర్మ) చేయవలసి యుండుననుట యొకటి, 2 జ్ఞానము పొందిన వెనుకనే నిష్కామకర్మ కర్హత లభించు ననుట రెండవది ఆత్మతత్త్వమును పూర్ణముగ నెఱింగిననే యథార్థమయిన నిష్కామకర్మను జీవుడాచరించ గల్గును, లేనిచో సాధ్యము కాదు కనుకనే యెందరో తాము దైవకర్మము, ఈశ్వరకర్మము ఫలాపేక్ష లేక ఆచరించుచున్నామని చెప్పుకొని

నను, అపరిపక్వతచేత ఆత్మతత్త్వజ్ఞానాభావముచేత పూర్ణమగు నిష్కామత్వము సంభవింపమిచే కర్మలందు తగుల్కొనుచునే యున్నారు ఈతత్త్వము తెలిసియే ఋషులు దీర్ఘవిచారముచేసి యివ్విధమున నుడివిరి

**కర్మాణి చిత్తశుద్ధ్యర్థమైకాగ్ర్యార్థముపాసనమ్।**
**మోక్షార్థం బ్రహ్మవిజ్ఞానమితి వేదాంతడిణ్డిమః॥**

మొమ్మొదట చిత్తశుద్ధికై పుణ్యకర్మాదులు, ఆపిదప చిత్తైకాగ్రతకొఱకు ఉపాసన, ఆపిమ్మట బంధవిముక్తి రూపమగు మోక్షమునకై బ్రహ్మజ్ఞానము జీవుడాచరింప వలసియుండునని, వేదాంతభేరి విస్పష్టముగ లోకమున కెఱింగించుచుండ నిక నావిషయమై సందియమేల? పైవిషయమునందింకొక రహస్యముగూడ గలదు బుసకొట్టుచున్న త్రాచుపామును పట్టుకొనిన అది వెంటనే కఱచును కాని గారుడమంత్రమును తెలిసినవానిని అది యేమియు చేయజాలదు ఆమంత్రశక్తిచే అది అణగియుండును అట్లనే యుద్ధరంగములో దుమికి, నిష్కామబుద్ధితో కార్యాచరణముచేసి ప్రకృతి యను సర్పము నాడించుటకు తగిన సమర్థునిగా అర్జునుని చేయదలంచి శ్రీకృష్ణభగవానుడు వానికి మొదటనే, ధైర్యోత్సాహములను పురికొల్పి కార్యశూరునిగ జేయునట్టి స్వస్వరూపవిజ్ఞానమును, అఖండాత్మతత్త్వమును

**అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ।**
**నైనం ఛిన్ద న్తి శస్త్రాణి నైనం దహతి పావకః।**

ఇత్యాది వాక్యము ద్వారా బోధించెను అపుడర్జునున కిదివఱకున్న భీతి తొలగి భ్రాంతిరహితుడై, అమృతస్వరూపుడై స్వకార్యాచరణకై రణరంగమున దుమికెను అట్టి ఆత్మతత్త్వమను గారుడమంత్ర ముపదేశించినందువలననే యుద్ధములో దుముకుట కాతనికి ధైర్య మబ్బెను అట్లే ప్రపంచములోని ప్రతిమానవుడును ఆత్మస్వరూపస్థితి నొందిన వెనుకనే ఏమహాకార్యమైనను చేయుటకు సమర్థుడగునుగాని తత్పూర్వము గాదు కాన పవిత్రమైన మానవజన్మమెత్తి దుఃఖరహితమైన శాశ్వతస్థితి బొందవలెనన్న బ్రహ్మవిద్య యొక్కటియే సాధనముగాని అన్యము గాదు ఎన్ని విద్య

లున్నను, ఎన్నిపదవులు బొందినను, ఎన్ని సౌఖ్యములు గల్గియున్నను, సార్వభౌముడైనను, ఇంద్రుడైనను, చతుర్ముఖ బ్రహ్మదేవుడైనను, త్రిమూర్తులైనను సరే జన్మరాహిత్యమగు నిరతిశయానందము నొందవలెనన్న బ్రహ్మవిద్య యొక్కటియే శరణ్యము

66 రామతీర్థ లమెరికాకు ఆహ్వానింపబడినప్పుడు, అచట రేవు దిగగనే, కొందఱు మిషనరీలు–మీరు ఏ సంప్రదాయమునకు జెందిన వారని వారి నడిగిరి అపుడాత డేమియు ప్రత్యుత్తర మివ్వలేదు మఱల నడిగిరి అంతనాతడు మీదేశములో గొప్ప గొప్ప విజ్ఞానవంతు లుండియు ఇంత యల్పప్రశ్న నన్నడిగితిరే యని లజ్జ యగుచున్నది అండపిండ బ్రహ్మాండము లన్నియు, సకల చరాచరమంతయు, సూర్యచంద్ర నక్షత్రాది గోళము లన్నియు నాయందు నిండి నిబిడీకృతమై యుండ నా స్వరూప మెచట? సంప్రదాయ మెచట? మీకంటే నేనన్యుడనా? అయ్యో, యింత చిన్నప్రశ్న వేసితిరే! భారతీయులు సోఽహంభావపరులు మీరు జడమునే ఆశ్రయించుచుందురు సోఽహంభావప్రకాశముచేతనే జడమగు దేహేంద్రియాదు లన్నియు, ప్రకాశించుచుండును అనిరి అక్కాలమున రామతీర్థులు అమెరికాలోని సర్వశాస్త్రజ్ఞులను జయించి అద్వైతమతమును స్థాపించిరి అంత నాదేశీయులు – మీవంటివారింకను మీదేశములో గలరా యని యడిగిరి అపుడు రామతీర్థులు – లేకేమి? నేను కేవలము సామాన్యుడను అచట నుండువారి దాసుడను మహనీయులెందరో యచట గలరు మీరు హింసాపూర్వకమైన పదార్థములు భుజించుచు క్రూరస్వభావము గలవారగుటచే వారిచటికి రాక నన్నే పంపిరి అని సమాధాన మొసంగెను

రామతీర్థుడు సామాన్యముగా ప్రణవమో, ప్రణవార్థమో బోధించునే గాని, అంతకు క్రిందికి నెన్నడును దిగిరాడు కాన నాబోధ అమెరికావారికి నందలేదు అంత, వారిలో కొందఱు – ఈ బోధ మాకనుభవము గాక యున్నది ఏమియో భజనలు ప్రార్థనలు – వీనిని గూర్చి చెపుడీ యనిరి అపుడు రామతీర్థులు, ఇది చిల్లర దుకాణము కాదు. రత్నముల యంగడి

వారమున కొకరత్నమైన అమ్మిన చాలును ఆలాగున ఏ కొలదిమంది మాత్రమైనను దీనిని తెలిసికొనిన చాలును అని చెప్పెను తదు పరి కొంత జాబోధను విని యానందించి వెంటనే ప్రపంచమున కంతకు బ్రహ్మవిద్యకు సాటియైన మఱియే యుత్తమ విద్యయు లేదని చాటిరి అప్పటి నుండియు అమెరికా వారికి అధ్యాత్మ విద్యయందు చాల నమ్మిక యేర్పడి నది

**67. లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ ।**
**జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్ ॥**

సృష్టికాలమునుండి నేటివఱకు జ్ఞాన, కర్మయోగములు రెండును నుండియే యున్నవి ఈ రెంటిలో దేనిని లెస్సగ ననుష్ఠించినను, ముక్తులు కాగలరు ఇవి యొక రౌండురోడ్డు మార్గము వంటివి ఏమార్గమున నడచినను ఒకే గమ్యస్థానమును జేరుదురు కర్మయోగము గృహస్థులకున్ను, జ్ఞానయోగము విరాగులకున్ను సామాన్యముగా నేర్పడియుండును కాషాయవస్త్రము గట్టినను యాజ్ఞవల్క్యునివలె అనుష్ఠానపరులై యుండిననే ధన్యులు గాగలరు లేనిచో బంధనము తొలగదు

**68. పురా మునీనాం గణనాప్రసంగే కనిష్ఠి కాధిష్ఠితమైథిలేశః ।**
**అద్యాపి తత్తుల్యమునేరభావాత్ అనామికా సార్థవతీ బభూవ ॥**

ఒక తూరి ఋషులందఱునుజేరి, లోకములో నింతవఱకు గృహస్థులలో తరించిన వారెందరు అనిగలరని ప్రశ్నించుకొనిరి జనకుడొకడు అని చిటికెన వ్రేలు వంచి లెక్కించుట ప్రారంభించిరి ఆ తరువాత మఱియొక డట్టివాడు కనుపించనందుచే నిక లెక్కించుట కెవరును లేకపోయిరి అందుచే నుంగరపువేలు చాల దుఃఖపడినదట! ( ఉంగరపు వ్రేలికి 'అనామిక' అను పేరు సార్థకమైనది )

**69. యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః ।**
**స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥**

యజమానుడెట్లు నడచునో తదితరులును అట్లనే నడచెదురు కాన

లోకసంగ్రహార్థమైనను తానాచరించియే తీరవలెను 'నియతిం న విముఞ్చన్తి మహాన్తో భాస్కరా ఇవ'(యోగవాసిష్ఠము) అనునట్లు సృష్ట్యాదినుండి నేటివఱకు సూర్యభగవానుడు రేఖాగణిత ప్రకారము కాలనియమము తప్పక నడపుచున్నాడు తన శింశుమార చక్రమునుండి కాసంతైన నాతడు తొలగుటలేదు అట్లుండ నిక సూర్యభగవాని కంటె యతీతులమనియా మనము నియతి నుల్లంఘించుట! మౌఖికముగ మాత్రము కర్మరహితుల మైతిమని చెప్పుకొనిన తగునా? కాన, నియతి ననుసరించి వర్తించుచు బంధవిముక్తి కై యత్నించవలెను

70 ఒక రాజొక యవధూతను సమీపించి మీరింత తేజోమయులుగ నుండుటకు కారణమేమని యడిగిరి అపుడాతడు నాకిఱువది నల్గురు గురువులు గలరు. అందు సముద్రమొకటి అపారజలరాశి కాస్పదమై ఉత్తుంగ తరంగ సమన్వితమై అతివిశాలమై యున్నను సముద్రము తనహద్దు దాటకయే మితి ననుసరించి యున్నది అట్లే ఎంత యోగప్రభావము గల్గియున్నను మనుజుడు దానిచే త్రుళ్లగూడదను బోధ నాకు దానిచే గల్గెను మఱియు సముద్రమట్టి మహామహిమాతిశయంబు గల్గియున్నను అనేక వేల యోజనములవఱకు విస్తరించి యున్నను, తనయందేదైన నొక చిన్నగడ్డిపోచ పడినచో వెంటనే తరంగముల ద్వారా దానిని ఒడ్డు జేర్చును కారణమేమన, ఆవిధముగ ఒక్కొక్కతృణము పడిపడి క్రమముగ తన్నావరించి, తన మహత్త్వమును భంగపఱచునేమో యని దాని భయము అట్లనే, సముద్రమువంటి అపారజ్ఞానము గలిగియున్నను, ఏ యొక్క ప్రపంచవృత్తి నాహృదయమున స్ఫురించినను వెంటనే దానిని తొలగ ద్రోయవలె ననియు, అట్లు చేయనిచో క్రమముగ దృశ్యవృత్తు లన్నియు నొకటొకటిగ జేరి మహత్తరజ్ఞానరాశి నంతయు క్రమముగ విహిత మొనర్చుననియు నాకు దానిచే బోధగల్గెనెను

**71. సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వ న్తి భారత।**
**కుర్యాద్విద్వాం స్తథాస క్తశ్చికీర్షుర్లోకసఙ్గ్రహమ్.**

అజ్ఞాని సక్తుడై కర్మల జేయు విధమున జ్ఞాని అసక్తుడై కర్మల నాచ

రించవలెను లోకసంగ్రహమునకైనను అట్లాచరించుట శ్రేష్ఠమని భగవానులు సెలవిచ్చిరి ఇట్లుండ కొందఱు గురువులు కర్మ లేదు, జన్మ లేదు, పాపము లేదు, పుణ్యము లేదు, అంతయు బ్రహ్మమే, అచలమే అని అమాయకులకు బోధించి వారికున్న పుణ్యకర్మాసక్తిని గూడ నశింపజేసి భ్రష్టుల నొనర్చు చుండుట కడు శోచనీయము అట్టి వారినిగూర్చి భగవంతుడు,

**యే త్వేతదభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్ ।**
**సర్వజ్ఞానవిమూఢాంస్తాన్విద్ధి నష్టానచేతసః ॥**

అని యుపదేశించి యున్నారు అనగా నెవరు సత్కర్మలను దూషింతురో వారు తత్త్వము నెఱుంగనివారు, శాస్త్రదృష్టిలేని వారు, ఏమియు తెలియని వారని భగవాను లానతిచ్చిరి ఇంద్రియములకు విషయములు స్వభావములు, కాన వాటి ననుభవించిన నికదోషము లేదని వచించు శుష్కవేదాంతులకు భగవంతుడే ఈ క్రిందిశ్లోకమున సరియైన ప్రత్యుత్తర మొసంగెను

**ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।**
**తయోర్న వశమాగచ్ఛేత్తౌహ్యస్య పరిపన్థినౌ ॥**

ఇంద్రియములకు విషయాదులందు రాగద్వేషములు గల్గియున్నవి కాన వాటికి లోబడవలదు అవి పరమశత్రువులు అని దీనియర్థము

**72. కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః ।**
**మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్. ॥**

'ఒకరిని నిందింపరాదు కోపగించరాదు, అసత్యమాడరాదు' అని నిశ్చయించుకొనినను హఠాత్తుగ కోపము, ద్వేషము వచ్చిపడునే అదేమియని అర్జునుం డడిగినప్పుడు భగవానులు పై విధమున నుడివిరి దానికి కారణము అంతఃకరణములో నిగూఢమై యుండు కామక్రోధాదులేయని చెప్పిరి రజస్తమోగుణ ప్రభావముచే కామక్రోధాదులు ప్రజ్వరిల్లి విషయాదులను లోనికి లాగుచున్నవి

73 సువర్ణపాత్రలో ఆమ్లరస ముంచిన చిలుమెక్కదు కాని రాగిపాత్ర లోనుంచిన వెంటనే చిలుము పట్టును అట్లే కామాదివృత్తులు నశింపనివాని హృదయములో జ్ఞానము ప్రవేశపెట్టినను, అది నిలువదు

74 మహాగ్నియందు కట్టెలు వేసినకొలది యింకను అధికముగనే ప్రజ్వరిల్లునట్లు కామాగ్నియందు విషయేంధనముల వైచినకొలది జ్వలించునేగాని శమింపదు విషయేంధనములను వేయనిచో కామాగ్ని తనంతట నదియే చల్లారిపోవును కాన తీవ్రవైరాగ్య వివేకబుద్ధులచే, శమదమాదులచే ఆ విషయాగ్ని నెట్లైన నుపశమింపజేయవలెను

75 దీపము శుద్ధమైన గ్లాసునందు వెలుంగుచున్నను, వత్తి పెద్దదియైన మసిబట్టి యెట్లు మలినమగునో, అట్లే యెట్టి జ్ఞానియైనను స్వల్పమాత్రమగు నంతఃకరణ దోషముండిన క్రమముగ నది పెరిగి తుదకు వాని నధోగతి పాలొనర్చును 'ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా' – ఈ యజ్ఞాన మెట్టి జ్ఞానము నైనను ఆవరించి అనుభవమునకు రానీకుండ చేయును కాన బ్రహ్మనిష్ఠుల కిది పరమశత్రువని యెఱుంగవలెను కనుకనే ''ప్రథమమున నీవింద్రియముల వశము జేసికొనుము అవి నీజ్ఞాన విజ్ఞానముల రెంటిని (తాను గురుశాస్త్రాదులవలన నెఱింగినది జ్ఞానము, స్వానుభవమువలన తెలిసి కొనినది విజ్ఞానము) నిర్మూలించును'' అని భగవంతుం డర్జునున కుపదేశించినది

**76. యోగేన చిత్తస్య పదేన వాచాం మలం శరీరస్య చ వైద్యకేన।**
**యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం పతఞ్జలిం ప్రాఞ్జలిరానతోఽస్మి**

ప్రణవాది మంత్రజపములచే, భగవన్నామ సంకీర్తనాదులచే, వాక్కుల యొక్క మలము నశించును ధ్యానముచే మనోమలము నశించును నిష్కామకర్మ, యోగాది పుణ్యకార్యములచే శారీరకమలము నశించును ఈ మూడనుష్ఠానములును యథార్థమగు బ్రహ్మనిష్ఠులు నిరంతరము చేయుచుందురు చేయవలెను

77 శ్రుతులు (ఉపనిషదాదులు) స్మృతులు, కలియుగమున వ్రాయ కూడదు ఋషులకే ఆయధికార ముండియుండెను కలియుగమున ఇంద్రియముల కతీతమైన జ్ఞానము గలవారరుదుగ నుందురనియు, జనులట్టి శక్తి నందుకొనజాలరనియు తలంచి యానియమ మేర్పఱచి యుండవచ్చును

78 ఒకడొక గొప్ప పర్వతము నధిరోహించి దూరదర్శినీ యంత్రముచే నంతయు పరిశీలించి తాను గాంచినది చెప్పెను మఱియొక డాపర్వతమునకు దిగువనే యుండి చూచి పైవాడు చెప్పినది అసత్యమని వాదించెను అట్లనే తురీయమను పర్వతమును తీవ్రవైరాగ్య ధ్యానాదులచే నధిరోహించి వచించిన ఋష్యాదుల దివ్యసత్యప్రబోధవచనముల నజ్ఞులు గనజాలక వాటియెడ విశ్వాసము లేక యుందురు పూర్వఋషులవలె ననుష్ఠానపరులైననే, వారు పొందినట్టి యప్రాకృతస్థితిని పొందగల్గి వారి వాక్యముల సత్యతను గనగలరు

79 లోహమిశ్రితమగు సువర్ణము అపరంజి కావలెనన్న స్ఫుట మొనర్పబడునట్లు కర్మరాహిత్యస్థితి నొందవలెనన్న సత్కర్మానుష్ఠాన, భక్తి, ధ్యానాదు లాచరింపవలసియే యుండును అపుడే తమయందున్న దుష్కృత్యము నశింప జీవులు కృతార్థు లగుదురు

80. ★దేహియగు ఆత్మకొఱకై జనులేవిధముగ యత్నము సల్పుచు న్నారో, ఆవిధముగ దేహము స్వస్థముగ నుండుటకయ్యు ప్రయత్నింపవ లెను దేహరక్షణ లేనిచో దేహికై యత్నింప శక్తి సామర్థ్యము లుండవు కాన దేహము, దేహి - ఈ రెంటిని కూడా జాగరూకతతో చూచుచుండవలెను అయితే, జనుల దారిద్ర్యము బాపుట లక్ష్యముగాగల రాజకీయ క్షేత్రమున మీరేల ప్రవేశింపలేదని నన్నడుగవచ్చును ఒక పెద్ద ఆసుపత్రి (జనరల్ హాస్పిటల్)లో అనేక శాఖలుండును నేత్రవ్యాధులన్నియు ఒకచోట చూడబడు చుండును చెవికి సంబంధించినవి యింకొకచోట చూడబడు

★నాటి మధ్యాహ్నము, యాగస్థలసమీపమున జాతీయపతాకారోహణము, రాట్న పరిశ్రమ గావింపబడెను తత్సందర్భమున శ్రీస్వాములవారు నుడివిన వాక్యములు

చుండును ఆయా శాఖలకు జెందిన డాక్టర్లున్ను వేఱువేఱుగానే యుందురు అందొకరు తక్కువని యెక్కువని, ఒకరు అవసరమని ఒకరు అనవసరమని లేదు అందఱు సమానమే, అందఱు అవసరమే దేహారోగ్యమున కన్ని చికిత్సలు కావలసినవే ఆయా పరీక్షలు ప్యాసైనవారు ఆయా శాఖలందు పనిచేయుచుందురు

ఇట్లుండ, కంటి డాక్టరుతో నీవేల చెవిని బాగుచేయుట లేదని యడిగిన ఎట్లుండునో, యోచించు కొనుడు అన్ని రోగములు బాగుపడిన మాత్రమే పూర్ణారోగ్యము గల్గును డాక్టర్లు వేఱువేఱుగానే యున్నను వారందఱియందును పరస్పరము మైత్రి యుండును అట్లనే ఒక గవర్న మెంటునందు అనేక శాఖలలో పనిచేయువారున్నను వారందఱియందును మైత్రి యుండును లోకక్షేమముకొఱకై అన్నిశాఖలున్ను అవసరములే ఆవిధముగానే స్వరాజ్య, స్వారాజ్యములు రెండును అవసరములే, ఆ రెంటి యైక్యమే పూర్ణత్వమునకు చిహ్నము

81 కర్మ, భక్తి, జ్ఞాన, ధ్యానము లనెడు నాల్గుమార్గములు సనాత నములై యున్నవి ఇవి మనచే నిర్మింబడినవి కావు సృష్ట్యాదినుండి పరమేశ్వ రునిచేతనే యేర్ప ఱుపబడిన్నవై యున్నవి వీనియం దేదేది ఏయే కాలములో పతనమొందునో ఆయాదాని నుద్ధరించుట కొఱక దివ్య పురుషుడు సర్వేశ్వరు నిచే లోకమునకు పంపబడును జ్ఞానము క్షీణదశ నొందినపుడు శ్రీ ఆదిశంకరు లవతరించి దాని నుద్ధరించిరి భక్తి సన్నగిలినపుడు శ్రీరామాను జులు, శ్రీకృష్ణ చైతన్యులు మున్నగు వారవతరించి దాని యాధిక్యమును బోధించిరి అలాగున కర్మ యంతరించినపుడు మధ్వాచార్యులున్ను, వర్తమానకాలమున నిష్కామ కర్మను జూపుటకు శ్రీగాంధీమహాత్ములున్ను అవతరించిరి ఇవ్విధమున సనాతనముగా జరుగుచునే యుండును ఇది ఈశ్వరనియతి

ఒక గోవునకు గల నాల్గుపాదములలో, ఒక మండపమునకు గల నాల్గు స్తంభములలో ఏది శ్రేష్ఠము? ఏది నికృష్టము? అన్నియు శ్రేష్ఠములే, అన్నియు

సమానములే ఆలాగున కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞానములను నాల్గుపాదము లున్న సౌష్ఠవముగా నున్ననే ముక్తియను కామధేనువు బాగుగ చరింపగల్గును కాని యందొక రహస్యము గలదు దేనినుద్ధరించుట కెవరెవరు వచ్చుదురో వారు వారు దానిదానికే యాధిక్యము నిచ్చుచు నుందురు అంతియేగాక తమ సిద్ధాంతమును బలపఱచుటకై శాస్త్రము లందును ఉపనిషదాదులందును ప్రమాణములను గూడ జూపుదురు అదియే ఉత్తమమనియు చెప్పుదురు అట్లు చెప్పనిచో వారాకార్యమును నిర్వహింపలేరు అది యుక్తిచే చెప్పుట కాదు పరమేశ్వరుని సంకల్పము వారల నావిధముగ వచింపజేయును కాన మీకు కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞానములలో దేని యందు విశేషముగా ప్రీతి యుండునో దానినే యాదరించి తద్ద్వారా యుత్తమ స్థితిని బడయవచ్చును అయితే యోగము, భక్తి మున్నగునవి శీలించుచున్నను, ఆవిధమున స్వారాజ్య మునకై యత్నించుచున్నను, తామందఱును శరీరమునకు తగిన ఆహారము నెట్లొసంగుచున్నారో, అట్లే స్వరాజ్యము, దేహస్వాతంత్ర్యము గూడ సర్వులును సంపాదించవలసినదే



## 4వ రోజు 31-3-1940

**82. యదా పఞ్చావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ ।**
**బుద్ధిశ్చ న విచేష్టేత తామాహుః పరమాం గతిమ్.॥**

జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, మనోబుద్ధ్యాదుల వ్యాపారము లేస్థితి యందుడిగియుండునో దానినే పరమావస్థయని ఋషులు పేర్కొనిరి అట్లనుటచే నది సుషుప్త్యవస్థ కానేరదు జాగ్రదవస్థలోనే అట్టి స్థితి తోచవలెను కేవలము జ్ఞేయాకారము మాత్రము మిగులవలెను. అదే పరమగతి దానికి మించిన దేదియును లేదు

83 బద్ధావస్థ, అభ్యాసావస్థ, ముక్తావస్థ యని మూడు అవస్థలు గలవు వర్షర్తువునందు మేఘము సూర్యుని క్రమ్మివైచునపుడు సూర్యుడు కానుపించ

నట్లు, హృదయాకాశమున అజ్ఞానము ఆత్మజ్యోతిని కమ్మియుండుట బద్ధావస్థ. మేఘము దట్టముగ నావరించి యుండునపుడు ఉరుము లురుముచు, మెరుపులు మెరయుచు నుండునట్లు, బద్ధావస్థయందున్నపుడు రజోగుణ ప్రేరితములైన ఉద్రేకపు మాటలను ఉరుములున్ను, విషయవృత్తులను మెరుపులున్ను గలుగుచుండును వర్షము కురిసిన తదుపరి మేఘముయొక్క నలుపుతనము పోయి తెల్లబడును అయినను అదికూడ సూర్యుని కొంచెము కొంచెము అడ్డపఱచుచునే యుండును అట్లే దుర్వాసనలను నలుపుదన ముడిగినను, హృదయమున పుణ్యకార్యములను గూర్చిన సంకల్పము లపుడపు డుదయించుచుండుట మధ్యమస్థితియగు అభ్యాసావస్థ ఇట్టి స్థితియందు హృదయము చాలమట్టుకు శుద్ధమైనను, పూర్ణశుద్ధత యింకను జెందలేదు క్రమముగ వసంతకాల మేతెంచ ఆకసము శుద్ధమై, నిర్మలదమైయుండ సూర్యభగవానుడు నిరావరణముగ ప్రకాశించునట్లు, హృదయ గ్రంథులన్నియు విచ్ఛిన్నమయి, అజ్ఞానావరణ మంతయు తొలగగ, జ్ఞానజ్యోతి విస్పష్టముగ ప్రకాశించును అదియే జీవన్ముక్తస్థితి ఇది మూడవదగు ముక్తావస్థ.

**84. యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః ।**
**అథమర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥**

ఎపుడు సమస్తవాంఛలు నశించిపోవునో, చిరకాలమునుండి వచ్చుచున్నట్టి వాసనాజాలము పూర్ణముగ విచ్ఛిన్నమగునో, అపుడిచటనే మానవుడు మృత్యురహితుడై అమృత స్వరూపు డగుచున్నాడు; అనగా దేవుడే యగుచున్నాడు. కనుకనే బ్రహ్మవేత్తలైన శ్రీరామ కృష్ణపరమహంస మున్నగు మహనీయులను ప్రజలు దేవునివలెనే పూజించుచు వారి పటముల నర్చించుచునున్నారు. అట్టి వారినే భక్తులు పూజించెదరు, మమ్ముల నేల పూజించుట లేదని సందేహపడవలదు మీలో నెవ్వరైన ఆ యమృతత్వ స్థితి నొందినచో మీ ప్రయత్నమునులేకనే జనులు మిమ్ముల గూడ పూజింతురు శ్రీరామకృష్ణ పరమ హంస మున్నగువారు తమ్ముల పూజింపుమని యెవరితోనేని జెప్పిరా?

85. ఉన్నతస్థితి, గౌరవము నొందదలంచు ప్రతివారును తమ మనస్సు నకొక పాఠము చెప్పవలెను. అదేమన – ''ఓ మనసా! నీవు ఉన్నత పదవిని గోరుచుంటివి. కాని యే అనుష్ఠానమువలన ఋషు లున్నత పదవుల నొందిరో, యెట్టి కృషిచే వారట్టి కీర్తనీయమైన సద్గతినొందిరో అట్టి అనుష్ఠానము, కృషి, నీవున్ను గల్గియున్నావా? అట్టిచో నిపుడే నీవాసద్గతిని తప్పకనొందగలవు కాన ప్రయత్నపూర్వకముగ బ్రహ్మసాక్షాత్కార రూపమగు ఆ ముక్తా వస్థను, ఉపాధి యున్నపుడే అనగా జీవించియుండగనే పొందునట్లు చూడు ము'' అని యిట్లుపదేశింపవలెను

86 ఒక జిల్లాకలెక్టరు తాను బ్రాహ్మణుడైనను, అబ్రాహ్మణుడైనను, క్రైస్తవుడైనను, మహమ్మదీయుడైనను స్త్రీ యైనను, పురుషుడైనను, ఆస్థాన మునకు తగిన హోదా, గౌరవము, అధికారము ఎట్లు గల్గియుండునో, అదే విధమున ఏ జాతివారైనను, స్త్రీలైనను, పురుషులైనను బ్రహ్మనిష్ఠయం దారి తేరినచో బ్రహ్మత్వమునకు, ఋషిత్వమునకు, ఈశ్వరత్వమునకు అర్హులగు దురు అయితే ఐ సి ఎస్. పరీక్షలో ఉత్తీర్ణులైనమాత్రమే కలెక్టరు ఉద్యోగము వచ్చునుగాని లేనిచో రానట్లు ఆత్మసాక్షాత్కారమను పరీక్షలో నెగ్గిననేగాని జీవుడు శివత్వమున కర్హుడు గానేరడు. సామాన్యముగా పాఠశాలలో ఉపా ధ్యాయులకుగాని, ఆసుపత్రులలో డాక్టర్లకుగాని, పురుషులకంటె స్త్రీలకే హెచ్చు జీతముండుట మనము చూచుచున్నాము అట్లే ఆధ్యాత్మిక క్షేత్రమం దును, యోగ్యత గల్గియున్నచో స్త్రీలకు గౌరవము హెచ్చుగనే యుండును గాని తగ్గదు ఈ విషయము నారీమణులెల్లరు జ్ఞాపకము నందుంచు కొనవలెను

**87. ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్ ।**
**వివస్వాన్మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్॥**

**ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః ।**
**స కాలేనేహ మహతా యోగో నష్టః పర న్తప! ॥**

గీతను ప్రప్రథమమున పరమేశ్వరుడు సూర్యున కుపదేశించెను సూర్యుడు మనువునకు, మనువు ఇక్ష్వాకునకు నుపదేశించెను కాన శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు దానిని బోధించకపూర్వమే అయ్యది లోకమున ప్రతిష్ఠితమై యున్నట్లు తెలియుచున్నది బహుకాలమునకు క్షీణించిన ఆయోగమునే మఱల నీకిపుడు ఉపదేశించుచున్నానని భగవాను లర్జునున కానతిచ్చిరి అయితే అట్టియోగము క్షీణించుటకు కారణమేమియని సందేహపడవచ్చును త్రేతాయుగమున పరశురాముడు 21 పర్యాయములు క్షత్రియు లందఱిని వధించినందుచే రాజపరంపర యంతయు క్షీణించి నందున వారల యధీనమున నున్న బ్రహ్మవిద్యయు క్రమముగ లయ మొంది యుండవచ్చును లేక ఆవిద్య నెఱింగినవారు బహుకాలమునకు యుద్ధాదు లందును, భూకంపాదులచేతను నశించి యుండవచ్చును

88 ఈశ్వరత త్త్వము తెలిసినవారు అంతయు తమస్వరూపమే యని యెంచి సర్వులను ప్రేమించుచుందురు తక్కినవారు, వేఱువేఱని తలంచి భేదభావము గల్గియుందురు వివేకానందులు చెప్పినట్లు, నాటకములోని ఒకే పాత్రధారి ఒకసారి ఋషిగాను, ఒకసారి రాజుగాను, వేఱొకసారి స్త్రీగాను, ఇట్లు అనేకవేషములు వేసికొని రంగముపైకి వచ్చుచు నుండును ప్రేక్షకుల కాతడు అనేకముగానే కన్పించునుగాని ఏకముగా కాదు వెనుకనున్న తన్నాటక సంబంధికులకు మాత్రము ఒకడే అనేకవేషములు వేయుచు న్నాడను బుద్ధిగల్గియుందురు అట్లనే జగన్నాటకమున గూడ సర్వేశ్వరుడు లీలామాత్రముగ అనేక జీవుల వేషముధరించి ప్రత్యక్ష మగుచున్నాడు. ఈ సత్యము నెఱుంగని వారు పరస్పర విద్వేషు లగుచున్నారుగాని, యెఱింగినట్టి జ్ఞానులు మాత్రము సర్వము భగవత్స్వరూపముగానే అవలోకించుచు ఆనందభరితులై యున్నారు

89 బ్రహ్మవిద్యను లోకములో బోధించుటకై అర్జునుని భగవానులు నిమిత్తమాత్రముగా జేసికొనెను ఆతడే ప్రథమమున బోధింపబడుటకు సమ ర్థుడని వారెంచిరి తగిన శిష్యుడు దొఱకినపుడే ఉత్తమ గురువులు వేదతత్త్వ

రహస్యములను వారి కెఱిగింతురు శ్రీరామకృష్ణపరమహంస, వివేకానందులే యిందులకు తార్కాణము తంతివార్త పంపువాడు, గ్రహించువాడు ఇరువురును ఆవిద్యయందెట్లు కుశలురై యుండవలెనో, అట్లనే గురుశిష్యు లిరువురును సమవ్యక్తిత్వము గల్గియున్ననే , గురుబోధ శిష్యునియందు ప్రవేశించి ప్రభావయుత మగును బహుజాగరూకత గలవాడే గురువాక్యమును పూర్ణముగ గ్రహించగలడు

90 జాగ్రత్తున నున్నవాడే నిద్రించువారిని లేపగలడుగాని నిద్రించువాడు నిద్రయందున్న వారిని లేపజాలడు అట్లే సంసారనిద్రనుండి మేల్కాంచిన బ్రహ్మజ్ఞులే, భవబంధనమున తగుల్కొని దీర్ఘ అజ్ఞాన నిద్రయందున్న జీవులను స్వప్రబోధముచే జ్ఞానయుతులను జేయగల్గుదురు. కాని, అజ్ఞాను లజ్ఞానుల నెట్లుద్ధరింపగలరు? ఒక రైలుస్టేషనులో రాత్రి మెయిల్ ట్రైన్ రాక మునుపు స్టేషనులో పలువురు నిద్రించుచుందురు వారెవరైనను సరే (రాజులైనను, పండితులైనను, ఉద్యోగస్థులైనను, అందఱును రైలు వచ్చు) టైమునకు ఒక్క కూలివానిచే లేపబడుదురు ఆకూలివాడు ఏజాతివాడైనను, ఏదేశీయుడైనను, విద్యావిహీనడైనను, దరిద్రుడైనను మేల్కొనిన కారణముచే గొప్పగొప్ప విద్యావంతులను, ధనవంతులను గూడ లేపగల్గుచున్నాడు అట్లే ఆత్మానుభవము గలవారెవరైనను, ప్రపంచములోగల అజ్ఞాను లందఱికిని జ్ఞానప్రకాశ మొనగూర్పగలరు నిద్రితుడు తన్ను తెలిసికొనలేడు, ఇతరులను గూర్చి తెలిసికొనజాలడు మేల్కొన్నవాడు తన్నెఱుంగును, ఇతరులకు నెఱుంగును. అట్లే అజ్ఞాని తన్నుద్ధరించుకొనజాలడు, ఇతరుల నుద్ధరింప లేడు. జ్ఞానియో తన్నుద్ధరించుకొని యితరులగూడ నుద్ధరింపజేయును.

91 (1 )పూర్వమీమాంసకులు అగ్నికి నేడు జిహ్వాలున్నవని చెప్పిరి, అగ్ని ప్రజ్వలించునపుడు జాగ్రతగా పరిశీలించిన అది వేఱు వేఱు రంగులతో గూడి యున్నట్లు కాన్పించును (2.) నవధాన్యములుగాని, సమిధలుగాని, ఆజ్యముగాని అగ్ని యొక్క జిహ్వాగ్రమున హోమించిననే ఫలము గలుగ

జేయును ప్రక్కలబడినచో సరిగా కాలక, అగ్నికాహుతికాక పూర్ణఫలమును కలుగచేయజాల కుండును ఆ నవధాన్యములు మొదలగునవి అగ్నిమధ్యమ మున బడక ప్రక్కలబడినచో తుదకు బూడిదయంతయు నెత్తి పారవైచు నపుడు వర్షము కురిసిన వెంటనే యవన్నియు మొలకెత్తును. అట్లనే జ్ఞానాగ్ని యందు భస్మమైనచోమాత్రమే కర్మబీజములు పునర్జన్మాంకురములను గలుగ జేయజాలవుగాని, భస్మము కానిచో పునర్జనన హేతువు లగును. ఇందొక రహస్యముకూడ గలదు నవధాన్యములనగా నవ రంధ్రములు, తద్విషయ ములు నవధాన్యము లన్నింటిని ఆజ్యములో ముంచి హోమింతురు గనుక ఆ యాజ్యమాన నవధాన్యము లంతటను వ్యాపించియుండును ఆవిధముగానే దశేంద్రియగు స్పర్శేంద్రియము దేహమంతను వ్యాపించి యుండునదై యున్నది ఆదశేంద్రియములను, వాటివృత్తులను ఆత్మజ్ఞానాగ్ని యందు భస్మీకృత మొనర్చి లయింప జేయుటయే పై హోమముయొక్క రహస్యార్థ మగును

92 విషయములతలంపులు గలుగుచున్నంతవఱకు ఇంకను బ్రహ్మనిష్ఠ సరిగ కుదురలేదని తలంచవలెను బీజములు మఱల మొలకెత్తిన అగ్నిలో సరిగా వ్రేల్చబడలేదని యర్థము కొందఱు విషయబుద్ధిగల వారైనను తాము జ్ఞాను లమనియు, అట్టి విషయబుద్ధి తమప్రారబ్ధమనియు, దేహస్వభావ మనియు, దానిననుభవించి తీరవలెననియు ఇట్లు శుష్కవేదాంతమును వచించుచుందురు ఇట్టి శుష్కవేదాంతమే జీవుల నధోగతికి దెచ్చినది అది సరికాదు జ్ఞానిని ఏకర్మయు బంధించదు అట్లు బంధించిన ఆతడు జ్ఞానియే కాడు 'అజ్ఞానజన బోధార్థం ప్రారబ్ధం వక్తి వై శ్రుతిః' అని శ్రీశంకరాచార్యులవారు, జ్ఞానికి కూడా ప్రారబ్ధము గలదను విషయమును ఖండించిరి అజ్ఞులబోధనార్థమే ప్రారబ్ధమను శబ్దము కల్పింపబడిన దనియు, జ్ఞానికది లేదనియు వారు సెలవిచ్చిరి 'జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా' యని గీతయందు చెప్పబడినందున సర్వనామప్రయోగముచే సమస్తకర్మములు జ్ఞానికి క్షయించినవని యర్థమే

గాని ప్రారబ్ధ మొకటి యింకను మిగిలియున్నదను నర్థము కాదు. కాన నిక నైనను నిట్టివారు పాపవృత్తులనుండి మఱలి పుణ్య శీలురై బ్రహ్మనిష్ఠాపరులై తరించెదరు గాక!

93 నాకు తెలిసినంతవఱకు ఆహారదోషముకంటె నివాసదోషముచే చెడినవారు ఎక్కువ మంది గలరు ఏలన, ఒకవేళ చెడు ఆహారము తినినను, అది జీర్ణమై, రక్తమై, శుక్లమగుసరికి కొంతకాలము పట్టును అప్పుడు మాత్రమే వానికి దుర్బుద్ధి కలుగును కాని నివాసదోషమో మానవుని వెంటనే పతితునిగ జేయును. కాన ముముక్షువు లందఱును ఈ విషయమున కడుజాగ రూకులై మెలంగవలెను

94 ఒక వేళ నెపుడైన అట్టి నివాసముచే దోషము గలిగినను వెంటనే పంచవిధప్రాయశ్చిత్తము చేసికొనవలెను ఆ పంచవిధప్రాయశ్చిత్తమేమన (1 ) ఉపవాసము, (2 ) మౌనము, (3 ) దివ్యమంత్ర జపము, (4 ) పశ్చాత్తాపము, (5 ) అన్నదానము వస్త్రము మలినమైనను, మురికిగలదిగాక కఱ్ఱబట్టిన దైనచో శుభ్రపడుటకు కొన్ని దినములు పట్టును అట్లనే అంతఃకరణదోషము విశేషముగా నుండిన, ఉపవాస మధికముగజేసి, బ్రహ్మనిష్ఠ తీవ్రముగ నొనర్చుచు పశ్చాత్తాపబుద్ధితో భక్తిభావనతో నాదోషమును రహిత మొనర్చు కొనవలెను మలినమైన నీటిలో వస్త్రము నెన్నిరోజా లుతికినను శుభ్రపడదు అట్లే గొప్పగురువు వద్ద యుపదేశ మొందినను అంతఃకరణశుద్ధి, సరియైన అనుష్ఠానములు గురుభక్తి, ఆత్మానాత్మవిచారణ లేనిచో జీవులు పరిశుద్ధత నొంది ఆత్మస్వరూపులు కాజాలరు

95 ఆహారనియమము చాలజాగ్రత్తగ పాటించుచుండవలెను నియ మము తప్పి అపుడపుడు మధ్యమధ్య తినుచుండుటచే ఆరోగ్యము చెడుటే గాక ఇంద్రియములు వశపడనేరవు. తల్లులు పిల్లలకు మిఠాయి దినుసులు కొనిపెట్టెదరు అది చాల పొరబాటు దానిచే వారికి పెక్కు వ్యాధులు వచ్చును తామే వండిపెట్టిన నికను మేలు ఏలన బజారువస్తువులపై అనేక క్రిములు వ్రాలు చుండును ధూళిపడుచుండును బీదవారు వాటినిజూచి

తినవలెనని వాంఛ గల్గి కొనుటకు డబ్బులేక, వాటిపై దృష్టిపఱచి పోవుదురు కాన వాటిని తిను వారికి దృష్టి దోషముకూడ వాటిల్లును

సామాన్యముగా ఆహారము (1) పాపార్జనము, (2) వస్తుమాలిన్యము, (3) దృష్టిదోషము, (4) చేయు వారి దుష్టస్వభావము అను నాల్గు విధముల నపవిత్ర మగుచుండును కాన నీనాల్గు విధములగు దోషములు లేకుండ జూడవలెను

నిజముగా మీరు పవిత్రులగువారి హస్తముతో ప్రసాదము పుచ్చుకొనిన యెడల తప్పక పవిత్రులగుదురు పాపరూపమున సంపాదించిన పదార్థము భుజించిన పాపమే సంభవించును ఎట్లన – వాల్మీకి ప్రచేతసుడను బ్రాహ్మణుని కుమారుడై యుండెను పాపకృత్యముగల యొక వ్యాపారస్థుడు వానికాహార మిచ్చుచుండెను వాల్మీకితల్లియు అట్టి దుష్టునియాహారమునే భుజించుటచే వాల్మీకి దుష్టుడై క్రూరుడై జన్మించినాడు అపుడు తపస్సుచేసి తద్దోషమును రహిత మొనర్చుకొనుమని ఋషులు వాని నాశీర్వదించిరి మాతాపితరులు భుజించెడు ఆహారము, భావించు భావము సర్వనాడులందు ప్రసరించి, వ్యాపించుటచే తదనుగుణమగు బుద్ధిగల శిశువే వారికి జన్మించును కాన మాతా పితరులు సత్యమార్గమువలన లభించిన శుద్ధాహారమునే గైకొనవలెను శుద్ధ స్వభావమే గల్గియుండవలెను. దొంగిలించిగాని, బెదిరించిగాని, దుష్టవర్తనతో కూడిగాని సంపాదించినది తినినచో అట్టి లక్షణములు గల సంతతియే జనించును

97 పూర్వము యతులు వైరాగ్యము గలిగి, భక్తులై బ్రహ్మనిష్ఠాపరులై పవిత్రాహారమునే గైకొనుచు వచ్చిరి కాననే వారు పవిత్రులై యుండిరి రాను రాను సాధువులు ఇతరుల ద్వారా వచ్చు రుచికరపదార్థములకు మఱిగి, విషయదోషము గలవారై క్రమముగ పతితులు కాజొచ్చిరి ఈతత్త్వము దెలిసినచో సాధువులకు ఏకభుక్తము చాల నుపయుక్త మైనదని తోచును కనుక నేకపర్యాయము తినువాడు యోగియనియు, రెండుమార్లు భుజించువాడు భోగియనియు, మూడుసార్లు తినువాడు రోగియనియు,

నాలుగుమార్లు గైకొనువాడు ప్రాణముతో కూడిన శవమనియు పెద్దలు వచించెరి. ఇప్పటి సాధువులలో పెక్కువా రీనాల్గవ తరగతికి జెంది యున్నారు వారు నిష్ఠనువదలి భ్రష్టత్వము నొందుచున్నారు ఇకనైనను సాధువు లేక భుక్త మవలంబించి ధ్యాననిష్ఠాగరిష్ఠులై యుండుడి! భోగమెక్కు వైనచో యోగము నశించునని మఱువకుడు!

దేవతార్చన, అతిధిసత్కారము, భగవద్ధ్యానము అయిన వెనుక భుజించు పదార్థము యజ్ఞశిష్టముగాన అది భగవత్ప్రసాదము, అతిపవిత్ర మైనది భగవంతునికి అర్పించనిది భగవద్భావముతో యుక్తము కానిది యునగు పదార్థము భుజించరాదు. యజ్ఞశిష్టాశినస్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః – అనియిట్లు యజ్ఞశేష మమృతమనియు, సర్వపాపములను బోగొట్టు ననియు చెప్పబడినది. కాన నిష్ఠాసమయములో నాష్ఠ నవలంబింపక, తదుపరియే యజ్ఞశేషమును గైకొనుచు వచ్చిన, యోగనిష్ఠ సిద్ధించి బ్రహ్మ ప్రాప్తికలుగును అతిథిఅభ్యాగతులకు ప్రసాదంబు లొసంగి, యాపిదప తాను భుజించుటయు యజ్ఞమే. విదురుడు చేసిన దివ్యమగు అతిథి యజ్ఞములో శ్రీకృష్ణుడు పాల్గొని భుజించినందుచేతనే యాతడు (విదురుడు) ధన్యు డయ్యెను జ్ఞానయజ్ఞ మనగా అంతఃకరణశుద్ధి గావించుటయే, అనగా మనస్సును పరమాత్మయందు సంయమనము చేయుటయే యని భగవాను లానతిచ్చిరి ధనముండియు ద్రవ్యయజ్ఞము చేయక పైవచించిన దానితో మాత్రము సంతృప్తి బొందరాదు అదియు దోషమే యగును. అట్టి ద్రవ్య వంతులు దానాదులు చేయవలసియే యుందురు ఎంతభూమి యుండునో అంతశిస్తు గవర్నమెంటునకు చెల్లించవలసియే యుండునుగదా!

**98. అపిచేదసి పాపేభ్యస్సర్వేభ్యః పాపకృత్తమః ।**
**సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం స న్తరిష్యసి ॥**

పాపులైనవారుకూడ జ్ఞానమను నావచే భవసాగరమును దాటు దురనిన, నిక పుణ్యాత్ముల సంగతి వేఱుగ జెప్పవలెనా? రోగము గలవానికే యౌషధము గాన, పాపుల అజ్ఞానదోషమును పోగొట్టుటకొఱకే జ్ఞానబోధ

యని గ్రహించవలెను

99 భగవద్గీతాదులందలి ఎన్నియో శ్లోకముల భావము ఒక్క సూత్రములో( బ్రహ్మసూత్ర యోగసూత్రాదులలో) నిమిడియుండును కాన సూత్రముయొక్క మహిమ యెటువంటిదో గ్రహింపనగును

100 పరిశుభ్రమైన ఓషధులవలన లభించిన యాహారము గైకొనుటచే దేహము పుష్టిగను ఆరోగ్యవంతముగను నుండును శరీరమను యంత్రము సరిగ లేనిచో, శరీరియగు యంత్రికిని ముప్పువాటిల్లును, అనగా అపుడు యోగనిష్ఠ సరిగ కుదురకుండును. కాన దేహారోగ్యకరమైన శుచివస్తువులనే మితి ననుసరించి భుజించుట మంచిది

101 బ్రహ్మభావమును పొందినవారికి నితర వ్యాపకము లెవ్వియు నుండవు. కాని సామాన్యులకు నిష్ఠనుండి బయటకు వచ్చునపుడు వృత్తి గుణాకారమై పరిణమించును అట్లు గాకుండ మనస్సును నిగ్రహించుటయే యోగసాధన

102 పూర్వము బ్రహ్మనిష్ఠులను బాగుగ పరీక్షించియే వారలకు సన్న్యాస మిచ్చుచుండెడి వారు కనుకనే అపుడు వారు తాము తరించి యిత రులను తరింపజేయ సమర్థులైరి ఇపుడట్లు కానందున జనులు త మ యిష్ట ప్రకారము విచ్చలవిడిగ సన్న్యసించి, అనుష్ఠానము లేనివారై, తాము సత్య దూరు లగుటయేగాక లోకమునుగూడ భ్రష్ట మొనర్చుచున్నారు మోటార్ డ్రయివర్లు ట్రైనింగ్ పరీక్ష ప్యాసుకానిచో, తాము అపాయమును దెచ్చు కొనునదేగాక, ప్రయాణికులకు కూడ అపాయమును కలుగజేతురు కను కనే లైసెన్సుగలవారే డ్రైవర్లుగ నియోగింపబడుదురు వారు కార్లను సరిగా నడుపుచు, అపాయము గలుగనీయక వర్తించుచుందురు యోగ్యతగల్గి యథారీతి శాస్త్రప్రకారము, గురుపరంపరానుసారము సన్న్యసించి, ఆత్మని ష్ఠులై యుండు సన్న్యాసు లీతెఱంగున నుందురు

103 రంధ్రములు గల ఘటములో దీపముంచిన, లోపలను, బైటను

కూడనది ప్రకాశింపజేయునట్లు, దేహేంద్రియాదుల కంతరమున అతీతమై ఆత్మజ్యోతి వెలుగుచు బాహ్యాభ్యంతరముల రెంటిని ప్రకాశింపజేయుచున్నది అట్టి యాత్మ అంతర్ముఖులగు వారికే బాగుగ గోచరించును.

104. 'తత్త్వమసి' ఆ పరమాత్మయే నీవు, సమస్తము నీయొక్క స్వరూపమే, సర్వప్రపంచము నీయొక్క నివాసమే' యని ముముక్షువుల కుద్బోధించి కృతార్థులను జేయుటయే నిజమైన సన్న్యాసముయొక్క అర్థము

105 సముద్రమును తరించుటకు నావ యెటువంటిదో సంసారమును దాటుటకు ప్రణవమున్ను అటువంటిది. ప్రణవము తప్ప సంసార సాగరమును తరించుటకు మఱియొక యుపాయ మెద్దియును లేదు మంత్రము (ప్రణవము) వాచకము, మంత్రార్థమగు పరబ్రహ్మము వాచ్యము 'ప్రాణాన్సర్వాన్ పరమాత్మని ప్రణామయతీతి ప్రణవః' (అధర్వశిఖోపనిషత్తు) – సర్వప్రాణములను పరమాత్మయందు చేర్చుట బట్టియు, సర్వ జీవులకు ప్రాణము (ఆనందము) నొసంగి, పరబ్రహ్మైక్యమును గలుగ జేయించునది యగుటవలనను ప్రణవ మనబడెను మఱియు 'సకృదుచ్చరితమాత్రమూర్ధ్వమున్నామయతీత్యోంకారః' ఒక్కసారి యుచ్చరించిన మాత్రముననే జీవులను నూర్ధ్వముగ దీసికొనిపోవున దగుటచే ఓంకార మనంబడెను సుషుమ్నానాడిలోనికి జేర్చి పరబ్రహ్మమును సాక్షాత్కరింపజేయున దగుటచేతను ఓంకార మనబడియెను. తారయతీతి తారకః' సర్వజీవులను తరింపజేయున దగుటచే ఓంకారము తారకమని చెప్పబడెను పూర్వము కాశీపట్టణమున విశ్వనాధుని యాలయమున మృగశృంగమహర్షి భార్యలగు నలుగురు స్త్రీ రత్నములు పరమేశ్వరుని ధ్యానించుచు త్రోవలో ప్రదక్షిణము చేయుచుండ, కండ్లుతిరిగి క్రిందపడ, అపుడు కాశీవిశ్వేశ్వరుడు వారిపై కరుణ గల్గి వారి దక్షిణకర్ణములందు ఒకేసారి ఓంకారమను తారక మంత్రోపదేశమును చేయగా వారందఱు కృతార్థులైరని శాస్త్రములందు గలదు. ఇందులకు ప్రమాణము

**కాశీపతిః కారుణికః కరాభ్యా మాదాయ మూర్ధాన మతీవ తాసామ్ ।**

**ఆగమ్య వేగాద్యుగవచ్చ తాసామోకారమోంకారయతి స్మ కర్ణే ॥**

106 ఓంకారమునకు ఎనిమిది అంగములు, నాల్గుపాదములు మూడు స్థానములు, పంచదైవతములు గలవు విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు, ప్రత్యగాత్మ యను జీవుని నాల్గు అంగములును, విరాట్, హిరణ్య గర్భ, అవ్యాకృత, పరమాత్మలను ఈశ్వరుని నాల్గు అంగములును చేరి అష్టాం గమగును. చతుష్పాదమనగా అకార, ఉకార, మకార, అర్ధమాత్రాకములు, త్రిస్థానమనగా జాగ్రత్స్వప్న సుషుప్తులు పంచ దైవతమనగా బ్రహ్మ, విష్ణు, రుద్ర, సదాశివ, మహేశ్వరులు – ఇవన్నియు చేరి ప్రణవమగును.

107 అంతఃకరణశుద్ధి గలవారికి ధ్యానయోగము చాలును అది లేని వారు ప్రాణాయామాది యోగము నభ్యసింపవలెను పరిశుద్ధ మనస్సు గల వారికి రాజయోగము చాలును అనగా, దేహేంద్రియాంతః కరణాదులకు విలక్షణముగా నున్న పరమాత్మయే నాయందును, అందటియందును గలదను భావము జేపట్టి అనుష్ఠానయుతులై యుండు వారే రాజయోగులు 'గురు దైవతభక్తానాం సర్వేషాం సులభో జవాత్' గురునియందును, దైవమందును భక్తి యున్నయెడల త్వరలోనే యోగము సిద్ధించును ఇంద్రియాంతఃకరణాదులను నిగ్రహించ లేనివారు కర్మబద్ధులు; వాచా వేదాంతులు అట్టివార లీకాలమున చాలమంది గలరు

108. అగ్నిలో వ్రేల్చిన బీజము భస్మమై మొలకెత్తని రీతి, బ్రహ్మజ్ఞా నియొక్క ఇంద్రియాది వృత్తులు జ్ఞానాగ్నిలో దగ్ధమగుటచే, ఆయా ఇంద్రి యాదులు గల్గియున్నను వాటిచే బాధింపబడక ఆత్మయందే సదా మెలం గుచుండును.

109 పరావిద్య యనగా పరమాత్మను తెలిసికొనువిద్య అపరావిద్య యనగా ధర్మాధర్మములను తెలిసికొను విద్య

110. హృదయబిలమనియు, నాసాగ్రమనియు, భ్రూమధ్యమనియు, బ్రహ్మరంధ్రమనియు, సుషుమ్నాగ్రమనియు ఒకే తురీయమునకు పేర్లు

111 సర్వప్రపంచము, సర్వలోకములు క్షరమే పరబ్రహ్మ మొక్క టియే అక్షరము( నశించనిది). ప్రథమమున అక్షరాభ్యాసమని చెప్పి క్షరమగు విద్యనే జనులు ఉపదేశించుచున్నారు! అనగా విద్యయని చెప్పి అవిద్యనే బోధించుచున్నారనుట!

112 ప్రణవోపాసకులు మహాబోధకు లగుచున్నారు ప్రణవము మణి వంటిది. తక్కిన మంత్రములు ముత్యములవంటివి



## 5వ రోజు 1-4-1940

113 పరమాత్మకు భిన్నముగా జీవేశ్వర జగత్తులు లేవని అద్వైత సిద్ధాంతము పరమాత్మ జీవులకు ప్రాప్యుడనియు, ఆతనికంటె నధికు డొకడు లేడనియు జీవులు ఈశ్వరాంశులనియు విశిష్టాద్వైత సిద్ధాంతము జీవ, ఈశ్వర, జగత్తులు వేఱువేఱని ద్వైతమత సిద్ధాంతము భగవంతుడు తాను జలమందు రసరూపముగాను, సూర్యునియందుష్ణత్వరూపముగను, చంద్రునియందు శీతత్వ రూపముననను చక్కెరయందు మాధుర్యరూపము గను నున్నాడని చెప్పినపుడు విశిష్టాద్వైతమునకు సరిగానున్నట్లు తోచు చున్నది కాని యథార్థముగా చూచిన జలముకంటె రసముగాని, సూర్యుని కంటె తేజోష్ణత్వములుగాని, చంద్రునికంటె శీతలత్వముగాని, చక్కెరకంటె మాధుర్యముగాని వేఱుగా లేవు కాన ఏకత్వరూపమగు అద్వైతమున్ను దీనియందు సంభవించుచున్నది అట్లే ద్వైతులు జల, రసములను భిన్నమని చెప్పుదురు. ఇట్లు త్రిమతస్థులున్ను భగవంతుని ఆయారీతి ద్వైత, విశిష్టాద్వైత, అద్వైత రూపముల గాంచుచుందురు

114. దృశ్యమొకటి, దృక్కొకటియని చెప్పినను మఱల బంధమే అంతయు దృక్కేనని చెప్పిన నిక బంధము లేదు

115 ఏ విత్తనమైనను పైపొట్టు ఉండువఱకు అది మొలకెత్తుచునే

యుండును మెల్లగ నా పొట్టు నూడబెరికిన మఱల నెన్నటికిని మొలకెత్తదు అట్లే జీవునకు అజ్ఞానావరణ మున్నంతవఱకు మఱల మఱల జన్మపరంరలకు లోనగుచునే యుండును విచారజ్ఞానముచే నద్దానిని తొలగించిన భవబంధ రహితుడై పునరావృత్తి లేకయుండును

116 ''సాగరం గోష్పదాయతే గోష్పదం సాగరయతే'' యన్నట్లు బ్రహ్మనిష్ఠునకు సంసార సాగరము గోష్పదజలతుల్యముగాను, బ్రహ్మనిష్ఠ లేనివానికి గోష్పదజలసంసారము మహాసాగరతుల్యముగాను కన్పించును అనగా నజ్ఞునకు సంసారసాగరము దాటుట యంత ప్రయాసముగా నుండు నని భావము

117 సృష్టికి పూర్వముగల ఏకవస్తువే తదుపరి ప్రకృతివైచిత్ర్యముచే అనేక బ్రహ్మాండములుగ, స్థావరజంగమాదులుగ కల్పింపబడుచుండునని తెలియవలెను. ఆరోపితమైన ప్రకృతి యిట్లెన్ని పర్యాయములు మారుచున్నను అధిష్ఠానమగు ఆత్మ (బ్రహ్మము) మాత్రము ఏకమై, నిర్వికారమై ఏమార్పున్ను లేక యుండును

118 బీజమందు వృక్షమంతయు నిమిడియున్నట్లు బీజభూతమగు మూలప్రకృతియందే సర్వము ఇమిడి యున్నదనియు,అది ఆత్మయందు కల్పితమనియు, ఆత్మయొకటియే సత్యమనియు, త్రికాలాబాధ్యమనియు నెఱింగి అట్టి ఆత్మస్వరూపముననే స్థితి గల్గియుండు వారికిక దృశ్యవాసనలు స్ఫురింపనేరవు అదియే యధార్థమగు సత్యస్థితియని యెఱుంగవలెను అటు గాక ప్రాపంచిక విషయవాసనలు మనస్సున స్ఫురించుచున్నచో నింకను నాత్మ స్థితి బొందలేదని తలంచవలెను. ఎండలో నిలబడినపుడు తననీడ తనలో నైక్యముకాక, కొంత మిగిలి యున్నచో నింకను మధ్యాహ్న సమయము కాలే దని యెఱుంగవలెను ఉదయము చూచిన తననీడ తనకంటె నెన్నియో రెట్లధికమును, భయంకరముగను తోచును రాను రాను మధ్యాహ్నమగు కొలది అది క్రమముగ తగ్గితగ్గి తుదకు సరిగా 12గం॥ లకు తనలో విలీనమై పోవును అట్లనే జ్ఞానభాస్కరుడు క్రమముగ వృద్ధియగుచు, ఉన్నతస్థితి నొం

దుచున్న, అజ్ఞాన మాయామోహమున్ను, ప్రాపంచిక భ్రాంతియు దృశ్యవాసనాజాలమున్ను తగ్గుచు తగ్గుచు నుండి, తుదకు పూర్ణవికాస స్థితియందు నేమియు లేకుండ నదృశ్య మగును. అట్లు గానిచో అనగా దృశ్యవాసనలు తనయందింకను నావిర్భవించుచున్నచో అవి నశించువరకు, ఆత్మవిచారణాదులతో గూడి యనుష్ఠానము తీవ్రముగ సల్పుచుండవలెను దృఢవైరాగ్యము గల్గి, నిర్వికల్పసమాధి సిద్ధించువఱకు, త్రిగుణాతీతమగు బ్రహ్మైక్యమగు వఱకు, ప్రకృతి సంపూర్ణముగ వినాశమగు వఱకు ఆచరణ అనుష్ఠానములు సల్పుచునే యుండవలెను.

119 ఎవరు సర్వజీవుల యంతరంగమున గల సర్వాంతర్యామియగు పరమాత్మయే తానని యెఱింగి, ఏకత్వ బుద్ధిగల్గి ఆవరణ రహితులై సర్వసాక్షిత్వము నొందుదురో వారే ముక్తులు

120 ''మాండూక్యమే మేకవాలం ముముక్షూణాం విముక్తయే'' అని ముక్తికోపనిషత్తునందు శ్రీరామచంద్రులు ఆంజనేయుల కుపదేశించిరి. అనగా ము క్తినొందుటకు ఒక్క మాండూక్యోపనిషత్తును బాగుగ గ్రహించిన చాలు నని యర్థము (ఈమాండూక్యోపనిషత్తునకే శ్రీశంకరుల గురువగు శ్రీగౌడపాదాచార్యులవారు కారికలను వ్రాసిరి ) అదియున్ను చాలనిచో ఈశాది దశోపనిషత్తుల పఠింపుమనియు, వాటివలనను శాంతి లభించనిచో అష్టోత్తర శతోపనిషత్తుల పఠింపుమనియు శ్రీరాములు అతని కెఱింగించిరి

**121. అగ్నిర్యథై కోభువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ ।**
**ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ॥**

ఈశ్వరుడు సర్వజీవులందును సమముగా వ్యాపించి యున్నను ఆయా జీవులు భిన్నభిన్నముగా నుండుటకు హేతువేమియనిన సమాధాన రూపమున ఉపనిషత్తు పైశ్లోకమును వివరించినది, అగ్ని ఒకటైనను ఆయా యుపాధుల ననుసరించి ఎఱ్ఱగనో (ముత్తాబులందు వలె), పచ్చగనో, నీలముగనో, ఇట్లనేకరంగులుగ వేఱ్వేఱుగ కన్పించునట్లు, ఆత్మయు

ఒకటైనను జీవుల యంతఃకరణోపాధుల ననుసరించి భిన్నభిన్నముగా తోచుచుండును చిమ్నీ యొక్క రంగుల ననుసరించి దీపపు ప్రకాశము వేఱ్వేఱుగ కనుపించినను, లోనున్న జ్యోతి యొకటిగనే ఉండును అట్లే దోషమంతయు అంతఃకరణ మువలననే కలుగుచున్నది గాని ఆత్మయందే దోషమున్ను లేదు కాన అంతఃకరణ శుద్ధియే ముఖ్యసాధనమై యున్నది

122 నిష్కామకర్మ యనగా సర్వజీవులయొక్క సేవచేయుట మాత్రమే యనికొందఱు చెప్పుదురు. కాని దాని కింకను విశేషార్థము గలదు. కరణములచే చేయబడునది కర్మ అంతఃకరణ, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, దేహ, ప్రాణాద్యవయవములచే సర్వేశ్వరుని శుద్ధబుద్ధితో ధ్యానము చేయు టయు నిష్కామకర్మమే యగును బుద్ధితో పరమాత్మను నిశ్చయించుట, మనస్సుతో సంకల్పించుట, ధ్యానించుట, కరచరణాద్యవయవములచే సేవించుటకూడ నిష్కామకర్మమే యనంబడును విగ్రహారాధనకూడ ఫలాపేక్ష లేక యొనర్చిన(అంతఃకరణశుద్ధికై యేర్పడినదిగాన) నదియు నొకవిధమగు నిష్కామకర్మయే యగును

123 దివ్యపురుషులు భక్తి, జ్ఞాన, యోగ, నిష్కామకర్మాదులలో దేని లోనో యొకదానియందు ముఖ్యముగా నిలుకడ గల్గి తక్కినవి గౌణమని చెప్పుచుందురు యోగమార్గావలంబకులు యోగమే ముఖ్యమని చెప్పుదురు. నిష్కామకర్మ పరులు లోకోద్ధారణ, దేశసేవయే మోక్షహేతువని వచింతురు ఇది గదా భగవచ్చిత్రము! ఎవరు ఏపనికై వచ్చియున్నారో వారికదియే ముఖ్య ముగ గోచరించును అట్టి వారికి వేదాదిశాస్త్రములలో తత్సంబంధములగు శ్లోకములే గానుపించును. వాటినే వారు ప్రతిపాదించుచుందురు అది యుక్తికుతర్కములచే చెప్పుట గాదు పరమేశ్వరుడు ఎవరిని నేకార్యము కొఱకు బంపియున్నారో వారు దానినే ముఖ్యముగా జూతురు. భక్తియోగ పరులు భక్తియే ముఖ్యమని ప్రతిపాదించునట్టి పదివేల శ్లోకములను శ్రుతియుక్తి ప్రమాణములతో వ్రాసియిచ్చెదరు అట్లనే తక్కిన మార్గావ లంబులును వారి వారి పద్ధతియే యుత్కృష్టమని చెప్పుట కెన్నియో

శ్లోకములను క్షణములో సమకూర్చి పెట్టెదరు ఇవి అన్నియు మాకు సమ్మతమే నదులన్నియు సముద్రము నేజేరునట్లు ఈ నాల్గుయోగములలో దేనినైనను ఈశ్వరార్పణ బుద్ధితో ఈశ్వరప్రాప్తి నొందువఱకు దృఢవిశ్వాస ముతో నాచరించెనేని తప్పక ధన్యులు కాగలరు.

అట్లనే ద్వైత, విశిష్టాద్వైత, అద్వైతులు వారివారి మతమే గొప్పదని వాదించి ప్రమాణముల నెన్నిటినో చూపుదురు అదేవిధముగ బ్రహ్మచర్యమే గొప్పది, అన్ని ఆశ్రమములకు పునాది యదియేయని కొందఱున్ను, కాదు, కాదు! గృహస్థాశ్రమము లేనిచో తక్కిన మూడాశ్రమముల వారికి అన్న ప్రసా దములే దొఱకవు అపుడు వారి కష్టములు దేవునకెఱుక, క్రమముగా వారు క్షీణత్వమునే పొందుదురు, కాన గార్హస్థ్యమే ప్రధానమని కొందఱున్ను వాదింతురు మఱికొందఱు ఇదియేమి? వానప్రస్థాశ్రమము లేనిచో గృహస్థా శ్రమ దోషములు నశింపవని మనుస్మృతిలో చెప్పబడియుండ లేదా? కావల సినచో ప్రమాణ పూర్వకముగ పదివేలశ్లోకముల వ్రాసి యిచ్చెదమని యందురు అయితే యింక కొందఱు - వాన ప్రస్థులు పంజరములేని పక్షి వంటివారు, సర్వసంగ పరిత్యాగము వారికి లేదు, వారు సాధకుల వంటివారే, కాన సన్న్యాసమే ముఖ్యము అని చెప్పుటయే గాక పై పెచ్చు పదివేల శ్లోకములను అందుకొఱకై శ్రుతి, యుక్తి, ప్రమాణ దృష్టాంత దార్ష్టాంతిక పూర్వకముగ జూపుటకు సంసిద్ధులై యుందురు కాని విశాలబుద్ధిగలవా రవియన్నియు సనాతనమగు పరబ్రహ్మముయొక్క అంగములే యని తలంతురు గోవున కేపాదము శ్రేష్ఠము, ఏపాదము నికృష్టమని చెప్పెదము అన్నియు శ్రేష్ఠములే. అట్టి విశాలబుద్ధి గలవారు లేనందుచేతనే జనులు సంకుచిత భావగ్రస్తులై కూపస్థమండూకములవలె మెలంగుచున్నారు

124. నిత్యసన్న్యాసి, అనిత్యసన్న్యాసి అని సన్న్యాసు లిఱుతెఱంగులు ఎవరైన చూచునపుడు మాత్రమే నిష్ఠ, ధ్యానము చేయువాడు అనిత్య సన్న్యాసి నియమప్రకారము అనుష్ఠానము శీలించువాడు నిత్య సన్న్యాసి మఱియు నిరపేక్షగల్గి, తనకు సంప్రాప్తమైన సత్పదార్థమునే గ్రహించుచు

సంతుష్టి నొందువాడు నిత్యసన్న్యాసి, ఇతరు లేభావముతో వచ్చిరో, వారి సంకల్పములను తీర్చుటయే ప్రధానముగా తలంచి అపేక్షాయుతుడై యుండు వాడు అనిత్యసన్న్యాసి ఈతడు కుటిలుడు భక్తులిచ్చు పదార్థములను అనియతముగ పుచ్చుకొనుచుండుటచేతనే సాధువు లధఃపతన మొందిరి సాధుత్వ మసాధుత్వమునకు వచ్చెను నాయనుభవమునందు, భోజన కాలమునందు దప్ప మఱల మంచినీరుగాక మఱేవస్తువును మధ్య నేను పుచ్చుకొనునది లేదు ఒకవేళ పరమభక్తులు దేవునకు అర్పించిన ప్రసాదము దెచ్చి స్వీకరింపుడని కోరిన అణుమాత్ర మప్పుడు గైకొని తదుపరి యద్దానిని ఆహారసమయమున భుజింతును

125 ఆహారనియమము లేనివారికి ఆత్మనిష్ఠ కుదురదు. ద్రవ పదార్థము విశేషముగా పుచ్చుకొనిన నది జలతత్త్వమగు చిత్తమయి (ఆత్మ) చింతన కనుకూల మగుననియు, కఠినపదార్థము పుచ్చుకొనిన నది పృథివీతత్త్వమగు అహంకారమును వృద్ధిపరచుననియు ఆయుర్వేదములోని సుశ్రుతమున చెప్పబడినది 'తస్మాదన్నమయం మనః' అని ఛాందోగ్యో పనిషత్తునందున్ను చెప్పబడినది అనగా మనస్సు అన్నమయ మైనది ఎవరెవ రేపదార్థమును భుజింతురో దాని కనుగుణమగు తలంపులే వారికి గలుగుచుండును.

126 సర్వసుఖములను, భోగములను విడచువాడే నిత్యసన్న్యాసి, సుఖదుఃఖములకు తాళలేక అనియమితుడై మెలంగువాడు అనిత్యసన్న్యాసి, ఈతడు క్రమముగ నధోగతుడగును. సాంఖ్యము లేదు యోగము లేదు, భక్తి లేదు అని చెప్పువారు సామాన్యులే గాని విశేషజ్ఞులు కారు

127 నిజముగా జూచిన, అన్నిటికంటె కష్టమైనది సన్న్యాసమే, యోగానుష్ఠానమే దేహసంబంధ వాసనలను విడుచుట సులభమేకాని దేహి సంబంధ వాసనలను విడుచుట కష్టము అవి అనాదినుండి దృఢపడి వచ్చుచు ఘనరూప మొందియుండును అరటి, చేమ, మున్నగు దుంపలను పైన మొలక వద్ద కోసివేసినను మఱల నంకురించి పిలకలు వేయ నారంభించును

దుంపతోకూడ త్రవ్వివేసిన మఱల మొలవవు అట్లే మూలావిద్యను విచ్ఛిన్న మొనర్చినవానికే సమూలవాసనా రాహిత్య మగును అందులకై తీవ్రసాధన, అనుష్ఠానము నవసరము. అది గలవాడే యుత్తమసన్న్యాసి యగును.

128 ఆజీవితము యోగ, ధ్యాన, స్థాన నియమాదులను జాగ్రత్తగా కాపాడుకొనుచుండవలెను ప్రారబ్ధనాశ పర్యంతము స్వస్వరూపానుసంధానము చేయుచునే యుండవలెను ఉపాధి యున్నంత వఱకు దాని పోషణకై అన్నాదు లెట్లవసరములో, అట్లే అనుష్ఠానమున్ను అవసరముగాన దానిని ఆజీవితము విడువరాదు

129 ఎలుక కఱచినచో ఆ విషమెంత కొంచెముండినను క్రమముగా నది వృద్ధియై, వ్యాధిగ్రస్తుని చేసి చంపును ఆ రీతిగనే అంతఃకరణమునందు కొంచెమేని దోషముండినచో నది యంతకంతకు ప్రబలి జీవుని నధోగతికి దెచ్చును కాన అంతఃకరణ శుద్ధియైన వెనుకనే సన్న్యాస ముపకరించును

130 సన్న్యాసి తాటిచెట్టు నెక్కు వాని వంటివాడు. ఏమాత్రము కాలు, చేయి జారినను అమాంతముగ ఒకేసారి క్రిందకు పడిపోవును. గృహస్థుడు చింతచెట్టు నెక్కువాని వంటివాడు ఒకేవేళ జారినను మధ్య ఏదో యొక కొమ్మను పట్టుకొని ప్రాణరక్షణ యొనర్చుకొనవచ్చును అట్లే సన్న్యాస ధర్మముల ననుష్ఠించువాని కేదేని లోపము గల్గెనేని వెంటనే పతితు డగును గృహ స్థాశ్రమమున నున్నవారికి కొన్ని సంకల్పములు గల్గినను తమ గృహస్థదర్మములను సంతానక్షేమములను చూచుకొనుచునే యుండవచ్చును యత్యాశ్రమ మునకన్న గృహస్థాశ్రమమునకు కొన్ని హెచ్చు సదుపాయములు గలవు కాన యత్యాశ్రమము మిగుల కష్టసాధ్యమైనది

**131. ఊర్ధ్వరేతా జితక్రోధో నియతాశీ చ సంయమీ।**
**నిగ్రహేఽనుగ్రహేశక్తస్సత్యసంధో భవేదృషిః ॥**

ధ్యానయోగానుష్ఠానమువలననే జనులు ఋషిత్వము నొందుదురు ఋషి యనునది ఒక బిరుదుమాత్రమే యగును ఈ క్రింది నియమములు

గలవారై యెవరుందురో వారెట్టివారైనను ఋషిత్వమున కర్హులె యగుదురు ఊర్ధ్వరేతస్సు గలవాడై, కామాదిదోషములను జయించి, నియతాహారియై, సంయమియై, ఇంద్రియనిగ్రహము గలవాడై నిగ్రహానుగ్రహశక్తి గల్గి, సత్య సంధుడై యుండువాడే ఋషి యనంబడును

132 రాజు భటుని యభిప్రాయముప్రకారము నడచినచో క్రమముగా వాని రాజ్య మరాజక మగును అట్లే దేహేంద్రియాదుల యాజ్ఞకు లోను లోబ డెనేని తప్పక పతితుడగును అట్లుగాక అమాత్యులను రాజు వశీకరించునట్లు ఇంద్రియాదులను తన వశమొనర్చుకొని, నిగ్రహపరుడై యెవడుండునో ఆతడే రాజయోగి యనంబడును హృషీకేశుడని శ్రీకృష్ణ నకు పేరు హృషీక ములనగా ఇంద్రియములు వాటిని జయించినవాడే హృషీకేశుడు

133 విషయాదులను నిగ్రహించి యుండుటయే నిజమైన యోగము ప్రాణాయామము శీలించుటచేతగాని, ఆసనములు వేయుటచే గాని యోగియని చెప్పరాదు అవి శరీరారోగ్యమును కాపాడుకొనుటకు సాధనలు మాత్రమే యగును

**134. మీనస్స్నానపరః ఫణీ పవనభుక్మేషోఽస్తి పర్ణాశనో**
**నీరాశీ ఖలు చాతకః ప్రతిదినం శైలే బిలే మూషికః ।**
**భస్మోద్ధూళితవిగ్రహస్తు శునకో ధ్యానాధిరూఢో బకః**
**ఏతేషాం ఫలమస్తి కిం న హి న హి జ్ఞానం పరం కారణమ్ ॥**

తీర్థములలో స్నానము చేసిన ముక్తివచ్చునందురు కాని చేపలు మొదలగునవి నిత్యము తీర్థాదులలో స్నానము చేయుచునే యున్నవి వాటికి విముక్తి లభించినదా? సర్పము వాయువే ఆహారముగా గల్గియుండును కాన దీనికి నిత్యోపవాసఫలితము రావలసియుండును గదా! మేకలు ఆకులు, అలములు తిని బ్రదుకును కాన ఫలపర్ణాదులు భుజించి యుండట ఆరోగ్యముకొఱకేగాని ముక్తికొఱకు గాదని యెఱుంగవలెను ఎలుక కొండబిలములో నివసించును చాతకపక్షి జలమే ఆహారముగా గొనును

వాటికట్టి క్రియచే మోక్షము గలిగినదా! కొందఱు దిగంబరత్వమే మోక్షహేతువని తలంచి దిగంబరులయ్యో, లేక కౌపీనము ధరించియో, భస్మమును నొడలంత రాసుకొనియో యుందురు చలికాలమున కుక్కలు మున్నగునవి బూడిదలో పొర్లాడుట లేదా? కొంగ ధ్యానము చేయు చుండును వాటికేమైన ఫలితము లభించినదా! కాన జనులారా! ఇవన్నియు మోక్షహేతువులు కావు ఆత్మజ్ఞాన మొకటియే ముక్తిహేతువు

135 సాధకులు ఆహారాది విషయములందు నిష్కపటులై వర్తింప వలెను నిరాహారులై ఆత్మనిష్ఠ గలవారగుచో అట్లనే యుండవచ్చును లేక ఆత్మనిష్ఠకు భంగము కలుగనట్లు, దేహారోగ్యమునకు హాని కలుగకుండు నట్లు ఫలమూలాదులనో, అన్నమునో భుజించి ఏకభుక్త ముండవచ్చును లేక రెండుపూటలైనను భుజించి యుండవచ్చును వాతాధిక్యము గలవారికి (ఆహారమున) ఉప్పు ఉండవలెను పైత్యాధిక్యము గలవారికి పులుపుండ వలెను శ్లేష్మాధిక్యము గలవారికి కారముండవలెను ఆయారీతిగ వారి వారి దేహానుకూలముగ వర్తింపవచ్చును కాని ఉప్పుకారములను సాధ్యమైనంత వఱకు తగ్గించుటయే మేలు ఖరీదు గల పదార్థములను తినక, స్వల్పఖరీదు గల వానినే గైకొనుచు అదిన్ని మితముగాను, నియమితకాలముననను భుజించుచు, ఆత్మనిష్ఠకు భంగము కాని రీతి ప్రవర్తింపవలెను ధ్యానమునకు ప్రతికూలముకాని వానిని పుచ్చుకొనుచు నిష్ఠను శీలించవలెను గొప్పబలము గల పదార్థములను భుజించిన నిష్ఠ కుదురునేమోయని తలంతురు గాని,వాటిని తీవ్రధ్యానాదులచే హరింపజేసికొన జాలకపోయినచో పైపెచ్చు రక్త శుక్లాదులుగ పరిణమించునపుడు వికారములనే గలుగజేయును కాన విలువ తక్కువ గలవి, త్వరలో జీర్ణమగునవి, దేహమున కారోగ్యము గలుగ జేయునవి, యోగాభివృద్ధికరములైనవి నగు వస్తువులు గైకొనుచుండిన త్వరలో యోగసిద్ధిని బడయగలరు

136 ఒక రైలు యింజనునందు బాయిలర్ శుద్ధముగా నుండిన, అగ్ని ప్రజ్వలించుటచే ఆవిరి తయారై, దానివలన ఆయంత్రము సరిగ నడుచును

అపుడెంత బరువునైనను అది లాగుకొని పోవుటకు సమర్థమగును అట్లుగాక, ఆ బాయిలరున కొకరంధ్ర ముండినచో స్టీమంతయు పోయి యింజను నడువదు అట్లే దేహమను బాయిలరును జాగ్రత్తగ సంరక్షించుచు ధ్యానశక్తిని ప్రజ్వలింపజేసిననే యచిరకాలములో గమ్యస్థానమగు మోక్ష మును చేరగల్గుదురు మఱియు దేహేంద్రియమనంబుల వృత్తుల నణచి, సర్వ శక్తులను యూర్ధ్వముఖ మొనర్చి లక్ష్యానుసంధానమందున్న యెడల, యోగశక్తి ప్రజ్వరిల్లి మహత్తరస్థితి చేకూరును అట్లుగాక దేహారోగ్యము, అంతఃకరణ శుద్ధి లేనిచో, శక్తి అధోముఖమై యెంత స్వల్పకార్యము నైనను చేయజాలరు

137. దుష్టవృత్తులతో, అనగా దొంగలించిగాని, లంచము తీసికొనిగాని, ఒకరికి అన్యాయము చేసిగాని సంపాదించిన వస్తువులచే తయారుగావింపబడి తేబడిన ఆహారము ఎంత శుద్ధమైనను అది పంది మాంసముతో సమానమే యగును అట్టి హీనాహారము భుజించిన కొలది తపస్సు చెడి బ్రహ్మనిష్ఠ లధోగతు లగుచున్నారు శ్రీ వివేకానందస్వాముల జీవితచరిత్రయందు, ఆతడెట్టి మానవు లేపదార్థము దెచ్చియిచ్చినను భుజించువాడని గలదందురు ఎవరైన దాని గూర్చి ప్రశ్నించిన అగ్నియందు వ్రేల్చిన కట్టెలన్నియు భస్మమగునని వారు ప్రత్యుత్తర మిచ్చినారు వారు నిజముగా అట్టి ధ్యానశక్తి గలవారే దేహేంద్రియాది సముదాయమంతయు తోచనట్టి యేసద్వస్తువునందలి స్థితిగలదో, అట్టిదానిని నొక్కక్షణములో పొందగల్గుటయే గొప్పది అట్టిస్థితి శ్రీవివేకా నందులకు సహజమయ్యెను కాన నతనికది ( ఏయాహారమైన గైగొనుట) సరిపోయెను తక్కినవారు ప్రారంభములోనే అట్లు చేసిన, గారుడ మంత్రము నేర్చుకొననివారు సర్పమును బట్టిన చందమున నుందురు అనగా నపాయమునే పొందుదురు

138 ప్రణవమంత్రార్థమును నిరంతరము స్మరించుచు, ధ్యానాను ష్ఠానములో నుండిన బ్రహ్మనిష్ఠ త్వరితముగా సిద్ధించును ఆతపముననున్న వృక్షము చక్కగా వృద్ధినొందును బాగుగా ఫలించును చాలకాలమువఱకు

ఫలించును అట్లే హెచ్చుకాలము బ్రహ్మనిష్ఠ చేసినచో కల్పాంతమునకుకూడ తరగనట్టి శాశ్వతమైన అమృతత్వము సిద్ధించును ఏ ఆశ్రమమువారైనను, ఏ జాతివారైనను దృఢభక్తితో నద్దాని ననుష్ఠింతురేని తప్పక వారికి అట్టి ఫలితము గలిగియే తీరును పూర్వము ఋషులందఱును అట్లే కష్టించి చాలకాలము ధ్యానానుష్ఠానము సల్పినందువలననే వారికి నిత్యమైన బ్రహ్మత్వము సంప్రాప్తించినదని వారి జీవితచరిత్రలలో వ్రాయబడియుండెను గదా!

139 మౌనముగానుండిన మాత్రమున నేమియు గొప్ప ఫలితము లేదు. మౌనము శీలించు వారందఱును కృతనిశ్చయులై, దృఢనియమము గలిగి, సునిశ్చితవ్రతులై ఏదేని నొకకార్యమును సాధించవలెను

140 ప్రాపంచికజనుల వాక్యముల నాధారముగ గైకొని యెపుడును నుండరాదు. వారు దృశ్యమునే సత్యముఁగ నమ్మువారు దృశ్యములోగల యాసక్తి వారలకు దైవకార్యములో నుండదు

141. జ్ఞాని యొకప్పుడు ఆనందమున తాండవ మాడుచుండును మఱియొకప్పుడు చిరునవ్వు నవ్వుచుండును ఇంకొకప్పుడు సమాధినిష్ఠుడై గంటలకొలది యట్లనే యుండును కొన్నిదివసములుకూడ నొకప్పుడట్లనే యుండును, వేఱొకప్పుడు అవధూతవృత్తిని సంచరించుచుండును ఒకప్పుడు అతిగహనమైన వేదాంతబోధన అత్యద్భుతముగ బోధించుచుం డును ఒకప్పుడు పరమప్రసన్నభావముతో నిశ్చేష్టుడై చిత్రపు బొమ్మవలె కూర్చుండును ఇంకొకప్పుడు నిస్తరంగ సాగరమువలె పరిపూర్ణబ్రహ్మభా వములో నిమగ్నుడై యుండును



# 6వ రోజు 2-4-1940

**142. ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మాన ప్రకాశతే।**
**దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥**

సర్వవ్యాపకుడగు పరమాత్మ కొందఱికి అగుపించుటకును, మఱి కొందఱికి నగుపించకపోవుటకును కారణ మీశ్లోకమున గలదు సర్వజీవులం దున్నను ఆత్మ మందబుద్ధులకు గోచరించుట లేదు సూక్ష్మబుద్ధి గలవారికి మాత్రమే గోచరించును దుర్భిణీయంత్రముతో జూచిన వారికే వాయువు నందును, జలమునందును క్రిములున్నట్లు కనుపించును తక్కినవారి కవి కనుపించవు

143 దుఃఖసముద్రమగు సంసారమున బడి, పాపకార్యముల నాచ రించువా రేయాశ్రమ వాసులైనను సంసారులే ధర్మబుద్ధి గల్గి పుణ్యశీలురై, పవిత్రాచరణతో సత్కార్యములను జరుపువా రేయాశ్రమస్థులైనను సాధువులే, సన్న్యాసులే ఎవడు జ్ఞేయస్వరూపము నెఱుంగ లేదో, మనస్సును స్వాధీనము చేసికొనలేదో, సదా నిర్మలాంతః కరణము గల్గియుండలేదో, పాపకార్యము లలో మగ్నుడై యుండునో, యాతడు తత్పదార్థలక్ష్యమగు పరమాత్మను బొందజాలడు, సదా దుఃఖమయమగు సంసారమునందే తిరుగాడు చుండును 'నేను అంతట నున్నను అందఱికిని గోచరమగుట లేదని భగవానుడు చెప్పెను అనగా నెవరు మాయాబద్ధులై యుందురో వారు భగవత్తత్త్వము నెఱుంగ జాలరనియు, మాయావిరహితులు మాత్రమే ఎఱుంగుదురనియు భావము

144 రాజమహిషి యంతఃపుములోని తెరలోనుండి బయటనున్న జనులందఱిని జూచుచున్నను, బయట నున్నవారు ఆమెను జూడజాలన ట్లును, అంతఃపురములో నున్న పిన్నవయస్సుగల రాజకుమారులు రాజ కొమార్తెలు చూడగల్గునట్లును, భగవంతుడందఱిని జూచుచున్నను అందఱు భగవంతుని జూడగల్గుటలేదు అంతరంగభక్తులు మాత్రమే చూడగల్గుచు

న్నారు. వారు తమ్ము నెఱుంగుచున్నారు భగవంతుని కూడ నెఱుంగు చున్నారు అట్టివారే లోకోద్ధారము చేయుచుందురు

145. సూర్యుడు సర్వత్ర ప్రకాశించుచున్నను స్ఫటికమణియందును, అద్దమునందును, సూర్యకాంత మణియందును స్పష్టముగా ప్రతిబింబించును కాని స్ఫటికమణియందును, అద్దమునందును ఉష్ణత్వము మాత్రముండదు సూర్యకాంతమణియందు అగ్ని ప్రజ్వరిల్లి ఉష్ణత్వము కూడ గలుగును అట్లే వారివారి అంతఃకరణముల శుద్ధాశుద్ధ విశుద్ధత్వముల బట్టి ఆత్మచైతన్యమున్ను జీవులందు వేఱువేఱుగా స్ఫురించుచుండును తమోగుణము నల్లరాతివంటిది. నల్లరాతియందు సూర్యప్రకాశ మేమియు కనుపించదు రజోగుణము మలినదర్పణమువంటిది. అందు కొంచెము ప్రకాశము మాత్రము కనుపించును సత్త్వగుణము శుద్ధదర్పణము వంటిది ప్రతిబింబము స్పష్టముగా గోచరించును గాని ఉష్ణత్వమందు లేదు. అనగానట్టి స్థితిలో ఇంకను జ్ఞానాగ్ని ప్రజ్వలించలేదనియు, అంతఃకరణ దోషము పూర్ణముగ నశింపలేదనియు భావము జ్ఞానాగ్ని ప్రజ్వలించనిచో కర్మకట్టె లన్నియు దహింపబడవు కర్మకట్టెలన్నియు దహింపబడనిచో జన్మ రాహిత్యము గాదు విశుద్ధసత్త్వగుణము సూర్యకాంతమణివంటిది.

**విశుద్ధస త్త్వస్య గుణాః ప్రసాదస్స్వాత్మానుభూతిః పరమా ప్రశాన్తిః।**
**తృప్తిః ప్రహర్షః పరమాత్మనిష్ఠా యయా సదానందరసం సమృచ్ఛతి ॥**

అని విశుద్ధసత్త్వగుణ లక్షణములు శ్రీశంకరులచే వివేకచూడామణియందును పేర్కొనబడినవి అనగా మనఃప్రసన్నత, స్వాత్మానుభూతి, పరమశాంతి, తృప్తి, ప్రహర్షము, పరమాత్మనిష్ఠ – ఇవి గలవారే విశుద్ధసత్త్వ గుణోపేతులు

147. ధ్యానయోగమందు ప్రీతిగలవారు గీత ఆఱవ యధ్యాయమగు ఆత్మసంయమ యోగమును బాగుగ కంఠస్థముచేసి చింతన చేయవలెను అట్లే కర్మయోగమందు ప్రీతిగలవారు గీత మూడవ అధ్యాయమగు కర్మ

యోగమును, భక్తియోగమందు ప్రీతిగలవారు పంద్రెండవ అధ్యాయమగు భక్తి యోగమును, జ్ఞానయోగమం దాసక్తి గల వారు పదునాల్గవ అధ్యాయ మగు గుణ త్రయవిభాగ యోగమునున్ను బాగుగ చింతనచేయవలెను. ఈ కర్మ, యోగ, భక్తి, జ్ఞానములు నాల్గును భగవానునకు చతుర్భుజముల వంటివి

148 ఆత్మనుండి వియోగము గలుగని స్థితి యేది గలదో అదియే యోగముయొక్క అవధి సర్వము భగవత్స్వరూపముగా దోచుటయే భక్తి యొక్క అవధి ఆత్మకన్యముగ అణుమాత్రమైన లేదనునట్టి అద్వైతస్థితియే జ్ఞానమున కవధి అంతఃకరణ శుద్ధత్వమే కర్మము యొక్క అవధి. ఉప్పును నీటిలో వేసిన కఱగి నీరగునటుల భగవంతుని యందు మనస్సు లీనమగు టయే భక్తియోగ తాత్పర్యము

**149. సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత।**
**కుర్యాద్విద్వాంస్తథాఽసక్తశ్చికీర్షుర్లోకసఙ్గ్రహమ్ ॥**

అజ్ఞుడు సక్తుడై ప్రాపంచిక కార్యముల నాచరించు విధముగనే తానసక్తుడై దైవకార్యములను, పుణ్యకార్యములను అచరించుటయే కర్మయోగరహస్యము.

సత్కర్మలను అనగా దేవాలయములు కట్టించుట, ఆశ్రమములు నిర్మించుట. చెరువులు బావులు త్రవ్వించుట, అన్నదానము చేయుట మొదలగు వానిని స్వలాభము కొఱకు గావించుట సత్త్వగుణములో స్వల్పముగ తమోగుణము మిశ్రితమైనట్టి కర్మ పుణ్యకర్మమును కీర్తి కొఱకు, పేరుప్రతిష్ఠలకొఱకు చేయుట రజోగుణమిశ్రిత సత్త్వగుణ కర్మ. ఇతరాపేక్ష యేదియు లేక పుణ్యకర్మ నాచరించుట సత్త్వగుణ కర్మ. అయితే ఆకార్యము జరిగినచో నాతనికి సత్త్వగుణకర్మకు సంతోషము లేనిచో దుఃఖము అట్లయినప్పటికి ఆకర్మ జ్ఞానమునకు సహాయకారియే యగును. విశుద్ధసత్త్వగుణకర్మ నాచరించు వానికి ఆ పని నెరవేరిన సంతోషముగాని, నెరవేరకున్న దుఃఖముగాని యుండదు జ్ఞాని సత్కార్యములను జేయు

మున్నను ఫలమును కోరనందున పరమశాంతిని బొందును అజ్ఞాని ఫలాపేక్ష గలవాడై బద్ధుడగును కనుకనే మహనీ యులెట్టి ఆపత్తులు సంభవించినను ఎన్ని యిక్కట్లు గలిగినను ఆనందముతోనే యుందురు.

151 గాలి వీవనప్పుడు రాళ్లు, ఎండుటాకులు ఒకేవిధమున పడి యుండును గాలి వీచినచో ఎండుటాకు లెగిరిపోవును రాళ్ల స్థిరముగనే యుండును అట్లే ఆపదలు తటస్థించినప్పుడు, అన్నియు అనుకూలముగా నున్నపుడు,పరిస్థితులు తారుమారు గానప్పుడు అందఱును పెద్దలే కాని వికట పరిస్థితు లేర్పడినప్పుడు, విపత్తులు సంప్రాప్తించినపుడు సామాన్య మనుజుడు చంచలత్వము నొంది మనశ్శాంతిని గోల్పోవును కాని ఆత్మ జ్ఞాని, లేక స్థితప్రజ్ఞుడు అచంచలుడై పరిస్థితులకు లోనుగాక, యధారీతి ఆనందమగ్నుడయ్యే యుండును ఇదే వారిరువురకును గల భేదము

152 వల్మీకమున సర్పమున్నచో, నాగస్వరముచే నది బుస్సున పైకి లేచును అట్లే సాధకులు తాము పరిశుద్ధుల మైతిమని తలంతురు కాని, సమయము వచ్చినపుడు, లోన ఏకోశములోనో సూక్ష్మరూపేణ దాగియున్న కోపము, తాపము, అసూయ, అహంకారము మున్నగునవి విజృంభించును అపుడింకను ధ్యాననిష్ఠ, నిగ్రహము, సంయమన శక్తి చాలదని యెంచి మఱింత యెక్కువ సాధన చేయవలెను అట్లు గానిచో వారు పూర్ణవాసనా రాహిత్యము లేనివారై బద్ధులే యగుదురు

**153. కాకః కృష్ణః పికః కృష్ణ కో భేదః పికకాకయోః ।**
**వస న్తకాలే సంప్రాప్తే కాకః కాకః పికః పికః ॥**

కాకి, కోకిల చూచుట కొకేవిధముగ నల్లగా నుండును. కాని వసంత కాలము రాగానే స్వరభేదముచే కాకి యేదియో, కోయిల యేదియో తెలిసి పోవును అట్లే ఆత్మనిష్ఠగలవారు లేనివారు చూచుట కొకేవిధముగనున్నను, జీవితపరీక్ష యేతెంచునపుడు, ప్రకృతి తన ప్రహారమును తీవ్రముగ సాగించునపుడు, సామాన్యులు తలక్రిందై పోవుదురు వారి మనస్స మాధానత యంతరించిపోవును కాని బ్రహ్మజ్ఞులగు మహాత్ములు స్థిర

చిత్తులయ్యే యుందురు

**154. న హ్యసన్న్య స్తసఙ్కల్పో యోగీ భవతి కశ్చన. (5-2)**

ఎవరి హృదయమందు సంకల్పము క్షీణించలేదో వారు యోగులు కారు, సన్న్యాసులు కారు కాన యోగము శీలించువారు తమకెట్టిస్థితి సంభవించినదా యని పరీక్షించుకొనుచుండవలెను

155. దీపము చలించుచున్నచో, ఏకిటికీగుండా, ఏతలుపుద్వారా గాలి వచ్చుచున్నదో చూచి దానిని మూయునట్లు, ఏయింద్రియము ద్వారా విషయవృత్తిలోనికి ప్రవేశించి ఆత్మజ్ఞానమును నశింపజేయుచున్నదో బహు జాగ్రత్తగ పరిశీలంచి దానిని వెంటనే రహిత మొనర్పవలెను

156 ధర్మకార్యములను ప్రపంచములో ననుష్ఠించి చిత్తశుద్ధి నొంది తదుపరి ధ్యానయోగము శీలించిన, బుద్ధి నిశ్చలత గల్గి యే వికల్పమున్ను పొందకయుందురు కొందఱు ఆరూఢులు కార్యరంగమున ప్రవేశించినను ధ్యానమగ్నులయ్యే యుందురు దృష్టాంతముగ, నేడుగాంధీ మహాత్ము డెంతయో లోకోపకారార్థము దేశసేవ జేయుచున్నను అహర్నిశము నెందఱి తోనో మాట్లాడుట, లెటర్లు చూచుట, ప్రత్యుత్తమరము లిచ్చుట, వ్యాస ములు వ్రాయుట యొనర్చుచున్నను నియమము దప్పక ధ్యానమును శీలించు చునే యుండును లోకములో గొప్పగొప్ప బ్రహ్మవేత్తలు మహనీయులు విద్యా శాలలను ప్రతిష్ఠించుట, ఆశ్రమముల నెలకొల్పుట, పత్రికల నడుపుట, ధర్మగ్రంథములను వ్రాయుట, సాధువులకు భోజనాది వసతుల నేర్పఱచుట, బోధనజేయుట మున్నగునవి గావించుచున్నను,సంసారులవలె నుండక ఆయాకార్యములను నిస్సంగముగ నాచరించుచు ధ్యానావస్థిత చేతస్కులయ్యే యుందురు. కాని సామాన్యులకు సర్వవృత్తులు నిగ్రహించుకొని ధ్యానయోగము చేయుటయే మేలు "ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణ ముచ్యతే' అనగా ఆరోహణము చేయువారికి, లేక సాధకులకు ధ్యాననిష్ఠ సోపానమువంటిది కాన స్నాన సంధ్యాద్యనుష్ఠానములు అభ్యాసులకేగాని మాకు కాదని వారనరాదు. భగవద్వాక్యమే మనకు ఆధారముగాని మధ్య

మధ్య కొందఱు వ్రాయు వాక్యములు ప్రమాణములు కావు

157. బ్రహ్మవేత్త వేదవిరుద్ధమగు కర్మను చేయడు సూర్యుని నుండి తమస్సు ఎన్నడును ఉద్భవించదు ప్రకాశమే యుద్భవించును అట్లే బ్రహ్మవేత్త నుండి ప్రకృతి సంబంధగుణములుగాని, అనాత్మ స్వభావములు గాని బయల్వెడలవు. ఆతడెల్లప్పుడు స్వస్వరూపమునందే యుండును కాన తదనుగుణమగు ఆత్మస్వభావమే దైవికలక్షణమే వాని నుండి గల్గుచుండును.

158 మామిడిపండు పండిన తర్వాత అందు తీపియే యుండును గాని చేదు, వగరు, పులుపు మొదలగునవి యుండవు లేతకాయకుగాని, ఎఱ్ఱగా నుండినప్పటికి తెగులుతో రాలిన కాయకుగాని మాధుర్య ముండదు అట్లే అపరిపక్వచిత్తులు, ధ్యానయోగానుష్ఠానము సంపూర్తి చేయనివారు తమకింకను పక్వావస్థ గలుగలేదని తలంచి మఱింత ధ్యానము చేయవలెను, ఆలసింపరాదు తమయందున్న దోషములు తమకు తోచకపోయినను, ఇతరులు తెలిసికొని ధర్మమును బోధించినపుడు వాటిని గ్రహించి యా మాలిన్యమును రహిత మొనర్చుకొనవలెను అటు కాకున్న వారు తమకున్ను, ఒరులకున్ను కూడ అపకారము చేసినవారే యగుదురు

159 కేవలమానంద స్వరూపుడై ముఖమెల్లపుడు వికసించి ప్రకాశవంతముగా నుండువాడే యోగారూఢుడని తెలిసికొనవచ్చును "సర్వసంకల్ప సన్న్యాసీ యోగారూఢస్తదోచ్యతే" - సమస్తసంకల్పములు నశించి ఊర్ధ్వరేతస్కుడై బ్రహ్మనిష్ఠను వదలక యుండువాడే యోగారూఢుడని యెఱుంగవలెను

**160. యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్ ।**
**తత స్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్. ॥**

మనస్సు చంచలమై ఏయే విషయములందు పోవుచుండునో, ఆయా విషయములనుండి లాగిపట్టి ఆత్మయందు వశవఱుపబడునట్టి దానినిగ జేయవలెను. దొంగపశువును పట్టుకొని ముక్కుకు త్రాడుగట్టి కట్టుకొయ్యకు

బలముగ గట్టివేసిన ఎట్లు లొంగునో, అట్లే సత్యమునుండి ధర్మమునుండి తొలగి బహిర్ముఖమైన మనస్సును ఆయా పాపకార్యములలో నుండి బుద్ధియను త్రాటితో బయటకీడ్చి జ్ఞేయమను స్తంభమునకు బలముగ గట్టివైచిన నికదాని మదమణగి పోవును అపుడే తలంపులు నశించును కాని తీవ్రవైరాగ్య ముండవలెను. ఆ కట్టుకొయ్య బలముగ నాటబడనిచో పశువు దానినూడబెరుకుకొని పోవునట్లు జ్ఞేయమునందు మనస్సును సరిగ నెలకొల్పక పోయినచో, లేక ఆత్మనిష్ఠ దృఢముగ లేనిచో, క్రమముగ నధోగతి పాలగును (దేహేంద్రియాద్యంతఃకరణ వృత్తుల కతీతముగానుండి సర్వమును నేది వెలిగింపజేయుచున్నదో అదియే పరమాత్మ, అదియే జ్ఞేయము. బుద్ధి నిశ్చియము గలవాడే అట్టి తన స్వస్థానము నధిష్ఠింపగలడు )

161. అష్టావక్రగీత, ఋభుగీత, బ్రహ్మగీత, శివగీత, పాండవగీత మొదలగు గీతలెన్నియో ప్రపంచమున నుండినను భగవద్గీతయే యెక్కువ ప్రాముఖ్యముతో నున్నది నేటికియ్యది షుమారు అయిదు వందల భాషల లోనికి ననువదింపబడియున్నది శంకరాచార్యులవంటి మేధాసంపత్తి గలవారు కూడ నేను గీతార్థమును సొంతముగ వ్రాయజాలకపోతినని చెప్పియుండ నిక నద్దాని భావగాంభీర్య మేమని చెప్పవచ్చును! గీత గంగా ప్రవాహము వంటిది ఎవరెంత పాత్ర తెచ్చుకొనిన వారికంతే నీరు లభించునట్లు, ఎవరిబుద్ధి యెంత విశాలమై యుండునో అంతే యర్థమును వారు దానినుండి గ్రహింపగల్గుదురు ఇంకను ప్రవాహము మిగిలియే యుండునట్లు దీనియర్థమున్ను మిగిలియే యుండును. కాన గీతయొక్క పూర్ణమైన యర్థమును నేటివఱకెవరును వ్రాయలేదు ఏ గ్రంథమైన చదువునపుడు గ్రంథకర్త యందెంత యధికముగ శ్రద్ధా విశ్వాసము లుండునో అంతంత యధికము దానిభావము బోధపడుచుండును గాన గీతను పఠించునపుడు వినిర్మల హృదయముగల్గి శ్రీకృష్ణపరమాత్మ యందు భక్తిభావముతో చిత్తమును సంలగ్న పఱచియుంచినచో భావము బాగుగ బోధపడును తక్కిన గ్రంథముల వలెగాక గీతయందు పాఠకులకు వారివారి మనఃపరిపక్వతను బట్టి నూతన నూతనములైన యర్థములు బోధపడు

చుండును

162 భూరేఖ చంద్రున కడ్డుపడుటచే దినమునకు రెండుఘడియలు చొప్పున చంద్రప్రకాశము కనుపించకపోవును కాని రానురాను పూర్ణిమ దినమున కాయడ్డు సంపూర్ణముగ తొలగుటచే చంద్రుడు పరిపూర్ణుడై ప్రకాశించునట్లు హృదయాకాశమందు అవిద్య, మాయ, మోహాది వృతు లున్నంతవఱకు ఆత్మప్రకాశము గోచరము కాదు అవి సంపూర్తిగ తొలగినచో జ్ఞానసూర్యుడు నిరావరణముగ ప్రకాశింప, ఆత్మసాక్షాత్కార ముదయ మగును దీనియందింకొక రహస్యముకూడ గలదు. అమావాస్య దినమున కూడ పూర్ణచంద్రుడు లేకపోలేదు ఉండియే యున్నాడు కాని వ్యక్తముగాక యుండును. అట్లే అజ్ఞానదశ యందును ఆత్మ లేకపోలేదు. కాని అవిద్యచే మరుగుపడియున్నది ఆమరుగును తొలగించుటయే జీవుల కర్తవ్యముగాని లేని ఆత్మను సంపాదించుట కాదు.

163. వ్యాపారస్థులు నష్టము వదలి లాభము కొఱకే యెట్లు ప్రయ త్నింతురో అట్టే ముముక్షువులున్ను ఆత్మానాత్మ విచారణజేసి వేద విరుద్ధము లైన కార్యములను త్యజించి ఆత్మభావమునే గ్రహించి సంతుష్టులు కావలెను

164. ★ పదార్థము రుచిగలదైనను, దానిలో విషము కలిసినదని తెలిసిన జనులు దానినుపేక్షింతురు గదా! అట్లే విషయాదులు విష సదృశములని యెఱింగి వానిని త్యజించి అతీతమగు ఆత్మలోనికి మనస్సును ప్రవేశపెట్టి సత్యదయాది ఉత్తమగుణములు గల్గియుండవలెను ఇది మనస్సును నిగ్రహించుటకు మొదటి యుపాయము

దొంగలించుచున్నవారిని మఱి యొకరు చూచుచుండిన నికవారు దొంగిలింపజాలరు. అట్లే ద్రష్టైకన తాను తనకెదురుగా నున్న దృశ్యపదార్థముల మీదికి మనస్సను నాయకుడు పోవు చుండుట బాగుగ గమనించినచో నిక నామనస్సు అటకు బోక నిలిచిపోవును ఎపుడు

★ ఇటనుండి మనస్సును నిగ్రహించుటకు కొన్నియుపాయములు చెప్పబడుచున్నవి

నాయకుడు నిలచునో అపుడు సేవకులగు నింద్రియాదులున్ను నిలచి పోవును. (స్వరూపస్థితినుండి చూచిన మనస్సున్ను ఒక బాహ్యేంద్రియమే యగును) ఇది రెండవ మనోనిగ్రహము ఇది పైదానికంటె హెచ్చైనది

ఇక మూడవది, మనస్సు ఎచటచటికి పోవునో అదంతయు బ్రహ్మమనియే భావించుట సర్వేంద్రియములచే గ్రహింపబడుచున్న సమస్తమును బ్రహ్మమే యని భావించుటచే నిక మనస్సునకు ఆత్మేతర వస్తువునందు బోవుట కవకాశమే లేక తనంతట నదియే నిలిచిపోవును ఇది యింకను అతీతమైన పద్ధతి. ఇది సామాన్యులకు సాధ్యము కాదు జ్ఞేయస్వరూపము నెఱిగినవారికే సాధ్య మగును

నాల్గవది పరమార్థస్థితియందు మనస్సను వస్తువే వేఱొకటి లేదు అగ్నినుండి వెలువడిన మిణుగురు అగ్ని కన్యము గానట్లు ఆత్మనుండి వెలువడిన మనస్సు ఆత్మకన్యము గాదను భావముచేగాని, ఆత్మయందు మనస్సు కేవలము కల్పితముగాన అది మిధ్యయను భావముచేగాని, మనస్సు యొక్క అస్తిత్వమే లేదను దృఢనిశ్చయము గల్గి సదా అమనస్కస్థితి యందుండుట అన్నిటికిని చరమసాధనము ఇది గొప్పది శక్తి **(Will Power)** మనోదార్ఢ్యము గలవారికి మాత్రమే సాధింప నలవియగును

165. శ్రీబుద్ధదేవుడు ఆత్మసాక్షాత్కార స్థితియగు నిర్వాణమును పొందిన పిదప, తాను అనుభూత మొనర్చుకొనిన దానిని గ్రహించునంతటి సామర్థ్యాతిశయము గలవారు లేరని తలంచి ఏమియు బోధింపక యూర కుండ నంత చతుర్ముఖబ్రహ్మ వచ్చి శ్రీ బుద్ధదేవునకు మూడు పర్యాయ ములు ప్రదక్షిణ మొనర్చి, కేల్మోడ్చి, దేవా! తాము లోకమునకు ధర్మ మును బోధింపుడు తెలిసికొనువారు గలరు తామిందుకొఱకే లోకమున నవతరించియున్నారని ప్రార్థింప, నంత బుద్ధదేవుడు మొమ్మొదట నెవరికి బోధింపవలెనని యూహించి దివ్యదృష్టితో పరికించి చూడ, సారనాథ్ అను ప్రదేశమున పూర్వము తాను తపస్సు చేసికొనునపుడు తన్ను వీడి చనిన ఐదుగురు శిష్యులుండిరనియు, వారే యోగ్యులనియు తలంచి వారికే

యుపదేశింప సమకట్టి యచ్చోటికి తానే పయనమాయెను

శ్రీ బుద్ధదేవుడు తపస్సు చేయుకాలమున అతని కైదుగురు శిష్యులుండిరి. ఇట్లుండ బుద్ధదేవుడు క్రమముగ తీవ్రతపం బాచరించిన కొలది, అతని శరీరము శుష్కించి, శైథిల్యము నొంద తుదకు చింతన చెయుటకు కూడ నొకపుడు సామర్థ్యము లేకపోయెను అట్టితఱి నామార్గ మున నొక కళావంతుల మేళము పోవుచుండెను అందు వీణ వాయించువారి వీణా వాద్యముయొక్క తంతి సడలినందున స్వరము సరిగ పలుకకుండెను అపుడు వారి నాయకురాలు, తంతిని బిఱ్ఱుచేయ నాజ్ఞాపించెను అట్లే చేయుగా స్వర మింకను కఠినమై కర్కశరూపము దాల్చెను అపుడు తంతిని మధ్యస్థాన మందుంచమని చెప్ప వారట్లు చేసిరి అపుడు స్వరము సొంపుగ వినవచ్చెను ఇదంతయు ప్రక్కనున్న బుద్ధదేవుడు ఆలకించుచునే యుండెను ఆహా! మనకిపుడు మంచి బోధ లభించినది శరీరము నత్యధికముగ భోగ్యపదార్థ ములచే పోషించుచు వచ్చిన విషయోన్ముఖమై మదించి, ధ్యానమున కుపక రించదు. ఏమియు తినక శుష్కింపజేసినచో, ధ్యానమునకు శక్తి సామర్థ్య ములు లేకుండపోవును కాన మధ్యమార్గ మవలంబింపవలెనని తలంచి నడువ శక్తిలేనందున ప్రక్కనున్న గ్రామమునకు ద్రోర్లుచుపోయి కొంచెము పెరు గన్నము తెచ్చుకొని తినెను అప్పటినుండియు ప్రతిదినము మధ్యాహ్న సమయమున స్వల్పముగ నాహారము గైకొనుట ప్రారంభించెను అదిగాంచి అతని శిష్యులైదుగురును 'ఓహో మన గురువుగారు ఉపవాసము చాలించి తినుట ప్రారంభించినారు ఇక వీరి నిష్ఠ తగ్గినది, సంయమనశక్తి యంతరించి నది. జిహ్వాచాపల్య మంకురించినది ఇట్టివారివద్ద యుండిన తమకేమి లాభ' మని నిశ్చయించుకొని వెంటనే యచ్చోటువీడి సారనాథ్ అను చోటుజేరి ప్రత్యేకముగ సాధనల జేయదొడంగిరి

166 బుద్ధదేవుడు అత్యంత దృఢవ్రతము గలవాడు. తాను తపంబు చేయుకాలమున ఎంత ప్రయత్నించినను పూర్ణసిద్ధి గలుగమి, చాల దుఃఖించి, తుదకు నివ్విధంబున భీషణ ప్రతిజ్ఞ జేసెను

**ఇహాసనే శుష్యతు మేశ రీరం త్వగస్థిమాంసం ప్రలయం చ యాతు ।**
**అప్రాప్య బోధిం బహుకల్పదుర్లభాం నై వాసనాత్కాయమతశ్చలిష్యతే ॥**

ఈ ఆసనమున నాశరీరమున శుష్కించి పోయినను సరే, అస్థిమాంసాదులు శైథిల్యము నొందినను సరే, పూర్ణ సాక్షాత్కారబోధ (నిర్వాణము) గలుగు నంతవఱకు నేనీ యాసనమును వీడను ఓ మాంసాస్థిసమూహమా! మీరు పోయిన పొండు మీయొక్క సాంగత్యము వలన నేనెన్ని జన్మల నుండియో దుఃఖయాతనల ననుభవించుచున్నాను సంసారమున బడి యున్నాను ఇకనైన చాలు!! ఇట్లు గంభీర ప్రతినజేసి, నలుబదియైదు దినములు తపస్సు చేసి తుదకు నిర్వాణమును బడసెను

167 ప్రకృతి కవ్వల నొక పరమశాంతిపదము గలదనియు, అచట చేరిననే జీవుల సర్వదుఃఖములు శమించుననియు శ్రీబుద్ధదేవు డెఱింగి, అద్దాని కొఱకే యత్నించి సిద్ధిని బొందెను ఏ నిరతిశయానందమగు ఆత్మ సుఖముచే సమస్త విషయసుఖములు ప్రకాశింపబడుచున్నవో, అట్టి యానందప పదవినే యాతడు పొందెను అట్టి బ్రహ్మనిర్వాణపదవి తాను స్వయముగ నొందువఱకును నద్దాని నాతడెవ్వరికిని బోధింపలేదు

168. మనోనిగ్రహ మొనర్ప దలంచువారు గాని, ధ్యానమును శీలించువారుగాని ప్రారంభదశయందు నేత్రములు మూసికొనుటయే మంచిది అయితే నేత్రములు తెఱచుకొని చేయు ధ్యానమే గొప్పది కాని అది అందఱికిని మొదట సాధ్యము కాదు అట్లు తెఱచికొనునపుడు దృశ్యస్ఫురణ గలుగనిచో మాత్రమే అది సఫలమగును లేనిచో మూయుటయే శ్రేష్ఠము తెఱచి ధ్యానింప గలశక్తి ఆరూఢులకే లభ్యమగును పులిని బోనులోనుంచి తలుపులు వేయునట్లు కనురెప్పల మూయుటయే ప్రారంభకులకు మంచిది సర్వేశ్వరుడు సర్వేంద్రియములను మనకిచ్చియున్నను, తెఱచుటకు మూయుటకు కిటికీ తలుపులవలె కంటికి ప్రత్యేకముగ రెప్పల నమర్చియున్నాడు భీకరమగు దృశ్యవితతినుండి ఉపరతి నొందుటకే కాబోలు,

అభ్యాసులయెడ కరుణగల్గి దయామయుడగు సర్వేశ్వరుడట్లొనర్చి యున్నాడు !

169. అమావాస్య దృష్టి, పాడ్యమిదృష్టి, పూర్ణిమదృష్టి అని మూడు దృష్టులు గలవు వీనిని గూర్చి మండల బ్రహ్మణోపనిషత్తునందు వివరింప బడినది. అభ్యాసము లేనివారికి నేత్రములు మూసికొనుట యను అమావాస్య దృష్టి ధ్యానకాలమున బాగుగ నుపకరించును కొంత యభ్యాసము గలవారికి సగము చూపుగల్గి భ్రూమధ్యమున దృష్టి నిలుపుట యను పాడ్యమి దృష్టి మంచిది ఆరూఢులు ధ్యానమందు పరిపక్వస్థితి నొందినవారు సామాన్యముగ నేత్రములు తెఱచికొనియే ధ్యానము చేయు దురు అది పూర్ణిమ దృష్టి

170. చతుర్వేదములను, షట్ఛాస్త్రములను అధ్యయనము చేసినను గూడ ప్రణవముయొక్కయథార్థ తత్త్వము బోధపడదు. స్థూలసూక్ష్మ కారణ మహాకారణ శరీరములను చక్కగ విచారించి అనుష్ఠానము చేయుచు తురీ యావస్థ నొందినవారికి మాత్రమే అది బోధపడును. ఓంకార మొకదాని యొక్క అనుభవమే కాదు సమస్త వేదవేదాంతములయొక్క అనుభవమున్ను వారికి సిద్ధించును. దీనిచే విద్య యవసరము లేదని చెప్పుట కాదు కేవల పాండిత్యముచే నది లభించునది కాదనియే యభిప్రాయము

**యథా ఖరశ్చందన భారవాహీ భారస్య వేత్తా న తు చన్దనస్య ।**
**తథైవ శాస్త్రాణి బహూన్యధీత్య సారం న జానన్ ఖరవద్వహేత్సః ॥**

అని ఉత్తరగీతయందు గలదు. అనగా గార్దభము సుగంధపు చెక్కల మోయుచున్నను తత్సుగంధానుభవమెట్లు పొందలేదో, అట్లే అనేక శాస్త్రము లను జదివిన వారైనను అనుభవజ్ఞులు గానిచో పరమార్థము నెఱుంగ జాలరు

171.అశ్వమేధయాగములు నూఱేసి చొప్పున డెబ్బదిసార్లు చేసిన నేఫలము గలదో, యట్టిఫలము అంతఃకరణ శుద్ధిగా ప్రణవము నొక్కమాఱు స్మరించిన మాత్రమున సిద్ధించునని చెప్పబడినది. శిఖిధ్వజుడు సర్వత్యాగ

మొనర్చి తుదకు ఓంకారోపాసన యనబడు సుషుమ్నాంతర ్యనయో గము చేతనే కడతేరెనని వాసిష్ఠము చెప్పుచున్నది ఓంకారార్థము నెఱుంగని వాడు బ్రాహ్మణుడు కాడు ఓంకార మంత్రధ్యానము సర్వదోషములను నశింపజేసి మోక్షమును గలుగజేయును

172 దేహమే ఘటము ఆత్మయే అంతరమునగల జ్యోతి, వైరాగ్య ధ్యానయోగములే ఘటతాడన రూపక్రియ, ఘటాంతర్గతమైయున్న జ్యోతి రూపమగు ఆత్మను దర్శించుట కీవైరాగ్యాదులే పరమోపాయంబులు

173 వైరాగ్యమను ప్రమిద, భక్తియను తైలము, చిత్తైకాగ్రతయను వత్తి, నిర్వాసనాస్థితియను గాలిలేని స్థలము, – ఉన్నచో జ్ఞానమను జ్యోతి నిరాటంకముగా వెలుంగును

174 గుహ్య జిహ్వేంద్రియములు నిగ్రహింపబడ నంతవఱకు బ్రహ్మ రంధ్రము లేక మోక్షద్వారము మూయబడియే యుండును జిహ్వోపస్థల నిగ్రహము గలవారలకే యవి తెఱవబడును



# 7వ రోజు 3-4-1940

**175. ''కామ స్సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతిరధృతిర్హ్రీ ర్ధీ ర్భీరిత్యేతత్సర్వం మన ఏవ.''**

(బృహదారణ్యకోపనిషత్తు)

మనస్సనగా వేఱు ఒక వస్తువేమియు కాదు కామము, సంకల్పము, సంశయము, శ్రద్ధ, అశ్రద్ధ, ధృతి, అధృతి, లజ్జ, భయము మున్నగువాని కూటమియే యగును. మేఘ మనునది అనేక త్ర సరేణువుల సంఘాతమేగాని ప్రత్యేకమగు ఒకవస్తువు కాదు. అట్లే మనస్సున్ను పైజెప్పిన వృత్తుల సముదాయమే యగును శీతవాయువు సోకుటచే మేఘమెట్లు విచ్ఛిన్నమై ద్రవీభూతమగునో అట్లే నిష్కామకర్మ, భక్తి, జ్ఞాన, వైరాగ్యాదులచే మనస్సున్ను

విలయమొందును.

176 ఆత్మశుద్ధి ముఖ్యము దేహశుద్ధి గౌణము కాని రెండును నుండవలసినవే ఒకపాత్రయొక్క బాహ్యాభ్యంతరములు రెండును శుభ్రముగానే యుండవలెను అపుడే అందు వండిన పదార్థము పరిశుభ్రముగా నుండును కాని వెలిశుద్ధికంటె లోశుద్ధి ముఖ్యము

**177. యస్త్వవిజ్ఞానవాన్భవత్యమనస్కస్సదాఽశుచిః।**
**తస్యేంద్రియాణ్యవశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః॥** (కఠోపనిషత్తు)

దుష్టాశ్వములచే రథమునకును సారథికిన్ని హాని యెట్లు కలుగునో, అట్లే అస్వాధీనములైన యింద్రియములచే జీవునకును దుఃఖము కల్గును అపవిత్ర హృదయులకు, మనోమాలిన్య యుతులగు అవివేకులకు ఇంద్రియములు వశపడజాలవు

178 లక్ష్యమున మనస్సును నిలుపక జప, పూజా ధ్యానాదులను చేయ ప్రారంభింపరాదు అట్లు నిలిపిననే ఫలితము చేకూరును. లేకున్న కలుగదు ఇక్కారణముననే మూడుకోట్లు, నాల్గుకోట్లు రామకృష్ణాది నామములు లిఖించి కూడ మా కింకను మనస్సు నిలువలేదే యని జనులడుగుచున్నారు. కాన రామకోటిగాని, శివకోటిగాని, విరల్‌కోటిగాని, ఏకోటి వ్రాసినను లక్ష్యమును బాగుగ నిల్పి వ్రాసిననే యెక్కువఫలమును గలుగజేయును. అంతఃకరణ శుద్ధియు కలుగును

179 రామదాసు శ్రీరాముని స్తుతించుచు పదివేల పద్యములను వ్రాసి, యందు చిత్తైకాగ్రత గల్గి మనస్సును కేవలము శ్రీరామమూర్తి యందు నిలిపి వ్రాసినవి యెన్ని యుండునో చూడదలంచి ఆపద్యములు వ్రాసిన తాటియాకుల నన్నిటిని గోదావరీ ప్రవాహ మధ్యమున బడవైచెను వాటిలో చాల వఱకు కొట్టుకొనిపోయెను కాని కొన్ని మాత్రము ప్రవాహమున కెదురుగ బోయి యొడ్డు చేరెను అవన్నియు చేటి నూఱు పద్యములయ్యెను. అవియే శ్రీదాశరథి శతక రూపమున నేడు ప్రపంచమునకు లభ్యమయ్యెను

180 అట్లే దక్షిణదేశమున కంబరామాయణ మనునొక గ్రంధము గలదు పూర్వము పండితులందఱును పరిశీలించనిదే ఏగ్రంధమును ప్రచార మునకు వచ్చునది కాదు అరవదేశీయులగు పండితులలో నెవరైన నే గ్రంధ మైన వ్రాసిన మధురాపురియందు దానినొక పీఠముపై నుంచి ఇంతకు పూర్వము అంగీకరింపబడిన గ్రంధములను కూడనుంచి పూజించి యొక కోనేటిలో వదలెదరు ఆ గ్రంధము మహత్తు గలది కానిచో తక్కిన గ్రంధములు దానిని నీటిలోనికి త్రోసివైచును కాని కంబరామాయణమను గ్రంధము తక్కిన పూర్వపు గ్రంధములన్నిటిని నీట త్రోసి వైచెను ఇక దాని మహత్తెంతయో! ఇట్లు పరీక్షింపబడిన గ్రంధములుకూడ, ఆదేశములో విద్వత్తు తపశ్శక్తి రెండును గల యొక నారీమణియొక్క అనుమతి పొందిననే ఆ పిదప సర్వులచే నంగీకరింపబడుచుండెడివి అట్లా కంబరామాయణ మునున్ను వారివద్దకు తీసికొని వెళ్ళగా దాని మహత్తెఱుంగుట తన వశము గాదనియు శ్రీ రంగనాధునివద్దకు తీసికొని పొమ్మనియు ఆమె చెప్ప అట్లనే శ్రీరంగనాధుని వద్దకు తీసికొని పోయి దానినంతయు ఆమూలాగ్రముగ భగవత్సన్నిధిని చదివిరి ఏయే శ్లోకములు చదువునపుడు ★ శ్రీ రంగనాధస్వామి శిరఃకంప మొనర్చునో అవియే శ్రేష్ఠములని నిర్ణయించిన అవన్నియు సుమారు 10 వేలుండెను మొత్తము లక్షశ్లోకముల వ్రాసి యుండిరి 90వేలు అనంగీకృతములై తీసివేయబడినవి పదివేల శ్లోకములు మాత్రమే చైతన్యవంతములనియు, తక్కినవి భక్తిభావముతో వ్రాయబడినవి కావనియు అర్థము కాన పూజాధ్యానాదులు చేయువారు గాని, రామకోటి మున్నగునవి వ్రాయువారు గాని ఈవిషయము జ్ఞప్తి యందుంచుకొని తాము వ్రాయువాటిలో నెన్ని చైతన్యవంతములై, భక్తిభావ యుతములై, యున్నవో బాగుగ యోచించు కొనవలెను

---

★ నేటికికూడ దక్షిణదేశమున కంబోత్సవమనునది జరుపబడు చున్నది కాని యిపుడు శ్రీరంగనాధుడు స్వయముగ తలయూపకున్నను అతని ఉత్సవ విగ్రహము మెడక్రింద నొకకీలు పెట్టి దానిచే నూగించుదురు జనుల కాకీలుభాగము కనుపించకుండునట్లు పుష్పములచే దానిని గప్పివైచుదురు

181 కాన భక్తిభావము కుదిరినపుడే నామము లిఖించుట ప్రారంభించ వలెను అట్లనే పూజించునపుడున్ను మనస్సు మూర్తిపై బాగుగ లగ్నమగు నపుడే పూజ నుపక్రమించవలెను అట్లే మంత్రాధిష్ఠానదైవమందు చిత్తము కేంద్రీకృతమై మంత్రార్థము గోచరించునపుడే జపమారంభింపవలెను

182 కొబ్బరి లేతగా నున్నపుడు చిప్పనుండి వేఱుపడదు ముదురు పడి కురుడియైనచో, నీరంతయు నింకిపోవ చిప్పనుండి వేఱుపడును లేతగా నున్నపుడు కొబ్బరి ఎక్కువకాల ముండదు చెడిపోవును కురుడి యైనచో ఎంతకాలమున్నను చెడదు అట్లే సాంఖ్యము కడవఱకు విచారించినను, వృత్తులను జలమింకిపోకున్నచో దేహత్రయమునకు తనకు సంబం ధము (హృదయగ్రంథి) వీడకనే యుండును

183 శ్రీ యేసుక్రీస్తును శత్రువులు కొట్టి, బల్లెములతో పొడిచి, శిలువపై వేసినను, వారలగూర్చి ఆయన 'ఓపరమేశ్వరా! వీరల బ్రోవు' మనియే వేడెను ఆహా! ఎట్టి దయారసము! ఎంతటిహృదయ విశాలత !! బల్లెములతో పొడుచునప్పుడు ఆ పరిశుద్ధాత్ముని దేహమునుండి చిమ్మిన రక్త మాఘా తకుని గ్రుడ్డికంటిలో పడినవెంటనే వానికి కన్ను వచ్చినది! ఓహో! అతని దేహమందలి ప్రతి అణువున్ను మహత్తర శక్తిమంతమై, కరుణారస పూరితమై యలరారుచుండెను గదా !!!

184 గీత రెండవ అధ్యాయమున 55వ శ్లో. నుండి 72-వ శ్లో వఱకు చెప్పబడిన స్థితప్రజ్ఞుని లక్షణములున్ను, పంద్రెండవ అధ్యాయమున 13 వ శ్లో. నుండి 20వ శ్లో వఱకు చెప్పబడిన అద్వేష్ట్రుత్యాది భక్తుని లక్షణములున్ను, పదమూడవ అధ్యాయమున 8-వ శ్లో నుండి 12వ శ్లో వఱకు చెప్పబడిన అమానిత్వాది జ్ఞానలక్షణములున్ను, ఆయధ్యాయమందే 14వ శ్లో నుండి 18-వ శ్లో వఱకు గల జ్ఞేయముయొక్క లక్షణములున్ను, 14-వ అధ్యాయమున 22వ శ్లో. నుండి 25 వ శ్లో వఱకుగల గుణాతీతుని స్థితియున్ను, 16-వ అధ్యాయమున 1-వ శ్లో ॥ నుండి శ్లో ॥ 3-వ వఱకు చెప్పబడిన దైవిక సంపత్తుయొక్క లక్షణములున్ను, 18-వ అధ్యాయమున

గీతాసారమంతయు దెల్పునట్టి 51,52,53 శ్లోకములున్ను ముముక్షువు లందరు తప్పక గ్రహించవలసి యుండును

185 సంకల్పము లాఱువిధములు-1 మృగసంకల్పము, 2 మనుష్య సంకల్పము, 3 దేవసంకల్పము, 4 ఋషిసంకల్పము, 5 ఈశ్వరసంకల్పము, 6 నిస్సంకల్పము వాటి లక్షణము లిట్లుండును-

మృగ సంకల్పము ఆహారనిద్రాభయములు, విషయచింతనలు మాత్రము గలిగి, పశుతుల్యులై, ధర్మమాచరింపక, యితరులకు కీడునే కలిగించు స్వభావము గలవారి సంకల్పము మృగసంకల్ప మనబడును అది తుచ్ఛమైనది వారు చేయు కార్యములు చవిటినేలలో వేయువిత్తనముల వంటివి వ్యర్థమే యగును

రెండవది మనుష్యసంకల్పము! తన సామాన్య ధర్మమును తాను నెరవేర్చుచు ఇతరులను చెరుపకయుండువారి సంకల్పము మనుష్య సంకల్పములో చేరినది.

దీనికంటెను శుద్ధమైనది దేవ సంకల్పము దైవిక సంబంధములగు కార్యముల నొనర్చుచు, కొంత యంతఃకరణ శుద్ధిగల వారియొక్క సంకల్పమే యిది ఇది మనుష్య సంకల్పము కంటె కొంచెము ప్రభావవంతమైనది అట్టివారికి వారి వారి అంతఃకరణశుద్ధిని బట్టి తాము కోరినది, కొంతకొంత ఫలించుచుండును. కాని పూర్ణసంకల్పసిద్ధి యింకను కలుగదు

నాల్గవది ఋషిసంకల్పము ఇది విషయాది వాసనాతీతము ఈస్థితియందు వారి సంకల్పము లన్నియు ఫలించును సర్వజీవకారుణ్యము శాంతి వారలకు ఉండును వారు మమాత్మా సర్వభూతాత్మా యను వాక్యము నెల్లపుడు చరితార్థ మొనర్చుచుందురు

ఐదవది ఈశ్వర సంకల్పము ఇదియే విశుద్ధ సంకల్పమనిగూడ యనంబడును ఇయ్యది త్రిమూర్తుల కుండినదై వారివారి లోకపాలనాది కార్యములను నెరవేర్చుచుండును అట్టివారికి సమస్తము గోచరించు

చుండును

అటువది నిస్సంకల్పము, దృశ్యమేమియు తోపకయుండి ఆత్మాకారమై కేవలము జ్ఞేయస్వరూపమందే యుండువారి స్థితి యది వారిది చక్రవర్తి యాజ్ఞవంటిది దేవతలు త్రిమూర్తులుకూడ వారి యాజ్ఞను శిరసావహింతురు సప్తభూమికల దాటినవారికే యీ పైస్థితి సంభవించును

**186. యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణా మ్ ।**
**తే ద్వన్ద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః ॥ (7–28)**

ధ్యానానుష్ఠానమున మనస్సు లక్ష్యమందింకను నిలుచుట లేదే యని ప్రశ్నింతురు పుణ్యకర్మానుష్ఠానముచే పాపము క్షయించి అంతఃకరణశుద్ధి గలుగని కారణముచేతనే వారట్టి స్థితినొందుచున్నారు కాన పుణ్యకర్మలచే పాపమును రహిత మొనర్చి క్రమముగ నాత్మశుద్ధి బడసిన చిత్తము వికల్ప రహితమై ధ్యేయాకారమున నిల్చును

187 'అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః' (పాతంజలయోగ సూత్రము) మనస్సుయొక్క వృత్తిరూప పరిణామావస్థను లేక వికల్పత్వ మును అభ్యాస వైరాగ్యముల ద్వారా నివారింపవచ్చును దినదినమునకును ధ్యానయోగ మభివృద్ధి పఱచుటయే యిందులకు హేతువు, వృక్షము మొమ్మొదట రెండు ఆకులతో ప్రారంభించినను క్రమేణ పెరుగుచు గొప్ప మ్రానగునట్లు వస్తాదు దినదినమునకును కొంత కొంత బరువు మోయుచు తుదకు నేనుగనుకూడ రొమ్ముపై నిలుపుకొన గలుగునట్లును, ధ్యానయో గమును నిత్యమభివృద్ధి పఱచుచుండిన కొలది చిత్తనిరోధ మేర్పడి ఆత్మాను భూతి యవలీలగ సంపన్నమగును

188 ఒక రాజగృహమున నొక ముసలిది ప్రతిదినము ప్రాతః కాలమున రాజగృహము నెదుట అలికి ముగ్గుపెట్టుచుండెడి అట్లు ముగ్గు పెట్టి వెళ్లుట తడవుగా నా రాజగృహమున నున్న నొక యేనుగుగున్న అచ్చోటికి వచ్చి దానిపై బడి పొర్లి ఆముగ్గంతయు చెరుపుచుండెడిది అపుడా

ముదుసలి వచ్చి దానినెత్తుకొని పోయి దూరముగ విడుచుచుండెడిది ప్రతిరోజా ఇట్లనే జరుగుచుండెను ఇట్లుండ మూడువత్సరములు గడిచెను ఏనుగు పెద్దదాయెను. కాని ప్రతిదిన మెత్తుచుండుటచే ముదుసలికి అది భారమని పించలేదు ఇట్లుండ నొకదినమున రాజా కార్యార్థమై ప్రాతఃకాలముననే లేచి బయటకు పోవు సమయమున ఆ యల్పప్రకాశమున రాజగృహము నెదుట పెద్ద యేనుగు నెత్తుకొని పోవుచున్న యొకరిని చూచి దయ్యమో భూతమో అని తలంచి భయపడి లోనికి పరుగెత్తుకొని పోయెను కిటికీలోనుంచి చూడ ఆమె తమ గృహమందు పనిచేయు ముసలిదియే. అపుడు బయటకు వచ్చి తానెట్లు అంత భారమగు నేనుగును మోయగల్గెనని ప్రశ్నింప అవ్విషయ మంతయు తెలియబఱచెను అభ్యాసమాహాత్మ్య మిట్లుండును గదా యని తలంచి రాజా అచ్చెరు వొందెను

189 ఒక భక్తుడు మితాహారమును నీ క్రిందివిధముగ సాధించెను వానియొద్ద గంధపు చెక్కతో చేయబడిన యొక కొలత పాత్ర యుండెను. దానితో నిత్యము బియ్యమును కొలిచి వండుకొని తినువాడు భుజించుటకు పూర్వము ఆ కొలతపాత్రయొక్క ముఖమును సానపై నరగదీసి గంధమును పెట్టుకొని కొంతసేపు ధ్యానించువాడు మఱల మఱునాడు ఆ పాత్రతోనే బియ్యమును కొలిచి, అంతపరిమాణపు బియ్యమునే వండి తినువాడు ఇట్లు చేయుచు రాగా కొంతకాలమునకు ఆ పాత్ర యరుగుచు వచ్చి చాల చిన్నదై పోయెను కాని యాతడట్లనే దాని కొలత మాత్రమే బియ్యమును వండి తినుచుండెను అభ్యాసముచే ఆతనికి కష్టమనిపించ లేదు క్రమముగ ఆపాత్ర యంతయు అరిగిపోయినపుడు కొన్ని దినము లుపవాసము చేయుటకు కూడ నాతడు శక్తిమంతు డయ్యెను అభ్యాస ప్రాబల్య మివ్విధముననే యుండును

190 పూర్వము విశ్వామిత్రుడు గృహస్థాశ్రమమున నున్నపుడు వసిష్ఠునకు వారికిని కలహము సంప్రాప్తించెను. విశ్వామిత్రుడు శస్త్ర యుద్ధమున గొప్పనేర్పరి కాన వారితో యుద్ధముచేయ నారంభించెను కాని విశ్వామిత్రుని బాణము లన్నియు వసిష్ఠుని యోగదండముచే భస్మీభూతము లయ్యెను

అపుడాతడు

**ధిక్‌బలం క్షత్రియ బలం బ్రహ్మతేజో బలం బలమ్**
**ఏ కేన బ్రహ్మదండేన సర్వాస్త్రాణి హతాని మే ॥**

అని తనక్షాత్రబలమును ధిక్కరించుకొని బ్రహ్మబలమే గొప్పదని తలంచి తపస్సుచేసి యద్దాని నార్జింప నెంచి, తీవ్రతపం బాచరించెను ఆ తపోఽగ్నికి తాళజాలక దేవతలు త్రిమూర్తుల యొద్దకుబోయి మొఱపెట్ట అంత త్రిమూర్తులు వచ్చి నీవు బ్రహ్మర్షివైతి వని వచించినను, ఒప్పుకొనక వసిష్ఠుని ముఖతః యట్టివాక్యము వచ్చిననే తాను తపము చాలించెదనని చెప్పి, తపము నింకను తీవ్రముగ కొనసాగించెను. అపుడు రజస్తమోగుణములు పూర్ణముగ నంతరించి సత్త్వ విశుద్ధ సత్త్వము లుదయింప బ్రహ్మర్షివైతివని వసిష్ఠుడు చెప్పెను అభ్యాసముయొక్క ప్రాభవ మిట్లనే యుండును

పూర్వ మొకపుడు విశ్వామిత్రుడు వసిష్ఠునియెడ ద్వేష భావము గల్గి తన క్షాత్ర ధర్మప్రకారము వానిని దునుమ నిశ్చయించుకొని యొక పున్నమ నాటి రాత్రి ఖడ్గమును చేబూని వశిష్ఠాశ్రమ సమీపమున నొక పొదలో దాగు కొని సమయమునకై వేచియుండెను నాటి యర్ధరాత్రి వసిష్ఠుడెందులకో బయటకు వచ్చి మనోహరముగ నున్న యా చంద్రికను గాంచి ఆహా! విశ్వామిత్రుని తపశ్శక్తిచేత ప్రపంచమంతయు నెట్లు ప్రకాశించుచున్నదో, అట్లే నేడీ చంద్రిక లోకము నంతయు ప్రకాశింపజేయుచున్నది అను నర్థమిచ్చు నొక శ్లోకమును బాడెను అది విని, విశ్వామిత్రుడు వెంటనే లేచి ఖడ్గమును దూరముగ పారవైచి వసిష్ఠుని సమీపి౦చి సాష్టాంగ నమస్కార మాచరించెను అంత వసిష్ఠుడు 'ఇప్పుడు నీ రజోగుణ మంతరించెను. ఇంతదనుక నీవు గర్విష్ఠుడవై అహంభావముతో శిరస్సు పైకెత్తుకొనియే తిరుగుచుంటివి నేటికది వంగినది. నీదు రభిమాన ముడిగినది, ఇపుడు నీవు బ్రహ్మర్షి వైతివి' అని వచించెను ఇట్లు విశ్వామిత్రుని బ్రహ్మర్షిత్వమును గూర్చిన మఱియొక గాథయున్ను కలదు

191 మనుజునకు దేహోత్పత్తికి కారణభూతుడగు జనకుడొక తండ్రి. ఆత్మోదయ మొనర్చు గురువు మరియొక తండ్రి

192 మూడు దేహములు శుద్ధమగుటకుగాను త్రివిధ (శారీరక, వాచిక, మానసిక) తపస్సు లుండియే తీరవలెను ఈ మూడును ఆత్మయను దీపమునకు మూడద్దముల వంటివి మూటిని శుభ్రముగ తుడిచిననే ఆత్మ ప్రకాశము దేదీప్యమానమై వెలుంగును ఒకటి తుడువబడి మఱియొకటి మసిబట్టి యున్నను, ప్రకాశము సరిగా కనుపించదు కాన మనోవాక్కా యములు మూడును శుద్ధముగా నుండవలెను అందులకై గీత 17-వ అధ్యాయమున 14,15,16 శ్లోకములందు చెప్పబడిన మూడు విధములగు తపస్సుల నాచరింపవలసియుండును

193 రాజ్యమునకు రాజు ఒకడే యుండవలెను పెక్కుమంది యున్న వైమనస్యముచే దేశము ఛిన్నాభిన్నమగును అట్లే పరబ్రహ్మ మేకమే గనుక తన్మంత్రమున్ను ఏకాక్షరమే కావలయును కాన సర్వమంత్రములలో ఏకాక్షరరూపమైన ప్రణవమే ఉత్తమమైనది సప్తకోటి మహామంత్రములలో నిదియే యగ్రగణ్యముగ నెంచబడుచున్నది

194. ఓంకార మనగా ఓమ్ అను శబ్దము కాదు దాని శబ్దార్థము గీత 8-వ అధ్యాయమున ఈ ఓంకారమును గూర్చి విస్తారముగా చెప్పబడినది

**యదక్షరం వేదవిదో వద న్తి విశ న్తి యద్యతయో వీతరాగాః ।**
**యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చర న్తి తత్తేపదం సంగ్రహేణ ప్రవక్ష్యే॥**

దేనిని గూర్చియైన వాదించునపుడు సాక్ష్యముండవలెను ఇచట ఓంకారము యొక్క మహిమను దెల్పుటకై భగవానుడు ముప్పురు సాక్షుల నేర్పఱచియున్నాడు వేదము నంతమువఱకు చదివిన మహనీయు లెద్దానిని వేదసారముగ వచించుచున్నారో, వీతరాగులగు తప స్సంపన్నులే యమల పదమును బొందుచున్నారో, ఏయకురింతపదవి నిచ్ఛగించి బ్రహ్మచర్య వ్రతము సల్పబడుచున్నదో అట్టి భవ్యపదమే యీ ఓంకారము ఇట్లు

ప్రణవమంత్ర ప్రాశస్త్య ను జూపుటకై వేదజ్ఞ, వీతరాగ, బ్రహ్మచారులను ముువ్వురను భగవానుడు సాక్షులుగ నెన్నుకొనెను. మఱియు,

**ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ ।**
**యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్॥**

ఎవడు సర్వేంద్రియములను నిగ్రహించి మూర్ధమందు లక్ష్యముంచి ఓమ్ అను ఏకాక్షరమును స్మరించుచు ప్రాణము విడుచుచున్నాడో, అతడు నన్నే పొందునని పరమాత్మ యానతిచ్చెను. కాన ఈ మంత్రమే గీతయొక్క ప్రాణమని యెఱుగుడు. ఇయ్యనుష్ఠానమునకు గృహస్థ, వానప్రస్థ, స్త్రీపురుషాది భేదమేమియును లేదు సర్వ మానవులును ఈ ప్రణవమంత్రోపాసనను జేసిన ధన్యులు కాగలరు.

195 రోగము గలవారికే వైద్యులును వైద్యశాలలును నేర్పఱుపబడినవి అట్లే భవరోగపీడితులకొఱకే, అజ్ఞానులకొఱకే, తాపత్రయాగ్ని బాధితులకొఱకే వేదములను, శాస్త్రములను, బ్రహ్మవేత్తలను, ఆశ్రమములను ఈశ్వరు డేర్పరచెను.

196. మొట్టమొదట ధర్మమున్ను, తదుపరి భక్తి, దైవారాధన సత్కర్మలను, పిదప వైరాగ్యమును, పిమ్మట జ్ఞానమున్ను, ఆపిదప అతీతమార్గావబోధకమగు విజ్ఞానమున్ను జనులకు బోధింపవలయును

197 కలరావ్యాధి గలవారిని సమీపించువారి కావ్యాధి యంటుకొనునట్లు బుద్ధిహీనులకు ధర్మమును బోధించుటకు వెడలినచో, వారి దోషము లాసజ్జనుల కంటుకొనునని కొందఱందురు అయితే కలరా వచ్చినచో గవర్నమెంటు వారు తన్నివారణార్థమై కొన్ని ద్రావకములను మందులను తయారు చేతురు మఱియు నావ్యాధి సోకకుండుటకై కొన్ని పరికరములను కూడ నిర్మింతురు. అవి గలవారికిక నావ్యాధి సోకదు. వారు నిర్భయముగ ఆరోగుల చెంతకేగి వ్యాధి నివారణ మొనర్పవచ్చును అట్లే బ్రహ్మనిష్ఠుడు పాపులవద్దకు నిర్భయముగ పోయి, ధర్మోపదేశముల జేయుచుండును. వారి

యా బోధామృత మజ్ఞానుల భేదములనెల్ల తృటిలో సంహరించివేయును

కాని సామాన్యులట కేగిన వ్యాధి సంక్రమించునట్లు, తాను ముందు శుద్ధుడుగాక, జ్ఞానార్జనము చేయక, యితరుల యాత్మోన్నతికై ప్రయత్నింప జూచువాడు తప్పక పతితుడగును మల్లెపుష్పముల వాసన హెచ్చుగ నుండిననే ఉల్లివాసనను అణగద్రొక్కగలదు లేనిచో ఉల్లివాసనయే విజృంభించును కట్టెలెన్ని యున్నను అగ్నిలో దహించి భస్మమగురీతి, బ్రహ్మ నిష్ఠలు తమసన్నిధినున్న యజ్ఞానుల పాపగుణము లన్నిటిని నశింపజేసి, సర్వధర్మములను వారికి బోధించి కృతార్థులుగ నొనర్పగలరు కాన సన్న్యాసు లగువారు గృహస్థుల యిండ్లలో భిక్షలగైకొని వారి భ్రాంతి లోజిక్కి తాము పతితులై వారలంగూడ భ్రష్టుల జేయక, తాము నిగ్రహపరులై, వారలకుకూడ నిగ్రహము నేర్పునట్లుగ నుండవలెను లేనిచో సన్న్యాసి వంశమునకే అపకీర్తి వచ్చును లోకులున్ను వారలను నిందించెదరు ప్రస్తుతము సన్న్యాసులలో పెక్కురు గృహస్థుల యిండ్లలో బడి యిట్లనే అధర్మముల పాలగుచున్నారు ఇదంతయు విరక్తులని తలంచువారి యొక్కయు, సన్న్యాసులయొక్కయు లోపమేగాన అట్టి వారు గృహస్థుల యిండ్లలో కడుజాగ్రత్తగ ఆహారము గైకొనవలెను

198 శ్రీ బుద్ధదేవుడు రాజవైభవము లన్నియు అనుభవించుచు, సుఖముగ కాలము గడుపుచున్న తఱి నొకరోజురాత్రి అతనికొక యాకాశవాణి యిట్లు వినవచ్చెను – ఓ బుద్ధుడా సర్వప్రాణికోట్ల నుద్ధరించు టకై యవతరించిన మహాపురుషుడవగు నీవీ చందమున వ్యర్థముగ కాలయాపన చేయు చుంటివా? ఇకనైన లోకోద్ధరణ మొనర్చెదవా, లేక పశుప్రాయుడవై విషయ భోగమగ్నుడవై పడియుండెదవా? యని ప్రశ్నింప నావాక్యములను విని యాతడు మహలునుండి బయటకువచ్చి, తన కర్తవ్యమును గుర్తెఱింగి, సర్వసంగ పరిత్యాగియై ఆఱు వత్సరము లఖండ తపంబొనర్చి, యా పిదప లోకోద్ధరణము గావించెను



# 8వ రోజు 4-4-1940

## 199. తిలేషు తైలం దధినీవ సర్పిరాపస్స్రోతస్స్వరణీషు చాగ్నిః। ఏవమాత్మని గృహ్యతేఽసౌ సత్యేనైనం తపసా యోఽనుపశ్యతి.॥

నువ్వులయందు నూనెయు, పెరుగునందు వెన్నయు, భూమియందు జలమును, కట్టెయందు నిప్పును ఎట్లు నిగూఢములై యున్నవో అట్లే ఆత్మయు దేహేంద్రియాదులందు నిగూఢముగ నున్నది కాని నువ్వులను గానుగాడించిననే నూనెయు, పెరుగును తఱచిననే నెయ్యియ్యు, భూమిని త్రవ్వినసే జలమున్ను, అరణిని మధించిననే నిప్పున్ను బయల్వెడలునట్లు, ఆత్మానాత్మవి చారణచేతను, ఈశ్వరధ్యానముచేతను, సత్య తపోనిష్ఠల చేతను మాత్రమే ఆత్మ ప్రత్యక్షము కాగల్గును

200 ఒకనికి నలుగురు కుమారులు గలరు అంత్యకాలమున నాతడు తన కుమారు లందఱిని బిలిచి, ఒక్కొక్కనికి ఒక్కొక్కపుల్ల యిచ్చి విరువుడని చెప్ప అందఱును తమ తమ పుల్లలను విరచివేసిరి. మఱల కొన్ని పుల్లలను కలిపి ఒక్కొక్కరికిచ్చి విరువుడనిచెప్ప, ఎవరును విరువజాలక పోయిరి అపుడు తండ్రి–నాయనలారా! ఒక్కొక్క పుల్లయు విడిగా నున్నచో త్రుంచివేయ బడినట్లు మీరందఱును వేఱువేఱు భావములు గలిగి, భిన్నభిన్నముగా నున్నచో, మిమ్ముల నెవ్వరైనను చులకనగా నోడింతురు. అట్లుగాక అందఱును ఏకీభవించియున్నచో ఎట్టివారైనను మిమ్ముల నెదుర్కొనజాలరని యుపదేశించెను అందఱును ఒకే లక్ష్యమందు మనస్సు నిలిపి ధ్యానముచేసిన, లేక ధ్యానకాలమున ఒకే శబ్దముతో నుచ్చరించిన, ఆ శుద్ధాణువులన్నియు ఏకాకారమై ఒకవిధమైన మహత్తరశక్తి నుద్భవింప జేయును కాన ఒక సంఘములోగాని, సమాజములోగాని నున్నవారు ప్రార్థనాదికాలములందు ఒకేచోట సమావేశమై ఆయాకార్యములను నెరవేర్చి నచో, ఇతరులవలన ఏయాటంకములున్ను కలుగవు. భూతప్రేత పిశాచాదు లున్ను బాధింపవు

201. ఇంజనునందు మొదట చిన్నచిన్న బొగ్గులువేసి మండించి తదుపరి పెద్దపెద్దవి వేయుచునుండ స్టీమ్ వృద్ధియై ఎంత బరువునైన నది యీడ్చుకొని పోగల్గును అట్లే క్రమముగ ధ్యానమభివృద్ధి పరచుచు రాగా రాగా నిరంతర ఆత్మచింతనాదులచే నొక గొప్పశక్తి తనయందు ఉద్భవింప, నపుడు జీవుడు లోకోద్ధరణము చేయ సమర్థుడగును శ్రీయేసుక్రీస్తు, శ్రీ బుద్ధదేవుడు, శ్రీమహమ్మదు నబి, శ్రీగాంధీమహాత్ముడు మున్నగు వారంద ఱును బాల్యమున సామాన్య మనుజులుగానే యుండిరి కాని బ్రహ్మచర్యము, సత్యము, ఈశ్వరచింతన మొదలగు వానిచే గొప్పశక్తిమంతులై లోకమును నడుపజాలిరి మహాపురుషులందఱు నిట్లు సత్యధర్మానురక్తులయ్యే అమోఘశక్తి నార్జింపగల్గిరి మీ హృదయమున జ్ఞానాగ్ని యొకప్రక్క, దైవ చింతన మఱియొక ప్రక్క గలిగి, రెంటిని ప్రజ్వలింపజేసినచో మీరున్ను గొప్ప శక్తిగలవారై లోకోద్ధరణ మొనర్పగల్గుదురు కాని వైరాగ్యము, బ్రహ్మచర్యము తప్పక యుండవలెను లేనిచో నింజను రంధ్రము పడినదైనట్లు శరీరము వ్యాధుల పాలగును అపుడు చైతన్యమను స్టీమ్ అందు తయారు గాకయే యుండును.

202 అంత్యకాలమున నెవరు ఓంకారమును స్మరించుచు, పరబ్ర హ్మమునందు మనస్సు నిలుపుదురో వా రాపరబ్రహ్మమునే పొందుదురని చెప్పబడియుండ నిక ఆజీవితము భగవచ్చింతన యేల చేయవలెనని కొందఱ డుగుదురు ఇది, ఒక విద్యార్థిని గూర్చి సంవత్సరాంతపు పరీక్షకై పాఠశాల కేగి సమాధానము వ్రాసిన చాలుగదా, రోజున్ను చదువుట, పాఠశాలకేగుట యేల? ఎందుల కీశ్రమ యని అడుగుటవంటిది సంవత్సరమంతయు చదివిన గదా, పరీక్షా సమయమున కది జ్ఞప్తికి వచ్చును అట్లే ఆజీవితము భగవచ్చింతన, స్మరణ, ధ్యానము చేయుచున్ననే మరణకాలమున దైవస్మృతి గల్గునుగాని లేకున్న గలుగదు పాఠశాలలో ఈ సంవత్సరము తప్పిపోయిన విషయములందు మరుసంవత్సరమెట్లు పరీక్ష యివ్వవలెనో, అట్లే ఈ జన్మయాందారూఢుడుగాక, యోగభ్రష్టుడైనచో, 'యతతే చ తతో భూయః

సంసిద్ధౌ కురునన్దన' యన్నట్లు మఱుజన్మలో నచ్చటినుండి మఱల ప్రారంభించి, అనుష్ఠానము సల్పుచు క్రమముగ నారూఢత్వము నొందవలసియుండును

203 సముద్రముపై ప్రయాణముచేయు నావికులవద్ద కంపాసు అను యంత్రమొకటి యుండును దాని సాయమున వారు పడవలను నడుపు చుందురు. అది ఎల్లప్పుడు ఉత్తరపుదిక్కునే చూపును ఎట్లు త్రిప్పినను తుదకచ్చో టికే పోయి నిలుచును సముద్రమధ్యమున గొప్ప తుపాను వచ్చి, పెనుగాలి వీచి దిక్కు తెలియకున్న పరిస్థితియందుకూడ నావికులు ఆయంత్రసహాయముచే తమ గమనదిశను సులభముగ నిశ్చయించు కొందురు అట్లే ప్రపం చమను సముద్రమున జీవుడను యోడ గమ్యస్థాన మును జేరవలసియున్న మనస్సను చుక్కానిని నెల్లప్పుడును ఆత్మోన్ముఖము గనే యుంచవలెను ఎట్టి పుణ్యకార్యములు, ధర్మకార్యము లాచరించు చున్నను చిత్తము లక్ష్యమగు పరమాత్మయందు కేంద్రీభూతమై యున్నచో నచిరకాలములోనే ఆపర మాత్మరూప గమ్యస్థానమును జీవుడు చేరగల్గును

204 కవాతు మున్నగునవి బాగుగ నభ్యసించిన వాడే రణరంగమున ధీరుడై నిలుచునట్లు దినదినము యోగ మభ్యసించువాడే తుదకు యోగాభ్యాసమున కుశలుడై ప్రకృతి సంగ్రామమున విజేతయగును మఱియు విద్యార్థి పుస్తకముల నింటియందుంచి, సోమరియై పరీక్షరోజున మాత్రము చదివిన నుత్తీర్ణుడు కానట్లు, నిత్యము ధ్యానాద్యనుష్ఠానములు గావింపకున్నచో జీవుడు పరమావధిని జెందనేరదు

**205. వేదేషు యజ్ఞేషు తపస్సు చై వ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్।**
**అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీ పరం స్థానము పైతి చాద్యమ్ ॥**

ధ్యానయోగమహిమ యీ శ్లోకముచే వెల్లడియగుచున్నది బీదలగు భక్తులను కరుణించి భగవంతు డీశ్లోకమును చెప్పియున్నాడు ఏలయన, కొందఱు నిర్ధనులును చదువులేనివారునగు భక్తులు అయ్యో! మాకు దాన ధర్మములు చేయుటకుగాని, యజ్ఞాదు లాచరించుటకుగాని ధనములేదే,

శాస్త్రము చదువుటకు విద్య లేదే యని చింతించుదురేమో యని తలంచి కరుణామూర్తియగు పరమేశ్వరుడిట్లు చెప్పెను – వేదాధ్యయనములచేగాని, యజ్ఞాది క్రతువులచేగాని, కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సులచేగాని గోదాన, భూదానములచేత గాని ఏఫలము లభించునో, దానికంటె నధికమగు ఫలము ధ్యాన యోగముచే మనుజునకు లభించును దీనిచే విద్య, ధనము నిరుపయోగములని కాదు, ధనముండిన సత్కర్మలకు వినియోగపడును. విద్యయున్న శాస్త్రార్థ మెఱుంగుటకు సహాయపడును

**206. స తు దీర్ఘకాల నైర న్తర్య సత్కారాసేవితో దృఢభూమిః ।**

**(పతంజలి యోగసూత్రము.)**

అభ్యాస, వైరాగ్య, బ్రహ్మచర్యాదులను విడువక చాలకాలము ఆద రముతో ననుష్ఠించిననేగాని చిత్తనైర్మల్యము, ఏకాగ్రత సిద్ధించి ఆత్మాను భూతి దృఢపడదని దీని భావము

207 ఇహపర భోగేచ్ఛా రాహిత్యమే వైరాగ్యము విషయాదివృత్తులను వదలినవాడే విరాగి (వైరాగి); తనలోని త్రిగుణసంబంధ వృత్తుల నెఱింగి వాటిని నిగ్రహింమవాడే గుణవిరాగి

208 పంచదశిలో నాల్గువిధములగు ఆనందములు చెప్పబడెను (1) అవిద్యానందము, (2) విద్యానందము, (3) యోగానందము, (4) జ్ఞానా నందము, స్థూలదేహ సంబంధములైన వాసనలవలనను, దేహేంద్రియ విషయ సంపర్కమువలనను గల్గునానందము అవిద్యానంద మనబడును బాహ్య విద్యల వలన గల్గునానందను విద్యానందము యోగధ్యానాదులచేతను, ప్రణ వానుసంధానముచేతను గల్గునానందము యోగానందము అపుడు విజ్ఞా నమయ కోశము బాగుగ వికసించును తన్మయత్వ మొందినపుడుగానీ, ఆవే శమునగాని కొన్ని తత్త్వములు, పద్యములు జనులు వ్రాయుచుందురు కాని అదియున్ను అంతరమున బాహ్యానందమే యగును అది అపూర్ణస్థితియే కాన దానిచే భ్రమనొందగూడదు నాదానందముకూడ బాహ్యమేగాన దాని

చేగూడ భ్రమయగూడదు అపూర్ణస్థితియందే బహిర్ముఖుడై బోధలను ప్రారంభించినచో, అభిమానము గలవాడై, క్రమముగ ధ్యానానుష్ఠానములు సన్నగిల, పతితుడైపోవును ఈ యనుభవము అనుష్ఠానము గలవారికే గోచరమగును కొండనెక్కువాడు నెత్తము జేరక యేమాత్రము కొంచెము క్రింద నున్నప్పటికి కాలుజారినచో అమాంతముగ క్రిందపడిపోవును కాన పూర్ణస్థితి నొందువఱకు మధ్య యెచ్చటను ఆగకూడదు. ఆత్మానందమే జ్ఞానానందము, సాక్షాత్కార జ్ఞానము కలుగునపుడు జనించు నిరతి శయానందమే యది

209. మహమ్మదునబి హీరాయను పర్వతముపై నొక గుహయందు చాలకాలము తపస్సుచేసెను తపస్సు పరిపక్వము కాగా నొక దైవశక్తి తనలో ప్రవేశించినట్లును, లెమ్ము, లోకోద్ధారణ చేయుమని యుద్బోధించినట్లును, అపుడు తాము బోధింపవలసిన దంతయు తనయందావేశ మైనట్లును, తదు పరి యాతడు లోకమున ధర్మబోధకై బయల్వెడలినట్లును చరిత్రగలదు



## 9-వ రోజు. 5-4-1940

210 'హ్రస్వో దహతి పాపాని దీర్ఘో మోక్షప్రదాయకః'- ఓంకార ము ను హ్రస్వముగ నుచ్చరించినయెడల పాపములను దహింపజేయును. దీర్ఘముగ నుచ్చరించిన మోక్షమును గల్గజేయును కాన నుచ్చరించునపుడు దీర్ఘముగానే యుచ్చరించుట మంచిది అపుడే స్థూలమును సూక్ష్మమందును, సూక్ష్మమును కారణమందును, కారణమును మహాకారణమందును, మహా కారణమును అవ్యక్తమందును అవ్యక్తమును పరమాత్మయందును విలీన పఱచి ఇవ్విధమున ప్రణవార్థమును చింతనజేయుటకు అవకాశము లభించును

211 దుఃఖము కనుగొనుట, దాని యుత్పత్తి నెఱుగుట, దాని

నివారణమునకు యత్నించుట, అట్టి నివారణోపాయమును సర్వజనుల కెఱింగించుట – ఈ నాల్గింటిని శ్రీబుద్ధదేవుడు బోధించెను

212 కొందఱు– ఆత్మకు స్థానమెక్కడ నని అడుగుదురు మీకు నెక్కడ శాంతి కలుగునో అదే ఆత్మస్థానము దానినే బ్రహ్మరంధ్రమనియు, సుషుమ్న యనియు, మేరుస్థానమనియు, హృదయకుహరమనియు, భ్రూమధ్యమనియు వివిధములుగా చెప్పుచుందురు. అవన్నియు యోగ శాస్త్రములందు అభ్యాసులకొఱకేర్పడినవే యగును ఆత్మ ఒక వస్తువైననే గదా యిచటగాని అచటగాని ఉండునని చెప్పుటకు లేక, అదియొక్క మాత్రవంటిదా! హృదయములోగాని, మఱెచటనైనగాని దాచిపెట్టుటకు? సర్వచరాచరములందును వ్యాపించి పరిపూర్ణమై తన కన్యముగ నెద్దియును లేకయుండునట్టి ఆత్మకు ఒక స్థానమెచట? మఱియు ఏవస్తువెచట నుంచబడునో, అది యావస్తువు కంటెను పెద్దయై యుండవలెను అట్లు కాకున్న అది దానిలో నిముడజాలదు అంటే ఆత్మ నొకస్థాన మందుంచ వలెనన్న అది ఆత్మకంటె నతీతమై యుండవలెను ఆత్మయే అన్నిటికి నతీతమై యుండనిక దాని కతీతమై యేది యుండ గలదు? కాన పైన వివరించిన వన్నియు అభ్యాసులకొఱకు కల్పింపబడినవే యని యెఱుంగవలెను

213. ఎట్లన, ఒక పెద్ద మైదానము గలదు గవర్నమెంటు వారు దానినింకను పంచి పెట్టలేదు ఈ లోపుగానే జనులు వారివారికి తగినట్లు కొన్ని హద్దులేర్పరచుకొని ఇది మాది, ఇది మాది యనుకొనుచుండిరి కాని మఱల దానినంతయు గవర్నమెంటు వారు స్వాధీనపఱచుకొని హద్దులూడ బెఱుక, ఒకే మైదానముగానే యుండెను అట్లే అనంతవస్తువును, జనులు వారివారి సౌకర్యార్థము సొంతముగా భావించి యుపాసించు చుందురు చిత్తము పరిపక్వమైన కొలది అవన్నియు కల్పనలే యని వారికి గోచరించును

214 గీతను పఠించుట యనగా శ్లోకములను వల్లించుట మాత్రము కాదు శ్లోకార్థమును అనుష్ఠానమందుంచుటయు నగును అట్టిచో దాని

యందొక్కొక శ్లోకమైనను చాలును ఎంతయో ఫలము చేకూరును దీనిని గూర్చిన యొక కథ గలదు గీత 18-వ అధ్యాయమున గీతాసారము నంతయు దెల్పునట్టి మూడు శ్లోకము (51,52,53,)లు గలవు అందు మధ్య శ్లోకము (52) ఇంకను ముఖ్యతరమైనది అదేదన,

**వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।**
**ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః॥ (18-52)**

అనగా, నిర్మలమైన యేకాంత ప్రదేశమున, మితాహారియై, మనోవాక్కాయముల సంయమన మొనర్చి, వైరాగ్యమును లెస్సగ నాశ్ర యించి, నిత్యము ధ్యానయోగపరుడై యుండువాడు బ్రహ్మత్వరూపమగు మోక్షము నొందగలడని యర్థము ఈగీతా శ్లోకమును పండ్రెండు సంవత్సర ములు మననము చేసినచో దానియర్థము బాగుగ తెలియగలదని యొక బ్రహ్మచారియగు బ్రాహ్మణున కొకరు చెప్పిరి అతడట్లనే యొక నదీతరమున గూర్చుండి యాశ్లోకార్థమును బాగుగ మననము చేయుచు ధ్యానించు చుండెను అప్పటికిని ఆఱుసంవత్సరములు గడచెను ప్రతిదిన మనేక పండితులు, విద్యావంతు లాత్రోవబోవుచు వానిని జూచి, సోమరియై పడియు న్నాడని తలంచిపోయి, విద్య నేర్చుకొనరాదా, సంస్కృతము చదువు కొనరాదా, వేద మభ్యసించరాదా, భగవద్గీత చదువరాదా, సోమరియై వ్యర్థముగ కాలము గడుపుచు బ్రాహ్మణవంశమున కప్రతిష్ఠ తెచ్చుచుంటివా యని వివిధ రీతుల చెప్పిరి కాని యాతడేమియు ప్రత్యుత్తర మొసంగలేదు

మఱునాడింకను బెదిరించి పల్కిరి, అపుడును మాఱుబల్కలేదు మూడవనాడు ప్రహారమున కియ్యకొనిరి అప్పుడు తన మౌనమును విరమించి యా బ్రాహ్మణుడిట్లనియె "మిత్రులారా! నేను శాస్త్రములను, ఉపనిషత్తులను చదువలేదనుకొంటిరి అన్నిటిని చదివితిని. గీతను చదవలేదని మీరు తలంచుచున్నారు చదువుచునే యున్నాను. కాని ఆఱు సంవత్సరముల నుండి చదువుచున్నను అందలి యొక్కశ్లోకమైనను ఇంకను పూర్తికాలే" దని వచింప నంత నాపండితోత్తము లందఱును, "ఓహో! ఇదియా నీవైదుషి!

నీప్రజ్ఞ నీకంటె చిన్న వాటెందరో మా పాఠశాల యందు రోజానకు పది, పదిహేను శ్లోకములను ఒక్క పెట్టున వల్లించివేయుదురే, ఇంతకాలమునుండి అర్ధశ్లోకమునైనను చదవలేకపోతివా?'' అని ప్రశ్నింప నంతనాతడు కడు శాంతముగ నిట్లు ప్రత్యుత్తర మిచ్చెను – ''నాయనలారా! నేను చదువుచున్న శ్లోకమిది–(వివిక్తసేవీ .సముపాశ్రితః, వివిక్తసేవీ– ఆసక్తి లేని అనగా ప్రతి బంధకములేని యేకాంతస్థలము నాశ్రయించి – అని అర్థము, నాకీ యాఱు సంవత్సరములకు స్థూలమగు నేకాంతమే లభించినదిగాని, సూక్ష్మమగు నేకాంతము (సంకల్పరహితానష్ఠ) లభించలేదు, లఘ్వాశీ! లఘువుగ నాహారము గైకొనుచు– అట్లనే లఘ్వాహారము స్థూలశరీరమునకు లభించినది గాని ఆత్మకు శాంతి దొఱకలేదు, యతవాక్కాయ మానసః – మనో వాక్కాయముల నిగ్రహించి– నామనస్సు పూర్ణముగ నిగ్రహింపబడ నందుననే బహిర్ముఖమై మీరనుచున్న దానిని సహింపక ప్రత్యుత్తరమీయ సమకట్టినది మౌనమును భంగమొనర్చుటచే వాక్నిగ్రహమింకను పూర్తిగ గలుగలేదని సిద్ధించుచున్నది. అట్లనే కాయ నిగ్రహమున్ను ధ్యానయోగపరో నిత్యం– నేనును నిరంతర ధ్యానశీలుడనై యున్నచో మీతో సంభాషింప కుండియే యుందురు కాన నదియు సగమే సిద్ధించినది వైరాగ్యం సముపా శ్రితః – వైరాగ్యము లెస్సగనుండి యున్నచో నేను మీకు సమాధానము చెప్పవలసిన యగత్యమే లేకపోయెడిది కాన నేనింకను ఆఱుసంవత్సరములు వాటి నభ్యసించిననే గాని బోధింపజా''నని చెప్ప నాపండితులందఱు విస్మయా విష్టచేతస్కులై, యథార్థపరనమన నేమియో గ్రహించి, తాము గావించిన యపరాధమును క్షమింప వేడుకొనిరి కాన గీతాది గ్రంథములను పఠించువారందఱున్ను తదర్థమును బాగుగ మననముచేసి యాచరణ యందుంచిననే పూర్ణఫలమును బొందగలరని నిశ్చయించుకొనవలెను

215 ఆత్మయొక్క స్థానమును గూర్చి శ్రీశంకరాచార్యులవారొక శ్లోకము చెప్పిరి అది చాలముఖ్యమైనది అదేదన–

**జాగ్రత్యుద్భూత బాహ్యేన్ద్రియ విషయ సముల్లాస సాక్షీ శివోఽహం।**

**స్వప్నే దృష్టప్రపంచప్రతిఫలనమనోవృత్తి సాక్షీ శివోఽహమ్ ।**
**సుప్తే చిత్తే ప్రలీనే ప్రబలతమమహామోహ సాక్షీ శివోఽహమ్।**
**నిత్యానందే తురీయే విగత కలిమలస్పర్శసాక్షీ శివోఽహమ్ ।**

జాగ్రదవస్థయందు దృశ్యప్రపంచ మెచటనుండి యెఱుంగబడు చున్నదో అదియే ఆత్మస్థానము అట్లే స్వప్నావస్థయందు సూక్ష్మరూపములైన సమస్తస్వప్నవృత్తాంతము లెచటనుండి యెఱుంగబడుచున్నవో అదియే ఆత్మ స్థానము. జాగ్రదవస్థయొక్క ప్రతిబింబితస్థలమే స్వప్నమని చెప్పబడినది ముఖమద్దమునందు ప్రతిబింబించురీతి జాగ్రత్తునందు తాననుభవించిన దృశ్యవిషయము లన్నియు సంస్కారరూపేణ సూక్ష్మముగ దాగియుండి స్వప్నమందంతఃకరణమున ప్రతిఫలించును

216. కనుకనే జాగ్రదవస్థయందు తాను శుద్ధుడైనది, లేనిది తెలిసికొనుట కిదియొక గొప్ప ఉపాయము స్వప్నమందింకను వికారములు దుష్టచేష్టలు కలుగుచున్నచో, జాగ్రత్తునందింకను పూర్ణముగ శుద్ధము కాలే దని తలంచవలెను అపుడు మఱింత హెచ్చుగ ధ్యానాదులొనర్చి దానిని రహిత మొనర్పవలెను. ఎపుడు స్వప్నమందేవిధమైన మాలిన్యము, వికారము కలుగకుండునో, జాగ్రత్తయందున్నట్లే శుద్ధముగా నుండునో అపుడే తన యాచరణ పరిపక్వస్థితికి వచ్చినదని సాధకు డెఱుంగవలెను

217 అట్లే సుషుప్త్యవస్థ యందేస్థానమునుండి యా నిర్విషయా నందము ననుభవించునో పిదప మేల్కొనిన తరువాత నేను ఆనందముగా నిద్రించితినని చెప్పబడుచున్నదో అదియే ఆత్మస్థానము అనగా సుషుప్తి యందలి ఆనందము, గాఢతరమగు అజ్ఞానము ఎచట నుండి యెఱుంగ బడుచున్నవో అదియే బ్రహ్మ(ఆత్మ) స్థానము. జాగ్రత్స్వప్న సుషుప్తులను ఈ త్రివిధావస్థలనే సామాన్యు లెఱుంగుచున్నారుగాని, తురీయమగు నాల్గవ యవస్థ నెఱుంగుట లేదు అట్టి స్థితి, అంతఃకరణము శుద్ధమై, విషయ వాసనలు నశించినవారికి మాత్రమే గల్గును ఎచట నుండి సమస్తమును సాక్షి రూపముగా గాంచుచు నిత్యానందరూపమై వెలుగుచుండునో అదియే తురీ

యస్థానము అట్టి తురియస్థమగు ఆత్మ అజ్ఞుల కనుభవైక వేద్యము కాదు జ్ఞానులకే యగును కనుకనే గీతలో ఇవ్విధమున నుడువబడెను-

**యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।**
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥ (2-69)**

సమస్త జీవులు ఏవిషయవాసనా రూపమగు దృశ్యమున మేల్కాంచుచున్నారో, అయ్యది జ్ఞానులకు రాత్రిగాను, ఏనిర్విషయ ఆత్మానందమున జ్ఞానులు మేల్కొని యున్నారో, అయ్యది జ్ఞానులకు రాత్రి (శూన్యముగాను) నుండును

218 మనము భూమిపై నుండినందువలననే రాత్రింబగళ్ళు మనకేర్పడుచున్నవి సూర్యునియొద్ద నున్నచో కలుగవు అపుడు నిత్యప్రకాశమే యుండును అట్లే ప్రకృతియందు తగుల్కొని యున్నంతవఱకు ద్వంద్వములేర్పడుచుండును ప్రకృతి కతీతమైన ఆత్మస్థితి యగు తురీయమున నవేవియు నుండవు అట్టి జ్ఞానసూర్యుని చెంత కేగుటకు ప్రతిముముక్షువును యత్నింపవలెను అట్టి స్థానమందుండువాడు నిత్యజాగ్రత్తున నున్నవాడే అట్టిదాని నెఱింగనివారు సన్న్యాసులు కాలజారు

**219. నేత్రే జాగరితం విద్యాత్ కంఠే స్వప్నం సమావిశేత్ ।**
**సుషుప్తిగ్ం హృదయస్థం తు తురీయం మూర్ధ్ని సంస్థితమ్. ॥**

జాగ్రదవస్థయందు జీవుని స్థానము నేత్రము స్వప్నమందు కంఠము సుషుప్తియందు హృదయము, తురీయమందు మూర్ధ్న (బ్రహ్మరంధ్రము), అని యోగశాస్త్రమున వచింపబడినది

220 సమాధినిష్ఠలో శరీరము పడదు ఎంతకాలమున్నను అట్లే యుండును ఆ తురీయపదమున సోహం మంత్రార్థమగు చైతన్యము ప్రకాశించుటవలననే అది ఆత్మ స్వరూపజాగ్రత్తు అనబడినది అచట సోఽహం మంత్రమును మౌఖికముగ చెప్పుట కాదు. ఆత్మయే దానిని పలికించుచుండును

221 యతయో యత్నశీలాః – ఆత్మకొఱకు యత్నించు వారే యతు లనబడుదురు అనగా ప్రకృతివిలక్షణమగు ఆత్మనుగూర్చి చింతించువారే యతులు

**222. యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్ ।**
**యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః ॥**

చవిటిభూమియందు కృషిచేసి పైరుపెట్టినను ఎట్లు సరిగ పండదో, అట్లే అంతఃకరణశుద్ధిలేక, ధర్మాచరణ లేనివారై, నిత్యము గీత పఠించుచుండి నప్పటికి, యోగాదులు శీలించుచున్నప్పటికి ఫలిత మెక్కువ గోచరింపదు

223. గీత తొమ్మిదవ అధ్యాయమునకు రాజవిద్యారాజ గుహ్యయోగ మని పేరు అనగా రాజ్యపరిపాలనా రహస్యములు అంతరంగులగు మంత్రులకే తెలియునట్లు, ఈ బ్రహ్మవిద్యను అంతరంగ భక్తులే తెలిసికొం దురనియు, రాజరహస్యముల నతిగుహ్యముగా నుంచునట్లు బ్రహ్మవిద్య నతిగూఢముగా నుంచవలెననియు భావము రాజులకు జ్ఞానము గలిగి యున్నచో ప్రజలను సక్రమముగ పాలింతురని యెంచి రాజులకే పూర్వము బ్రహ్మవిద్య నుపదేశించిరి కనుకనే 'ఇమం రాజర్షయో విదుః' (దీనిని రాజర్షులు తెలిసికొనిరి) అని గీతయందును చెప్పబడినది

**224. జ్ఞానం విజ్ఞానసహితం యత్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ।**

జ్ఞానమనగా జ్ఞానికి నుండవలసిన అమానిత్వాది గుణములు విజ్ఞాన మనగా అనుభవజ్ఞానము బ్రహ్మమును తెలిసికొనునట్టి జ్ఞానము రెండును నుండవలెను జ్ఞానమార్జించిన పరీక్షయం దుత్తీర్ణులైనట్లు విజ్ఞానము కలిగిన ఉద్యోగము దొఱకినట్లు, పరీక్షప్యాసైనను ఉద్యోగము దొఱుకనిచో లాభ మెట్లులేదో, అట్లే జ్ఞానగుణములు గల్గియున్నను, జ్ఞేయము నెఱుంగనిచో పూర్ణత్వము సిద్ధింపదు మఱియు జ్ఞానము రాజబంధువువంటిది. రాజ బంధువునకు రాజభోగము లన్నియు లభించునుగాని రాజ్యాధికారము మాత్రము లభింపదు అట్లే జ్ఞానగుణములచే పుణ్యలోకప్రాప్తి, పరలోక సుఖము కలుగునేగాని జన్మరాహిత్యపదవి చేకూరదు.

225 సామాన్యముగా మనస్సు చేయవలదను దానిని చేసియే తీరును. చేయమనుదానిని చేయకయే యుండును ఇదియే సోమరితనముయొక్క లక్షణము కాన మనస్సును జయించుట కుపాయమనగా- అది చేయుమనిన దానిని చేయకుండుటయు, చేయివలదనిన దానిని చేయుటయు - ఇంతే, ప్రాతఃకాలమున బ్రహ్మముహూర్తమున లేచి, స్నానమాచరింప దలచిన - ఇపుడు చలిగనున్నది, లేవవలదు, ఇంకను కొంచముసేపు పరుండుమని మనస్సు హితము బోధించును. అపుడు విజ్ఞుడగువాడు లేచి వెంటనే స్నానము చేసియే తీరవలెను. అట్లే గీతాపారాయణము, ధ్యానము చేయుదమని తలంచిన వలదని చెప్పును అపుడు వాటిని చేసియే తీరవలెను ఇవ్విధమున చేయుచు రాగా రాగా తన ప్రభుత్వము సాగమిచే మనస్సు నెమ్మదిగ వశపడును దీనిని గూర్చిన యొక కథగలదు -

226 పూర్వమొక గ్రామమున కలహ యనునొక బ్రాహ్మణ స్త్రీ గలదు పేరు చేతనే ఆపె స్వభా మొకింత గమనించుకొనవచ్చును ఆగ్రామస్థు లందఱితోను కలహించుటయే ఆమె పని భర్త వద్దనిన దానిని చేయును చేయుమన్నదానిని చేయదు ఇట్లుండ నొకదినము ఆ బ్రాహ్మణుని తండ్రి గారి శ్రాద్ధము వచ్చెను. ఆ విషయము క్రిందటి దినముననే యాతడు తన భార్య కెఱింగించెను వెంటనే యా కలహోత్సుక తన అనిష్టమును దెల్పి దానిని వారింపనెంచెను అయ్యో! పాపమాబ్రాహ్మ డత్యంతచింతాకులితుడై, గత్యంతరము దోపక, తన గురువువద్దకు బోయి జరిగిన సమాచా రమంతయు నతని కెఱింగించె అంత నాతడిట్లొక యుపాయంబు వచించెను, - ఓ బ్రాహ్మణుడా! నీవిపుడే నీభార్యయొద్దకేగి - నేడు శ్రాద్ధము వద్దు, ఏమియు వద్దు, ఒక్క బ్రాహ్మణునకు కూడ అన్నము పెట్టవద్దు అని చెప్ప మనెను అతడట్లే చేసెను అది వినగానే ఆ చండగాత్రి అరుణనేత్రయై- అట్లెప్పటికిని కాదు, నేడు చేసియే తీరవలెను ఒకరికి కాదు, పదిమందికి భోజనము పెట్టవలెను, నేనే తయారు చేసిపెట్టదను- అని భీష్మించి యక్కార్య మున కుపక్రమించెను, భూసురుడు లోలోన సంతసించి తన్ను రక్షించిన

గురువును వేనోళ్ళ పొగడుకొనెను మనస్సును కూడ ఈరీతిగనే లొంగదీసి కొనవలెను అయితే అది క్రమముగ నభ్యసించుచు రావలెను ఎట్లన –

227. ఒక యూరిలో నొక ధనవంతుడు గలడు బహుస్థూల కాయుడు కాలుతీసి కాలుపెట్టవలెనన్న పదిమందిసేవకులు దగ్గఱనుండ వలెను ఒకనా డాధనికునకు రుగ్మత యేర్పడెను వెంటనే స్వంత డాక్టరును పిలిపించి చూపించిరి రోజునకు పదిమైళ్లు నడచినగాని ఆ వ్యాధి తగ్గదని యాతడు చెప్పెను. ఇంకేమి, ధనికుడు హతోత్సాహుడాయెను. అడుగు పెట్టలేని వాడు పదిమైళ్లు నడచుటెట్లు? అయితే డాక్టరుగారు కడు సమర్థుడు బాగుగ నాలోచించి యిట్లనెను– సరే, నేడుసాయంత్రము బండిలో షికారుగా వెళ్ళి మంచి గాలి సేవించుము, రోగము కొంచెము తగ్గునని వచించెను అట్లనే యానాడు ధనికుడు తన చేతికఱ్ఱతీసికొని బండిలోగూర్చొని వాయుసేవనమునకై యూరిబయటకు పయనమాయెను డాక్టరుగారుకూడా వెంట వచ్చిరి ధనికుడు ముందుప్రక్కను, డాక్టరు వెనుకప్రక్కను బండిలో కూర్చొనిరి బండి సాగి కొంతదూర మేగగనే వెనుకనున్న డాక్టరు మెల్లగ నాధనికుని చేతికఱ్ఱను క్రిందకు పడద్రోసెను డాక్టరుగారు చాల గొప్పవారు గాన వారిని దిగి తీయు మనుట యుచితము కాదని తలంచి ధనికుడు తానే దిగెను దిగి యాకఱ్ఱ నెత్తునంతలో డాక్టరు గారు బండిని కొంచెము ముందుకు జరిపించిరి. ధనికుడు బండిని సమీపించు నప్పటికి ఇంకకొంత జరిపించిరి ఇంకను కొంత జరిపించిరి ఇట్లు జరుపుచు జరుపుచు వానిని బండిఎక్కనీయక సుమారొకమైలు వానిచే నడిపించెను. ఆ దినమునుండి వానికి నడచుట యభ్యాసమై, క్రమముగా రోజునకు 10మైళ్ళు నడువ శక్తిగలిగి, దానిచే తన రుగ్మతను బోగొట్టుకొని యారోగ్యవంతు డయ్యెను అభ్యాసముయొక్క మహిమ యిట్లనే యుండును

228 ఒకనాడు రుక్మిణీదేవి శ్రీకృష్ణపరమాత్మ నిట్లడిగెను – నాధా! న మోహం సర్వభూతేషు న మేద్వేష్యోఽస్తిన ప్రియః (9–29) అని గీత యందు చెప్పియున్నారు అట్లయిన భక్తులనే రక్షించుట, తదితరుల

నుపేక్షించుటేల? అందఱును మీకు సములే గదా? అపుడు పరమాత్మ యిట్లనెను, - ఒకతండ్రికి నలుగురు పుత్రులు గలరు వారిలో ముగ్గురు ఉద్యోగముచేయుచు జీవించుచున్నారు ఒకడు పాపము పిచ్చివాడు తల్లి వానినే దగ్గఱకు పిలిచి అన్నముపెట్టును ఆతడు తల్లిదండ్రులపైననే ఆధారపడు వాడు కాన నల్వురిపైనను ప్రేమ యున్నను తల్లిదండ్రులు ముఖ్యముగ వానినే కనిపెట్టి చూచుచుందురు అట్లనే సర్వజనులు విషయాదులందు మునింగి నాయాశ్రయమును వదలుకొనుచున్నారు భక్తులు మాత్రము నన్నే శరణుజొచ్చుచున్నారు కాన వారినే నేనెక్కువగ గమనించుచుందు నని చెప్పెను

**229. అపిచేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।**
**సాధురేవ స మన్తవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః ॥**

**క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి ।**
**కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥**

మిక్కిలి పాపాత్ముడైనను తన దుష్టగుణములను విడిచి అనన్య మనస్కుడై యెపుడు నన్ను ధ్యానించునో, అపుడాతడున్ను త్వరలో ధర్మాత్ముడు కాగలడు. అచిరముననే దివ్యపదము నొందగలడు ఓకుంతీ పుత్రా! నన్ను నమ్మినవాడు చెడడు, చెడడు, చెడడని ముమ్మాటికి నొక్కిగుమ ప్రతిజ్ఞ చేయుచున్నానని రణభేరి మ్రోగించి భగవంతు డుద్ఘోషించెను అయితే మఱల నెన్నడు పాపకార్య మాచరింపకుండ నుండవలెను. లేనిచో, ఒక ప్రక్క ధ్యానముచేయుచు మఱియొకప్రక్క దుష్కృత్యము లాచరించుచు వచ్చిన ఫలితము మృగ్యమే యగును

230 పూర్ణత్వము నొందినవానికి మఱల నెన్నడును మాలిన్యమేల కలుగదని కొందఱు ప్రశ్నింతురు అట్టివారికి సర్వమును ఆత్మాకారముగనే గన్ను ట్టునుగాన భేదభావమున కచట తావులేదు. ఆత్మస్థితిని వీడి వారెపుడును నుండరు జీవన్ముక్తస్థితి గలుగనివారు మాత్రము మఱల ప్రకృతిదోషము గల

వారై పతనము నొందవచ్చును గాని అట్టిస్థితి గలిగిన వారుమాత్రము పతనము నొందరు టెంకాయ(బొండము) గాని, సొరకాయగాని పచ్చిగా నున్నపుడు నీటిలో మునుంగును ఎండినచో ఎంతముంచినను పైకే తేలును/గాని మునుగదు అట్లనే జీవన్ముక్తుని స్థితియునని విజ్ఞులు తలంచుకొనవలెను

231. పంచకోశములలో ఆనందమయకోశమే పరమాత్మకు స్థానమని చెప్పిరి కాని అది యథార్థము కాదు. ఆత్మ పంచకోశాతీతము కాన ఏ కోశమున్ను దానికి స్థానము కానేరదు ఉపాసనాపరుల కనుకూలతకొఱకే అట్లు ఆత్మస్థానము కల్పింపబడియుండవచ్చును ఐదు చిమ్నీలుగల ఒక దీపమునకు పైగల నాల్గుచిమ్నీలను తీసివైచి కొంతదూరమునుండి చూచిన, చిమ్నీ లేనట్లుగను, దీపమొకటే యున్నట్లుగను కనుపించును కాని, సమీపమునకు వచ్చి చూచిన, నింకను నొక ఆవరణ గలదనియే స్పష్టపడును అట్లనే, ఆనందమయకోశ మాత్మకతి సమీపమున నుండుటంబట్టి దానినాత్మ యని పరిభ్రమింపవచ్చును కాని యథార్థమున కదియునొక యావరణమే కాన దానినిన్ని భేదింపవలసియుండును అపుడే ఆత్మను జేరగల్గుదురు ఒక్క చిమ్నీ యున్నప్పటికి, దానికి జ్వాలనశక్తి లేదు, దీపమునకే గలదు అట్లే ఆనందమయకోశమున నిత్యత్వ,జ్ఞానత్వ, ప్రకాశత్వములు లేవు కాన జ్ఞానాగ్ని యచట ప్రజ్వలింప నేరదు తదేకైకపటలవిచ్ఛిత్తిచే సచ్చిదానందమగు ఆత్మ బహిర్గతమై, పూర్ణత్వము సంభవించును అయితే అంతవఱకేతెంచినవారు సామాన్యులకంటె చాలగొప్పవారే కాని ధ్యేయాకారస్థితి ఇంకను వారికి కలుగలేదు. కాన జన్మరాహిత్యమున్ను కలుగలేదనియే అర్థము శుద్ధాంతఃకరణు లైనందుచే వారికి పుణ్యలోక ప్రాప్తిమాత్రము చేకూరును

232.పూర్ణ ధ్యేయాకార స్థితిగలవారు ఎన్నియో సంవత్సరముల కొకసారిమాత్రమే లోకమున నవతరింతురని శ్రీరామకృష్ణపరమహంస వచించిరి. ఉద్యోగస్థులందువలె గురువులలోకూడ చాల భేదము కలదు వారలందును అనేక తరగతులు గలవు సామాన్యులే తఱచు అగపడుచుం

దురుగాని కారణగురువులు (కేవలము భగవదాదేశముచే లోకమునకు పంప బడినవారు) బహు అరుదుగా నుందురు

233 సామాన్యస్థితిచే సంతుష్టిపడక క్రమేణ జ్ఞానమభివృద్ధిపఱచి తా నుత్తీర్ణుడై, యితరుల కూడ నుత్తీర్ణుల జేయవలెను అందులకై తీవ్ర వైరాగ్యము గలిగి అనన్యభగవచ్చింతన చేయవలెను స్వాతికార్తెలో కృత్తికా నక్షత్రము పైనున్నపుడు వర్షించు జలబిందువునకై ముత్తెపు చిప్ప లెంతకాలమో సముద్ర పైభాగమున నోరు తెఱచికొని వేచి యుండి, ఆజలబిందువు పడగనే నోరు మూసివైచి అగాధజలములోనికి దిగిపోయి, యట దానిని గూర్చియే చాలకాలము చింతనచేయుచు నుండ, క్రమముగ నాబిందువు ముత్తైముగా పరిణమించును అపుడు దానికెంతయెూ అమూల్యత యేర్పడును అట్లే ధ్యాననిష్ఠుడగు ముముక్షువున్ను మహాత్ము లగు గురువుల సద్బోధ లెపుడు లభించునా యని కాచుకొని కాచుకొని యుండి అయ్యవి లభించుటతోడనే యిక మెదలక నొకచోట గూర్చుండి తీవ్రముగ వాటిని మనననిది ధ్యాసనము లొనర్పవలెను. అపుడే తద్బోధనామృతశీకరములు ముక్తిమౌక్తికములై పరిణమించి శాశ్వతసుఖ మొనగూర్పగల్గును ఇదియే వేదాంతము యొక్క పరమ రహస్యము

234 దయాల్‌బాగ్ సత్సంగమువారి యభిప్రాయము దేహేంద్రియా ద్యంతఃకరణవృత్తుల కతీతమైయుండు సాక్షిచైతన్యమున సంయమనము చేయుటయే యగును ఆ చైతన్య మనాది, అనంతము, సర్వప్రకాశకమున్ను, నిత్యోదితము బావి త్రవ్వకపూర్వమును అచ్చోట జలముండియే యుండి నట్లు, సర్వజీవులందున్ను ఆదివ్యచైతన్య శక్తి ఎల్లప్పుడుండియే యున్నది కాని త్రవ్వబడిననే జలము కన్పడినట్లు, ధ్యానాద్యనుష్ఠానముల వలననే ఆ యాత్మశక్తి ప్రస్ఫుటముగ గోచరించును దానినే కుండలినీ ఉద్బోధమనియు, జ్ఞానశక్తి యనియు అందురు

235. పక్వమై వృక్షమునుండి రాలినపండు మఱల చెట్టున కంటుకొనదు అట్లనే సంసారవృక్షమునుండి విచ్ఛిత్తినొందిన జీవన్ముక్తులైన

మహాత్ములు మఱల నా సంసారమున దగుల్కొనరు వారికిక పునరావృత్తి లేదు రంగులరాట్నమును పట్టుకొనిన వారుమాత్రమే దానితో బాటు తిరుగు చుందురు బయటనున్నవా రాయంత్రమును సాక్షిరూపమున గాంచు చుందురు అట్లనే, సంసారచక్రభ్రమణ పరితాపోపశమనము నొందిన జీవన్ముక్తులు బంధరహితులై లీలారూపమున నీ జగంబును గాంచు చుందురు.

236. సన్న్యాసులకు, బ్రహ్మనిష్ఠులకు నిక నేకర్మయు లేదని కొందఱు చెప్పుదురు అది సరి కాదు

**ఫలస్య కారణం పుష్పం ఫలం పుష్పవివర్జితమ్ ।**
**జ్ఞానస్య కారణం కర్మ జ్ఞానం కర్మవివర్జితమ్ ॥**

అనగా ఫలము పుష్పరహితమైనను, ఫలోద్భవమునకు పుష్పమే హేతువు అట్లనే జ్ఞానము కర్మవివర్జితమైనను, జ్ఞానోద్భవమునకు కర్మయే హేతువు కాన నిష్కామకర్మముచే సత్కర్మానుష్ఠానముచే, పూజా, భక్తి, ఉపాసనాదులచే నంతఃకరణశుద్ధి బడసి, ఆపిదప ధ్యానాద్యనుష్ఠానములచే విజ్ఞాన మభివృద్ధి కాగా ఆత్మసాక్షాత్కారమును జీవుడు పొందగల్గును కాన మొదటనే కర్మల నుపేక్షించిన నిక జ్ఞానము శూన్యమగును ఒకవేళ జ్ఞానము పొందినప్పటికిని నితరులకొఱకైనను తాను సత్కర్మల నాచరించుటయే మంచిది. తనదేహమును తాను కాపాడు కొనుచున్నంతవఱకు లోకమును కూడ కాపాడుచుండుట శ్రేయస్కరము.

237 ప్రమిద, తైలము, వత్తి, గాలిలేని స్థలము - ఇవన్నియు నుండిననే జ్యోతి వెలుగగల్గునట్లు వైరాగ్యమను ప్రమిదె, భక్తియును తైలము, యోగమను వత్తి, నిర్వాసనారూపమగు గాలిలేని స్థలము నున్ననే జ్ఞానమను జ్యోతి ప్రకాశించును పైజెప్పినవన్నియు నున్నచో ఆదీపమెక్కడ పెట్టినను, ఎవరు వెలిగించినను ప్రమిద ఏరూపముగా నున్నను, అది మట్టిదైనను బంగారుదైనను, చిన్నదైనను, పెద్దదైనను; రంధ్రము లేనిదైనచో, తైలము నీరు కలియనిదైనచో, వత్తి కొడిగట్టనిచో, స్వచ్ఛముగ వెలుగు

చుండును అట్లనే ఏజాతివారైనను స్త్రీలైనను, పురుషులైనను, ధనికులైనను, దరిద్రులైనను, ఇచట నున్నను, కాశీ హరిద్వారము మున్నగు స్థలముల కేగినను, దృఢ వైరాగ్యమును రంధ్రములేని ప్రమిద, విషయమాలిన్యమను నీరుతగులని పరిశుద్ధమైన యచంచలభక్తియను తైలము, ఏకాగ్ర మానసంబను కొడిలేని వత్తి, వాసనారహితస్థితి యను నిర్వాతస్థలము జేపట్టినచో జ్ఞానజ్యోతి నిరాటంకముగా వెలుగగలదు.

238 బ్రహ్మనిష్ఠులకు నాడీశుద్ధి ముఖ్యముగ నుండవలెను పావని వృత్తి గలిగినచో, దృఢగాత్ర మేర్పడును తగరపుకత్తితో గొప్పవృక్షమును నఱుకజాలనట్లు దుర్బలదేహముతో బలవత్తరమైన ప్రకృతిపాదపమును ఉన్మూలించుట యసాధ్యము బ్రహ్మచర్యానుష్ఠానము సరిగనున్ననే వీర్య మోజస్సుగ పరిణతమై దేహము శక్తిమంతమగును దుర్బలదేహులు, దుర్బలచిత్తులు బ్రహ్మస్థానము నెపుడును నలంకరింపజాలరు కనుకనే గొప్పగొప్ప బ్రహ్మవేత్తలందఱును దృఢకాయులై, తేజోవంతులై, అస్ఖలిత బ్రహ్మచర్యపరులై యుండుదురు అయితే దేహమును మాత్రము పోషించు చుండుడని చెప్పుట కాదు. దేహమానసంబులకు సన్నిహిత సంబంధము గలదు గాన మనశ్శుద్ధికై దేహశుద్ధి యవసరమని చెప్పుటయే యగును

239 బ్రహ్మచర్యము గలవాడు, కామసంకల్ప రహితుడు, గురుభక్తి, దైవభక్తిగలవాడు, శమదమాది సాధనచతుష్టయ సంపత్తిగలవాడు మాత్రమే బ్రహ్మవిద్య కర్హుడగును

240 ఇక ధ్యానమెట్లుపక్రమింపవలెనో చెప్పెద- అనుకూలమైన స్థలముండవలెను అది లేనిచో, ఏదైన ఏకాంతప్రదేశముగాని, ఆశ్రమము గాని చేరుట యుత్తమము జలము, ఫలవృక్షాదులు సమీపమున నుండు నట్టిచో టైనచో చాల మంచిది క్రూరమృగ సంచారము లేనిదై యుండవలెను. శబ్దము లేకుండ నుండవలెను బ్రహ్మముహూర్తముననే స్నానమాచరించి, విభూతి ధరించి మట్టినేలపై కృష్ణాజినముగాని, దర్భాసనముగాని వైచుకొని, సిద్ధాసనముగాని, పద్మాసనముగాని యవలంబించి, దేహమును ఋజువు

నొనర్చవలెను 'సమం కాయశిరోగ్రీవం' అని గీతయందు చెప్పబడినదిగాన శిరస్సు, కంఠము, నడుము సమముగా నుంచవలెను ఏలన వెన్నెముక మధ్య భాగమునుండి సుషుమ్న ప్రవహించుచుండును అయ్యది వక్రముగానున్న, కుండిలినీస్థాన మగు మూలాధారమునుండి ఊర్ధ్వముఖముగా జనునట్టి శక్తి ప్రతిహతమై, యవరోధమునంది, సమాధిస్థితి కాటంకము గలుగజేయును చింతనాప్రవాహమున్ను అడ్డుపడిన దగును కనుకనే దీర్ఘచింతన చేయునపుడు గాని, మహత్తర సమాలోచనల గావించునపుడుగాని శరీరము సహజముగానే తిన్ననగును మఱియు మహాపురుషులు, గొప్పగొప్ప ప్రవక్తలు, సూక్ష్మవిష్కృతుల నొనర్చు గొప్ప వైజ్ఞానికతత్త్వవేత్తలు, ఋజాగాత్రులైయే యుండుట మనము గాంచుచున్నాము. వక్రశరీరము గలవారి బుద్ధులున్ను వక్రముగానే యుండును వక్రదేహముగల సర్పము విషమయము గదా!

ఇక స్థలవిషయమై ఒకటిరెండు వాక్యములను చెప్పవలసియున్నది స్థలము మిట్టపల్లములు లేనిదై యుండవలెను ఒక ఇంజను నొకచోట స్థాపించునపుడు మొట్టమొదట లెవెల్ సరిసమానముగా నుండునట్లు జూతురు ఏయొక్క నూలైనను హెచ్చుతగ్గులుగా నుండిన, ఇంజను సరిగ పనిచేయ జాలదు అట్లే ఈదేహమను ఇంజను ధ్యానమను క్రియ కనుకూల పడవలసియున్నచో, మొదట దానిని చక్కగా స్థాపించవలయును ఇక స్థల భేదము జూతము రాతినేల శక్తి నాకర్షించును కాన రాతిబండపై గూర్చుండి ధ్యానించుట యంత మంచిదికాదు సిమెంటు, కంకఱవేసిన నేల మధ్య మము మట్టినేల శ్రేష్ఠము కాన గోమయముచే దానిని శుభ్రముగ నలికి ఉపయోగించుట మంచిది కృష్ణవ్యాఘ్రాజినములందు, శక్తిని భూమి యాకర్షింపక నిల్పునటువంటి యొకవిధమైన సామర్థ్యము గలదు. కాననవి ధ్యానమున కుపకరించును కాని సర్వసామాన్యముగా పవిత్రమగు దర్భయే ఆసనమున కుపయోగింతురు

ఏది యెటులున్నను ఈ యాసనాది విషయములు గౌణములేగాని

ప్రధానములు కావు అట్లు ఆసనముపై గూర్చుండి దృష్టిని భ్రూమధ్య మునగాని, నాసికాగ్రమున గాని, సహస్రారమునగాని నిలిపి, మొమ్మొదట తన యిష్టదైవమును, గురువును స్మరించవలెను పిమ్మట అర్థానుసంధా నరూపముగ జపమాచరించవలెను ఒక్కొక్క మంత్ర ముచ్చరించునపుడు ఒక అపూర్వమైన తేజము తనలో ప్రవేశించి తన్ను పరిశుద్ధ మొనర్చు చున్నట్లును, దేహమంతయు చైతన్యమయ మైనట్లును భావన చేయవలెను అట్లుగావించిన, త్వరలోనే యాతడు శుద్ధుడు కాగల్గును

తజ్జపస్తదర్థభావనం (పతంజలియోగ సూత్రము) – అనగా మంత్ర ముచ్చరించునపుడు దాని యర్థమును కూడ భావింపవలెను లేనిచో మందు లేక వట్టిగుండు మాత్రము వేసి కాల్చిన ఫిరంగివలె నుండును అది శబ్ద మును గలుగజేయునుగాని లక్ష్యమును భేదింపజాలనట్లు, అర్థపురస్సరముగ నాచరింపని జపమున్ను అవిద్యా కోటను ధ్వంసం మొనర్పజాలదు

పూర్వపు ఋషులకును మనకును గల భేదమిదియే వారికిని మన కును మార్గము చీలిపోవున దిచటనే ఏప్రణవాది దివ్యమంత్రములను జపించి సనకాదులు విజ్ఞానవంతులైరో, ఆ ప్రణవాది మంత్రములనే యిపుడు మనమును జపించుచున్నాము ఏపంచాక్షరీ మహామంత్రమును స్మరించి వామదేవ, విశ్వామిత్రులు జన్మరాహిత్యపదవి నొందిరో, ఆ పంచాక్షరినే యిపుడు మనమున్ను స్మరించుచున్నాము ఏ శ్రీరామమంత్రమును స్మరించి ఆంజనేయాదులు ముక్తిని బడసిరో, ఆ శ్రీరామమంత్రమునే యిపుడును మనము స్మరించుచున్నాము తుంబురు, నారదాదులే నారాయ మంత్రము జపించి కృతార్థత నొందిరో, మనము జపించునదియు ఆ నారాయణ మంత్రమే కాని, వారివలె మనకేల యట్టి యపూర్వశక్తిసామర్థ్యములు గలుగలేదు? కారణము జపించునపుడు అర్థానుసంధానముగావింప కుండుటొకటి, చిత్తమన్యత్ర యుండుట యొకటి ఈ రెంటివల్లను మన జపమంత ఫలవత్తర మగుట లేదు తగినరీతి నాచరింపనందుననే తగినఫలము బొందక పోవుచున్నారు

241. యధార్థము వచించిన, పండ్రెండుసంవత్సరము లెవరు నిర్మల భక్తితో ధ్యానము సల్పుదురో, వారికి తప్పక ఆత్మసాక్షాత్కారము కలుగును పూర్ణత్వము సిద్ధించును సందియము లేదు. ఇట కొందఱిట్లు ప్రశ్నింతురు - మేము ధ్యానము ప్రారంభించి 12సంవత్సరములే కాదు ఇంకను నెక్కువే యైనది; ఎంతకాలమో గురుసేవ చేసితిమి, జపమాచరించితిమి, ధ్యానము సల్పితిమి, కాని మాకింకను ఆత్మశాంతి కలుగలేదేమి? యనిన నిజమే ఎంతకాలము దున్నినను భూమి చవిటి దైనచో మొక్క మొలవదు ఎంతకాల మౌషధము సేవించినను పథ్యము సరిగా లేనిచో రోగము కుదురదు. అట్లే చిత్తశుద్ధి లేక చేసిన యనుష్ఠాన మంతగా ఫలింపదు.

పోనిండు, మీరు నిండు భక్తివిశ్వాసములతోనే చేసినారనుకొనుడు అదైనను ఈ 12సంవత్సరములు కాదు మీరు ధ్యానించునపుడుగాని, నడచు నపుడుగాని, కూర్చున్నపుడుగాని, మాట్లాడుచున్నప్పుడుగాని యెంత కాలము మీమనస్సు ధ్యేయాకారమగు ఆత్మయందు లగ్నమైయుండునో, ఆకాలమే లెక్కకువచ్చుచుండును తక్కినదంతయు పొల్లుమాత్రమే అట్లెన్ని నిముషములు నేడు మీ మనస్సు ధ్యేయమందు నిలుచునో అటువంటి నిమిషములు అఱువదియైనచో ఆత్మలోకమున ఒక గంటకాలము మీరు పొందినట్లు, అటువంటి గంటలు 24యైన, ఒకరోజుమాత్రమే. మీరు ఆత్మయందు నిలుకడ గలిగిన వారగుదురు అట్టిరోజులెన్నియో జేరిననే ఒక సంవత్సరమగును, అట్టిసంవత్సరములుగూడ పండ్రెండు కావలెను గదా। దీనిచే నింకెంతకాల మొక్కొక్కరు ధ్యానింపవలసియున్నారో యోచించు కొనుడు ఈ జన్మయందు కాకపోయినను ఎన్నిజన్మలలోనైనను అంత కాలము సేకరించిననే (ఆత్మయందు స్థితిగల్గిననే) పూర్ణత్వము నొందగలరు.

అట్లు చిత్తైకాగ్రతతో ధ్యానముచేయని కారణముచేతనే ఎంతయో కాల మనుష్ఠించియు తుదకు ఫలము కనుపింపనందుచే అనేకులకు నాస్తికభావ ముత్పన్న మగుచున్నది. వేదశాస్త్రాదులందును, గురువాక్యములందును వారి కవిశ్వాస మేర్పడుచున్నది సాధులోకము పతనమగుటకు కారణమిదియే

కాన ధ్యానాదికాలములందు చిత్తమన్యత్ర పోనీయక చూచుచుండుట సర్వముముక్షులయొక్కయు కర్తవ్యమై యున్నది ఈవిషయమై యొక కథ గలదు

242 అక్బరుచక్రవర్తి రాజుగా నున్నపుడు (ఆ మహమ్మదీయ రాజ్యకాలమున) గురునానక్‌యొక్క కీర్తి ప్రజలలో బాగుగ వ్యాపించి యుండెను ఆతని తపఃప్రభావము పవిత్రస్వభావము గాంచి మహమ్మదీయులలో గూడ ననేకు లాతనికి శిష్యులైరి కాని యాతడుమాత్రము లోక వ్యవహారము లందెక్కువ జనక ఏయేకాంత ప్రదేశముననో కాలము గడుపుచుండెను వాని ప్రభావము గాంచి అక్బరుచక్రవర్తి తన యాస్థానమునకు వాని బిలువనెంచి, దూతను బంపెను ఆతడట్లే పోయి వచింప, నానక్ సర్వలోకములకు సామ్రాజ్యాధిపత్యము వహించు నేను ఒక చిన్నదేశమును పాలించు రాజు బిలిచిన, పోవుటయా? అట్లెన్నటికిని కాదు అని చెప్పి పంపివేసెను ఆప్రత్యుత్తరము విని కొందఱు మహమ్మదీయులు క్రుద్ధులైరి గాని, అక్బరు శాంతించి మఱల వానికి వర్తమాన మంపెను అపుడును నాతడు రాలేదు

అత్తఱి అక్బరుచక్రవర్తి యొక ఉపాయ మాలోచించెను - ఈతడు పరమభక్తుడు కాన నమాజు కాలమున మసీదునకు పిలువనంపిన నటకు తప్పక వచ్చును అని యూహించి ఫలానిదినమున ప్రార్థనాసమయమునకు మసీదున కేతెంచుడని వచింప దూతనంపెను దూతవాక్యమును విని గురు నానక్ సంతోషభరితుడై నేనే ఆదినము స్వయముగ వచ్చెదను నా కొఱకై మఱల నెవరును పిలువరా నక్కఱలేదని వచించెను అట్లే యాదిన మందఱి కంటెను ముందుగా గురునానక్ మసీదునకు బోయి యట వేచియుండెను ఇంతలో అక్బరుచక్రవర్తి, ప్రధానుడగు మౌల్వీసాహెబు, తదితర ముస్లిం భక్తులు, అందఱు వచ్చి చేరిరి సమాజుప్రారంభ మయ్యెను తాను నిలబడి యదంతయు చూడవలెనని నానక్ కోరెను వారందులకు సమ్మతించిరి

కొంత ప్రార్థన అయిన తరువాత మౌల్వీసాహెబుగారు ప్రార్థన

నుపక్రమించగనే, నానక్ పకపక నవ్వెను తమగురువు నవమానపరచు చున్నాడని తలంచి వారందరును రౌద్రము వహించిరి కాని అగ్బరు ఇది సమ యముగాదని వారలను వారించి శాంతపఱచెను మఱల కొంతసేపటికి అగ్బరు చక్రవర్తి ప్రార్థన కుపక్రమించెను అపుడు నానక్ ఇంకను బిగ్గఱగ నవ్వనారంభించెను ఇక వారి యాగ్రహమునకు హద్దు లేదు కత్తులను దూసిరి. కాని దూరదృష్టి గల యగ్బరు వారలను మఱల నిరోధించెను

నమాజంతయు పూర్తియైన పిదప తాను నవ్విన హేతువేమి యని యేకాంతముగ అక్బరుచక్రవర్తి నానక్‌ను ప్రశ్నింప, అతడిట్లనెను– మౌల్వీగారు ప్రార్థించుచున్నారని మీరు తలంచితిరేమో, కాదు, తనయింట్లో తనపిల్లవానికి మందు ఇచ్చుచున్నాడు (నిజముగా యపుడాతడట్లే చేయుచుండెను తన కుమారు డస్వస్థుడై యున్నందున వానికి మందిచ్చు చుండగా సమాజుకాల మైనదని మసీదునకు వెంటనే వచ్చివైచెను కాన చిత్తమంతయు నచటనే లగ్నమైయున్నది.) ఈ విషయ మతనిని నడిగి తెలిసికొనవచ్చును అంత అక్బరు మౌల్వీని బిలిపించి యడుగ, నదంతయు సత్యమనియే తేలినది

ఇక రెండవమాఱు నవ్విన కారణమేమని యడుగ నానక్ అక్బరుతో మీరు ప్రార్థిఃచుచుండిరని యెంచితిరేమో, కాదు, మార్కెట్టునందు గుఱ్ఱపుబేరము చేయుచుంటిరనెను–( నిజముగా నాదినము మార్కెట్టునకు కొన్ని క్రొత్త అరేబియా గుఱ్ఱములు వచ్చియుండెను, వాటిని గైకొనదలంచి రాజు బేరమాడుచున్నపుడు సమాజు సమయము కాగా మసీదునకు రావలసివచ్చెను.)

కాన దేహము మందిరమున నున్నను, మనస్సు మార్కెట్టులో దిరుగులాడుచుండెను అక్బరు తన చిత్తస్థితి అపుడట్లనే యుండెనని సమ్మతించి, నానక్‌యొక్క త్రికాలజ్ఞానమునకును, పవిత్రస్వభావమునకు మెచ్చి తనరాజ్యమందొక భాగమును అతనికిచ్చివైచెను, మఱియు నికమీద తాను తన మతమును నిరాఘాటముగ చాటుకోనవచ్చుననియు, తానేమియు

దానినాటంక పరుపననియు వచించెను నేటికిని పంజాబుదేశ మందలి కొంతభాగము సిక్కుమతస్థులైన గురునానక్ సంప్రదాయము యొక్క పరంపరయందలివారి యధీనమున నున్నది. చూచితిరా, జనుల యేకాగ్రత యెవ్విధమున నుండునో!! కాన కడుజాగరూకత వహించి, చిత్తము నన్యథా పోనీయక, ధ్యానకాలమందైనను లక్ష్యమందే నిల్పునట్లు శీలించవలెను.

243 నాడీశుద్ధి స్థూలదేహమునకు జెందినది ఇది బాహ్యశుద్ధి జలముచే దేహమును శుద్ధమొనర్చుకొనునట్లే ధ్యానయోగాదులచే అంతఃకరణశుద్ధి చేసికొనవలెను ఇది లోశుద్ధి రెండును కావలసినవే జ్ఞానానుష్ఠానము చేయలేనివారికి సత్కర్మలను బోధించవలెను వాటిని నిరసించరాదు ప్రథమమున అవియే యవసరము

244 బ్రహ్మచర్యము రెండువిధములు (1)నైష్ఠిక బ్రహ్మచర్యము, (2)గృహస్థ బ్రహ్మచర్యము మనోవాక్కాయములచే నేకాలమందును విషయమందు ప్రవర్తింపక బ్రహ్మమందు సదా నిష్ఠగల్గియుండుట నైష్ఠిక బ్రహ్మచర్య మగును అపుడీక్రింద తెలుపబడు ఎనిమిది దోషములు లేకయుండవలెను

**స్మరణం కీర్తనం కేలిః ప్రేక్షణం గుహ్యభాషణమ్ ।**
**సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియా నిష్పత్తిరేవ చ ॥**

**ఏతన్మైథున మష్టాంగం ప్రవదన్తి మనీషిణః ।**
**విపరీతం బ్రహ్మచర్యం ఏతదేవాష్టలక్షణమ్ ॥**

విషయముల స్మరించుట, కీర్తించుట, క్రీడించుట, చూచుట, రహస్యముగ మాట్లాడుట, సంకల్పించుట, యత్నించుట, ప్రవర్తించుట యను నీయెనిమిదిన్ని అబ్రహ్మచర్య లక్షణములు ఇవి లేకుండుటయే నైష్ఠిక బ్రహ్మచర్యలక్షణము.

పరస్త్రీయందభిలాషలేక ఋతుకాలమున మాత్రము స్వపత్నితో ధర్మముగా ప్రవర్తించుట గృహస్థబ్రహ్మచర్య మనంబడును నిత్యము

బ్రహ్మచింతనయం దుండుటయే అనగా బ్రహ్మమందు చరించుటయే యధార్థమైన బ్రహ్మచర్య మగును. కాని స్థూల బ్రహ్మచర్యమున్ను ఆవశ్యకమే. అది లేనిచో నిది సాధ్యము కాదు. ఈ బ్రహ్మచర్యవిషయము స్త్రీపురుషుల కిరువురకును సమానమే

245. ఆత్మానాత్మ వివేకముచే మనసును ప్రత్యగాత్మయందు విలీనము చేయుటయే జ్ఞానతపస్సు ఇది ఉత్తమమైనది ధ్యానధారణాదులచే నొనర్చు తపస్సు మధ్యమము కేవలము కృచ్ఛ్రచాంద్రాయణాదులచేతను, కేవల ముపవాసాదులచేతను దేహమును కృశింపజేసి చేయు తపసు కనిష్ఠము

246 ఆత్మైక్యబోధ మొకసారి గల్గినచో, మఱల నిక నద్దాని విషయమై సంశయ ముండదు అదే ఆత్మవాణి అది గలుగనిచో శ్రవణ మనన నిది ధ్యాసనల గావింపవలెను ఆత్మస్వరూపమును ప్రతిపాదించు మహావాక్యాదు లను వినుట శ్రవణము ఆవినిన దానిని అనేకయుక్తులచే నాలోచించి, ఆనాత్మపదార్థము నేను కాదని త్రోసివేసి తన యధార్థస్థితిని మాటిమాటికి చింతించుట మననము. అట్లు మననము చేసినదాని ననుభూత మొనర్చు కొనుట, అనగా ఆత్మయందు నిలుకడ గల్గియుండుట నిదిధ్యాసము ఇది ఒకదానికంటె నొకటి యుత్కృష్టమై, అధికఫలము గలదై యుండును ఈవిషయమై వివేకచూడామణియందు శ్రీశంకరులిట్లు తెల్పిరి.

**శ్రుతేశ్శతగుణం విద్యాన్మననం మననాదపి ।**
**నిదిధ్యాసం లక్షగుణ మన న్తం నిర్వికల్పకమ్ ॥**

అనగా, శ్రవణముకంటె మననము నూఱురెట్లధికఫలము నొసం గును మననముకంటె నిదిధ్యాసము లక్షరెట్లధిక ఫలము నిచ్చును నిర్వి కల్పసమాధి అనగా సాక్షాత్కారస్థితియొక్క ఫలమనంతమని పేర్కొనబడెను.

247 కట్టెను మథించుటచే అగ్ని ప్రజ్వలించునట్లు, ధ్యానయోగముచే జీవునియందు జ్ఞానాగ్ని ప్రజ్వలించును

248 బ్రహ్మనిష్ఠను చెఱుపులేక చూచుచుండుటయే ఆత్మవ్రతము

249 మలినహృదయము, శుద్ధహృదయము, విశుద్ధహృదయమని హృదయము మూడు తెఱగులు మలిన హృదయము మట్టివంటిది మట్టి యందు సూర్యబింబము కనుపించదు అట్లే యట్టి హృదయమున ఆత్మజ్యోతి ప్రకాశింపదు శుద్ధహృదయము అద్దమువంటిది. అందు సూర్యబింబము కానుపించునుగాని దహనశక్తిలేక యుండును అనగా నట్టిహృదయమున జ్ఞానమంకురించును గాని కర్మరాశి నది పూర్తిగ దగ్ధమొనర్ప శక్తిలేనిదై యుండును విశుద్ధహృదయము సూర్యకాంతమణి వంటిది అందు ప్రకాశోష్ణత్వములు రెండును నుండును. అది పూర్ణజ్ఞానో దయస్థితి సూర్యకాంతమణి జ్వలించునపుడు తృణాదుల భస్మీభూత మొనర్చునట్లు, ఆ విశుద్ధహృదయము కర్మసమూహము నంతయు నిర్మూల మొనర్పగలదు

250 ఆసనములలో పద్మాసనము, సిద్ధాసనము ముఖ్యములైనవి సిద్ధాసనము పండ్రెండుసంవత్సరములు శీలించిన యోగము సిద్ధించును, ప్రాణవాయువు సన్నగిలును ఉన్మనీఅవస్థ తనంతట నదియే కలుగును ఆయాసనము బ్రహ్మచర్యమునకున్ను సహాయపడును

251 వేసవికాలము ముదురుచు రాగా రాగా మంచు ఏలాగున తగ్గిపోవుచుండునో, అట్లే జ్ఞానసూర్యు డభివృద్ధి నొందినకొలది, అవిద్యా కర్మ వాసనారూపమగు తుషారము క్షయ మొందుచుండును

252 చవిటినేలను దున్ని విత్తనము వేసినను ఫలింపనట్లు, వాసనాయుతమగు నంతఃకరణమున ఈశ్వరోపాసన, ధ్యానయోగాదులు ఫలింపవు కాని యిపుడు అమెరికాదేశీయులు ఎట్లు చవిటిభూములలోని ఉప్పును ఎలెక్ట్రిక్ కర్రెంటుచే మాడ్చివైచి భూములను సారవంతముగను సస్యాభివృద్ధి కనుకూలముగను చేయుచున్నారో, అట్లే తపోబలముచే మనోమాలిన్యమును రహిత మొనర్చినచో, జ్ఞానబీజము దివ్యముగ వర్ధిల్లును

# 10 వరోజు 6-4-1940

**253. మహర్షయః సప్త పూర్వే చత్వారో మనవ స్తథా ।**
**మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః**

నలుగురు మనువులు, సప్తర్షులు – వీరు మొట్టమొదట భగవంతునిచే సృజింపబడిరి వారినుండి క్రమముగ లోకమభివృద్ధి యయ్యెను మనువు సంతాన మగుటచేతనే మానవులని పేరువచ్చినది ఇంగ్లీషుభాషయందలి మేన్ అను పదముకూడ దీనినుండి యేర్పడినదే మనువులు, సప్తర్షులున్ను బ్రహ్మచర్య, గృహస్థ వానప్రస్థాశ్రమములను యథాప్రకారము నిర్వర్తించి, సర్వధర్మముల ననుష్ఠించి, వాటిని లోకమునకు బోధించిరి ఇట్లు వారు ప్రవృత్తి మార్గమును జనులకుపదేశించిరి కాని సనకాదులు కేవలము బాల్య కాలమునుండియే విరక్తులై, సన్న్యసించి యత్యాశ్రమధర్మములను, నివృత్తి మార్గసాధనలను నెక్కువగ బోధించిరి ఇట్లు ఈశ్వరాంశ సంభూతులగు వారిరువురును క్రమముగ ప్రవృత్తి నివృత్తిమార్గముల రెంటిని లోకమున కుపదేశించి మార్గదర్శకులైరి అట్టివారి సంతాన మగుటచే మనము ఋషిపుత్రుల మనియే తలంచవలెనుగాని, అల్పులమని యెన్నటికిని తలంపరాదు అల్పభావనచే అల్పత్వమునే చెందుదుము, కాన వారెట్లు అనుష్ఠించిరో అట్లనే మనమున్ను అనుష్ఠించిన, వారు పొందిన పదవిని మనమున్ను పొందగలము

254 కృతయుగమున అగ్ని నైజముగ ఏ ప్రకాశ, జ్వలనశక్తులను గల్గి యుండెనో నేటికిని అట్లనే గల్గియున్నది కాని ఆకాలమున జనులనేక ఇం ధనములను నందువైచి దానిని వృద్ధిపఱచిరి మనమింధనములను వేయ నందున నది చల్లారిపోయినది ఇంతే భేదము కాన భక్తి, ధ్యాన, వైరాగ్యాది ఇంధనముల సాయముచే జ్ఞానాగ్నిని రగుల్కొలిపిన, నిపుడున్ను అది దేదీప్యమానముగ ప్రకాశింపగలదు మఱియు కృతయుగమున సింహ శార్దూలాదు లేశక్తి గల్గియుండినవో, యిపుడును అవి యాశక్తినే

గల్గియున్నవి. ఒక్కమనుజులు మాత్రమిట్లు క్షీణదశ నొందుట యేల? వారి ప్రయత్నలోపమే కాన, నో జనులారా!

**ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్నిబోధత!**
**లెండు! మేల్కొంచుడు!! ధర్మానుష్ఠానమునకు గడంగుడు!!**

255 మనమందఱము ఆర్యసంతతివారము మొట్టమొదట ఆర్యులు టిబెట్ ప్రాంతముననుండి ఆపిదప నలుదిశల వ్యాపించినారని కొందఱు చెప్పుదురు పూర్వము వారు గోవులను విశేషముగా పాలించుచుండెడి వారు నేటికిని ఉత్తరదేశమున హిమాలయ, వింధ్యపర్వతప్రదేశములందు జనులు విశేషముగ పశువులను మేపుచుందురు. పాలు, రొట్టియే వారాహారముగ గైకొనుచుందురు

**256. మచ్చిత్తా మద్గతప్రాణాః బోధయ న్తః పరస్పరమ్ ।**
**కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమ న్తి చ॥ 10–9**

చిత్తము, ప్రాణము భగవంతునియందు లగ్నమై యేకవిధముగ నుం డవలెను భగవత్తత్త్వమునుగూర్చి పరస్పరము బోధించు కొనుచుండ వలెను కలహములకు తావుండరాదు ఎల్లప్పుడు ప్రశాంతముగ నుండి, ఆత్మను గూర్చి చెప్పుకొనుచు నానందించు చుండవలసినదేగాని కపటవృత్తులు, మోసకృత్యములు గల్గియుండరాదు పెద్దలు బోధించిన ధర్మములను దెలియజాలనిచో, ఏకాంతవాసుడై, గొప్పగ్రంథమేదేని తన సన్నిధి నుంచుకొని తదు క్తరీతి ననుష్ఠించు చుండవలెను

257 భగవంతుడు సర్వచరాచరములందును వ్యాపించి యున్నప్పటి కిని నట్టి సర్వస్వరూపము నందఱును నెఱుంగుట కష్టసాధ్యమని యెంచి, భక్తులయెడల కరుణగల్గి, కొన్నినదులు, క్షేత్రములు, వృక్షములు మొదలగువాటిని ముఖ్యముగ దెల్పి, వాటియందు తానున్నానని వచించి యవ్విధమున జనులదృష్టిని భగవదున్ముఖముగ జేయుటకై, తన విభూతియోగమును శ్రీకృష్ణపరమాత్మ గీతయందు దెల్పెను సర్వనదులు

క్రమముగ సముద్రమును జేరునట్లు, సత్కర్మానుష్ఠానముచే మొదట ఈశ్వరకరుణ వడసి, యాపిమ్మట ధ్యానాద్యనుష్ఠానముల ద్వారా ఆత్మసాక్షాత్కారమును బొందగలరు

258 ఎన్నిపను లున్నప్పటికిని, ఎన్నిప్రతిబంధములు గల్గినప్పటికిని, భగవద్ధ్యానము చేసినపిదపనే భుజింపవలెనను దృఢనియమము గలిగి యుండవలెను అపుడు మాత్రమే ప్రకృతి వారికి దారియిచ్చును మఱియు,

**యజ్ఞశిష్టాశినస్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః ।**
**తే త్వఘం భుఞ్జతే పాపా యే పచన్త్యాత్మ కారణాత్.॥**

ఎవరట్లు భగవద్ధ్యానమైన తదుపరి పదార్థమును దేవునకు నివేదించి, అతిథిసత్కారము గావించి, శేషాన్నమును భుజింతురో వారమృతము భుజించినవారే యగుదురనియు, సర్వపాప విముక్తులనియు అట్లు చేయనివారు పాపమునే భుజించినవా రగుదురనియు భగవాను లానతిచ్చిరి

259 జీవాతాత్మపరమా త్మైక్యానుసంధానకాలమే నిజమైన సంధి కాలము (సంధ్యాసమయము).

**260. శనైశ్శనై రుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా**

ధ్యానానుష్ఠానము మున్నగునవి నిత్యము క్రమేణ యభివృద్ధి పఱచు చువచ్చినచో, శుక్లపక్షచంద్రునివలె జ్ఞానమున్ను అభివృద్ధియై తుదకు పూర్ణత్వము సిద్ధించును

**261. కీర్తి శ్శ్రీర్వాక్చనారీణాంస్మృతిర్మేధా ధృతిః క్షమా ।**

అని యివ్విధంబున నేడు దైవికగుణములతో నారీమణులందు తాను విరాజిల్లుదునని, భగవంతుడు చెప్పియున్నాడుగాన, స్త్రీలందఱును ఆపవిత్ర దైవికగుణములు తమయందు గల్గియుండునట్లు చూడవలెను అట్లుగాక తమోగుణమునకు స్థానమిచ్చినచో, ఆవులమందలోనికి పులి దుమికిన, నాయావులన్నియు చెల్లాచెదరైపోయి పులియొకటే మిగులునట్లు, దైవ

గుణము లన్నియు పోయి, ఆసురగుణమగు తమస్సు మాత్రమే నిలుచును

262 సర్వేశ్వరుని సృష్టిలో ఈభూతలముపై మనుజులు దాదాపు 200కోట్లు గలరు కాని ఒకరిరూప మింకొకరికి లేదు ఒకరి గాత్ర మింకొకరికి లేదు అవన్నియు వేఱువేఱుగానే యున్నవి. ఆహా! ఈశ్వరసృష్టి యెంత విచిత్రమైనది! రిజిస్టరీ ఆఫీసులో వ్రేలిముద్రలు వేయించుటచూడ, నొకరిహస్త నిర్మాణ మింకొకరి దానికి సమానముగ లేదనియేగదా స్పష్టమగుచున్నది! ఆకారము లెట్లు సంబంధము గలవిగ లేవో, అట్లే అంతఃకరణములున్ను వేఱువేఱుగానే యున్నవి మతములు, భావములు కూడ భిన్నములై యే యున్నవి కాని అందఱియందును ఆత్మశక్తి ఒకటియే, దాని నెఱింగిన నిక భేదదృష్టి తొలగును ఏకమగు సన్మతమే సమ్మతము. అపు డొకేమనువు యొక్క సంతానమై సర్వులును మెలంగుదురు

263 సోమరితనము లేక నిత్యమేదో యొక పనిచేయుచు, పుణ్య కర్మాదు లాచరించుటచేతనే కుడిచేతికి లోకమున నెంతయో గౌరవము వచ్చి నది ఎడమచేయి సోమరియై, యేకార్యమునను ప్రవర్తింపక యుండుట చేతనే, మలమూత్రాదులు శుద్ధపఱచు పనియే దానికి లభించినది దానికి గౌరవము లేదు ఏ పూజాదు లొనర్చినను, కుడిచేతితో గాని యెడమచేతితో గాదు పవిత్రవస్తువు లొరులనుండి గ్రహించినను దానితోనే ఇంతేకాదు, పూజాది దైవికకార్యములకు, పరవస్తుగ్రహణమునకు నెడమచేయికి శాస్త్రమున నిషేధమున్ను గావింపబడినది చూచితిరా, అకర్మణ్యత్వఫలము! కాన సత్కర్మల నాచరించుచు వచ్చిన, కుడిచేయివలె లోకమున నందరును గౌరవమునే పొందగలరు సమష్టి జ్ఞానమున్ను ఉదయము కాగలదు. అందఱు ఈశ్వరాంశులే యను భావమున్ను ఒదవగలదు

264 విద్యుచ్ఛక్తి సర్వవస్తువులందును వ్యాపించి అనాదికాలము నుండి ప్రపంచమున నుండియున్నను నిటీవల నది కనిపెట్టబడి యంత్రముల ద్వారా బహిర్గత మొనర్పబడినప్పుడే అయ్యది యుపయోగమునకు వచ్చినది అట్లనే సర్వభూతములందును వెలుంగుచున్న ఆత్మను సత్యధర్మా

నుష్ఠానములద్వారా యనుభూతి మొనర్చుకొని, అట్టి ఆత్మతేజమును సర్వులకును వ్యాపింపజేయవలయును. ఇట్లు ప్రతివారియందును అనంతశక్తి యుండి యున్నను, తగుసాధనలచే దానిని వ్యక్తీకరింపక పోయినందుచేతనే, అది యుపయోగమునకు రాకయున్నది

265 పూర్వము నదీప్రవాహమంతయు వ్యర్థముగ సముద్రములోనికి బోవుచుండెడిది కాని యిపుడు అచ్చటచ్చట ఆనకట్టలు కట్టి జలమును నిరోధించి, కాలువలద్వారా దానిని పొలములకు పంపి పూర్వము నిరుపయోగముగానున్న ప్రదేశము లన్నిటిని, సుక్షేత్రములుగ, డెల్టాలుగ మార్చివైచి సస్యవృద్ధి కనుకూలత నేర్పఱచుచున్నారు అట్లనే ఆత్మశక్తి సర్వజీవులందును ప్రకాశమునకు రాక వ్యర్థమగుచున్నది దానిని గురూపదేశ, శ్రవణ, మననాదుల ద్వారా బహిర్గత మొనర్చిననే తమకును, ఇతరులకునుకూడ నుపయోగపడును

266 ఒక వృక్షమునుండి రాలిన విత్తనములలో కొన్ని రాతిపై పడును కొన్ని ఆకులపైనను, తృణములపైనను పడును మఱికొన్ని నేల పైబడును రాతిపై బడినవి యెన్నాళ్ళకైనను మొలవవు అవి వ్యర్థమైపోవును ఆ కులపై తృణములపై పడినవి, గాలి బాగుగ వీచునపుడు క్రిందపడి మొల కెత్తును నేలపైబడినవి వెంటనే యంకురించును అట్లే ఒక గురువు అనేక శిష్యుల కుపదేశించినను, వైరాగ్యరహితులగు కఠిన చిత్తులగు కొందఱికది ఫలితమును గలుగజేయకయు, మందవైరాగ్యముగల ముముక్షువులకు క్రమ ముగ ఫలితమును గలుగజేయుచు, తీవ్రవైరాగ్యపరులకు సద్యఃకాలముననే గొప్పరిణామము గల్గించుచునుండును

267 పంచతన్మాత్రలను పంజరమున(బోనునందు) జీవుడను సింహము బంధింపబడియున్నాడు 'పంజరాదివ కేసరీ' యనునట్లు జీవుడు తన విజ్ఞానబలముచే నద్దానిని భేదించి వినిర్గతుడు కావలసియున్నాడు. అపుడే యాతడు పంచభూత విలక్షణుడైన పరమాత్మను వీక్షింపగల్గును పరమాత్మ యెచట గలడను ప్రశ్నకు సమాధానము చెప్పెద. ఇందులకొక కథగలదు

268 పూర్వమొక ధార్మికుడగు రాజుండెను ఆతని యాస్థానమున గొప్ప శాస్త్రవేత్తయగు పండితుడొకడుండెను ఒకనాడు రాజు పండితుని బిలిచి దేవుడెచట నున్నాడు? ఏ వైపు ముఖము త్రిప్పియున్నాడు? ఏమి చేయుచున్నాడు అను మూడుప్రశ్నలడుగగా వాడు తగు ప్రత్యుత్తర మియ్యకపోగా వారము దినముల కివ్వనిచో అతని నాస్థానమునుండి తొలగించెదనని రాజు వచించెను పాపమాపండితుడు శాస్త్రవేత్తయేగాని, అనుభవ జ్ఞానము కలవాడుగాడు అందుచే నా ప్రశ్నలకు తగు సమాధానము వాని కేమియు తోచలేదు. ఇకగ్రంథములను తిరగవేయుట ప్రారంభించి నాడు కాని వాని యందును సరియైన ప్రత్యుత్తరము వానికి గోచరించలేదు. అపుడు ఖిన్నచిత్తు డాయెను వదనము నిర్విణ్ణమైనది పదచ్యుతి యగును గదా యను భీతి యొకప్రక్క, తన శాస్త్రపాండిత్యము వ్యర్థమయ్యె గదా యను వ్యాకులత మఱియొక ప్రక్క వానిని వేధించుచుండెను

ఆతని గృహమున నొక సేవకు డుండెను. ఆతడు పరమభక్తుడు, తన యజమాని విషణ్ణవదనుడై యుండుట గాంచి, కారణమరయ, నా భూసురు డంతయు వచించెను అపుడాభృత్యుడు ఇంతియేగదా, ఈ స్వల్పభాగ్యము నకు మీరుకూడ పోవలెనా? మీరింటనే యుండుడు నేనే పోయి తగురీతి సమాధానము చెప్పి వచ్చెదనని రాజసభకు పయనమయ్యెను సకాలమున రాజ భవనమంతయు ప్రేక్షకులతోడను, విద్వాంసులతోను, సామంతుల తోడను క్రిక్కిఱిసిపోయెను. దేవుడెచట నున్నాడను ప్రశ్నకు సమాధానము వినుటకై దూరదూర ప్రదేశముల నుండియు అనేకులు వచ్చి చేరిరి నిర్ణీతకాలము సమీపించెను. కాని యింకను పండితుడు రాలేదు.

రాజు వానికై పంపనుద్దేశించుచుండ నింతలో నాభృత్యుడు లేచి తన యంత గొప్ప శాస్త్రవేత్తనంత చిన్నప్రశ్న లడిగితిరే యని సిగ్గుపడి యాతం డీసభకు రాలేదు వాటికి సమాధానమీయ నన్నే పంపెననెను. అట్లనే తాను చెప్పవచ్చునని రాజు వాని నాజ్ఞాపింప నంత నాతడు లేచి సభాసదులారా! నృపోత్తమా! లోకములో నొక న్యాయము గలదు అదేమన చెప్పువాడు

పైనను వినువాడు క్రిందను నుండవలెను యథార్థగురుశిష్య ధర్మమట్లనే యుండును. కాన నేను సింహాసనముపై గూర్చుండవలెను మీరు క్రిందకు దిగవలెననెను. రాజా విస్మితుడై, ఏమి చేయుటకును తోపక, మంత్రులతో నాలోచింప, వారట్లు దిగుటయే న్యాయమనిరి. అంత భూపాలుడు భృత్య స్థానమును, భృత్యుడు భూపాలస్థానమును నాక్రమించిరి

ప్రశ్నలకు సమాధాన మివ్వబోవుచు నాభృత్యులండిట్లనియె 'రాజా! ఇయ్యది అతిపవిత్రమగు సమయము. దేవాతార్చన, విఘ్నేశ్వరపూజ కాకుండ ప్రారంభించుట మంచిదికాదు. కాన అందులకై పూజాద్రవ్యము లను, ఒక గిన్నెలో క్షీరమును, బంగారపు చిమ్నీ పైనమర్చిన దీపమును, వెంటనే తెప్పించవలె ననెను అట్లనే యవి తీసికొనిరాబడెను అపుడాభృత్యు డాక్షీరకలశమును చేతదీసికొని, సభాసదు లందఱకును జూపి, మిత్రులారా! ఈక్షీరమందు నేయి యెచటగలదు? అనెను అంతవారు అంతటనునున్న దనిరి, అపుడా భృత్యుడు-అట్లనే సర్వేశ్వరుడు చరాచరప్రాణికోట్ల యందంతటను వ్యాపించియున్నాడు భక్తిధ్యానాదులచే మీరు మీ యంతఃకరణములను తెలివనందుచే నాతడు కన్పింపకపోయెననెను

పిదప నాదీపపు చిమ్నిని జూపి - ఈ దీప మేవముఖముగల్గి ప్రకాశించుచున్నదో వచించుడనెను. అన్నివైపుల ప్రకాశించుచున్నదని వారనిరి అంత నాతడు అట్లనే, సర్వవ్యాపకుడగు భగవంతుడు సహస్ర శీర్షా పురుషః అన్నట్లు ఒక దిక్కు అని లేక, సర్వదిక్కుల వీక్షించుచు సర్వతోము ఖుడై యున్నాడని వచించెను

ఇక మూడవప్రశ్నయగు దేవుడేమి చేయు చున్నాడను ప్రశ్నకు సమాధాన మొసంగుచు దేవుడేమిచేయుచున్నాడో యిపుడే ప్రత్యక్షముగ ఋజువైనది చూచితిరా, భూపాలుని గోపాలునిగను, గోపాలుని భూపాలునిగను చేసివైచెను అభిమానము, గర్వము గల్గి విఱ్ఱవీగువారిని క్రిందకు పడద్రోయుటయు, నిరభిమానులైన వారిని పైకి లేవదీయుటయు ఇట్టి యఘటనఘటనా ప్రదర్శనమే దేవుడొనర్చు పని అని యెలుగెత్తి చెప్పెను

సభ్యులందఱు నిశ్చేష్టులైరి రాజు తగిన గురువు దొరకెగదా యని లోలోన సంతసించెను



# 11వ రోజు 7-4-1940

269 ఉపరతియొక్క శబ్దార్థము ఉప-సమీపే, రతిః - రమణమ్, క్రీడనమ్- సమీపమున క్రీడించుట, అనగా ఆత్మను సమీపించి శాంతి నొందుట యని అర్థము ఉపవాస శబ్దమునకు నిదియే అర్థము సమీపమున వసించుట అనగా విషయాదులందు ప్రవర్తించు మనస్సు నటనుండి త్రిప్పి ఆత్మయందుంచుట యని అర్థము ఉపరతివలన వృత్తులు నశించి స్థిరమైన ప్రజ్ఞ కలుగును ఆహారమును విసర్జించుట యనునది ఉపవాసముయొక్క బాహ్యరూపము అది ప్రథమ సాధనము అది స్థూలదేహమున కారోగ్యము కలుగజేయును జఠరాగ్ని శాంతినొందుటకు మాత్రమే ఆహారమును గైకొనవలెను అజీర్తిగానుండిన, ఉపవసించినచో మఱునాడు శరీరము చాల తేలికగా నుండును అపు డేరోగమున్ను ఉండదు యాత్రచేయువారికేక భుక్తము చాలమంచిది

270 సత్యము మాట్లాడుట యనునది సత్యముయొక్క బాహ్య రూపము. సత్స్వరూపమగు ఆత్మయందు నిలుకడ నొందుట యనునది సత్యముయొక్క ఆంతరరూపము మొదటిది పుష్పమువంటిది, రెండవది ఫలమువంటిది పుష్పము లేనిదే ఫలముద్భవించదు, కాన ప్రథమ సత్యమున్ను అవసరమే

**271. నిర్వికల్పా చ చిన్మాత్రా వృత్తిః ప్రజ్ఞేతి కథ్యతే ।**
**సా సర్వదా భవేద్యస్య స జీవన్ముక్త ఇష్యతే.॥**

ఏసంకల్పమున్ను లేక, చిన్మాత్రస్వరూపుడే యగుచు, సర్వావ

స్థలందును అట్టి యేకత్వానుభవమే గల్గి త్రిగుణములున్ను లేని సద్వస్తువే యునికిగ గలవాడే జీవన్ముక్తుడు. అనగా దేహేంద్రియాది వృత్తులు తోచని యునికి (సత్) గలవాడు రజోగుణము గలవారి మనస్సు దృశ్య ప్రపంచము లోనికి బోవును సత్త్వగుణము గలవారి మనస్సు అంతర్ముఖమై ఆత్మవైపు నకు జనును. ఈ గుర్తుల నెఱింగి ధ్యానము చేయవలెను

272. విశ్వరూపసందర్శన మనగా ప్రపంచమంతయు బ్రహ్మాకార ముగా తోచుటయే. వృక్షము బీజమునుండియే యావిర్భవించినది. కాన దానికన్యము గానట్లు ఈ జగత్తున్ను బ్రహ్మమున కన్యము గాదు

273 ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి యను మూడుశక్తులు పరమేశ్వ రునియందు గలవు అందిచ్ఛాశక్తి భక్తులందును, క్రియాశక్తి గృహస్థులం దును, జ్ఞానశక్తి బ్రహ్మనిష్ఠులందును నదికముగ నుండుచుండును

**274. నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా।**
**శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా॥**

**భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున।**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప॥**

వేదము లన్నిటిని సంపూర్ణముగ చదివినను, కఠిన తపశ్చర్యలు గావించి నను, దానములు చేసినను, యజ్ఞయాగాదు లొనర్చినను, నేను కన్పించు వాడను కాను, అనన్యభక్తి యొక్క దానిచేతనే నన్ను పొందుటకును, దర్శించు (యెఱుంగు)టకును సాధ్యమగునని భగవంతుడు భక్తులపై కరుణించి పలికియున్నాడు కాన అనన్యభక్తియే ఆత్మసాక్షాత్కారమునకు ముఖ్యసాధన మగును అయితే ఈశ్వరుడు తనకొసంగిన పదార్థమును సత్కార్యములకు శక్తి కొలది వినియోగించుట మంచిది అట్లుగానిచో, ఒకవేళ ఈ జన్మయందు తరించినచో మరల దారిద్ర్యముతో గూడిన జన్మయే రావచ్చును. అపుడు ఆహారాదులకై పరితపించవలసివచ్చును

**275. మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సఙ్గవర్జితః ।**

**నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాణ్డవ! ॥**

మత్కర్మకృత్= అనగా భగవత్ప్రీతికరములైన కార్యములను జేయువాడు, లేక భగవదాజ్ఞానుసారము వర్తించువాడు, మత్పరమః= భగవంతుడే పరమ ప్రాప్యమని తలంచువాడు, మద్భక్తః= భగవంతుడు తప్ప నితరమెద్దియు లేదను విశ్వాసము గలవాడు సఙ్గవర్జితః= ఆసక్తిని విడచినాడు, నిర్వై రస్సర్వభూతేషు= ఏ ప్రాణియెడను వైరము లేక యుండి సర్వజీవులను ప్రేమతో జూచువాడు భగవంతుని తప్పక పొందగలడు

276. జీవుడు తానాచరింపవలసిన ధర్మమును గూర్చి శ్రీయోగవాసిష్ఠమున నొకశ్లోకము చెప్పబడినది దాని నెఱింగి తదనురీతి నాచరించిన నిక జీవునకు పతన మెన్నటికిని కలుగదు అదేదన,

**అత్రాహారార్థం కర్మ కుర్యాదనిన్ద్యం కుర్యాదాహారం ప్రాణసంరక్షణార్థమ్।**
**ప్రాణా స్సంధార్యా స్తత్త్వసంపాదనార్థంతత్త్వం సంపాద్య యేన భూయో న జన్మ॥**

ఆహారముకొఱకై ధర్మవిరుద్ధముగాని కర్మను చేయవలెను దేహసంరక్షణ కొఱకు మాత్రము ఆహారమును భుజించవలెను ఆత్మతత్త్వసంపాదనకొఱకే దేహరక్షణమును గావింపవలెను తత్త్వసంపాద నము జన్మరాహిత్యముకొఱకే యగును కాన పరులను పీడింపక ఈశ్వరప్రీతికరమగు కార్యమునే ధర్మపూర్వకముగ నాచరింపవలెను తినుటకు జీవించువాడు బద్ధుడు జీవించుటకు తినువాడు ముక్తుడు

277 ఆదిశేషునిపై విష్ణువు పరుండునట్లు శ్రీబుద్ధదేవుడు అంత్యకాలమున యోగనిద్రయందు పరుండి యుండగా దేహము వీడునేమో యని తలంచి భయపడి కొందఱు శిష్యులు చింతాక్రాంతులై యుండిరి. ఆసంగతి బుద్ధదేవుడు గ్రహించి వారలతో నిట్లనెను పంజరమున నున్న పక్షి బంధనమున నుండుట కియ్యకొనక స్వేచ్ఛగ విహరింపనుంకించుచుండును. అట్లనే నేను పరిచ్ఛిన్నమైన శరీరమను పంజరమును విడిచి, స్వేచ్ఛగా విహరించుటకై విశాలమగు పరనిర్వాణరూపమైన చిదాకాశమునే బొందు

చుండ నిక, దుఃఖింపనేల? సుధారసము బోలు నావాక్యములను వినుట తోడనే వారలు దుఃఖ ముపశమింప శాంతచిత్తులై, కర్తవ్యమునకు గడంగిరి

278. అట్లు బుద్ధదేవుడు యోగనిద్రయందుండెనని, తదితరులున్ను పరుండి ధ్యానించుట కుపక్రమింప వలదు అభ్యాసులు పరుండి యోగము చేయ ప్రారంభించినచో నిద్ర వచ్చును అపుడు తపస్సు పోయి తమస్సు మిగులును కాన సాధకు లీవిషయమును కడు జాగ్రత్తతో జూచుచు కూర్చుండియే ధ్యానమును శీలించు చుండవలెను

279 నిర్హేతుకముగ నొకనిని ద్వేషించిన, తన పుణ్యము వానికి బోయి, వాని పాపము తనయందు వచ్చి చేరును కాన ఏ ప్రాణియెడ వైరములేక యుండవలెను అపుడే 'నిర్వైరస్సర్వభూతేషు'- అను భగవద్వాక్యము చరితార్థ మగును

280 అవిద్యా, క్లేశ, కర్మాదులచే బాధింపబడనివాడు ఈశ్వరుడు బాధింపబడువాడును, జాతికర్మాది భేదములచే జట్టబడియుండువాడును జీవుడు ఈశ్వరుడు త్రికాలాబాధ్యుడగుట వలన త్రిమూర్తులకున్ను గురువు. ఆతడే యాదిగురువు తస్య వాచకః ప్రణవః– ఆతని నామధేయము ఓంకారము.

281 అణుస్వరూపుడగు జీవుడు విభుస్వరూపుడగు ఈశ్వరుడెట్లగు నను విషయము విచారింపదగియున్నది అణురూపుడైన జీవుడు విభురూపు డగుట చాల కష్టతరము కాని అయ్యది అసాధ్యము కాదు. పూర్వము విశ్వామిత్ర వసిష్ఠాదులట్టి విభుస్వరూపమును ప్రయత్నముచే పొందగల్గిరి ఒక భూతద్దముపై అనేకసూర్యకిరణములు పడ, అన్నియు కేంద్రీకృతమై ఏకాకారము నొంద అగ్ని ప్రజ్వరిల్లి తృణాదులను భస్మము చేయగల్గును. అట్లే తపోధ్యానాది యత్నములచే తమయందున్న ఆత్మశక్తిని ప్రజ్వలింపజేసికొనిన, అంతఃకరణోపాధి విధ్వంసమై, జీవు డపరిచ్ఛిన్నత్వ మొంది విభురూపు డగును కాని అట్టి ప్రయత్నాతిశయము మనలో లేనందుచే మనమట్టి విభుత్వ

మొందజాలకున్నాము కావునఎంతో కాలము కష్టపడి ప్రయత్నించిననే ఆ ఋష్యాదులు పొందిన విభుశక్తిని మనమున్ను పొందగలము

సూక్ష్మముగా నున్న జ్ఞానాగ్ని కణమును సాధనలను నింధనములచే ప్రజ్వలింపజేసి అనంత జ్ఞానాకారమగు మహాగ్నిగా నొనర్చవలెను ఈ సందర్భమున వేదాంత శాస్త్రమునందు పేర్కొనబడిన ఆరంభ, పరిణామ, వివర్తములను మూడు వాదములను గూర్చి యొకింత విచారింపవలసి యున్నది ఆరంభ పరిణామములు ద్వైత విశిష్టాద్వైతములకును, వివర్త మద్వైతమునకు జెందినది అనేక తంతువులుజేరి వస్త్రరూప మగుచున్నవి వస్త్రము తంతురూపమేగాని యన్యము కాదు అట్టి సమష్టి జీవసమూహ మీశ్వరుడు వ్యష్టిరూపుడు జీవుడు, వస్త్రము తంతురూపమే యగునట్లు, జీవేశ్వరులకున్ను యధార్థముగ భేదము లేదు ఇది యారంభవాదము

కారణరూపమగు వృక్షమునుండి కార్యరూపమగు బీజమేర్పడుచున్నది అట్లే కారణరూపమైన మహాశక్తియందు గల్గిన జీవుడు పరిణామావస్థ బెందెనే గాని వాస్తవముగ జీవుడు కాలాతీతమగు వస్తువే నాశరహితుడే యధార్థదృష్టి విచారించిన ఆనాశరహితస్థితి వానికి స్వతస్సిద్ధమే యగును ఇది పరిణామ వాదము

ఇక వివర్తవాదమనగా కారణమున నధ్యవసింపబడిన కార్య మేకాల మందును సత్యము కాదనియు, అది కల్పితమే యనియు, అధ్యాసవస్తు వధిష్ఠానమున కన్యము గాదనియు నగును ఇందులకు రజ్జుసర్పభ్రాంతియే దృష్టాంతము అధ్యస్తమగు సర్పము యధార్థముగ లేనే లేదు అధిష్ఠానమగు రజ్జువే తద్రూపమున కల్పితమైనది అట్లే యధార్థదృష్టిలో పరబ్రహ్మ మొకటియే కలదు గాని రెండవది లేనే లేదు ఆకాశమందలి నీలత్వభ్రాంతి స్థాణు పురుషభ్రాంతి విచారించినను ఈ సత్యమే తేలగలదు కాన పరమార్థ దృష్టియందు జీవేశ్వరులకు భేదమే లేదని స్పష్టమైనది అమనస్కమే వివర్తవాద రహస్యము అదియే ప్రకృతిరహితస్థితి యోగశాస్త్రముయొక్క చరమా వస్థయు నదియే ఉప్పు నీటగలియురితి మనస్సు పరమాత్మయం దైక్య

మగుటయే యోగశాస్త్ర సిద్ధాంతము

మఱ్ఱిబీజము నొక బరిణలో నుంచిన నెంతకాలమునకైనను అకుం రించదు భూమిలోపెట్టిన క్రమముగ మొలకెత్తును. కాని అది సున్నపు భూమియైనచో అచ్చటను అంకురింపదు అట్లే జ్ఞానబీజమును, రాగ్వేషాదు లను సున్నము, చవుడు కలువని పవిత్ర హృదయ క్షేత్రమున నాటిననే యభివృద్ధి గాంచును కాన మనస్సు శుద్ధముగా నుండవలెను అశుద్ధమైన పాపాహారమును సేవించరాదు శుద్ధమై న్యాయార్జితమైన సాత్త్వికాహారమునే సేవించవలెను మఱియు ఆవృక్షమునకు ఉప్పునీరు పోసినచో అది వృద్ధిగాంచనట్లు, విషయా దులతో గూడిన మలిన మనస్సు గల్గియున్నచో చైతన్యము వికసింపదు

వృక్షము బాగుగ వృద్ధినొందుటకు సూర్యప్రకాశ మావశ్యక మైనట్లు ఈశ్వరచింతనయు జ్ఞానాంకురాభివృద్ధికి చాల సహాయభూత మగును ఉదయమునుండి సాయంత్రము వఱకును వాయువు ఎండయు తగులుచున్న వృక్షమే బాగుగ పెరుగునట్లు, నిరంతరము ధ్యాన నిష్ఠగలవారికే యోగాభి వృద్ధి శీఘ్రముగ నగును మనస్సునందు ప్రశాంతి, భూతదయ గల్గి యుండినచో దైవత్వము వర్ధిల్లును ఆకాశము అవయవరహితమై, సర్వత్ర వ్యాపించి, దేని నంటక, శుద్ధమైయుండునట్లు చిత్తమున్ను అట్టి శుద్ధత్వ మును, వ్యాపకత్వమును పొందవలెను జీవుడు తనలో వెలుంగు పరిపూర్ణాత్మయందు స్థితి గల్గియుండుటయే అమనస్కముగాని జడమగు స్థితియందుండుట కాదు ఇవ్విధమున పంచభూతములచే వృక్షమభివృద్ధి యగునట్లు, అణుస్వరూపుడైన జీవుడు పంచశీలాదులచే విభుస్వరూపుడగు ఈశ్వర (ఆత్మ)స్థితి నొందవలసియుండును ప్రయత్న వేగముచే శీఘ్రము గాను, ప్రయత్న శైథిల్యముచే మెల్లగాను జీవుడట్టిస్థితి నొందుచుండును కాని యాస్థితిని సర్వజీవులున్ను పొందవచ్చును

**282. సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః।**
**నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్॥**

ప్రకృతి సంభవములగు త్రిగుణములం దభిమానము గల్గి యున్నంత వఱకు జీవుడు బద్ధుడే గాని బంధరహితుడు కాడు

**గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మమృత్యు జరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే ॥**

త్రిగుణముల నతిక్రమించువాడే జన్మమృత్యురహితుడై, అతీతుడై, అమృతత్వము నొందగల్గును

283 మంత్రమును గురుముఖతః తెలిసికొనుటయే మంచిది ముఖ్యముగ అగ్నిబీజము మున్నగు వానిని గురువులవలననే తెలిసికొనవలెనని ఋషుల యాశయము

284 జ్ఞానయోగులకుగూడ కుంభకము చాల ఉపయోగకరమై యుండును ప్రాణాయామమువలన సర్వసిద్ధి చేకూరును కేవలకుంభక మభ్యసించు వారికి కాలనియమము లేదు సర్వదా యభ్యసించుచుండ వచ్చును భ్రూమధ్యయందు లక్ష్యము నిలిపి ప్రాణాయామము చేయువారికి యోగము త్వరలో సిద్ధించును (పెదవులను పక్షిముక్కులవలె చేసి, దంతముల మధ్య నాలుకను జేర్చి వాయువును పీల్చిన చల్లగ నుండును దానిని కొంత సేపు లోపల నిలిపి మఱల నాసికారంధ్రములద్వారా మెల్లగా విడువవలెను దాహముగలవారు దీనినభ్యసించినచో దాహము తీరును ) సర్పముః వాయువును భక్షించును కావుననే చిరకాలజీవితము గల్గి యుండును అట్లే, ఏకాంతముగా నుండి శుద్ధవాయువు సేవించుచుండిన శరీర మారోగ్యవంతముగ నుండి ధ్యానమున కుపకరించును వృక్షము లుండు తావు ధ్యాన మునకు చాల మంచిది ఆశ్రమములలో తులసి, బిల్వము (మారేడు) తప్పక యుండవలెను ఆరెండును పవిత్రములును పూజార్హములునునై యున్నవి వాటి వాయువు సోకిన దుష్టక్రిములు నశించును ఆరోగ్యమున కనుకూల మొనర్చునది గనుకనే తులసిని దైవముగ నెంచి పూజింతురు ముఖ్యముగ ధ్యానయోగము గలవారలద్దాని వాయువును

సేవించుచుండినచో వారి ధ్యానాదులు వృద్ధి యగుచుండును దాని వాయువును శరీరమంతటను వ్యాపింపజేసికొనిన, అమృతపానము జేసినవారివలె నగుదురు మూడు మాసములట్లు శీలించిన, వాతపిత్తాది దోషము లన్నియు హరించును. శరీరము తేజోమయముగ నుండును.

285 ఆత్మధ్యానముచే మోక్షము సిద్ధించును. యజ్ఞాదులచే దేవలోకము సిద్ధించును. తపస్సుచే బ్రహ్మలోకము ప్రాప్తించును. ఆత్మజ్ఞానముచే అజ్ఞానము నశించును దానివలన రాగాదులు సంక్షయించును దానిచే మోక్షము సిద్ధించును అపుడు మరల జన్మ లేకుండును

286 కృతత్రేతాయుగములలో జనులు ప్రాణాయామాది తపస్సుల చేతను, యోగముచేతను, ద్వాపరయుగమున యజ్ఞార్చనలచేతను, (కలౌ తు కేవలా భక్తిః – యన్నట్లు) కలియుగమున కేవలము భక్తి సంకీర్తనాదుల చేతను, దానాదులచేతను, బ్రహ్మసాయుజ్యము నొందగల రని శాస్త్రమందు చెప్పబడినది జనులకు రానురాను దేహబలము క్షీణించుచు వచ్చు చుండుటచేతనే వారట్టి పద్ధతి యేర్పఱచుటకు కారణమైనది



## 12వ రోజు 8-4-1940

287 పరుండబోవునపుడు భగవద్ధ్యానముచేసి పరుండిన, అనగా దైవమును లక్ష్యమందుంచుకొని పరుండిన అనిద్ర నిష్ఠగా మారును

288 అవిద్య, అజ్ఞానము నశించినచో జీవునకు తనయందే ఆత్మప్రకాశము గల్గును జ్ఞానాజ్ఞానదశలు శుక్లపక్ష కృష్ణపక్షములవంటి వనియు, ఉత్తరాయణ, దక్షిణాయనముల వంటివనియు నెఱుంగవలెను. ఎంతయెంత జ్ఞానమభివృద్ధి యగుచుండునో, అంతయంత అజ్ఞానము సన్నగిలు చుండును. ఎంతకెంతకు ఆత్మను సమీపించుచుండునో అంతకంతకు అవిద్య, మాయలకు దూరమగుచుండును (ఎంతకెంతకు ఉత్తర

దిశకేగుచుండునో, అంతకంతకు దక్షిణమునకు దూరమగుచుండును. ఎంతకెంతకు శుక్లపక్షచంద్రుడు వృద్ధి యగుచుండునో, అంతకంతకు కృష్ణపక్షతమస్సు తగ్గుచునే యుండును) ఇదే ఆత్మోన్నతికి గుఱుతు

289 దేహాభిమానమును విడుచుటయే ముక్తికి ప్రధానహేతు వగును ఇందులకొక కథగలదు ఒక రాజునకొక గురువుండెను ఆ రాజు అప్పుడపుడు తనగురువువద్దకు బోధకై చనుచుండువాడు ఒకనా డాగురువు రాజును బిలిచి ప్రపంచములో నెందుకును పనికిరాని వస్తువేదియో వెతకి తీసికొనరమ్మని చెప్పెను అట్లనేయని ఆ రాజు బయలుదేఱెను ఊరూర, పల్లెపల్లెయందు వెతకుట ప్రారంభించి, కనుపించిన వస్తువు లన్నిటిని పరిశోధించుచు, వాటి నిరుపయోగతను గూర్చి విచారించుచు బోవుచుండెను కాని ఏవస్తువును జూచినను అది దేనికో యొకదానికి ఉపయోగపడుచునే యుండెను

ఇంతలో నొక గ్రామ సమీపమున, ఆగ్రామస్థు డొకడు క్రిందటి దినము దైవప్రసాదమును భుజించి మఱునాడు విసర్జించిన మలమును గాంచి, యది కేవలము నిరుపయోగమని యెంచి, దాని నెత్తుకొనుచుండ నందుండి యీశబ్దము వినవచ్చెను 'ఏ శరీరమను భాండమున నొక్కరాత్రికాలముండు నంతలోనే క్రిందటి దినమెంతో పవిత్రముగ నెన్నబడినట్టి నేను ఇపుడు సమీపించిన రోత గల్గించునట్టి యిట్టి యశుచిపదార్థముగ మారితినో! ఇక నా శరీరమెంత యశుచి యైనదో!' ఆవాక్యములను విని, రాజు దానిని వదలివేసి, గురువును సమీపించి అన్నిటికంటెను అశుచియగు వస్తువు శరీరమేయనియు, దానియందు నిరంతర మభిమానము గలిగియుండు మనుజుని చిత్తమెంత అశుచియైనదో యనియు తెలిపెను అపుడు గురువు అట్టి అశుచిరూపమగు చిత్తమును విడనాడి, మలభాండరూపమగు దేహమందభిమానమును విడిచి యుండు మనిచెప్పి, నాటికదియే ఉపదేశమని వచించి పంపివేసెను కనుకనే శ్రుతులందును నిట్లు చెప్పబడినది

**అమేధ్యపూర్ణం క్రిమిజాలసంకులం స్వభావదుర్గంధమశౌచమధ్రువమ్ ।**

**కళేబరం మూత్రపురీషభాజనం రమ న్తి మూఢా న రమన్తి పణ్డితాః॥**
**(మైత్రేయ్యుపనిషత్.)**

శరీరము మలయుక్తమై, క్రిమికీటసహితమై, దుర్గంధయుతమై, అపవిత్రమై, అనిత్యమై, మూత్రపురీషములు గల్గి, అత్యంతహీనమై యున్నందున విజ్ఞులు దానియందు ప్రీతి గల్గియుండరు అజ్ఞానులే యందు రమింతురు మఱియు అష్టావక్ర గీతయందిట్లు ఉపదేశింపబడెను

**దేహాభిమానపాశేన చిరం బద్ధోఽసి పుత్రక!**
**బోధోఽహం జ్ఞానఖడ్గేన తన్నికృత్య సుఖీభవ ।**

అష్టావక్రుడు జనకునకిట్లు బోధించెను– దేహాభిమానమను పాశముచే చిరకాలమునుండి నీవు బంధింపబడియున్నావు. నేను బోధరూపుడగు నాత్మనను జ్ఞానఖడ్గముచే నాపాశమును తెగద్రుంచి సుఖివి కమ్ము

290 గీతయందలి భక్తి యోగప్రారంభముననే అర్జునుడు కృష్ణ పరమాత్మను సాకార నిరాకారార్చనలం గూర్చి ప్రశ్నించినాడు ఇంద్రియాతీత మగు పరమాత్మను ధ్యానించువారు శ్రేష్ఠులా? లేక మూర్తి పూజ, మొదలగు సాకారార్చన గలవారు శ్రేష్ఠులా? యని అడిగెను అందులకు భగవానుడు ఎవరు భగవంతునియందు చిత్తమర్పించి, శ్రద్ధాభక్తులు గలవారై యుపాసింతురో వారెవరైనను, ఏ పూజ యొనర్చుచున్నను శ్రేష్ఠులేయని ప్రత్యుత్తర మిచ్చెను సర్వేంద్రియ నిగ్రహము సర్వజీవహితము గలవాడు నిర్వికారోపాసన కర్హుడు మఱియు ఈ దేహము నేను కాను, ఆ సద్వస్తువే నేనను దృఢ నిశ్చయము గలవాడే అట్టి యుపాసన కర్హుడగును ఈశ్వరార్పణ బుద్ధితో సత్కర్మల జేయువారు, పూజాదు లొనర్చువారు, క్రమముగ నంతఃకరణ శుద్ధిగలవారై, జ్ఞానమునొంది తద్ద్వారా ముక్తిని బడయుదురు

291 గీత 12వ అధ్యాయమగు భక్తియోగమున భక్తులు వారివారి సంస్కారానుగుణముగ ఆయా ధ్యానపద్ధతి నవలంబించుట కనువగునట్లు అనేకపద్ధతులను నుడివియున్నారు ప్రారంభమున జ్ఞానమార్గము సూచింప

బడెను ''నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః'' అనునట్లు భగవంతునియందే చిత్తమును సంలగ్నమొనర్చి, సర్వేంద్రియములను నిగ్రహించి ధ్యానించువాడు తద్రూపమునే పొంది, భగవదైక్యమును బడ యగల్గును అట్లు చిత్తమును నిలుపలేనివారికి ప్రాణాయామాది అభ్యాస యోగములు వచింపబడెను అవిన్ని సాధ్యము కానిచో సత్కర్మలను, జప, ప్రార్థనా, ధ్యానాదులను గావింపుమని భగవంతుడు నుడివెను ఇది భక్తిమార్గ మునకు జెందినది తుదకు ఏమియు సాధ్యము కానిచో సర్వకర్మఫల త్యాగమును లేక నిష్కామకర్మమును ప్రయత్నపూర్వకముగ నాచరింపుమని చెప్పెను ఇట్లు జ్ఞాన, యోగ, భక్తి, కర్మమార్గముల నాల్గింటిని భగవాను డుప దేశించెను. ఒక రైలు నందు ఫస్టుక్లాసు, సెకండుక్లాసు, ఇన్టర్‌క్లాసు, థర్డ్‌క్లాసులను నాల్గు తరగతుల పెట్టెలుండును ఏ పెట్టెలో నెక్కినను అందఱు నొకేకాలమునకు గమ్యస్థానమును చేరునట్లు, పైనదెల్పినవానిలో నెవరే మార్గమును జేపట్టినను తుదకందఱును నొకేతూరి మోక్షమును పొంద గల్గుదురు మఱియు నిందొక విశేషము గలదు సామాన్యముగా ఫస్టుక్లాసు పెట్టెలో నెవరో ఒకరిద్దఱే యెక్కుదురు. థర్డ్‌క్లాసులో వందలకొలది జను లెక్కుదురు అట్లే నిరాకారోపాసన ననుసరించువారు చాల యరుదుగాను, కర్మమార్గమును ద్రొక్కువారు విశేషముగా నుందురు

**292. శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే।**
**ధ్యానాత్కర్మఫలత్యాగస్త్యాగాచ్ఛాన్తి రనన్తరమ్॥**

అనగా అభ్యాసముకంటె జ్ఞానము మేలు జ్ఞానము కంటె ధ్యానము మేలు, ధ్యానముకంటె కర్మఫలత్యాగము మేలు కర్మఫలత్యాగముచే శాంతి చేకూరును గాంధిగా రీశ్లోకమును ముఖ్యముగ దెల్పుచుందురు జ్ఞాన, ధ్యానాదుల ననుష్ఠించుటకు సామాన్యులకు శక్తి చాలదని తెలిసికొని నిష్కామ కర్మయోగము శ్రేష్ఠమని గాంధీజీ బోధించిరి ఇక సర్వులకును నుండవలసిన గుణములగు అద్వేష్టృత్వాదులను మఱల నా యధ్యాయముననే పేర్కొనిరి సర్వభూతముల యెడ దయగల్గియుండుట, ఏ ప్రాణిని ద్వేషించకుండుట,

మైత్రి, కరుణ గల్గియుండుట, మమత్వాహంకారములు లేకయ్యుండుట, కోపమును వర్జించుట, సుఖదుఃఖములను సమముగా జూచుట, (రాత్రిం బగళ్ల వలె సుఖదుఃఖములున్ను, నెపుడును కలుగుచునే యుండునని తలంచి వాటి నోర్చుకొనుట,) ఎంతగాలి వీచినను గుండురాయి చలింపనట్లు ఎన్ని కష్టములు, హర్షామర్షములు సంప్రాప్తించినను చలింపక స్థితప్రజ్ఞుడై యుండుట, దూషణభూషణములను సహించుకొనుట, ఎల్లప్పుడు సంతుష్టి గల్గియుండుట- ఈమున్నగు గుణములను ముఖ్యముగ గల్గియుండవలెనని యందు వచింపబడినది ఉపనిషదాదులు పఠించుట చాలకష్టమని తలచి, వాటి సారమంతయు గీతయం దివ్విధమున భగవానులు బోధించిరి

293 ప్రణవమును జపించుటచే సర్వవిఘ్నములు నశించును. శుభము చేకూరును.

294 భగవద్గీత, కఠోపనిషత్తు, పతంజలి యోగసూత్రము- ఈమూటిని కంఠస్థముగా చదివినవారికే సన్న్యాస మివ్వబడునను నియమము ★శ్రీవ్యాసాశ్రమమున నేర్పఱచుటయైనది

295 ఉత్తమ దివ్యపురుషునియందుగాని, వారి పటమందుగాని లక్ష్యము నిలిపి ధ్యానించిన, అదియే ప్రత్యక్షముగ అంతఃకరణమున పొడమును

296 ఒక మైనపువత్తిని పైకెగురవేసిన, కొంతసేపటికది మఱల భూమిపై వచ్చిపడును అది పృథివీతత్త్వ మగుటవలన అట్లు వర్తించినది దానినే అగ్నిచే కరిగించినచో జలరూపమై కొంతదూరమువరకు పారును, ఇంకను దాని నగ్నిచే వేడిమి యొనర్చిన, జ్వలించి యగ్నిరూపమై ఆ పిదప వాయువురూపమై పైకెగసి, క్రమముగ సూక్ష్మాతిసూక్ష్మమై ఆకాశరూప మొంది తుదకు విలీనమగును ఇవ్విధమున, ఒకే వస్తువు అగ్ని సహాయమున అనేకరూపములుగ పరిణామ మొందినది ఆ మైనపువత్తి ప్రథమమున

★ విద్య, యోగ్యత సన్న్యాసులకు తప్పక గల్గియుండవలెనని తలంచి యిట్టి నియమమును శ్రీ స్వాములవారు వ్యాసాశ్రమమున నేర్పఱచిరి

స్థూలాకృతి గల్గి పృథివ్యంశమున నున్నదై, క్రమముగ(వేడిమిచే) సూక్ష్మమైన జలరూపముగా మారి, అటనుండి ఇంకను సూక్ష్మమైన అగ్నిరూపము లోనికిని, దానినుండి వాయురూపములోనికిని, తుదకతిసూక్ష్మమైన ఆకాశ రూపములోనికిని జని యెట్లు విలయమొందెనో, అట్లే దేహమును, కర్మేంద్రియములను జ్ఞానేంద్రియములలోను, జ్ఞానేంద్రియములను అంతఃకరణములోను, అంతఃకరణమును ఆత్మలోను, అభ్యాసముచే క్రమముగ లయమొనర్పవలెను

మొట్టమొదట పృథ్వీతత్త్వమున నున్నపుడు, మైనపువత్తి ఒకే చోటనుండి, స్వల్పాకృతిగల్గి, చలింపక జడరూపమున నుండును కేవలము తమోగుణస్వభావులై, పరమార్థ మేమియు నెఱుంగని పశుప్రాయుల స్థితి యట్లుండును వారి దృష్టి పరిచ్ఛిన్నమై, తమోగుణప్రధానమై వ్యాపకము లేనిదై, రాతివలె కఠినముగ నుండును, క్రమముగ మైనపువత్తి జలతత్త్వము లోనికి మారునపుడు, కొంచెము సూక్ష్మమగును కొంతవఱకు వ్యాపించును చలనము గలిగియుండును అపుడాతడు జలతత్త్వములోనికి ప్రవేశించెనని యెఱుంగవలెను

పిమ్మట వత్తి జ్యోతిగా మారునపుడు, ఇంకను సూక్ష్మమై, ప్రకాశవంతమై, వ్యాపకమై యుండును అట్లే అగ్ని తత్త్వములోనికి ప్రవేశించిన వారి బుద్ధి మిగుల సూక్ష్మమై తేజోవంతమై, ఏకాగ్రమై యుండును, నూతన భావము లపుడు మనస్సునకు స్ఫురించును

ఆ మైనపువత్తి అగ్నిరూపమునుండి వాయువు రూపమునకు పరిణమించునపుడు బహుదూరము వ్యాపించి, మిక్కిలి సూక్ష్మమై వేగము గల్గియుండును అట్లే ధ్యానానుష్ఠానము వృద్ధి చేయుచు రాగా జీవునకు సత్త్వగుణ మేర్పడును. హృదయము శుద్ధమై, వాయువువలె విశాలమై, పవిత్ర వంతముగ నొప్పును. వాయువొకచోట నుండక చాలవఱకు వ్యాపించునట్లు ఆతడున్ను అట్టిస్థితిలో సర్వ ప్రాణులయెడ దయగల్గి విశాల భావమును జూపుచుండును.

తుదకామైనపువత్తి ఆకాశరూప మగునపుడు, అదృశ్యమై విలీనమై నట్లు, జీవుడట్టి యాకాశతతత్త్వమున ప్రవేశించునపుడు, విశుద్ధసత్త్వగుణ ప్రధానుడై, సర్వజీవరాసుల బాహ్యాభ్యంతరముల తన యాత్మరూపమునే గాంచుచు, జీవన్ముక్తుడైయుండును ఇదే అంతిమస్థితి. ఇక దానిపై నేపరిణామమున్ను లేదు. ఇవ్విధమున జీవుడు ఒకేజన్మలో క్రమపరిణామ మొందవలసి యుండును

పైమార్పులన్నియు అగ్ని యుండిననే మైనపువత్తికి కలిగినట్లు, ధ్యానా భ్యాసము చేయుచుండిననే జీవుని చిత్తము పైవిధమున మార్పునొందగల్గును నిప్పు చల్లారినచో, వత్తి యెంత కాలమునకైనను పరిణామములేక అదేస్థితిలో నుండియుండునట్లు భక్తి, ధ్యాన, వైరాగ్యాది సాధన లవలంబించి ఆత్మై క్యమునకై యత్నమొనర్పకుండినచో జీవున కుత్తమపరిణామ మబ్బదు దీనిచే నిపు డెవరెవరు ఏతత్త్వమున నున్నది బాగుగ గమనించుకొని, అంతకంటె పైస్థితిలోనికి పోవుటకై ధ్యానాగ్నిని లెస్సగ రగుల్కొల్పవలెను

297 అట్లు పంచభూతాంశమగు అంతఃకరణాదుల వృత్తులను నివృత్తి చేసికొని, పరిశుద్ధులైన శ్రీరామకృష్ణ, శ్రీశంకర, శ్రీరామానుజ, శ్రీమధ్వ, శ్రీబుద్ధదేవ, శ్రీగాంధి మొదలగు మహాత్ములను దైవస్వరూపులుగా భావించి మనము సేవించుచున్నాము ధ్యానానుష్ఠాన పరుడు తనయందేవైన వాసనలు తోచునపుడు, ఇంకను తనకు నంతఃకరణశుద్ధి కాలేదని యెంచి దృష్టిని మఱల్చుకొని, తీవ్రనిష్ఠలో ప్రవేశించి, ఆ మాలిన్యమును నివృత్తిచేసు కొనవలెను. ధ్యానానుష్ఠాన బలముచే మలినవాసనలు దృశ్యసంకల్పములు క్రమముగ క్షీణించి, అంతఃకరణాదుల వృత్తుల కతీతమగు పరమాత్మ యందు స్థిరత యేర్పడును

298 వర్షాకాలమున భూమి జలమయముగా నుండును కాని వేసవి కాలమున నెట్లు సూర్యకిరణము లానీటిని పైకిలాగుకొని యెండింప జేయునో, అట్లే అజ్ఞానావస్థయందు హృదయము వాసనామయమై యుండును కాని జ్ఞానసూర్యుడు ప్రకాశింప, తత్కిరణజాలముచే

అజ్ఞానవాసనాజలముడుగ, జీవుడు చైతన్యరూపుడై తదాకారాకారిత మగును

299 ఎట్టి యనుష్ఠానము గలవాడైనను విషయసాంగత్యము, దుష్టసంపర్కము గల్గియున్నచో క్రమముగ వానిదృష్టి ప్రపంచమువైపునకు మఱలి, ఆత్మనిష్ఠ తగ్గి బ్రహ్మచర్యము పతనమై, ఊర్ధ్వరేతస్కుడగుట మాని యధోగతుడై, చిత్తచాంచల్యము గల్గి, కర్మబ్రహ్మోభయభ్రష్టు డగును అట్టివాడు మఱల తనపూర్వపుస్థితి నొందవలెనన్న యెంతకాలమో ప్రయత్నింపవలెను లోగడ తాను కష్టించి సేకరించు కొనిన పదార్థమంతయు విషయసాంగత్యముచే నశింపజేసికొని, చింతాగ్రస్తుడై ఆతడు కష్టముల పాలగును ఎంతయో శ్రమపడి సంపాదించిన ధనమును దుస్సాంగత్యముచేతను, దుష్టపదార్థములను సేవనముచేతను, అనగా జూదము, స్త్రీ సాంగత్యము మొదలగు నికృష్టకార్యములందు భ్రమగలవాడగుటచే నశింపజేసికొని, దరిద్రుడైనచో, మఱల ఆవృత్తులు మానిన గదా, కష్టపడి నిర్మలబుద్ధితో జాగ్రత్తగా సంచరించుచు వర్తించుచుండినగదా, అట్టి సద్గుణములు గల వారితో పరిచయము గలిగినగదా, యెప్పటికో ధనవంతుడగుట! ఈరీతిగానే యెంతోకాలము కష్టపడి సంపాదించిన జ్ఞానధనమును అరిషడ్వర్గాదులను శత్రువులతో స్నేహమొనర్చుకొని కోల్పోవుట యెంత అవివేకము! మఱల నాజ్ఞానరత్నమును సంపాదించుకొనుట యెన్నటికో గదా! ఇట్లు ప్రతి ముముక్షువు అతిజాగరూకతతో పరిశీలించి యాచరించుచుండినచో, నిక నాశత్రులు వానియెదుటకు రాకయు, వచ్చినను వానియాజ్ఞను మీరకయు నుందురు. అరిషడ్వర్గమును నిగ్రహించుటయే ఆత్మానందమునకు మార్గమని గ్రహించవలెను.

300 పంచభూతములలో నొకభూతమునుండి మఱియొక భూతములోనికి వెళ్లినకొలది శక్తి హెచ్చును అట్లు పృథివినుండి ఆకాశమునకు వెళ్లు తఱికి శక్తి అనేకరెట్లు అధికమగును. ఆకాశముననే మనస్సును లీనము చేసినకొలది గొప్పతేజోవంతుడు, నిర్మలుడు నగును

నేత్రములు మూసికొని యున్నను, తెఱచుకొని యున్నను తన్మాత్రలకు విలక్షణమై ఆత్మపదార్థము నపుడు గాంచగలడు కాన మేల్కొనినప్పటి నుండి నిద్రించువఱకు అట్టి లక్ష్యమును వదలక యుండువాడు నిజమైన ఈశ్వరతత్త్వమును గ్రహించిన వాడగును ఆస్థితిలో నుండువారే నిరాకారమగు బ్రహ్మము నుపాసింపగలరు వారే యట్టి ఉపాసనాకర్తలు అట్టి ధ్యానానుష్ఠానము సర్వులకు నవశ్యముకాదని తలంచి, సర్వజీవరాసుల క్షేమముకోరి వేదధర్మప్రకారము కర్మ, ఉపాసన, భక్తి, సగుణారాధనలు మొదలగు సాధనలను పెద్దలేర్పఱచిరి అభ్యాస కాలమున 'సాకారము' అందఱికిని ముఖ్యమైనదే ఇదే మహర్షుల యభిప్రాయము. ఆర్యుల వాక్యము లను మనముల్లంఘించరాదు. అట్లు ఋషివాక్యముల నుల్లంఘించిన పతితుల మగుటయేగాక, లోకమునుగూడ పతన మొనర్చినవార మగుదుము

301. విషయాదులయందు ప్రవర్తించు ఇంద్రియ మనంబులను అట నుండి మఱలించి ఆత్మయందు నెలకొల్పుట ప్రత్యాహార మనబడును ఒకరా తియందుగాని, కొయ్యయందుగాని చెక్కబడిన విగ్రహముల నామరూప ములు కల్పితములని యెఱింగి వాటిని అధిష్ఠానమగు శిలారూపముగను, కాష్ఠరూపముగను చూచుటచే కల్పితములగు విగ్రహములు ఎట్లు తోచుట లేదో, అట్లే బ్రహ్మమునుండి కల్పితమగు నీ దృశ్యమును విసర్జించి బ్రహ్మాకారముగ జూచుటచే మాయావరణ నివృత్తి యగును ప్రతి- ఆహారము=ప్రత్యాహారము, అనగా ప్రత్యేకముగ నుండు ఆత్మయందు మనస్సును విహరింపజేయుటయే ప్రత్యాహారమగును. ధారణయనగా, నిశ్చలముగా నుండి మనస్సును లక్ష్యమునుండి చెదరనీయక, బాహ్యాంతరా కాశములనేకము చేసి, రెండవది లేకయుండుట అనగా కార్యకారణముల నేకాకారమొనర్చి అద్వైతభావనను వీక్షించుటయే ధారణ యనబడును పవిత్రాంతఃకరణ గలవాడు (పరమాత్మయందు మనస్సును నెలకొల్పుట యను) ధారణను కొంచెము కాలము చేసినను గొప్పదివ్య శక్తి కలుగును.

302. ప్రథమమున సగుణధ్యానము తరువాత నిర్గుణధ్యానము అవ

లంబించుట మంచిది. పూజామందిరమున మహాత్ముల విగ్రహముల నుంచ వలెను మూర్తియందు మనస్సు లీనము కానంతవఱకు అది గోచరించుచునే యుండును. పిదప ఉండియు గోచరింపదు అట్లే దేహమందిరమునగాని, ఆకాశమున సోమమండలమున గాని, సూర్యమండలమందు గాని, మనస్సును నిలిపి నిశ్చలబుద్ధితో ధ్యానముచేయవచ్చును లేక శివరూపమును నిర్మించుకొని ధ్యానింపవచ్చును లేక విశ్వాకారుడగు నారాయణమూర్తిని 'సహస్ర శీర్షా పురుషః' యను పురుషసూక్త ప్రకారము ధ్యానింపవచ్చును ఈధ్యానమే బాహ్యమున బ్రహ్మాండమును లక్షించి చేసిన కొన్ని సిద్ధులను బడయువచ్చును. ఇవిగాక తన హృదయమధ్యమున అష్టకళలతో నిండియున్న ఈశ్వరునినైన ధ్యానింపవచ్చును. భ్రూమధ్యమున లక్ష్యము నుంచియైన ధ్యానము చేయవచ్చును బ్రహ్మ, పరాశక్తి, విఘ్నేశ్వరులకూడ ధ్యానింపవచ్చును కాని వీటి యన్నిటికంటె స్వస్వరూపధ్యానము మిన్న యైనది దానికిసాటి మఱియొకటి లేదు నిర్మలాత్ములకే అయ్యది సిద్ధించును.

303 యమనియమాదులను మొదటి యేడంగములు సిద్ధించిన తదు పరిమాత్రమే యెనిమిదవదగు సమాధియోగము సిద్ధించును. జీవేశ్వరైక్య జ్ఞానము గల్గియుండుట (అనుభూత మొనర్చుకొనుట) యే సమాధి. కార్యరూపుడైన జీవుడు కారణరూపుడైన ఈశ్వరున (ఆత్మ) కన్యుడు కాడు. మృత్తిక కన్యముగ ఘటము లేదు. ఉపాధులు తొలగిన ఘటాకాశ, మహాకాశములకు ఏకత్వమే సిద్ధించుచున్నది అట్లే అవిద్యామాయోపాధులచే జీవేశ్వరభేదము గలుగుచున్నది గాని యధార్థముగ లేదను ఏకత్వ ప్రతిపాదనారూపమగు అద్వైతసిద్ధాంతము ననుభూత మొనర్చుకొనుటయే సమాధి. ఆవరణరూపములగు దేహేంద్రియాదులు నేను కాను, వాటికి విలక్షణమయిన ఆత్మనే యనుజ్ఞానము కలుగుటయే సమాధి అకార, ఉకార, మకార, అర్ధమాత్రలు, ఋగ్యజుస్సామాథర్వణవేదములు, బ్రహ్మ, విష్ణు మహేశ్వర, పరమాత్మలు- స్వరూపముగా గల ప్రణవవాచ్యుడైన

పరబ్రహ్మము తోటి యాసమాధ్యవస్థయందు జీవుడైక్య మగును అపుడు ప్రపంచవాసన లెవ్వియును తోచవు. విజ్ఞానముచేతనే సమాధి సిద్ధించునుగాని కర్మకాండవలన కాదు కర్మకాండ మున్నగునవి సాధనలు మాత్రమేయని యెఱుంగవలెను గొప్ప అగ్ని పచ్చికట్టెలనుకూడా దహించి భస్మము చేయు నట్లు ధ్యాన, సమాధినిష్ఠచే సర్వకర్మములున్ను భస్మీభూతములగును

304. మలయాళదేశమున సిద్ధమత మనునది నేటికిని గలదు ఆమతము వారు ఈశ్వరుడు, గురువు ఆత్మ-వీనిని ధ్యానించుచు నిత్యము డైరీ వ్రాయుచుందురు. భగవంతుని నిత్యము ఎన్ని ఘంటలు మఱచుదురో వ్రాయుదురు. ఒక్క శ్వాసయైన వ్యర్థముగ పోనీయక సదుపయోగ మొనర్చుటయే వారి సిద్ధాంతము. కాన వారు సమయము నతిజాగరూకతతో పరిశీలించుచుందురు అందరు సమపంక్తితో భోజనము చేయుదురు ఈశ్వరోపాసన, ప్రాణాయామము ముఖ్యముగ నాచరింతురు. వారి మూలపురుషుడు గొప్పసిద్ధులు గల్గియుండువారు వారి ఖ్యాతి యచ్చోటంతయు వ్యాపించియుండెను. సిద్ధులను బడసి లోకము నుద్ధరింపవలెననియే వారితలంపు. ఆ సంఘము లోనివారు ఎవరికివారే కష్టించి భుజించెదరు. సాధువులు నడచియే ప్రచారము చేసెదరు



## 13వ రోజు 9-4-1940

305 వేదము కాండత్రయాత్మకము. అట్లే గీతయున్ను. ఏలన, 1-వ అధ్యాయమునుండి 6-వ అధ్యాయము వఱకున్ను కర్మకాండయు, 7-వ అధ్యాయమునుండి 12వ అధ్యాయమువఱకు ఉపాసనాకాండయు, 13-వ అధ్యాయము నుండి 18-వ అధ్యాయమువఱకు జ్ఞానకాండయు, ప్రతిపాదింపబడియున్నవి. అట్లే కొందఱు తారకము, సాంఖ్యము, అమనస్కమనియు మూడు అంతస్తు లేర్పఱచియున్నారు. మొదటి అంతస్తులందుండువారు పైఅంతస్తులయందలి స్థితిని తెలిసికొనజాలరు.

కాన, తారక సాంఖ్యములు బడయనివారికి అమనస్కము బోధించినను, వారు దానియందు సిద్ధిని బడయజాలక పోవుటయేగాక పతితులు కూడ నగుదురు మట్టిగోడపై రంగు నిలువనట్లు, చవిటిభూమిలో విత్తనము మొలవనట్లు పరిపక్వులుకాని వారి యందాత్మబోధయు నిలువదు సీతారామాంజనేయమునందు ప్రథమమున తారకము, పిదప సాంఖ్యము, ఆపిమ్మట అమనస్కము బోధింపబడినవి ఇదియే క్రమమగు సాధన పునాదిలేని గోడ నిలువనట్లు, తారక సాంఖ్యములు మొట్టమొదట బోధింపక అద్వైతము, అమనస్కము, నైష్కర్మ్యము బోధించిన జనులద్దాని నందుకొన జాలక చ్యుతులగుచున్నారు కాన పునాదియగు తారక, సాంఖ్యాదులందే మొమ్మొదట విశేష ధ్యాన ముంచవలెను అట్లుగాక, పునాది భూమిలోపల నుండునుగదా, దానినెవరు చూచెదరు అని తలంచి ఉపేక్షించినచో, ఆపిమ్మట దానిపై కట్టబడు మహాభవన మంతయు నొక్కుమ్మడి కూలి ధ్వంసమైపోవును.

306 గీతయందు 13–వ అధ్యాయమున దృగ్దృశ్య, క్షేత్ర క్షేత్రజ్ఞ, జ్ఞాన జ్ఞేయ విభజనలనుగూర్చి లెస్సగ ప్రతిపాదించిరి గీతకు విఖ్యాతి గల్గుటకు కారణమేమన, దీనిని పఠించువారికి పారాయణ ఫలమున్ను, విజ్ఞాన ప్రాప్తియు రెండును చేకూరును ఉపనిషత్సారమే గీతయగుటచే ఉపనిషదర్థ మంతయు దీనియందు ప్రకాశిత మొనర్పబడినది ముఖ్యముగ ఈ 13–వ అధ్యాయమున ఆత్మానాత్మ, ప్రకృతిపురుష వివేచనారూపమగు నిగూఢ సాంఖ్య, తత్త్వశాస్త్ర సిద్ధాంతములన్నియు తేట తెల్లముగ వచింపబడినవి గాన, ముముక్షువుల కయ్యవి అత్యంతోపకరములై యున్నవి. యథార్థముగ విచారించిన క్షేత్రక్షేత్రజ్ఞుల రెంటిని, సాంఖ్యశాస్త్రానుసారము లెస్సగ విభజించి తెలిసికొని, ఆత్మానాత్మ పరిజ్ఞాన మొంది, అనాత్మను, దృశ్య రూపమైన క్షేత్రమును దూరీకరించి, దృగ్రూపమైన క్షేత్రజ్ఞుడు తానను దృఢబోధ గల్గినపుడే పూర్ణత్వము(మోక్షము) సిద్ధించును

కొందఱు భజనలు, పూజలు మున్నగునవి చాలుననియు, సాంఖ్యము,

ఇత్యాదులు అనవసర మనియు చెప్పుదురు అది సరికాదు. భజనకీర్తనా దులచేతనే మోక్షము కల్గునని యేల చెప్పబడెననగా ''యోజనాధ్వన్యశ క్తస్య క్రోశాధ్వా పరికధ్యతే'' అన్నట్లు యోజనము దూరము నడువలేనివారికి క్రోసెడుదూరమే యని చెప్పి తీసికొనిపోయినట్లును, వ్యాధివచ్చి సరిగ నడు వలేనివారితో ఇచ్చటనే, సమీపమే యని చెప్పి దూరము తీసికొనిపోయిన ట్లును నుండును. అట్లు చెప్పినగాని వారు నడువరు. మొదలే ఎంతయో దూరమున్నదనిన, ప్రయత్నమే విరమించుకొందురుకాన సత్కర్మాను ష్ఠానము ద్వారా క్రమముగ నొక్కొక్కసాధనను దెల్పి తుదకు గమ్యస్థాన మును జేర్చుదురు అందువలన, సాధనరూపములగు భజన పూజనాదు లొనర్చు చుండవచ్చునుగాని సాంఖ్య విజ్ఞానములయెడ విముఖత్వమును మాత్రము చూపరాదు. ఏలన, తుదకు వాటినే యాశ్రయింపవలసివచ్చును ''క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానంయత్తజ్జ్ఞానం మతం మమ'' అని 13-వ అధ్యాయమున క్షేత్రక్షేత్రజ్ఞులంగూర్చిన జ్ఞానమే యధార్థజ్ఞాన మనియు, అదియే తన మత మనియు భగవానుడు సుస్పష్టముగ వచించియున్నాడు కాన నివ్విషయమున సంశయమునకు తావు లేదు.

307 13-వ అధ్యాయమున అమానిత్వాది జ్ఞానగుణము లిఱువది చెప్పబడినవి ఈ యిఱువదియు నిరవై పాఠములవంటివి విద్యార్థి ఏ పాఠమునందు తప్పిపోవునో, ఆ పాఠమును మఱల చదివి అందెట్లు యుత్తీర్ణత నొందవలసి యున్నదో, అట్లే ఏ గుణమునందు ముముక్షువు కొఱతగల్గి యుండునో, దానిని మఱల మఱల నభ్యసించి సాధించవలసి యుండును ఏదో యొక కాలమున ఆ యన్నిగుణములు పొందనిచో ఉత్తరోత్తర చెప్పబడు జ్ఞేయమున కాతడర్హుడు కాజాలడు. శుభ్రవస్త్రముపై మరకయున్నచో అది వస్త్రముయొక్క సౌందర్యము నెట్లు తగ్గించునో, మఱియు నపుడు వస్త్రమెట్లు వికారముగ నుండునో అట్లేపై యిరువై గుణములలో నేగుణము లేకున్నను అది శుద్ధాంతః కరణమున లోటుగనే యుండును కాన, దానిని కూడ పూర్తిచేసికొనిననే పూర్ణపారిశుధ్యము

ఏర్పడును మఱియు అవయవములన్నియు నుండి, ఏయొక్కటి తఱుగైనను, దాని పని చేయజాలము గదా? దేహసౌందర్యమునకును భంగము వాటిల్లును గదా, అంగవికలుడు యజ్ఞాది మహాకార్యములకును తగడు గదా, అట్లే పై జ్ఞాన గుణములలో నేది లేకున్నను, జ్ఞేయ్వార్హత నొందక అపూర్ణుడే యగును కాన మఱల ప్రయత్నముచే దానినికూడ సంపాదించవలెను

308 ధ్యానానుష్ఠానపరుడు, తీవ్రముముక్షువు, ఏకాంతవాసియైయే యుండి అనుష్ఠానము సల్పుచునుండును అనవసరముగ సంభాషించు జనుల వద్ద ఉండడు శ్రద్ధగ పాఠము చదువుకొను విద్యార్థి యితర సంభాషణలు జరుగుచోటున వసించునా?

309 ధ్యానసమాధి యనియు, యోగసమాధి యనియు సమాధి రెండు విధములు అని విచారించిన రెండును ఒకటియే యైయున్నవి టెంకాయలో నీళ్ళుండువఱకు అది కురిడి కాజాలదు కొబ్బరి చిప్పనంటు కొనియే యుండును అట్లే దేహవాసన, లోకవాసన, శాస్త్రవాసన యను నీవాస నాత్రయము హృదయమున నుండువఱకు, జీవుడు బోధరహితుడై జీవన్ముక్తుడు కాజాలడు ఎపుడావాసనలు వీడిపోవునో అవుడు చిప్పనుండి కురిడి వేఱుపడునట్లు, జీవుడు ప్రకృతినుండి వేఱుపడి, బంధవిముక్తుడై ఆత్మస్వా తంత్ర్య మనుభవించును

310 కొందఱిట్లందురు ''చీకటి పోవుటకు దీపప్రకాశము చాలునట్లు మూలావిద్య నశించుటకు జ్ఞేయమొక టెఱింగిన చాలుగదా! ఇక జ్ఞానగుణములతో పనియేమి'' దీపముచే నంధకారము నశించుననుట తథ్యమేగాని ప్రమిద, తైలము, వత్తి లేక దీపమెపుడైనను వెలుంగునా? అట్లనే, జ్ఞేయస్వరూప సాక్షాత్కారముచే అజ్ఞానము నశించుట వాస్తవమేగాని, జ్ఞానగుణములు లేనిచో జ్ఞేయానుభవ మెన్నడేని సిద్ధించునా? సిద్ధించదు ఏమియు ఆధారములేని శూన్యాకాశమున దీపమెపుడేని నిలువగలుగునా? కాన, శమదమాది సాధనచతుష్టయ సంపత్తి గలిగిన తరువాతనే బ్రహ్మ(జ్ఞేయ) విచారణ చేయవలసియున్నది జపము ఏకాంతవాసము,

పూజ మొదలగునవి యెందులకు? అనువారి మాట వత్తి, ప్రమిద, చమురు ఎందులకు? దీప మొకటి చాలుగదా! యనుటవంటిది అది కేవల మసంగతము మఱియు భక్తియను తైలమున్నను వైరాగ్యమను ప్రమిదకు రంధ్ర మున్నచో, ఆ భక్తి రూపతైల మంతయు క్రమముగ కారిపోయి జ్ఞానజ్యోతి వెలుగకుండును ఒక్క రంధ్రమున్నపుడే తైలము కారిపోవ, నిక పదిరంధ్రము లున్నచో, వేఱుచెప్పవలెనా? అట్లే యేయొక్క యింద్రియ మైనను విషయములందు చరించుచున్నచో, తద్ద్వారా జ్ఞానమంతయు హరించి పోవ, నిక దశేంద్రియములు విషయోన్ముఖములైనచో జ్ఞానము నశించునని వేఱు చెప్పనేల?

**ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।**
**తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివాంభసి.॥** 2-67

అని శ్రీకృష్ణపరమాత్మ సెలవిచ్చియున్నారు (దీనియర్థముపైన దెల్పినదే) ఒకయింద్రియముచేతనే ప్రజ్ఞ నశించునపుడు, దశేంద్రియములు విజృంభించిన నిక జ్ఞానమెట్లు నిలువగలుగును? కాన ఇంద్రియనిగ్రహము, వైరాగ్యము, అతిజాగరూకతతో కాపాడుచుండిననే, జ్ఞానజ్యోతి నిరాటంక ముగా వెలుంగుచుండును

311 ఒకరు గొప్ప యుద్యానవనమును స్థాపించిరి కాని దానికి ప్రహరి కట్టలేదు దానిచే పశువు లందు జొరబడి అందలి వృక్షము లన్నిటిని మేసిపోయినవి మఱియొకరు సిమెంటుతో గొప్పప్రహరి కట్టిరి కానిలోన ఒక్క పుష్పవృక్షమైనను, లతయైనను లేదు అదియును నిరుపయోగమే గదా! అట్లే యొకరు శమదమాదులన్నియు గల్గియుండినను, అనుష్ఠానము చక్కగ నొనర్చుచుండినను, వైరాగ్యము సరిగ లేనందుచే, విషయరూప పశువులు వారియందు జొరబడి దివ్యమైన యా శమదమాదిపాదపముల హరించి వైచెను మఱియొకరు, తీవ్ర వైరాగ్యము గల్గియున్నను, శమాది సుగుణ ములు లేనందుచేతను, అనుష్ఠానము చక్కగ నాచరింపనందుచేతను జ్ఞానము ప్రకాశింపకుండెను కాన వృక్షములు, ప్రహరి రెండును నున్ననే

యుద్యానము శోభించునట్లు, వైరాగ్యము, శమదమాది సాధనలు రెండును యుండిననే జ్ఞాననందనము శోభిల్లును (గీత 13-వ అధ్యాయమున చెప్ప బడిన అమానిత్వాది జ్ఞానగుణములు ప్రహరివంటివి, జ్ఞేయము పుష్ప వృక్షముల వంటిది అట్టియుద్యానమును భగవంతుడు భక్తులకై యేర్పఱచి యున్నాడు )

312 ''ధ్యానేనాత్మని పశ్యన్తి'' కొందఱు ఆత్మధ్యానము చేతమాత్రమే పరమాత్మని పొందగల్గుచున్నారు వ్యాసులవారు శ్రీ శుకమహర్షి కీధ్యానయోగమే గొప్పదని బోధించిరి భక్తియను పుష్పము ధ్యానమను ఫలముగా మారును. కనుకనే భగవంతుడు భక్తిని మొదట చెప్పి, తద్ద్వారా ధ్యానానుష్ఠానపరుడై యుండువాడు ముక్తుడగునని చెప్పియుండెను నిష్కామకర్మయోగము దోరగాయువంటిది క్రమముగ నది పక్వమై జ్ఞానఫలముగ మారును

**అన్యే త్వేవమజానన్త శ్శ్రుత్వాన్యేభ్య ఉపాసతే ।**
**తేఽపి చాతితర న్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః॥ 13-26**

భక్తి, ధ్యాన, కర్మ, ఉపాసనాయోగములను చేయ శక్తి లేనివారు పెద్దల సన్నిధి జేరి బోధబడసి, అనుష్ఠించిన ధన్యులు కాగలరని భగవంతు డానతిచ్చియున్నాడు.

313 డాక్టరు పరీక్ష ప్యాసైనను, తనకు వ్యాధి వచ్చినచో ఔషధము సేవింపనిచో వ్యాధి నివారణ కాదు డాక్టరు పరీక్ష ప్యాసు కానివాడైనను రోగము వచ్చినపుడు ఔషధమును సేవించినచో, తద్రోగము క్షయించును ఆవిధముగనే శాస్త్రపాండిత్య మెంత గల్గియున్నను భవరోగముచే బాధ పడుచున్నచో, భగవచ్చింతన యను భేషజమును గైకొనకున్న తద్బాధానివృత్తి కాజాలదు మఱియు నిరక్షరుడైనను పాండిత్యప్రకర్ష విరహితు డైనను, భగవద్భక్తి ఆత్మచింతన యను ఔషధమును సేవించినచో, భవరోగము నిర్మూలమై, నిరతిశయమగు ఆత్మశాంతి నొందగల్గును.

314. నిర్వితర్కసమాధియన శబ్దార్ధముల గూర్చిన తలంపు లేవియు లేక, ధ్యానించుచుండు వస్తువు మాత్రమే మిగిలియుండు స్థితి సవితర్క, సవిచార సమాధులందు పంచభూతముల, పంచతన్మాత్రల గూర్చిన చింతన యుండును నిర్వితర్క, నిర్విచార సమాధులందది యుండదు సవితర్క సమాధిచే మనస్సు నిర్మలము కాగా గురూపదేశ, స్వానుభవ యుక్తులచే జ్ఞేయస్వరూపము నిశ్చయింపబడును. ఋతంభరా ప్రజ్ఞచే, సూక్ష్మ మైనవియు, దూరమున నున్నవియు నగు పదార్ధములు గోచరము కాగల్గును ఇది యొక యోగసిద్ధి ఈ ప్రజ్ఞ బహిర్ముఖ వ్యాపారమును తగ్గించును నిర్బీజ సమాధిని దృఢముగ నభ్యసింపవలెను. దానియందు సమస్త చిత్తవృత్తులు, సంస్కారములు, వాసనలు పూర్ణముగ నశించును ఏయొక్క చిత్తవృత్తి యున్నను, అట్టి నిర్బీజసమాధి గలుగదు

315 కర్మేంద్రియములకన్న జ్ఞానేంద్రియములున్ను, జ్ఞానేంద్రియ ముల కంటె మనస్సున్ను, మనస్సుకంటె బుద్ధియు, బుద్ధికంటె అవ్యక్త మున్ను, అవ్యక్తముకంటె జ్ఞేయమగు పరమాత్మయున్ను సూక్ష్మమై, అతీతమై యుండును మనస్సునొకదానినుండి మఱియొకదానిలోనికి క్రమముగ మఱల్చి, తుదకాత్మయందు లయింపజేయవలెను ఇదియే ధ్యానయోగ రహస్యము, ఇట్టి స్థితి అనుష్ఠానమువలననే లభించును.

316 ధ్యానమునుగూర్చిగాని, తదితర యోగాభ్యాసముల గూర్చి గాని గ్రంధములను చదివిన మాత్రమున, నొరులవలన వినిన మాత్రమున ఎక్కువ ప్రయోజనము లేదు. తాను స్వయముగ ననుష్ఠించిననే ఫలము లభించును ఒక దేశపుపటములో పేర్కొనబడిన తీర్థ స్థలములను అందు చూచిన మాత్రాన మనుజునకేమైన పుణ్యము లభించునా? స్వయముగ నచ్చోటికి బోయి తీర్థములను సేవించిననే పుణ్యము గలుగునుగదా, అట్లే ధ్యాన, యోగాదులను గూర్చియు, వాటిమహిమనుగూర్చియు వేనోళ్ల వచించి నంతమాత్రముచే అవి సిద్ధింపనేరవు అనుభవించిననే సిద్ధించును. అట్లు గానిచో ''ప్రతిబింబిత శాఖాగ్రఫలాస్వాదన మోదవత్'' అన్నట్లు ఒక

జలాశయతీరముననున్న వృక్షఫలములు క్రిందనున్న జలములో ప్రతిబింబింప, అట్టి ప్రతిబింబిత ఫలమును భక్షించి సంతృప్తినొంద దలంచినవాని చందమున నుండును భక్తిధ్యానములు లేక కేవలము శాస్త్రపాండిత్యము గలవారిని గూర్చి శ్రీశంకరు లిట్లుపదేశించిరి –

**షడంగాది వేదో ముఖే శాస్త్ర విద్యా కవిత్వాది గద్యం సువద్యం కరోతి ।**
**గురోరంఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్॥**

షడంగములతో సహావేదములను కంఠస్థ మొనర్చినను, గొప్ప పాండిత్య ప్రకర్ష గల్గియున్నను, శేముషీధురంధరుడైనను, గురుస్వరూపు డగు భగవంతుని పాదపద్మములపై చిత్తమును నెలకొల్పకున్నచో నిక వాని చదువెందులకు? పాండిత్యమెందులకు? కవిత యెందులకు? కీర్తి యెందులకు?

వివేక చూడామణియందును నీ విషయమై యిట్లు తెల్పిరి–

**వాగ్వైఖరీ శబ్దఝరీ శాస్త్రవ్యాఖ్యానకౌశలమ్।**
**వైదుష్యం విదుషాం తద్వద్భుక్తయే న తు ముక్తయే।**

శాస్త్రపాటవము, పదప్రయోగకౌశలము, ప్రతిభ మున్నగునవి భుక్తికొఱ కేగాని ముక్తికొఱకు గావు అయితే, దీనిచే శాస్త్ర పరిజ్ఞానమును దూఱుట కాదు ఆచరణ, అనుభవముకూడ నుండవలెనని చెప్పుటయే.

317 రాజు స్వాధీనుడైనచో పరివారము, సేన, రాజ్యము అంతయు వెంటనే స్వాధీనమగునట్లు అపుడు వారందఱును తనకు వశవర్తులై మెలంగునట్లు దేహేంద్రియ మనోబుద్ధ్యాదుల కతీతమై, 'సాకాష్ఠా సా పరాగతిః' – యనునట్లు సర్వచేతనాచేతనములకు, సమస్తపదార్థములకు నవధియై చెన్నొందుచున్న ఆత్మస్థానమును జేరినచో, ఆత్మయందు సంయమన మొనర్చినచో, తక్కిన సమస్తమున్ను తనకు లోబడినదే యగును యథార్థమైన యింద్రియనిగ్రహము అపుడే చేకూరును.

**318. విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః!**

**రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥** 2–59

ఇవ్విధమున గీతయందు చెప్పబడినట్లు, పరమాత్మసందర్శన మైనపుడే రసోఽప్యస్య – మూలావిద్య, సూక్ష్మసంస్కారములు నిగూఢ వాసనాజాలము, పూర్ణముగ ధ్వంసమైపోవును అంతకుమునుపు కాదు ఇంద్రియజయమున కిదియే సర్వోత్తమమైన యుపాయము ఒక రైలు వేగముగ నడుచుచున్నచో, దాని నాపవలె నన్న, వెనుక యెన్ని వేలమంది పెట్టెలను పట్టుకొనినను సాధ్య మగునా? ఇంజనులోని ఒక చిన్న మఱ త్రిప్పినచో సమస్త యంత్రములు, చక్రములు పనిచేయును వాటినాపవలె నన్న ఒక్కొక్క చక్రము నెందఱు పట్టుకొనినను సాధ్యము కాదు మూల యంత్రము నాపవలెను. ఇవ్విధముననే కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ, దేహ, మనోబుద్ధ్యాది సమస్తదృశ్య ప్రపంచమున్ను దేనిచే చైతన్యవంత మగుచున్నదో, దానిని స్వాధీన మొనర్చుకొనిన చాలును, సర్వప్రపంచమున్ను స్వాధీన మైనట్లే, సర్వేంద్రియములు వశవర్తులైనట్లే, ఇదియే వేదాంతములోని పరమకీలకము

ఇంద్రియము లెంత బలిష్ఠములైనను, మనస్సు సర్వతోముఖమై యున్నను, ఒకక్షణములో ఆ (యాత్మ) స్థితి యందన్నియు నిగ్రహింప బడగలవు అట్టిస్థితిని నేకాలమున నైనను బడసిననే తప్ప మోక్షము చేకూరజాలదు. కనుకనే వివేకానంద, బుద్ధదేవుడు మొదలగువారు యువరాజులవలె జీవించినను, అవసరమైనపు డొక్కక్షణములో సర్వేంద్రి యములను నిగ్రహించుకొన శక్తి గల్గియుండెడివారు ఆవిధముగనే దయానందుడున్ను నిగ్రహపరుడై యుండగల్గెను నిజముగా మీరున్నూ అట్టి నిగ్రహపరులై సంయమనశక్తి గల్గియుండినచో వారివలెనే ప్రవర్తింప వచ్చును లేనిచో పతనము సంభవించును అయితే అట్టి స్థితి సామాన్యము కాదు ఆత్మ సమీపమున నున్నప్పటికిని, చిత్తశుద్ధి లేనివారల కది దూరమున నున్నదే యగును ''సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయందూరస్థం చాన్తికే చ తత్'' అని గీతాశాస్త్రము ఆత్మయొక్క దుర్జేయ, సువిజ్ఞేయత్వముల గూర్చి

ప్రతిపాదించుచున్నది జిహ్వాగ్రము నాసికాగ్రమునకు సమీపమున నున్నను, దానినంటుకొనజాలదుగదా! నిధి పాదముల క్రిందనే యున్నను, నిధిజ్ఞానము లేనివారి కది యలభ్యమే గదా! అట్లే స్వహృదయాంత రాళములోనే ఆత్మ వెలుగుచున్నను, అపరిపక్వచిత్తుల కయ్యది అప్రాప్యమే యగును

నేను తపస్సు చేయుకాలమున మూడు సంశయములు నాకు గల్గియుండెడివి తామరాకును నీటిబిందువు అంటనట్లును, వెన్న నీటిలో మునుగనట్లును, కుమ్మరిపురుగునకు బురద యంటనట్లును, విషయాదు లందు జ్ఞాని తగుల్కొనక యుండునా? యని దీనిగూర్చి యెంతయో యోచించితిని ఎన్నియో గ్రంథములను జదివితిని తుదకు తపస్సుకూడ చేసితిని చాలకాలమునకు నాకు వాటికి ప్రత్యుత్తరము లభించినది అదేమన తామరాకైనచో నీరంటదుగాని, అదే అరటియాకైనచో వెంటనే యంటు కొనును అట్లే విషయాతీతుడైన జ్ఞానియొక్క మనస్సు విషయములందు తగుల్కొనదు గాని, అజ్ఞానిచిత్తము వెంటనే తగుల్కొనును ఆవిధముగనే వెన్నముద్ద నీటియందు మునుగదు గాని, అదే సున్నపుముద్ద యైనచో వెంటనే కరిగి మునిగిపోవును అట్లే జీవన్ముక్తుడు విషయాదులందు మునుగడు గాని, వాసనాసహితుడగు అవివేకి తద్విషయార్ణవమున నిమగ్నుండై పతితుడగును అదేరీతిగ, కుమ్మరిపురుగు శరీరముపై ఒకవిధమైన చమురుండుటచే అది బురద యందు తిరుగాడినను నిర్లేపముగ నుండునుగాని, అదే కంబళి పురుగైనచో వెంటనే ముద్దయై చచ్చిపోవును ఆవిధముగనే ఆత్మానాత్మ వివేకమను తైలపు పూత గలిగిన ప్రజ్ఞాశీలుడు తుచ్ఛములైన ప్రాపంచిక విషయములను బురదయం దెన్నడును చిక్కుకొనడు అట్టి ప్రజ్ఞ లేని మందమతి విషయవాసనలలో జిక్కుకొని భ్రష్టుడగును

319 దీనియందింకొక రహస్యముకూడ కలదు పాలను తోడుపెట్టి తయారుచేసిన పెరుగు మఱల పాలెట్లు కాజాలదో, పెరుగునుండి తఱచ బడిన వెన్న మఱల పెరుగెట్లు కాజాలదో, వెన్నను కఱిగించి చేయబడిన

నెయ్యి, మఱల వెన్న యెట్లు కానేరదో అట్లే అధ్యాత్మికస్థితి యందును ఒక్కొక్క యంతస్తు పైకిపోయినవారి మనస్సు క్రిందిస్థితి కన్న విలక్షణమై, మఱల నట్టి పూర్వస్వభావము లేకయుండును నిర్వాణస్థితిని బొందినవారి మనస్సు పైదృష్టాంతమందలి నెయ్యివంటిది ఆపై నిక పరిణామము లేదు. అదే అంతిమస్థితియగు జీవన్ముక్త్యవస్థ బుద్ధదేవుడు దీనిని గూర్చియే చెప్పుచు, స్రోతాపన్నుడు, సకృదాగామి, అనాగామి, నిర్వాణప్రాప్తుడు లేక అర్హతుడుఅను నాల్గువిధములగు జీవులుందురనియు, ఒక్కొక్కస్థితినుండి పైస్థితికి బోవువారికి వెనుకటి స్థితియందలి స్వభావములుండవనియు, నిర్వాణప్రాప్తియను అర్హతత్వము చరమస్థితి యనియు, అదే జీవితముయొక్క పరమలక్ష్య మనియు నుద్బోధించెను

320 జ్ఞానికి విషయాది దోషము లుండవు

**అగ్నిదగ్ధో యథా బీజం న భూయః పరిరోహతి।**
**తథాత్మజ్ఞానినో నిత్యం జగద్బుద్ధిర్విలీయతే ॥**

అనునట్లు, అగ్నియందు దహింపబడిన విత్తనములను చల్లి పైరు పండించితిమనిన వాక్యమును నమ్మిన నమ్మవచ్చునుగాని జ్ఞానాగ్నిచే దగ్ధమైన కర్మలు గలవారికి మఱల పునరావృత్తి గలదను వాక్యమును నమ్మరాదు అగ్నిలో కాల్చిన త్రాటిచే నేనుగును బంధించితిమని చెప్పువాక్యమునైన నమ్మవచ్చు నుగాని, జ్ఞానాగ్నియందు వ్రేల్చబడిన వాసనలు, సంస్కారములు గల జ్ఞానికి మఱల విషయాదిదోషము లుండునను వాక్యమును మాత్రము నమ్మరాదు గండుపిల్లి సంచరించుచోట నెలుకలు నిర్భీకముగ విహరించు చున్నవను వాక్యమునైన విశ్వసింపవచ్చునుగాని, నిర్విషయస్థితి నొందిన జ్ఞానియందు దృశ్య వాసనలింకనున్నవను వాక్యమును నమ్మరాదు అగ్నిదగ్ధారణ్యమున ఫలపల్లవలతాపుష్పాదులు మనోరంజకముగ శోభిల్లుచున్నవను వాక్యమునైన నంగీకరింపవచ్చునుగాని, జ్ఞానాగ్నిచే దగ్ధమైన వాసనలుగల జీవన్ముక్తుని హృదయాంతరాళమున విషయ చింతనలుండునను వాక్యము నంగీకరింపరాదు మదించిన యేనుగుల

గుంపుమధ్య సింహము నాట్యమాడుచున్నదను వాక్యము నొకవేళ నమ్మిన నమ్మవచ్చునుగాని, జ్ఞేయాకారస్థితి నొందిన విశుద్ధహృదయుని చిత్తమున వాసనాదోషము లున్నవను వాక్యమును మాత్రము నమ్మరాదు అజ్ఞాని దృశ్యపదార్థములు సత్యమని తలంచి వాటియందు భ్రమించుచున్నాడు జ్ఞాని అయ్యవి మిథ్యయని యెఱింగి, భ్రమింపక కేవలము దృక్స్వరూపుడై పరమశాంతి నొందుచున్నాడు ఆత్మేతరమగు వస్తువు వాని కెద్దియు గోచరింపదు

**321. అజిహ్వాష్షండకః పంగురంధో బధిర ఏవ చ ।**
**ముగ్ధశ్చ ముచ్యతే భిక్షుష్షడ్భిరేతైర్న సజ్ఞతే ॥**

జ్ఞాని జిహ్వయుండియు, రుచులను కోరనందున అజిహ్వుడే గుహ్యముండియు విషయవాంఛా రహితుడు గాన నపుంసకుడే, చక్షువులుండియు, దృశ్య పదార్థములదభిలాష శబ్దాదులందాసక్తి లేనివాడగుటచే బధిరుడే, ప్రజ్ఞావంతుడైనను బాహ్య ప్రపంచమున రమింపక తూష్ణీంభావము గల్గియుండుటచే ముగ్ధుడే జడప్రాయుడే

బ్రహ్మనిష్ఠ యొనర్చుటకు తగినంత అనగా ఉపాధి నిలుచుటకు మాత్రము ఒకపర్యాయము భుజించువాడు నిరాహారుడు, లేక నిత్యోపవాసియేయనియు, వసరమునకు మాత్రము హితముగా, మితముగా మాట్లాడు వాడు మౌనియే యనియు చెప్పబడును

322. జ్ఞానులకు మనస్సు బ్రహ్మాకారమై యుండును. 'జ్ఞచిత్తం సత్త్వముచ్యతే' అన్నట్లు జీవన్ముక్తుల చిత్తము కేవలము సత్స్వరూపమై యుండును. అట్లుగాక, జ్ఞానులకు మనస్సే లేదని చెప్పిన, వారు శూన్యత్వమును, జడత్వమునే ఆశ్రయించి యున్నారని చెప్పవలసివచ్చును. అది సరికాదు జ్ఞానులకు మనస్సే లేనిచో, వ్యాసాది మహర్షులు బ్రహ్మసూత్రాదుల నెట్లు రచింపగల్గిరి? శుకాదులు భాగవతాదుల నెట్లు వచింపగల్గిరి? బుద్ధదేవాదులు దేశ దేశాంతరములకు జని ధర్మము నెట్లు

బోధింపగల్గిరి? సనకాదులు మహర్షుల కెట్లాత్మోపదేశ, యోగశాస్త్రోపదేశ ముల నొనర్పగల్గిరి? క్రీస్తువు బైబిలెట్లు బోధించెను? మహమ్మదు కురాన్ షరీఫ్ నెట్లుపదేశించెను? శంకరులు సూత్రభాష్యమెట్లు రచింపగలిను? దత్తాత్రేయులు అవధూతగీత నెట్లు గానమొనర్చెను? వీరందరు జడ స్వరూపులా? శూన్యమునే ఆశ్రయించినవారా? కాదు, వీరికిన్ని చిత్తము గలదు. కాని, యదిశుద్ధమై బ్రహ్మాకారమై పరిణమించినది కాననే విషయదోషరహితమైనది అట్టి శుద్ధమనసుచే జీవన్ముక్తులగు జ్ఞానులు లోకోపకారకార్యములను జేయుచుందురు అది వారికి బంధము కాదు వారిచిత్తము కాలినత్రాడు వంటిది అట్టిత్రాడు నామమాత్రముగ నుండును గాని, బంధించుట కుపయోగపడదు అజ్ఞానిచిత్తము దహింపని, దృఢమైన త్రాడు వంటిది కాన నది విషయపరిగ్రహణమును బంధనమును గల్గించుచుండును

323 కేవలము ఇంద్రియాదులను శుష్కింపజేసి, ఆహారమును విసర్జించి చేయు ధ్యానమంత సరియైనది కాదు శరీరము నిలుచుటకును చింతన, ధ్యానాదులు చేయుటకును వలసినంత యాహారమును గైకొనుటయే మేలు లేనిచో తపస్సు తమస్సుగా మారును

324. పాషాణాది విషములను పుటముచే శుద్ధముగజేసి, కొన్ని మందులు తయారుచేసి వాటిచే వ్యాధులనెట్లు నివారించుచున్నారో అట్లే విష యదోషముగల చిత్తమును జ్ఞానాగ్నియందు పుటమొనర్చినచో, తద్గతమా లిన్యము నశించి, శుద్ధమై దారుణమైన భవరోగమును త్రుటిలో నిర్మూలన మొనర్పగల పరమౌషధముగా మారును. అపుడే యంతవఱకు జీవుని బంధించి యున్న జననమరణ రూపమగు సంసారబంధములు విచ్ఛిన్నమై పరమానంద పదవి సంప్రాప్త మగును



# 14వ రోజు 10-4-1940

325 వినుట, చదువుట, చింతించుట మొదలగు క్రియలన్నియు ఏకకాలమున సిద్ధించవలెనన్న మనస్సున కతీతమైన స్థితిలో తానుండవలెను మనస్సునకు క్రిందనే యున్నచో అట్లొనర్చుటకు సాధ్యము కాదు అనగా మనోలోకము నతిక్రమించి ఆత్మలోకమున జేరినవారే ఇంద్రియ, మనో, బుద్ధ్యాదుల క్రియలన్నిటిని ఏకకాలమున గ్రహించుటకు శక్తిమంతు లగుదురు మనస్సునకు లోబడియుండువాడు కోటలోపలనున్న • వాని చందమున నుండును ఆతడు పరిచ్ఛిన్నదృష్టి గల్గియుండును బాహ్య వస్తువులను చూడజాలడు మనస్సును దాటి జ్ఞేయాకారమున నున్నవాడు కోట వెలుపలికి వచ్చినవాడు ఆతడు సమస్తము నొక్కసారి పరికింపగలడు కాన, మనస్సను హద్దును దాటినపుడే, విశాలదృష్టి యేర్పడి మనోలోకమున నున్నదంతయు, ఇంద్రియవ్యాపార మంతయు ఒక్క పర్యాయము గ్రహింపబడగలదు కాని అట్లు మనస్సును దాటిన వారరుదు

నానాఛిద్రఘటోదరస్థిత మహాదీపప్రభాభాస్వరమ్ – అన్నట్లు అనేక రంధ్రములు గల ఘటమునందు పెట్టబడిన దీపముయొక్క కాంతి ఆయా రంధ్రముల గుండా బాహ్యమునకెట్లు ప్రసరించునో, ఆప్రకారము అట్టివారి సర్వావయవముల నుండియు జ్ఞానప్రకాశము వెల్లివిరియుచుండును. కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ, పంచప్రాణ, అంతఃకరణ చతుష్టయములను ప్రణవము యొక్క ఏకోనవింశతి ముఖములద్వారా వారు పుంఖాను పుంఖములగు క్రియావిశేషములందు ప్రవర్తించినప్పటికి, తదతీతమగు ఆత్మస్థితియందు ప్రతిష్ఠితులై నందుచే వారు జ్ఞేయమునుండి విచలితులుకాక పరమశాంతినే బొందుచుందురు ఇదియే ఆత్మానుభూతినొందిన జీవన్ముక్తుల స్థితి అట్టివారి మనోనిశ్చలత్వ మెట్లుండుననిన–

**పుంఖానుపుంఖవిషయేక్షణతత్పరోఽపి**
**బ్రహ్మావలోకనధియం న జహాతి యోగీ।**

**సంగీతతాళలయవాద్యవశంగతాఽపి**
**మౌళిస్థకుంభపరిరక్షణధీర్నటీవ ॥**

పుంఖానుపుంఖములగు క్రియాజాలములందు బ్రవర్తించుచున్నను, అనేక విధములగు నృత్యగీతవాద్యాదు లొనర్చుచున్నను, నటి తన శిరస్సు పైనున్న ఉదకకలశమును జాగ్రత్తగ పరిరక్షించుచుండునట్లు, ఆత్మజ్ఞాని సర్వేంద్రియములచే క్రియలొనర్చుచున్ననను, ప్రజ్ఞారూప చైతన్యమునందే స్థిరచిత్తుడైయుండును ఒక తంతి కార్యాలయమునకు దూరదూర ప్రదేశములనుండి వివిధములగు వార్తలు వచ్చుచున్నను, అందున్నవారు ఏకకాలముననే ఆయన్నిటి నెట్లు పరిగ్రహించుచుందురో అట్లే, ఇంద్రియ మనంబులు తత్తత్కార్యములందు ప్రవర్తించినను అవి భిన్నభిన్నములుగా నున్నను, ఆత్మ అన్నింటిని ఐక్యపఱచును గనుక, జ్ఞాని వాటివ్యాపారము లన్నిటిని ఏక కాలముననే గ్రహింపగల్గుచుండును. మనోనిగ్రహము లేనివారికి, పైన దెల్పిన ఇంద్రియ, ప్రాణ, మనోబుద్ధ్యాది పందొమ్మిది ముఖముల దాటని వారికి అట్టి సర్వతోముఖత్వము, సద్యోగ్రాహకత్వము సంభవము కాదు.

తంబుర మీటునప్పుడుగాని, పూజచేయునపుడుగాని పైవిషయ మును బాగుగ గమనింపవవచ్చును దృష్టి మీటుట యందున్నచో గానము సరిగా రాదు దృష్టిగానముపై నున్నచో మీటుట సాధ్యము కాదు ప్రారంభమున నిట్లనే యుండును. కాని క్రమాభ్యాసముచే రెండుక్రియలున్ను ఏకకాలముననే చేయసాధ్యమగును. అట్లే పూజాకాలమున, దృష్టి భగవంతుని యందు హత్తింపబడిన, పుష్పము వేయజాలము, పుష్పములు వేయుచు, మంత్ర ముచ్చరించుచునున్నచో మనస్సు మంత్రార్థమును చింతింపజాలదు. చిత్తము భగవంతునియందు సంలగ్నము కాదు నేను చిన్నకాలమున పూజచేయునపుడు ఇదే పరిస్థితి నెదురొనవలసివచ్చెను కాని అభ్యాసముచే అది సాధ్యమై రెండు క్రియలను ఏకకాలమున చేయగల్గితిని కాన సాధనచేయుచు రాగా రాగా క్రమముగ నభ్యాసపాటవముచే ఇంద్రియ

జయము, ఆత్మప్రాప్తి కూడ సిద్ధించగలదు మనస్సుతో పరమాత్మను ధ్యానముచేయుటకున్నూ, వాక్కుతో మంత్ర ముచ్చరించుటకున్ను, హస్తములతో పూజించుటకున్నూ, శక్తిగలిగి యిట్లు త్రికరణ సామర్థ్యము గలవారే పూజావిధానమును లెస్సగ నెఱింగినవారు

326 అరటిచెట్టు గెలవేయునపుడు ఒక్కొక్కహస్తము ముదరగనే దాని పైనుండు పట్ట తనంతట నదియే రాలిపోవును ప్రయత్న మేమియు నవసరము లేదు తుదకు అన్ని పట్టలు రాలిపోయిన పిదప స్వచ్ఛమైన గెల మిగులును అందులకు మూలమును పోషించుచుండిన చాలును, మఱేమియు చేయనక్కరలేదు అట్లే నిరంతరధ్యానానుష్ఠానము భగవచ్చింతన చేసినకొలది మనస్సుయొక్క యావరణ లన్నియు ( అవిద్యాగ్రంథులన్నియు) ఒక్కొక్కటిగ తమంతట నవియే వీడిపోవును వాటిని వీడగొట్టుటకు ప్రత్యేక ప్రయత్న మేమియు నవసరము లేదు అట్లుగాక అరటిచెట్టుయొక్క పట్టలను బలవంతముగ లాగి యూడబెరకిన గెల యెట్లు క్రుళ్ళిపోవునో అట్లే కఠిన తపశ్చర్యలచే ఒక్క పర్యాయము ఆవరణలన్నిటిని నశింప చేయదలంచిన నది సాధ్యము గాక పోవుటయేగాక దేహము శుష్కించి తుదకు విపరీతఫలమే గలుగుచుండును

327 అట్లనే సరోవరమున తామరపుష్పము జలసూర్యప్రకాశములు సవృద్ధిగనున్న క్రమముగ వికాసస్థితి నొందుచుండును తామర పుష్పమునకు జలమే తల్లి, సూర్యుడే తండ్రి కాడ తెగనంతవఱకు వారి రువురున్ను దానిని పోషించి వృద్ధికి తెచ్చుచుందురు. కాడ తెగినచో ఆ సూర్యుడే దానిని నెండింపజేయును ఆ జలమే దానిని క్రుళ్లబెట్టును. అట్లనే భగవద్ధ్యానమను కాడ యున్నంతవఱకు, జీవుని హృదయకమలము ప్రకృతిమాతచే వికసింపజేయబడి యూర్ధ్వముఖమయ్యే యుండును. కాని అది తెగి ధ్యానము భంగమైనచో ఆప్రకృతి మాతయే హృదయకమలమును ముకుళిత మొనర్చి, అధోముఖముగ జేసి వినాశ మొనర్చును. అపుడు జీవుడు పతితుడైపోవును

328 అరవదేశములో పూర్వము తిరువళ్ళూర్ నాయన యను గొప్ప బ్రహ్మనిష్ఠులు గలరు. వారు తిరుక్కురళ్ అను అపూర్వ ఆధ్యాత్మిక గ్రంథ మును రచించిరి అది చాల విఖ్యాతి బొందియున్నది నేటికిని దాని మహిమను జనులు కొనియాడుదురు ఎందరో దానిని పఠించి కృతార్థులైరి ఆ తిరుక్కురళ్ అను అరవపదమునకు అర్థమేమనగా, ఆవగింజలో సముద్రంతయు నిమిడ్చిన నెట్లుండునో అట్లనే దానియొక్కొక్క పదము నందు, అంత గంభీర విశాలార్థము గలదని భావము వారినొకరు గృహస్థాశ్రమము గొప్పదా, లేక సన్న్యాసాశ్రమము గొప్పదా యని ప్రశ్నించిరి వారందులకు అట్లనే చెప్పెదను కొంతకాలము వేచియుండు డనెను అట్లు కొంతకాలము గడచిన పిదప వాని నొక గృహస్థుని ఇంటికి దీసికొని పోయెను వారు నేతనేసికొని జీవించువారు. ఇతరుల నేమియు యాచింపక, తమజీవితమును గడపుచుండువారు మగ్గము నూలు మట్టిపాత్రలు ఇవియే వారి ధనము ఆగృహయజమాని మగ్గము నేయుచుండగా మఱియొకరితో మాట్లాడు నవసరమున, కండె క్రిందకు జారిపడెను. దానినందుకొని యిచ్చుటకై యాతడు తనభార్యను పిలిచెను ఆమె మహాపతివ్రత! అపుడామె బావిలో నీరు తోడుచుండెను బొక్కెన సగమువఱకు పైకిలాగెను ఇంతలో భర్తగారి కేకవిని, దానినట్లనే వదలివైచి వారికడ కేగెను కాని బొక్కెన అట్లనే బావిమధ్య నిలబడియుండెను

అది హేమంతఋతువు, భర్త యొకదినమున చల్దీ అన్నము భుజించుచు, అది యుడుకుగా నున్నది, విసరుమని భార్యను పిలిచి చెప్పెను ఆ సమయమున నాసుగుణవతి రోటిలో నేదియో దంచుచుండెను. కాని, భర్తమాట వినగనే సగము పైకెత్తిన రోకలిని అట్లనే వదలి వెంటనే వారికడ కేగెను. అపుడా రోకలి యట్లనే ఆకాశమున నిలబడియుండెను

ఈ చిత్రము లన్నిటిని నాడాప్రాశ్నికునకు తిరువళ్ళూరునాయన ప్రత్య క్షముగ నాగృహస్థుని యింట జూపెట్టి, పాతివ్రత్యమహిమను బోధించి, యట్టి గృహిణి యున్నచో గృహస్థాశ్రమము మంచిదే యని బోధించెను

ఇక మరియొకచోటునకు వానిని తీసికొనిపోయెను అదియొక రాజగృహము ఆనా డారాజకుమార్తెయొక్క స్వయంవరణ మచట జరుగు చుండెను రాజకుమార్తెతోబాటు వరునకు అర్ధరాజ్యముకూడ నివ్వబడునని ప్రకటింపబడుటచే అనేక ధనికులును, శ్రీమంతులునగు రాజులు, చక్రవర్తులు కూడ నటకు ఆస్వయంవరణమున పాల్గొనుటకై విజయము చేసిరి రాజబంధువులు, సామంతులు, పురజనులు కూడ అనేకులు విచ్చేసిరి ఆప్రేక్షక సముదాయమున నొక సన్న్యాసికూడ నుండెను అచట నేమి చిత్రము జరుగనున్నదో చూచుటకై యాతడేతెంచెను ఇంతలో వరణ కాలము సమీపించెను వధువగు రాచకొమరిత బాగుగ నలంకరింపబడెను చేత పుష్పమాలను గైకొనెను. ఏలన రాజవనిత స్వయంవరణకాలమున తాను వరించిన వాని మెడలో నాపుష్పహారము వేయుట ఆకాలపు వాడుకయై యుండెను నాటి స్వయంవరణమున పాల్గొన దలంచిన రాజులందఱును బారులు దీర్చి యొకచో గూర్చొనియుండిరి ఇంతలో రాకొమరిత చేత నాపుష్పహారమిడు కొని వారిచెంతకువచ్చి ఒకరొకరిని వీక్షించుచు పోయెను, కాని యెవరి మెడలోను హారము వేయలేదు పంక్తి సమాప్తి యగుసరికి నీ చివర ప్రేక్షకులలో బడియున్న సన్న్యాసిని జూచి, మిగుల తేజోమయుడై, దీప్తిమంతుడై చెన్నొంది యుండుటను గాంచి వెంటనే యాతని మెడలో నాపూమాలను బడవైచెను ఆతడద్దానిని తీసి యట పారవైచి పరుగిడ సాగెను దీనినంతయు నాతిరువళ్ళూరునాయన తనమిత్రునకు జూపి, ఇట్టిది యైనచో సన్న్యాసాశ్రమమే గొప్పది యని వచించెను సారాంశము ఏయాశ్రమమునకు జెందినప్పటికిని, తద్ధర్మములను చక్కగా ననుసరించుండినచో, ఆతనికదియే శ్రేయము నొనగూర్చును

329 తిరువళ్ళూరు నాయన జీవితచరిత్ర నుండి మనము గ్రహించ వలసిన విషయము లెన్నియో గలవు ఆతడు భోజనము చేయు సమయమున తన భార్యతో ఒక నత్తగుల్ల, సూది, కొంచెము నీరు తెచ్చి భోజనకాలమున ప్రతిదినము ప్రక్కన పెట్టియుండుమని చెప్పియుండెను ఆమె అట్లనే

యొనర్చుచుండెడిది ఎందులకట్లు నుంచుకొనుచున్నారో ఆమె యడుగ లేదు అతడు చెప్పునూ లేదు ఇట్లు చాలా కాలము గడచినది.

తుదకు కాలము సమీపించినది మరణశయ్యపై నున్న యాతనిని తన భార్య యిట్లడిగెను "మహాత్మా! నాకేసంశయమును లేదుగాని యిన్ని దినములు భోజనమయమున ఆవిధముగ నత్తగుల్ల సూది నీరు ప్రక్కన నుంచుకొనుటకు కారణమేమి? ప్రతిదినము తెచ్చియుంచినను వాటినొక పర్యాయమైనను వాడకుంటిరే? అవి యేలకో?" అంత నాతడు "కారణము చెప్పెద వినుము అన్నము భుజించునపుడు, పొరబాటున నెపుడైన ఒక మెతుకు క్రిందబడినచో దానినాసూదితో నెత్తి, నత్తగుల్లలోని నీటిలోకడిగి భుజించుటకై వాటినచట నుంచితిని కాని యింతవఱకు ఒక్కమెతుకైనను అట్లు క్రిందపడకుండుటచే వాటినుపయోగించుట కవసరమే చిక్కలే" దనెను చూచితిరా! అన్నమునెడ ఎంతగౌర ముండియుండినదో అతనికి కనుకనే అన్నం బ్రహ్మయని శ్రుతులలో చెప్పబడినది.

అన్నము బ్రహ్మస్వరూపము. కాన అన్నమును తిరస్కరించినవాడు బ్రహ్మమును తిరస్కరించినవాడే యగును. అన్నమును బహు పవిత్రభావనతో చూడవలెను. కావలసినంతయే పెట్టించుకొని భుజింపవలెనుగాని ఎక్కువ వడ్డించుకొని పారవేయరాదు అట్లు చేయుట పాపహేతువే యగును ఎందఱో సగము కూటికైనను లేక మలమల మాడుచుండ తిన్నంత పారవేయు చుండు స్వభావము గలవారు ఇతరుల యన్నమును పోగొట్టిన వారగు చున్నారుగాన పాపమునే యొడిగట్టుదురు కాన, అన్నము నెంతో పవిత్రభావముతో జూడవలెను "అన్నం న నిన్ద్యాత్ తద్వ్రతమ్" (తైత్తిరీయ శ్రుతి) అనగా అన్నమును నిందింపరాదు అట్లు దృఢవ్రతము గావించుకొన వలెను కనుకనే జగన్నాథ దేవాలయములోను శ్రీకృష్ణచైతన్యులవారి మఠములలోను పంక్తిభేదము లేక అందఱు కలసియే ప్రసాదమును భుజింతురు భుజించిన పిదప చేతులుగూడ ఒక తొట్టిలో కడుగుదురు ఆ కడుగునీరు మెతుకులు ఇంకొక ప్రాణికైనను ఉపయోగపడునుగదా యని

తలంచి కనుకనే 'సర్వం జగన్నాథం' అని వాడుకపడినది

330 తిరువళ్లూరునాయన గారి గురుశిష్య సంప్రదాయమును గూర్చిన మఱియొక చరిత్రగలదు తిరువళ్లూరు నాయనయొక్క తపఃప్రభావము, ఆధ్యాత్మికశక్తి, పవిత్రహృదయముగాంచి యచ్చోటగల యనేకులు వారియెడ అత్యంత శ్రద్ధాభక్తులుగల్గి వారివలన బోధలను వినుచుండిరి వారందఱున్ను తమగురువునుగూర్చి, తమకేదేని మంత్రము నుపదేశింపుడని బహువిధముల ప్రార్థించిరి కాని యాతడెవరికిని మంత్రోప దేశము చేయలేదు సరి చూచెద, సరి చూచెదనని చెప్పుచు సరియైన ముహూర్తము దొఱకలేదని కాలమును పొడిగించుచుండెను ఇట్లు పండ్రెండు సంవత్సరములు గడిచెను ప్రతిదినము వారు వారిని తొందఱ చేయుచునే యుండిరి అపుడొకనాడు వారందఱితోను తానిట్లనెను ''రేపు కార్తిక శుద్ధపూర్ణిమదివసము చాల పవిత్రమైనది. నాటి రాత్రి సరిగా 12గంటలకు మీరందఱు సుస్నాతులై, విభూతి ధరించి, జపమాలలుగైకొని పుష్పహారతుల దీసకొని సమీపముననున్న కావేరీనదీతీరము వద్దకు చేరుడు అపుడుపదేశించెద'' ననెను అది వినగానే, యిక వారి సంతోషము చెప్పనేల! పండ్రెండు సంవత్సరములున్ను చేసిన తపస్సు నేడు ఫలించినది గదా యని యువ్విళ్లూరు చుండిరి అట్లే యారాత్రివారు గుర్వాజ్ఞానుసారము సన్నద్ధులై వచ్చి నదీతీరమున వేచియుండిరి

వర్షము బోరున గురియుచుండెను నది వెల్లువలై ప్రవహించు చుండెను తుపానుగాలి వీచుచుండెను నలుదెసల కారు మబ్బులు క్రమ్ముకొనెను లోకమంతయు నంధకారబంధురమై యొప్పుచుండెను అత్తఱి గురుమహారాజటకేతెంచి వారందరితో ''ఈచోటు కాదు ఆవలి తీరమున నొక పుణ్యాశ్రమము గలదు. అదియే ఉపదేశమునకు తగినచోటు, నేను బోవుచున్నాను మీరున్ను వెంటరండు మీరు ప్రత్యగాత్మస్వరూపులు కాన దేహాభిమానమును విడిచి రం''డని తాను ఆ నదీమధ్యమునుండి జొరబడి వెళ్లిపోయెను

ప్రవాహవేగ మతితీవ్రముగ నుండెను పాపము తక్కిన వారేమి చేయుదురు సరే, గుర్వాజ్ఞ మీరగూడదు గదా యని వారున్ను నదిలోనికి దిగిరి నడుమువఱకు కంఠమువఱకు నీరెక్కెను ఇకనేమున్నది! హతాశులై నిలిచిపోయి వెనుకకు తిరిగిరి మఱి కొందఱు నీటిలో దిగకనే వెనుకకు మఱలిపోయిరి ఒకడుమాత్రము గురువుతో పోగల్గెను ఆతడే సరి యైనవాడని తలంచి గురువు వానికే యుపదేశించెను. గురువు వెంట బోగల్గిన వారే, గురువు త్రొక్కిన బాట ననుసరింపగలవారే, గురువాచరించుదాని ననుసరింపగలవారే, కష్టముల, సంకటముల నెదుర్కొన గలవారే నిజమైన గురుభక్తులు వారే యుపదేశార్హులు తక్కిన వారుకారు. ధాన్యమును తూర్పార బట్టునపుడు పొల్లంతయు బోయి వట్టి సస్యములు మాత్రము మిగులునట్లు పరీక్షాసమయమున నెగ్గగల్గువారే యథార్థ మానవత్వము గలవారగుదురు అట్టివారే లోకమునకు మార్గ దర్శకులై యొప్పుదురు

331 ఒకరాతిబండ విగ్రహము కానపుడు మొదట నేవీధిలోనో, యేమూలనో యేకొండపైనో పడియుండును దానిని జనులు త్రొక్కుచునే పోవుచుందురు, మఱియు మలిన పఱచుచుందురు కాని, యద్దానిని శిల్పిగైకొని ఉలితోను, సుత్తితోను కొట్టికొట్టి తుదకు శ్రీరామవిగ్రహమో, శ్రీకృష్ణవిగ్రమో, శ్రీనందికేశ్వర విగ్రహమో, శ్రీహనుమంతుని విగ్రహమో చేసినపుడు, రథముపై పెట్టి, పూలహారములు వేసి, మేళతాళములతో గూడ నూరేగించి మ్రొక్కుచుందురు చూచితిరా! యెంత మార్పుగల్గినదో!

అట్లే ప్రప్రథమమున సామాన్యస్థితియందుండి, అనేకులచే నిందింప బడుచు, ధిక్కరింపబడుచు బహిష్కరింపబడుచు నున్న మానవు డైనప్పటికి, గురుసన్నిధి జేరి, యుచిత శిక్షణంబను ఉలిదెబ్బలు తిని, కఠినసాధనములు, నియమములను సుత్తి వేటుల కోర్చుకొని, స్వాత్మోన్నతికై దీర్ఘకాలము యత్నీకృతుడై యుండు తఱి, యొకకాలమున, ప్రకృతిదోష మంతయు పూర్తిగ నశింప, ఆతడే లోకపూజ్యుండవును జీవుడు శివుడుగా మారును కాని, ఉలివ్రేటులకు తాళజాలక పగిలిపోయిన విగ్రహము ఎట్లు పూజార్హము

గాక పారవేయబడునో, అట్లే గురుశిక్షణకు తాళజాలక పారిపోవువాడున్ను ప్రజలచే నుపేక్షింపబడుచు ఉన్నతస్థితి బొందజాలక యుండును

ఈ రీతిగనే, గనియందలి మట్టిలో కలిసియుండు మలినబంగారును తీసికొనివచ్చి, ద్రావకములచే దానిని పుటమొనర్చి, శుద్ధముచేసి, యంత్రములో పెట్టి నొక్కి బాగుగా లాగి, తీగగ జేసినపుడుగాని, లేక సన్నని సుత్తితో కొట్టి భూషణముగ చేసినపుడుగాని మాత్రమే బంగారము జనుల కంఠ, శిరోభాగముల నలంకరింప యోగ్యమై యుండును ఇన్ని శ్రమల కోర్చుకొనినది గనుకనే యది సర్వజనులకు శిరోధార్యమై యలరుచున్నది. లేనిచో నెచటనో పడి దిక్కులేక యుండెడిది అట్లే సాధకుడును, అధ్యాత్మ లోకమున తగిన పరిశ్రమ చేసినచో కొంతకాలమునకు శుద్ధుడై, విశ్వ వంద్యుడు కాగలడు

**332.** తిరువళ్లూరునాయనగారి సమాధిని గూర్చిన యొక విచిత్ర ఉదంతము గలదు వారి దేహవియోగకాలము సమీపించినపుడు శిష్యులందఱును, సమాధియైన తదుపరి యాదేహమును మంగళవాద్యములతో రథారోహణము చేయించి, గొప్పగ నూరేగించి యొకచోట అందమైన సమాధి నొక దానిని నిర్మించి యందుంచ దలించిరి శిష్యుల యంతరం బెఱింగి, గురువు ''నాయన లారా! నేనుపోయిన పిదప నిక నీతుచ్ఛదేహముతో నేమి పని? ఇది యెచట పడియుండిననేమి? భోజనము చేసిన పిదప విస్తరి నెచట పడవైచిననేమి? దానికి గౌరవమేల, పూజ్యతయేల? సత్కారమేల? పాము కుబుసము విడిచిన పిదప, ఆకుబుసమెచట పడియుండినను దానికేమి? కాన నేనీదేహమును వీడిన యనంతరము దీనిరెండుకాళ్ళ బొటనవ్రేళ్ళకు తాడుగట్టి, వీధులగుండా, బజారుగుండా, యీడ్చి, గిరగిరతిప్పి, శ్మశానములో పారవేయు''డని యాజ్ఞాపించెను

అది వినినతోడనే శిష్యుల హృదయములు గుభెల్లు మన్నవి గుండెలదఱి పోయినవి ఏమి చేయుదురు! ధర్మసమస్య యేర్పడినది గురువాక్య ముల్లంఘింతుమా, గురుద్రోహ మొనర్చినవార మగుదుము

అనుసరింతుమా, శివ! శివ! ఎద్దాని పవిత్రస్పర్శచే భక్తకోట్ల తాపత్రయ ముడిగి, వారల సంసారవేదన చల్లారెనో, ఏపవిత్రపాదరజముచే శిష్యకోటి పునీతంబయ్యెనో, అట్టి దేహమునా, వీథులలో నీడ్చుట! రామ! రామ! చేతులెట్లు వచ్చును? ఇట్టి ద్వంద్వ వితర్కములలో బడి చాలసేపు యోచించు కొని తుదకు, మోమోటమున గురువుతో సరే అట్లనే చేసెదమని పైకి నొప్పుకొనిరి కాని లోలోన వారిట్లు నిశ్చయించుకొనిరి ప్రాణవియోగమైన పిదప నిక మన ఇష్టారాజ్యం- ఏమి చేసినను చూచునదెవరు? బ్రహ్మాండ ముగా నూరేగించి తీసికొనిపోయి నొకచోట సమాధి నిర్మించెదము''- గురువుగారు వారియంతరంగమును తెలిసికొనినను అపుడేమియు పల్కకయూర కుండిరి

ఇంతలో వారు మహాసమాధిని బొందిరి ఇక మొదలుపెట్టిరి గదా- మేళములు, తాళములు,తప్పెట్లు, తూర్యాలు, లెక్కలేవు గొప్ప రథమును నిర్మించి అనేక పుష్పహారములతో దాని నలంకరించి, గురు దేహమును నాపుష్పవిమాన మందుంచి, మహాపటాటోపముతో నలుదెసల ద్రిప్పుచు నూరేగింపసాగిరి

కాని ఎత్తి కొంతదూర మేగుసరికి గురువు కన్నులు విప్పి తేరచూచెను ఆర్భాట మంతయు బాగుగ పరికించెను శిష్యులు స్తబ్ధిల్లిరి ఏమిచెప్పుటకును తోచలేదు అపుడు గురువు 'అవిశ్వాస్యులారా! మీకు గురువాక్యమున శ్రద్ధ లేదు. కాన మీకీజన్మమున ముక్తి లేదు మీకొకవిధమగు భక్తిమాత్రము కొంతయున్నందుచే నరకప్రాప్తిలేదుగాని ముక్తి మాత్రము లభింపదు మఱల జన్మించి శ్రవణాదుల నభ్యసించి క్రమముగ దివ్యశక్తినొంది తరింతురు గురుధిక్కార పాపప్రతిఫలమిదియే కాన, ఇప్పటికైనను విశ్వాసము గోల్పోవక పూర్వము వచించినట్లు, త్రాడుచే నీ దేహమునీడ్చి పారవేయు' డని చెప్పి మఱల మహాసమాధి బొందెను శిష్యగణ మట్లనే చేసెను అపుడు శ్మశానమున నాదేహమును స్పృశించిన మాత్రముననే మృగములు, పక్షులు, అన్నియు దివ్యశరీరులై విమానములపై నుత్తమలోకములకు బోవుచున్నట్లు

గన్పట్టెను ఒక శిష్యుడు మాంసమయిపోగా ప్రేమాతిశయమున వారి యెముకల క్రిందబడి యున్న మట్టిని ప్రోవుజేసి తినగా, అది కంఠము వఱకు వచ్చి నిలువ నంత పర్యంతము వాని శిరస్సునకు దివ్యశక్తి కలిగెను.

333 నిర్మలాకాశమున మేఘమేమియు నుండనట్లు వాసనావృత్తు లన్నియు పూర్ణముగ నశించినట్టి నిర్మలస్థితియే నిర్వాణపదవి యగును ఒక్కొక్క సంకల్పము రహితమైన కొలది జీవునకొక్కొక్క జన్మ తగ్గుచున్నట్లు అనగా అంతఃకరణలోని ఒక్కొక్క వృత్తి నశించిన కొలది జీవుడొక్కొక్క మెట్టు పైకి నెక్కినట్లగును అట్లు క్రమముగా వృత్తులన్నియు నశించి నిస్సంకల్ప స్థితి యెపుడు చేకూరునో, అపుడు జీవుడు ముక్తిధామము, లేక మోక్ష సాధనమును చేరినట్లగును బ్రహ్మసాక్షాత్కారము నొందిన వానికిక విషయేచ్ఛ యుండదు ఒకవేళ దృష్టి బహిర్ముఖమున ప్రవర్తించినను, ఆదృశ్యమునకు తాను విలక్షణుడనిన్ని, దృక్స్వరూపుడే యనిన్ని దృఢబోధ గల్గియుండును

334 గీత 14వ అధ్యాయము చాల అగాధమైనది గీతయందలి అన్ని అధ్యాయములలో నిది చాల ముఖ్యమైనది తక్కినవి దీని యందంతర్భూతము లైనవే ఇందు మూడుగుణములను గూర్చియు, వాటి స్వభావములను గూర్చియు, ఫలములగూర్చియు, గుణాతీతుని లక్షణము లను గూర్చియు విశదముగా చెప్పబడినది, సత్వరజస్త మోగుణములు మూడున్ను జీవుని బంధించుచున్నవి అవి బంగారు, రాగి, యినుప గొలుసుల వంటివి ఈత్రిగుణాత్మకమగు ప్రకృతిని దాటుటయే బంధవిముక్తి

335 ఒక వైద్యునివద్ద మందు తీసికొనినపుడు పథ్యాపథ్యముల రెంటిని తెలిసికొనవలసి యుండునట్లు దైవీసంపద, ఆసురీసంపద రెంటిని తెలియవలసియుండును అపుడేయేవి గ్రహింపదగినవో, యేవి త్యజింప దగినవో బాగుగ బోధపడును

336 గుణములు మున్నగునవి ఆగంతుకములే గాని, ఆత్మయందు స్వభావముగ లేవు స్వభావము లైనచో నెప్పటికిని రహితము కాకయే యుండవలెను అట్లు కానుపించుట లేదు. ఎందఱో త్రిగుణాతీతులై ముక్తిబొంది యున్నారు కాన, వస్త్రమునకు రంగు ఆగంతుక మైనట్లు ద్రావకములో వైచిన ఆరంగు వీడి, పూర్వపు సహజ శ్వేతత్వము బహిర్గత మైనట్లు ఆత్మధ్యానముచే త్రిగుణములను మాలిన్యము నశించి జీవుడు శుద్ధస్థితికి వచ్చును. యధార్థస్థితిని మఱుగుజేయుటయే మాయయొక్క, ప్రకృతియొక్క పని కనుకనే అయ్యది ఆత్మవస్తువును మఱుగుపఱచి దేహేంద్రియాది దృశ్య ప్రపంచము నంతయు తోపింపచేసి భ్రమను గలుగజేయుచున్నది కాన మాయా స్వరూపములగు త్రిగుణముల నతిక్రమించినవాడే ప్రకృతి బంధమునుండి తొలగుచున్నాడు

337. సత్త్వగుణము ప్రకాశరూపము, రజోగుణము మోహ రూపము, తమోగుణము అజ్ఞానరూపము- ఈమూటిని నిరసించిన వాడే అతీతుడు అట్టి వాడే నిందాస్తుతులకు చలింపడు ముష్టిచెట్టును చూచి చేదని కోపగించుకొనడు మామిడిచెట్టును చూచి తీపని సంతోషపడడు చింత చెట్టును జూచి యిది పులుపని యేహ్యపడడు అవి వాటి వాటి స్వభావమని తలంచి లోలోన ఆనందించును అట్లే ఆరూఢుడు త్రిగుము గలవారిని, పుణ్యపాప మిశ్ర కర్మలు గలవారిని జూచి వారి వారి స్వభావము లట్లుండునని తలంచి వారియెడ తూష్ణీంభావము వహించియుండును అట్టి యారూఢ త్వము నొందని సామాన్యులకు గీతయందు 14వ అధ్యాయమున గుణత్రయ విభాగయోగమున గుణాతీతస్థితిని జెప్పిన నందుకొనజాలరనియు, పొందశ్రమపడుదు రనియు నెంచి అనన్యభక్తియే సులభమగు మార్గమని తుదకు బోధించిరి అట్లనే 6వ అధ్యాయమైన ధ్యానయోగమున కూడ తుదకు భక్తియే ముఖ్యమని వచించిరి

338 వెలిగారము కొంచెముగ వేసి బంగారమును పుటముచేసిన, అది శుద్ధమగును విశేషముగ వేసిన ఆబంగారునే యది భస్మ మొనర్చును అట్లనే

ఔషధము మితముగ సేవించిన వ్యాధి కుదురును విశేషముగ సేవించిన శరీరము నష్టమగును ఆరీతిగనే తపస్సు కడుజాగ్రత్తగ నొనర్చవలెను యుక్తాహారవిహారులై, తగిన పదార్థములను మాత్రమే శరీరమున కారోగ్యము కొలకిచ్చుచు క్రమేణ సాధన చేయుచు రావలెను

339 అసంప్రజ్ఞాత సమాధియందు అవిద్య, అస్మిత (అహంకారము), రాగ, ద్వేష, అభినివేశములను పంచక్లేశములు నశించును

**340. అంకుశేన వినా మత్తో యథా దుష్టమతంగజః ।**
**విజేతుం శక్యతే నైవ తథా యుక్త్యా వినా మనః ॥**

మదించిన యేనుగను మావటివాడు పట్టి, దానికి తగిన శిక్షణ యొనర్చుచు, నెదిర్చినచో అంకుశముతో నాడుల సంధులందు పొడుచుచు, లాగి పట్టుచు, ఎట్లు క్రమముగ దానిని వశపఱచుకొనునో, అట్లే స్వేచ్ఛగా సంచరించునట్టి మనస్సను మదపుటేనుగును గురువాక్యమను కట్టుకొయ్యకు బిగించి, సాధనయను శిక్షణ నొసంగుచు రాగా, రాగా క్రమముగ నదియు వశమగును మొదట నేనుగకు స్వల్పాహార మిచ్చిననే దాని శరీరము తగ్గి మదమణగును స్వాధీనమైన తరువాత ఆహారము విశేషముగ నిచ్చినను శాంతముగనే యుండి గొప్ప గొప్ప తీర్థోత్సవములందును జనసమూహము లందును గూడ నితరుల కేహానియు నొనర్పక పోవుచుండును అట్లే అభ్యాసకాలములో బ్రహ్మనిష్ఠుడు సాత్త్వికాహారమును స్వల్పముగ సేవించుచు ఏకాంతమున లేక గురుసన్నిధిని అనుష్ఠానము చేయవలెను అట్లు నియమబద్ధుడై గురుసన్నిధిని అభ్యాసము చేయుచు రాగా, కాలక్రమమున నారూఢుడైన తరువాత అనేక జనుల సమూహమందు ధర్మోపన్యాసములు చేయుచున్నను, వినమ్రుడై, శాంతచిత్తుడై, సత్యధర్మ నిరతుడయ్యే యుండి, తానను ష్ఠించి యితరుల ననుష్ఠింపజేయుచుండును

341 అన్ని జన్మలలోను మానవజన్మ సర్వోత్కృష్టమైనది దీనికి కారణము కఠోపనిషత్తునందు ఇట్లు వివరింపబడినది

**యథాఒఒదర్శే తథాఒఒత్మని యథా స్వప్నే తథాపితృలోకే యథాప్సు పరీవ దదృశే తథా గంధర్వలోకే ఛాయాతపయోరివ బ్రహ్మలోకే ।**

అద్దములో ముఖము ఎట్లు స్పష్టముగ గోచరించునో, అట్లే మానవాంతఃకరణములో ఆత్మచైతన్యము విస్పష్టముగ గోచరించును పితృలోకస్థయులకు స్వప్నవస్తువువలెను, గంధర్వలోకీయులకు నీటియందలి ప్రతిబింబము వలెను, బ్రహ్మలోకీయులకు ఆతపచ్ఛాయవలెను ఆత్మ అస్పష్టముగ గోచరించును ఇట్టి యుత్కృష్టత, ఆత్మసాక్షాత్కారమునకు తగిన యనుకూలత గల్గియున్నందువలననే సర్వలోకవాసులును, ఎపుడు భూలోకమున మానవజన్మ మెత్తి తరింతువమా యని యువ్విళ్లూరు చుందురు కాన మానవజన్మ శ్రేష్ఠత్వమును గ్రహించి, ఈజన్మలోనే యెట్లైనను కడతేరుటకై సర్వులును యత్నింపవలెను ఏలన, మఱల నిట్టి యుత్కృష్ట జన్మ లభించునో, లేదో యెవరి కెఱుక?

342 బ్రహ్మనిష్ఠుల ముఖమునుండి అపవిత్రమైన వాక్కు రాకూడదు అట్లు వచ్చినచో వారి వాక్పుణ్యము తగ్గిపోవును అట్లే మనస్సుతో అపవిత్ర చింతన చేసినను మనస్సుయొక్క పుణ్యము తగ్గిపోవును ఆరీతిగనే సర్వేంద్రియములు వాటివాటి పుణ్యమును గోల్పోవుచుండును వాక్పుణ్య మెపుడు తగ్గిపోవునో, అపుడావాక్కుతో చెప్పినదేదియు ఫలింపదు (నెరవేరదు) కాన వాక్శుద్ధి గలవారి యొక్క వాక్యమును, సంకల్పశుద్ధి గలవారియొక్క సంకల్పమున్ను వెంటనే ఫలితమునకు వచ్చును భారతములోని శృంగియే యిందులకు దృష్టాంతము తనతండ్రియగు శమీకుని మెడలో మృతసర్పమును వైచినాడను కారణమున శృంగి పరీక్షితుని శపించినపుడు వానివాక్కు ఫలించి యేడుదినములలో తక్షకఫణీంద్రునిచే నాతడు హతుడాయెను ఋషులకుగల శాపానుగ్రహ సామర్థ్యమునకు వారల వాక్శుద్ధియే కారణము అట్లనే సంకల్పశుద్ధిగల మహనీయులు తాము తలంచిన దంతయు ఒక్క క్షణములో నెరవేర్పగల శక్తిగల్గియుండిరి విశ్వామిత్రుడు తన సంకల్పబలముచేతనే బ్రహ్మకు ప్రతిసృష్టి చేయగల్గెను ఋషులకట్టి దివ్యశక్తి యున్నది

కనుకనే మహారాజులు, చక్రవర్తులు, గొప్పగొప్ప శ్రీమంతులుకూడా హస్తబద్ధులై వారిపాద సేవచేయుచు వారి యాజ్ఞకై వేచియుండెడివారు నిజముగా లోకమునుద్ధరించవలెనన్న అట్టి ఆత్మశక్తి, దైవశక్తి, లేక చైతన్యశక్తి గలిగియే తీరవలెను ఋషియనగా నొక బిరుదుమాత్రమే ఇపుడు డాక్టరు, ఇంజనీరు అని యెటుల చెప్పుచున్నారో అట్లు అదియున్ను ఒక పదవి మాత్రమే దాని కెవడు యోగ్యుడో, అట్టివాడెవడైనను, ఆ బిరుదు పొందుటకు అర్హుడగును ఋషి యనుపదమునకు మూడు అర్థములు గలవు

1 ఋషయో మంత్రద్రష్టారః – మంత్రముల సృజించిన వారు ఋషులు
2 ఋక్కులను వేదావాక్కులను, తదర్థభూతమగు పరమాత్మను సాక్షాత్కరించుకొనిన వారు ఋషులు
3 హృషీకములను అనగా ఇంద్రియములను జయించినవారే ఋషులు

ఊర్ధ్వరేతస్కుడును, తీవ్రవ్రతంబు గలవాడును, నియతాహారియు, నిగ్రహానుగ్రహ శక్తిగలవాడును సత్యసంధుడును ఋషి యనబడును కాన నిట్టి ఋషిత్వము సర్వులకును సాధ్యమగును కృత, త్రేతా, ద్వాపర యుగములందు అగ్ని (జ్ఞానాగ్ని) కెట్టి జ్వలనశక్తి ( ఆత్మసాక్షాత్కారశక్తి) యుండెనో, నేటికిన్ని అది యుండియే యున్నది. కాని దానియందిపుడు కట్టెలు( భక్తి, ధ్యాన, వైరాగ్యాదిసాధనలు) వేయకపోయినారు కనుకనే అది ప్రజ్వలించ లేదు అట్లు దానియందు కట్టెలు వేయువారు స్త్రీలైనను, పురుషులైనను, బాహ్మణులైనను, అబ్రాహ్మణులైనను, గృహస్థులైనను, సన్న్యాసులైనను ఎట్లు అది జ్వలించియే తీరునో, అట్లనే ధాన్య, వైరాగ్యాది యత్నములు గలవారెవరైనను, వారిహృదయములో జ్ఞానాగ్ని ప్రజ్వలించియే తీరును. కనుకనే స్త్రీలలో గార్గి, మైత్రేయి, చూడాల, కాత్యాయని, విశ్వవర, మదాలస, సులభ మొదలగువారు ఋషులైరి బ్రహ్మజ్ఞానుల పరంపరకు మూలస్థానము వహించినది పౌతిమాషి యను స్త్రీ యని ఆత్మపురాణమున పేర్కొన

బడియున్నది అట్లే బ్రాహ్మణులందు వసిష్ఠ వామదేవాదులును, క్షత్రియు లందు విశ్వామిత్ర జనకాదులు, వైశ్యులందు తులాధారాదులును, శూద్రు లందు సూతుడు, విదురుడు, ఉద్ధవుడు మున్నగువారును బ్రహ్మజ్ఞులైరి ఇవుడైనను నెవరైనను అట్టి అనుష్ఠానము గల్గియున్నచో బ్రహ్మజ్ఞులు తప్పక కాగలరు నాటకములో శ్రీరామ, శ్రీకృష్ణ వేషముల వేసినంతమాత్రాన రామ, కృష్ణులెట్లు కాజాలరో, అట్లే పైజెప్పిన ఋషుల వేషములను మాత్రము ధరించిన, ఋషులెన్నటికిని కాజాలము. వారివలె నాచరణ చేసిననే వారు పొందిన యలౌకిక దివ్యపదమును మనమును పొందగలము

343 సాధనలలో బ్రహ్మచర్య మతిముఖ్యమైనది అది సరిగ లేనిచో వారి వాక్కులుగాని, సంకల్పములుగాని యూషరక్షేత్రమున బెట్టిన క్రుళ్లిన విత్తనమువలె వ్యర్థమగును రెండు విధములుగ జెప్పబడిన బ్రహ్మచర్యము లలో గృహస్థ బ్రహ్మచర్యము గలవారికి జ్ఞానప్రాప్తి చేకూరినను నైష్ఠిక బ్రహ్మ చర్యముగల వారివలె వాక్-శక్తి తపశ్శక్తి యుండదు. శుక, జనకులే యిందు లకు తార్కాణము శుకుడు బ్రహ్మవిద్యోపదేశమునకై జనకుని యాస్థాన మునకు జనినపుడు, జనకుడు వానితో నిట్లనే చెప్పెను మే మెట్టి జ్ఞానులమై నను, తుదకు గృహస్థులమే, అనేక విషయములతో సంబంధపడి యుండ వలసివచ్చును మీకున్నంత పవిత్రత, బ్రహ్మచర్యము. తపస్సు, సంకల్పసిద్ధి మాకు లేదు కాన ఎట్లయినను మీరే మాకు పూజ్యులు, మీరే మాకు గురువులు అని చెప్పి తాను యథావిధముగ బ్రహ్మవిద్యోపదేశము చేసినను తుదకు గురు భావముతో అతనికే సాష్టాంగ దండప్రణామ మాచరించెను

344. మనోవాక్కాయములను నిగ్రహించుటకొక యుపాయము గలదు సామాన్యముగ శరీరమందలి యే అవయవమునైనను, చేతినిగాని, కాలిని గాని, తలనుగాని ఒక ప్రక్కకు త్రిప్పి కొన్ని మాసము లావిధముగనే యుంచుచు వచ్చిన, నిక నది యాస్థితి యందే యుండిపోవును. అట్లనే నియ మప్రకారము ఒక మాసము దినములు అసత్యము వచింపక శీలించుచు వచ్చిన నికనది యభ్యస్తమైపోవును ఈవిధముగా ప్రతిదానిని సాధించ వచ్చును

నశ్రేయో నియమం వినా యన్నట్లు నియమమునకు బద్ధులు కానిచో శ్రేయము లభించదు కాన నియతి బద్ధులై యున్నచో నచిర కాలములోనే సర్వేంద్రియ నిగ్రహము సమకూరగలదు

345 ఇక్కాలమున బ్రహ్మజ్ఞానము పతన మగుటకు రెండు కారణములు గలవు అవియేవన 1 మనస్సే ప్రధానము గాన, ఏమి తినినను, ఏమి చేసినను ఆత్మయగు మాకేమియు దోష మాపాదింపదనుటయు, 2 ఇంద్రియములకు విషయము స్వభావములై యున్నవిగాన, ఆయా ఇంద్రియములు తమ తమ స్వభావరూపమైన విషయములందు ప్రవర్తించినను, తమ కేమియు హాని లేదనుటయు- ఈరెండు సంకుచిత దృష్టులు గల్గియుండుటయే నేటి బ్రహ్మజ్ఞాన పతనమునకు హేతువై యున్నది ఇంద్రియములకు విషయములు స్వభావములు కావు. అగంతుకములు స్వభావములే యైనచో, వాటి కెన్నడును నాశముగాని, మార్పుగాని యుండ కూడదు కాని యెందటికో అట్టి స్వభావమున పరిణామమున్ను, ఎందటికో దాని నాశమున్ను కూడ గలిగినది కలుగుచున్నది. కాన, అది సరి కాదు.

**ప్రకాశోఽర్కస్య తోయస్య శైత్యమగ్నేర్యథోష్ణతా ।**
**స్వభావస్సచ్చిదానన్ద నిత్యనిర్మలతాఽఽత్మనః ॥ (ఆత్మబోధ)**

అని శ్రీశంకరులు ఆత్మబోధయందు ఆత్మయొక్క స్వభావము సచ్చిదానందమనియు, సూర్యునకు ప్రకాశము, జలమునకు శీతలత్వము, అగ్నికి ఉష్ణత్వము స్వభావమైనట్లు, ఆసచ్చిదానంద మాత్మయొక్క సహజస్వరూప మనియు వచించిరి. కాన జీవుడు ఇది నా ఇంద్రియముల స్వభావము, ఇది నా మనస్స్వభావము అని చెప్పుట యథార్థము కానేరదు అది వాని దుస్స్వభావమే, అస్వానుభవమే యగును సత్యమగు ఆత్మానుభవములేక ఆత్మను గూర్చి వచించునట్టి వాచావివేకము అవివేక మనియే శ్రీయోగవాసిష్ఠమున వసిష్ఠులు తెల్పిరి

**చిత్రామృతం నామృతమేవ విద్ధి చిత్రానలం నానలమేవ విద్ధి ।**

**చిత్రాజ్ఞానం నాజ్ఞానమేవ విద్ధి వాచావివేక స్త్వవివేక ఏవ ॥**

చిత్రమందలి అమృతము అమృతము కాదు (అది మృత్యువును రహిత మొనర్పజాలదు) చిత్రమందలి అగ్ని అగ్ని కాదు (పాకాది క్రియలకది యుపయోగపడదు) చిత్రమందలి స్త్రీ స్త్రీకాదు (గృహకృత్యముల నది నిర్వహింపజాలదు ) అట్లే వాచావివేకము వివేకము కాదు, అది అవివేకమే

**అనుభూతిం వినా మూఢో వృథా బ్రహ్మణి మోదతే ।**
**ప్రతిబింబితశాఖాగ్ర ఫలాస్వాదనమోదవత్ ॥**

అనుభవములేక వ్యర్థముగ బ్రహ్మమును గూర్చి వచించువాడు, జలాశయమునొడ్డున జలమందు ప్రతిబింబించిన వృక్షఫలములను భుజించి సంతసించు వానివలె నుండును

పైవిధమున విషయములు ఇంద్రియముల స్వభావము లనుటయేగాక పై పెచ్చు 'ప్రారబ్ధం భోగతో నశ్యేత్' అని చెప్పుచు ఇట్లు విషయములందు ప్రవర్తించుట మాప్రారబ్ధము కాన అనుభవించియే తీరవలెనను శుష్కవేదాంత ప్రవచనమును బల్కుచుందురు. అది ధర్మవిరుద్ధము ప్రారబ్ధమనునది. అప్రయత్నముగ సంభవించు జ్వరాది రోగబాధలకే చెల్లునుగాని ప్రయత్న పూర్వకముగ సంపాదించుకొను దుర్విషయమునకు చెందునది కాదు. కాన నట్టి దుస్స్వభావములను, దుస్సంస్కారములను పురుషప్రయత్నముచే నివారించుకొనవలసి యుండును

346. ఇక మనస్సే ప్రధానమను రెండవదానిని గూర్చి యాలోచింతము సామాన్యముగా నట్టి కుతర్కమును జేపట్టువారు 'మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' అను ప్రమాణమును వచించి, మనస్సేగదా అన్నిటికి ముఖ్యము అని పేర్కొను చుందురు కాని ఆశ్లోకము యొక్క పూర్వార్ధమునే వారు గమనించిరిగాని, ఉత్తరార్ధమును గమనించ లేదు. ఆయుత్తరార్ధ మేమన 'బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్' అనగా విషయాసక్త మై నచో మనస్సు బంధమున దగుల్కొనును,

నిర్విషయమైనచో ముక్తిని బొందునని తాత్పర్యము కాన నిద్దానిని గ్రహించిన నిక దుర్విషయములందు ప్రవర్తించుట యెంత హానికరమో తెలియగలదు మఱియు కారణమునకు భిన్నముగ కార్యమెద్దియు నుండజాలదు.

విత్తు ఒకటి, చెట్టు మఱియొకటి అగుట ఈలోకమం దెచటను గాంచ బడలేదు తాము నాటిన బీజమునకు తగిన ఫలమునే జీవులు అను బవింతురు ఆ విధముగనే దుశ్చింతలు, దుస్స్వభావములు, దుర్వృత్తులు గల్గి విషయువములందు యథేచ్ఛగ సంచరించు మనస్సు తత్ఫలమగు దుఃఖమునే యుపభోగింప వలసివచ్చును కర్మసిద్ధాంత మావిధముగనే యున్నది ప్రకృతి యందిది యొక అనుల్లంఘనీయమగు నియమము దీని నెదిర్చి చనుట కెవరికిని సాధ్యము కాదు కాన మనస్సే ప్రధానము అని యెలుగెత్తి పాడుచు కరణములచే దుర్వ్యాపారములందు మునుంగు నవివేకులగు శుష్కవేదాంతులు ఇప్పటికైనను నిజమరసి సన్మార్గమున ప్రవర్తించుదురుగాక!

యథార్థముగ ఆత్మ ఇంద్రియాతీతమైనను, అంతఃకరణాద్యుపాధి జనిత గుణదోషములచే నిర్లేపమైనను అట్టి ఆత్మస్థితికి కారణభూతము ఇంద్రియ మనంబుల శుద్ధత్వమే గనుక, ఆత్మస్థితి యందున్నవాడు, లేక మనస్సు ఆత్మయందు సంలగ్నమైనవాడు ఇంద్రియాదులచె దుర్వ్యాపా రంబుల నెన్నటికిని మునుంగడు తమోగుణము నుండి, రజోగుమునకు, రజోగుణమునుండి సత్త్వగుణమునకు, సత్త్వగుణమునుండి విశుద్ధ సత్వమునకు జనినట్టి ఉన్నత మనస్సు మరల అతినీచమగు తమోగుణము నాశ్రయించునా? అట్టి మనస్సునకు గాని, ఇంద్రియములకుగాని తమోగుణ స్వభావమగు విషయవ్యామోహము మరల యెన్నటికైన నుండునా? ఒక వేళ నుండినచో ఆతని మనస్సు ఇంకను పరిపక్వము కాలేదనియే యర్థము సురేశ్వరాచార్యుల వచనములే ఇందులకు ప్రమాణము –

**రాగో లింగమబో ధస్య చిత్తవ్యాయామభూమిషు ।**
**కుతశ్శాద్వలతా తస్య యస్యాగ్నిః కోటరే తరోః ॥** (నైష్కర్మ్యసిద్ధి)

అనగా, విషయానురాగమె అజ్ఞానచిహ్నము ఏ చెట్టుతొఱ్ఱయందు అగ్ని రగుల్కొనుచున్నదో ఆ చెట్టునకిక పచ్చదనము (చిగుళ్ళు ఆకులు మొదలైనవి) ఉండునా? అట్లనే జ్ఞానాగ్ని ప్రజ్వలించుచున్న దుర్వ్యాపార సంబంధ మెన్నటికిని గల్గియుండదని భావము



# 15వ రోజు 11-4-1940

347 గీత 15 వ అధ్యాయమగు పురుషోత్తమ ప్రాప్తియోగమును సామాన్యముగ జనులు భోజనకాలమున పఠించుచుందురు దీని యందొక రహస్యము గలదు భగవానుడు తాను వైశ్వానర రూపమున సర్వజీవుల శరీరముల నాశ్రయించి, ప్రాణాపానములతో గూడి, వారు భుజించిన యాహారమును పచన మొనర్చుచున్నాడను విషయమిందు దెల్పబడినది ఎట్లన –

**అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।**
**ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥** (15ః14)

దీని యర్థము పైన దెల్పినదే కాన నా వైశ్వానరరూపుడగు పరమాత్మను ధ్యానించి, భుజించిన యాహారము అతి తేజోవంతమై, పరిశుద్ధమై, జీవుని సత్త్వగుణోపేతునిగ నొనర్చును

348 గృహమందున్న యజమాని గృహమునకు వేఱుగ నుండి తన గృహ సంబంధ వ్యవహారములన్నింటిని యెట్లెఱుంగుచున్నాడో, అట్లనే శరీరమను గృహమున పరమాత్మయను గృహపతి శరీరమునకు విలక్షణుడుగ నేయుండి తచ్ఛరీరవ్యాపారములన్నింటిని వీక్షించుచున్నాడు

349 'జీవుడు ప్రప్రథమమున అతి సూక్ష్మమగు బీజరూపముగను, తదుపరి వృక్షములుగను, పిమ్మట క్రిమికీటకాదులుగను, ఆక్రిమి

కీటకాదులనుండి పక్షులుగను, పక్షులనుండి మృగములుగను, మృగముల నుండి వానరములుగను, వానరముల నుండి మనుజులుగను - ఇట్లు క్రమముగ పరిణామము నొందుచు వచ్చెదనని పరిణామవాదులగు 'డార్విన్' మొదలైనవారు తెలుపుచున్నారు ఈ విషయము 'జగత్కథ' యను నొకగ్రంథమున బాగుగ వివరింపబడినది వారివ్విధమున మనుజాని వఱకు పరిణామమును వచించియున్నను, ఆ మనుష్యజన్మ పిదప ఏమైనదియు తెలుపకనేపోయిరి అట నుండి మానవజన్మ తరించు మార్గమును శ్రీ వివేకానందులవారు బాగుగ బోధించి యున్నారు హిందూమతప్రకారము ఈ సృష్టి క్రమమునంతయు లెస్సగ వివరించుచు,

> **ఆత్మనోఽవ్యక్తః, అవ్యక్తాన్మహత్, మహతోఽహం కారః,**
> **అహంకారాత్పంచ తన్మాత్రాని, పంచతన్మాత్రేభ్యో పంచభూతాని,**
> **పంచభూతేభ్యోఽఖిలం జగత్ ॥**

అని యిట్లు పరబ్రహ్మమునుండి అవ్యక్తము, అవ్యక్తమునుండి మహత్తు, మహత్తునుండి అహంకారము, అహంకారమునుండి పంచ తన్మాత్రలు, పంచ తన్మాత్రలనుండి పంచభూతములు, పంచభూతముల నుండి ఈ జగత్తు ఆవిర్భవించినదనియు, తానేస్థానమునుండి బయలుదేరెనో, అట్టి యాపర బ్రహ్మమును జేరుటయే జీవుని పరమావధి యనియు, అప్పుడు మాత్రమే తాను పరిపూర్ణుడై, జన్మరాహిత్యము నొందగలడనియు వారు నొక్కి వక్కాణించిరి

350 పర్వతోపరిభాగమున నున్నవాడు దూర దూర ప్రదేశములను, పట్టణములను, పల్లెలను, అరణ్యములనుకూడ గాంచగలడు నిమ్నస్థాన మున నున్నవాడు కొలదిదూరముమాత్రమే వీక్షించగలడు అట్లనే తురీయ స్థితి యందు జ్ఞాననేత్రముచే లక్షించునట్టి జ్ఞాని సర్వదేహాంతర్వర్తియు, అఖండ వ్యాపకుడును, సచ్చిదానంద స్వరూపుడును నగు పరమాత్మను కనుంగొనును అవిద్యాసంబంధము గల్గియున్నవాడు దృశ్యప్రపంచమే సత్యమని నమ్మువాడు దేహేంద్రియాదులకు వశమైనవాడు పరమాత్మ

స్థానమును తెలిసికొనజాలకపోవును.



# 16వ రోజు 12-4-1940

351 సన్న్యాసి మాధుకరవృత్తి గలిగియుండవలెనని చెప్పుదురు. దాని యర్థమేమన- మధుపము అనగా తుమ్మెద, వికసించిన పుష్పము పైననే వ్రాలి, ఆ పుష్పమునకేలాటి హానియు కలుగజేయక మధువు నెట్లు గ్రోలి పోవునో, అవిధముననే సన్న్యాసి గృహస్థుల కేలాటి కష్టమును కలుగజేయక భిక్షాటన మాచరింపవలెను మఱియు, తుమ్మెద వికసించని పుష్పముపై వ్రాలకుండునట్లు గృహస్థుల ఇండ్ల యందు వంట ఇత్యాదులు పూర్తిగాక పూర్వమే యతులు వారి గృహములకు భిక్షాటనమునకై వెడలరాదు. వారు భక్తితో నొసంగినది యే కొంచెమైనను, దానితో సంతుష్టి నొందవలెను వారిని దూషించుట మొదలగు కార్యముల నెన్నడును చేయరాదు దృష్టిని బాహ్యవృత్తుల మీదికి పోనీయక, ధ్యానపరుడై, మౌనముగా నుండి యాభిక్షాటన కార్యమును నిర్వహింపవలెను. అట్టి పవిత్ర హృదయము గలవాడే యతి యనబడును

పూర్వకాలమున యతులు ఎంతయో పవిత్రులై, అనుష్ఠానపరులై యున్నందుననే గృహస్థులకు వారిపై ఎక్కువభక్తి, విశ్వాసము లుండెను తమ యొక్క ఒక్క పిడికెడు అన్నమైనను వారి యుదరమున బడినచో తమ జన్మ సార్థకమగునని వారు తలంచెడివారు. నిజముగ బ్రహ్మనిష్ఠయొక్క ప్రభావ మావిధముగనే యుండును కనుకనే పూర్వకాలమున యతి ఏ ఇంటికి వెళ్లి, భిక్షలేక తిరిగిపోవునో, ఆ గృహస్థునకు తాను లోగడచేసిన పుణ్యము కూడ పోవుచుండెడిది. రాను రాను సాధువులందు, సన్న్యాసు లందు పవిత్రత, అనుష్ఠానము తగ్గిన కొలది గృహస్థులకు వారిపై విశ్వాస మున్న్ను అంతరింపజొచ్చెను కాని విశుద్ధహృదయులైన సాధుపుంగవు లేకాలమున గూడ ప్రజల విశ్వాసమునకు పాత్రులు గాకపోరు. వారి యౌన్నత్యము, సత్య

ప్రభావము పూర్వమువలెనే ఇపుడును ప్రతిష్ఠతమయ్యే యున్నది

**352. అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥9-22**

అనగా, అనన్యభ క్తిగల్గి తన్ను ఎడతెగక చింతించువారి యోగక్షేమములను తానే వహించెదనని శ్రీకృష్ణపరమాత్మ గీతయందు నుడివి యున్నాడు దీనికి దృష్టాంతపూర్వకముగ నొకకథ గలదు –

ఒక గ్రామమున నొక యాలయమున నొకబ్రహ్మచారి వసించు చుండెను ఆతడచటనే ధ్యానానుష్ఠానములను సల్పుకొనుచు సమయమున కా గ్రామమున కేగి భిక్షాటన మాచరించుచుండెడివాడు ఆతడు అల్ప వయస్కుడును, లోకానుభవమెక్కువ లేనివాడునైనను పరమభక్తుడై యుండెను ఆ గ్రామమున నొక యుపాధ్యాయుడుండెను ఆతనిపత్ని మహాసాధ్వి, భక్తులనిన, పరమప్రేమతో నాదరించుచుండెడిది ఇట్లుండ నొకనా డాయాలయమున నున్న బ్రహ్మచారికి కాలిపై నొక వ్రణము లేవ, ఆతడద్దానికి కట్టు కట్టి, యథాప్రకార మాదినమున్ను గ్రామమునకు భిక్షాటమునకై వెడలెను

నాడు ఉపాధ్యాయుడు గ్రామమున లేడు వాని భార్య యాదినము స్నానమాచరించి సన్నని వస్త్రము కట్టుకొనియుండు తటి బయట నాసాధుమూర్తి వాక్యము విని వెంటనే భిక్ష తీసుకొని రాగా అంత నాబ్రహ్మచారి యామెతో నిట్లనెను– "అమ్మా ఒక్క వ్రణముచేతనే నేనెంతయో బాధపడుచుంటినే, రెండువ్రణములచే నీవెంత బాధపడు చుంటివో!" అపుడామె 'నాయనా! అవి పాల గుళికెలు భావిసంతానమునకై భగవంతు డాహారమును సమకూర్చియుండె'నని వచింపనది విని, "ఆహా! ఎపుడో పుట్టబోవు సంతానమునకై యిపుడే భగవంతు డాహారమును సమకూర్చియుండగా నిక నాకేల సమకూర్చక యుండు"నని తలంచి, యాభిక్షాపాత్రము పారవైచి వెంటనే యాలయమున కేగి, భగవంతుని ధ్యానింప, శ్రీకృష్ణభగవానులు బాలుని రూపమున నటకేతెంచి వానికి

ప్రసాదమునిచ్చెను

రెండురోజులు గడచెను మూడవదినమున ఉపాధ్యాయుడు ఊరినుండి తిరిగివచ్చి సాధుమూర్తి భిక్షకు వచ్చుచున్నాడా యని తనభార్య నడుగగా, నేటికి మూడుదినములనుండి వచ్చుట లేదని యామె ప్రత్యుత్తర మిచ్చెను అది విని ఆ యుపాధ్యాయుడు వెంటనే యాలయ మునకేగి చూచునతటి, సాక్షాత్ శ్రీకృష్ణభగవానులే యట వానికి భిక్ష నొసంగు చుండుటను గాంచి అతివిస్మయాయత్త చిత్తుడై, అనన్యచింత గల్గి తదేకనిష్ఠతో ధ్యానించు భక్తుల యోగక్షేమముల నాభక్తవత్సలుడే గాంచుచుండునని మనంబున నిశ్చయించుకొనిన వాడాయెను

353 మఱియొక కథ గలదు – ఒక భగవద్భక్తుండగు రాజు గలడు ఆతడు గీతను ప్రతినిత్యము పారాయణ చేయుచుండువాడు ఆతని యాస్థానమున నున్నట్టియు మఱియు నితర ప్రాంతములనుండి వచ్చినట్టియు గొప్ప గొప్ప పండితులనుండి యాగీతార్థమును నాతడు తెలిసికొను చుండెను ముఖ్యముగ 4 వ అధ్యాయమునుండి ‘అనన్యాశ్చిన్తయన్తో మాం’ అను శ్లోకమునం దాతనికి అత్యంతప్రీతిగల్గి, వచ్చిన పండితుల నెల్లదాని యర్థమునే యడుగుచు దానినిగూర్చియే ప్రశ్నించుచు, సమాధానముల బడసిన వెనుక వారలను బహురీతుల సత్కరించి పంపుచుండెను ఇట్లెం దఱినో యాశ్లోకార్థము నడిగెనుగాని తృప్తికరమగు సమాధాన మాతడు బడయకుండెను ఒకనాడు యథాప్రకార మొకపండితుని దానినిగూర్చి ప్రశ్నింప, ఆతడు తనకు మూడుమాసముల గడువీయవలసిన దనియు, ఆ పిమ్మట దానియర్థము నాతనికి వచించెదననియు చెప్పెను రాజు అందులకు సమ్మతించెను

రాజువద్దనుండి సెలవుగైకొనిన పిదప నా పండితోత్తము డాశ్లోకమును అక్షరలక్షగా ధ్యానము చేయసాగెను సుమారు మూడు సంవత్సరము లాయెను దాని యర్థమపుడాతనికి పూర్తిగ నవగత మయ్యెను సర్వలోక రక్షకుండగు శ్రీకృష్ణపరమాత్మయందే అనన్యచింతన గలవాడై, ఆతడు తప్ప

వేఱొక శరణ్యము లేదని దృఢముగా నిశ్చయించుకొని ప్రాపంచికవిషయములు తుచ్ఛములుగా దలంచి, నిరాశ గలియుండెను అచట రాజుగారు, మూడు మాసముల కాలమైనను ఇంకను పండితుడు రాలేదేమియని తలంచుచు చాలకాలము వేచి వేచి తుదకు తానే స్వయముగా, ఒక రథముపై విస్తార ధనము నుంచుకొని, వాని కడకు పయనమైపోయెను పోయి నమస్కరించి 'మహాత్మా! ఇంకను రాకయుంటిరేల? ఇదిగో ఈ ధనమంతయు తీసికొను'డని వచింప, నంత నా పండితుడు 'రాజా! ఈ ప్రాపంచిక ధనముతోగాని, వైభవములతోగాని నాకిక బనిలేదు నాకు శాశ్వతమైన జ్ఞానధనము సంప్రాప్తించినది ధన్యుడనైతి' నని బల్కి యారాజును పంపి వేసెను రాజున్ను నిజార్థమీతని కపుడు బోధపడినదని యెఱింగి, సంతుష్టుడై, శ్రీ కృష్ణపరమాత్మ యందు ఇతోఽధికముగ భక్తి గల్గి యుండెను ప్రాపంచిక సుఖములుగాని, వైభవములుగాని, గౌరవాదులు గాని ఆత్మధనము సంప్రాప్తింప నంతవఱకే రుచించును గాని, తదుపరి హేయ్యముగా తోచునని యిందు మూలమున స్పష్టమగుచున్నది

354 'అనన్యాశ్చిన్తయన్తో మాం' అను నీ గీతాశ్లోకము చాల ముఖ్యమైన దగుటచే దీనినిగూర్చి మఱియొక కథకూడ చెప్పెద ఒక యూరిలో నొక ఉపాధ్యాయుడు కొందఱు పిల్లలకు చదువుచెప్పుచు వారిచ్చెడు కొలది మాత్రముతోనే తన కుటుంబమును నిర్వహించు కొనుచుండెను ఆతడు పరమభక్తుడు గీతయందు ఎక్కువ విశ్వాసము కలవాడు ముఖ్యముగ పైశ్లోకమును 'అనన్యాశ్చిన్తయన్తో మాం' అనుదానిని ప్రతినిత్యము చదువుచుండెడివాడు తల్లి వచ్చి పిలిచినపుడు మాత్రమే అపుడు భోజనమునకు పోవును ఇట్లుండ నొకనాడు వారియంటియందు ఆహారపదార్థములేమియు లేకపోయెను పదార్థములు లేమిచే నాడు వంటకము చేయలేదని తల్లి చెప్పగా, అది విని, భగవంతుడు భక్తులను సంరక్షించుచుండునని వచించు నా గీతాశ్లోకముయొక్క సత్యత్వమునందు సంశయము గల్గి వెంటనే యాతడు తన గ్రంథమును తెఱచి యాశ్లోకమున కిరువైపుల బ్రాకెట్టు( ) అను చిహ్నము

పెట్టెను ఆదినమాత డేదోయొక పని నిమిత్తము బయటకు పోగా తనవద్ద చదువుకొనుచుండిన రాకొమరుడపుడు ఒక గంపయందు అడుగున కొన్ని రత్నములను, పైన కొన్ని యాహారపదార్థములను వైచికొని వానియింటికి తీసికొని వెళ్లెను. వాని రెండు చెంపలపై రెండు వాతలు గలవు అందునుండి రక్తము కారుచుండెను అట్టి స్థితియందున్న యాబాలుని జూచి, ఉపాధ్యాయుని తల్లి, ''నాయనా! ఇదియేమి, నిన్నెవరిట్లు హింసపెట్టి''రని యడుగ ''నాకు భక్తి చాలమిచే గురువుగారు శిక్షించి''రని యాతడు చెప్పి వెడలిపోయెను ఇంతలో మాష్టరుగారు తిరిగి వచ్చిరి జరిగిన వృత్తాంత మంతయు తల్లి యాతనికి నివేదించి రాచకొమరుని కొట్టినందులకు గాను తనకు వారిచే ఏదోయొక శిక్ష విధింపబడగలదనివచించెను. పాపము! మాష్టరుగారు ఏపాపము నెఱుంగరు ఆతడతనిని కొట్టనే లేదు కాన వెంటనే రాజగృహమునకు బోయి తన నిర్దోషత్వమును గూర్చి రాజాగారికి విన్నవించుకొనగా, రాజాగారు ఆశ్చర్యము నొంది వారి బాలుని నెవరును హింసించ లేదనియు ఆతడు ఆడుకొనుచునే యున్నాడనియు వచించెను.

మాష్టరుగారి కంతయు విదితమయ్యెను భగవంతుడే యాలీల యంతయు గావించెనని యాతనికి స్పష్టమయ్యెను తానుపెట్టిన బ్రాకెట్లే ఆపిల్లవాని చెంపలపైని వాతలనియాతడు గ్రహించినవాడై తానుచేసిన పని కెంతయో వగచుకొనుచు, పూర్వముకంటె నధికముగ భగవంతునిపైనను, గీతావాక్యముల యెడలను విశ్వాసముగల్గి, తనకిక గృహస్థాశ్రమము నందుండుట బంధకరమని యెంచి, సన్న్యసించి, ఇల్లువిడచిపోయి ఏకాంతమున ధ్యానము చేయదొడంగెను

355. ఈ దేహమే కురుక్షేత్రము, పరమాత్మయే శ్రీకృష్ణుడు, తమోగుణమే (అజ్ఞానమే) అంధుడగు ధృతరాష్ట్రుడు ఆతమోగుణ జనిత దుర్వృత్తులే దుర్యోధనాదులు సత్త్వగుణము పాండురాజు ఆసత్త్వగుణ జనిత ధర్మప్రవృత్తులే పాండవులు జీవుడే అర్జునుడు సంశయాస్పదుడై అర్జునుడను జీవుడు శ్రీకృష్ణుడను పరమాత్మను ధర్మమునుగూర్చి ప్రశ్నించెను. ప్రతిదేహమునందును ఆత్మానాత్మ యుద్ధము జరుగుచునే

యుండును అట్లు ధర్మాధర్మములలో ఎవరియందేది బలవత్తరముగ నుండునో, అది జయించును కాన ఆసురీసంపత్తును అణగద్రొక్కి, దైవీ సంపత్తును ప్రతిష్ఠింప జేయుటకై సర్వులు ప్రయత్నింపవలెను శ్రీకృష్ణుని సహాయముచే ధర్మరాజాదులు కౌరవుల నోడింపగల్గినట్లు ఆత్మజ్ఞానమను సహాయమును గైకొన్నచో అజ్ఞానమును సమూలముగ వినాశ మొనర్ప వచ్చును కాన నట్టి యాత్మజ్ఞాన సంపాదనార్థమై ఇంద్రియ నిగ్రహోద్యుపాయ ములను శమదమాది సాధన సంపత్తిని, తీవ్రవైరాగ్యమును అవలంబింపవలసి యున్నది

356 సామాన్యవాసన, విశేషవాసనయని వాసనలు రెండు విధములు, దృష్టాంతముగా ఇంగువతో కూడియుండిన డబ్బాయందుగల వాసన విశేష వాసన ఇంగువ తీసివేసినను అందుగల వాసన సామాన్య వాసన రెండును పోవలెను పదార్థము తీసివేసినను, దానికి సంబంధించిన వాసన పాత్ర యందుండియే యుండును ఎన్నియో సార్లు, సబ్బుతోగాని, మట్టితోగాని శుభ్రముగ కడిగిన మాత్రమే ఆవాసన పూర్తిగ నిర్మూలింపబడును అట్లనే, కొంత యనుష్ఠానము ధ్యానము గావించినచో, క్రోధము ఇత్యాది దుర్గణముల తీవ్రరూపము జనులయందు నశింపవచ్చునే గాని, బీజరూపమన నది యేకో శముననో యింకను దాగియేయుండును. ఎండాకాలమున విత్తనములు భూ మిపై కన్పింక యెక్కడనో పడియుండి, వర్షాకాల మావిర్భవింపగనే అంకు రించునట్లు వాసనల తీవ్రరూపము నశించినను, వాటి సామాన్య రూపము హృదయక్షేత్రమున నెచటనో దాగియుండి, వాటికనువగు పరిస్థితులు రాగానే పైకి లేచుచుండును కాన విశేషవాసనా రాహిత్య మాత్రముచే సంతృప్తి నొందక, సామాన్య వాసనా, లేక బీజవాసనా రాహిత్యము కొఱకుగూడ అతిశయ ప్రయత్న మొనర్పవలెను

357 ప్రయత్నముచేతనే ఎట్టి కార్యమైనను సాధింపబడును - పూర్వము గొప్ప పాండిత్యము గల్గిన సన్న్యాసి యొకడు గలడు. ఆతనికి చాలామంది శిష్యులు కూడగలరు ఇతర దుర్గుణము లేవియు యాతనికి

లేవుకాని రోజుకు కనీసము ముప్పదిసార్లు మాత్రము కోపము వచ్చు చుండును ఇతర లోభగుణముగాని, కామగుణముగాని యెవ్వియు లేవు ఒకవస్తువు కావలెనను కోరికయు లేదు తనవద్దకు వచ్చిన ఫలములు మొదలైన వాటినికూడ నితరుల కిచ్చివేయుచుండును ఈశ్వరార్పణ బుద్ధితో సత్కర్మ లాచరించుచుండును ఇట్లు అన్ని సుగుణములు గల్గియున్నను తమోగుణ సంబంధమగు క్రోధము తగ్గలేదే యని దుఃఖించుచు 'యతిః కోపీ చండాలః' అను వాక్యమును సంస్మరించి అనగా యతికి కోపము వచ్చినచో చండాలునితో సమానుడను వాక్యమును జ్ఞప్తికితెచ్చుకొని తనకు కోపము వచ్చినపుడెల్ల స్నానముచేయ నారంభించెను అట్లు చేయుచు రాగా, క్రమేణా కోపమున్ను తగ్గుచు వచ్చెను పూర్వము ముప్పదిసార్లు వచ్చుచుండిన కోపము, అస్నానభయముచే ఒక్కమాసములో ఐదుసార్లకు దిగివచ్చెను ఇక కొంత కాలమునకు సమూలముగ నశించెను ఇట్లు స్వప్రయత్నముచే తనయందున్న క్రోధమను పెనుభూతమును బారద్రోలి ఆయతివరుడు పరమశాంతిని బొందగల్గెను, (నిజముగ జూచినచో వాసనలను బోగొట్టు కొనుటయే యధార్థమగు సన్న్యాసమగును లట్లు వాసనల బోగొట్టుకొన నంతవఱకు ఆ సన్న్యాసము నామమాత్రమేగాని వాస్తవము గానేరదు )

358 పూర్వమొక వృద్ధపండితుడు కాశీపట్టమున కర్మకాండ నిరతుడై కాలము గడుపుచుండుట జూచి శ్రీమచ్ఛంకరాచర్యులవారు ఓ వృద్ధబ్రాహ్మణుడా! నీవిట్లెంతకాలము కర్మకాండ నాచరించినను, నీకయ్యది యధార్థతత్త్వమును దెలుపలేదు జీవితమో క్షణికము, నీవో వృద్ధుడవైతివి, కాననొక్కశ్లోకముతో నీకు ఆత్మోపదేశము చేసెదనని పల్కి యిట్లు చెప్పనారంభించెను –

**కిం జ్యోతి స్తవ భానుమానహని మే రాత్రౌ ప్రదీపాదికమ్**
**స్యాదేవం రవిదీపదర్శనవిధౌ కిం జ్యోతిరాఖ్యాహి మే ।**
**చక్షుస్తస్య నిమీలనాది సమయే కిం ధీర్ధియో దర్శనే**
**కిం తత్రాహమతో భవాన్పరమకం జ్యోతిస్తదస్మి ప్రభో ॥**

(ఈ శ్లోకము గురు శిష్య సంవాదరూపముగా చెప్పబడినది )

గురువు- నీకు ప్రకాశమేద్ది?

శిష్యుడు- పగలు సూర్యుడు, రాత్రిచంద్ర దీపనక్షత్రాదులు

గు - అట్లే యగుగాక! ఆయితే, సూర్య చంద్ర దీప నక్షత్రాదులను ప్రకాశింప జేయునదేది?

శి-నేత్రము

గు- ఆ నేత్రము మూసినపుడు?

శి-బుద్ధి

గు- ఆ బుద్ధిని ప్రకాశింప జేయునది (చూచునది) ఏది?

శి- నేను ( ఆత్మ)

గు- కాబట్టి నీవే అన్నిటికంటెను ఉత్కృష్టమైన జ్యోతివి (పరమ ప్రకాశకుండవు)

శి - నే నదియె (పరంజ్యోతియగు ఆత్మనే) యై యున్నాను తండ్రీ! (ఇట్లు శిష్యుడు స్వానుభవమును దెల్పెను )

ఇట్లు శ్రీమచ్ఛంకరాచార్యులవారు ఆవృద్ధ బ్రాహ్మణునకొక్క శ్లోకములోనే వేదాంతసారమగు తత్త్వమసి మహావాక్యోపదేశము నంతయు గావించి, వానికి నాత్మానుభవమును గలుగజేసి ధన్యుని గావించెను

359 జ్ఞానము లేని కర్మ రెల్లుపుష్పము వంటిది రెల్లు పుష్పము పూజకు గాని, ఫలమునకుగాని యుపయోగపడనట్లే, ఆ కర్మయు ఎక్కువ ప్రయోజనకారి కానేరదు

360 భోగములందును ఐశ్వర్యములందును ఆసక్తిగలవాడు యోగాభివృద్ధి నొందలేడు. ఇందులకు ప్రమాణము -

**భోగైశ్వర్య ప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్ ।**
**వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ న విధీయతే ॥**

**361. త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।**

**నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥**

చతుర్వేదములున్నూ మూడు గుణములతో కూడినవే. మూడు లోకములకు సంబంధించినవే కాన త్రిగుణాతీతమును, ద్వంద్వాతీతము నగు బ్రహ్మసాక్షాత్కార స్వరూపమునే బొందుమని శ్రీకృష్ణభగవానులు అర్జునునకు బోధించిరి

362 సన్యాసులు గృహస్థుల యిండ్లయందు తీర్థప్రసాదములను పుచ్చు కొని నప్పటికి వారిగుణములందు జిక్కక, తమ ధర్మములనే వారికి బోధించి,వారల యంతఃకరణ శుద్ధి గావింపవలెనేగాని, ఆగృహస్థాశ్రమ మునందున్న వారి ధర్మములకంటె నెన్నడు క్రిందికి దిగి రాకూడదు

**363. తైలధారామివాచ్ఛిన్నం దీర్ఘఘంటానినాదవత్ ।**
**ఉపాస్యం ప్రణవస్యాగ్రం యస్తం వేద స వేదవిత్ ॥**

స్థూల, సూక్ష్మ, కారణ, అకార, ఉకార, మకారములకును అతీత ముగా నుండు అర్ధమాత్రా స్వరూపమగు తురీయస్థానమున ప్రతిష్ఠితమై యున్నట్టి పరబ్రహ్మమును తైలధారవలెను, దీర్ఘ ఘంటానాదము వలెను నెడతెగక ధ్యానింపవలెను అట్టి తురీయాత్మస్వరూపము నెఱింగినవాడే సర్వవేదముల నెఱింగిన వాడగుచున్నాడు

364 సామాన్యముగా ఆయా మతములవారు వారివారి దైవమునందే భక్తి యుంచవలెనని చెప్పుదురు అట్లుండిన నొకింత మేలేకాని కొందరు సం కుచిత భావము గలవారు పరమత దూషణయు గావించుచుందురు ఇక్కా రణముననే మతవిద్వేషములు పెరిగి, జనులలో అధ్యాత్మికత సన్నగిలు చున్నది ముఖ్యముగ శైవులు వైష్ణవులను, వైష్ణవులు శైవులను దూషించు కొనుటచేత శ్రీరంగము, గోకర్ణము, శ్రీ శైలము మొదలగుచోట్ల జనులకెట్టి విభేదములు విఘాతములు గలుగుచున్నవో యిపుడు తెలిసియేయున్నది వేదసారము, ఉపనిషత్సారము నెఱింగిన ఆత్మ ఏకస్వరూపమే యని స్పష్టము కాగలదు వారి వారిదృష్టి భేదముచేతనే పరమాత్మను వివిధ రూపములుగ

జనులు కల్పన చేసికొనుచున్నారేగాని, వాస్తవముగ తత్త్వమొకటియేయై యున్నది ఈ క్రింది శ్లోకమున నీభావమే స్పష్టీకరింపబడుచున్నది –

**యం శైవాస్సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాన్తినో**
**బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణపటవః కర్తేతి నైయాయికాః ।**
**అర్హన్నిత్యథ జైనశాసనరతాః కర్మేతి మీమాంసకాః**
**సోఽయం వో విదధాతు వాంఛితఫలం త్రైలోక్యనాథో విభుః ॥**

అనగా, శైవులు శివుడనియు, వేదాంతులు బ్రహ్మమనియు, బౌద్ధులు బుద్ధుడనియు, నైయాయికులు కర్తయనియు, జైనులు అర్హత్ అనియు, మీమాంసకులు కర్మయనియు నెంచి ఏ పరమాత్మను ధ్యానించుచున్నారో, అట్టి త్రిలోకాధీశుండును, సర్వవ్యాపకుండునగు పరబ్రహ్మము నన్ను బ్రోచు గాత .

మఱియు నివ్విషయమున పుష్పదంతుడను గంధర్వుని వాక్యమున్ను చిరస్మరణీయమైయున్నది –

**త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి**
**ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితి చ ।**
**రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిలనానాపథజుషాం**
**నృణామేకో గమ్యస్త్వమసి పయసామర్ణవ ఇవ ॥**

**(శివమహిమ్నః స్తోత్రం. 7)**

ఓ పరమేశ్వరా ! వేదమతము, సాంఖ్యమతము, యోగమతము, పాశుపతమతము, వైష్ణవమతము– ఇట్లు భిన్న భిన్న మతములను జనులవలంబించుచున్నను, తుదకు వారందఱకును గమ్యము నీవేయై యున్నావు ఋజువక్రమార్గముల ప్రవహించినను తుదకు నదులన్నిటికిని సముద్రమొకటియే గమ్యమై యున్నది కదా!

ఇట్టి విశాలభావమును గ్రహించి సమస్తచరాచర ప్రాణికోట్ల

యందును నిండి వెలుంగుచున్న యేకస్వరూపుడగు పరమాత్మయే ఆయా విభిన్న దేవతారూపముల ప్రతిష్ఠితుడై యున్న సంగతి స్మృతి పథమున నుంచుకొనినచో నిక మత విద్వేషములకు తావెచట? కలహములకు చోటేది? మఱియు సత్యార్థ ప్రకాశికయందు సర్వమతములను సమన్వయ పఱచుచు దయానందులు యథార్థ సత్యమును బాహాటముగ చాటియున్నారు. ఒకే పరమాత్మ, మంగళ స్వరూపు డగుటచే శివుడనియు, వ్యాపక స్వరూపు డగుటచే విష్ణువనియు, ఇట్లు వివిధనామముల బొందెననియు, అనేక భాషలు, అనేక సంప్రదాయములు ఉండుటచే నామములందు మార్పు గలిగినదేకాని తత్త్వమొకటియే యనియు వారు సెలవిచ్చిరి ఇంకొక రహస్యము కూడ కలదు విష్ణుభక్తుడుగా నుండి శివుని దూషించినను శివభక్తుడుగా నుండి విష్ణువును దూషించినను ఈ యుభయులును ఆచంద్ర తారార్కము నరకమునను భవింపవలసి వచ్చునని శాస్త్రము వచించు చున్నదిగాన పరమత దూషకులు సచేతస్కులై యుండవలెను

365 అనన్యభక్తి యను దానికి నాలుగు విధములైన అర్థములు గలవు (1) భ్రూమధ్యమందుగాని సుషుమ్నాగ్రమునగాని, సహస్రారమందుగాని, బ్రహ్మరంధ్రమునగాని లక్ష్యముంచి తదేకనిష్ఠతో ధ్యానించుట అనన్యభక్తి యొక్క లక్షణమే యగును ఇది సర్వసామాన్య మైనది ఇది ఒక ధనికుని వంటిది (2) ఇక రెండవది జీవ సాక్షినిగూర్చి తెలుపునట్టిది. ఇది మొదటి దానికంటె కొంచె మతీతమైనది ఇది ఒక రాజు వంటిది (3) మూడవ అర్థము, అనేకత్వములో ఏకత్వము వెలుంగుట అనేక జలపాత్రలందు సూర్య ప్రతిబింబములు వేఱ్వేఱుగా నున్నను సూర్యబింబ మొకటియేయై యున్నట్లు, అనేక జీవోపాధులందును పరమాత్మ యొకడేయని తెలిసి కొనుట – ఇది పైదానికంటె వేయిరెట్లధికమైనది (4) ఇక నాల్గవ అర్థము

**మత్తః పరతరం నాన్యత్కించిన దస్తీతి ధనంజయ! ।**
**మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥**

మణులందు గ్రుచ్చబడిన సూత్రము ఏకమై, ఆమణు లన్నిటిని

భరించునట్లు, సమస్త ప్రాణికోట్ల ఉపాధులందును సాక్షిభూతముగా నుండి సర్వమును ప్రకాశింపజేయువాడు పరమాత్మయని యెఱింగి ధ్యానించుట అనన్య భక్తియొక్క నాల్గవ అర్థము ఇది పైయర్థముకంటె వేయి రెట్లధిక ప్రభావము గలది ఇక ఐదవది అన్నిటికంటెను నుత్కృష్టమైనది అదేదన - న అన్యం - అనన్యం - అన్యమెద్దియు లేక ఒకే పరమాత్మ సర్వ ప్రపంచమున వెలుగుచున్నాడను జ్ఞానమేది కలదో అదియే అనన్యభక్తి ఇది చరమస్థితి అన్నిటికంటెను అతీతమైన యవస్థ ఇయ్యది అనన్యభక్తి యొుక్క పూర్ణార్థమగును దీని నెఱింగి యనుభూత మొనర్చుకొనువాడే స్వారాజ్య సిద్ధినొందగలడు ఈ క్రింది శ్లోక మీయర్థమునే దెలుపుచున్నది-

**సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**సమం పశ్యన్నాత్మయాజీ స్వారాజ్యమధిగచ్ఛతి ॥**

366 కేవలము నాశరహితమగు పరబ్రహ్మ స్వరూపమైన ప్రణవమును గూర్చియే ముఖ్యముగ ప్రతిపాదింపబడియున్నందున మాండూక్యోపనిషత్తు ఉపనిషత్తులన్నిటిలోను ప్రధానముగ పరిగణింపబడినది ఈ సమస్తము ప్రణవస్వరూపమగు పరబ్రహ్మమే యని అందు పేర్కొనబడెను

367 శ్రీ దత్తాత్రేయులవారు అవధూతవృత్తి నవలంబించి సంచార మొనర్చు దినములలో నొకనాడొక నదీతీరమార్గమున జనుచుండ నొకచోట ఆమార్గము రెండుగా చీలిపోయెను ఏమార్గమున పోవలసినదని యోచించుచు తన దృష్టిని నలువైపుల ప్రసరింప నంత నానదీతీరమున నొకచోట నొకపల్లెవాడు గాలము వైచి చేపలను బట్టుచు గూర్చుండి యుండుటను గాంచెను ఏ దారిని పోవలసినదని వానిని నడుగ, నేమియు బలుకకుండెను. మఱియొకసారి యడిగెను, పలుకలేదు మూడవసారి మరల నడిగెను. కాని అపుడును ప్రత్యుత్తరము లేదు

అత్తఱి నాపల్లెవాని గాలమున నొక చేప తగుల్కొన, దాని దీసి యాతడు బుట్టలో వైచికొని ప్రక్కన చూడగా నొక బుష్యుత్తముడు నిలబడి

యుండెను తత్క్షణమే యాతనికి నమస్కరించెను అంత, దత్తాత్రేయులు, నిన్ను మూడు పర్యాయములు పిలిచినను నేల బలుక కుంటివన, అపుడాతడు మహాత్మా! నాదృష్టియంతయు గాలము పైననే యుండెను బెండు మునిగినదా, లేదా యని చూచుటయందే నాలక్ష్యమంతయు కేంద్రీకరింప బడియున్నందున తాము పిలిచినది నాకు వినిపించలేదు క్షమింపుడని వేడుకొనెను అపుడు దత్తాత్రేయులు (లోలోన, – ఆహా! నాకొక గొప్ప బోధ లభించినది ఏకాగ్రతయొక్క స్వరూపము, ప్రభావము నాకిపుడు లెస్సగ విదితమైనవి ఈయల్పమైనట్టి పాపకార్యమునందే ఈతడింత ఏకాగ్రత జూపినపుడు ఇక నా పరమతత్త్వము నెఱుంగుటకు గాను మనమెంత యేకాగ్రత చూపవలెనో! భుక్తి కొఱకే యింత తదేకనిష్ఠాపరత్వ మీతడు వ్యక్తీ కరించియుండ, ఇక ముక్తికొఱకై మనమెంత అనన్యచింతన గల్గియుండ వలెనో! అని యిట్లు పలువిధముల చింతించి,) తనకిట్టి అమూల్యమైన యుప దేశమును గావించినందుల కాతనిని తన★గురువులలో నొకనినిగా నెన్నుకొని వానికి నమస్కరించి తనదారి నేగెను.



## 17వ రోజు 13-4-1940

368 గొప్పపండితుడైనను మలినమైన అద్దములో జూచిన తన ముఖము కన్పింపనట్లు, శుద్ధాంతఃకరణము లేనిచో వానికి ఆత్మానుభవము కలుగ జాలదు. అంతఃకరణముయొక్క శుద్ధత్వమే ఆత్మానుభూతికి హేతువుగాని, పాండిత్యప్రకర్ష కాదు. కాన శుద్ధాంతరంగము గలవాడు విద్య యెక్కువ లేక యున్నప్పటికి కరుణ, శాంతి, దయ, తితిక్ష, సత్యము

★శ్రీ దత్తాత్రేయులకు 24గురు గురువులు గలరు (పృథివి, వాయువు, ఆకాశము, జలము, అగ్ని, చంద్రుడు, సముద్రము, పతంగము మొదలగునవి ) ఈ విశ్వమున దేని దేనినుండి యాతనికి గుణపాఠము లభించెనో దానిదాని నాతడు తనగురువుగ భావించుకొనెను ఈవిషయము శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమున అవధూతో పాఖ్యానమునందు గలదు

మున్నగు సద్గుణముల ద్వారా సత్త్వాభివృద్ధి నొంది తద్వారా ఆత్మశాంతి నొందగలడు యథార్థ ముగ జూచినచో తన్ను తానెఱుంగుటయే విద్యగాని, సాహితీకౌశలమున ప్రతిభ గాంచుట కాదు

369 అభావసన్న్యాసి, స్వభావసన్న్యాసి అని సన్న్యాసులిరు తెఱగులు తినుటకు లేకనో , కుటుంబమును పోషింపలేకయో, ఇతరులతో కలహము పెట్టుకొనియో సన్న్యసించువాడు అభావసన్న్యాసి ఇతనికి స్వభావ ముగ వైరాగ్యము లేదు గాక తప్పక పతితు డగును. సన్న్యసించినను దుఃఖమునే పొందుచుండును ఇతరుల నెప్పుడు ఏదోయొకటి యాచించు చునే యుండును వారద్దాని నివ్వనిచో ఆగ్రహము చెందుచుండును

ఇక సర్వసంపదలున్నను వాటిని త్యజించి, తీవ్ర వైరాగ్యము గలవాడై, ప్రాపంచిక విషయ భోగముల యెడ విర క్తిగల్గి, మోక్షాభిలాషచే ప్రేరితుడై సన్న్యసించువాడు స్వభావసన్న్యాసి ఈతడు తన సాధనాతిశయముచే నచిరకాలములోనే పరమశాంతి నొందగలడు ఈతని జన్మసార్థక మైనది

370 సర్వజీవుల హృదయములందు పరమాత్మ ప్రకాశించుచున్నను, వారివారి యంతఃకరణముల శుద్ధత్వాశుద్ధత్వములబట్టి జీవులు సుఖదుఃఖ ముల నొందుచుందురు అంతఃకరణము సంపూర్ణముగ పరిశుద్ధ మగునంత వఱకు జీవుడు ఈశ్వరస్వరూపుడు కాజాలడు ఏ విధమైన వాసన లున్నప్పటి కిని ఆతడు బద్ధుడే పూర్ణవాసనా రహితుడే మోక్షార్హుడు

371. లోహాదులతో మిశ్రితమై యున్నంతవరకు బంగారమునకు విలువ తగ్గియే యుండును అదియే బాగుగ పుటమొనర్పబడి అపరంజి యగుసరికి యధారీతి అధికమూల్యము గలిగియుండును అట్లనే మనో మాలిన్యము గల్గియున్నంతవఱకు జీవుడున్ను విలువలేనివాడై యుండును. కాని సాధనాదులచే తన్మాలిన్యమును రహిత మొనర్చుకొనునపుడు మూల్యవంతుడై శోభిల్లును.

372 యాత్రలు చేయువారు ఆయా దేశములను దాటి వెళ్ళునపుడు

అచటిజనులను, భాషలను నెట్లు విడిచిపోవుదురో, అట్లనే అధ్యాత్మ క్షేత్రమున సాధకుడు ఒక్కొక్కగుణము దాటివెళ్లునపుడు దానికి సంబంధించిన వృత్తులనుకూడ విడిచిపోవును తుదకు ఆత్మను జేరునపుడు త్రిగుణములను పూర్ణముగ దాటినవాడగును

**పరాఞ్చిఖాని వ్యతృణత్స్వయంభూ స్తస్మాత్పరాఙ్ పశ్యతినాన్తరాత్మన్ ।**
**కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షదావృత్త చక్షురమృతత్వమిచ్ఛన్ ॥**

**(కఠోపనిషత్తు 2-1)**

అనగా బ్రహ్మదేవుడు ఇంద్రియములను బహిర్ముఖములుగా సృజించెను గావున సర్వజీవులు బాహ్యమునే గాంచుచున్నారు గాని అంతరాత్మను వీక్షించుటలేదు. ఎవడో యొకానొక ధీరుడు మాత్రమే అమృతత్వ స్వరూపమగు ఆత్మనవలోకింపదలంచి అంతర్ముఖుడై పఱగి తుదకు ప్రత్యగాత్మను సాక్షాత్కరింప గలుగుచున్నాడు అని కఠోపనిషత్తునందు తెలుపబడినదిగాన, ముముక్షువులెల్లరు, అట్లు బహిర్ముఖముగా పోవునట్టి యింద్రియములను భగీరథయత్నముచే నిగ్రహించి, అంతర్ముఖముగా నొనర్చి, ఆత్మానుభూతి నొందుటకై విశేషకృషి సల్పవలయును

374. కాయిక, వాచిక, మానసికములను త్రివిధ తపస్సులు అలీఘర్ బీగమునకు గల మూడు తాళపు చేతులవంటివి మూటిచే తీసిన మాత్రమే ఆ తాళము తెరువబడును గొప్పగొప్ప బ్యాంకులందు ఇనుపపెట్టెయొక్క తాళపుచేతులు ముగ్గురు అధికారులవద్ద యుండును ఆ ముగ్గురు దానినేక కాలమందు తీసిననే అది తెరువబడును అందేయొకటి లేకున్నను తెరువబడదు అట్లనే త్రివిధ తపస్సులలో ఏయొకటి కొఱతగలిగినను, బ్రహ్మరంధ్రము తెరువబడనందున అందున్న యాత్మ ధనమును పరిగ్రహించుటకు వీలు పడదు కాన, మూడు తపస్సులును అవశ్యముగా గలిగియుండవలెను

375 శరీరము, వాక్కు, మనస్సు అను నీత్రిపుటి ఏకమై, ఆత్మయందు విలీన మగుటయే త్రిపుటిరహితావస్థ

**376. అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతం చ యత్ ।**
**అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ ॥**

హోమముగాని, దానముగాని, తపముగాని మఱియే యితర కార్య మైనను శ్రద్ధాయుతముగ నొనర్పనిచో నది విఫలమై యిహపరంబులగూడ సౌఖ్యము నొడగూర్పజాలదని భగవానుడు నుడివి యున్నందున ముముక్షువులు తాము చేయు సమస్తకార్యములున్ను శ్రద్ధాభక్తులతో గూడియే గావించుచుండవలెను

377 ఒకడు చవిటిభూమిని, అనగా సముద్రప్రాంతములనుండు విశాలమైన పల్లప్రదేశమును దానమిచ్చి, నేను గొప్ప భూదాన మొసంగితి ననుకొనిన నెట్లుండునో, లేక అట్టిభూములందే కొన్ని పనికిరాని కొమ్మలను నాటి యితరుల కొసంగి నేను మంచితోటలను కూడ దానమిచ్చితి ననుకొనిన నెట్లుండునో, ఆయాదానముల ఫలితము వానికెట్లు లభింపదో, ఆవిధ ముగనే అనుష్ఠానము లేనివారియొక్క బోధలున్ను ఉండును శాస్త్రములను చదివినను, అందలి సారము ననుభూతి మొనర్చుకొననిచో, విజ్ఞానము గల్గియుండనిచో త్రికరణశుద్ధి లేనిచో, వారిబోధ లన్నియు చవిటిభూములలో కొమ్మలను నాటిన చందమున, వాటిని దానమిచ్చిన చందమున ఫలరహిత ములై యుండును ఆయాబోధలును జనులను ప్రభావిత మొనర్పజాలవు

378. ఒక ఫిరంగిలో సురేకారము, గంధకము, ఉక్కుగుండు, మందు చున్న బొగ్గులు వేసి, తాను లక్షించు కోటవైపునకు దానిని త్రిప్పి, ఏకాగ్రముగా, పట్టుదలతో అందరి ఒటను ఒత్తినచో వెంటనే యాకోట భేదించుకొని, బ్రద్దలైపోవును. ఆరీతిగనే జ్ఞేయాకారముకొఱకు ఇంద్రియ నిగ్రహాదులు గల్గి, సంయమము, దృఢవైరాగ్యము నవలంబించి, నిశ్చయ జ్ఞానము గలవాడై, అంతర్ముఖమున లక్ష్యార్థానుసంధానపరుడై, అవిద్యయను కోటవైపునకు మనస్సును ద్రిప్పినచో వెంటనే అయ్యది ధ్వంసమై పోవును.

379 భక్తియను రాణికి ముక్తి యనునది దాసియని శ్రీకృష్ణ

చైతన్యులు వచించిరి

380 సామాన్యముగా చిన్నచిన్న తరగతులవారికిగూడ బి ఎ, ఎమ్ ఏ మొదలగు నున్నతపరీక్షలు ప్యాసైనవారే పాఠ్యపుస్తకములను వ్రాయుచుండుట కలదు. వారు ప్రప్రథమమున అక్షరాభ్యాసము నుండియే క్రమముగ అట్టి యున్నతస్థితికి వచ్చియుండిన వారగుటచే, ప్రారంభకులకు నెట్టి పాఠములు కావలయునో వారికి బాగుగా తెలియును అట్లు క్రమక్రమముగ వారిని పైక్లాసులలోనికి తీసికొని పోవుదురు ఆరీతిగనే పూర్వము ఋషులు ఆది నుండి బ్రహ్మవిద్యను అభ్యసించి వచ్చినవారగుటచే, వారలు ప్రప్రథమమున, సత్కర్మ, భక్తి, వైరాగ్యములనే జనులకు బోధించియుండిరి

ఎట్లన, శ్రీశుకులవారు భాగవతములో భక్తికే ప్రాధాన్యమిచ్చి అదియే ముఖ్యమని, ప్రథమసాధనమని, అధ్యాత్మికభిత్తికి పునాది వంటిదని తెలిపియుండిరి శ్రీశంకరులున్ను అట్లనే వచించిరి

**అపార సంసార సముద్రమధ్యే సమ్మజ్జతో మే శరణం కిమస్తి ।**
**గురో! కృపాళో! కృపయా వదైత ద్విశ్వేశపాదామ్బుజ దీర్ఘనౌకా ॥**

అనగా, అపారమైన సంసారసముద్రమున బడి దరిగానక తల్లడిల్లుచు, మునుంగబోవుచున్న జీవునకు భగవచ్చరణారవిందములను విశాలమైన నౌకయే శరణ్యమని వారు సెలవిచ్చిరి అనగా నట్టివారికి ఈశ్వరునియందలి దృఢ భక్తియే మార్గమని యర్థము ఇక నివ్విషయమున అవతారమూర్తియగు శ్రీదత్తాత్రేయు లేమి వచించిరో చూతము

**ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా ।**
**మహాభయపరిత్రాణా ద్విప్రాణాముపజాయతే ॥ (అవధూతగీత 1-1)**

అనగా, సంసారమహాభయ పరితాపోపశమ మైనట్టి అద్వైత జ్ఞానానుభవము, ఈశ్వరానుగ్రహమువలననే సిద్ధించునని భావము. ఇవ్విధమున మహనీయులందఱి వాక్యములనుబట్టి చూడగా భక్తియే ముక్తికి ప్రథమ సోపానమని నిశ్చిత మగుచున్నది

381 జీవుని క్రమవికాసము భగవదవతారములద్వారా స్పష్టముగా విశదీకరింపబడుచున్నది ఎట్లన మొదటిది మత్స్యావతారము మత్స్యము ఎల్లప్పుడు నీటియందే సంచరించు జీవి ఇది ప్రథమవర్గమునకు జెందిన యొకానొక ప్రాణి రెండవదియైన కూర్మావతారము ఇంకను కొంతవికాసము జెందిన జీవియొక్క అవస్థను తెల్పుచున్నది కూర్మము జలచరము, భూచరము కూడను కాన మొదటి దానికంటె ఇది యొకింత హెచ్చుస్థితిని జూపుచున్నది ఇక మూడవదగు వరాహావతారము, కేవలము భూమియందే చరించు మృగముయొక్క యవస్థను సూచించుచున్నది ఇది మత్స్య కూర్మముల రెంటికంటెను నెక్కువ పరిణామము నొందిన జీవియొక్క స్థితి

నాల్గవదగు నృసింహావతారము సగము మృగరూపము, సగము మానవ రూపము గలది ఇది పూర్వము మూడింటికంటెను వికాసమొందిన ప్రాణి యొక్క అవస్థ ఇక నైదవది వామనావతారము మానవుని ప్రథమాశ్రమమమైన బ్రహ్మచర్యమును నిరూపించుచున్నది మనుజునకు బ్రహ్మచర్యమత్యావశ్య కమనియు, ప్రప్రథమమున బ్రహ్మచర్యము శుద్ధముగా పరిపాలించిననే దప్ప, ఆ పిదప తక్కిన ఆశ్రమములందు సఫలత్వము నొందనేరడనియు, బ్రహ్మచర్యమే మానవజీవితముయొక్క ప్రథమాంగ మనియు ఈ యవతార రహస్యమైయున్నది

ఆరవదగు రామావతారము గృహస్థాశ్రమమును సవాచించుచున్నది బ్రహ్మచర్యమును చక్కగ శీలించిన తదుపరి జీవుడిక గృహస్థాశ్రమమున బ్రవేశించి తన విధ్యుక్త ధర్మములను నెరవేర్చుచు నెట్లు ఆత్మోన్నతికి మార్గమును వెతుకుకొనునో ఈ యవతారము వలన స్పష్టమగుచున్నది. ఏకపత్నీవ్రతము, మాతృపితృవాక్య పరిపాలన, భ్రాతృప్రేమ, కష్టసహిష్ణుత, ధర్మసంస్థాపన, సత్యాన్వేషణము మున్నగు యుత్కృష్టధర్మము లిందు స్పష్టముగా నిరూపింపబడినని

తదుపరి పరశురామావతారము, వానప్రస్థాశ్రమతత్త్వమును బోధించుచున్నది పరశురాముడు సగము జీవితము ఏకాంతమున

తపస్సులోనే గడపి దానివలన వృత్తులను, గుణములను నిగ్రహింపగల్గెను అతని జీవితము వానప్రస్థాశ్రమ రహస్యమును చాటుచున్నది.

శ్రీ కృష్ణావతారము ఎనిమిదవది భక్తియొక్క ప్రాముఖ్యమును నిరూపించుచున్నది అనన్యభక్తియే మోక్షమార్గమని ఆ యవతారమున తెలుపబడినది గోపికాస్త్రీలు, ఉద్ధవుడు మున్నగువారి జీవితములచే నిది స్పష్టీకరింపబడెను భక్తిచేతనే నిర్వాణపదవిని పొందవచ్చునని ఈ యవతారమున చాటబడెను

ఇక తొమ్మిదవదైన శ్రీ బుద్ధావతారమున తురీయాశ్రమమగు సన్న్యాసాశ్రమతత్త్వము లెస్సగ ప్రతిపాదింపబడెను శ్రీబుద్ధదేవుడు సన్న్యసించి పరనిర్వాణపదవికి మార్గముల నన్వేషించి యెట్లు సఫలీకృతుడయ్యెనో యిందు మూలమున తేటతెల్లమగుచున్నది శ్రీబుద్ధావతారము జీవుని పూర్ణవికాసమును తెలుపుచున్నది సర్వసంగపరిత్యాగము, విషయవిరక్తి, తీవ్రతర వైరాగ్యము- ఇవియే జీవుని పూర్ణత్వమునకు ప్రధానహేతువులని శ్రీబుద్ధావ తారమున నిరూపింపబడినది

ఇవ్విధమున, మత్స్యము మొదలుకొని పూర్ణదేవత్వము వఱకుగల వికాసక్రమము, పరిణామావస్థ పరంపరా సోపాన మార్గము ఈ యవతారముల మూలమున బాగుగ విశదమగుచున్నది

382 సామాన్యమానవుని పూర్ణజీవితమునుగూర్చి శ్రీకాళిదాస మహాకవిచే నీక్రింది శ్లోకమున సంక్షిప్తనిరూపణము గావింపబడినది ఈశ్లోకము రఘువంశమున గలదు

**శైశవేఽభ్యస్త విద్యానాం యౌవనే విషయైషిణామ్ ।**
**వార్ధకే మునివృత్తీనాం యోగేనాన్తే తనుత్యజామ్॥**

బాల్యకాలము విద్యోపార్జనయందును యౌవనకాలము ధార్మిక విషయ ప్రవృత్తులందును వార్ధక్యము ధ్యానాది మునివృత్తులందును, అంత్యకాలము ధ్యేయాకారస్థితి యందును గడుపవలయునని దీని

తాత్పర్యము (ఇందు సర్వసామాన్యముగ మానవు డవలంబింపవలసిన క్రమము వచింపబడినది తీవ్రముముక్షుత్వము గలవారు బాల్యము నుండియే, అంతిమస్థితి యగు ధ్యేయాకారానుభవమునకై యత్నింప వలెను )

383 'దుర్గం పథస్తత్కవయో వదన్తి' అను కఠోపనిషద్వాక్యాను సారము అధ్యాత్మ మార్గము సాధించుట మొదట కష్టతరమేగాన, దుఃఖముల నెదు ర్కొనుటకు ముముక్షువులు సర్వదా సంసిద్ధులయ్యే యుండవలెను సామాన్యముగ సాధనకాలమున నెట్టి వారికైనను కొన్ని విఘ్నములు తటస్థించుచునే యుండును వాటికి వెనుదీయక సాధకులు ధైర్యోత్సాహము లతో ముందునకు సాగుచునే యుండవలెనుగాని యధీరులై వెనుకకు మరలగూడదు అనుసంధించు లక్ష్యము శాశ్వతానందము, నిత్యస్వరూప మును గనుక అట్టి పరమానంద స్వరూపప్రాప్తికై జనుచున్న సాధకుడు త్రోవలో నేతెంచు కష్టనిష్ఠురములకు, తాత్కాలిక ఆపదలకు నెన్నడును వెనుదీయగూడదు

ఇక్కార్యమున సఫలత నొందుటకై యొక ఉపాయము గలదు అదేమన, అట్టికష్టముల నెదుర్కొనుటకై ముందుగనే తయారై యుండుట ఎట్లన అన్నము కూడ దొరకనిస్థితి యెపుడైనా సంభవించునేమొ యని తలంచి ముందుగనే కొన్నాళ్లు ఏకభుక్తము శీలించి యుండవలెను కొన్నాళ్లు ఉపవాసముచేసి అభ్యసింపవలెను కొన్నాళ్లు కేవలము రొట్టె తిని యుండ వలెను కొన్నిదినములు కేవలము ఫలమూలములపైననే యాధారపడి యుండవలెను కొంతకాలము శనగలు, గోధుమలు మాత్రమే తినవలెను కొన్నాళ్లు సజ్జపిండి, తమిదపిండి మొదలగు వాటిచేతనే నిర్వహించి చూడవలెను మఱికొన్నాళ్లు చప్పటికూరలే భుజించవలెను కొంతకాలము సంకటి తిని శీలించవలెను ఉప్పుడుబియ్యపు అన్నము కూడ ఉపయోగించ వలెను కేవలము నీటిపైననే యాధారపడి కొన్నాళ్లుండవలెను శరీరమును జాడీవలెను శిరస్సును సెమ్మె వలెను చేసికొనవలెను అనగా జాడీ యందు

ఏపదార్థము వేసినను చెడక యుండునట్లును, సెమ్మెపై దీపముంచినను సహించుకొనునట్లును మనుజాడు, ఏకాలమున నే ఆహారము లభించినను దానిని జీర్ణించుకొనుశక్తి గలిగి యుండునట్లుగను, శీతోష్ణములను సహించుకొనునట్లుగను దేహమును ముందుగానే తయారు చేసి యుంచ వలెను, ఏకాలమున నేది యెట్లుండునో కాన మొదటనే జాగరూకులై యుండుట మంచిదికదా!

సత్యాగ్రహాందోళనా సమయమున గాంధీమహాత్ముడు జనులగూర్చి యిట్టి ఘోషణయే గావించియున్నారు ఓ సత్యాగ్రహులారా! కారాగృహ మున మీకు సంకటిమాత్రమే దొరుకును కష్టములు సంప్రాప్తించును కనుక ముందుగనే మీయిండ్ల దగ్గర అట్టియాహారమునే అలవరచుకొనుచు, కష్టసహిష్ణుతను బాగుగ నేర్చియుంచుడనివారు ఉద్ఘోషించిరి. రాజకీయ రంగమున మహాత్ముని యాదేశానుసారము సత్యాగ్రహులెట్లాచరించిరో, అట్లనే ఆధ్యాత్మికరంగమున ముముక్షువులున్ను ఆచరింపవలసియుండును అప్పుడే వారు స్వారాజ్యప్రాప్తి కర్హులగుదురు

384 మఠము నెప్పుడు కట్టవలెననగా, ఘటమును (దేహమును) మఱచినపుడే

385 పోలీసు సబిన్స్పెక్టరు గొప్పగా తలంపబడినను, సర్కిలిన్స్పెక్టరు, సూపరెండెంటుల దగ్గర నాతడెట్లణగి యుండునో, అట్లనే అన్నమయ ప్రాణ మయ కోశములవద్ద మనోమయకోశము గొప్పగా తలంపబడినను, విజ్ఞానా నందమయ కోశముల వద్ద అది అణగియే యుండును

386 ఇక, పంచకోశములందును ఒక్కొక్క కోశమును దాటి వెళ్లు నప్పుడు జీవుడే యే పరిణామమును బొందునో యిట వివరింపబడుచున్నది అన్న మయకోశమునం దుండునపుడు జీవుడు కేవలము మృగావస్థను బోలి యుండును దేహమే సర్వస్వముగ భావించుకొనుచు, దానిని పోషించుట యందే విశేషకాలమును గడపుచు, తనయొక్కయు తన కుటుంబము

యొక్కయు సౌఖ్యమును మాత్రము జూచుకొనుచుండును ఇది మొగ్గవంటి స్థితి. ఇక ప్రాణమయకోశమునకు జనునపుడు ఒకింత వికాసమును బొందును అపుడు సగము మృగత్వము, సగము మానవత్వము గలిగి యుండును ధర్మబుద్ధి వివేకము కొంత కొంత అంకురించుటకు ప్రారంభించును. ఇది యొకింత వికసించిన పుష్పమువంటి స్థితి

ఇక మనోమయకోశమున కేగునపుడు పూర్ణమానవత్వము సిద్ధించును హృదయము చాల వికాసము నొందిన దగును అప్పుడు తన యొక్కయు, నితరులయొక్కయు క్షేమమును బరికించుచుండును స్వార్థబుద్ధి తగ్గును. పరోపకారచింత హెచ్చగును ధర్మము చేయవలెనను కూతూహలము బాగుగ పొడసూపుచుండును దైవికలాభము పొందవలెనను నిచ్ఛ అధికరించును ఆత్మ యొకటి కలదని యొకింత తెలిసికొనును. ఇది పూర్ణవికాస మొందిన పుష్పమువంటి స్థితి

నాల్గవదగు విజ్ఞానమయ కోశమునకు జేరునపుడు సగము మానవత్త్వము, సగము దేవత్వము గలిగియుండును బుద్ధి పూర్వముకంటె నెన్నిరెట్లో విశాలమైన దగును విశ్వమానవ సోదరత్వమవు డుదయించును. స్వార్థచింతన సంపూర్ణముగ వినాశమగును ఆత్మసాక్షాత్కారమునకై తీవ్రప్రయత్న మాచరించుచుండును బహిర్ముఖవ్యాపకములు సన్నగిల్లును. దైవభక్తి యితోఽధిక మగును. రజస్తమోగుణములు పలాయనమైపోవును జ్ఞానాజ్ఞాన విచారణ గల్గును వాగాదీంద్రియములు శాంతించును వాసనలు దూరీకృతములగు చుండును ఇది పుష్పము నుండి ఫలమావిర్భవించుచుండిన (అనగా, పిందెవంటి) స్థితి

ఇక ఆనందమయ కోశమున కేగునపుడు పూర్ణదేవత్వము గలిగి యుండును. అపుడు తురీయానుభవము బాగుగ గల్గును నిర్మలాకాశమున సూర్యుడు దేదీప్యమానముగ ప్రకాశించునట్లు అపుడు హృదయాకాశమున ఆత్మ సునిర్మలముగ ప్రకాశించుచుండును ఇది పరిపక్వఫలము వంటి స్థితి

కాని ఆనందమయ కోశమున్ను ఒకకోశమేగాన, నాచు కొంచెమైనను

నుండినచో క్రమముగ నది తటాకమంతయు వ్యాపించి క్రమ్ముకొని దానిని ఆరించివేయునట్లు ఆకోశమునుకూడ దాటి పంచకోశాతీతుడు కానంత వఱకు నెప్పటికైనను అపాయమే యగును. కాన పంచకోశములను దాటి బుద్ధికి నావల నున్న స్వయంజ్యోతిని సాక్షాత్కరించుకొనుటయే జీవుని పరమావధియై యున్నది అదియే పూర్ణత్వము. అస్థితి నొందినచో నిక సుఖ దుఃఖములు లేవు నిరతిశయానందమే స్వరూపముగా గల్గియుండును నది సముద్రములో చేరిన తరువాత సముద్రమే యగునట్లు అపుడు ధ్యాతృ ధ్యానములు విలీనమై కేవలము ధ్యేయాకారమగు పరబ్రహ్మమే మిగిలి యుండును హృదయగ్రంధు లన్నియు నపుడు ఛిన్నాభిన్నములై పోవును కోశములన్నియు అరటిపట్టలవలె రాలిపోవును అపుడు శేషించునది పరమాత్మయే. అదియే శివము, అమృతము, ఆనందము, అద్వైతము అచటికి జేరువఱకు జీవుడు ప్రయాణము చేయవలసియే యుండును

## 18వ రోజు 14-4-1940

387 గీత 18వ అధ్యాయమునకు మోక్షసన్న్యాసయోగమని పేరు అనగా మోక్షమునుకూడ సన్న్యసింపుమని చెప్పునట్టి యోగము ఇంతవఱకు కర్మ, వైరాగ్య, భక్తి ధ్యానాదులవలన మోక్షము కలుగుననియు, అవి చక్కగ నాచరించిన తానాముక్తి పద మొసంగెదననియు చెప్పి తుదకిచట ఆమోక్షము వదలి పెట్టుమని చెప్పుట యెట్లు సమంజసమగును? ఒకరొక కార్యము నిమిత్తమై సహాయముకొఱకొక ధనవంతునివద్దకేగ, ఆతడు సహాయము చేసెదను, చేసెదనని చెప్పి తుదకు అకోరికనే నీవు వదలిపెట్టుమని యాతనితో చెప్పిన ట్లుండును అట్లు గావించుట భగవంతున కుచితమా యని యడుగవచ్చును ఇందులకు సమాధానమేమన ఇట్టి మోక్షసన్న్యాసము నకు నాల్గర్థములు గలవు 1 మోక్షమును సన్న్యసింపుము మోక్షాపేక్షను విడువుము అనగా, ఇంతవఱకు నేజెప్పిన పదునేడధ్యాయముల తత్త్వమును బాగుగ నెఱింగినచో నిక మోక్షమునకై వేఱు వెతకపని లేదు అది వచ్చియే తీరును కాన అవిచారమే నీకక్కఱలేదు సమస్తము నాకేవదలిపెట్టి కర్తవ్య

మును మాత్రము ఆచరింపుమనుట 2 ఇంత వఱకు చెప్పినభక్తి, జ్ఞాన, ధ్యాన కర్మయోగముల లెస్సగ ననుష్ఠించినచో, ముక్త్యవస్థ గలిగియే పోయినది ఇక దానికై వేఱు ప్రయత్నమేల? కారాగృహమున సడనివాడు విడుదలకై ప్రయత్నింపనేల? వ్యాధియే లేనివాడు ఔషధమునకై వెతుకనేల ? ఋణము లేనివాడు దానిని తీర్చుటకై యత్నమేల చేయవలె ? 3 ఇక మూడవ యర్థమేమన కేవల నిర్వాణరూపమైన పరమాత్మను బోధించిన దగుటచే దీనికీనామ మొసగబడెను ఇది ముఖ్యార్థము వేదాంతవస్తువుయొక్క పరాకాష్ఠయందు,

**నజాయతే మ్రియతే వా కదాచి న్నాయం భూత్వా భవితా వా న భూయః ।**
**అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే ॥**

అని బోధింపబడినది అనగా జీవుడు యథార్థముగ ఆత్మస్వరూపుడనియు, పుట్టుట, గిట్టుట మున్నగు నవస్థ లెవ్వియు, నేకాలమందును వానియందు లేవనియు, ఆతడు సనాతనుడనియు, బంధమోక్షముల కతీతుడనియు పేర్కొనబడినది బంధముండిన గదా మోక్షమునకై యత్నించుట. ఏకాలమందును బంధము లేదని చెప్పినపుడు ఇక మోక్ష యత్నమనవసరమేయని చెప్పుట యగును అవస్థలు, అభిమానములు, ఆవరణలు, కోశములు లేని పదమే నిర్వాణము అది నిత్యశుద్ధ స్వయం ప్రకాశమైనది అయితే ఈ కాన్పించుజగత్తు అసత్యమాయని ప్రశ్నించ వచ్చును వేదాంత శాస్త్రమున పేర్కొనబడిన ఆరంభ పరిణామ వివర్త వాదములను మూటిలో వివర్తవాదమే పూర్ణసత్యమును బోధించునదై యున్నది

దీనికి దృష్టాంతము రజ్జుసర్పభ్రాంతి పూర్ణప్రకాశమునగాని, కేవలము గాఢాంధకారమునగాని భ్రమభావన యుండదు మందప్రకాశమునసే యుండును ఏలన పగటియందు సూర్యప్రకాశ ముండునపుడు త్రాడు స్పష్టముగా కనుపించునుగాన, సర్పభ్రాంతి యుండదు రాత్రి కారు చీకటిలో త్రాడే కన్పించదుగాన భ్రమ కవకాశమే లేదు ఇక సంధ్యాకాలమున

మందప్రకాశమున్న సమయమున మాత్రమే భ్రమ కలుగును అట్లనే కేవల జ్ఞానావస్థయందు సందేహమే యుండదు కేవలఅజ్ఞానావస్థయందు సందేహము పుట్టనే పుట్టదు. ఇక ముముక్షువులకు మాత్రమే జగన్మిథ్యాత్వ మందు ఆత్మస్థితియందు సంశయము ఉండును అట్టి వివర్తవాదమును బట్టి పరిపూర్ణాత్మయే సత్యమైనది. తదితర కల్పన యెద్దియు లేనేలేదు. 4 ఇక నాల్గవయర్థమున సన్న్యాసము (త్యాగము) పూర్తిగ కలుగనిచో మోక్ష మెన్నటికి కలుగదని వచించుట సర్వత్యాగము కానిచో బంధనివృత్తి కాధు గనుక, సర్వసంకల్ప నివృత్తికొఱకే ఈయధ్యాయము చెప్పబడెను

388 కొందఱు భక్తియే గీతయందు ప్రధానమని చెప్పుదురు. భక్త విజయమునందు పేర్కొనబడిన జ్ఞానేశ్వరి యనునాతడు అనన్యభక్తియే మోక్షమునకు ప్రధానహేతువని వచించెను భగవంతుడు భక్తులకు దాసుడు గాన భగవంతుని తనదాసునిగ చేయగల్గునట్టి భక్తియే పరమభక్తి దీనిని చూపుట కొఱకే కృష్ణపరమాత్మ అర్జునునకు సారథిత్వము వహించెను దీనిచే అర్జునునకు నెంతపరమభక్తి గల్గియుండెనో యూహించుకొనవచ్చును అంతఃపురములోని బిడ్డ వచించినట్లు పట్టమహిషియైనను ఆచరించును గదా! ఇక శంకరులు అద్వైతమే గీత యొక్క పరమలక్ష్య మనిరి మధ్వాచార్యులు నిష్కామకర్మయే గీతయొక్క పరమావధియని వచించిరి. ఇక శైవులు శివభక్తియే ముఖ్యమని చెప్పుదురు. కనుకనే భగవానుడు 'ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి' అని సర్వభూతముల హృదయాంతరాళ ముల నీశ్వరుడే యున్నాడని వచించె నందురు మఱియు అర్జునునకు పాశుపతాస్త్ర మొసంగినది యీశ్వరుడే గదా యనియు బల్కుదురు కృష్ణపరమాత్మ యీశ్వరుడే యనియు చెప్పుదురు ఇట్లు గీతయంతయు శివపరముగా వారు వర్ణింతురు. శ్రీశ్రీ కంఠశివాచార్యుల వారి గీతా భాష్యమంతయు శివపరముగానే యున్నది శ్రీ బోధానందమహర్షులున్ను ఈరీతిగానే శివతత్త్వమును మిక్కుటముగ జెప్పుచుందురు

ఈభావముల నటనుంచి యిక గీతయొక్క యథార్థాశయ మేమో మన

మొకింత విచారించెదము. పాండవులు అంత్యమున రాజ్యమంతయు పరీక్షితున కొప్పజెప్పి సర్వత్యాగ మొనర్చి, సన్న్యాసివేషమును ధరించి, భూప్రదక్షిణము చేసి స్వర్గారోహణ మొనర్చి, మోక్షము నొందిరను విషయ మందఱకును విదితమే కర్మగాని, భక్తిగాని, యోగముగాని జీవితపరమావధి యైనచో వారందఱున్ను తుదకు కర్మసన్న్యాస మేల చేయవలెను? త్యాగమేల యవలంబించవలెను? కాన మోక్షమునకు సన్న్యాస (త్యాగ)మే ప్రధాన హేతువని స్పష్టమగుచున్నది ఆ స్థితిని సర్వులును పొందవలసియే యున్నారు.

389 శ్రీమహమ్మదు నబిగారు యోగసమాధిలో నుండగా నయ్యానందమున వారికి స్ఫురించిన భగవత్తత్త్వములను భక్తులకు బోధించ, వారు వాటిని వ్రాసికొని గ్రంథరూపముగా జేసిరి అదియే నేడు కొరాను అను పేరిటు ప్రసిద్ధికెక్కి యున్నది మహమ్మదున కెక్కువ విద్యరాదు. చేవ్రాలు చేయుట మాత్రమే వచ్చును అయినను వారి పవిత్ర హృదయమునుండి వెలువడిన దివ్యసందేశములు ఆచంద్రతారార్కముగ స్థిరరూపము వడసి చైతన్యవంతములై లోకమున విఖ్యాతి నొందియున్నవి అట్లనే శ్రీయేసు క్రీస్తున్ను ఎక్కువ చదువుకొనినవారు కారు అయినను వారు యోగదృష్టి యందు వచించిన వాక్యముల నన్నింటిని క్రోడీకరించి చాలకాలమునకు వారి భక్తులు గ్రంథరూపముగా జేసిరి అదియే బైబిల్ నామమున నేడు విఖ్యాతినొంది యున్నది అందు మఱికొందరు భక్తుల యుత్తమ ప్రవచనములున్ను గలవు

అట్లనే శ్రీకృష్ణపరమాత్మ బోధించినది 24 గీతలనియు అనగా గాయత్రీమంత్రమున కెన్నియక్షరములు గలవో అన్ని గీతలు వచించి యుండెననియు, అందు మూడుమాత్రమే భగవద్గీత, ఉత్తరగీత, ఆత్మగీతలు, ప్రస్తుతము వ్యాపకములో నున్నవనియు, తక్కినవి యెచటనుండెనో యెవరికిని తెలియజాలకున్నదనియు, అందు ఆత్మగీతలో కూడ కొంత భాగము అలభ్యముగాక యున్నదనియుతెలియుబడుచున్నది వెయ్యేల వేదము లనంతములనియు, శ్రీవేదవ్యాసులు విభజించిన కొన్ని మాత్రమే

లోకమిపు డెటింగి యున్నదనియు, అట్లనే ఉపనిషత్తులుకూడ అనేకములు గలవనియు, ప్రస్తుతము 108 మాత్రమే లభించినవనియు, తక్కిన వెచ్చోట దాగియుండెనో తెలియకున్నదనియు గూడ స్పష్టమగుచున్నది దీనినిబట్టి చూడ నిప్పుడున్నట్టి విజ్ఞానము చాల స్వల్పమైనదనియు, ఎంతయో కాల గర్భమున నంతరించినదనియు, ఎంతయో ప్రజలకు తెలియరానిచోట్ల నిప్పటికిని యుండి యుండపచ్చుననియు నూహింపవచ్చును. 'అనాగదేశే వైశాల్యే భూనాగో౽పి మహోరగః' అనగా పాములే లేనిచోట భూనాగము (ఎట్టి) అది శేషునివలె తలంపబడునట్లు ఇపుడున్న విజ్ఞానమునే మనము గొప్పదిగ నెంచుచున్నాము!

390. సుగంధపు డబ్బీని తెఱచి యుంచినచో ఆవాసనయంతయు క్రమముగ పోవునట్లు, తాను చేసిన దానధర్మాదులను తాను వెల్లడి చేసికొనినచో వాటిశక్తి తగ్గిపోవును

391 పుణ్యకార్యములు జేయు మనుజాలలో నాల్గుతెగలవారు గలరు. మొదటితెగవారు ఏదేని పుణ్యకార్యము కొఱకై యితరులను యాచించి చందాలు వసూలుచేసి, దానిలో స్వార్థమునకై కొంత వినియోగించుకొని తక్కినది మాత్రమే ఖర్చుపెట్టువారు.

ఇక రెండవతెగవారు స్వార్థము నపేక్షింపరుగాని పేరు ప్రతిష్ఠలు వెల్లడియైన పరమానందము నొందుదురు.

మూడవవారు పేరు ప్రతిష్ఠలుగాని, స్వార్థమునుగాని కోరక తాము భగవత్సేవకులమని తలంచి పుణ్యకార్య మాచరింతురు కాని ఆకార్యము సరిగ నెరవేరనిచో ఖేదమొందుదురు

ఇక నాల్గవ తెగవారు కేవలము నిష్కామబుద్ధితో ఈశ్వరార్పణముగా శక్తివంచన లేక యాచరింతురు. లాభాలాభ, జయాపజయ, సిద్ధ్యసిద్ధులందు సమచిత్తులై యుందురు. నిందాస్తుతులను లెక్కింపరు. కార్యనిర్వహణము నందే దీక్షగల్గి ఫలాపేక్ష లేక సదా సంతుష్ట చిత్తులయ్యే యుందురు. వీరే

బంధరహితులు వీరాచరించునదే సరియైన నిష్కామకర్మ అట్లు సిద్ధ్యసిద్ధు లందు సమబుద్ధి యేర్పడుటయే కర్మయోగమందలి రహస్యము గీత యందును నిట్లనే వచింపబడినది 'సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వంయోగ ఉచ్యతే' (2-48), అనగా సిద్ధ్యసిద్ధుల యందు సమబుద్ధి గల్గియుండుటయే యధార్థయోగ మగును

392 అయితే కర్తృత్వము లేకుండ కర్మ యెవరైన చేయగలరా? యని యడుగవచ్చును చేయవచ్చును కర్తృత్వము గల్గినప్పటికంటె నింకను బాగుగ చేయవచ్చును కర్తృత్వము గల్గియున్నపుడు జీవుడే కార్యమాచరించును కర్తృత్వము వదలినపుడు ఈశ్వరుడే యాకార్యము నిర్వహించును కర్తృత్వము గల్గియున్నపుడు వెంటనే వ్యష్టిభావన, సంకుచితదృష్టి, పరిచ్ఛిన్నత్వము ఏర్పడును కర్తృత్వము వదలినపుడు సమష్టిభావన, విశాలదృష్టి, అఖండత్వము నేర్పడుచుండును ఇందేది గొప్పది? మానుషప్రయత్నము గొప్పదా? ఈశ్వర ప్రయత్నము గొప్పదా?

మనుష్యుడెంతయో ప్రయత్నము చేసిన, బావిత్రవ్వియో, చెరువు త్రవ్వియో, బోరింగ్‌వేసియో, అమెరికావారివలె ఎలక్ట్రిక్ మిషన్ పెట్టియో, కొంచమునీరు మాత్రమే పైకి తేగలడు కొంచెము భూమిని మాత్రమే తడుప గలడు ఈశ్వరుడో ఒక్క వర్షము కురిపించిన బావులు, దొఱువులు, గుంటలు, నదులు జలమయమైపోవును ఎన్నివేల యెకరములో తడుపబడును అట్లనే మనుజుడు ఒక విసనకఱ్ఱద్వారానో, లేక ఎలక్ట్రిక్ పంకాద్వారానో కొంచెము గాలిమాత్రమే వీచునట్లు చేయగలడు కాని ఒక గొప్పవాయువు వీచినచో, అనంతకోటి జనులకు తాపశాన్తి యగును అట్లనే మనుజుడు తన ప్రయత్నముచే ఒక చేతి దీపమునో, గాస్ లైటునో, ఎలక్ట్రిక్ దీపమునో వెలిగించి కొంత చీకటిని మాత్రమే పోగొట్టగల్గును కాని సూర్యోదయమైనచో ప్రపంచమంతటను ప్రకాశము వ్యాపించును. చూచితిరా దైవశక్తి ప్రాభవము! కనుకనే వ్యష్టిత్వమును మఱువవలెనని చెప్పబడినది

జలబిందువు సముద్రమునుండి వేఱుపడి వ్యష్టిరూపమును

ధరించినచో క్షణములో తనరూపమును గోల్పోవును కాని సముద్రమందే యున్నచో గంభీర విశాలరూపమును ధరించి నాశరహితమై యుండును. ఇదియే భేదము కాన, మానవుడు కర్తృత్వమును వదలి యీశ్వరార్పణ బుద్ధితో కర్మ జేయుచు వచ్చిన పూర్వముకంటె ఎన్నియో రెట్లు అధికముగనే దానిని నెరవేర్చ గల్గును గాని, అల్పముగ కాదు. ఇదియే యిందలి రహస్యము ఇంక కొంత హెచ్చుస్థితికి బోయినచో, తానాచరింపకనే తన సంకల్పము మరియొకరిలో ప్రవేశించి ఆయా కార్యముల నిర్వహించు చుండును కాని యిట్టిస్థితి సామాన్యులకు కలుగదు. జ్ఞేయస్థితి నొందిన గొప్ప బ్రహ్మనిష్ఠులకు మాత్రమే గల్గును

393 మనుజుని చిత్తమునందు మల, ఆవరణ, విక్షేపములను మూడు దోషములు గలవు ఈమూటి కారణముచే ఆత్మశక్తి బాగుగ ప్రకాశింప కున్నది ఒక పాత్రలో నీరు శుద్ధము గానున్నచో సూర్యప్రతిబింబ మందు స్పష్టముగ గోచరించును. కాని యది బురదనీరైనచో ప్రతిబింబము కనుపించదు పోనిండు, జలము శుద్ధముగానున్నను, చలించుచున్న యెడల అపుడున్ను ప్రతిబింబము స్పష్టముగ గోచరింపదు. ఒకవేళ జలము శుద్ధముగా నిశ్చలముగా నున్నను, ఆ పాత్రపై మూతయున్నచో అపుడున్ను ప్రతిబింబము కనుపించదు కాన నా జలము నిర్మలమై, నిరావరణమై యున్ననే అందు సూర్యప్రతిబింబము చక్కగ కానుపించును అట్లనే చిత్తమను జలము మలమను బురదతో కూడినను, విక్షేపమను చంచలత్వము గలిగియున్నను, ఆవరణమను మూత గలిగియున్నను ఆత్మచైతన్యమను సూర్యుడందు స్పష్టముగ ప్రతిబింబింపజాలడు. కాన పుణ్యకార్యములచే పాపరూపమలములను పోగొట్టుకొని యీశ్వరధ్యాన ఉపాసనాదులచే చిత్తవిక్షేపమును తొలగించు కొని ఆత్మజ్ఞానముచే అజ్ఞానరూపావరణమును నశింపజేసికొనిన నిక చైతన్యభాస్కరు డఖండతేజముతో వెలుగొందును. ఆత్మసాక్షాత్కార ముదయమగును గ్రంధులన్నియు తెగిపోవును. జీవన్ముక్తి చేకూరును. కనుకనే శ్రీ శంకరులున్ను, చిత్తశుద్ధికొఱకు (మనోమాలిన్యము

రహితమగుకొఱకు) పుణ్యకర్మ లాచరింపవలెననియు, చిత్తైకాగ్రత కొఱకు ఉపాసనాధ్యానాదులు చేయవలెననియు, ఆవరణ విచ్ఛేదరూప మోక్షము కొఱకు బ్రహ్మజ్ఞానము కలిగి యుండవలెననియు బోధించియుండిరి

394 కొందఱు ఆచరణ అనుష్ఠానములు లేక వేషభాషలచే మాత్రము బ్రహ్మనిష్ఠులవలె నటించుచుందురు అట్టివారు ఆత్మశాంతి నొందజాలరు తుమ్మెద, పేడపురుగు చూచుట కొకేవిధముగ నుండునుగాని తుమ్మెద మధువును గ్రోలును, పేడపురుగు మలమును ఉండలుగా చేసికొని పోయి భక్షించును

395 సామాన్యముగ - జనులకు మూడు దృష్టులుండును 1 అశుద్ధదృష్టి 2 శుద్ధదృష్టి 3 విశుద్ధదృష్టి వీటినే 1 బహిర్దృష్టి 2 అంతర దృష్టి 3 అంతరాంతరదృష్టి యని కూడ అందురు అశుద్ధదృష్టి గలవారు, ఎన్ని సుగుణ ములున్నను దోషమునే పరికించుచుందురు ఏదో యొక లోపమును వెదకు చుందురు కొందఱు సాధువులనుకొనువారు ఎవరైనను కొందఱు భక్తి, భజన, కీర్తనల సల్పుచున్నచో- వీరింకను క్రిందిస్థితిలోనే యున్నారు, కర్మ కాండలోనే మునిగియున్నారు, మేమో, అతీతులము అని వారి నాక్షేపించు చుందురు అట్టివారు నిజమైన సాధువులు కారు. మఱికొందఱు భోజనకాలమందు మమ్ముల సరిగా చూడలేదు, ఆదరింప లేదు అని గృహస్థులపై నేరారోపణలను చేయుచుందురు వారున్ను నిజమైన సాధువులు కారు ( భోజనకాలమున, భగవచ్చింతనగల్గి, పదార్థముల రుచులను విమర్శిపక, ఆనందముగా అనుభవించువాడే నిజమైన యోగి). అశుద్ధదృష్టి గలవారు ఎంతమంచి యున్నను చెడునే విమర్శించు స్వభావము గలవారై యుందురు వారు పాత్రనే పరికించువారుగాని అందలి వస్తువును లక్ష్యపెట్టువారు కారు. జాతినే చూచువారు కాని గుణము~~ను పరిశీలించువారు~~ కారు.

ఇక అంతర్దృష్టి లేక శుద్ధదృష్టిగలవారు ఎన్ని దోషములున్నను గుణమునే చూచుచుందురు వారు పాత్ర యెట్లున్నను అందలి వస్తువునే

గాంచువారు జాతిని విసర్జించి గుణమునే పరిగ్రహించువారు

ఇకఅంతరాంతర దృష్టి, లేక విశుద్ధదృష్టిగల మహనీయులు గుణ దోషములను రెంటిని వదలి అంతర్వ్యాప్తమగు ఆత్మనే పరిలక్షించుచుందురు వారు పాత్రను గాని, అందలివస్తువుగాని, జూడక అంతట వ్యాపించియున్న జ్ఞేయమగు ఆత్మనే గాంచుచుందురు వీరే అతీతులు, జ్ఞేయము నెఱింగిన వారు, పరిపూర్ణులు

అశుద్ధదృష్టిగల మొదటి తెగవారు సామాన్యముగ జనులనిట్లు ప్రశ్నించుదురు మీ గురువుగారు మీ కేలక్ష్యమును బోధించినారు? ముద్రను జూపినారా? అంతర్దృష్టి చెప్పినారా? అంతరతారక ముపదేశించినారా? అపుడు వారు మాగురువుగారు మాకివేమియు చెప్పలేదు శుద్ధవర్తనము గల్గి, నిర్మల బుద్ధితో భగవంతుని ధ్యానము చేయుమని చెప్పినా రనినపుడు అంతవారు - ఇంతేనా, మీగురువుగారింకా ప్రారంభదశలోనే ఉన్నారు వారికి ముద్ర తెలియదు, లక్ష్యం తెలియదు మాకు చూడుడు ఎందఱు శిష్యులున్నారో ఇట్లు ఏమేమో ప్రలపించి అమాయకులగు భక్తులను తమవలలో జేర్చుకొందురు. యథార్థము విచారించిన శుద్ధవర్తనమే, నిష్కపటస్వభావమే అన్నిటికంటెను గొప్పది. ఆత్మను భద్రముగ కాపాడు కొనుటయే నిజమైన ముద్ర భగవంతునినుండి వియోగమెన్నడు లేకయుండుటయే నిజమైన యోగము, ఆత్మను సదా లక్ష్యమందుంచుకొని మఱువక యుండుటయే నిజమైన లక్ష్యము· వర్తనము శుద్ధముగా లేక ఎన్ని ముద్రలు, లక్ష్యములు అవలంబించినను,చవిటిభూమియందలి కృషివలె నిష్ప్రయోజన మగును. పరుగెత్తిపోయెడి చిత్తమును కుదురుగ నొకచోట నిలబెట్టుటకే ఆ పైముద్ర లన్నియు కల్పింపబడినవని యెఱుంగునది కాన ముముక్షువు లెల్లను కడుజాగరూకులై తమ ఆత్మనిష్ఠకు ప్రతిబంధకరము లైన దుర్బోధల నాలకింపక, కపటచిత్తుల దుర్భాషణలకు చెవియొగ్గక వారలకు దూరముగా నుండి, అంతఃకరణ పారిశుద్ధ్యమునకై, తద్ద్వారా జ్ఞేయస్వరూపానుభవము నకై యత్నించుచుందురుగాక!

396 ఈశ్వరుడున్నాడని చెప్పి, అశుద్ధగుణములు గల్గియుండు వారికంటె, ఈశ్వరుడు లేడనిచెప్పి శుద్ధగుణములు గలవారెంతయో శ్రేష్ఠులని శ్రీ వివేకానందులు తెల్పిరి భగవంతునియందు విశ్వాసముగల వాడనని చెప్పి ఆభగవద్వాక్యము నుల్లంఘించినచో అతడు భగవంతునకు ప్రీతిపాత్రుడగునా? రాజునందు నమ్మకము గలిగి యున్నను, రాజనీతి నతిక్రమించు వారికి దండన లభింపకుండునా? నాస్తికులనైనను ఆస్తికుల నైనను వారి వారి కర్మఫలము తప్పక వెంబడించుచునే యుండును

397 బ్రహ్మనిష్ఠుడు తనకు ప్రతిబంధములేని ప్రదేశమునందుండి ధ్యాననిష్ఠ, యోగసాధనలు చేయుచు అల్పాహారమునే సేవించవలెను ఆ యల్పాహారలక్షణ మెట్టిదనిన

**ద్వౌ భాగౌ పూరయేదన్నైస్తోయేనైకం ప్రపూరయేత్ ।**
**మారుతస్య ప్రచారార్థం చతుర్థమవశేషయేత్ ॥**

జఠరకోశముయొక్క రెండు భాగములను అన్నముచేతను, ఒక భాగమును నుదకముచేతను నింపి తక్కిన యొకభాగమును వాయుసంచారము నకై వదలవలెను ఏలన జీర్ణకోశము ఊపిరితిత్తుల నానుకొనియే యున్నందున, అది పెరిగినచో ఊపిరితిత్తుల నణచివేయును అపుడు ఆయాసము కలుగును దానినే భుక్తాయాస మందురు. సామాన్యముగ ప్రతివారు భోజనమైనవెనుక భుక్తాయాసము తీర్చుకొనుచున్నామందురు. అయితే అంత ఆయాసము కలుగునట్లు భుజింపనేల? నిజముగా జూచిన, భోజనమైన వెంటనే ఏపని యందైన ప్రవేశింప శక్తిగలవాడే, శ్రమము ఆయాసమును పొందనివాడే మితాహారియగును. యుక్తాహారముయొక్క లక్షణ మిదియే మితము దప్పి భుజించిన అట్లైన్నటికి చేయ సామర్థ్యము గలుగదు ఇంతియేగాక, మితము దప్పి తినువాడు ఇతరుల అన్నమును హరించినవాడే యగును గాన పాపముకూడ నొడిగట్టుచుండును ఇట్లు అమితముగ భుజించు వారలకు దేహాయాసజనిత దుఃఖము, పాపఫలరూప దుఃఖము– రెండును సంప్రాప్తించుచుండును

398 వైరాగ్యము మోక్షసాధమునకు పునాదివంటిది అది దృఢముగ నున్ననే యాసాధమునకు హాని వాటిల్లకుండును తీవ్రసంవేగానామాసన్నః – అనునట్లు తీవ్రవైరాగ్యము గలవారికి మాత్రమే మోక్షమాసన్న మగును.

399 పరవస్తువులచే జీవించు స్వభావము గల్గియుండుట చాలనీచము పరాన్నము భుజించువారు తగిన బ్రహ్మనిష్ఠ గల్గియుండనిచో, తమ పుణ్యమును గోల్పోవు వారగుదురు అపుడు వారికి కోపతాపములు వృద్ధి యగును కఠినవాక్కు అల వడును ద్వేషము పెరుగును ఇట్టి లక్షణము లేమైన గలుగు చుండినట్లు తోచిన, పుణ్యము క్షయించుచున్నదని తెలిసికొని యింకను తీవ్రముగ ధ్యానము చేయవలెను లేక యొరుల నాశ్రయింపక జీవించుచు అనుష్ఠానము సల్పవలెను పరుల నాశ్రయించి పరాన్నము భుజించు చుండువారు సరియైన ధ్యాననిష్ఠ సల్పనిచో వారిస్థితి నాటుకోటు శెట్ల వద్ద డబ్బు తీసికొని వ్యాపారము సరిగ చేయనివాని చందమున నుండును చెల్లింపక పోయినచో కష్టపడవలసియుండును ఆ ధనికులెట్టి ధర్మాత్ము లైనను, తుదకు వారిల్లుకూడ జప్తుచేయించి ఆడబ్బు వసూలు చేయుదురు. ఇతరుల భిక్షల గైగొనుచు సుఖముగ జీవించుచుండు వారందఱును ఈ విషయమును బాగుగ జ్ఞప్తి యందుంచుకొనవలెను.

400. గీత 18వ అధ్యాయమున 51,52,53 శ్లోకములందు జెప్ప బడిన ధర్మము లన్నింటిని ముముక్షువు గల్గియుండవలెను. గీతయొక్క సారమంతయు ఆ మూడుశ్లోకములందే యిమిడియున్నది. నిరభిమానము శాంతము, అపరిగ్రహము ఇత్యాది సుగుణములు గలవారే బ్రహ్మప్రాప్తి కర్హులు. ముముక్షువులు సాధువులు శక్తికొలది సత్కర్మలు చేయుచుండుట మంచిది

**401. ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా ।**
**విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు ॥**

ఓ యర్జునా! నీకివ్విధముగ అతిరహస్యమగు జ్ఞానముపదేశించితిని

దానిని నీవు స్వయముగ బాగుగ విచారించినవాడవై ఆ పిదప నీయిచ్ఛవచ్చిన ట్లొనర్చుమని భగవానుడు గీతాంతమున అర్జునునకు బోధించెను దీనిచే, భగవానుడు తనపై కర్తృత్వమేమియు పెట్టుకొనలేదని స్పష్టమగుచున్నది. గురువులగువారు శిష్యుల కనేక ధర్మములు బోధించి చెప్పవలసి నదంతయు చెప్పి వైచి న్యాయాన్యాయములను దెలిపి, యిక మీయిష్టము వచ్చినట్లు చేసుకొనుడని ఆకర్తృత్వభారము వారిపైననే యుంచుదురు లేనిచో శిష్యులు చేయలేదను నెపము గురువుల కాపాదింతురు గదా! తానింతవఱకు చెప్పుచు వచ్చినట్టి నిష్కామబుద్ధిని దీనిద్వారా భగవానుడు స్పష్టీకరించియున్నాడు, చెప్పినది చేసి చూపినారు అష్టావక్రమునీంద్రుడుకూడ జనకున కీవిధముగనే యుపదేశించెను

**మోక్షో విషయవైరస్యం బంధో వైషయికో రసః ।**
**ఏతావదేవ విజ్ఞానం యథేచ్ఛసి తథా కురు ॥**

విషయవిరక్తియే మోక్షము, విషయాసక్తియే బంధము ఇదియే సర్వశాస్త్ర సిద్ధాంతము దీని నెఱింగి యిక నీ యిచ్ఛవచ్చి నట్లొనర్చుము

శ్రీయోగవాసిష్ఠమున శ్రీవసిష్ఠులున్ను శ్రీరామచంద్రున కంతమున నిట్టివిధముగనే యుపదేశించిరి గీత ద్వాపరయుగాంతముననను, శ్రీయోగ వాసిష్ఠము త్రేతాయుగముననను వ్రాయబడియున్నప్పటికి, గీతయందలి శ్లోకములు వాసిష్ఠమున పెక్కులు గలవు కొన్నికొన్ని శ్లోకములందు ఒక్కొక్క పాదము మాత్రమే సరిపోవుచుండును మఱి కొన్నిటిలో పాదార్థము సరిపోవును కనుకనే గీత సర్వశాస్త్రసారమని వచింపబడినది.

**402. య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।**
**భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః ॥**

**న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।**
**భవితా న చ మేతస్మాదన్యః ప్రియతరో భువి ॥**

ఎవ రీపరమగుహ్యమైన గీతాశాస్త్రమును నాభక్తుల కుపదేశింతురో,

వారు తప్పక నన్నే పొందుదురు అట్టివారే నాకు మిక్కిలి ప్రియులు ఇంక నధికప్రియ లెవరును లేరు, ఉండబోరు అని శ్రీకృష్ణపరమాత్మ యర్జునునకు బోధించెను

కనుకనే శ్రీ వివేకానందులు మొదలగువారు పాశ్చాత్యదేశములకు బోయి సర్వజనులకును నీ గీతాశాస్త్రమును బోధించి భగవత్సందేశమును ప్రజలలో వ్యాప్త మొనర్చిరి ఇంతియే గాక,

**శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః ।**
**సోఽపి ముక్తశ్శుభాన్లోకాన్ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్ ॥**

ఈ గీతాశాస్త్రము నెవరు శ్రద్ధ గల్గి విందురో, వారున్ను పాపరహితులై పుణ్యాచరణద్వారా క్రమముగ ముక్తి నొందగలరని వచింపబడినది గీత యంతయు బోధించి తుదకు భగవానులు తాను చెప్పినదంతయు శ్రద్ధతో, ఏకాగ్రచిత్తముతో వింటివా యనియు, సందేహము దీరినదా యనియు అర్జునుని ప్రశ్నింప; అందులకాతడిట్లు వచించెను

**నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత ।**
**స్థితోఽస్మి గతసన్దేహః కరిష్యే వచనం తవ ॥**

నా యజ్ఞాన మంతరించినది ఆత్మస్మృతి గలిగినది సంశయము లన్నియు వీడినవి తమ యనుగ్రహముచే ధన్యుడనైతిని ఇక తామాజ్ఞాపించి నట్లు వర్తింతును

శ్రీవసిష్ఠుల యుపదేశానంతరము శ్రీరామచంద్రులున్ను ఇట్టి అను భవమునే తెలిపియుండిరి. ఎట్లన,

**త్వత్ప్రసాదేన యాతోఽస్మి పరాం నిర్మలతాం ప్రభో ।**
**శాంతాశేషకలంకోఽంఽత శ్శరదీవ నభఃస్థలమ్ ॥**

శ్రీరాముడు ఓ వసిష్ఠమునీంద్రా! కళంకమంతయు రహితమై పూర్ణచంద్ర సహితమగు ఆకాశము శరత్కాలపూర్ణిమను బొందినట్లు

తమయనుగ్రహ ముచే నేను పరమనైర్మల్యమును పొందితిని

**సర్వాధివోపశాన్తా మే భ్రా న్తయో భవభఙ్గదాః ।**
**స్వరూపేణావదాతేన తిష్ఠామ్యచ్ఛమివామ్బరమ్ ॥**

ఓ గురువర్యా! నశ్వరసంసార ప్రదమగు నాభ్రాంతియంతయు నశించినది నిర్మలాకాశమువలె నేనిపుడు శుద్ధస్వరూపమున నున్నాను

**స్థితో౽హం గలితగ్రన్థిః శాన్తాశేషవిశేషణః ।**
**స్ఫటికాలయమధ్యస్థస్ఫటికామలధీరహమ్ ॥** (శ్రీ యోగవాసిష్ఠము)

నా హృదయ గ్రంధులన్నియు పటాపంచలైనవి సర్వవిశేషణ రహితుడనై నేనొప్పుచున్నాను స్ఫటికప్రదేశమున నున్నవానికి స్ఫటికబుద్ధి వలె, నీజగద్విషయమున శుద్ధ బ్రహ్మబుద్ధిమాత్రమే నాకు నున్నది. ఇవ్విధముగ ప్రతివారును తమ జీవితములో అట్టిస్థితి నొందవలెను తమ పరిపూర్ణత్వానుభవమును ఈ జన్మయందే వెల్లడిచేయవలసి యుండును. అపుడే మానవజన్మ సార్థకమైనట్లు ఇంకొక రహస్యమున్ను ఇందు గలదు. 'కరిష్యే వచనం తవ' అని అర్జునుడు చెప్పుట బట్టి, ఆత్మజ్ఞాన మొంది జీవన్ముక్తుడైనను, ఇక చేయవలసిన దేదియు లేకున్నను, గుర్వాజ్ఞను పాలించుట యను కర్తవ్యమొకటి మాత్రము మిగిలియుండును

**403. ఆజీవితం త్రయస్సేవ్యా వేదాన్తో గురురీశ్వరః ।**
**ఆదౌ జ్ఞానాప్తయే పశ్చాత్కృతఘ్నత్వనివృత్తయే ॥**

అనునట్లు శాస్త్రవిశ్వాసము, గురుభక్తి, ఈశ్వరభక్తి, జీవన్ముక్త్యనంతరమున్ను గల్గియుండవలెనని నియమము గలదు ఏలన ఈముగ్వురి వలననే తనకు బంధనివృత్తి గలిగెను గదా! కాన తదనంతరమున్ను కృతజ్ఞతా సూచకముగ వారియాజ్ఞల నెరవేర్చవలసియే యుండును అదియే లోకనీతి. తనకు మేలుచేసినవారిని మఱువకుండుటయే విజ్ఞుల స్వభావము

404 ఆత్మ యొక్కటియే విశ్వతైజసప్రాజ్ఞులను త్రివిధరూపములను,

వాటి యనుభవములను గాంచుచు ప్రజ్ఞానఘన స్వరూపుడై, వాటికి విలక్షణ ముగ నుండును సూర్యబింబముచే ఘటములందలి ప్రతిబింబములవలె నివియు సృజింపబడుచున్నవి ఆఘటములు నశింప ప్రతిబింబములున్ను నశించి, ఏకాలమందును మార్పునొందని బింబమెట్లు శేషించి యుండునో, అట్లనే అంతఃకరణోపాదులు నశింప త్రివిధావస్థలు లేని తురీయాత్మ యే కాలమందును దుఃఖము నొందక యున్నట్లు గోచరమగును మహావాక్యాను భవము గలవారికిని, వస్తుతత్త్వ మెఱింగిన వారికిని మాత్రమే యిది సిద్ధించును శాస్త్రపాండిత్య మెంత యున్నను, అనుష్ఠానముచే తురీయస్థితి నొందనివారి కది తెలియదు అనగా అవిద్య శమించినవారికే అట్టి యాత్మానుభూతి సంప్రాప్తించునని భావము. అయితే శాస్త్రములు విడువవలెనని గాదు అనుభవములేని శాస్త్రములవలన ప్రయోజనము లేదనియే ఒకవేళ అనుభవ మున్నప్పటికిని నితరుల కొఱకైనను, శాస్త్రపరిజ్ఞాన ముండియుండవలెను

మఱియును ప్రపంచములో నున్నతస్థాన మలంకరించిన వారలలో చాల మంది శాస్త్రములు చదివినవారలే విద్యలేనివారు విద్యగలవారికి బానిసలై యున్నారు. అయితే యీ బాహ్యవిద్య నభ్యసించి సంతృప్తినొందక అధ్యాత్మవిద్యను సొంతముగ గ్రహించిననే యానందము బడయగలరు

ఋష్యాదు లందఱును శాస్త్రములను జదివి తదుపరి యనుష్ఠాన మును శీలించుకొనినవారలే అందు స్త్రీలుకూడ గలరు బృహదారణ్యా కోపనిషత్తునందు గార్గి, మైత్రేయి మొదలగు బ్రహ్మజ్ఞలగు నారీమణులు పేర్కొనబడిరి. అనేక విద్వాంసులు, బ్రహ్మనిష్ఠులు గల జనకుని రాజసభ యందు నిర్భీకముగ శాస్త్రవాదమునకు గడంగిన గార్గి యెట్టి తపస్సంపన్ను రాలై యుండవచ్చును! కనుకనే అట్టి నారీలలామల దివ్యచరితములు ఉపనిషదాదులందును పేర్కొనబడి చిరస్థాయియై లోకమున వెలయుచున్నవి ఎంతయో అమోఘశక్తి గల్గి యుండిననే యొకరిని ఋషులు తమ ఉపనిషద్గ్రంథముల జేర్చుదురు

కొంత చదువు, సాంఖ్యవిచారణ గలవారికి వేదాంత తత్త్వము సులభముగ బోధపడును పూర్వపు ఋషులు విద్య, తపస్సు రెంటియందును ఆరితేరియుండిరి అట్టి మేధాసంపత్తి లేనందుచేతనే కలియుగమున భక్తి, ప్రార్థన, భజనాదులకు ప్రాముఖ్యము నిచ్చిరి కాని యెన్ని యుగములకైనను జీవుడు తనయొక్క మలినవాసనలన్నిటిని సంపూర్ణముగ నశింపజేసికొని ప్రకృతి రహితమైన శుద్ధావస్థను పొందిననే మోక్షార్హుడగును అట్టి యవస్థయందు కృతయుగ, కలియుగ భేదము లెవ్వియు లేకనే సద్యఃకాలముననే జీవుడు ముక్తుడగును ఒక పర్వతము క్రింద నుండి చూచిన షుమారు ఒక పదిమైళ్ళ వఱకు మాత్రమే చూడగల్గును కాని దాని పైకెక్కినచో ఎన్నివందల మైళ్ళో చూడగల్గును అట్లనే ప్రకృతిని దాటి ఒక్కొక్క మెట్టు పైకెక్కి తుదకు ఆత్మశిఖరము చేరినచో సర్వము నెఱుంగగల్గును

405 ఈసందర్భమున యుగభేదముల గూర్చి యొకింత తెలిసికొనవలసియుండును వాటి నెఱింగిన నిక జీవులు తాము అల్పులు కాదనియు, కేవలము ఋషినంతానమనియు తెలిసికొనగలరు అట్లు తెలిసికొననందు చేతనే దుర్బలులై, పాపకార్యములందు భ్రమసి తుదకు అధోగతి పాలగుచున్నారు ఏకాదశిదినమున నియమపరులు శుద్ధమనస్కులై, నియతాహారము గైకొని, ఆరోగ్యవంతు లెటులగుదురో, అట్లే ఈయుగరహస్యము నెఱింగిన మనమందఱము కృతయుగములో నున్న వారమే యను ధైర్యము గలిగి ప్రయత్నశీలురమై బంధవిముక్తిని బడయుదుము

ఈశ్వరసృష్టియందు పరమాణువునుండి పరమేశ్వరునివఱకు గల సమస్తమున్ను ఒకేనియమము ననుసరించి వర్తించుచున్నదిగాని భేదమేమియు లేదు జ్యోతిశ్చక్రగమనమును పరికించిన సూర్య, చంద్ర, నక్షత్ర గ్రహాదులు సృష్ట్యాది నుండి నేటివఱకు ఒకేరీతిగ పయనమగుచున్నవి గాని విపరీత మార్గమును జేపట్టలేదు అట్లనే నభోమండలమునగల యసంఖ్యాక ములగు గోళము లన్నియు వాటివాటి నియమప్రకారము ఒక్క రేఖయైన తప్ప కుండ గమనము సల్పుచున్నవి అట్లు కానిచో ఒకటికొకటి ఢీకొని సృష్టి యంతయు

నెపుడో ధ్వంసమైయుండెడిది అట్లనే రైలుపోవునపుడు చూచిన, పెట్టె లన్నియు ఒకే వేగమున నడచుచుండునేగాని గతిభేదము గల్గియుండవు భూమియొక్క ఆకర్షణశక్తిచే గూడ పరమాణువు లన్నియు ఒకే విధముగ దాని వైపునకు ఆకర్షింపబడుచుండును

త్రిమూర్తులకును ఈనియతి సమానముగానే యున్నది బ్రహ్మ ప్రళయ, విష్ణుప్రళయ, రుద్రప్రళయములు సరిగా ఆయాకాలములకు గల్గుచుండును అట్లు ప్రపంచమందెచట జూచినను అనాదినుండి యొకేవిధ మగు నియమము భేదము లేక సమరీతిగ దృగ్గోచర మగుచుండ, నిక యుగములందు మాత్రము భేద మెచటనుండి వచ్చినది? యుగభేద ముండి యున్నచో అయ్యది సర్వత్ర వర్తింపవలదా? అట్లు కానుపించుట లేదే! మఱియు యుగములందు భేదమున్నచో ఆభేదము ఆయా యుగముల యందలి అందఱికిని అనువర్తింపవలెను

కలియుగము పాపయుతమైనచో, అందలి సర్వజీవులును పాపభూయిష్ఠులై యుండవలసియుండును అట్లు కాన్పించుట లేదు నాల్గుయుగము లందును ఫలాదులొకే రుచి గల్గియున్నవి గదా! ఈ కలియుగమున వాటిరుచియేమైన మారినదా? కాలచక్రమందు భేదము లేదు అట్లనే సమస్తసస్యములు, ఓషధులును పూర్వమువలె నేడున్ను ఒకేరీతి ఫలించు చున్నవి ఋతువు లన్నియు నొకేవిధమున మార్పునొందుచున్నవి. ఇక పక్షివర్గము జూచినను, శుక, పిక, మయూరాదులందుగాని, సింహ, శరభ, శార్దూలాదు లందుగాని, స్వర, శక్తి, గమనాదులందేమైన మార్పుగలదా? పంచభూతములను గాంచినను, పృథివియొక్క కాఠిన్యమందుగాని, జలముయొక్క ద్రవత్వ మందుగాని, అగ్నియొక్క యుష్ణత్వమునందుగాని, వాయువుయొక్క చలనత్వమునగాని, ఆకాశముయొక్క శబ్దవ్యాపకత్వము లందుగాని యేమైన భేదము పూర్వమునకును నిప్పటికిని కనుపించినదా? అట్లనే దేవతలయొక్క సత్త్వగుణమందును, అసురులయొక్క పాప స్వభావమునందును నేమార్పున్ను గలుగలేదు

ఇక యొక్క మనుష్యుని మాత్రము ఆ కలిమాయ యేల బాధించును? కృత, త్రేతా, ద్వాపర, కలియుగము లంతటనుగూడ అసురస్వభావము గలవారు, దైవస్వభావము గలవారు సమరూపముగానే యున్నారు ఎట్లన, కృతయుగమున కృతయుగ స్వభావుడగు ప్రహ్లాదుడుండినను, కలియుగ స్వభావుడగు హిరణ్యకశిపుడు గూడ యుండియే యున్నాడు అట్లనే త్రేతా యుగమున రామ,రావణులును, ద్వాపరయుగమున పాండవ, కౌరవులును నుండియున్నారు ఇక కలియుగముననో, శ్రీబుద్ధదేవుడు, శ్రీ ఏసుక్రీస్తు, శ్రీమహమ్మదునబి, శ్రీ ఆదిశంకరులు, మున్నగు కృతయుగపురుషులు లేరా? ఇపుడు జీవించియున్నవారిలో శ్రీగాంధీమహాత్ముడు మున్నగు మహనీయులందఱునుగూడ కృతయుగముననే పరిగణింపబడవలసినవారు గదా? కలి వారినేమైన బాధింపగల్గినదా? దీపమెచట నుండునో అచట చీకటి పటాపంచలై చెదరిపోవును. అది కృతయుగమైనను సరి, కలియుగమైన సరి ఇదియే దానికి గుఱుతు అట్లనే ఆత్మజ్యోతి యెచట నిరావరణముగ ప్రకాశిం చునో అచట అజ్ఞానాంధకార మంతయు రూపుమాసిపోవును కాలభేద మెద్దియు దానినాటంక పరుపజాలదు

కొందఱు కలియుగమున బ్రహ్మచర్యము సాధ్యమగునా? గృహస్థులు కూడ బ్రహ్మచర్య మాచరింపగలరా? అట్లు చేసినచో నెంతవారైనను భ్రష్టులై పోవుదురు అని దుర్బోధల గావించుచు, పవిత్ర బ్రహ్మచర్యవ్రత మవలంబించి కాలము గడపువారిని మోసపెట్టి గృహస్థాశ్రమమునకు దింప యత్నించు చున్నారు మహామహాపండితులే యిట్టిబోధనుల గావించు చున్నారు. ఇక సామాన్యుల విషయము వేఱు చెప్పవలెనా? అట్లే తురీయస్థితి యందు నిర్మలముగ జీవితము గడుపదలంచువారినిగూడ, ఎన్నో ప్రమాణములు చూపి క్రిందకు దింపుచున్నారు అదంతయు మోసము! కపటము! సత్య దూరము కొలది కాలము క్రిందటనే మనభారతభూమి నలంకరించిన విఖ్యాతులైనట్టి శ్రీవివేకానంద దయానందుల యఖండ బ్రహ్మచర్యదీక్షను, ఆబోధకులను కలి ఎంతమాత్రము భంగపఱుప గలిగినదో !!

పైనదెల్పిన ప్రకారము సృష్టియందలి దేనినికూడ కలి బాధింపనపుడు ఒక మనుజుడు మాత్రమేల బాధింపబడవలెను? ఒక్కమానవునకు మాత్రము అల్పాయువు, దుర్గుణములు ఏల గలుగవలెను? ఇది యుగభేద ముచే గలిగినది కాదు మానవుడు తానల్పుడనని యెంచి ధర్మమును సరిగ బాలింపక, నియమమును వీడి, శాస్త్రమును వదలి, స్వేచ్ఛాప్రవర్తకుడై విషయదోషసహితుడై, పశువర్తన గల్గియుండుటచేతనే అతడీకలిమాయకు బద్ధుడగుచున్నాడు. ఇపుడున్ను కృత యుగపురుషులెందఱో గలరు. కృతయుగముననను కలియుగపురుషులెందఱో యుండిరి ఎవని హృదయము శుద్ధముగా నుండునో ఆతడు కృత యుగమున నున్నట్లే ఎవని హృదయము మలినమై, దుర్గుణసంకులితమై కల్మషభూయిష్ఠమై యుండునో ఆతడు కలియుగమున నున్నట్లే ఎట్లన, హిరణ్యకశిపుడు కృతయుగముననే యుండెను త్రేతాయుగమున విభీషణుని హృదయము సత్త్వమయమై యుండుటచే నాతడు కృతయుగముననే యుండెను రావణాదులు కలియుగమున నుండిరి ద్వాపరయుగమున పాండవులు కృతయుగధర్మము గల్గి వినిర్మలచిత్తులై పఱగిరి దుర్యోధనాదులు కల్మషహృదయులై కలిస్వభావమును జూపిరి

ఇక నీకలియుగముననో శ్రీబుద్ధదేవాది మహాధర్మప్రవక్తలు, శుద్ధాంతఃకరణులు కలిమాయలోనేమైన జిక్కిరా? శ్రీరామకృష్ణ పరమ హంస, శ్రీవివేకానంద, శ్రీగాంధిమహాత్ముడు- మొదలగువారిని కలి యేమి చేయగల్గినది? వారు పతితులని, ధర్మహీనులని యెవ్వరైన చెప్పగలరా? ఇక స్త్రీలలో శ్రీరామకృష్ణ పరమహంసలవారి సతీతిలకమగు శ్రీశ్రీశారదా దేవి మున్నగు పవిత్రహృదయలను వ్రతభంగముగల వారని యెవ్వరైన చెప్పగలరా? వెయ్యేల ! మనుజుడు తాననుష్ఠింప వలసిన ధర్మమును సరిగ ననుష్ఠించినచో నాతడు కృతయుగము లోనివాడే. ఈ సత్యమెఱింగి తమయందేమైన కల్మషమున్నచో వెంటనే నివృత్తిచేసికొని కృతార్థులు కావలెను. ఈ సత్యమును బోధించువారు లేకపోవుటచేతనే జనులు కలిమాయకు లోబడి

తపించుచున్నారు

406 ఎపుడు మనుజానకు ఒకవ్యక్తియొక్క దేహము, జాతి మాత్రమే తోచుచుండునో, ఆతనికింకను అవిద్య, దృశ్యము నశించలేదనియు, జడ మందే వసించుచున్నాడనియు నిశ్చయింపవచ్చును అట్టి జడత్వబుద్ధిని వదలి నిత్య, శుద్ధ స్వరూపమగు ఆత్మ తానే యను ప్రబోధమెపుడు పడయునో అపుడు నిద్రనుండి మేల్కొంచినవానివలె నాతడు ప్రబుద్ధుడగును నిద్రలో నున్నపుడు చక్రవర్తి యైనను మహారాజైననుకూడ తానెవరో తెలియ కుండును మేల్కొనిన పిదప తాను ఫలానివాడని గుర్తించును అట్లనే అవిద్యా నిద్రనుండి మేల్కొలిపి, ఆత్మబోధ గావించి తాము నిత్యులు సత్యస్వరూపు లని జనులకు లెస్సగ బోధించినచో అజ్ఞానము, దృశ్యభ్రాంతి, దేహవాసన, శాస్త్రవాసన, కులవాసన నశించి కృతార్థు లగుదురు అట్టి దివ్యప్రబోధము గావించువారు అరుదగుటచేతనే జనులు మాయాపంకమున మగ్నులై దీనదశ నొందియుండుట జరుగుచున్నది

మనస్సు మహాద్భుతశక్తి గలది ఒక్క క్షణములో సత్యలోకము నుండి పాతాళలోకమున కేగగలదు ప్రపంచములోని తీర్థములన్నింటిని సేవించి రాగలదు మేరుస్థానమునుండి య.గోలోకమునకు జేరగలదు ''యోగశ్చిత్త వృత్తి నిరోధః'' (పతంజలి యో సూ) – అట్టి మనస్సును స్వాధీనము చేసికొని వశమొనర్చుటయే యోగము విజ్ఞాన బుద్ధిగల వారందఱును ఈ విషయమును ముఖ్యముగ నెఱుంగవలెను

మనుజాడు ఏజాతియందు జన్మించినను సరే తాను దేహము కాదు; మనస్సు కాదు, బుద్ధి కాదు – వీటన్నింటికి విలక్షణమైన ప్రజ్ఞానం బ్రహ్మ యను మహావాక్య ప్రతిపాదితమైన ఆత్మచైతన్యమే, తన స్వరూపము అని బోధించుటచే వారు ధైర్యయుతలై ఉన్నతాశయులై తమయథార్థ రూపమును సాక్షాత్కరించుటయందు యత్నీకృతులై యుందురు అట్లుగాక మీరు అల్పులు, నికృష్టులు, హీనజాతివారు, మీకు శుచి ఆచారాదుల క్షరత లేదు. మీరు స్త్రీలు, అబలలు కాన బ్రహ్మవిద్యకు యోగ్యత లేదు – ఇట్లు జనులను

నిరుత్సాహపఱచి వారలను పైకి రానీయక వారి యాత్మశక్తిని అణగద్రొక్క జూచుచున్నవారు తమకు నితరులకుకూడ హాని యొనర్చుచున్న వారగుదురు లోకోన్నతి కవరోధము కల్పించిన వారగుదురు అట్టి వారు పాపమునే యొడిగట్టుచుందురు ఎపుడు జీవుడు తానల్పుడనని తలంచునో, అపుడు తన శక్తియంతయు గోల్పోయి దుర్బలుడై, క్రుంగిపోవును ఎపుడు తానధికుడనని తలంచునో, అపుడే ద్విగుణీకృత శక్త్యుత్సాహములతో గూడి తేజోమయుడై చెన్నొందును ఇదియే మానవుని జయాపజయములందలి రహస్యము కాన ప్రతివారును తాము ఆత్మస్వరూపులను దృఢనిశ్చయము గావించుకొని, తత్స్వరూపసాక్షాత్కృతికై యహర్నిశంబులు యత్నీభూతులై యుండవలెను

407 శుచి, ఆచారముగల యొక వైదికబ్రాహ్మణునకు మరారీ నీచ గ్రహమొకటి పట్టినచో, తన బ్రాహ్మణత్వమును మఱచి, శూద్రత్వమునే ఎట్లు ప్రకటించునో, అపుడొక మాంత్రికుని పిలిపించి మంత్రింపించినచో గ్రహ విమోచనమై పూర్వపుస్థితిని మఱల యధాప్రకారమెట్లు పొందునో, అపుడెట్లు తన బ్రాహ్మణత్వమును మఱల గుర్తెఱుంగునో, తన గ్రహకాల చేష్టలజూచి సిగ్గుపడునో, అట్లనే అవిద్యాగ్రహబద్ధుడైన జీవుడు తన బ్రహ్మత్వమును మఱచి, జీవరూపమును ప్రకటించుచున్నాడు పూర్ణానందస్వరూపమగు తన స్వస్వరూపమును విడనాడి దుఃఖసముద్రమున మునుగుచున్నాడు. చిదాకాశ మున స్వేచ్ఛగ విహరించుచు ప్రజ్ఞానఘను డైయుండవలసిన యాతడు అయ్యవిద్యాగ్రహావేశంబున గుణత్రయపాశబద్ధుడై, పరిచ్ఛిన్నుడై, జ్ఞాన రహితుడై యున్నాడు కాని ఆత్మానుభూతిగల దేశికుని బ్రహ్మ జ్ఞానోపదేశంబుచేత అవిద్యాగ్రహము పలాయనము కాగా, జీవుడు బంధరహితమై, సర్వ స్వతంత్రమై, సచ్చిదానందమయమైనట్టి తన యధార్థ రూపమును స్మృతిపథమునకు దెచ్చుకొనుచున్నాడు కాని గ్రహవిమోచన మైనను, మాంత్రికుడు వానికొక రక్ష రేకు(యంత్రము)ను కట్టును. దానిపై కొన్ని బీజాక్షరము లుండును అది పోయినచో వెంటనే మఱల గ్రహము

తపించుచున్నారు

406 ఎపుడు మనుజానకు ఒకవ్యక్తియొక్క దేహము, జాతి మాత్రమే తోచుచుండునో, ఆతనికింకను అవిద్య, దృశ్యము నశించలేదనియు, జడ మందే వసించుచున్నాడనియు నిశ్చయింపవచ్చును అట్టి జడత్వబుద్ధిని వదలి నిత్య, శుద్ధ స్వరూపమగు ఆత్మ తానే యను ప్రబోధమెపుడు పడయునో అపుడు నిద్రనుండి మేల్కొంచినవానివలె నాతడు ప్రబుద్ధుడగును నిద్రలో నున్నపుడు చక్రవర్తి యైనను మహారాజైననుకూడ తానెవరో తెలియ కుండును మేల్కొనిన పిదప తాను ఫలానివాడని గుర్తించును అట్లనే అవిద్యా నిద్రనుండి మేల్కొలిపి, ఆత్మబోధ గావించి తాము నిత్యులు సత్యస్వరూపు లని జనులకు లెస్సగ బోధించినచో అజ్ఞానము, దృశ్యభ్రాంతి, దేహవాసన, శాస్త్రవాసన, కులవాసన నశించి కృతార్థు లగుదురు అట్టి దివ్యప్రబోధము గావించువారు అరుదగుటచేతనే జనులు మాయాపంకమున మగ్నులై దీనదశ నొందియుండుట జరుగుచున్నది

మనస్సు మహాద్భుతశక్తి గలది ఒక్క క్షణములో సత్యలోకము నుండి పాతాళలోకమున కేగగలదు ప్రపంచములోని తీర్థములన్నింటిని సేవించి రాగలదు మేరుస్థానమునుండి గోలోకమునకు జేరగలదు "యోగశ్చిత్త వృత్తి నిరోధః" (పతంజలి యో సూ) – అట్టి మనస్సును స్వాధీనము చేసికొని వశమొనర్చుటయే యోగము విజ్ఞాన బుద్ధిగల వారందఱును ఈ విషయమును ముఖ్యముగ నెఱుంగవలెను

మనుజాడు ఏజాతియందు జన్మించినను సరే తాను దేహము కాదు; మనస్సు కాదు, బుద్ధి కాదు – వీటన్నింటికి విలక్షణమైన ప్రజ్ఞానం బ్రహ్మ యను మహావాక్య ప్రతిపాదితమైన ఆత్మచైతన్యమే, తన స్వరూపము అని బోధించుటచే వారు ధైర్యయుతలై ఉన్నతాశయులై తమయథార్థ రూపమును సాక్షాత్కరించుటయందు యత్నీకృతులై యుందురు అట్లుగాక మీరు అల్పులు, నికృష్టులు, హీనజాతివారు, మీకు శుచి ఆచారాదుల క్షర్షత లేదు. మీరు స్త్రీలు, అబలలు కాన బ్రహ్మవిద్యకు యోగ్యత లేదు – ఇట్లు జనులను

మఱువక ఆత్మసంపదతో తులతూగుచు సుఖింతురుగాక।

410 పరీక్షిన్మహారాజా, కలికి వసించుటకై నాల్గు స్థానముల నొసంగెను 1 జూదము, 2 పానము, 3 దుష్టగుణముగల స్త్రీ, 4 హింస, పరీక్షిత్తు కలికి నిట్లు ఆజ్ఞాపించెను– ఓ కలీ! ఎచట జూదమాడబడుచుండునో అచట నీ ప్రభుత్వమును నిరాటంకముగా కొనసాగించుకొనుము ఎచట జనులు మద్యపాననిరతులై యుందురో అచట నీరాజ్యమును సుస్థిరముగ నెలకొల్పుకొనుము ఎచట దుర్వృత్తి గల స్త్రీలుందురో అచట నీ యధికారమును బాగుగ చలాయించుకొనుము ఎచట హింసాప్రవృత్తిగల జనులుందురో అచట నీరాజ్యమును సుభిక్షముగ నొనర్చుకొనుము కాని యెచట సత్యము, దానము,దయ, ధర్మము, తపస్సు, భగవత్స్మరణ, ఏకపత్నీవ్రతము, పాతివ్రత్యము, జీవకారుణ్యము, ఇత్యాది సుగుణము లుండునో, అచ్చోటకు పోనైనపోరాదు దూరమునుండియే దానిని విడిచి వేయుము –అని యాజ్ఞ యొసెంగెను. కాన నీపై దుర్గుణము లుండిననే కలిని జూచి భయపడవలసియుండును. లేనిచో కలి వారి నేమియు చేయజాలదు.

411 ఈపైజెప్పిన ధర్మము లన్నింటిని బాగుగ గ్రహించి, శ్రవణ మాత్రముతో సంతుష్టిపడక, వాటిని మనన నిదిధ్యానములు గూడ గావించినచో, ఆత్మనిష్ఠ, సమాధులందు కాలము గడిపినచో స్వాములవారు మీ సన్నిధి యున్నట్లే అట్లుగాక గజస్నాన మాచరించినచో, అనగా ఏనుగు ఎంత శుభ్రముగా కడుగబడి, తిలకాదులచే సంపన్నము గావింపబడినను, బయటకు వచ్చుటతోడనే దుమ్ము ఎట్లు నెత్తిన చల్లుకొని యథారీతి మలినమగు చుండునో, అట్లు చేసినచో ఫలితమేమియు నుండదు కాన మీమీ గృహములకు బోయినపుడు ఈ వచించిన గీతాధర్మములను, ఆధ్యాత్మిక తత్త్వములను మఱవక, యనుష్ఠించుచుండినచో, భగవచ్చింతన గావించు చుండినచో మీరందఱు కృతయుగము లోనివారలే.అట్లుగాక భగవద్భక్తి లేనివారై అనుష్ఠానమును మఱచి, ఆత్మ విస్మృతి గల్గియున్నచో కలియుగము లోనివారలే

**కలౌ కృతయుగం తస్య కలిస్తస్య కృతే యుగే ।**
**యస్య చేతసి గోవిన్దో హృదయే యస్య నాచ్యుతః ॥**

ఎవడు సుగుణసంపన్నుడై, దైవనిష్ఠాపరుడై, పరిశుద్ధచిత్తము గల్గియుండునో, అతడు కలియుగమున నున్నను కృతయుగపురుషుడే యగును ఎవడధర్మభూయిష్ఠుడై, దుర్వృత్తియుతుడై, పాపస్వభావము గల్గియుండునో ఆతడు కృతయుగమున నున్నను కలియుగమున నున్నవాడే యగును ★



# 19 వ రోజు 15-4-1940

(నేటినుండి ఉత్తరగీత ప్రారంభింపబడెను)

412 ఉత్తరగీతయందు ప్రారంభముననే అహంకార, మమకార నివృత్తి, విషయాసక్తిరాహిత్యము సమాధిలక్షణము మొదలగు ధర్మములు బోధింపబడెను. భగవద్గీతయందు బోధింపబడిన నిష్కామకర్మను బాగుగ ననుష్ఠించి భక్తి, వైరాగ్యములు గల్గి అంతఃకరణశుద్ధిని బొందినవారికే ఈ ఉత్తరగీతయందలి బోధ యలవడును కాన గృహస్థాశ్రమమున నిష్కామకర్మాదులను లెస్సగ నాచరించి చిత్తశుద్ధిబొంది అ పిదపనే వానప్రస్థాశ్రమమున ధారణా, ధ్యానాదుల నభ్యసింపవలెను భిత్తిని శుభ్రపరచి పాలరాతిచే నునుపుగ చేసిన తదుపరియే గదా చిత్రకారుడు దానిపై చిత్రములను లిఖించుటకు యత్నించును! భూమియొక్క మిట్టపల్లములు బాగుగ చదరముచేసి, రాళ్లు, మొద్దులు తీసివేసి బాగుగా దున్ని ఆపిదపనే గదా పైరు వేయుదురు!

**413. ఆత్మమంత్రస్య హంసస్య పరస్పర సమన్వయాత్ ।**
**యోగేన గతకామానాం భావనా బ్రహ్మ ఉచ్యతే ॥**

---

★ నాటితో భగవద్గీత 18 అధ్యాయములున్ను పూర్తియయ్యెను మఱునాడు ఉత్తరగీత ప్రారంభింపబడెను

ఆత్మమంత్రమునకును, జీవునకు నన్యోన్య ప్రతిపాద్య ప్రతిపాదక భావసంబంధ ముండుటవలన చిత్తవృత్తి నిరోధరూపమైన యోగముచేత, కామాదులు లేని వారియొక్క భావన (తత్త్వమస్యాది మహావాక్య జన్యచర మవృత్తి) బ్రహ్మము అనబడుచున్నది ఆత్మతత్త్వవిచార రూపమైన ధ్యాన యోగముచే కోరికలన్నియు నశింపబడును. కాన ఆత్మసాక్షాత్కారము సిద్ధించును తుపాకిలో మందు మాత్రము వేసి, గుండులేక కాల్చినచో నయ్యది లక్ష్యమును భేదింపజాలనట్లు అర్థభావన లేక వాక్యముచే మాత్రము జప, పారాయణాదు లేవి చేసినను ఆత్మసందర్శనము కాదు. అట్లు అర్థాను సంధాన పూర్వక ధ్యానాద్యనుష్ఠానములు గల వారికే ఆవరణ నశించి స్వస్వ రూప ముదయమగును.

414 'సోఽహం' అను దానియందు సకారహకారములను హల్లుల రెంటిని తీసివైచినచో మిగులునది 'ఓం' అనుఅక్షరము అదియే ప్రణవము, అదియే పరబ్రహ్మముయొక్క వాచకము. ప్రాణమునుకూడ ప్రేరణ చేయునట్టి ఆ పర బ్రహ్మము నెఱుంగుటయే నిజమైన ప్రాణాయామమని శ్రీవివేకానందులు రాజయోగమున దెల్పిరి. ప్రాణము జడమైనది కాన దాని ప్రేరణ చేయు చైతన్య మొకటి యుండియుండవలెను ఒక రొంక గొట్టముద్వారా గాలిని పీల్చుచు, వదలుచున్న యెడల, అట్లు పీల్చువా రాగొట్టముకన్న వేఱుగ నెట్లుందురో, అట్లనే దేహమునను గూడ జడమైన ప్రాణమును ప్రేరేపించునట్టి చైతన్య మొకటి గలదు అందాప్రాణమును విలయ మొనర్చుటయే ప్రాణాయామము. కర్మ(బాహ్య) ప్రాణాయామమువలన శరీరారోగ్యము, దీర్ఘాయువు చేకూరునే గాని ఆత్మసాక్షాత్కారము కలుగదు అది పైజెప్పిన ఆంతర ప్రాణాయామమువలననే సిద్ధించును.

ఎంతవఱకు ఆత్మజ్ఞానము కలుగలేదో యంతవఱకు దేహబుద్ధి జీవునకు నుండును. మఱియు ఎన్నివేల సంవత్సరములు జీవించినను దేహాత్మబుద్ధి నశించువఱకు ఆత్మశాంతి కలుగదు. అంతవఱకు నాతడు బాలుడే యగును

**కలౌ కృతయుగం తస్య కలిస్తస్య కృతే యుగే ।**
**యస్య చేతసి గోవిన్దో హృదయే యస్య నాచ్యుతః ॥**

ఎవడు సుగుణసంపన్నుడై, దైవనిష్ఠాపరుడై, పరిశుద్ధచిత్తము గల్గియుండునో, అతడు కలియుగమున నున్నను కృతయుగపురుషుడే యగును ఎవడధర్మభూయిష్ఠుడై, దుర్వృత్తియుతుడై, పాపస్వభావము గల్గియుండునో ఆతడు కృతయుగమున నున్నను కలియుగమున నున్నవాడే యగును ★



# 19 వ రోజు 15-4-1940

(నేటినుండి ఉత్తరగీత ప్రారంభింపబడెను)

412 ఉత్తరగీతయందు ప్రారంభముననే అహంకార, మమకార నివృత్తి, విషయాసక్తిరాహిత్యము సమాధిలక్షణము మొదలగు ధర్మములు బోధింపబడెను. భగవద్గీతయందు బోధింపబడిన నిష్కామకర్మను బాగుగ ననుష్ఠించి భక్తి, వైరాగ్యములు గల్గి అంతఃకరణశుద్ధిని బొందినవారికే ఈ ఉత్తరగీతయందలి బోధ యలవడును కాన గృహస్థాశ్రమమున నిష్కామకర్మాదులను లెస్సగ నాచరించి చిత్తశుద్ధిబొంది అ పిదపనే వానప్రస్థాశ్రమమున ధారణా, ధ్యానాదుల నభ్యసింపవలెను భిత్తిని శుభ్రపరచి పాలరాతిచే నునుపుగ చేసిన తదుపరియే గదా చిత్రకారుడు దానిపై చిత్రములను లిఖించుటకు యత్నించును! భూమియొక్క మిట్టపల్లములు బాగుగ చదరముచేసి, రాళ్లు, మొద్దులు తీసివేసి బాగుగా దున్ని ఆపిదపనే గదా పైరు వేయుదురు!

**413. ఆత్మమంత్రస్య హంసస్య పరస్పర సమన్వయాత్ ।**
**యోగేన గతకామానాం భావనా బ్రహ్మ ఉచ్యతే ॥**

★ నాటితో భగవద్గీత 18 అధ్యాయములున్ను పూర్తియయ్యెను మఱునాడు ఉత్తరగీత ప్రారంభింపబడెను

విపరీతార్థములను కల్పించిరి. బుద్ధదేవుడు చంపగూడదని చెప్పెనేగాని తినగూడదని చెప్పియుండెనా యని వాదించి, తినరాని వస్తువులను తినుట ప్రారంభించిరి కాని మఱియొక శాఖవారు శుద్ధముగానే యుండిరి బుద్ధమతము నాలుగు శాఖలుగా చీలినది అందు నాస్తికులు కూడ నొక తెగవారు గలరు ఆచార్యులు స్థాపించు మూల సిద్ధాంతములలో క్రమముగ వారి యనుయాయులకు భిన్నాభిప్రాయము గల్గియుండినచో మతము లందిట్లనే చీలిక లేర్పడుచుండును ఇపుడు కాంగ్రెసునందు కూడ మొదట గాంధిమత మవలంబించు వారొక్కరై యుండిరి కాని రాను రాను, సోషలిస్టు పార్టీ వారు అందుండి చీలిపోయిరి గదా!

416. ఈ చలించునటువంటి దృశ్యకోటిని చలింపని బుద్ధితో వీక్షించు వారే సమాధినిష్ఠయందుండువారు అట్టి నిశ్చలస్థితి జ్ఞేయమందు నిలుకడ గల వారికే గలుగును శ్రవణమనననిదిధ్యాసములు గావించిన వారికే యది తెలియును. బౌద్ధమతములోగల శూన్యవాదమును శంకరు లొక్క వాక్యము చేతనే ఖండించివైచిరి. శూన్యము శూన్యము నెఱుంగుచున్నదా, లేక చైతన్యము శూన్యము నెఱుంగుచున్నదా యని వారు ప్రశ్నించిరి. శూన్యమును శూన్యమెఱుగజాలదు కాన శూన్యమును తెలిసికొను నటువంటిది దాని కంటె వేఱై, చైతన్యమై యుండవలెను అదియే ఆత్మ యని శంకరులు బోధించిరి. నాదబిందు కళాతీతమైన చిద్వస్తువు నెవ్వరెఱుంగుదురో వారే ఆత్మ నెఱింగినవారు. శబ్దముల కందక, శబ్దార్థ స్వరూపమున నిలుకడ గలవారే బ్రహ్మసా క్షాత్కారము నొందినవారు. కాన ఓంకారమును కేవలము స్మరించుట మాత్రముతో చాలదనియు, దాని యర్థము ననుసంధించుచు, ఆత్మాకారమున మనస్సును లీనము చేయవలెననియు చెప్పిరి

417. భగవద్గీతయందువలె నీ యుత్తర గీతయందును, జ్ఞాన జ్ఞేయ ములగూర్చి తెలుపబడినది జ్ఞానముచే జ్ఞేయాకారము సిద్ధించునపుడు, ఆ జ్ఞానము జ్ఞేయరూపమై పరిణమించును అభ్యాసయోగమిక నచట లేదు. ధ్యాత ధ్యేయాకారమై మారును కాన సాధన లన్నియు తుదకు ఆ ధ్యేయ

ములోనే విలీనమగును అవధూత గీతయందు శ్రీ దత్తాత్రేయులును కేవలమీధ్యేయమును గూర్చియే తెలిపిరి ధారణా ధ్యానములు రెండును ధ్యేయాకృతి సాధించుట కొఱకే నదులు ప్రవహించుట సముద్రమున జేరుట కొఱకే గదా! ఉప్పుబొమ్మను తన జన్మస్థానమగు సముద్రమున ముంచిన కఱగి నీరైపోయి, తన నామరూపములను బోగొట్టుకొని సముద్ర రూపము గనే శేషించినట్లు, కత్తిని గొంపోయి తన జన్మస్థానమగు మట్టి యందుంచిన, త్రుప్పువట్టి క్రమముగ మట్టియే యగునట్లు, మనస్సును తన జన్మస్థానమైన ఆత్మయందు నెలకొల్పిన, తన మనోరూపమును గోల్పోయి ఆత్మరూపము గనే శేషించును

418 దీపము, దీపము అని యుచ్చరించిన మాత్రమున చీకటి నశింపదు దీపము వెలిగించిన మాత్రముమన అది నశించును అట్లనే ప్రణవము నుచ్చరించిన మాత్రమున నజ్ఞానాంధకారము తొలగనేరదు మనన, నిదిధ్యాసనలద్వారా ప్రణవార్థ స్వరూపమగు బ్రహ్మమును సాక్షాత్కరించు కొనిననే తొలగును అపుడు ప్రకృతి సంపూర్ణముగ నశించును

419. నదిని దాటునంతవఱకు ఓడ యెట్లవసరమో, ధాన్యము లభించు నంతవఱకు, కృషి యెట్లవసరమో, అట్లనే ఆత్మసాక్షాత్కార మగువఱకు, గురూపదేశ, శాస్త్రాధ్యయన, శ్రవణ మననాదు లవసరములై యుండును నదిని దాటిన పిదప ఓడ నెట్లు విడుచుదురో, ధాన్యము లభించిన పిదప తృణాదులనెట్లు విసర్జింతురో, అట్లనే మహనీయులద్వారా శ్రవణముచేసి, శాస్త్రములను పఠించి, అనుష్ఠించి జ్ఞేయైకస్థితి బడసి ఆ పిదప శాస్త్రములను విడువచ్చును కొందఱు శాస్త్రమును చదువకయే గొప్ప బ్రహ్మనిష్ఠులెట్లైరని ప్రశ్నింపవచ్చును అట్లు కాకతాళీయయోగమున కొందఱకు సంప్రాప్తించును వారు పూర్వము బాగుగ సాధనజేసి పరిపక్వస్థితికి వచ్చిన వారైయుందురు కాని యట్టివారు చాల అరుదుగ నుందురు వారిని జూచి తక్కిన వారందఱున్ను అపరిపక్వస్థితియందే సాధనల విడచిపెట్టినచో గమ్యస్థానము నెన్నటికిని చేరజాలరు ఒకడు పరీక్ష

ప్యాసై, ఉద్యోగముచేసి పెన్షను తీసికొను చుండ, వానిని గాంచి, తక్కిన విద్యార్థులు కూడ చదువు చాలించి యూరక ఉన్నచో, పరీక్ష యెట్లు ప్యాసగుదురు? ధనమెట్లార్జింపగలరు? కాన అభ్యాసస్థితి, ఆరూఢస్థితి - యీ రెంటియొక్క వైలక్షణ్యమును బాగుగ గుర్తించవలెను వస్తువులను గాంచునంతవరకు దీపమును విడువనట్లు, వ్యాధి నివారింపనంతవఱకు ఔషధమును వదలనట్లు ఆత్మోదయ మగువఱకు సాధనల నెన్నడు వీడరాదు అమృతపానముచేసి తృప్తినొందిన వానికిక అన్న, జలము లవసరము లేదుగాని, ఆకలిచే మలమల మాడుచుండు అన్నాతురునకు వలయునుగదా! కాన అజ్ఞానాంధకారమున మునిగియుండు సాధకులకు, ముముక్షువులకు ధ్యానానుష్ఠానములు తప్పక యుండవలయును బ్రహ్మనిష్ఠనకు వలసిన నియమములను అంత్యము వఱకు విడువరాదు ఆరురుక్షువు యోగారూఢు డను నిరువురిలో ఆరురుక్షువు మోక్షసౌధము నారోహించుటకై సోపానము నెక్కుచున్నవాడు. యోగారూఢుడు మోక్షసౌధము నధిరోహించినవాడు కాన వీరిరువుర తారతమ్యమును గమనించవలెను

**420. ఆత్మానమరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్ ।**
**ధ్యాననిర్మథనాభ్యాసాద్దేవం పశ్యేన్నిగూఢవత్ ॥**

ఆత్మను అధరారణిగను, ప్రణవరూపంబగు పరబ్రహ్మమును ఊర్ధ్వారణిగను, భావించి ధ్యానంబనియెడి నిర్మథనాభ్యాసంబుచే నతినిగూఢంబై వర్తించునట్టి పరమాత్మను గాంచవలెను! యజ్ఞాదులందు అగ్నినుత్పన్నము చేయునపుడు రెండుకొయ్యల నుపయోగింతురు వాటినే అరణులందురు రావికఱ్ఱ, మఱ్ఱికఱ్ఱ, జువ్వికఱ్ఱ, అత్తికఱ్ఱ మొదలగువాటి నందులకై యుపయోగపరచుదురు ఆ కట్టెలు పచ్చివిగా నున్నచో ఎంతమథించినను అగ్ని రగులదు. అపుడు వాటి నెండవేయవలెను అట్లనే, ఆత్మోదయము గానిచో తన యంతఃకరణమందలి దోషమింకను నశింపలేదని యెంచి, వైరాగ్య, భక్తి, జ్ఞాన, ధ్యానములను మఱింత తీవ్రముగా నభ్యసింపవలెను ఎప్పటికైనను యోగాభ్యాసముచే నట్టి దోషము పూర్ణముగ నశించిననే

ములోనే విలీనమగును అవధూత గీతయందు శ్రీ దత్తాత్రేయులును కేవలమీధ్యేయమును గూర్చియే తెలిపిరి ధారణా ధ్యానములు రెండును ధ్యేయాకృతి సాధించుట కొఱకే నదులు ప్రవహించుట సముద్రమున జేరుట కొఱకే గదా! ఉప్పుబొమ్మను తన జన్మస్థానమగు సముద్రమున ముంచిన కఱగి నీరైపోయి, తన నామరూపములను బోగొట్టుకొని సముద్ర రూపము గనే శేషించినట్లు, కత్తిని గొంపోయి తన జన్మస్థానమగు మట్టి యందుంచిన, త్రుప్పువట్టి క్రమముగ మట్టియే యగునట్లు, మనస్సును తన జన్మస్థానమైన ఆత్మయందు నెలకొల్పిన, తన మనోరూపమును గోల్పోయి ఆత్మరూపము గనే శేషించును

418 దీపము, దీపము అని యుచ్చరించిన మాత్రమున చీకటి నశింపదు దీపము వెలిగించిన మాత్రమువన అది నశించును అట్లనే ప్రణవము నుచ్చరించిన మాత్రమున నజ్ఞానాంధకారము తొలగనేరదు మనన, నిదిధ్యాసనలద్వారా ప్రణవార్థ స్వరూపమగు బ్రహ్మమును సాక్షాత్కరించు కొనిననే తొలగును అపుడు ప్రకృతి సంపూర్ణముగ నశించును

419. నదిని దాటునంతవఱకు ఓడ యెట్లవసరమో, ధాన్యము లభించు నంతవఱకు, కృషి యెట్లవసరమో, అట్లనే ఆత్మసాక్షాత్కార మగువఱకు, గురూపదేశ, శాస్త్రాధ్యయన, శ్రవణ మననాదు లవసరములై యుండును నదిని దాటిన పిదప ఓడ నెట్లు విడుచుదురో, ధాన్యము లభించిన పిదప తృణాదులనెట్లు విసర్జింతురో, అట్లనే మహనీయులద్వారా శ్రవణముచేసి, శాస్త్రములను పఠించి, అనుష్ఠించి జ్ఞేయైకస్థితి బడసి ఆ పిదప శాస్త్రములను విడువచ్చును కొందఱు శాస్త్రమును చదువకయే గొప్ప బ్రహ్మనిష్ఠులెట్లైరని ప్రశ్నింపవచ్చును అట్లు కాకతాళీయయోగమున కొందఱకు సంప్రాప్తించును వారు పూర్వము బాగుగ సాధనజేసి పరిపక్వస్థితికి వచ్చిన వారైయుందురు కాని యట్టివారు చాల అరుదుగ నుందురు వారిని జూచి తక్కిన వారందఱున్ను అపరిపక్వస్థితియందే సాధనల విడచిపెట్టినచో గమ్యస్థానము నెన్నటికిని చేరజాలరు ఒకడు పరీక్ష

మధించినగాని నెయ్యి ఉద్భవము కాని విధమున, పుష్పములను తత్తత్క్రి యలచే మార్పు ఒనర్చినగాని పరిమళము విజృంభించనట్లు, ఫలములు పండిన గాని రసమావిర్భవించనట్లు, కట్టెలను మధించినగాని అగ్ని యుద్భవించ నట్లు, సత్య, తపంబులచే అంతఃకరణమును శుద్ధమొనర్చుకున్న ఆత్మోదయము కాజాలదు అట్లొనర్చిననే కాగల్గును.

**423. ఊర్ధ్వపూర్ణమధః పూర్ణం మధ్యపూర్ణం యదాత్మకమ్ ।**
**సర్వపూర్ణం తదాత్మేతి సమాధిస్థస్య లక్షణమ్ ॥**

క్రిందను, పైనను, మధ్యమందును, అంతటను పరిపూర్ణమై ఆత్మ చెన్నొందుచున్నటుల భాసించుటయే సమాధియొక్క లక్షణము మైత్రే య్యుపనిషత్తు నందును ఇట్లనే పేర్కొనబడినది

**అంతశ్శూన్యం బహిశ్శూన్యం శూన్యకుంభ ఇవామ్బరే ।**
**అంతఃపూర్ణం బహిఃపూర్ణం పూర్ణకుంభ ఇవార్ణవే ॥**

ఆకాశమున నుంచబడిన శూన్యఘటముయొక్క బాహ్యాభ్యం తరములందు ఆకాశ శూన్యత్వ మెటుల వ్యాపించియుండునో, సముద్ర మధ్యమందుంచబడిన ఘటముయొక్క లోన, వెలుపలన యంతట జలమే యెట్లు వ్యాప్తమై యుండునో, అట్లనే బాహ్యాభ్యంతరము లందును సర్వత్ర పరిపూర్ణమై సమాధియందు యోగి భాసించు చుండును త్రిపుటి పూర్ణముగ నశించిన స్థితియే యది. అంతయు శూన్యమనియు, అంతయు పూర్ణమనియు, ఇట్లు శూన్యత్వ, పూర్ణత్వములు రెండును పైశ్లోకమున వివరింప బడినవి అవియే శూన్యదృష్టి, పూర్ణదృష్టి యని చెప్పబడును. అంతయు శూన్యమనగా, దృశ్యమంతయు శూన్యమని అర్థమేగాని ఏమియు లేదని గాని, ఆత్మయు శూన్యమని గాని అర్థముగాదు. శ్రీ బుద్ధదేవుడు వచించిన నిర్వాణ రూపమగు ఆత్మ, పరిపూర్ణత్వమును సరిగ గ్రహింపజాలక రాను రాను వాని యనుయాయులలో చాలకాలమునకు శూన్యవాదులు అంతయు శూన్యమేయని వచించువారు బయలుదేరిరి ఇపుడును

అచలమతస్థులను మఱియొక శాఖవారున్ను కొంతవఱ కీశూన్యత్వవాదమునే యాశ్రయించు చుందురు ఆత్మ శూన్యమని చెప్పు ఏ సిద్ధాంతమున్ను, ఏ మతమున్ను సరి కాజాలదు

**424. అదృశ్యే భావనా నాస్తి దృశ్యమేతద్వినశ్యతి ।**
**అవర్ణమస్వరం బ్రహ్మ కథం ధ్యాయన్తి యోగినః ॥**

కనబడనిదానిని ధ్యానించుట యశక్యము కనబడునదెల్ల నశించునది ఇక నాయరూపమగు, శబ్దాతీతమగు బ్రహ్మమును యోగులెట్లు ధ్యానించ గలరను అర్జునుని ప్రశ్నను పురస్కరించుకొని శ్రీకృష్ణ భగవానులు ఊర్ధ్వ పూర్ణం- అను శ్లోకముచే ప్రత్యుత్తర మిచ్చిరి ఏలన, శుద్ధభావన ననుసరించి పోయినచో, ఆ భావమే బ్రహ్మరూపమొంది భావనయను ప్రత్యేక వృత్తిరూప మిక లేనిదై, బ్రహ్మరూపమై శేషించును ఇదియే ధ్యానమందలి రహస్యము

**425. శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః ।**
**గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్. ॥**

అను గీతాశ్లోకానుసారము, నేత్రముల కగపడక సూక్ష్మముగా నున్నట్టి గంధమును పుష్పమునుండి గ్రహించి వాయువెట్లు దూరముగా గొంపోవునో, అట్లే సూక్ష్మమైన లింగశరీరముద్వారా వృత్తులన్నిటిని గ్రహించి జీవుడు లోకాంతరమున కేగుచున్నాడు ఆలింగశరీరము భంగమైననే తప్ప జీవునకు జన్మరాహిత్యము గలుగదు

**426. ఆకాశస్య గుణశ్శబ్దో నిశ్శబ్దో బ్రహ్మ ఉచ్యతే.**

ఆకాశము శబ్దమే గుణముగా గలది తద్విలక్షణమై, సాక్షిరూపముగా నుండి, యట్టి యాకాశమునుగూడ నెఱుంగుచున్నదే ఆత్మ

427. 55 అక్షరములున్ను దంతములచేత, దవుడలచేత, పెదవుల చేత నుచ్చరింపబడినవి అవన్నియు జడములే కాన క్షరములుగాని యక్షర ములు కావు ఏకాక్షరమై, ముఖాద్యవయవములకు దేనికిదగులక యుచ్చరింపబడునట్టి ప్రణవమే నాశరహితమైనది అక్షరమైనది యెట్లన,

**అఘోషమవ్యంజనమస్వరం చ అతాలుకంఠోష్ఠమనాసికం చ ।**
**అరేఫజాతం పరమూష్మవర్జితం తదక్షరం న క్షరతే కథంచిత్. ॥**

అనగా వర్ణములు కాని వ్యంజనములుకాని, సర్వములుగాని, గానిదియు తాలుకంఠోష్ఠాద్యధిష్ఠానము లేనిదియు, నాసికయందు పుట్ట నిదియు, రేఫవర్ణములలో జేరనిదియునగు అక్షరమే (ఓంకారమే) పరబ్రహ్మము అది నాశ రహితమైనది ఆ స్వరములన్నిటిని గ్రహించువాడు ఆ స్వరములకంటె విలక్షణుడే యగును అతనినే ప్రజ్ఞానం బ్రహ్మయను మహావాక్యము తెలుపుచున్నది ఆప్రజ్ఞానమే సర్వేంద్రియములకును సాక్షిగా నుండి సర్వమును నెఱుంగుచున్నది

**428. తావదేవ నిరోధస్స్యా ద్యావత్తత్త్వం న విందతి ।**
**విదితే తు పరే తత్త్వే ఏకమేవానుపశ్యతి ॥**

ఎంతవఱకు అపరోక్షజ్ఞానము గలుగకుండునో, అంతవఱకు సమా ధిస్థుడై ఇంద్రియ నిరోధము గావింపవలెను అఖండానందైకబ్రహ్మము అపరోక్షమైన మీదట దేహేంద్రియాది సాధనరహితమైన బ్రహ్మమునే గాంచు చుండును పాలనుండి వెన్న తీయునంతవఱకు పాలను సంరక్షించు చుండవలెను గదా! ఫలించునంతవఱకు వృక్షమును బాగుగ కాపాడుచుండ వలెనుగదా!

429. అనాదిమాయతో గూడియుండి నిద్రించుచున్న జీవుడు ఎప్పుడు ప్రబోధమను జాగ్రదవస్థకు(నిజస్థితికి) వచ్చునో అపుడే యధార్థము నెఱుంగును నిద్రలోనున్నవాడు తన స్థితి నెట్లు మఱచునో, మేల్కొనినపిదప తాను ఫలానివాడని యెట్లెఱుంగ గల్గునో, అట్లే అజ్ఞాననిద్రనుండి మేల్కొని ఆత్మప్రబోధము బడసినపుడు జీవుడు తాను నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వరూపుడగు బ్రహ్మమని తెలిసికొనును

430 రైలు ఇంజనులో నీరు, బొగ్గు వేసి అగ్నిని బాగుగా ప్రజ్వలింప జేసిన, నీరు ఆవిరియై, సన్నని గొట్టములద్వారా ప్రవహించి చక్రములను

త్రిప్పి యింజనును కదలించి పెట్టెలన్నిటిని లాగుకొనిపోవును అట్లే భక్తి, ధ్యానయోగములను, తీవ్రవైరాగ్య సహితముగ ననుష్ఠించుచో, ఊర్ధ్వ ముఖమున బ్రహ్మరంధ్రయోగాగ్ని ప్రజ్వరిల్ల అధోముఖముననున్న విషయాది వాసనలన్నియు, కర్మసముదాయమంతయు సంపూర్ణముగా భస్మీభూతమై, జననమరణరూప సంసారదుఃఖ ప్రవాహమునుండి జీవుడు తరింపబడును అపుడు పూర్ణబంధచ్ఛేదనమై నిర్వాణము లభించును అట్టి ప్రయత్నము లేనిచో, యోగాగ్ని చల్లారి విషయాదులు దహింపబడక, తద్విషయ వాసనా కృష్టుడై బంధమున తగుల్కొని శక్తిని గోల్పోయి, పతితుడగును కాని సోమరితనము, నిద్ర, అమితసంభాషణ, మొదలగు అజ్ఞానవృత్తులనువీడి-స్టీమ్ వృద్ధిచేసిన, ఆగిన రైలు మఱల నడచునట్లు యోగాభ్యాసమును పెంపొందించిన, తనదోషముల నెప్పటికపుడు సవరణ చేసుకొనుచు నుండిన క్రమముగ శుద్ధత్వమునొంది, గమ్యస్థానమును త్వరలో జేరగలుగును

**431. త్రిషు ధామసు యద్భోజ్యం భోక్తా భోగశ్చ యద్భవేత్ ।**
**తేభ్యో విలక్షణస్సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః ॥**

జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలను మూటికిని, తదవస్థలయందలి భోక్తృ భోగ్యముల కన్నిటికిని విలక్షణమై, సాక్షిరూపమున వాటి గాంచునట్టియే తురీయమైన చైతన్యము గలదో, యద్దాని నెఱుంగువాడే నిజమైన మౌని యగును అనగా అవస్థాత్రయాతీతమగు చైతన్యమును తెలిసికొనుటయే యథార్థ మౌనముగాని, వాక్కుతో మాట్లాడక మనస్సునందు విషయాదుల చింతించుట కాదు సర్వేంద్రియములు దేనిని తెలియజాలవో, ఏది చింతించుట కలవికానిదో, దానిని జేరుటయే నిజమగు మౌనము అమితముగ మాట్లాడు వారు మాత్రము తమ వాక్చాపల్య ముడుగుటకై కొంత వాఙ్మౌనము శీలించవచ్చును వాక్కుద్వారా చేయు నామసంకీర్తనాదులకంటె (అతీతమగు స్థానమును పొందుటకుగాను) మనస్సంయమము చేయుట యుత్తమము అంతర్ముఖ దృష్టియందు మనస్సు సంలగ్నమగుటచే, మాట్లాడుట కిష్టము లేక, బహుకష్టముతో మాట్లాడునట్టి స్థితి ఉపరతి

యొక్క చిహ్నము అదియే ఉత్తమమౌనము సంయమయోగ లక్షణమున్ను అదియే

**432. శబ్దాదిభిః పఞ్చభిరేవ పఞ్చ పఞ్చత్వమాపుస్స్వగు ణైర్నిబద్ధాః॥**
**కురఙ్గ మాతఙ్గ పతఙ్గ మీన భృంగా నరః పఞ్చభిరఞ్చితః కిమ్ ॥**

లేడి, యేనుగ, మిడుత, చేప, తుమ్మెద అనునైదును నొక్కొక్కటి క్రమముగ శబ్ద, స్పర్శ, రూప, రస గంధములను విషయములందుబడి మృతినొందుచున్నవి మానవుడో ఐదింటియందును బడుచున్నాడు గాన ఇక వాని దుర్గతి యేమని చెప్పవచ్చును!

ఉద్దాలక మునీంద్రుడు ఏకాంతమున నిర్వికల్ప సమాధ్యభ్యాసము గావించునపుడు తన యొక్కొక్క యింద్రియమును, మనస్సును సంబోధించి యిట్లు హితమును జెప్పెను

**(శ్రోత్రము) ఆగత్య శ్రోత్రతాం మూర్ఖ వ్యర్థోత్థానోపబృంహితామ్।**
**ధియా శబ్దానుసారిణ్యా మృగవన్మా క్షయం వ్రజ॥**

ఓ మూఢచిత్తమా! శబ్దమును వినదలంపుచే నిరర్థకంబగు శ్రోత్ర రూపంబునొంది వేటగాని గానమున నాసక్తినొందిన మృగము వలె నశింపకుము లేళ్లను పట్టుటకై కిరాతు లచ్చటచ్చట ఉరులు పన్ని యచ్చోటికి వాటి నాకర్షించుటకై మధురగాన మొనర్చెదరు ఆగానమును వినదలంపుతో లేళ్లన్నియు నచ్చటకురాగా గుప్తముగా దాగియున్న కిరాతులు వెంటనే వాటిని బట్టు కొందురు. ఇవ్విధమున శ్రోత్రేంద్రియ విషయమగు శబ్దమందాసక్తి గొనినందున మృగము వినాశమొందుచున్నది. కాన నో కర్ణమా! నీవున్ను అట్లు నాశ మొందక భగవన్నామమందో, లేక ప్రణవనాదమందో మాత్రమే ప్రీతిగల్గి యుండుము. మఱియు శబ్దము వైపునకు మనస్సెపుడు ఆకర్షింపబడునో అపుడు పైలేడి దృష్టాంతమును స్మరించి తద్దుఃఖమునుండి తొలగుము (శ్రోత్రము ఆకాశత త్త్వము గావున తద్గుణమగు శబ్దమును గ్రహించుటకు కారణ మగుచున్నది)

**(త్వక్కు) త్వక్త్వ మాగత్య దుఃఖాయ స్పర్శోన్ముఖతయా తయా ।**
**మూర్ఖ ! మా బధ్యతామేహి గజీలుబ్ధగజేన్ద్రవత్ ॥**

ఓ మూర్ఖచిత్తమా! స్పర్శసుఖ మనుభవింపగోరి త్వగ్రూపము నొంది కరిణియందాసక్తిగొని బంధీకృతమైన కరిరాజువలె నశింపకుమా! ఏనుగునకు మదము హెచ్చినపుడు స్పర్శానందమున తన్మయమై ఏమియు తెలియకపోవును అపుడు ఆడు ఏనుగుద్వారా దానిని వశీకృతమొనర్చుకొందురు కాన నెపుడెపుడు స్పర్శానంద మనుభవింపగోరుదువో, అపుడపుడే ఈగజేంద్రుని విషయము స్మరించి, అయ్యాపదనుండి తొలగుము (త్వక్కు వాయు తత్త్వము గావున తద్గుణమగు స్పర్శను గ్రహించుచున్నది )

**(చక్షువు) చాక్షుషీం వృత్తిమాశ్రిత్య ప్రభారూపవయోన్ముఖీమ్।**
**మా గచ్ఛ దగ్ధతాం మూర్ఖ ! కాంతిలుబ్ధకుతఙ్గవత్ ॥**

ఓ చిత్తమా! రూపవిలాసంబు జూడగోరి, తద్రూపజాలంబున కభిముఖంబగు చక్షురింద్రియవృత్తి నాశ్రయించి, దీపపుకాంతియం దాశగొనిన మిడుత చందమున కాలిపోకుము నేత్రము అగ్నితత్త్వము కాన విషయావలోకనము అగ్నివలె ప్రమాదకరమైనదని యెఱుంగవలెను మిడుత రాత్రి దీపమును జూచి పండని భ్రమించి, దానిలో బడినశించునట్లు, దృశ్య పదార్థములను జూచి యాసక్త చిత్తులై యందు తగుల్కొని భ్రష్టులవరాదు. నిప్పు మండునపుడు దిగువభాగము ఎఱ్ఱగాను, పైభాగము పొగచే నలుపుగాను నుండును అట్లనే మనుజుని శరీరమున్ను క్రిందిభాగము ఎఱ్ఱగాను పైభాగము కేశములచే నలుపుగాను నుండును కనుకనే అగ్నిదృష్టాంతము ఈయబడినది ఎపుడెపుడు చిత్తము రూపమందాసక్తిగొనునో, అపుడపుడు పైదృష్టాంత మందలి మిడుతను జ్ఞాపకమునకు దెచ్చుకొని ఆయాపదనుండి తప్పించుకొనవలెను అట్లు చేయుచు రాగా ఆ విషయవృత్తి క్రమముగ నశించును. (నేత్రము అగ్ని తత్త్వముగాన అగ్నిగుణమగు రూపమును గ్రహించుచున్నది)

**(జిహ్వ) రసనా భావమాగత్య గర్తేనాంధధురంధసామ్ ।**

**మా నాశమేహి బడిశ పిండిలంపట మత్స్యవత్ ॥**

ఓ చిత్తమా! రుచిననుభవింపగోరి రసనేంద్రియత్వము నొంది గాలమున తగిలింపబడినట్టి ఎరయందాసక్తిగొనిన చేపవలె మృతి నొందకుమా! గాలమందలి మాంసమును తినగోరి మత్స్యము దానిని సమీపించినపుడయ్యది గొంతుకలో జిక్కుకొనుటచే మృతిని బొందును కాన జిహ్వేంద్రియము రుచిగల పదార్థములను కోరునపుడు దానికి మత్స్య దృష్టాంతమును జూపి యటనుండి దానిని మఱలింపవలెను ముఖ్యముగ మాంసభక్షకు లీవిషయమున కడుజాగరూకత గలిగియుండవలెను ( జిహ్వ జలతత్త్వముగాన తద్గుణమగు రసమును గ్రహించుచున్నది )

**( ఘ్రాణము) ఘ్రాణమార్గముపాశ్రిత్య శరీరాంభోజకోటరే।**
**గంధోన్ముఖతయా బంధం మా సమాశ్రయ భృంగవత్ ॥**

ఓ మనసా! గంధము నాఘ్రాణింపగోరి ఘ్రాణేంద్రియము నాశ్రయించి పరిమళవాంఛచే కమలముకుళంబున తగులువడిన తుమ్మెద విధంబున నశింపకుము భ్రమరము వాసనాబద్ధమై తామరపువ్వులో గల తేనె నాశించి పానముచేసి మత్తునొందియుండగా, అస్తమయమగుటచే తామరపుష్పము ముకుళించుటవల్ల దానియందు చిక్కుకొనును. లేక చంపక పుష్ప వాసనచే నా పుష్పముపై వ్రాలిన వెంటనే తుమ్మెద మృతినొందిపోవును. కాన సుగంధ ద్రవ్యాదులపైకి చిత్తమాకర్షింపబడినపు డీభ్రమర దృష్టాంత మును స్మరియించి తద్విషయములనుండి మఱలవలెను ఆ వాసనలకు లోబడరాదు. ( ఘ్రాణము పృథివీతత్త్వముగాన తద్గుణమగు గంధమును పరిగ్రహించుచున్నది )

ఇవ్విధంబున పంచేంద్రియములను తత్తద్విషయలనుండి మఱలించి ఆత్మోన్ముఖ మొనర్చినచో ఆపదలు తొలగి పరమశాంతి లభించును. అజ్ఞాని భ్రాంతిచే ఆయా విషయములందు దగుల్కొని అంతమున దుఃఖ మొందు చుండును కాని జ్ఞాని వాటి భీషణ పరిణాము నెఱింగియుండుటచే వాటి నుండి విముఖుడై మెలంగుచుండును ఇట్లు విషయదోష మెఱింగి

యుక్తాయుక్త పరిజ్ఞానము, వివేక బుద్ధిగలిగియుండువారు యోగముగాని, ప్రాణాయామముగాని, తపస్సుగాని లేకయే మనస్సును సాధించి నిగ్రహింప గల్గుదురు ఈపైవిషయాదులలో జిక్కిన వారింకను ప్రకృతి రహితులు కాలేదని యెఱింగి, ఈశ్వరభక్తి, వివేక జ్ఞానములను మిక్కుటముగ నలవఱచుకొని తద్ద్వారా మనస్సును స్వాధీన పఱచుకొనవలెను అట్లు గావించిననే అవిద్య పూర్ణముగ నశించును



## ౨౦వ రోజు 16-4-1940

433 పూర్వాశ్రమమగు గృహస్థాశ్రమమున తానాచరించవలసిన ధర్మకార్యము లన్నియు జరిపి, ఆ భ్రాంతి తీరెనేని, తదువరి ఉత్తరాశ్రమమగు తురీయాశ్రమమును స్థిరచిత్తుడై, జితేంద్రియుడై పొందవచ్చును అనిశము తీవ్రవైరాగ్యము గల్గి యుండవలెను ఊర్ధ్వగమనమే సల్పుచుండవలెను బ్రహ్మచర్యాశ్రమమునగాని, గృహస్థాశ్రమమునగాని ఎపుడు తీవ్రవైరాగ్యము గల్గునో అపుడు వెంటనే తురీయాశ్రమములోనికి చేరవచ్చును 'యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్' అని శ్రుతివాక్యము, అనగా ఏక్షణమున విరక్తిజనించునో ఆక్షణముననే సన్న్యసింపవలెను. మఱియు,

**యదా మనసి వైరాగ్యం జాతం సర్వేషు వస్తుషు।**
**తదైవ సన్న్యసేద్విద్వా నన్యథా పతితో భవేత్ ॥**

అను మైత్రేయ్యుపనిషద్వచన ప్రకారము, ఎపుడు సమస్తవస్తువు లందును వైరాగ్యము తీవ్రముగ మనంబున ఆవిర్భవించునో అపుడే సన్న్యసింప వలెనుగాని, అన్యథా గావించిన పతితుడగును కాన నీవిషయమును కూడ జ్ఞప్తి యందుంచుకొనవలెను గృహస్థాశ్రమమున నింతకాల ముండవలెనను నియమము లేదు. ఏ సమయమున విరాగి యగునో, ఇంద్రియ విషయము లందరుచి జనించునో, అపుడే సన్న్యసింపవచ్చును ఆక్షేపణ లేదు

434 1 కొందఱు కొంతకాల మీశ్వరోపాసన, ధ్యానము చేసి, మనస్సు కొంచెము నిశ్చలము కాగా, ఇక పరిపూర్ణులమైతిమి, ధన్యత్వము నొందితిమి, చేయవలసిన దేమియు లేదని తలంచి బోధకు గడంగుదురు క్రమముగ వారి దృష్టి బహిర్ముఖము కాగా ధ్యానమును విస్మరింతురు అపుడు బాహ్యావృత్తు లధికమై, అంతర్లక్ష్యమందు దృష్టి సన్నగిలి తుదకు పతనమునే బొందుదురు కాన ఎట్టిబోధకుడైనను నిత్యము తనలోనుండు దోషములను విమర్శించుకొని, వాటి నేమాత్రము తనయందు లేకుండ చేసికొనవలెను అపుడే ధ్యానమందాసక్తి హెచ్చి ఆత్మమార్గమున నుత్తీర్ణులు కాగలరు గ్లాసులైటు నందు కొంచెముగానే గాలి కొట్టినచో, ఆగాలి యున్నంత వఱకు వెలిగి పిదప చల్లారిపోవును అట్లే మానవుడు కొంత ధ్యానానుష్ఠానమును సంపాదించుకొని నేను ధన్యుడనైతినను సహంభావము గల్గి అనుష్ఠానమును మఱచుటచే, అంతకంతకు వైరాగ్యము తగ్గి విషయ లోలుడై భ్రష్టుడగును కాన నీ ధర్మముల దెలిసికొని ధ్యానానుష్ఠానములను హెచ్చించి ఆత్మలోకమున ధన్యత్వము నొందవలెను

(2) కొందఱు ఇది నా స్వానుభవమని, చెప్పుదురు అది వారి స్వానుభవమైనప్పటికి ప్రమాద సహితానుభవము శ్రుతివాక్యమునకు భిన్నమైనను, లేక మహాత్ముల యనుభవమునకు వ్యతిరిక్తమైనను నంగీకరింప బడదు అట్లు ఉత్తమగ్రంధములయొక్కయు, సద్గురువులయొక్కయు ప్రమాణానుభవములతో మేళగింపకున్నచో తాము వచించినది నిర్దుష్టమని ఎట్లు చెప్పగలరు? వాక్కులోగాని, క్రియలోగాని అనేకములైన పొరపాట్లుండ వచ్చును. కాని యవి వారికి తెలియవు. ఇతరులకే తెలియును కాన తమ యనుభవముల మహాత్ములగు ఇతరుల యనుభవములతో సరిపోల్చుకొన వలెను. కనుకనే 1. ప్రమాద సహితానుభవము, 2. ప్రమాద రహితానుభవమని అనుభవము రెండు విధములుగ చెప్పబడెను జ్వరము వచ్చినవానికి ఎట్టి మంచి యాహారమైనను అరుచిగానే యుండును పచ్చకామెరలను నేత్రవ్యాధి గలవారికి ప్రపంచమంతయు పచ్చగా కాన్పించును. అట్లనే అజ్ఞాన వ్యాధి పీడితుడగు జీవునకు ఆత్మజ్ఞాన మందరుచియు, విషయాదులయందు

రుచియు జనించుచుండును మఱియు మాయాపటలాచ్ఛాదిత జ్ఞాన నేత్రుడగు జీవునకు జగత్తంతయు సత్యముగాను, బ్రహ్మము మిథ్యగాను తోచుచుండును ఇవన్నియు ప్రమాద సహితానుభవములు ఇవి సత్యములు కావు వీటిని నమ్మరాదు కావున, ఆత్మసాక్షాత్కారము గలవారును జీవన్ముక్తులునునగు మహాత్ముల ప్రవచనము, శ్రుతివాక్యము, స్వానుభవము, ఇవి ఏకీభవించినదే ప్రమాదరహితజ్ఞాన మగును

435 ఆశ్రమములలో నుండు ధ్యాననిష్ఠులకు విపరీతవు తిండ్లు నేర్పినచో వారి శరీరము అంతకంతకు బలిసి, యోగము తగ్గి, నిద్ర, సోమరితనము మొదలగు వృత్తులు పెరిగి క్రమముగా ఆత్మనిష్ఠనుండి చ్యుతులగుదురు కాన నట్టివానిని వదలి, ధ్యానమునకు భంగము కాని స్వల్పాహారమును గైకొనుచు, సాధకుడు ఏకాంతమున ధ్యానపరుడై యుండవలెను తననిష్ఠకు వ్యతిరేకములైన పదార్థము లన్నిటిని విడువవలెను. దృశ్యవాసన యంతఃకరణమున నున్నంత వరకు దానివైపునకే అది లాగుచునే యుండును ఆ దోషముపోయిన తరువాత నట్టి బాధ యుండనేరదు కాన నెచట నున్నను బంధము లేదు

436 యోగవాసిష్ఠమున వ్యాసశుక సంవాదమను నొకటి గలదు బ్రహ్మ చర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసాశ్రమములు నాలుగును వరుసగ పరిపా లింపవలెననియు, లేనిచో పతనము గలుగుననియు తండ్రియగు వ్యాసుల వాదము తేనెలో నీగ పడినచో వెంటనే దానిలో చిక్కుకొనిపోయి మరణించునట్లును, పనసపండుపై నీగ వ్రాలిన దాని జిగురున కంటుకొని యది చనిపోవునట్లును జీవుడున్ను ఆయా ఆశ్రమము లన్నిటిని పాలించుచు వచ్చిన విషయముల లోబడి అనాత్మచింతనచే దృశ్యమున మ్రగ్గిపోవునని కుమారుడగు శుకుల వాదము అపుడు శుకునకు సమాధానము చెప్పక వ్యాసుడు జనకుని సన్నిధికి పాదచారియై పొమ్మనియు, అణిమాది సిద్ధులు గారడీ విద్యవంటివనియు వచించెను "వైరాగ్యము, శాంతము, దైవబుద్ధి గలవారు రాజ్యమెట్లు పాలింపగలరు రాజులకు సమత్వ మెన్నడేని

సిద్ధించునా? బ్రహ్మజ్ఞానము కలిగినచో నిక మిథ్యయైన రాజ్యమెట్లు పాలింప గల్గుదురు? నిరంతరము ధ్యాననిష్ఠలో నుండువారికి బహిర్ముఖమైన రాజ్యమున వాంఛయెట్లు ప్రాదుర్భవించును? కాన జనకుడు బ్రహ్మజ్ఞాని యగునా?'' అని యీ విధముగ శుకుని చిత్తము సంశయతరంగములచే డోలాయమాన మగుచుండెను అయినను పితృ వాక్యమును శిరసావహించి జనకుని వద్దకు పయనమయ్యెను

ఇంతకు పూర్వమే, శుకుని యభీష్టమును జనకుడు తన దివ్యదృష్టిచే నెఱింగి, శుకున కేవిధమైన సత్కారములు చేయరాదనియు, లోనికి కూడ పిలువరాదనియు, ఎవరును వానితో పలుకరాదనియు తన భృత్యులకు, ద్వారపాలకులకు నాజ్ఞ యొసంగియుంచెను కాన శుకుడు జనకుని యాస్థానమున కేగిన తోడనే, యెవరును వానిని లక్షింపకుండుటగాంచి, అట్లనే అన్నాహారాదులు లేక ద్వారము వద్ద పడియుండెను వారము దినము లయ్యెను శుకుని ముఖవర్చస్సు ఏమియు తగ్గలేదు వాని ప్రశాంతహృదయము తన సహజ ప్రశాంతతను యథారీతి వెలిగ్రక్కుచునే యుండెను వాని చూడ్కులందసహనత యేకోశమునను వ్యక్తీకరింపబడలేదు

వాని యీ గంభీర స్థితిగాంచి జనకుడపుడు లోనికి బిలిపించి సమస్తరాజ్య భోగములను వానియెదుట నుంచెను కాని యపుడున్ను వాని చిత్తమచంచలమయ్యే యుండెను అపుడాతడు ద్వంద్వాతీతస్థితి నొందినవాడే యని గ్రహించి జనకుడు అతనికి బ్రహ్మవిద్యోపదేశంబు చేసెను శుకుడును, జనకుని మహత్తును గుర్తించెను. రాజ్యపాలనా నిమగ్నుడైనను అతని చిత్తము భగవదున్ముఖమయ్యే యున్నట్లు కనుగొనెను బహ్మవిద్యా విధానము గూర్చి పూర్వము తనతండ్రియగు వ్యాసులుపదేశించినదే జనకుడున్ను ఉపదేశించెను గాని, మఱియొకరు కూడ చెప్పుటచే తనభావము లిపుడు బాగుగ దృఢీభూతము లయ్యెను తన యభిప్రాయములు సునిశ్చితము లయ్యెను. అపుడు తీవ్రవైరాగ్య మవలంబించి మేరుపర్వతము పైకి జని అనేక సంవత్సరము లఖండబ్రహ్మనిష్ఠను సల్పి కృతకృత్యుండై జీవన్ముక్తు డయ్యెను.

(ఎవడు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబుల విషయంబులగు శబ్దస్పర్శరూప రసగంధములందు తగుల్కొనడో, ఎవడు శీతోష్ణాది ద్వంద్వములచే చలింపడో, మానావమానములను సహింపగల్గునో అతడే జితేంద్రియుడు, ఆతడే జీవన్ముక్తుడని యెఱుంగునది ఇంద్రియజయము కలుగనిచో మనుజు డెప్పటికిని జీవన్ముక్తుడు కానేరడు అట్టి ఇంద్రియ నిగ్రహము గలిగి యున్నందుననే శుకుని విషయము లెవ్వియు చలింపజాలకుండెను.

**437. యథా జలం జలే క్షిప్తం క్షీరే క్షీరం ఘృతే ఘృతమ్ ।**
**అవిశేషో భవేత్తద్వజ్జీవాత్మ పరమాత్మనోః ॥**

జలమందు జలమును, పాలయందు పాలును, నేతియందు నేతిని కలుపగా నెటుల భేదముగుపడక యైక్యమగునో అటులనే జీవునకు అంతఃకరణదోషము రహితమై అవిద్య పూర్తిగ నశించినపుడు పరమాత్మతోడ నేకత్వము సిద్ధించుచున్నది అనగా తానే పరమాత్మ యగుచున్నాడు మహా వాక్యబోధ యొక్కదానిచేతనే చిత్తమందేకాగ్రత సిద్ధించి జీవత్వము నశించి బ్రహ్మైక్యము కలుగును. కాన నిర్మల మనస్కులైనవారికి మహావాక్యోపదేశమే గావింపవలెను

438 ఉద్యోగము కావలెనననిన పరీక్ష అయినను, ట్రైనింగ్ ప్యాసు కావలెను మఱియు ఏదైన నొక యుద్యోగమునకు వెయ్యి అప్లికేషన్లు వచ్చిన దానిలో ఫస్టున ప్యాసు అయినవారికే ముందుగ ఉద్యోగమీయబడును లేక రెండవ తరగతియందుత్తీర్ణులైన వారికైన లభించవచ్చును అట్లనే బ్రహ్మవిద్య యందును పట్టుదలతో సత్కర్మ, భక్తి, వైరాగ్యము, ధ్యానా నుష్ఠానము గలిగి పూర్ణయోగ్యత్వము సంపాదించి జ్ఞేయాకారమును పొందినవారికే మోక్షరూప మగు ఆత్మానందానుభవమను ఉద్యోగము లభించును

439 గాఢనిద్రలో నున్నవానిని జూచి నిర్వికల్పసమాధి యందున్నాడ నిన విశ్వసింపనట్లు విషయవాసనలు గలవాడు బ్రహ్మవిద్వరిష్ఠుడనిన నమ్మకుడు చెట్టుపై గరుత్మంతుడు కూయుచున్నను, తొఱ్ఱలో త్రాచుపాము

బుసకొట్టుచున్నదను మాటనైన విశ్వసింపవచ్చునుగాని బ్రహ్మనిష్ఠుని హృదయమున విషయాసక్తి యుండుననిన విశ్వసింపరాదు జ్ఞాని అంతర్ముఖుడై యుండును అజ్ఞాని వాసనాబద్ధుడు, బహిర్ముఖుడై యుండును జ్ఞాని సంయమశీలుడై యుండును. అజ్ఞాని ఆత్మసంయమము లేక యుండును. వీరిరువురకు సామ్యమెచట?

**440. యత్ర యత్ర మృతో జ్ఞానీ యేన వా కేన మృత్యునా ।**
**యథా సర్వగతం వ్యోమ తత్ర తత్ర లయం గతః ॥**

జ్ఞాని యెచ్చట, నేవిధముగ దేహము వీడినను పరబ్రహ్మముననే కలియును ఆకాశము సర్వత్ర నిండియున్నట్లు సకల చరాచరములందును చతుర్దశ భువనములందును జ్ఞాని ఆత్మరూపుడై వ్యాపించియుండును గాన ఇక వానికి రాకపోకలెచట? జ్ఞానోదయ కాలముననే వానికి సద్యోముక్తి లభించియున్నది గదా!

441 నిప్పుపుల్లయందు తేమయుండినచో మండనట్లు, వాసనాత్రయ ముండువఱకు జీవునకు జ్ఞానాభివృద్ధి కాదు ఇందులకొక కధ గలదు ఒక గ్రామసమీపమున నొక కొండగుహయందొక గొప్పబ్రహ్మ నిష్ఠుడగు తాపసి వసించుచుండెను. ఆదేశపురాజు వారియెడ గురుభావము గలిగి అపుడపుడు భక్తితో సందర్శించుచుండువాడు. కాని తనకు బ్రహ్మోపదేశము చేయుడని యెన్నియో దినంబులనుండి వారిని ప్రార్థించుచున్నను నాయోగి పుంగవుడు ఉపదేశింపకుండె

ఆ రాజున కొక భృత్యుడుండెను అతడు పరమభక్తుడు. అతడును రాజుతోటి యేతెంచుచు నా సాధువును సందర్శించుచుండువాడు ఇట్లుండ నొక నా డాసాధువు రాజభృత్యున కుపదేశము చేసెను. అది గాంచి జనులందఱును రాజు పాపిగనుకనే సాధువుగారు వానికుపదేశింపకుండ భక్తుడగు వాని సేవకునికే మొదట నుపదేశము చేసెనని యనుకొనుచుండిరి. అది గాంచి రాజునకు చాలసిగ్గయ్యెను వెంటనే యా మహాత్ముని సమీపించి తనకుపదేశింపకుండుటకు కారణమడుగ యోగి మఱుదినము

వచించెదననెను

మఱునాడట్లనే సంధ్యాకాలమున కడునాతురతతో రాజు వానివద్దకు పయనమయ్యెను నాడు కుంభవర్షము కురిసెను ఆ సాధువు వసించు గుహ లోనికి పైనుండి నీరు సడుచుండెను వానివద్ద ఒకప్రమిద, దానినిండ చమురు, వత్తి, ఒకనిప్పుపెట్టె మాత్రముండెను అపుడు సూర్యుడస్తమించు సమయమగుటచే నాసాధువు రాజును జలలిప్తదీపము వెలగించుమని చెప్పెను కాని ఆ వానకు నిప్పుపెట్టె తడిసిపోయి యుండెను ప్రమిదలో నీళ్లు చేరుకొని యుండెను వత్తి తడిసిపోయెను ఇక నారాజు దీపమెట్లు వెలిగింప గలడు? ఎన్ని పుల్లలు గీసినను, ఒకటైనను మండకుండెను వాని యవస్థను గాంచుచున్న యా సాధువంత వానికొక క్రొత్తపెట్టె తెచ్చియిచ్చెను. అపుడును అగ్గిపుల్లను వెలగించి వత్తికి తగిలించగా, అది తడిగా నున్నందునను, చమురులో నీరుపడినందుననను సుర్ సుర్ అనుశబ్దమును మాత్రము కలుగ జేయుచుండెనేగాని మండుట లేదు అపు డాచమురు పారబోసి, క్రొత్త చమురు పైచి, క్రొత్తవత్తి యమర్చి మండింప వెంటనే జ్యోతి వెలిగెను.

అంత సాధువిట్లనెను ''ఓ రాజా! చమురునందు నీరున్నను, అగ్గిపుల్ల తడిసినను జ్యోతియెట్లు వెలుంగ లేదో, అట్లనే నీ హృదయము నందింకను వాసనలు క్షయింపలేదు గాన నీకింకను అంతఃకరణము శుద్ధము కాలేదు కాన బ్రహ్మవిద్య కర్హుడవు గావని యెంచి నీకుపదేశము చేయలేదు నీభృత్యుని మనస్సు పరిశుద్ధముగ నుండుట గాంచి అది బ్రహ్మజ్ఞానజ్యోతికి తగిన క్షేత్రమని యెంచి వానికుపదేశించితిని విశుద్ధ హృదయముననే జ్ఞానాగ్ని ప్రజ్వలించును కాన మొదట, దాన, ధర్మ, వ్రత, పూజాది సత్కర్మలచే చిత్తమును శుద్ధమొనర్చుకొని వైరాగ్యమును జేపట్టి ఆపిదపనే బ్రహ్మోపదే శమునకై యేతెంచుమని చెప్పి యా రాజును పంపివైచెను ★

442 మహమ్మదీయులు సమాజానకు బోవునపుడు కండ్లు, చెవులు

★ మహావాక్యబోధకై గురువులను పీడించు అపరిపక్వహృదయు లందఱును దీనినుండి పాఠమును నేర్చుకొందురుగాక!

బాగుగ కడుగుకొందరు భగవత్సాన్నిధ్యమున ఇంద్రియాదు లన్నియు శుద్ధ ములై, విషయదోష రహితములై యుండవలెనని దానిభావము అట్టి పరిశుద్ధహృదయులే భగవంతుని చూడగల్గుదురు.

443. గురుశిష్యు లిరువురును సమానప్రజ్ఞయు, చిత్తైకాగ్రతయు గలిగియున్ననే గురువు వచించినది శిష్యుడు బాగుగ గ్రహింపగలడు. అమావాస్య కారుచీకటిలో మెరుపు మెరసి నపుడు, ఒక సూదిని క్రిందపడవైచి గురువు దానిని తెమ్మనిన, తీసియిచ్చు నంతటి మేధాశక్తి, చురుకుతనము శిష్యుడు గలిగి యుండినచో వానికి ఏకాగ్రత సిద్ధించి నట్లే ఈవిషయమై గౌరాంగుని (శ్రీకృష్ణచైతన్యుని) గూర్చిన యొక కథ గలదు.

444 పూర్వము గౌరాంగుడు తన బాల్యకాలమున తోడి విద్యార్థు లతో సహా యొక గురువువద్ద విద్య నభ్యసించుచుండెను. విద్యార్థులలో చిత్తైకాగ్రత గలవారెవరని పరీక్షింప దలంచి యొకదినమున పాఠము నుపక్రమింప బోవునపుడు అందరి నోళ్లలోను కొంచెము కొంచెము చక్కెరనుంచి ఆపిదప తన బోధ ప్రారంభించెను బోధ పూర్తియైన పిదప విద్యార్థులందరిని నోళ్లు తెరువమను సరికి ఒక్కరి నోటియందును చక్కెఱ లేకుండెను అందఱును మ్రింగివైచిరి. ఒక్క గౌరాంగుని (శ్రీకృష్ణచైతన్యుని) ముఖమున మాత్రము వేసినది వేసినట్లే యుండిపోయెను వానిచిత్తమంతయు గురుబోధయందు తన్మయత జెందియున్నందున చక్కెఱ గూర్చిన విషయ మాతడు లక్షింపలేదు. అపుడీతడుగదా నిక్కమైన విద్యార్థి యని దలంచి గురువు అతనికి హెచ్చుబోధల గావించెను కాన గౌరాంగునివంటి చిత్తైకాగ్రత గల్గియున్ననే బ్రహ్మవిద్యయందు ముముక్షువు లారితేరగలరు

**445. దక్షిణే పింగలా నాడీ వహ్నిమండలగోచరా ।**
**దేవయానమితి జ్ఞేయా పుణ్యకర్మానుసారిణీ.॥**

దేహముయొక్క దక్షిణ పార్శ్వమునందు అగ్నిమండల గోచరంబై, పుణ్యకర్మలచేతనే సంప్రాప్తంబగుటకు యోగ్యంబైన పింగళానాడి యనునది దేవయానమనియు, అది పునరావృత్తి రహితమనియు తెలియదగును

ఇదియే అర్చిరాదిమార్గ మనంబడును. మానవుడు దేహమును విడుచు నపుడు, అంతర్ముఖుడై, సంయమము గల్గి ఆత్మానుసంధానపరుడై, ఊర్ధ్వ దృష్టి నవలంబించి సూర్యనాడి ద్వారా వినిర్గతమైనచో పరమాత్మయందే విలీనమై పునరావృత్తి రహితుడగును. అదియే ఉత్తరాయణకాలము. అట్టి స్థితి గల్గి దక్షిణాయనమందు దేహము వీడినను ఉత్తరాయణమందు వీడినట్లే. అట్టి స్థితి గలుగక విషయాది వాసనలతో గూడియుండువాడు ఉత్తరాయణమందు దేహవియోగము నొందినను దక్షిణాయనమందు వియోగమొందినట్లే. అట్టి వారు మఱల జన్మకువత్తురు. ఏవాసన గల్గియుందురో ఆవాసనతో జన్మించుదురు.

446. చిత్తైకాగ్రత గల్గియున్నచో గడచిన జన్మమందు తానేస్థితి యందుండెనో చెప్పవచ్చును. ఎన్ని జన్మల వృత్తాంతమైనను కూడ చెప్పవచ్చును. ఆయా జన్మానుభవము లన్నియు సంస్కారరూపేణ అతిసూక్ష్మముగా చిత్తమున నడుగున పడియుండును. చిత్తనైర్మల్యముచేతను, ఏకాగ్రత చేతను అవి లక్షింపబడును. శ్రీ బుద్ధదేవుడు ఎన్ని జన్మలయొక్కయో తన పూర్వవృత్తాంతములను చెప్పగలిగినటుల చరిత్ర సాక్ష్యమిచ్చు చున్నది. బ్రహ్మ సూత్రములకు వ్యాఖ్యానము వ్రాయునపుడు శ్రీశంకరాచార్యులు నలుబది దినములు ఏకాంతమున దీర్ఘచింతనచేసి, తుదకు బదరికాశ్రమమున వ్యాసులవారిని సందర్శించి ఆపిదపనే తన భాష్యము నుపక్రమించెను.

ఖగోళ శాస్త్రజ్ఞులు, గొప్ప గొప్ప విజ్ఞానవేత్తలు, నూతనావిష్కృతుల నొనర్చు శేముషీ ధురంధరులు, ఏకాంతమున ప్రతిబంధము లేనిచోట తమ చిత్తముల నేకాగ్ర పఱచి, బహుకాలము దీర్ఘచింతనచేసి నవ్యయంత్ర నిర్మాణ పద్ధతులను క్రొంగ్రొత్త సిద్ధాంతములను, నూతన యుద్ధ వ్యూహములను కనిపెట్టి లోకమునకు వెల్లడి చేయుచున్నారు. స్థూలమై ఇంద్రియ గోచరమైనట్టి ప్రపంచవిషయములకే యింత దక్షత, ఏకాగ్రత, తదేకనిష్ఠ యవసరమై యున్నపుడు సూక్ష్మాతిసూక్ష్మమై, అనంతమై, ఇంద్రియా గోచరమైన పరబ్రహ్మము నెఱుంగుటకు నెంత దక్షత, ఏకాగ్రత, సంయమన

శక్తి, ధ్యానము అవసరమో యోచించుకొనుడు విజ్ఞానశక్తి మెరుపువంటిది. దానిని గ్రహించువారు బహు సమర్థులై యుండవలెను వివేకానంద మొదలగు మహనీయులు ప్రయత్నముచేతనే ఆత్మశక్తిని సంపాదించుకొనిరి. కాన యోగప్రతిబంధకములైన భయక్రోధాదులను త్యజించి అతిశయ యత్నముచే నాత్మశక్తిని సముపార్జించవలెను

**447. భయం క్రోధమథాలస్య మతి స్వప్నాతి జాగరమ్ ।
అత్యాహారమనాహారం నిత్యం యోగీ వివర్జయేత్ ॥**

భయము, క్రోధము, సోమరితనము, అతినిద్ర, అతిజాగరము, అత్యాహారము, అనాహారములను ధ్యాననిష్ఠ డెల్లపుడు విడువవలెను అపుడే బుద్ధికతీతమైన వస్తువు నాతడెఱుంగ గలడు మనోబుద్ధ్యాదుల కతీతమైనది అనంతవస్తువు. దానికి మించినది మఱియొకటి లేదు అది వేదములకును అతీతము కనుకనే గీతయందు "యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతిత రిష్యతి" అని అవిద్యావ్యామోహమును దాటినపుడే యథార్థవస్తు వవగతమగు నని తెలుపబడినది

448 మోక్షద్వారమున కిరువురు ద్వారపాలురు గలరు వారు సత్యము, ధర్మము అనువారు వారిరువురిని వశపఱచుకొనిననే ముక్తిధామ మున ప్రవేశమబ్బును లేక యొకరినైనను తప్పక వశపఱచుకొనవలెను ద్వారపాలకులు నలుగురనియు కూడ నొకచోట (యోగవాసిష్ఠమున) చెప్పబడినది

**మోక్షద్వారే ద్వారపాలాశ్చత్వారః పరికీర్తితాః।
శమో దమశ్చ సంతోషశ్చతుర్థస్సాధుసంగమః ॥**

శమము, దమము,సంతోషము, సాధుసంసర్గము - అను నీనాల్గున్ను మోక్షద్వారమునకు ద్వారపాలురనియు, ఆ నలురిని వశపఱచుకొనుట యుత్తమమనియు, లేనిచో నొకరు వశమైన, క్రమముగ తక్కినవారును వశమగుదురనియు శ్రీవసిష్ఠులు యోగవాసిష్ఠమున చెప్పిరి

449 అగ్నిని వృద్ధిచేయువారికి ఒక చిన్న నిప్పురవ్వ యిచ్చిన చాలును దానిని పెంపొందించి గొప్పజ్వాలగ చేసికొనగలరు తక్కినవారికి పళ్లెము నిండ ఎన్ని నిప్పు కణికలు వేసి యిచ్చినను వానినట్లనే యుంచుదురుగాన అవి చల్లారిపోయి బొగ్గులై బూడిదైపోవును అట్లనే అనుష్ఠించువారికి ఒక్క ధర్మము చాలును అనుష్ఠింపనివారికెన్ని ధర్మములు బోధించినను వ్యర్థమే యగును శ్రీ వాల్మీకి కొక్క రామమంత్రమువదేశింప, దానిని జేపట్టి యాతడెన్నియో వత్సరములు మననము చేయ దివ్యత్వము నొందగల్గెను కిరాతుడైనవాడు బ్రహ్మర్షి కాగల్గెను. ఋషిమండలిలో కీర్తి వహించెను శ్రీరామాయణము, శ్రీయోగవాసిష్ఠము మొదలగు లోకోత్తర గ్రంథములను రచింపగల్గెను

450 పక్షులు తమ రెండు ఱెక్కలతోగూడి యాకాశమున విహరించు నట్లు, జ్ఞాన,(బోధ) వైరాగ్యములను పక్షద్వయ మవలంబించిననే జీవుడను విహంగము చిదాకాశమున, సమాధి నిలయమున విహరింపగల్గును

451 ఇక ఆత్మయొక్క అనంతత్వములోనికి బ్రవేశింతము. అది ఇంద్రియముల కావలనున్న వారికి మాత్రమే తెలియును. ఆ యనంతశక్తిని చేరని వారు, నీరు లేనిస్థలమున నెచటనుండియో కొలది నీరును మాత్రము తెచ్చుకొనిన వారి చందమున నుందురు అది అయిపోయినచో, నిక వారివద్ద నీరు లేదు. కాని యా అనంతవస్తువును చేరినవారు, ఇంటిలోనే బావి త్రవ్వినవారివలె నుందురు ఎన్ని నీళ్లు తోడి యిచ్చినను తరుగుండదు. కనుకనే యట్టి వారఖండశక్తి సంపన్నులై మహామహిమాన్వితులై యుందురు. ఎలిమెంటరీ పాఠశాలలోను, హైస్కూళ్లలోను కొన్నిభూగోళ, ఖగోళ పటములు చుట్టచుట్టి యుండును వానిలో నొకదానిని కొంచెము తెఱచిచూచిన, మొదట ఒక జిల్లా కనబడును ఇంకను విప్పిన, ఒకదేశ మగపడును ఇంకను తెఱచి చూచిన నొక ఖండమగపడును ఆ పిదప ప్రపంచమంతయును గోచరించును పిమ్మట నవగ్రహ చంద్రసూర్య నక్షత్రాదులు కాన్పించును. అపుడు దానిని చూచి ఇది అనంతముగా నున్నదే

అని యెట్లుందువో, అట్లనే హృదయమను పట్టయందు సమస్తము చిత్రింపబడియున్నది. అది వికసితమైనకొలది ఆయనంతత్వము క్రమముగ నవగత మగును

బీజమునందు వృక్ష మిమిడియున్నట్లు, లోగడ తాను పొందిన యను భవములన్నియు, చూచిన క్షేత్రములన్నియు, గాంచిన దేశములన్నియు, హృదయమున నిమిడియున్నవి ఒక్కపర్యాయము తలంచినంతమాత్రాన ఆదృశ్యములన్నియు హృదయఫలకమున గోచరించును దృష్టాంతముగ మీరు కాశి, రామేశ్వరము మున్నగు పుణ్యక్షేత్రములందు గాంచినదిగాని లేక లండన్ మున్నగు పట్టణములగూర్చి వినినదిగాని ఒక పర్యాయము ఊహించి నంతమాత్రమున హృదయమున స్ఫురించుచుండుట లేదా! కాన నది యెంత విశాలమై యుండునో! అనేక బ్రహ్మాండములనుకూడ తన కుక్షియందుంచు కొనిన అయ్యధిష్ఠానమెంత బాహుళ్యమైనదో ! ఈదినమొక గ్రంథము చదివిన ఆ భావములన్నియు మనస్సున నిముడుకొనును కాని యింకను అందు స్థలము మిగిలియే యుండును మఱునాడు మఱికొన్ని నూతన భావముల జేర్చినను ఇంకను దానియందవకాశ ముండియే యుండును కాన నయ్యది యనంతాకృతి గలదిగనే యుండవలెను

ప్రపంచములో నేటికెన్నియో శాస్త్రములు, కళలు, విజ్ఞానములు ఆవిర్భవించియున్నవి అవన్నియు జీవుని హృదయ క్షేత్రమునుండి ప్రాదు ర్భూతమైనవే కాని యింకను జనులు నూతనతత్త్వముల కనుగొనుచునే యున్నారుగాన ఆ క్షేత్రమనంతమనియే చెప్పనగును ఏలయనగా ఒక చిన్న సీసాయందు నీరు పోయుచుండిన, అది నిండగనే తక్కినది కారిపోవును. అపుడది పరిమితి గలదనియు, అపరిమితము కాదనియు చెప్పనగును కాని, ఆత్మ అపరిమిత మైనది గనుకనే, బాల్యకాలము నుండి తాను నేర్చిన విద్యలుగాని, కవిత్వము గాని భావనాప్రపంచములుగాని అందిమిడి యుండుటకును, ఇంకను క్రొత్తవాని కవకాశము కలుగజేయుటకును, కారణమగు చున్నది

జర్మనీదేశములో 64భాషలెఱింగిన వాడొకడు కలడు. ఆ భాషా పరిజ్ఞాన మంతయు నెచట దాగియున్నది? అపరిచ్ఛిన్నమైన ఆత్మ కుహరముననే, ఆయనంతశక్తి ప్రవాహమునుండియే కవితలు, ఉపన్యాసములు, వాగ్ధోరణులు, అష్టావధాన, శతావధానములు, సమస్త విద్యలు, కళలు ప్రవహించుచున్నవి మఱియు ఒక వస్తువు మఱియొక దానియందుంచబడిన, అయ్యది పెట్టబడిన వస్తువుకంటె పెద్దదై యుండవలెను లేనిచో దానియందు పట్టదు. చిన్నడబ్బియందు గుమ్మడికాయ పట్టదు దానికొక గంప కావలయును అట్లే, అసంఖ్యాక గోళము లన్నియు దేనియందు, సముద్రజలమున నిమ్మపండ్లవలె, తేలియాడుచున్నవో, దేనినుండి అనంతశక్తి యనిశము ప్రవహించుచున్నదో, ఆ వస్తువున్ను అనంతమయ్యే యుండవలెను

తమ చిత్తము నంతర్ముఖము చేసికొని అట్టి ఆత్మశక్తితో మేళగించినందుననే వాల్మీక్యాదులు మహాగ్రంథములను వ్రాయగల్గిరి ఆ యనంతాత్మను జేరవలెనన్న, ఆ యింద్రియాతీతపదవి నొందవలెనన్న, ప్రథమమున మనోబుద్ధీంద్రియములన్నియు శుద్ధములై యుండవలెను వాసనలు సమూలముగ నశింపవలెను విషయవృత్తు లెవ్వియు నుండరాదు తీవ్రవైరాగ్యము గల్గి, ధ్యానానుష్ఠానము సల్పినవారే అట్టి పదవిని సంపాదింపగలరు ఆయనంతశక్తిని పొందగలరు అపుడే సమస్తమున్ను వారు గ్రహింపగల్గుదురు పూర్వపు ఋష్యాదు లట్టిశక్తిని బడసియే యెచ్చోట నేవస్తువున్నది గనుగొనగలిరి అంతయు బుద్ధియొక్క నైర్మల్యముచేతనే సిద్ధించుచుండును

మనస్సును ఊర్ధ్వముఖముగ పోనిచ్చినకొలది దృశ్యవిషయముల నదిమఱచుచుండును ఎంతెంత పైకిబోవుచుండునో అంతంత విషయాది వృత్తులకు దూరమగుచుండును. కాన అంతఃకరణ వృత్తు లశేషముగ నశించిన జీవున కనంతశక్తి గలుగును. శ్రీకృష్ణపరమాత్మ తన నోటియందు విశ్వమంతయు తల్లికి చూపెట్టెనుగదా! అదియే అనంతత్వము నొందిన వారి

యఖండప్రతిభ అట్టి ఆత్మతో నైక్యమొందుటయే పరమార్థము అదియే పరిపూర్ణబోధ, అదియే అచలతత్త్వము, వృత్తిరహితమగు నిర్వికల్పసమాధి యదియే అంతఃకరణ దోషమున్నంతవఱకు ఆ స్థితి యెవరికిని కలుగదు.



# 21వ రోజు 17-4-1940

**(విక్రమ చైత్ర శుద్ధదశమీ బుధవారము)**

**452. అనంత శాస్త్రం బహువేదితవ్యమల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః ।**
**యత్సారభూతం తదుపాసితవ్యంహంసో యథా క్షీరమివాంబుమిశ్రమ్ ॥**

శాస్త్రము లనంతములు ఒకవేళ వానిని కొంతవఱకు ప్రయాసతోడ చదివినను వాని తత్త్వార్థము నెఱుంగుటకు చాలాకాలము పట్టును మనుష్యున కాయుష్కాలము బహుస్వల్పము బాల్యమందజ్ఞానము చేతను, వార్ధక్యమున అశక్తిచేతను ఆతడేమియు చేయజాలకుండును ఇక మధ్యకాలమందో, విఘ్నము లనేకములు కాన, హంస జలమును వేఱుపఱచి క్షీరమును మాత్రము గ్రహించునటుల వివేకియగువాడు సచ్ఛాస్త్రంబుల వెదకి యందలి సారవంతములైన వానిని గురుముఖతః ఎఱుగదగును

దాహము తీరుటకు ప్రపంచములో నున్న సర్వనదుల తీర్థము త్రాగనవసరము లేదు ఒక చిన్నగ్లాసు నిండ నీరుత్రాగిన చాలును అట్లనే తాపత్రయము శమించుటకు ఒక్క అనుష్ఠానము చాలును వెయ్యి జన్మములెత్తి ఒక్కొక్క జన్మలో వెయ్యి సంవత్సరములు జీవించి పఠించినను శాస్త్రము పూర్తి కాదు కాన సారమును మాత్రమే గ్రహించవలెను. మట్టి బొమ్మ లనేకములున్నను ఒకదానిని పరీక్షించిన, అన్నియు నదేవిధమున నుండునని యూహించునట్లు, గొలుసునందలి ఒక రింగును జూచిన తక్కిన నన్నియునదే విధమున నుండునని యెఱుంగునట్లు, తన దేహమునకు విలక్షణమై ప్రకాశించుచున్నట్టి ప్రత్యగాత్మ నెఱింగి, అదియే తానని గ్రహించి, ఆ సచ్చిదానందమే సమస్తోపాధులందును వ్యాపించి యున్నదని తెలిసి

కొనుటయే యథార్థస్థితి కొందఱు జన్మాంత రమున శాస్త్రాధ్యయనము చేసి యనుష్ఠించి, ఈ జన్మమున ప్రారంభము నుండియే ధ్యానానుష్ఠానపరులై సత్ప్రవర్తన గల్గియుందురు శ్రీరామకృష్ణపరమహంసలే యిందులకు తార్కాణము

453. పక్షి వృక్షముపై గూడు నిర్మించుకొని, కొంతకాలమున కద్దానిని విడిచి చనునట్లు, ఎట్టి పండితుడైనను, ధనవంతుడైనను, రత్నకిరీట కుండలాద్యాభరణములు గలవాడైనను అంత్యకాలమున సర్వమును విడిచియే పోవుచున్నాడు అయితే శాస్త్రపరిచయము కొంతయైన లేనిచో, నుపనిషత్తత్త్వమును కొంతయైన గ్రహింపనిచో, సంకుచితభావము లేర్పడి క్రమశః సంఘము మూఢత్వములోనికి దిగిపోవును ఉత్తరదేశమున గోరఖ్‌నాథ్ పంథ్, రామానంద పంథ్, కబీర్ పంథ్ మున్నగు భిన్నభిన్న సంప్రదాయములవారు గలరు గోరఖ్‌నాథ్ పంథ్‌నకు జెందినవారు హఠయోగమునే శీలించుచుందురు. కాని శాస్త్రములనుగాని, తదితరము లను గాని ముట్టనైన ముట్టరు. రామానంద పంథ్‌కు జెందిన సాధువులు (మొలకు గొలుసు కట్టుకొని యుండువారు)న్ను ఒకవిధమగు యోగశాఖకు జెందినవారే. కాని శాస్త్రపరన మేమియు లేదు

ఒక కబీర్ పంథ్‌వారు ఎక్కువ వైరాగ్యము గలిగి రామనామమును జపించుచు సంకీర్తనము చేయుచునుందురు ఈ సాధుసంప్రదాయము లన్నింటియొక్క మూలపురుషులు మిగుల పవిత్రులై గొప్ప లక్ష్యము గలవారైనప్పటికి వారి సంఘములందు విద్య లేనికారణమున, రాను రాను వారి యనుయాయులలో పెక్కురు సంకుచితహృదయులై రజోగుణ, తమో గుణ ప్రధానులు కాజొచ్చిరి కొంతయోగము, భక్తి శీలించినను శాస్త్రపరి చయాభావముచే మూఢత్వ మొకింత దాపురించెను కనుకనే యిపుడు విద్యకు ప్రాధాన్య మొసంగబడెను ఉత్తరదేశమున కొందఱు మండలేశ్వ రులు, కౌముది సంస్కృతవ్యాకరణము చదువని యతులను తమ సంఘములో జేర్చుకొనరు.

454 సాధువులలో గురునానక్ దయాసముద్రు డనందగును ఒకనాడాతడు ఘోరఖ్ నాథ్ పంథ్‌నకు జెందిన యొక మఠమునకు బోయెను, ఆ మఠమునకు జెందిన సాధువులందఱును నిదివఱకే గురునానక్ యొక్క కీర్తినిగూర్చి వినియుండిరి అందుచే వారు అసూయాగ్రస్తులై నానక్ మఠములోనికి వచ్చినపు డెవరును లేవగూడదు, సత్కరింపగూడదు, అందఱు ఆసనముల వైచికొని నేత్రములను మూసికొని యోగసమాధి యందుండవలెను, చలింపగూడదని నిశ్చయించుకొనిరి కొందఱు అనుచరులతో గూడి నానక్ వారి మఠమును సమీపించి వారందఱును యోగ నిష్ఠులై యుండుటగాంచి తమ యనుచరులతో వీరందఱు సమాధినిష్ఠులై యున్నారు వీరినిష్ఠను భంగ మొనర్పరాదు కాన నిశ్శబ్దముగ నుండుడని వచించి తానటనున్న యొక బిల్వవృక్షము క్రింద తిన్నెపై గూరుచుండెను.

ఆ బిల్వవృక్షము పూర్వము వారి మూలపురుషులెవరో గొప్పవారు స్థాపించి యట తపస్సున్ను చేసియుండిరిగాన, అది యిపుడు శుష్కించి యున్నను కొట్టివేయక, భక్తితో దానిచుట్టు అరుగు నొకదానిని కట్టి యుంచిరి. ఇపుడు మన నానక్ కూర్చున్నది దానిపైననే అతడద్దానిపై కూర్చుండుటయే తడవుగా నా శుష్కవృక్షము వెంటనే చిగిర్చి పుష్ప ఫల పల్లవములతో విరాజిల్లెను. అంత నొక్కొక్కరు లేవదొడగిరి. నేత్రములు మూసికొనియున్నను, బయట ఏమి జరుగుచున్నదో యని వారలలో కొందఱపుడపుడు కొంచెము కన్ను తెఱచి చూచుచునే యుండిరి వారి మహత్తు అపుడు గుర్తెఱింగి వెంటనే సాష్టాంగ దండప్రణామ మాచరించి తమ యవినీతిని క్షమింపుమని వేడుకొనిరి. అపుడు నానక్ మీరందఱు దయారహితులై, అభిమాన గర్వములు ఆవరింప, కర్కశహృదయులై వర్తించుచుంటిరి మీరు యోగము శీలించుచున్నారేగాని అహంకారమును వదలలేదు కాన నిరభిమానులై, సోదరజీవియెడ కరుణగల్గి, సర్వభూతము లందును ప్రేమతత్త్వమును విస్తరించి సమష్టి భావములలో నుండుడీ యని ఉపదేశించి వెడలెను

455 గురునానక్‌ను గూర్చిన మఱియొక చరిత్రకూడ గలదు. ఒక నాడు కొందఱు శిష్యులతోగూడి గురునానక్ ఒక గ్రామసమీపముగా బోవు చుండెను ఆగ్రామస్థులెల్లరు పరమ భక్తితో వారిని పూజించి సత్కరించిరి అంత గురునానక్ వారలగూర్చి, మీసంఘమంతయు ఛిన్నాభిన్నమై యచి రకాలములోనే ఈగ్రామమును వీడి చెల్లాచెదరైపోవుగాక! యని ఆశీర్వదించి చనెను మఱికొంతదూరమేగుసరికి నింకొక గ్రామము వచ్చెను, ఆగ్రామస్థు లెవ్వరును గురునానక్‌ను ఆదరింపలేదు అపుడు నానక్ వారినిగూరి, ఈ గ్రామస్థులెల్లరు అచ్చోటనే యుండి, సంఘీభావముతో వెలయుదురుగాక! యని ఆశీర్వదించెను

అపుడు శిష్యులాశ్చర్యచకితులై, యిది యేమి స్వామీ! ఎంతయో గౌరవించి యాదరించిన ఆ గ్రామస్థులను చెల్లాచెదరైపొమ్మనియు ఏమియు గౌరవింపక యుపేక్షించినట్టి ఈగ్రామవాసులను స్థిరముగ నిచటనే నెలకొని యుండుడనియు ఆశీర్వదించితిరే, దీనికి కారణమేమియని ప్రశ్నించిరి అది విని గురునానక్ మీరింకను గ్రహింపలేకుంటిరి ఆగ్రామస్థులు సాధు మూర్తులు, దయాస్వరూపులు కాన నట్టివా రొకచోటనే యున్నచో తదితరుల సాధుత్వ దయాగుణంబులు వ్యాపింపవు కాన ప్రపంచమంతటను విస్తరింపుడని వచించితిని. ఇక రెండవవారు దయాశూన్యులు కఠిన హృదయులు, అట్టివారు ప్రపంచములో వ్యాపించిన వారి దుర్గుణములే యితరులకు కూడ నల్లుకొని కీడు వాటిల్లును కాన నొకచోటనే యుండుడని వారలకు వచించితి ననెను చూచితిరా! జగత్కల్యాణ మపేక్షించు మహాత్ముల దూరదృష్టి, సదమల హృదయము!

**456. పృథివ్యాం యాన్తి భూతాని జిహ్వోపస్థనిమి త్తకమ్ ।**
**జిహ్వోపస్థపరిత్యాగే పృథివ్యాం కిం ప్రయోజనమ్ ॥**

పృధ్వీస్థలిని ప్రాణికోటులు జిహ్వోపస్థల దృప్తిసేయువారలై యున్నారు వాటి చాపల్యంబు వదలిన వారలకిక ప్రపంచముతో పని యేమియు నుండదు. ఆ రెంటిని విడిచినవారే మోక్షార్హులు

**457. అనంతకర్మశౌచం చ జపయజ్ఞాస్తథైవ చ ।**
**తీర్థయాత్రానుగమనం యావత్త్వం న విన్దతి ॥**

ఎంతవఱకు మనుజుడు బ్రహ్మతత్త్వం బెఱుంగ జాలడో, అంతవఱకు ననేకంబులగు శౌచాది నిత్యనైమిత్తిక కర్మములు, తీర్థయాత్రాదులు సలుపవలెను 'ప్రతిమా స్వల్పబుద్ధీనాం సర్వత్ర విదితాత్మనాం' – అనునట్లు ఆత్మ ధ్యాన పరాయణులైనవారికి విగ్రహారాధనలు మున్నగునవి అవసరము లేదు గాని తదితరులకు కావలసియే యున్నవి

**458. యత్ర యత్ర మనో యాతి తత్ర తత్ర పరం పదమ్ ।**
**తత్ర తత్ర పరం బ్రహ్మ సర్వత్ర సమవస్థితమ్ ॥**

జ్ఞానులకు మనస్సు పోవుచోటెల్ల పరమపదమే యగును అచటచట పరబ్రహ్మమున్ను సమముగానే వర్తించును వారిమనస్సు కేవలము బ్రహ్మాకారమై, సత్వరూపమై పరిణమించునుగాన నికవారు గాంచిన దెల్ల బ్రహ్మరూపమే యగును

459. ఏ జాతివారైనను మంచి ఫలవృక్షమును నాటి ఎరువు, నీళ్లు సమృద్ధిగా వేసి పోసి పోషించినచో వారికి ఫలము విశేషముగ లభించును. అట్లే యే మతస్థులైనను భక్తిధ్యానాదులను నిష్పక్షపాతముగ నవలంబించు చున్నచో వారికి తప్పక భగవత్సాక్షాత్కారము గలుగును

460. సముద్రజలము అనేక అణువులరూపమున సూర్యకిరణముల ద్వారా గ్రహింపబడి మేఘరూపమై వర్షించి నదీముఖమున ప్రవహించి తుదకు సముద్రమునే మరల జేరునట్లు జీవులు పరమాత్మ స్థానమునుండి చ్యుతులై అనేక జన్మలెత్తి, క్రమవికాసము నొందుచు తుదకు మానవజన్మ బడసి సత్కర్మ భక్తి, వైరాగ్య, జ్ఞానములద్వారా మఱల నామోక్షస్థానమగు పరమాత్మనే చేరుచున్నారు

అయితే సముద్రజలము అణువులరూపమున ఖండమగునట్లు పరబ్రహ్మమున్ను ఖండమగునా యని ప్రశ్నించవచ్చును. అట్లుకాదు.

యధార్థముగ ఆత్మ యేకమైనను, అవిద్యాభ్రాంతిచే వేఱ్వేఱుగ తోచబడి జీవత్వమును పరిగ్రహించి ప్రతిబింబములరీతి పెక్కుపాధుల ధరించి గమనాగమనముల సల్పుచున్నట్లు భాసించుచుండును కాన జీవుడున్ను పరమార్థమున విచారించినచో అధిష్ఠానమగు చైతన్యరూపమే యగును గంగానది హిమాలయములనుండి బయలుదేఱి మంచుగడ్డలు కఱగి నీరుకాగా దానిని పరిగ్రహించి క్రమముగ పీఠభూములందు ప్రవేశించి నెమ్మదిగ ప్రవహించుచు, దాదాపు వెయ్యిమైళ్ల ప్రయాణము సల్పి తుదకు సాగరమును జేరుచున్నది. అట్లే జీవులున్ను మోక్షమను నిరతిశయానందము నొందుటకై ఎంతయో కాలము ప్రయత్నించి దినదినాభివృద్ధి గాంచుచు తుదకట్టి స్థానము నలంకరించుచున్నారు

461 ప్రపంచములో నెవరిని జూచినను సుఖమునే కోరుచున్నారుగాని దుఃఖమును కోరుట లేదు దుఃఖమునుండి తప్పించుకొనుటకే వారు యత్నించుచున్నారు దీనినిబట్టి జననమరణరూప సంసార దుఃఖప్రవాహమునుండి యెట్లైనను తొలగి శాశ్వతానంద మనుభవింపవలెననియే వారి యుద్దేశ్యమైనట్లు కనుపించుచున్నది. ఒక విద్యార్థిని బిలచి, యేల నీవు చదువుకొనుచున్నావని బ్రశ్నింప ఉద్యోగము సంపాదించి సుఖముగ నుండుటకొఱకనును. ఒక వ్యాపారిని ప్రశ్నింప, వ్యాపారముచే లాభము బడసి సుఖించుటకనును. ఉద్యోగిని ప్రశ్నింప, ధనము సంపాదించి సుఖము పొందుటకొఱకనును. అట్లే అందఱున్ను కాని ఆయాసుఖములతో దనివి తీరక మఱియొక సుఖ మపేక్షించుచుందురు నిజముగా దానియందే పూర్ణసుఖ మున్నచో మరియొకదాని నెన్నటికిని కోరరు దానిని వీడుటకును నిచ్ఛగింపరు కాన నవన్నియు పూర్ణసుఖరూపములు కావనియే స్పష్టమగుచున్నది

గృహస్థాశ్రమమును స్వీకరించిన పిదప సంతానాపేక్ష యుండును సంతానము కలిగినను వానికింకను తృప్తిలేదు. మఱియొక సుఖమునకై బ్రయత్నించును కాని యివన్నియు గల్గియున్నను శాంతిలేదని తుదకు భక్తికొఱకు యత్నించును. మఱల వానప్రస్థాశ్రమము చేరును అట నేమి

చేయుచుంటిరని యెవరైన ప్రశ్నించిన మనశ్శాంతికొఱకు ధ్యాన, యోగాదులను శీలించుచుంటిమి, వాటిచే కొంతశాంతి చేకూరినది కాని యింకను పూర్ణతృప్తి (శాంతి) కలుగలేదని చెప్పుదురు

ఇందులకు కారణమేమన, మత్స్యము నీటి యందున్నంతవఱకు సుఖముగా నుండి, బయటకు వచ్చినతోడనే దుఃఖము నొందునట్లు ధ్యానాదులను సాధించు యోగియు అ ధ్యానాదులందున్నంత వఱకు అతిశయసుఖమును బడయునుగాని, బహిర్ముఖమైనపుడు శాంతిని, సుఖమును నొకింత గోల్పోవుచుండును కాన నదియు పూర్ణస్థితి కానేరదు అపుడు తురియాశ్రమము స్వీకరించి క్రమముగ సాధనల నభివృద్ధి పఱచి ఆత్మానాత్మవివేకము బడసి మహావాక్యప్రబోధము నొంది అంతః కరణశుద్ధి గలవాడై నిర్వికల్పసమాధి సిద్ధింప పరమశాంతిని బొందును అదియే అంతము అదియే జీవుని పరమావధి అట్టిస్థితి చేకూరువఱకు ప్రాణికోట్లు ప్రయాణము సల్పుచునే యుందురు అట్టిపదవి నొందినవారే నిరావరణులు, నిర్ద్వంద్వులు, నిగమాతీతులు, భవబంధరహితులు కర్మలు, వృత్తులు, సంకల్పములు క్షీణించినవారికే యాపదవి లభించును దాని కతీత మైనది మఱొకటి లేదు నిద్రపోవు వారినందఱిని మేల్కొనినవా డొక్కడు లేప గల్గునట్లు, అట్టి తురీయపదము నొందిన బ్రహ్మజ్ఞాని, అజ్ఞానములో బడి యున్న జీవుల నెందఱినో తన దివ్యప్రబోధముచే ప్రబుద్ధుల జేయగల్గును

462 భగవంతుడు హృదయనిర్మలత్వమునే ముఖ్యముగా పరిగణించి నప్పటికిని మనము చేయు పారాయణాదులందు స్వరాదుల లోపము లుండ కుండునట్లే చూడవలెను సత్యప్రవర్తన గలవారు అనుష్ఠానపరులు, భక్తులు, దైవప్రార్థన చేయునపుడు వారి హృదయము సరిగా నున్నదా లేదా యని చూచుచుందురు పండితులు శబ్దములు సరిగా నున్నవా లేవా యని పరిశీలించుదురు

463 మంత్రసిద్ధి, గ్రంథసిద్ధి మున్నగునవి జ్ఞానమున కుపకరించును ఏదేని మంత్రము సిద్ధించినచో, దాని ప్రభావముచే వారు కొన్ని గొప్ప

కార్యముల చేయగల్గుదురు ధర్మములను స్థాపింపగల్గుదురు ఒక గ్రంథమును నిరంతరము చదువుచుండ, దానిలో నూతనార్థములు స్ఫురించు చుండును అదే గ్రంథసిద్ధికి గుఱుతు ఒక మంత్రమున సిద్ధి బొందినవారు దాని నితరుల కుపదేశించిన, వారికి త్వరలోనే సిద్ధియగును

464 వృక్షము మొదట కొంచెముగా ఫలించినను వృద్ధియైన కొలది విశేషఫలముల నొసంగుచుండును మఱియు ఆచెట్టునుండి గింజలు రాలి అవియు మొలకలెత్తి వృక్షము లగుచుండును చెట్టుక్రిందనే పడిన విత్తనమైనను రాతిపైబడినచో మొలువనేరదు దూరముగా బడిన విత్తనమైనను మట్టిపై బడినచో మొలచి వృద్ధికి వచ్చును అట్లనే ఎవరెవరి హృదయము ఎంతెంత విశాల మగుచుండునో, అంతంత దూరముగ వారి ధర్మ బీజములు విస్తరిల్లి జనుల హృదయములలో బ్రవేశించి, జ్ఞానాంకురములను పెంపొందింప జేయుచుండును కాని వారి సమీపమున నున్నవారైనను కఠిన చిత్తులైనచో వారి హృదయమున నాజ్ఞానబీజములు ప్రవేశింపకనే యుండును వృక్షమునకు పురుగుపట్టనిచో మాత్రమే అది వృద్ధి యగును అట్లనే సంఘములోని ప్రధానవ్యక్తులు సరియైన ఆచరణ అనుష్ఠానము గల్గియున్ననే, తదితరులును ఆచరించి ఆ సంఘ మభివృద్ధికి రాగల్గును. వేరుపురుగు పట్టిన వృక్షములు వర్ధికి రాక, ఫలమును గలుగజేయక నశించునట్లు, అనుష్ఠాన రహితులగు వారి సంఘములును, సమాజములును నుచ్ఛదశకు రాక పతన మొందుచుండును ఇదే ముఖ్యముగ గురుసంప్రాదాయము గలవారు తెలిసికొనవలసిన విషయము

465. రోగబాధ యధికముగ నుండువారు ఆసుపత్రికి ముందుగనే బోయి మందిచ్చుచోట గుమ్మమువద్దనే కాచుకొనియుందురు మఱి కొందరు రోగబాధ యధికముగ లేనివారు నెమ్మదిగా వెళ్లవచ్చులేయని తలంచి యింటిలోని పనులన్నియు చక్కపెట్టుకొని అపుడు పోవుదురు అట్లనే భవరోగమునుండి శీఘ్రముగ నివృత్తిని బొందగోరువారు. అనుభూతి పరులగు గురువు లేతెంచినపుడు, వారివద్దకు ధర్మోపదేశమునకై ముందుగనే

వచ్చి కాచుకొని యుందురు మంద వైరాగ్యము గలవారు ఆ వెనుక మెల్లగ వచ్చి చేరుదురు

466 ఇంత వఱకు బోధించిన ఈ యాధ్మాత్మిక సూత్రము లన్నింటిని మీహృదయ పేటికలందు భద్రముగా నుంచుకొనుడు పూర్వము నైమిశారణ్యమున మహర్షులచే బోధింపబడిన ఆధ్యాత్మిక తత్త్వరహస్య ములను జనులందఱును అతిజాగ్రత్తగ కాపాడుకొని అనుష్ఠించి తరించినట్లు, మీరున్ను ఈ ఓంకారసత్రయాగమున వినినట్టి బోధల నెల్ల కడు జాగ రూకతతో పరిగ్రహించి, మీ హృదయ కుహరములందు స్థిరముగ నెలకొల్పు కొని మనన నిదిధ్యాసముల గావించి, జన్మరాహిత్య పదవి నొందుదురు గాక!! తాము తరించి యితరులను తరింపజేయవలెనను సనాతన ధర్మ సిద్ధాంతమును కార్యాన్విత మొనర్చుదురుగాక!

**స్థాపయధ్వమిమం మార్గం ప్రయత్నేనాపి హే ద్విజాః।**
**స్థాపితే వైదికే మార్గే సకలం సుస్థితం భవేత్ ॥**

ఓ బ్రహ్మనిష్ఠులారా! ఈ వేదమార్గమును ప్రయత్న పూర్వకముగ నైన మీరు లోకమున స్థాపింపజేయవలెను. అట్లు వేదమార్గము స్థాపింపబడ, సకలము సుస్థిత మగును అని యీశ్వరుడు సనకాది ఋషులకు వచించిన విధమున ఈ ధార్మిక మార్గమును, ఈ సనాతన వేదసారమగు జ్ఞాన సిద్ధాం తములను, ఈ అధ్యాత్మిక తత్త్వరహస్యములను మీరందఱును ఆ పూర్వపు ఋషుల చందమున హృద్గత మొనర్చుకొని యితరుల ఆత్మోన్నతి కయ్యు, ఏ తద్ధర్మ స్థాపన కయ్యు, ప్రపంచమున వాటిని నాటి తద్ద్వారా ఆత్మధర్మమును స్థిరముగ సంస్థాపన మొనర్చెదరుగాక! అపుడే సకలము సుస్థితమై వెలయును. ప్రజలందఱును ఆత్మమార్గావలంబులై ఆనందానుభూతి నొందెదరు భీకరసంసార వితతినుండి విమోచనము నొంది ఆత్మ సామ్రా జ్యాభిషిక్తు లగుదురు ఇందు సంశయము లేదు.

ఏ పరమ కారుణికులగు పరమఋషుల అపారకరుణచేతను, దయా మూర్తియగు పరమేశ్వరుని అనుగ్రహమువల్లను, నిర్విఘ్నముగ ఈ 21

రోజాలు అతిపవిత్రమగు ఈ ఓంకారసత్రయాగము పుణ్యనది యగు కృష్ణాతీర మున మనము జరుపగలిగితిమో, అట్టి పరమపావనులగు మహర్షుల యెడలను, కారుణ్య సింధువగు ఆ సర్వేశ్వరుని యెడలను మనము కృతజ్ఞు లమై యుందుముగాక!

మఱియు, ఈ 21రోజాలు ఏ ఓంకార ఉపాసనయు, ప్రణవార్థ విచారమున్ను చేసితిమో, యిచట అగ్నిహోత్రము, గీతా పారాయణము, భగవద్భజన, దివ్యమంత్రజపము, మహత్తరములైన అన్న దానాది పుణ్య కార్యములు జరిగినవో, వీటి యన్నింటియందును ఏ ఫలము సర్వేశ్వరుడను గ్రహించియున్నాడో దాని వలన మీ అందఱియొక్క ఆత్మ శుద్ధి కలుగును గాక! మఱియు లోకములోగల చరాచర ప్రాణికోట్లకు శాంతియు, కరుణయు, సద్భక్తియు, విజ్ఞానబోధమున్ను సంప్రాప్తమగును గాక!

***లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు. ఓం తత్‌సత్.***
***ఇరువది యొకటవరోజా ముగిసెను.***
***ఓంకారసత్రయాగము సమాప్తము.*** ★

# అనుబంధము

467 పూర్వమొక యోగి ఒకానొక యరణ్యమున ఏకాంత ప్రదేశమున నొకచెట్టుక్రింద తపము చేయుచుండ పైనుండి యొకకొంగ వానిపై రెట్టవేసెను వెంటనే యాతడు తీవ్రదృష్టి లో తలపైకెత్తి చూడ ఆకొంగ భస్మమై క్రింద పడిపోయెను ఆహా! నా తపస్సు ఇపుడు ఫలించినది గదా! నా తపోఽగ్నిచే నిక నా శత్రువుల పని పట్టించెద నని లోలోన సంతసించి అతడు భిక్షకై సమీపగ్రామమునకు బోయెను

ఒక గృహస్థుని యింటికి బోయి భిక్ష నడుగ, ఆ గృహిణి కొంచెము సేపు వేచియుండుడని చెప్పి లోనికేగెను ఆమె మహాపతివ్రతయగు సాధ్వి

★ నాటి మధ్యాహ్నముతో సత్రయాగము పూర్తియయ్యెను అపుడందఱును అవభృత స్నానమాచరించిరి పిమ్మట శాంతిపరమంగళాచరణాదులు గావింపబడెను

మణి భర్తకు పరిచర్య చేయుచున్నందున వెంటనే భిక్ష మొసంగుటకు వీలులేక పోయినందున, అపని పూర్తియైన వెనుక ప్రసాదము తీసికొని బయటకు వచ్చెను ఆ యాలస్యమునకు సహింపజాలక ఆ తాపసి పరమక్రుద్ధుడై యాసాధ్వివైపునకు తన కోపదృష్టిని పఱపెను అపు డాతల్లి యాతనితో, నిట్లనియె ''నే నా వృక్షము క్రింద కాలిపడిపోయిన కొంగను కాను మీ యీ కోపదృష్టులు నన్నేమియు చేయజాలవు నేను పాతివ్రత్యధర్మము నాచరించు దానను విధ్యుక్తధర్మము పూర్తియైన పిదప వచ్చితినిగాని అప్రయోజకముగ జాగుచేయ లేదు మీరు తాపసులేగాని ధర్మరహస్యములను తెలిసికొనలేదు దవ్వున ధర్మవ్యాధుడను వాడొకడు గలడు వాని చెంతకేగుము ధర్మమును బోధించగలడు ''

అది వినగనే ఏకాంతమున అరణ్యమున జరిగిన సంగతి యీమెకెట్లు తెలిసెనో యని ఆశ్చర్యపడి యొకింత శాంతించి యిక చేయునదిలేక తపప్రయోగము సిద్ధింపమి వగచుచు ఈపెయే యింతమహత్తు గల్గియుండ నిక నతడెట్లుండునో యని విస్మయాకులిత చిత్తుడై వానికొఱకు వెదకుచు పోయెను నిర్దిష్టస్థలమును జేరి, యచ్చోట ధర్మవ్యాధుడెవడని ప్రశ్నింప జనులొకనిని జూపి యీతడే యనిరి అతడు కసాయి దుకాణమున మాంసము గోయుచు, తూచుచు, అమ్ముచునుండెను తాపసిని జూచిన వెంటనే యాతడు లేచి నమస్కరించి యాదరించి ఆపతివ్రతాశిరోమణి యిచటకు బంపెనాయని యడిగి, కొంతసేపు కూర్చుండుడని చెప్పి వెడలి తన పని యంతయు పూర్తియైన పిదప స్నానాదు లాచరించి, తల్లి దండ్రులను పూజించి ఆ పిదప నాయోగిని బిలిచి మాంసమమ్ముట పరంపరగ వచ్చుచున్న వారికుల ధర్మమనియు, అందుచే జీవికకు వలసిన ద్రవ్యమును మాత్రమే దానినుండి సంపాదించుకొని కుటుంబ నిర్వహణ మొనర్చుచుంటిననియు, తాను హింసాహారముల భుజింపననియు, గృహస్థాశ్రమ ధర్మముల సక్రమ ముగ నిర్వర్తించుచుంటిననియు, ఏ యాశ్రమమందుండినను, ఆయా ధర్మములను విధ్యుక్తముగ నెరవేర్చుచున్నచో మహాశక్తి కలుగగలదనియు

నాతడు వచించెను

కుల వృత్తి యటుంచినను, మాతాపితరులసేవ, భగవద్భక్తి, అతిధి అభ్యాగతుల యాదరణము, దానధర్మము, పరోపకారము మున్నగు గృహస్థాశ్రమ సంబంధ ధర్మములను యధావిధి అనువర్తించుచున్నందుననే యా ధర్మవ్యాధుడు త్రికాలజ్ఞానియై ప్రబోధము బడయగల్గెనని యెంచి ఆ ముని యట నుండి వెడలి, తన యహంకార గర్వములను తొలగించుకొని ప్రశాంతమనస్కుడై యత్యాశ్రమ ధర్మమును సక్రమముగ నిర్వర్తించి జ్ఞానవంతుడయ్యెను ఈతడే కౌశికుడు భారతమున కౌశికముని వ్యాధ సంవాదమున నీ చరిత్రను గనదగును

468 విషమెక్కిన వానికి వేపాకు తీయగాను, మిరియములు చప్పగాను నుండును అట్లనే అజ్ఞానసర్ప దష్టులగు జీవులకు నశ్వర విషయములు శాశ్వ తముగను, తుచ్ఛప్రాపంచిక భోగములు కడురమణీయములుగను గన్పట్టును విషము తరిగినకొలది, అట్టి విపరీతానుభవమున్ను ఉడుగుచు వేపాకు చేదుగను, మిరియములు కారముగను నుండునట్లు అజ్ఞానము నశించినకొలది యధార్థదృష్టి గలుగుచు, సత్యము సత్యముగను అసత్యము అసత్యముగను గానుపించును మఱియు జ్వరపీడితున కెంత మంచి యాహారము పెట్టినను రుచింపనట్లు భవరోగ పీడితులకు దివ్యమగు ఆధ్యాత్మిక బోధ లున్ను రుచింపవు జ్వరము తగ్గినకొలది ఆహారమున రుచి పుట్టునట్లు అవిద్య సన్నగిలినకొలది పరమార్థవిషయములందు ప్రీతి హెచ్చును

469. స్తంభమును నాటునపుడు మఱల మఱల నూగించి, గట్టిగా నెలకొను నంతవఱకు నింకను రాళ్లు, మన్ను వేసి కూరునట్లు ఇంద్రియ నిగ్రహము, మనోజయము, సంయమనశక్తి పూర్ణముగ కలిగెనో, లేదో, అపుడపుడు పరీక్షించుచు ఇంకను పూర్ణ నిగ్రహము గలుగనిచో, విషయముల వైపునకు మనస్సు ఎపుడైన పరుగిడుచు నున్నచో ఇంకను ప్రయత్నము చాలదని నిశ్చయించి మఱింత పట్టుదలతో సాధనల జేయుచు పూర్ణస్థితిని

బొందవలెను దీనికే స్థూణానిఖననన్యాయ మనిపేరు

470 బ్రహ్మజ్ఞానులు తఱచు మూడు తెఱగులుగ నుందురు కొందఱు మత్స్యవృత్తి గలవారు, కొందఱు కూర్మవృత్తి గలవారు, మఱి కొందఱు మృగవృత్తి గలవారు మత్స్య మెల్లపుడును నీటిలోనే యుండి భూమిపై నుండజాలనట్లు కొందఱు జ్ఞానులెల్లపుడు ఏకాంతము నాశ్రయించియే యుందురు. ఇట్టివారికి జనస్తోమమందుండుట రుచింపదు కూర్మము నీటియందును భూమిపైనను గూడ సంచరించునట్లు మఱి కొందఱు బ్రహ్మజ్ఞానులు కొంతకాల మేకాంతమున నిర్వికల్ప సమాధి యందుండి ఆపిదప లోకమునకు వచ్చి స్మరణ, పూజా కీర్తనాదుల గావించుచు, విసుగునొందక జనులకు ఆత్మధర్మమును బోధించుచు నుందురు మృగమెల్లపుడును భూమిపైననే సంచరించునట్లు నీటియందుండ జాలనట్లు మూడవతరగతివారగు బ్రహ్మనిష్ఠులు ఎల్లపుడు ప్రపంచముననే యుండి జనులకు ధర్మమును బోధించుటయందును, స్మరణ, పూజాదుల గావించుటయందును ప్రీతిగల్గియుందురు. వీరికి నేకాంతము రుచింపదు మూడు వృత్తులలో కూర్మవృత్తియే లోకమున కెక్కువ యాదర్శప్రాయమై, ప్రబోధజనకమై, పరోపకార సంయుతమై యుండును. మహాప్రవక్త లందఱును ఈతరగతికి జెందినవారే

471. వ్యాపారమేమియు సాగనపుడు దుకాణదారుడు చీట్లాడుచు, వార్తాపత్రికలు చదువుచు వచ్చేపోయేవారితో మాట్లాడుచు ఇటునటు తిరుగుచు కాలము గడపుచుండును. కాని తిరునాళ్లరోజులలో వ్యాపారము సాగుచున్న సమయమున దుకాణమునందే కూర్చొని వస్తువుల నమ్ముచుండును ఇతరులెవరితోను అనవసరముగ మాట్లాడడు అట్లే ధ్యానము సరిగా సాగుచున్న సాధువు లెవరితోను ప్రసంగము చేయక ఏకాంతమున నిరంతర ధ్యాన మగ్నులై యుందురు. ధ్యానము సరిగా సాగక, మనస్సు చంచలమై బహిర్ముఖమగుచు, ధ్యేయమందాసక్తి జనించక యుండువారు అనేకులను జేర్చుకొని మాటలాడుచు వ్యర్థముగ కాలము గడపుచుందురు ఇదే ధ్యానమున

నిలుకడ కలిగిన వారికిని, కలుగని వారికిని గల గుఱుతు

ధ్యాననిష్ఠను సాధించు ముముక్షువులు మెయిల్ రన్నర్ వలె నుండవలెను టపాల్ గొనిపోవుచుండు రన్నరు దారిలో నెవరితోను మాట్లాడక పరుగెత్తుచుండును అట్లుగానిచో మెయిల్ టైమునకు టపాలను అందివ్వజాలడు అట్లే సాధకులు, తీవ్రవైరాగ్యమవలంబించి, దృశ్య విషయములందాసక్తి గల ప్రాపంచికజనుల సంసర్గము చేయక ఆత్మాను సంధానపరులైయే యుండవలెను కొందరు జీవన్ముక్తులై ధ్యాన నిష్ఠయం దారితేరి నిస్సంగత్వము నొందినవారు ప్రపంచములో జనులమధ్య సంచరించుట చూచి తామున్ను ప్రారంభముననే అట్లు చేయరాదు పెన్షన్ తీసికొను వారితో, ఉద్యోగము చేయు చున్నవారు సరిపోల్చుకొనగూడదు డిగ్రీ తీసికొనినవారితో, చదువుచున్న విద్యార్థులు సరిపోల్చుకొనగూడదు ఈత నేర్చుకొనినవారితో, ఈతనేర్చుకొనని వారెన్నడును సామ్యము నొందగూడదు. అట్లు పొందినచో భ్రష్టులగుదురు.

472 ఒక నదిలోని జలమును సమీపగ్రామస్థులు అన్ని జాతుల వారును బిందెలతో ముంచుకొని బయటకు వచ్చిరి నదిలో నున్నంత వరకు ఆజలము ఒకటే, పవిత్రమైనదే ఇపుడో, – ఇది మా జలము, ఇది మీ జలము, దీనిని తాకవచ్చును దీనిని తాకకూడదు, ఇది బ్రాహ్మణులది, ఇది బ్రాహ్మణేతరులది, ఇది మహమ్మదీయుల జలము, ఇది క్రైస్తవుల జలము, ఇది పవిత్రమైనది, ఇది అపవిత్రమైనది – ఇవ్విధమున భేదమేర్పడినది. కలహము లారంభమైనవి తుదకందరును వారివారి నీటిని ఆ నదిలో పారబోసిరి

అపుడు మఱల యథాప్రకారము ఒకటై, పవిత్రమై, సర్వులకు నేకరూపముగ పానార్హమై, స్పర్శార్హమై నెగడినది ఈ భేదమంతయు ఎట్లేర్పడినది? ఈ కలహము లన్నియు నేల జనించినవి? సమష్టినుండి వ్యష్టికి వచ్చుట బట్టియే అట్లే జీవులు తాము ఉపాధిరహితులై పరమాత్మలో ఏకీభావము నొందియున్నపుడు కళంకరహితులై ఒకే రూపమున వెలయుచుందురు

కాని ఆ సమష్టిరూపమునుండి విడివడి వ్యష్టిరూపోపాధుల ధరించి వచ్చు నపుడు, బంధము, కలహము, మాలిన్యము, అపవిత్రత, ద్వేషము, జాతి, మతము, కులము ఇత్యాదులు జనించినవి మఱల నట్టియాత్మతో నైక్యమగు నపుడు సర్వభేదములు సమసిపోయి ఒకే యఖండరూప చైతన్యము మాత్రము మిగులుచుండును

473 శాస్త్రవాక్యమందును, గురువాక్య మందును విశ్వాసమెక్కువ లేకపోయినందుచేతనే తత్తత్ఫలితములు మనుజులకు సరిగ కలుగకపోవుచు న్నవి దీనినిగూర్చిన యొక చరిత్ర గలదు పార్వతీదేవి యొకపుడు శివుని గూర్చి యిట్లు ప్రశ్నించెను ''శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే'' అని శ్రీశైల మాహాత్మ్యమున పురాణములందు చెప్పబడినదిగదా! ఆ దినమున నెందరో శ్రీశైలశిఖరమును దర్శించి పోవుదురే వారందఱును నిక్కముగ మోక్షము నొందుదురా? అని యడుగ ఆవాక్యమునందు జనుల కెంత విశ్వాసమున్నదో పరీక్షింప నెంచి యొక శివరాత్రి మఱుసటిదినమున సాక్షాచ్ఛివుడు వృద్ధబ్రాహ్మణరూపమును ధరించి, పార్వతీదేవిని వృద్ధ బ్రాహ్మణిగ జేసికొని, శ్రీశైలమునకు బోవు త్రోవయందున్న ఒక మడుగునందు దాను దిగబడి కంఠమువఱకు బురదయందు మునిగిన వాడుగ నటించుచుండెను ఒడ్డున నావృద్ధ బ్రాహ్మణి గూరుచుండి విలపించుచు దారినపోవు నందఱిని, తనపతి నెట్లైన నాపంకమునుండి బయటకుదీసి కాపాడుడని, తన ముత్తైదువతనము నెట్లైన సంరక్షింపుడని వేడుకొనుచు పెద్దపెట్టున నేడ్చుచుండెను

నాడు శివరాత్రి మఱుసటి దినము గనుక జ్యోతిదర్శనమునకై శ్రీశైల మునకు వెడలిన వేలకొలది జనులాత్రోవను తిరిగి వచ్చుచుండిరి. కాని యెవ రును ఆ బ్రాహ్మణుని లేవనెత్తుటకు సాహసింపరైరి ఎవరో పుణ్యాత్ములు దిగి లేవనెత్తు సమయములో ఆ ముదుసలి ''తండ్రీ మీరెవరో పుణ్యాత్ములు, కాని ఒక్కమాటను మాత్రము విని ఆ పైని దిగుడు మాభర్త అతిపవిత్రుడు వేదవేదాంగముల నధ్యయనము చేసినవాడు, బ్రహ్మజ్ఞాని పాపాత్ములెవరైన

స్పృశించినచో మరణింతురు అందులకు సంసిద్ధులైననే లేవనెత్తుడు'' అని చెప్పుచుండెను అది వినగనే ఆ దిగినవారు (తమయందేవో పాపములుండు నని తలంచి అనవసరముగ నేల మృత్యువు వాతబడవలెనని యూహించి) తటాలున వెనుకకు మఱలి పోవుచుండిరి ఇట్లెందఱో ప్రయత్నించియు, ఆబ్రాహ్మణి వాక్యములు విన్నంతనే తిరిగిపోవుచుండిరి

తుదకొక భక్తురాలగు వేశ్య యాత్రోవను బోవుచుండ నావృద్ధ బ్రాహ్మణి యథారీతి కన్నీళ్ల గార్చుచు, తనభర్త నుద్ధరింప నామెను వేడుకొనెను అపుడామె వెంటనే నీటిలోనికి దిగబోగా నాబ్రాహ్మణి వారించి ''అమ్మా! మీరెవరో దయాస్వరూపిణిగ గన్పించుచున్నారు కాని ఒక్కమాట వినుడు, మా భర్త పరమపవిత్రుడు, నిర్మలుడు పాపాత్ములు స్పృశించిన ఆ స్పృశించిన వారు మరణింతురు. అందులకు సిద్ధమైననే దిగు''డనెను అపుడావేశ్య! ''ఛీ! మూర్ఖురాలా! ఇంకను నాయందు పాపమా? నిన్న శివరాత్రియంతయు, ఉపవాసముండి జాగరణ మొనర్చి, శిఖర జ్యోతిని దర్శించిన నాయందింకను పాపమెచట? అవిశ్వాసురాలా! నీకు శాస్త్రవాక్యమందు విశ్వాసము లేదు 'శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే' అని చెప్పబడలేదా? కాన, నాపాపములన్నియు దగ్ధమైపోయినవి పుణ్యాత్మురాలనైతిని జన్మరాహిత్యము నొందితిని- అని యుచ్చస్వరమున బల్కి,పంకిలమున జొరబడి ఆపై భర్త్రుద్ధరణమునకై గడంగ, తోడనే ఆవృద్ధ బ్రాహ్మణీ బ్రాహ్మణు లిరువురును సాక్షాచ్ఛివ పార్వతులై యట తేజరిల్లి తమ నిజరూపంబుల బ్రత్యక్షమై యా వేశ్యకు జననమరణ రహిత శాశ్వత కైవల్యపదవి నొసంగి యంతర్ధానమైరి చూచితిరా! విశ్వాసముయొక్క మహిమ!

474 సామాన్యముగ, భక్తిశ్రద్ధలు గలవారు ధర్మబోధ మున్నగునవి జరుగుచోట్లకు అందఱికంటె ముందుబోవుచు, తుద కందఱికంటెను వెనుకను మఱలి వెళ్లుచుందురు దీనిగూర్చి యొక్కచరిత్రగలదు పూర్వ మొకపుడు తులసీదాసు శ్రీరామచంద్రమూర్తిని దర్శింపనెంచి గంగా

తీరమున అహర్నిశము శ్రీరామధ్యానము చేయుచుండెను ఇట్లుండ నొకదినమున ఆతడు పుక్కిలించి ఉమిసిన నీరు సమీపముననున్న నొక చెట్టుమోడుపై బడ, అందుండి యొక బ్రహ్మరక్షస్సు బయల్వెడలి, తాను శాపకారణంబున నాశుష్కవృక్ష రూపమున నుంటిననియు, నిరంతర రామనామజప సంభరితంబగు శ్రీవారి ముఖారవిందంబునుండి వ్రాలిన జలబిందు సంస్పర్శముచే తాను పవిత్రుడై శాపవిమోచనము నొందితిననియు, అతని యభీష్టంబెద్దేని యుండిన దానిని నెరవేర్చుటకు సంసిద్ధుడననియు వచించెను అంత, తులసీదాసు శ్రీరామచంద్ర దర్శనో పాయంబు నెఱింగింపుమన నా రక్కసి శ్రీరామచంద్రులను దర్శించుట చాల ప్రయాసమనియు, మొదట శ్రీఆంజనేయులను దర్శించిన వారి ద్వారా శ్రీరామచంద్రుల దర్శనము సులభముగ నొందవచ్చుననియు తెలిపెను

అపుడు తులసీదాసు శ్రీఆంజనేయులను దర్శించు నుపాయం బెద్దనిన ఆబ్రహ్మరక్షస్సు ఈ గంగాతీరమున జరుగు శ్రీమద్రామాయణ కథాశ్రవణమునకై యాతడేతెంచుచుండును గాన అతనినట గాంచుడని చెప్పి యదృశ్య మయ్యెను తులసీదాసు అట్లనే నాటిదినము శ్రీమద్రామాయణ కథాశ్రవణమున కేతెంచిన వారినందఱిని బాగుగ పరీక్షించి చూచెను కాని శ్రీఆంజనేయు లెచటను గన్పింపకుండెను. అంత దుఃఖాక్రాంతుడై యుండ నా రక్కసి మఱల ప్రత్యక్షమై, ఆ కథాశ్రవణమున కందఱికంటె ముందుగ విచ్చేసి, అందఱికంటెను వెనుకగా మఱల వెళ్లువాడే శ్రీఆంజనేయులని వచించి యంతర్ధానమొందెను. మఱుసటిదిన మట్లనే కథాస్థలంబునకేగి చూడనొక వృద్ధ బ్రాహ్మణుడందఱి కంటెను ముందుగ వచ్చి శ్రద్ధాభక్తులతో విని, అందఱును తిరిగివెళ్లిన పిదప మెల్లగ నచ్చోటు వీడుచుండుట గాంచి, యాతడే శ్రీ ఆంజనేయులని గ్రహించి సాష్టాంగ దండ ప్రణామంబు గావించి, వారి యనుగ్రహము బడసి తద్ద్వారా శ్రీరామచంద్రులను దర్శించి, వారి యనుగ్రహమునకున్ను పాత్రుడై కృతార్థత నొందెను.

475. మోక్షమెపుడు గల్గునను విషయము స్పష్టముగ చెప్పవచ్చును.

ఈ జన్మలోనే కలుగునా? లేక ఇంకొక జన్మలో కలుగునా? రెండుజన్మలలో కలుగునా? లేక అనేక జన్మలు పట్టునా? ఇపుడు ముక్తుడైయే యుండెనా? అను సంగతి జ్యోతిషమువలె తథ్యముగ వివరింపవచ్చును తన యందేవియు విషయ వాసనలు లేక, దృశ్య సంకల్పము లుదయించక, ఆత్మానుభవము చక్కగ గలుగుచున్నచో తానిపుడే మోక్షము నొందినట్లు; లేక వాసనలు పూర్తిగ నశింపక యింకను కొన్ని మిగలియుండి దృశ్యవృత్తు లపుడపుడు స్ఫురించు చున్నట్లైన, ముక్తికై ఇంక కొన్ని జన్మలు పట్టును వాసనలు ఘనీభూతములైయుండి, దృశ్యమందే సదా రమించుచు ధ్యేయాకారమును పూర్తిగ విస్మరించి యుండు వారింక నెన్నిజన్మలకో (కష్టసుఖములు పడిపడి యెపుడో యొకపుడు నివృత్తిమార్గ మవలంబించి క్రమముగ) మోక్షము నొందుదురు

కొందఱు మీకు త్రికాల జ్ఞానమున్నదా? అట్లైన మేము పూర్వజన్మయం దెట్లుండియుంటిమి! మఱు జన్మయం దెట్లుందుమో చెప్పుడని తిరుపతియం దేకాంతమున నేను తపస్సు చేయుచున్న కాలమున నన్నపుడపుడు ప్రశ్నించుచుండెడివారు నేనందులకు నాకు త్రికాల జ్ఞానము గలదు అట్లనే మీ భూత భవిష్యత్తుల జెప్పెదను వినుడని యిట్లు చెప్పుచుందును ఇపుడు మీ యందెట్టి సంస్కారములున్నవో, వాటి కనురూపమగు జన్మయే మున్ముందు మీకు వచ్చును. ఆ వచ్చే జన్మలో మీరాచరించు క్రియలన్నిటికిని ఈ జన్మలోని సంస్కారములు కారణరూపములై బీజరూపేణ యుండును ఇపుడేయే వృత్తులను మీరు గలిగియున్నారో, వాటికి కారణరూపములైన బీజములే క్రిందటి జన్మయందు మీకుండినవి కాననీ జన్మయందలి మీ చిత్తవృత్తులను బట్టి గడచిన జన్మయందు మీ రెట్లుండిరో కూడ ఊహించు కొనవచ్చును ఇవ్విధమున మీభూత భవిష్యత్తులను మీరే తెలిసికొనగలరు. ఇదియు త్రికాలజ్ఞానమే కదా!

476. నది విస్తారజలము గల్గి ప్రవహించుచున్నను వారువారు తీసికొని పోవు పాత్ర (బిందె, చెంబు, పీపా మొదలగునవి) యెంతపరిమాణము గల్గి

యుండునో, అంతమాత్రము నీరే వారు గ్రహింపగల్గుదురు అట్లే ఒక గ్రంథము చదువునపుడుగాని, ఒకరి బోధ వినునపుడుగాని, ఎవరెవరి బుద్ధి యెంత విశాలముగా నుండునో అంత అర్థమునే వారు దానినుండి గ్రహింప గలుగుదురు మఱియు రైలుస్టేషనునందు నీళ్ల రిజర్వాయర్ నుండి గొట్టము ద్వారా నీరు పంపబడునపుడు, ఇంజను త్రాగునీటియొక్క గొట్టము చాల లావుగా నుండును గాన దానినుండి ధారయు లావుగానే వచ్చును. కాని ప్రయాణికులు ఉపయోగించు పంపుగొట్టము చాలసన్నగా నుండును. కాన దానినుండి సన్నధారయే వచ్చుచుండును. ఇట్లు ఆయా ఉపాధుల యాకృతి, వైశాల్యములబట్టి విజ్ఞానమును్న న్యూనాధిక్యములను బొందు చుండును.

477 మేఘజలము శుద్ధముగాను, పవిత్రముగాను నున్నను వర్షించిన పిదప భూమిపై గల ఆయా ధాతువులతోగలసి వికార, వైవర్ణ్యమాలిన్యముల నొంది, వివిధరూపముల బ్రవహించునట్లు శుద్ధమై, నిష్కళంకమై, అనంతమైన ఆత్మవిజ్ఞానము జనుల యుపాధి తత్త్వముల బట్టి వివిధరూప ములుగా వ్యక్తమగుచున్నది.

478. మరణకాలమున జీవునివెంట తాను సంపాదించిన ధనముగాని, ఆరామ విహారములుగాని, కీర్తిగౌరవములుగాని రావు. బంధుమిత్రాదు లున్ను రారు ఏకాకియైయే పోవలసియుండును తాను చేసిన సుకృత దుష్కృతములు మాత్రము వెంటవచ్చుచుండును. కాన దుష్కృతమును వదలి సుకృతమునే జీవితకాలమున సముపార్జించ వలసియుండును.

**ధనం చ భూమౌ పశవశ్చ గోష్ఠే కాన్తా గృహద్వారి జనశ్శ్మశానే ।**
**దేహశ్చితాయాం పరలోకమార్గే కర్మానుగో గచ్ఛతి జీవ ఏకః ॥**

(అంత్యకాలమున) ధనము పెట్టెలందే నిలచిపోవును. పశువులు కొట్టము నందే యాగిపోవును. భార్య గుమ్మమువద్దనే యుండిపోవును. బంధుజనులు శ్మశానముననే నిలచిపోవుదురు దేహము చితిపై

భస్మమైపోవును. ఇక పరలోకమునకు తానొకడే తన కర్మను వెంటబెట్టుకొని పోవుచుండును. ఎపుడో యొకపుడీస్థితి యందఱకును వచ్చియే తీరును మరణము తథ్యము అట్టిచో నిక నీ జీవితము నేలయొక మహాకార్యమున వినియోగింపరాదు? ప్రపంచమున క్షణక్షణమునకు నెన్నియో కోట్ల జీవరాసులు, క్రిమి కీటజాలములు మరణించుచున్నవి వాటిలో నిదియొకటి అనుకొనుడు మరణమే నిక్కమైనపుడు ఒక గొప్పదైవకార్యమును, ధర్మమును సాధించుటయం దీజీవితమేల వినియోగింపరాదు? అట్లు సాధించుటలో శరీరమంత మొందినను మహత్తరఫలమే చేకూరును గదా! కాన ప్రతివారును తమ జీవితమున నేదేని యొక ధర్మమును పూర్ణముగ ననుష్ఠించి, జన్మసార్థకత నొందవలెను

479 సాధులోక ముద్ధరింపబడవలెననిన ఒకే యుపాయము గలదు అది స్వల్పముగ తోచినను దానివలన మాత్రమే యథార్థమగు ఉన్నతి సాధు లోకమునకు గలుగును అదేమన! 'ఈ సాధువు హృదయములో ఒక్క పిడికె డన్నము పడిన మాజన్మ తరించును. మేము కృతార్థుల మగుదుము' అను భావము జనులకు కలిగేలాగున తాము వర్తించుటయే యగును తమయం దట్టి విశ్వాసము జనుల కుదయించునంతటి ఆచరణ, అనుష్ఠానము, పవిత్ర తలను సాధువులు గలిగి యున్నచో, నిక మఱేసాధన లేకయే సాధులోకము వర్ధిల్లును లేనిచో ప్రపంచ మెపుడును వారికి విముఖమయ్యే యుండును అట్టి పవిత్రత, ఆచరణ లేనందువలననే పూర్వికఋషులు సంపాదించిన గౌరవమును నేడు జనులు సంపాదింపజాలకున్నారు సాధులోకము పతన మగుటకును కారణమిదియే

480 ఒకడు ఉత్తరధ్రువమున కెంతెంత సమీపముగ నేగుచుండునో దక్షిణ ధ్రువమున కంతంత దూరమగుచుండును అట్లనే ఆత్మలోకమునకు సమీప మేతెంచిన కొలది దృశ్యప్రపంచ మంతంత దూరమగుచుండును. దృశ్యమును సమీపించిన కొలది ధ్యేయము (ఆత్మ) దవ్వగుచుండును

481 అధ్యాత్మలోకమున గురువులు, బోధకులు మున్నగువారు

మార్గమును జూపువారే గాని నడవవలసినది తమకు తామే గురువుల చెంతనున్నను తమ ప్రయత్నాతిశయముచే తాము హృదయమును పరిశుద్ధ మొనర్చుకొనిననే తప్ప జ్ఞేయవస్తు వవగతము కానేరదు గురువుగారి కంటి ప్రక్కననే తన కన్ను పెట్టినను గ్రుడ్డివాని కేదేని కన్పించునా? అట్లనే గురువు చెవివద్దనే తన చెవి పెట్టియుంచినను చెవిటివాని కేదేని వినవచ్చునా? అంధత్వమును పోగొట్టుకొని యెవరి కంటితో వారు చూడవలసినదే బధిరత్వమును పోగొట్టుకొని యెవరి శ్రోత్రముతో వారు వినవలసినదే గురువు నీడ గురువుతో బోవును శిష్యుని నీడ శిష్యునితో బోవును

482 పూర్వము జనకుడు తన రాజ్యమున సంచరించుచున్న సమ యమున నొకచోట నొక బ్రాహ్మణుడొక వేదగ్రంథము నధ్యయనము చేయుటగాంచి, యచటికేగ నపుడాతడొక మంత్రము చదువుచుండెను దాని యర్థమేమన గుఱ్ఱపు రికాబులో నొకదానియందు పాదముంచి రెండవదా నిలో పాదముంచులోపల మోక్షము సిద్ధించగలదు రాజది వినెను. దాని సత్య మును నిర్ణయించెదవా యని వానిని ప్రశ్నించెను. వేదములో నున్న దాని యందు మేము విశ్వాసముగల్గి యుందుమని మాత్ర మాతడు వచించి యూరకుండెను అట్టిచో నట్టి యసత్యవాక్యముల నేల పఠించెదవని వానిని మందలించి వెంటనే కారాగృహమునకు బంపెను ఆ వాక్యముయొక్క సత్యతను ఋజావుపరచుటకై తన రాజ్యమందలి బ్రాహ్మణులను, విద్వాంసులను, శాస్త్రజ్ఞులను అందఱిని విచారించెను. కాని యెవరును ఋజావు చేయజాలక పోయిరి అపుడు వారందఱినికూడ కారాగృహమున బంధీకృతులజేసెను, అది విని సర్వులును భీతులైరి.

ఆ సమయమున అష్టావక్ర మునీంద్రడెందులకో ఆ విదేహ రాజ్య మునకు వచ్చుట తటస్థింప జనులందఱు అతని కీవార్తను వినిపించి, తాను రావలదనియు, వచ్చినచో జనకుడు కారాగృహమునకు బంపుననియు దెల్పిరి అందుల కాతడు దీనికింత భయపడనేల! నేనిపుడే పోయి ఆ ప్రశ్నకు తగు సమాధాన మిచ్చెదనని వచించి, జనకునివద్ద కేగి, ఆ వేదవాక్యము

యొక్క సత్యతను తాను ఋజావు పరచెదననియు, తనతోటి యేకాంతమున నాడరణ్యమున కేతెంచుమనియు చెప్పెను రాజట్లనే యొకగుఱ్ఱముపై నెక్కి ఒకరిద్దఱు భృత్యుల గైకొని యేకాంతమునకు బోయి, భృత్యులను దూరము గనుంచి తాను నిర్ణీత స్థలమునకు వచ్చి చేరెను అష్టావక్రమునీంద్రు డంత వానిని తన గుఱ్ఱముపై నెక్కుమనెను అట్లనే యాతడొక పాదమునొక రికాబు నందుంచి రెండవపాదమును రెండవ రికాబులో పెట్టునంతలో నమ్ము నీంద్రుడు గురుదక్షిణ నేమి యొసంగుదురని యడుగ, రాజందులకు తన్ను, తనరాజ్యమును సమస్తమును శ్రీ గురుదేవునికే యర్పింతుననెను అంతనా మునీంద్రుడు వాని మనంబును దానము చేయమన, నాతడట్లనే చేసెను అపుడు వెంటనే ఉన్మనీస్థితి నొందినవాడై జనకుడు చిత్రంపు బొమ్మవలె అట్లనే స్తబ్ధుడై నిలచిపోయెను మునీంద్రుడు వెడలిపోయెను

ఇట్లుకొన్ని దినములు గడచెను. రాజింకను నరణ్యమునుండి తిరిగి రాలేదేమియని తలంచి విహ్వలచిత్తులై భృత్యులు, పురజనులు వెదక నారంభించ నొకచోట శిలాకృతితో చలింపక నిలబడియుండుటను గాంచి యెవరో సమ్మోహ మొనర్చిరని యెంచుచుండిరి ఇంతలో నచ్చోటికి నష్టావక్రు డేతెంచి వాని శరీరమును తట్టి మేల్కొలిపెను మనస్సును (వృత్తులను, సంకల్పములను) త్యజించినచో ఆక్షణమే ముక్తి( అమనస్కము, ఉన్మన్యవస్థ, నిర్వికల్పసమాధి) సిద్ధించునని అష్టావక్రు డివ్విధమున జనకునకు ప్రత్యక్షముగ ఋజావుచేసి చూపెను

483. తమ్ములను తామే బంధించుకొని, బంధమెట్లు తొలగునని అందఱిని వేడుకొనుచుందురు. ఈ రీతియే జనులందు గన్పించుచున్నది. ఎట్లన ! పూర్వమొక రాజా గలడు అతని యాస్థానమున నొక శాస్త్రజ్ఞుడగు పండితుడుండెను ఒక దినమున రాజాతనిని బిలచి పూర్వము శుకుడు పరీక్షిత్తునకు మోక్షమిప్పించియుండ లేదా, అట్లనే నాటి కేడవదినమున తన కున్ను ఆతడు మోక్షమిప్పించ జాలనిచో తన యాస్థానమునుండి వానిని వెడల గొట్టించెదనని చెప్పెను.పాపమాపండితుడు ఏమియు చేయునదిలేక ఖిన్న

వదనుడై విచారగ్రస్తుడై యుండెను. వాని దురవస్థజూచి మహాతత్త్వజ్ఞురాలగు వాని కొమరిత తానే యక్కార్యము నిర్వహించెదనని చెప్పి వానినూరడించెను

సరిగా నిర్ణీతసమయమునకు రాజగృహమున గొప్ప సభ చేర్చబడెను రాజుగారు మోక్షము నొందుదురు గదా యని చూచుటకై యెందఱో ప్రజలు, ప్రముఖులు నటకు విచ్చేసిరి అపు డాపండితసుత తానే వానికి మోక్షమిప్పించెద వనియు, తాను చేయుమనిన ట్లాతడు చేయవలెననియు రాజుతో జెప్ప నాతడందుల కంగీకరించెను ఒక స్తంభము ప్రక్కనే యొక బల్లవైచి దానిపై రాజును గూర్చుండుమని చెప్పి, వానిముందు మఱియొక బల్లనమర్చి దానిపై రకరకముల పిండివంటలు ఫలాహారములు వరుసగ పెట్టియుంచెను రాజుయొక్క రెండుచేతులను, కంఠమును స్తంభమునకు బాగుగ బిగించి కట్టించివైచి యిక నెదురుగనున్న యాభోజ్యముల నారగింపుమని రాజుతో ననెను. పాపమాతడేమి చేయును! నోటికి అందవు, తీసికొనుటకు చేతులు రావు అట్లనే వాటిని చూచుచు నుండిపోయెను

అపుడు కొంతసేపటి కాపె వాని కట్లను విప్పించి వైచి వానికిట్లుపదేశించెను "ఓ రాజా! సమస్తము (ముక్తి) నీ చెంతనే (హృదయముననే) యున్నది కాని నిన్ను నీవే అజ్ఞానముచే బంధించుకొని యుంటివి. అంతఃకరణ దోషమను రజ్జువుచే నిట్లు నిన్ను నీవు బంధీకృతునిగ నొనర్చుకొని యితరుల మోక్షమునకై యాచించుచుంటివా? తద్దోషమును నీవే రహితమొనర్చుకొనిన అవిద్యాపాశ మున్మూలింపబడి ముక్తి కరతలామలకం బగు"నని వచించెను అపుడు రాజు ముక్తియొక్క యథార్థతత్త్వమును గుర్తెఱింగి కర్తవ్యమునకు గడంగెను

484. కాశీపురవర్ణనను గూర్చి గ్రంథములందు చదివిన ఇరువురు పండితులు ఆయాస్థల నిర్ణయముల గూర్చి భిన్నాభిప్రాయముగల్గి పరస్పరము వాదవివాదము సల్పుచుండిరి ఇంతలో కాశికిబోయి చూచి వచ్చిన మఱియొక డచటికేతెంచి వారు తగవులాడుటను జూచి నవ్వి (తాను పండితుడు గాకున్నను) నిజమును వారికి బోధించి శాంతపఱచెను. అట్లనే

ఆత్మానుభూతిలేని పండితులు పరతత్త్వమును గూర్చి పెక్కు యుక్తులతో, ప్రమాణ ములతో వాదించుకొనినను, యాథార్థ్యమును నిర్ణయింపజాలరు అనుభవ జ్ఞానముగల బ్రహ్మనిష్ఠుడే ఇదమిత్థమని తేల్చి చెప్పును

485 కొందఱు మీవద్ద ధనాకర్షణ జనాకర్షణ యంత్రమేదో యుండ చ్చును లేక మలయాళ మంత్రమహిమ యేదేని మీరు గలిగి యుండవచ్చును దానిని మాకుపదేశింపుడని యడుగుచుందురు నేను వారితో నిట్లను చుందును ''అవిశ్వాసులారా! మీకు భగవంతునియందు విశ్వాసము తక్కువ అట్టిమంత్ర మెద్దియును నావద్దలేదు కాని ఒక యంత్రమును, మంత్రము, మాత్రము అందఱకు చెప్పెదను, దాని జేపట్టిన ప్రతివారున్ను ఈశ్వరకృపకు పాత్రులై, జనుల విశ్వాసమును బడయగలరు ఆదేదన! మీ హృదయమున దృశ్యవృత్తులెవ్వియు నుదయింపకయు, దృక్స్వరూపమైన ఆత్మ మఱుపు గలుగకయు చూచుచుండుటయే దీనికి మించిన యంత్రము, మంత్రము ముల్లోకములందును లేదు ఎపుడు మీ హృదయము సర్వజీవరాసుల కొఱకు తపించునో, భగవల్లక్ష్యమును విడువకయుండునో, అపుడే సర్వజీవాంతరాత్మయగు పరమేశ్వరుడు మీకు వలసినదంతయు సమకూర్చి, ప్రజలకు విశ్వాసపాత్రునిగ జేయును తమ (స్వార్థము) కొఱకేదియు దాచుకొనక అంతయు లోకమునకై వినియోగించు వానిని లోకమే కాపాడి సంరక్షించును ''

486 ఒకరాజు ఎంతయో ధనము వెచ్చించి ఒక గొప్ప ఈశ్వర దేవాలయమును నిర్మించెను సరిగా దాని ప్రతిష్ఠాదినమునకు క్రిందటి రోజు రాత్రి ఈశ్వరుడు వానికి స్వప్నమున నగుపించి రేపటి దినమే ఈ గ్రామ సమీపమున నొకతావున మఱియొక దేవాలయ ప్రతిష్ఠ యున్నదనియు, ఆ దేవాలయము ఇంకను నెంతయో అధిక విలువ గలిగినదనియు, అత్యంత శోభాయమాన మైనదనియు, దాని ప్రతిష్ఠ యింకను అతిశయమైన దనియుచెప్పి దానిగుర్తును వానికి జూపి యదృశ్యమయ్యెను రాజాశ్చర్య పడెను ఎన్నియో రత్నాభరణములతో తులతూగు నీ దివ్యమైన దేవళము

కంటె ఇంకను శోభాప్రదమైన దేవళము నెవరు నిర్మింపగల్గిరి? అని విస్మితుడై మఱునాడు దయముననే లేచి యా నూతన దేవాలయమును సందర్శించుటకు పయనమయ్యెను.

స్వప్నమున ఈశ్వరుడు చూపెట్టిన గుఱుతు ననుసరించి పోవ, నచ్చోట దేవాలయము లేదు, ఉత్సవము లేదు అచటి జనులను విచారింప, వారున్ను అట్టిదేమియు లేదనిరి కాని సమీపమున నొక చెట్టుక్రింద నొక భక్తుడు మాత్రము గూర్చుండి భగవద్ధ్యానము చేయుచుండెనని చెప్పిరి అతనిని సమీపించి, దేవళమునుగూర్చి విచారింప నాతడు ఈశ్వరుడు స్వప్నమున గానుపించి నిన్నిటకు బంపెనా యని రాజునడిగెను ఆ వృత్తాంత మాతని కెట్లు తెలిసెనా యని రాజాశ్చర్యపడి వినయపూర్వకముగ ప్రశ్నింప తనహృదయమే దేవాలయమనియు, దాని ప్రతిష్ఠార్థమే భగవంతుడటకు విచ్చేయుదునని చెప్పియుండెననియు ఆతడు వచించెను

రాజంతయు గ్రహింపగల్గెను. తాను నిర్మించినది రాతితో గట్టబడిన జడమైన దేవాలయమనియు, ఈ భక్తుడు నిర్మించినది చైతన్యమగు దేవాలయమనియు, వాని హృదయము పరిశుద్ధమైనందువలననే భగవంతుడట వసింప నిశ్చయించుకొనెననియు తెలిసినది కాన, బాహ్య పూజలకంటె చిత్తశుద్ధిద్వారా చేయబడు ఆంతరంగిక ఆత్మపూజయే శ్రేష్ఠమనియు తెలిసికొనినవాడై, తన గృహమునకు జని పూర్వాధికభక్తితో భగవంతుని సేవించుచు, ఆత్మపారిశుద్ధ్యమునందే దృష్టి నధికముగ నిల్పుచు, క్రమముగ ఈశ్వర సాక్షాత్కారమను దుఃఖరాహిత్యపదవి నొందెను

487. బ్రహ్మజ్ఞానము గలిగిన పిమ్మటగూడ నింకను ఆచరణమేల? అనుష్ఠానమేల? నీతియేల? నియమమేల? యని కొందఱుదురు నదిని దాటిన పిదప నిక ఆ నావతో నేమి ప్రయోజనము? పుష్టిగ భుజించి తృప్తినొందిన పిదప నింకను పొయ్యివద్ద గూర్చొని వండుచుండుటేల? అట్లు వండు చుండినచో నాతడింకను పూర్ణముగ భుజింపలేదనియే గదా అర్థము అని యివ్విధంబున బల్కుచుందురు నిజమే నదిని దాటినవారికి నావతో

పనిలేదుగాని, నదిని దాటించువారు దానినెల్లపుడు భద్రముగ కాపాడు చుందురు గదా! మొదటి వారు తామొక్కరే తరించిరి కానిరెండవ వారు తాము తరించుటయేగాక దానిచే నింకెందఱినో తరింపజేయుచుందురు, కాన జీవన్ముక్తులలో కొందఱు తామొక్కఱే తరించి యూరకుందురు మఱి కొందఱు తాము తరించినను, తక్కినవారినికూడ తరింపజేయుటకై, లోకమునకు మార్గమును చూపుటకొఱకై ఆచరణ, అనుష్ఠానము, ధ్యానము, భక్తి- వీటిని కలిగియే యుందురు దానిచే వారు ముక్తులు కాలేదను భావమెన్నడును గలిగియుండరాదు

తామొక్కరు తరించుట యొక గొప్పకాదు ప్రపంచమునంతను గూడ తన వెంటతీసికొని పోగల్గుటయే గొప్ప ఒక్క రైనచో తాము వండుకొని భుజించి పాత్రను కడిగివైచి, నిప్పు చల్లార్చి కూర్చుందురు నిత్యాన్నదాన సత్రములలో బోయి చూచిన వండువారు, పెట్టువారు, తీయువారు, విరామము లేక నిరంతరము పనిచేయుచునే యుందురు. ఆయగ్నిహోత్ర మును చల్లార్పకయే యుందురు లోకోద్ధరణ తత్పరులగు బ్రహనిష్ఠుల స్వభావ మివ్విధముగనే యుండును

**శాన్తా మహాన్తో నివసన్తి సన్తో వసంతవల్లోకహితం చరన్తః।**
**తీర్ణాస్స్వయం భీమ భవార్ణవం జనా నహేతునాఽ న్యానపి తారయన్తః॥**

అని శ్రీశంకరులు వివేక చూడామణియందు బ్రహ్మజ్ఞుల స్వభావ మును పేర్కొనిరి. అనగా వసంత ఋతువువలె లోకమునకు హితము చేయుచు ప్రశాంతచిత్తులగు మహాత్ములు, భయంకరమైన సంసార సాగరమును తాము తరించినవారై, అహేతుకముగ నితరులను గూడ తరింప జేయుచున్నారు

488 సామాన్యముగ ఆశ్రమములలోగాని, గృహములలోగాని పెద్దలె వరైన తదితరులకును కొన్ని పనులు చెప్పి నాయనలారా! మీరీ కార్యముల జేయుడు, పుణ్యము వచ్చునని యన్నపుడు కొందఱువినయ పూర్వకముగ

సంతోషముతో చేయుదురు వారు పుణ్యమునే పొందుదురు కొందఱు శ్రమతో వాటిని నిర్వహించుదురు వారు కొంచెము పుణ్యమును సంపాదించు దురు. పాపమును మాత్రము సంపాదింపరు మఱికొందఱు ఆపనుల నుండి యెట్లైన తప్పించుకొన దలంచి గర్వముతో మాకు పుణ్యమక్కఱ లేదు పాపమే కావలెనని దంభపూర్వకముగ బల్కుదురు అట్టివారు తప్పక పాప మునే పొంది క్రమశః క్షీణదశనొందుదురు. ఏలన తామనుకొను రీతిగా తమ మనస్సు పరిణామ మొంది ఫలించుట యొకటి రెండవది, పవిత్ర హృదయు లెవ్వరైన నది విని ఓహో? వీరింత గర్వము, అభిమానము గల్గియున్నారా? యని లోలోన తలంచినప్పటికి అది వారికెంతో హానిని గలుగజేయును వారి జీవితము కష్టముల పాలగును వారపకీర్తిని పొందెదరు అట్లే పవిత్ర హృదయులును, నిర్మలాత్ములును నగు జీవులెవరిని గూర్చియైన ఈతడు మంచివాడు. చాలా శాంతబుద్ధిగలవాడని తలంచిన, ఆతలంపే వారి కెంతయో మేలును చేకూర్పగలదు ఏలన మహాత్ములెట్లు తలంతురో అట్లనే జరిగి తీరును శుద్ధసంకల్పముయొక్క మహిమయే అది

పూర్వము భస్మాసురుడను రాక్షసుడు శివునిగూర్చి ఘోర తపంబొనర్చె. శివుడు ప్రత్యక్షమై యేదేని వరము కోరుకొనుమన ఎవని శిరస్సుపై నాహస్తము పడునో యాతడు భస్మమైపోవునట్లు వరమిమ్మని ప్రార్థించెను శివుడు వల్లెయని యదృశ్యుడయ్యెను అప్పటినుండియు నా రక్కసుని హస్తస్పర్శచే నెందఱో హతులగుచుండిరి అపుడు తనప్రభావము శివునిపైగూడ జూపదలంచి వరమిచ్చినవారు కూడ తన హస్తస్పర్శముచే మరణింతురో, లేదో చూడనెంచి, శివుని శిరస్సుపై గూడ తన కరముంచ యత్నించు చుండెను

అపుడు వాని దుష్టపు తలంపెరింగి, లోక సంరక్షణ తత్పరుడగు జనార్ధనుడు అతిసుందరమైన స్త్రీ రూపము ధరించి వానిచెంతకేగ నయ్యసురు డా జగన్మోహనాకారయగు సుందరాంగినిగాంచి, మోహితుడై యామెను పరిగ్రహింప నిశ్చయించుకొని తన యభీష్టము నామెకు దెల్ప,

నన్ను తప్ప మఱి యెవ్వరిని నీవు వరింపకుండునట్లు శిరస్సుపై హస్తముంచి ప్రమాణము చేసిననేగాని యంగీకరింపనని యామె బదులు చెప్పెను అట్లనే చేసెదనని యాతడు తన హస్తమును శిరస్సుపై నిడుకొని ప్రమాణము చేయబోవ, శివవర ప్రభావముచే వెంటనే భస్మీభూతుడయ్యె! చూచితిరా! తానుకోరిన వరమే తన కనర్థమును తెచ్చిపెట్టినది కాన గర్వాభిమాన యుతులై దుష్టసంకల్పములను జేయక, మహాత్ముల యాదేశముల ధిక్కరింపక, సుగుణయుతులై మెలంగుట శ్రేయోదాయకము

489. తొడిమ నంటుకొని యున్నంతవఱకు కాయ అభివృద్ధి నొందుచుండును తొడిమనుండి రాలినచో కృశించి నశించును అట్లనే చిత్తము భగవంతునియందు సంలగ్నమై యున్నంతవఱకు జీవుడు క్రమ వికాసము నొందుచుండును ఎపుడట్టి భగవత్స్మృతిరూపమగు ధ్యాన ప్రవాహము తెగిపోవునో, అపుడు వికాస రహితుడై ఆత్మోన్నతి బడయ జాలకుండును

490 శ్రీ దయానంద స్వాములవారి నొకరిట్లు ప్రశ్నించిరి 'స్వామీ! దుర్బల శరీరులమై, అంగపటుత్వము తప్పి, వార్ధక్యము నొందిన నొకప్పుడు మాకే విషయవాంఛ గలుగ నిగ్రహించుట కష్టముగా నున్నదే! సర్వేంద్రియ సౌష్ఠవముగల్గి యౌవనమందున్న మీ రెట్లు నిగ్రహింప గలుగుచున్నారు? బ్రహ్మచర్యము నెట్లు సాధించుచున్నారు?' అందులకు స్వామిజీ, తానెల్లపుడు సత్యమునుగూర్చి చింతించుటయందే కాలము గడుపుదుననియు, ధర్మకార్య ములందే నిమగ్నుడనై యుందుననియు, అందుచే విషయమన నెట్టిదో తలంచుటకు కూడ తనకు సమయము లేదనియు, కనుకనే బ్రహ్మచర్య మును సాధింప గల్గుచుంటిననియు వచించెను

శ్రీదయానందులు నిరంతర కార్యదీక్ష గలవారు అధ్యయనము, అధ్యాపనము, దైవచింతనము ధర్మప్రచారము మొదలగు నుత్తమకార్యము లందే నిరంతరము కాలము గడుపువారు అట్టివారికిక ప్రాపంచిక విషయ చింతనమునకు సమయ మెచట నుండును? ముముక్షువులైనవారు

ముఖ్యముగ నిర్విషయమును జ్ఞప్తియందుంచు కొనవలెను ఎంతకాలము మనస్సు ధ్యానమున నిలుచునో, అంతవఱకు ధ్యానముచేసి ఆపిదప సద్గ్రంథ పరనమో, పరోపకార కార్యమో, ఆశ్రమకార్యమో, దైవకార్యమో ఏదోయొక పుణ్యకార్యము నొనర్చుచుండ వలసినదేగాని సోమరిగ కాలము గడుపరాదు ఏలన, మనస్సు మహాచంచలమైనది. ఒక్క నిమిషము దానికి విరామ మిచ్చిన ప్రపంచముపై దుమికి విషయములను చింతన జేయుచుండును, కాన నట్టి చర్యకు గడంగనీయక ఏదోయొక (దైవికమగు) పని దానికొప్పగింపవలెను

491 దేవాలయములలో కార్తిక మాసము మున్నగు పర్వదినములలో అఖండ దీపమును వెలిగించుదురు. అది చల్లారకుండ జాగ్రత్తగ కాపాడు చుందురు అట్లనే ఎపుడో కొంతకాలము కాక నిరంతరము ఆత్మజ్యోతిని హృదయకుహరమున సంస్థాపిత మొనర్చువారే పూర్ణత్వము నొందినవారు ఆజ్యోతిని చల్లారకుండ అహర్నిశములు ధ్యానాదులచే కాపాడుచుండుట ముముక్షువుల కర్తవ్యమై యున్నది

492 రామతీర్థుడు చాల బీదకుటుంబమున జన్మించినవాడు తండ్రి పురోహితుడు, చిన్నకాలమున తాను చదువుకొను సమయములో, ఇంటివద్దనుండి తండ్రి పంపునటువంటి డబ్బులో స్కూలుజీతము, గది అద్దె, పుస్తకముల ఖరీదు, పైఖర్చుఅంతయు పోగా భోజనమునకై తనకెంత మిగులునో యది యొకనా డాతడు లెక్కించి చూచెను. అపుడు రోజునకు ఏ పదిపైసలో మిగిలెను. అదిగాంచి రామతీర్థుడు పరమానంద భరితుడాయెను ఆహా! లోకములో ఒక దమ్మిడియైన దొఱకక, ఒకపూట భోజనమైన సరిగ లేక మలమల మాడుచున్న వారెందఱో గలరు అట్టిచో భగవానుడు నాకు రోజునకు పదిపైసలు భోజనమున కొసంగెను గదా! ఆ పరమేశ్వరుడెంత కరుణామయుడో! నేనెంత భాగ్యవంతుడనో ! అని యానందము పట్టజాలక యొకనాటి రేయి యెలుగుత్తి ఇంగ్లీషు భాషలో ఆయా భావములు వచ్చునట్లు భగవంతుని మహిమను సంస్తుతించుచుండగా ప్రక్కయింటియందున్న ధనికుడు దానిని విని, ఆ భావగాంభీర్యమున కచ్చెరువంది వెంటనే వానిని

సమీపించి యాతని వృత్తాంతమంతయు నరసి, యాతడు విద్యాభ్యాసము చేయునంతకాలమున్ను తన గృహమందే భోజనము చేయ నేర్పాటు గావించెను

లోకములో తమ కెంత యున్నను ఇంకను లేదని విచారపడు వారంద అను రామతీర్థుని ఈ చారిత్రము నుండి పాఠమును గ్రహింపవలసి యుందురు మఱియు తాను ధ్యానాదులు సల్పుకాలములో, ఇంద్రియ నిగ్రహము సాధించు సమయములో ఖడ్గమును తీక్ష్ణముగ నూరి, ప్రక్క నుంచుకొని, ఏ యింద్రియము చలించిన దానిని పొడిచి వేయుటకు నిశ్చయించు కొనినవాడు రామతీర్థుడు అట్టి ధీరత్వము, దృఢవ్రతము గలిగి యుండెను కనుకనే ప్రకృతిని త్రుటిలో హతమార్చి ఆత్మసామ్రాజ్యా భిషిక్తుడు కాగల్గెను!

493 పూర్వమొక గురువువద్ద అనేకమంది శిష్యులుండిరి వారిలో భగవత్తత్త్వము నిజముగ నెఱింగిన వారెవరో చూడదలంచి గురువుగారొక దినమున శిష్యులనందఱిని పిలచి, ఒక్కొక్కరికి ఒక్కొక్క అరటిపండునిచ్చి దీనిని ఎవరును చూడని స్థలములో భుజింపవలెనని చెప్పి అందఱిని పంపి వైచెను అపుడొకరు చెట్టుచాటున దాగి, ఒకరు వస్త్రము ముసుగు పెట్టుకొని, ఒకరు దూరముగ పోయి, ఈ విధముగ నెవరును చూడకుండు నట్లు అందఱును వారివారి ఫలమును తినివైచిరి

కాని ఒక్కడు మాత్రము తినక యుండెను దానిని చేత బట్టుకొనియే మఱునాడు గురువుయొద్దకు తిరిగి వచ్చెను అపుడు గురువందఱిని బిలచి, వారి వారి ఫలముల నేమి చేసితిరని యడుగ ఒకడు తానొక కొండగుహలో తింటిననియు, ఒకడు గదిలో నొంటరిగ తిని వైచితిననియు, ఇట్లందఱున్ను వారు వారు భుజించిన చోట్లను చెప్ప దొడగిరి తుదకు ఫలమును భుజించని ఆ యొక్కనినిగూర్చి తానేల యట్లు గావించితివని యడుగ 'స్వామీ! ఎవరును లేని స్థలము నాకెచటను గన్పించలేదు ఎచట కేగినను భగవంతుడు చరాచర ప్రాణికోట్లయందు వెలుగుచు నాకు ప్రత్యక్షమై యుండ నిక మఱొకరు లేని

తావు నాకెట్లు సంప్రాప్త' మగునని యాతడు బదులు చెప్పెను అపుడు గురువు ఈతడుగదా నిజమైన భక్తుడని తలంచి తక్కిన వారందఱికిని నాభగవత్సర్వ వ్యాపకత్వ తత్త్వమును గూర్చి విశదముగా తెలియబఱచెను.

494 ఒక గురువు తన శిష్యునకు తీవ్రవైరాగ్య లక్షణమును బోధింప నెంచి యొక నది వద్దకు తీసికొనివెళ్లెను నీటిలో వానిని ముంచి కొంతసేపుంచగా నాతడు ఊపిరికై తల్లడిల్లినపుడు పైకి లేవనెత్తి నీటిలో నున్నపుడు తనస్థితి యెట్లుండెను? దేనిని కోరుచుండెను? అని ప్రశ్నింప, ఎపుడు పైకి వత్తుమా యను చింత యొకటి తప్ప వేఱుచింత యెద్దియు లేదని చెప్పెను ఆవిధముగానే ఈ సంసారబంధమునుండి యెప్పుడు విడివడుదు మాయను తీవ్రవేదన యున్నపుడు, ఒక్కనిమిషము భగవంతుని ధ్యానింపక వ్యర్థముగ పోయినపుడు కంటివెంట ధారధారగా నీరుకారునపుడుమాత్రమే పరమార్థచింతనయందు సఫలత చేకూరును తీవ్రవైరాగ్యముయొక్క లక్షణ మిదియే యని వానికి బోధించెను

495 మనమేదేని నొక వస్తువును రుద్రాక్షమాలనో లేక విభూతి పండునో, లేక భగవద్గీతనో యొకచోట నుంచుచు వచ్చి ఒకనాడాస్థానమును మార్చి మఱియొకచోట నుంచినచో, వాటిని తీసికొనుటకు మఱల పూర్వస్థా నమునకే పొరబడిబోవు చుందుము ఇదియే వాసనయొక్క లక్షణము మఱల కొన్నాళ్ల కానూతన స్థానమే యలవడును అట్లే సంస్కారములన్నియు అనేక జన్మలనుండి జీవునియందు బలపడి, బలపడి వచ్చుచున్నవి అవి ఘనా కారమును జెందియున్నవి అట్టి అనాదిసంస్కార ప్రభావముచేతనే దృశ్యవిష యములందు ప్రీతి హెచ్చై, ఆత్మయందు ప్రీతి సన్నగిలినది కాని మఱల గురూపదిష్టమార్గము ననుసరించి ఆత్మయందే దృష్టిని నిలుపుచు రాగా రాగా సంస్కారములు క్రమముగ క్షీణించి ఆత్మస్థితియే దృఢపడి పోవును

496 సమయము రబ్బరు దారమువంటిది. ఎంతలాగిన నంత పెరుగును.

497. ప్రకృతిని భగవంతుడేలసృజించవలెననిన, మనుజుని వికాసము కొఱకేనని వివేకానందులు చెప్పిరి నిజముగా ప్రకృతియే యెన్నియో పాఠములను జీవునకు గఱపుచుండును సృష్టియందలి ఒక్కొక్క వస్తువును గూర్చి బాగుగ విచారించిన ఈశ్వరతత్త్వమంతయు బయల్పడును

498 స్పర్శవేదికను సమీపించినప్పటికి, దానిని స్పృశించనిచో ఇనుము బంగారు గాజాలనట్లు ఆత్మను సమీపించినను, ఆత్మతో నైక్యము నొందనిచో బంధరహితమై జన్మరాహిత్యస్థితి కలుగనేరదు

499 ఇంటియందు సరిగ పథ్యము చేయని రోగులను కొందఱు ఆసుపత్రికి పంపివేయుదురు ఇకనచట వారి యాటలు సాగవు ఆసుపత్రి వారు తమ నియమముల ప్రకారము, కట్టు దిట్టముల ప్రకారమే ఆహారాదుల నట నిచ్చుచుందురు బయటనుండి యేపదార్థములను తెప్పించు కొనుటకు, కొని తినుటకు వలనుపడదు జిహ్వను కట్టివేయవలసివచ్చును కనుక రోగము అచట త్వరలో కుదిరిపోవును అట్లనే గృహమందు ఇంద్రియ నిగ్రహము సాగక, అనేక విషయములపైకి, రుచులపైకి చిత్తము బోవుచు అనుష్ఠానము సరిగ జరుగకున్నట్లైన సుశిక్షణ యొసంగబడు నొక యాశ్రమములో చేరినచో నిక నాయాశ్రమనియమములకు లోబడి యుండవలసి వచ్చునుగాన, నింద్రియములు లెస్సగ నిరోధింపబడ సాధన యందు త్వరలో నారితేర వచ్చును మఱియు సద్గురువుల సహాయమున్ను ఇచట లభించును కాన, మార్గము సరిగ గోచరించి, త్వరితగతిని లక్ష్యమును చేరవచ్చును

500 కొందఱు సాధకులు కొంతవఱకు ధ్యానానుష్ఠానములు సల్పి పూర్ణస్థితి నొందక మునుపే ప్రపంచరంగమున దుమికి, బోధలు చేయప్రారంభింతురు ఆత్మ సాక్షాత్కార మొందిన జీవన్ముక్తులైనచో నిర్లేపస్థితి పొంది యుందురు గాన, ధ్యేయాకారమును మఱవక యుందురు కాన వారెట్టి సంఘమధ్యమున నున్నప్పటికి, ఎంతకాలము బోధించినప్పటికి తమ సహజ పవిత్రతను వీడక యుందురు కాని అట్టి నిస్సంగత్వస్థితి నొందినవారు కూడ వారివలెనే ప్రవర్తించినచో వారిగతి కథయందలి రాజునల్లుని వంటిదే

యగును.

ఒక రాజునకు నలుగురు కొమార్తెలు గలరు వారందఱిని గొప్ప గొప్ప శ్రీమంతులకిచ్చి వివాహముచేసెను ఒకనా డారాజ్యగృహమున నొక గొప్ప విందు జరుగగా, దానికి జామాతలందఱినికూడ రాజు ఆహ్వానించెను కాని వారిలో నొక యల్లుడు శరీరరుగ్మత గల్గి యున్నందున ఔషధము తీసి కొనుచు, పథ్యమాచరించుచుండెను రోగము చాలవఱకు నెమ్మదించెను కాని యింకను పూర్ణారోగ్యము కలుగలేదు ఆతడుకూడ అందఱితో బాటు విందున గూర్చొని, తనకు రోగమని పథ్యమని చెప్పినచో తక్కిన యల్లుళ్లలో తన కగౌరవము గలుగునని తలంచి, యేమియు చెప్పక అందఱివలె తానున్ను విందు భోజన మారగించెను

ఇక మఱునాడు వెంటనే జ్వరము తీవ్రమయ్యెను. దేహబాధ యధికము కాజొచ్చెను శరీరము శుష్కింపసాగెను. మఱల నెంతయో కాలము అనేక ఔషధములను సేవించుచు రాగా రాగా అప్పటి కాజ్వర తీవ్రతతగ్గి, దేహమారోగ్యస్థితికి వచ్చెను మొదటనే యింక కొన్ని దినములు పథ్యముగా నున్నచో ఇంత శ్రమపడ నవసరము లేదుగదా? అట్లనే పైన దెల్పిన సాధువులున్ను అపరిపక్వస్థితిలోనే ప్రపంచ రంగమున జేరి కర్మ బ్రహ్మోభయ భ్రష్టులగుచున్నారు కాన నట్లుచేయక పూర్ణమగు ఇంద్రియని గ్రహము, మనోజయము, ఆత్మసంయమము గలుగునంత వఱకు తన ప్రయత్నమును విడనాడక యేకాంతమున సాధనల జేయుచునే యుండవలెను

501 పూర్వమొకపుడు ఇంద్రియములన్నియు నేను గొప్ప, నేను గొప్పయని పరస్పరము కలహించుకొని తుదకన్నియు బ్రహ్మదేవునివద్దకు వెళ్లిన వట బ్రహ్మదేవుడు మీలో నెవరు లేకున్న జీవుడు బ్రతుకడో వారే గొప్పవారని తీర్పు చెప్పి పంపి వైచెను అపుడు క్రమముగ ఒక్కొక్క ఇంద్రియము ప్రవాసము చేయ నారంభించెను నేత్రేంద్రియము కొంత కాలమెచటికో పోయి ఏకాంతమున వసించెను కాని తిరిగివచ్చి చూచుసరికి

నామనుజాడు జీవించియే యున్నాడు అపుడు కర్ణేంద్రియము ప్రవాసదీక్ష బట్టెను అదిన్ని తిరిగివచ్చి చూడ మనుజాడు యథాప్రకారము బలిష్ఠుడై జీవించియే యున్నాడు ఇట్లు సర్వేంద్రియములు కొంతకొంత కాలమున జీవుని విడిచిపెట్టి పోయినను, నా మనుజానిస్థితి కేహానియు గలుగలేదు తుదకు ముఖ్యప్రాణము విడిచిపోయినపుడు వెంటనే దేహము శైథిల్యము నొంది సర్వేంద్రియములు శుష్కించి దుర్గంధయుతమై అపవిత్రమై మాలిన్యము నొందసాగెను అపుడు తక్కిన ఇంద్రియములన్నియు ప్రాణమునే ముఖ్యముగ పరిగణించినవి ఈ చరిత్ర ఛాందోగ్యోపనిషత్తు నందు గలదు

ఇంద్రియములన్నియు తాము వేఱు, వేఱని తలంచినపుడు మాత్రమే వాటియందు పరస్పర కలహము, విద్వేషము జనించును అన్నియు ఒకే జీవు నియొక్క అంగములనియు, దేనికి బాధ కలిగినను జీవుడే వెతనొందు ననియు, ఏదిలేకున్నను జీవుని పూర్ణ రూపత్వమునకును, లావణ్యమున కును హానిగల్గుననియు నెఱింగియున్నచో, భిన్నత్వమున కవకాశమే యుండదు అట్లనే సర్వజీవులును ఈశ్వరాంశులనియు, ఏ జీవిని బాధించినను, ఈశ్వరుని బాధించినట్లే యగును కాన సర్వుల క్షేమము వాఛించుచు, సర్వజీవరాసులయెడ కరుణ గల్గియుండినచో, ఈశ్వర కృపకు పాత్రుల గుదురనియు నెఱింగినచో నిక సంఘము నందుగాని, సమాజము నందుగాని కలతలు, పరస్పర వైషమ్యములు లేక సమభావము వ్యాపించి లోకమంతయు సోదరభావముతో మెలంగగలదు ఈవిషయమై మఱియొక కథకూడ గలదు

502 ఒక గురువున కిద్దఱు శిష్యులుండిరి వారిలో నొక్కొక్కరు గురువు యొక్క ఒక్కొక్క పాదమును ఒత్తుచు నుండువారు ఒకనాడొక శిష్యుడు తన పాదమును సేవించుచుండగా రెండవపాదము దానికి తగిలిన దను కారణముచే, తానొత్తుచుండిన పాదమును తీసి దానిపై బడ్డవైచెను ఇంతలో రెండవ శిష్యుడు వచ్చి తానుసేవించు పాదముపై బడ్డవైచెను గదా

యను రోషముచే తన యోగదండముచే గురువుగారి మొదటి పాదమునకు బుద్ధి చెప్పెను అదిగాంచి మొదటి వాడు మఱియొక కఱ్ఱచేబూని ఆ రెండవ పాదమును హతమార్చెను

ఇట్లీరువురు కలసి వారివారి కోపములను గురుపాదములపై జూపుచు గురువుగారి పాదముల రెంటిని చితకమోదిరి గురువుగారు కుయ్యో, మొఱ్ఱో యని విలపించుచుండ నొక యాప్తుడు వచ్చి, జరిగిన సమాచార మంతయు తెలిసికొని వీరు సేవించుపాదమైనను, వారు సేవించు పాదమైనను రెండును గురువుగారివే గదా! దేనిని బాధించినను, గురువును బాధించినట్లే గదాయని ఆ మూఢశిష్య లిరువురకు బోధించి గురువును సాంత్వనపఱచి వెడలెను హృదయ వైశాల్యము లేని సంకుచిత భావపరుల యాశయము లున్న ఇవ్విధముననే యుండును మణులందు సూత్రమువలె సర్వాంతర్యామియై విలసిల్లు ఏకత్వమును గుర్తెఱుగ నందుచేతనే జనులందు పరస్పర విభేదము జనించుచున్నది

503 మహాభారత యుద్ధమైన తరువాత పాండవులు సుఖముగా రాజ్యమేలు చుండు తఱి నొకపుడర్జునునకు ఎంతయో ధనము వెచ్చించి ప్రపంచమున నెచటను లేని యొక గొప్ప సభాభవనమును నిర్మింప దలంపు జనించెను శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు గల ఐశ్వర్యమదమత్తత, రాజ్య కాంక్ష తగ్గింపనెంచి యొకనాడు వాని నరణ్యమునకు విహారార్థము గొంపోయెను. అచటనొక మహర్షి యొకచోట ధ్యాననిష్ఠుడై యుండెను. వాని శరీర మంతయు రోమమయమై యుండెను కాని చేతిపై నొకచోట మాత్రము చింత గింజంత స్థలమున రోమము లెవ్వియు లేకుండెను అర్జునుడది గాంచి, అట్లుండుటకు కారణమేమి యని ఆ ఋషీశ్వరుని నడుగ ఆతడిట్లు చెప్పదొ డగెను. ఒక్కొక్క మహాయుగము పూర్తియగునప్పటికి ఒక్కొక్క రోమము నాకు ఊడుచుండును ఇప్పటి కెన్ని రోమము లిట నూడియుండెనో అన్ని మహాయుగములు నాకు గడచినవి ఇంకను నీ దేహమున ఎన్ని రోమములు గలవో, అన్ని మహాయుగములు జీవింతునని వచించెను

నామనుజాడు జీవించియే యున్నాడు అపుడు కర్ణేంద్రియము ప్రవాసదీక్ష బట్టెను అదిన్ని తిరిగివచ్చి చూడ మనుజాడు యధాప్రకారము బలిష్ఠుడై జీవించియే యున్నాడు ఇట్లు సర్వేంద్రియములు కొంతకొంత కాలమున జీవుని విడిచిపెట్టి పోయినను, నా మనుజానిస్థితి కేహానియు గలుగలేదు తుదకు ముఖ్యప్రాణము విడిచిపోయినపుడు వెంటనే దేహము శైధిల్యము నొంది సర్వేంద్రియములు శుష్కించి దుర్గంధయుతమై అపవిత్రమై మాలిన్యము నొందసాగెను అపుడు తక్కిన ఇంద్రియములన్నియు ప్రాణమునే ముఖ్యముగ పరిగణించినవి ఈ చరిత్ర ఛాందోగ్యోపనిషత్తు నందు గలదు

ఇంద్రియములన్నియు తాము వేఱు, వేఱని తలంచినపుడు మాత్రమే వాటియందు పరస్పర కలహము, విద్వేషము జనించును అన్నియు ఒకే జీవు నియొక్క అంగములనియు, దేనికి బాధ కలిగినను జీవుడే వెతనొందు ననియు, ఏదిలేకున్నను జీవుని పూర్ణ రూపత్వమునకును, లావణ్యమున కును హానిగల్గుననియు నెఱింగియున్నచో, భిన్నత్వమున కవకాశమే యుండదు అట్లనే సర్వజీవులును ఈశ్వరాంశులనియు, ఏ జీవిని బాధించినను, ఈశ్వరుని బాధించినట్లే యగును కాన సర్వుల క్షేమము వాఛించుచు, సర్వజీవరాసులయెడ కరుణ గల్గియుండినచో, ఈశ్వర కృపకు పాత్రుల గుదురనియు నెఱింగినచో నిక సంఘము నందుగాని, సమాజము నందుగాని కలతలు, పరస్పర వైషమ్యములు లేక సమభావము వ్యాపించి లోకమంతయు సోదరభావముతో మెలంగగలదు ఈవిషయమై మఱియొక కథకూడ గలదు

502 ఒక గురువున కిద్దఱు శిష్యులుండిరి వారిలో నొక్కొక్కరు గురువు యొక్క ఒక్కొక్క పాదమును ఒత్తుచు నుండువారు ఒకనాడొక శిష్యుడు తన పాదమును సేవించుచుండగా రెండవపాదము దానికి తగిలిన దను కారణముచే, తానొత్తుచుండిన పాదమును తీసి దానిపై బడవైచెను ఇంతలో రెండవ శిష్యుడు వచ్చి తానుసేవించు పాదముపై బడవైచెను గదా

పూజించిన దనిన యుధిష్ఠిరుడు పూజించినదనెను. కాని యొకచోట 108 దళములు మాత్రమున్న చిన్నకుప్ప జూచి ఇది యెవరిదని యడుగ అర్జును నిదనెను. ఇంత కొంత దూరమేగగా నచట నొక గొప్ప పర్వతాకారమైన రాశి కనుపించెను – అదెవరిదనిన ద్రౌపదిదనెను

మఱికొంత దూరమేగి చూడ నచట బ్రహ్మాండమైన రాశియొకటి కనబడెను ఆశ్చర్యముతో నిదెవరిదని యర్జును డడుగ కృష్ణుడు భీముని దనెను. అదియేమి, భీముడెన్నడు నిన్నెక్కువగ పూజించి యుండలేదే, ఇన్నిదళములు అతనిరాశి యందెట్లుండెనన అర్జునా! నీవు బాహ్యపూజయే యెక్కువని తలంచుచున్నావు భీముడు ద్రౌపది మున్నగువారు పరమభక్తితో నన్నంతరంగమున సదా స్మరించుచుందురు. నీవు నాయందు బాహ్య ప్రేమయే యధికముగ గల్గియున్నావని పరమాత్మ వచించెను. అప్పటినుండి యర్జునుడు శ్రీకృష్ణపరమాత్మయెడ తనకుగల యాంతరంగిక భక్తిని నింకను ద్విగుణీకృత మొనర్చెను అందఱికంటెను శ్రీకృష్ణుడు తనకే యధిక ప్రియుడని అర్జునుడు తలంచుచు గర్వించుచున్నందున, నాగర్వమును బోగొట్టదలంచి భగవాను డీయుపాయమును బన్నెను

505. గురునానక్ సమాధి యగుటకు పూర్వము వారిస్థానమందు మఱి యొకరిని ఆశ్రమాధిపతిగ జేయవలసిన సమయ మేతెంచినపుడు, వారి సన్నిహితశిష్యు లందఱును మమ్ములనే, యాస్థానమున నియమించెదరని తలంచుచుండిరి. ఇంతలో గురునానక్ పూర్వాశ్రమ సంబంధీకులు గురు నానక్ కుమారుని వెంటబెట్టుకొని వచ్చి వానికే యా వారసత్వమిప్పించవలెనని కోరిరి అపుడు నానక్, దేహసంబంధమైన సొత్తునకే యాతడు వారసుడు గాని, ఆత్మ సంబంధమైన దానికి కాడని చెప్పి, తన శిష్యులలోకూడ నెవరిని నెచ్చోట స్థాపింపక, యొక ఆగంతుకుడైన పరమభక్తునకే యాస్థాన మొసంగెను. ఎవరు నిర్మలమైన భక్తిగలిగి, అనవరతము దైవచింతన గల్గియుందురో వారే దైవము సొత్తునకు అధికారులు క్రీస్తు చరిత్రమున గూడి నిట్టి యుదం తమే కానుపించుచున్నది

506. క్రీస్తువు తనయాశ్రమమున కధిపతిని నిర్ణయింప నిశ్చయించు కొనిన దినమున ఆయాశ్రమమునకు జెందిన అనేక పండితులు, మత బోధకులు శ్రీమంతులునగు శిష్యులు విచ్చేసియుండిరి వారి ఆశ్రమములో నెల్లప్పుడు అతిధి అభ్యాగతుల సత్కరించి, వారికి భోజనాది సౌకర్యముల నొనగూర్చుచు ఆశ్రమ ఆవరణమంతయు శుభ్ర పఱచుచుండునట్టి యొక్క భక్తుడు కలడు అతనికి విద్య యెక్కువ లేకున్నను పరమభక్తుడై యుండెడు వాడు ఆతడున్ను అచ్చోట కరుదెంచెను అపుడు క్రీస్తువు అచటికేతెంచిన ప్రజలందఱిని సంబోధించి ఆశ్రమసంబంధ ఉపకారము ఎక్కువగ చేయు వానినే గదా ఆశ్రమమునకు మిన్నయని దలంపవలసినది అట్టిచో, మీరి యాశ్రమమునకు వచ్చుట తోడనే ప్రతిదినము మిమ్ముల గౌరవించి, భోజనాదులొసంగి సత్కారము చేయువారెవరని ప్రశ్నింపగా, అందఱును ఆ భక్తునే జూపిరి. అపుడు ఎందఱో విద్వాంసులు, ధర్మబోధకులు శ్రీమంతులు అచట నున్నప్పటికిని, క్రీస్తువు వానినే ఆశ్రమాధిపతిగ జేసిరి. ఎవరు నిర్మలభక్తితో, అంతరంగ విశ్వాసము గల్గి సర్వుల నాదరించుచుందురో వారే భగవంతునికి ప్రియు లగుదురని అచటనున్న అందఱకును అపుడు తేటతెల్లముగ బోధపరచిరి

507 ఒకపుడు క్రీస్తువు భక్తులందఱకును ధర్మమును బోధించు చున్నపుడు వానితల్లి సోదరులు అచటి కేతెంచిరి అపుడచటనున్న వారు క్రీస్తువుతో మీదేహసంబంధులు మిమ్ముల దర్శింప నేగుదెంచిరన, క్రీస్తువు పెడముఖము ద్రిప్పి, యెవరు భగవంతుని సేవింపరో వారు తన సంబంధులు కారనియు, సత్యము ననుసరించువారే తండ్రి యనియు, దైవధర్మమును పాలించువారే తల్లి యనియు చెప్పి, తన బోధన యధారీతి కొనసాగించెను

508. ఒకనాడు క్రీస్తువు అనేకమంది భక్తులతో ఒకయెడారి ప్రదేశమున ప్రయాణము చేయుచుండెను. మార్గమధ్యమున వారి భోజన పదార్థములన్నియు అయిపోయెను రెండు మూడు రొట్టెలు కొన్ని ఇతర పదార్థ ములు మాత్రమే యుండెను. కాని వెంట ఎన్నివేల మందో జనులు

గలరు అది గాంచి శిష్యులలో కొందఱు క్రీస్తువు వద్దకుబోయి స్వామీ! నేడు భోజనమున కేమియును లేదు వెంటననేకు లున్నారని చెప్పగా, ఆ చింతన యేమియు వలదు ఉన్న దేమియో నావద్దకు దీసికొని రమ్మని చెప్పి పంపెను వారట్లే పోయి తమ యొద్దనున్న రెండు మూడురొట్టెలు ఆ యితర పదార్థమును తెచ్చి యిచ్చిరి

క్రీస్తువపుడు వచ్చినవారి నెల్ల భోజనమునకు కూర్చుండ జేయుమని చెప్పి ఆరొట్టెలను ముక్కలు ముక్కలుగా జేసి యటనుంచి అందఱకును వడ్డించుడని శిష్యులకు జెప్పెను వారట్లే చేయగా, అందఱకును సరిపోయి యింకను రెండు మూడు గంపలు మిగిలియుండెను అపుడు క్రీస్తువు శిష్యులను బిలిచి ''అవిశ్వాసులారా! మీకు ఈశ్వరునియందు నమ్మకము లేదు ఒక రోమములోని సహస్ర భాగమునకు సమమైన పుణ్యముగూడ లేక జన్మించి నట్టి పశుపక్షి మృగాదుల కన్నింటికిని గూడ భగవంతుడు అన్న మును ప్రసాదించుచుండగా, శరీరమందెన్ని రోమము లుండునో అన్ని రోమ ములకు సమమైన పుణ్యముతో జన్మించినట్టి మానవునకు ప్రసాదింప కుండునా? భగవంతుని యందనన్యభక్తి అచంచలమైన విశ్వాసము కలిగి యుండి సమస్తము వానికే యర్పణచేసి పరప్రాణి కుపకారార్థము జీవించు చున్నచో ఆదయామయుడు వారి యోగక్షేమములను విచారింపకుండునా? కాన ని ర్మల భక్తితో జీవింపుడని బోధించెను

509 మహమ్మదునబిగారు జీవించియున్న కాలముననే వారి కనేకమంది భక్తులుండెడివారు ఆ భక్తులపుడపుడు వారి సన్నిధి కేగి బోధలను విను చుండెడివారు వారిలో నొక గొప్ప ధనికుడుండెను ఆతని కొక విశాలమైన ఏపిల్ తోట గలదు అందొక ప్రక్కనొక కుటీరమువేసికొని యాతడు ధ్యానము చేయుచుండువాడు మహమ్మదు మతమున కాతడు చాలసహాయము చేసినవాడగుటచే, మహమ్మదు వాని యిష్టప్రకార మాతోట యందు కొన్ని దినములు వసించుట కియ్యకొనెను

ఒకనాడాధనికుడు తన కుటీరము బయట గూర్చుండి ధ్యానము

చేయుటకు ప్రారంభించుచుండగా, అతని యెదుట నొక వృక్షముపై బాగుగ తయారైన ఏపిల్ పండ్లను ఉడుతలు తినుచుండుటను గాంచెను లేచి తోలుదమా, ధ్యానము భంగమగునేమో, ధ్యానించుచునే యుందుమా, అయ్యో! అంత మంచి పండ్లను ఉడుతలు కొఱికి వేయుచుండగా చూచి యూరకొనుటయా,– అను నీవితర్కమునబడి అపుడపుడు కనులు తెఱచి ఉడుతలు పోయినవో లేవో చూచుచు మఱల కనులు మూసికొని ధ్యానించుచు ఇవ్విధమున నుండెను నేత్రములు మూసికొనినను పోయిన ఉడుతలు మఱల వచ్చునేమో యను భీతిచే వాని ధ్యానము సరిగ సాగలేదు.

అయినను, ధ్యానము సమాప్తియైన పిదప, ప్రతిదినమువలె, యథారీతి ఆతడు మహమ్మదు వద్దకు ప్రణామము సల్పుటకై పోయెను కాని, అంతకు మునుపు ప్రతిదినము మహమ్మదు ఆతడు వచ్చుటతోడనే కుశల ప్రశ్నలడిగి, ఆదరమున సంభాషించుచు, ధర్మమును బోధించువాడు నాడాతడు జనునప్పటికి వెంటనే ముఖము వెనుకకు ద్రిప్పెను (విముఖతను చూపెను) తానేమియు తప్పిదము చేసియుండ లేదే, ధ్యానము చేయుటయు మఱువలేదే, ఏల తామట్లు ఉపేక్షాభావము వహించితిరని వినయపూర్వక ముగ వ్యాకుల హృదయుడై యాతడు గురుదేవుని ప్రార్థింప నాడాతడు దేవుని ధ్యానింపలేదనియు, ఉడుతలనే ధ్యానించెననియు వానికి దేవుడు గొప్పకాదు,చెట్ల ఫలములే గొప్పవనియు మహమ్మదు చెప్పెను అది విని యా ధనికుడు తన తప్పిదమును గ్రహించి ఆ దినమే కొన్ని వేలమంది పనివాండ్రచే ఆ చెట్లన్నియు కొట్టించి వైచి, భోజనము చేసి తదుపరి నిశ్చలముగ ధ్యానము చేయసాగెను

కాన, ధ్యానకాలమున నితర చింతనలెవ్వియు లేకుండునట్లు ప్రయత్నించుచు, అట్టి చింతన లేవేని గలిగిన, అవి యుద్భవించుటకు కారణములను గనుగొని, వెంటనే వాటిని నివారించి, తదుపరి ధ్యానమున కుపక్రమించినచో ఏ యాటంకమును లేక నిష్టకొనసాగును.

510 పూర్వమరబ్బీదేశమున నిరువురు భక్తులు నివసించుచుండిరి దేవునకు ప్రీతికరమైన కార్యమేదియై యుండునని వారిరువురు తమలో

తాము ఆలోచించుకొని వారివారి ఆంతరంగిక సహజస్వభావానుసారము ఒకడు నిరంతర ధ్యాననిష్ఠుడయ్యు మఱియొకడు సదా లోకోపకార కార్యముల జేపట్టియు నుండెను ఇట్లు కొంతకాలము గడువగా ఒక దినమున ఆధ్యాన శీలునకు స్వప్నమున నొక దేవదూత యగుపించెను వాని యెడమచంక యందొక పుస్తక ముండెను తానెవరని ఆ భక్తుడు ప్రశ్నింప, దేవుని దూతననియు, ఆగ్రంథమేమన యడుగ, భగవంతుని సేవకుల నామములను తాను లిఖించునట్టిదనియు వచించెను అంత నాభక్తుడు అత్యాతురతో తన పేరు అందుండునాయని చూడమనిన, నాదేవదూత అందులకై గ్రంథమును వెతకి చూడ ప్రప్రథముననే వాని నామమందు లిఖింపబడియుండెను అది గాంచి యాభక్తుడు భగవత్సేవకులతో తానగ్ర గణ్యుడుగ నెన్నబడినందులకు కడు మోదంబందెను

తన మిత్రుని పేరు అందుండెనో చూడుమనిన, అతడట్లే వెతకి చూడ నెచటను వానినామమం దగుపింపలేదు ఈ విషయము మఱు నాడాతడు తన మిత్రుని కెఱింగించెను అది విని యాతడు తాను చేయు కార్యము భగవత్ప్రీతికరము కాకపోయెనే యని మిగుల దుఃఖాక్రాంతు డయ్యెను. నాటిదినము స్వప్నమున ఆ రెండవ భక్తునకు మఱియొక దేవదూత యగు పించెను.వాని కుడి కక్ష్యమున వేఱొక పుస్తకముండి యుండెను తానెవరని యడుగ దేవుని దూతననియు, ఆ పుస్తకమేమనిన భగవంతుడెవరి సేవకుడో వారి నామములన్నియు తాను లిఖించునట్టి గ్రంథమనియు నుడివెను. అపుడాభక్తుడు తన పేరు అందుండునా యని చూడుమనిన, నాతడట్లే చేయ, మొదటనే గానుపించెను తనమిత్రుని పేరు ఉన్నదో చూడుమన నెచటను గన్పింపకుండెను. ఈ సంగతి యంతయు ఆ రెండవ భక్తుడు మఱునాడు తన మిత్రుడగు ప్రథమ భక్తునకెఱింగింప, అంత నాతడు– సర్వజీవరాసులయందును భగవత్స్వరూపమును గాంచి, పరప్రాణి కుపకార మొనర్చుటయే నిజమగు ధ్యానమనియు, అట్టివాడే భగవంతున కెక్కువ ప్రీతి పాత్రుడనియు బాగుగ గ్రహింపగల్గెను

511 ఒక రాజునకు నేత్రవ్యాధి రాగా, వైద్యులతో సంప్రదించి నపుడు, దానికి వేఱేమందు ఏమియు అవసరము లేదనియు, పచ్చని

వస్తువులను మాత్రము చూచుచుండిన చాలుననియు వచించిరి. అపుడాతడు తన రాజ సౌధమున నున్న వస్తువులన్నిటికిని పచ్చని రంగు వేయించెను అట్లు వేయించినను, మఱల నెవరినైన చూచినపుడుగాని, క్రొత్తవారితో మాట్లాడు నపుడుగాని, బయట నెపుడైన తెలుపు వస్తువును గాంచినపుడుగాని కన్ను పోటు పుట్టుచుండెను అందుచే నాతడు కొన్నివేల రూప్యములు వెచ్చించి, రంగు తెప్పించి, ఆ యూరంతయు పచ్చనిరంగు వేయించెను

ఇంతలో వాని గురువు ఆ రాజధానికి వచ్చిచూడ ఎచటగాంచినను పచ్చని గోడలే, పచ్చని వస్తువులే ఏల యట్లు చేసితిరని రాజాను ప్రశ్నింప, కారణ మంతయు నాతడు సవిస్తరముగ జెప్పెను అపుడు గురువు ఏల వ్యర్థముగ ఇంత వ్యయము జేసితిరి! ఒక పచ్చని కంటిజోడు తొడుగుకొనిన చాలదా! ఇల్లేల? ఊరేల, ప్రపంచమంతయు పచ్చగ నగపడునే! యని హితోపదేశముజేసి, వెంటనే యొకనికి నాలుగణాలిచ్చి జోడు తెప్పించి రాజాన కొసంగెను రాజా తన బుద్ధిహీనతకు నొచ్చుకొనెను

అవ్విధముగనే ప్రారంభకాలములో కొందఱు వైరాగ్యమును జేపట్టు నపుడు, ఏ వస్తువును చూడగూడదు తాక గూడదు, తినగూడదు అని నిషేధించుచుందురు అట్టివారు ఊరంతయు రంగువేయువారు మఱికొందఱు అభ్యాస పరిపక్వత గలవారు ఇంద్రియ మనోనిగ్రహములు సిద్ధింపజేసికొనినందున దృశ్యవస్తువుల వలన నేబాధయు పొందకుందురు వీరు రంగు అద్దములు పెట్టుకొనినవారు మొదటివారు ప్రపంచములోని ముండ్లన్నియు నేరివేయదలంచువారి చందనమున నుందురు రెండవవారు చెప్పులు తొడుగుకొనిన వారి బోలుదురు దృష్టిని విశుద్ధమొనర్చుకొనిన ప్రపంచమంతయు విశుద్ధముగనే గన్పట్టును మఱియు ఆత్మదృష్టితో గాంచిన అంతయు ఆత్మమయముగనే కానుపించును అపుడు దేనిని జూచియు భయపడి పారి పోనక్కఱలేదు అంతయు ఏకరూపమై దైవమయమై కనుపించును వీరిది భావవైరాగ్యము మొదటివారిది వస్తువైరాగ్యము భావవైరాగ్యమే యుత్తమ మైనది అయితే, ప్రారంభములో వస్తు వైరాగ్య ముండవలసినదే అది లేనిచో భావవైరాగ్యము సిద్ధింపదు

వస్తువైరాగ్యము మసిబొగ్గువంటిది భావవైరాగ్యము తెల్లని బూడిద వంటిది మసిబొగ్గునందు కాష్ఠరూపత్వము లేకున్నను మసి మాత్రముండును తాకినచో నలుపు అంటుకొనును అట్లే వస్తువైరాగ్యము విషయ దోషము లేనిదైనను ప్రమాదముతో గూడియుండును ఏమాత్రము అజాగ్రత్త గలి గినను, వైరాగ్యము సన్నగిలినను పతనము సంభవించును భస్మము తెల్లగ నుండి యొడలంతయు బూసికొనుటకును వీలుపడునట్లు, భావవైరాగ్యము నిష్కళంకమై, ప్రమాదరహితమై, ఆశ్రమయోగ్యమై యుండును అయితే మసిబొగ్గు బాగుగ కాలినచో దాని యందలి కాలిమత్వ మంతయు నంతరించి తెల్లని భస్మముగ పరిణత మగునటుల వస్తువైరాగ్యమే దృఢపడిన కొలది క్రమశః భావవైరాగ్యముగ పరిణామ మొందునని యెఱుంగునది.

512. హృదయ పారిశుద్ధ్యము లేక 'శివోఽహం, శివోఽహం' అని ముచ్చరించువారికంటె,హృదయశుద్ధత గలిగి 'దాసోఽహం దాసోఽహం' అని ఉచ్చరించువారు శ్రేష్ఠులు మొదటివారు కపటయుతులు, రెండవ వారు నిష్కపటులు

ఓమ్ తత్ సత్

సమాప్తము

# సాంఖ్యయోగము

## పీఠిక

**గురుర్బ్రహ్మా గురుర్విష్ణుర్గురుర్దేవో మహేశ్వరః ।**
**గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః ॥**

గురుడే బ్రహ్మయు, విష్ణువును, ఈశ్వరుడును సాక్షాత్పరమేశ్వరుడును గావున నట్టి గురునికొఱకు నమస్కరించుచున్నాను.

**సత్సంగాద్భువ నిస్పృహో గురుముఖాచ్ఛ్రీశం ప్రపద్యాత్మవాన్**
**ప్రారబ్ధం పరిభుజ్య కర్మశకలం ప్రక్షీణకర్మాంతరః ।**
**న్యాసాదేవ నిరంకుశేశ్వరదయా నిర్లూనమాయాన్వయో**
**హార్దానుగ్రహలబ్ధమధ్యధమనిద్వారాద్బహిర్నిర్గతః ॥**

**ముక్తోఽర్చిర్దిన పూర్వపక్ష షడుదఙ్మాసాబ్దవాతాంశుమ**
**ద్గ్లౌవిద్యుద్వరుణేంద్ర ధాతృమహితస్సీమాంత సింధ్వాప్లుతః ।**
**శ్రీవైకుంఠముపేత్య నిత్యమజడం తస్మిన్పరబ్రహ్మణ**
**స్సాయుజ్యం సమవాప్య నందతి సమం తేనైవ ధన్యః పుమాన్ ॥**

లోకములో మానవుడు సజ్జనసాంగత్యమువలన సంసారవాంఛను వీడి, పిమ్మట గురుకటాక్షముచే శ్రీమన్నారాయణుని శరణుజొచ్చి యాత్మజ్ఞానము కలవాడై ప్రారబ్ధంబను పేరుగల కర్మలేశము ననుభవించి కర్మరహితుడై, సర్వసంగ పరిత్యాగమువలన నిరంకుశ స్వతంత్రుడగు పరమేశ్వర దయ యుదయింపగా నందుచే మాయాస్వరూపమైన వంశమును ఛేదించి, మనోరంజకమైన యీశ్వరానుగ్రహముచే లబ్ధంబగు సుషుమ్నా నాడీ ద్వారము నుండి బయటికి వెడలి, ముక్తుడై, అతివాహికులగు (ముక్తులను వైకుంఠము నొందించువారు) నర్చిరాదులచే బూజింపబడి, వైకుంఠమునకు బొలిమేరలో నున్న విరజా(దోషరహితమైన) నదిలో స్నానము చేసి, నిత్యమై స్వయంప్రకాశమై యుండు వైకుంఠమును జేరి, యందు విష్ణుసాయుజ్యము

నొంది కృతార్థుడై, యా శ్రీమన్నారాయణునితో గూడి యానందించు చుండును

శ్రీకాశీతుల్యంబును, అఖండగౌతమీతీరస్థంబును, అనాది సుప్రసిద్ధంబును, కోటిలింగ మహాక్షేత్రయుతంబును, రాజరాజ నరేంద్రాది మహారథులచే బరిపాలింపబడినదియు నగు రాజమహేంద్ర వరపురంబు వేదవేదాంగాది సకలవిద్యా పారంగతులైన మహావిద్వజ్జనులతో నలరారుచుండె

అట్టి పురంబున నతిశోభాయమానంబును, సారంగధరునిమెట్ట కనతి దూరస్థంబును, భక్తాగ్రేసరుండగు నెడ్లరామదాసుగారి మఠంబునొద్ద స్త్రీ పురుషులకు ప్రత్యేక ప్రత్యేకోపన్యాస మంటపములు వేరువేర వాస యోగ్యములై యతిసౌఖ్యదాయకములగు వాసగృహములు, వర్ణాశ్రమ ధర్మానుకూలమైన భోజనవసతులు, స్నానపానాదుల కతిసులభసాధ్యమగు యంత్రధారలు, మొదలగు నానావిధ సదుపాయములతో గూడిన పందిళ్లు, మహాత్యాగశీలురాలగు గొల్ల కామమ్మచే వంపబడినవి ఇట్టి త్యాగమునకు హేతువు శ్రీమలయాళస్వాములవారి కరుణాకటాక్షమే

దివ్యజ్ఞాన సంపన్నులతో నలరారు నీ సభనుగూర్చి యల్పజ్ఞుడనగు నేను వర్ణించుట కెంతటివాడను. అయినను గురుకటాక్షంబున నాకుండు నల్పజ్ఞానంబున నాకు దోచిన విషయములను వివరించెద

**గుణదోషౌ బుధో గృహ్ణన్నిందుక్ష్వేడావివేశ్వరః ।**

**శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి ।।**

అను నార్యోక్తి చొప్పున గుణగ్రహణపారీణులగువారు గుణములనే గ్రహించి యవగుణములను గంఠస్థముగ జేయుదురుగాక!

ప్రజలలోపములు సవరణ జేయుటకును, భక్తిజ్ఞాన వైరాగ్యముల నభివృద్ధి నొందించుటకును, కృతయుగము నాటినుండియును లోకోపకారపరాయ ణులును, దివ్యజ్ఞాన సంపన్నులునగు మహర్షులు శ్రుతి స్మృతి

పురాణేతిహా సములలో నతిగూఢముగా నున్న ముఖ్యాంశములను దీసి సభాముఖమున వెలువరించుచుండిరను సంగతి యందఱకు దెలిసిన విషయమే గాన నట్లనే కృత, త్రేతా, ద్వాపర, కలి - యను నాల్గు యుగంబులును ప్రత్యేకముగ నాలుగేసి పాదములు కలిగియుండుటయు నట్టి నాల్గుపాదములు వేర్వేర క్రమముగా చతుర్యుగధర్మములును గలిగియుండుటం బట్టియు ప్రస్తుత కలియుగ ప్రధమపాదమందు గృతయుధర్మము లీసనాతధర్మ సభారూపమున మూర్తీభవించినవా యనునట్లొప్పారుచుండె

పైనుదాహరించిన విషయములను గూర్చి వ్యాసాశ్రమ స్థాపకులును, విజ్ఞాన మూర్తులునగు శ్రీమలయాళస్వాములవారి ముఖ్యోద్దేశ్యమేమన వారి శిష్యకోటియును మఱియు భక్తాగ్రేసరులును నందఱు నేక కాలమున సమావేశమై యానందించుటయే

రాజమహేంద్రవరపురంబున జరిగిన యైదవసనాతన ధర్మసభకు శ్రీమల యాళస్వాములవారును, వారి శిష్యవర్గమును, వీరభద్రపురంబున నున్న సాధు వమ్మగారును, నామె శిష్యురాండ్రును నింకను మఱికొంతమంది భక్తసంఘ ములును భజనలను జేయుచు వేలకొలది విచ్చేసిరి. ఇట్టి మహాసభకు బ్రస్తుతము శాంత్యాశ్రమాధిపతులగు శ్రీరాజేశ్వరానంద స్వాముల వారగ్రాసనాధిపత్యమును వహించిరి

ఇదంతయు జూచి పరాత్పరుడే శ్రీమలయాళస్వాములవారి రూపమున నిచ్చటికి విచ్చేసి యజ్ఞానాంధకార మగ్నులమై యున్న మనకు సుజ్ఞాన దీపము నీయవచ్చెనా యనుకొనుచు జను లానందాబ్ధి నోలలాడిరి.

ఈ సభకు పెక్కుజిల్లాలనుండి వచ్చినట్టి బహువిద్యాసంపన్నులును, అపు రంబున నున్న కవిరాజసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, మహా రాజశ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారు, చిత్రపు వెంకటా చలంపంతులు గారు మున్నగు ప్రముఖులు పెక్కుమంది దయచేసిరి

విద్యాధికురాండ్రగు స్త్రీరత్నములు పెక్కుచోట్లనుండియు, నాపురంబున నుండియు విచ్చేసి ప్రత్యేక స్త్రీ సభలలో గొంతమంది యుపన్యసించిరి వారిలో శ్రీమతి నంది వాడ శేషమాంబగారు పద్యరూపముగాను, వాగ్రూపముగాను శ్రీమలయాళ స్వాములవారిని గూర్చి యతిగంభీరము గాను, సభారంజకముగాను మహా సభలో నుడివిన వాక్యములు మిక్కిలి శ్లాఘనీయములుగా నున్నవి. ఆ సమయమున చూచేవారికి భక్తిజ్ఞాన వైరాగ్యము లీసభారూపమున వెలు గొందినవా? యని పొడగట్టుచుండెడివి సభాంతమున శ్రీ ప్రెసిడెంటుగారు కలికల్మషనాశనమైన

**హరే రామ హరే రామ రామ రామ హరే హరే ।**

**హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే ॥**

అను శ్లోకమును సభ్యులందరితో బఠింపించి యత్యానందముతో జయప్రదముగా సభను బూర్తిచేసిరి

సభా ప్రారంభ దినమునుండియు మూడు రోజులు నన్నప్రదానము జయప్రదముగా జరుపబడెను.

ఇట్లు మహాసభా స్థలియందు శ్రీస్వాములవా రుపన్యసించిన సాంఖ్యయోగము అను నుపన్యాసమును సర్వజనోపయోగార్థ మచ్చొత్తించి ప్రచురపరచుటకై వారి కరుణాకటాక్షమును నాయెడ బ్రసరింపజేసి నాకొసగినందులకు వారియెడ నేనెంతయు గృతజ్ఞుడను

**మంగళం గురుదేవాయ మహనీయగుణాత్మనే ।**

**సర్వలోకశరణ్యాయ సాధురూపాయ మంగళమ్ ॥**

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

**ఇట్లు బుధజనవిధేయుడు**

**కొత్త వెంకటరత్నము.**

ఓం

# సాంఖ్యయోగము★

**సత్యమేవేశ్వరో లోకే సత్యే ధర్మస్సదాశ్రితః ।**

**సత్యమూలాని సర్వాణి సత్యాన్నాస్తి వరం పదమ్ ॥**

ఓం శ్రీ కపిలమహాత్మనే నమః ॥

సాంఖ్యయోగమును పంచీకరణమని గూడ చెప్పు వాడుక గలదు ఈ సాంఖ్యముయొక్క మూలపురుషుడు శ్రీ కపిలమహర్షి. ఈ మహాత్ముడు నిరీశ్వర సాంఖ్యుడు. ఈ పరమపురుషుని తత్త్వమున బ్రకృతికే ప్రధానమను నామ మియ్యబడెను ''ప్రధానమే జగత్కారణము మరియొకరి యవసరము లేకయే యీ జగజ్జాలము జరుగుచుండు'' నని యీాయన బోధించెను అయితే సత్యము, ధర్మము, తపస్సు, దయ, శాంతము, కరుణ మొదలుగా గల దైవిక గుణములు ఎక్కువగ నుండవలయునని యెల్లప్పుడును శ్రీబుద్ధదేవునివలె బోధించుచుండెడివాడు సాంఖ్యమనగా సంఖ్యలచే లెక్కపెట్టి చెప్పదగినది అని అర్థము గనుక ఈతత్త్వమునకు సాంఖ్యమని పేరు వచ్చినది ఈమునీశ్వరుడుగూడ శ్రీమన్నారాయణుని చతుర్వింశతి ముఖ్యావతారములలో నొక్కడుగా శ్రీమద్భాగవతములో బేర్కొని యున్నారు ''సిద్ధానాం కపిలో మునిః'' అని శ్రీకృష్ణభగవానుడు గీతలో గూడ సెలవిచ్చియున్నాడు అనగా సిద్ధపురుషులలో శ్రీకపిలముని భగవదవ తారమని యర్థము ఈ సాంఖ్యము గాక సేశ్వరసాంఖ్య మింకొకటి గలదు దీనికి మూలపురుషుండు శ్రీపతంజలి మహర్షి వీరే యతి పురాతనమును, యోగశాస్త్రము లన్నిటికిని మూలమును నగు పాతంజల యోగసూత్ర మును రచించినవారు.

---

★ రాజమండ్రిలో సనాతన ధర్మ సభా పంచమ వార్షికోత్సవ మహాసభ (1931) లో శ్రీసద్గురు స్వాములవారి ఉపన్యాసము

ఇప్పుడు లోకములో గల మహాత్ము లందఱును, పూర్విక మతాచార్యు లగు శ్రీశంకర, శ్రీరామానుజ, శ్రీమధ్వ, శ్రీకృష్ణచైతన్య, శ్రీవల్లభా చార్యులు మున్నగు మహాపురుషు లందఱును ఈ సాంఖ్యమునే సాంఖ్యమని యొప్పుకొనుచున్నారు దీనిని బంచీకరణమని మనము గ్రహించవగును ఇది ముఖ్యముగా ముముక్షువు లందరును తెలిసికొనదగినది లేనిచో వస్తుతత్త్వజ్ఞానము నిస్సంశయముగా నెరుంగరాదు కావుననే ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత మతసంప్రదాయముల వారందరును దీనిని గ్రహించవలయునని శాసించిరి పంచీకరణముచేత ననగా నపంచీకృతములగు సూక్ష్మభూత ములను భాగానుక్రమముగా గలుపుటచేత మాత్రమే యీ జగత్తున జతుర్విధప్రాణికోట్లకు దగిన స్థూల సూక్ష్మ కారణ శరీరోపాధులును నేర్పడగలవు ఈ కారణమువల్ల సేశ్వర సాంఖ్యులు ప్రకృతిని అనగా బ్రధానమును, బ్రేరేపించు పురుషుడొక్క డుండియే తీరవలెను అని సిద్ధాంతీకరించిరి అందుచే వారివాదము నాస్తికము కాదు వారు దానిని ఆస్తికమని రూఢీకరించిరి

ఈ నాస్తిక, ఆస్తిక భాగములు ప్రస్తుతము మనకు చర్చనీయములు కాని విషయము లగుటచే వదలి వేసి చర్చనీయవిషయమగు సేశ్వరసాంఖ్యము నవలంబించెదము వేఱువేఱుగా స్థూల, సూక్ష్మ వస్తువులను గణించి సంఖ్య యేర్పరచినందుచే సాంఖ్యశబ్దము వచ్చినదని ముందే చెప్పబడియున్నది గదా! అయితే ‘‘సాక్షరా విపరీతాశ్చేత్ రాక్షసాః పరికీర్తితాః’’ – అను న్యాయమునకు అక్షర జ్ఞానము విపరీతమైనచో రాక్షసత్వము గలుగునని భావము. ‘సాక్షరా’ అను పదమును త్రిప్పి చదివిన ‘రాక్షసా’ అగును గదా! అదే ప్రకారము ప్రస్తుతము కొందఱి సాంఖ్యము రాక్షసత్వము నొందినది. సాంఖ్య విచారణచేసి యిరువదినాలుగు తత్త్వములును అనాత్మస్వరూపము లనియు, వీనికి విలక్షణుండై సాక్షియై, జడములైన యీ తత్త్వములను ప్రకాశింపజేయు కారణమునై యుండుటచే ప్రత్యగాత్మ వేరనియు, అది అప్రాకృతమనియు తెలిసికొనుటయే దీనియొక్క ముఖ్యోద్దేశము.

సరే, ఇది తెలిసినచో గలిగెడు లాభమేమి? అని ప్రశ్నించు అభిలాష అందరికిని కలుగును లాభమేమన? నరుడు పంచభూతములతో నేర్పడిన మూడు దేహములును, వానిగుణములును తనకు సంబంధించినవి కావనియు, తాను నిత్య, శుద్ధ, స్వయంప్రకాశ, జ్ఞానస్వరూపుడ ననియు గ్రహించి నిత్యశాంతియు, కైవల్యము నొంది సుఖించవచ్చును అనాదికర్మ వాసన చేతను, అనిర్వచనీయ మాయాశక్తిచేతను, ఆత్మ నాత్మతో గలిసి యుండుటచే అనాత్మగుణము లన్నియు ఆత్మ అగుణములై కనిపించుటయే బంధమనబడును. ఇదే అజ్ఞానమనియు, మాయ యనియు, కర్మ యనియు, సంసారపాశబంధమనియు మహర్షులు చెప్పుదురు అట్టి దానినుండి విముక్తి బడయుటయే మోక్షమని సత్పురుషుల మతము.

పైజెప్పిన చతుర్వింశతి(24) తత్త్వములును, వాని గుణములున్ను తమ యందు రహితము చేసికొనుటయే ముముక్షువుల కర్తవ్యము. ఇట్టి విషయ మును మఱచిపోయి గుణములతో గూడియుండియు, గుణానుభవముల ననుభవించుచు, సుఖదుఃఖములను బెంపొందించుకొనుచు సుఖములను ఆశించుచు దుఃఖములను తొలగింపజూచినను తొలగించుకొన జాలక దుఃఖించుచు విషప్రాయమగు విషయానుభవములో మునుగుచు, తేలుచు మోహాంధ తమస్సులో నుండియు తాను నిస్సంగుడననియు, నిర్మలు డననియు చెప్పువారి సంఖ్య పెరిగిపోయినందుచే వివేకబుద్ధియు, విద్యా విశాలతయును, గౌరవమును గల గృహస్థులలో కొందఱు బ్రహ్మవిద్య యొక్క మహి మను తెలిసికొనజాలక యున్నారు అంతేగాక బ్రహ్మవిద్య యందును బ్రహ్మ నిష్ఠులయందును గూడ జనులకు నలక్ష్యభావము కలుగుచున్నది. ఇది వారి తప్పు కాదు. బ్రహ్మనిష్ఠామార్గస్థులలోగల కొందఱి లోపమే యగును.

కావున ఇట్టి లోపమగు కళంకమును భారతఖండము నుండి పారద్రోలిననే భరత ఖండ మున్నతస్థితికి రాగలుగును. అప్పుడు మాత్రమే విద్యయు, వివేక బుద్ధియు, ఆత్మగౌరవమును గల జను లీపరమపావనమగు

బ్రహ్మనిష్ఠా మార్గములో బ్రవేశించి ధన్యాత్ములు కాగలుగుదురు ఇతరులను ధన్యులనుగా జేయుటకును బ్రయత్నించెదరు. అప్పుడు మాత్రమే సహస్రముఖములతో జనులను పీల్చి పిప్పిచేయుచుండు దారిద్ర్యమనెడు బ్రహ్మరక్షస్సును కోట్లకొలది భయంకరములగు విషజ్వాలల గ్రక్కుచు, కాళరాత్రివలె భీకరముఖములతో లోకమంతయు హాహాధ్వని చేయుచు వివేక వంతులనుగూడ నమలివేయుచు, కరుణ, శాంతము, వివేకజ్ఞానము మొదలగు దైవరసములను హరించివేసి జనులను జీవచ్ఛవములుగా నొనర్చి దైవ స్వభావముగల మానవులను సయితము దయ్యపు స్వభావులుగా మార్చివేయు నీ మహాభయంకర బ్రహ్మరాక్షసుడగు నజ్ఞానము భారతదేశములో నాట్యము చేయుటకు స్థలము దొరకకపోవును.

ఈ మహాక్రూరుడును, స్వారాజ్య వినాశకమునకు కారణుడు నగు రాక్షసాధముండును, దయాశూన్యుడు నగు నజ్ఞానికి వివేకవంతులును, తపస్సంపన్నులును, కరుణాసాగరులును, యోగయుక్తులును నగు కొందఱు బ్రహ్మ నిష్ఠులగు సోదరీసోదరులు తమ సజీవరక్తమును బ్రహ్మనిష్ఠ చేయుటలోను, అనర్గళముగా దానిని బోధించుటలోను వినియోగపఱచెడు బలినిచ్చిన మాత్రముననే వీడు శమింపగలుగును. లేదా నశించును. ఇది యొక్కటి తప్ప నితని పై మారణప్రయోగము మరియొండు లేదు.

ఓ యస్వాతంత్ర్యమును గల్పన చేయు బ్రహ్మరాక్షసుడా! నీకు వినాశకాలము సమీపించినది నీపై మారణ ప్రయోగము చేయుటకొఱకు మహాత్ములగు మాంత్రికు లనేకులు భూలోకమున పుట్టియున్నారు సుమా! నీయొక్క నామావశేషమును గూడ నిలువనీయక నిన్ను నశింపజేయుదురు. ఇది నిక్కము నీకు కాలము సమీపించినది. దీనితో నీవు అంత మొందగల్గుదువు. ఈతత్త్వమును గ్రహించియైనను శాంతము నొందుమా! కరుణ వహింపుమా! స్వస్తిపుణ్యాహవచనము చేసికొని సుఖముగా నుండుమా!

ఇంతవరకు నీపై ననేకులు మహాత్ములగు పుణ్యపురుషులు బ్రహ్మాస్త్ర సమానమగు మారణాస్త్రములను బ్రయోగించిరి. అత్తఱి నీవు చచ్చినట్లు

కొంతకాలము పడియుండి దెబ్బతినిన నక్కవలె మరల లేచి మనుష్యుల దయారస శాంతరస విజ్ఞానరసములను పానముచేసి దైవాత్మ స్వరూపులగు మానవులను పిశాచులనుగా మార్చుచున్నావా? మంచిది. ఇత్తఱి నీపై మారణాస్త్రమును ప్రయోగించెడు మాంత్రికులలో మహాత్ములగు సోదరీమణులుగూడ గలదు ఇదివరకు వీరెక్కువ పూనిక వహించియుండ లేదు. ఇప్పుడో ఇక్కాలమహిమ విశేషమని గ్రహించుకొనుమా!

మఱియొక్క విశేషమునుగూడ నీపై దయగల వాడనగుటచే దెలుపు చున్నాను. అదేమన? నీవు కనివిని యెరుంగని బ్రహ్మచారిణులగు నాయాత్మ సోదరీమణులు వజ్రాయుధమును గూడ తునుకలుగా చేసెడు వైరాగ్య మును, బ్రహ్మాస్త్రము నైనను ధ్వంసము చేసెడి సంయమవ్రతమును, ఱాతి నైనను కరుగజేసెడు మహిమగల కరుణయును, భగవంతుడు ఆదరించు టకు తగిన నిర్మలభక్తియును గలిగి తమ నిరంకుశ శస్త్రములను నీపై ప్రయోగించి నిన్ను అంతమొందించుటకు బూనుకొనుచున్నారు. స్వల్ప సౌఖ్యము నిచ్చెడు స్వరాజ్యమునకే యెంత మందియో వివేకబుద్ధిగల సోదరీ సోదరులు తమ రక్తమును సమర్పణ చేయు సమయమున శాశ్వతసుఖము నొసంగు స్వారాజ్యము కొఱకు ఆత్మార్పణము చేయుటలో నట్టివారు సన్నద్ధు లుగాక యుందురా?

అంతేగాక మఱియొక్క రహస్యముగూడ నీకు తెలుపుచున్నాను. అదేమన నింతవరకు నీపై మారణాస్త్రముల ప్రయోగించినవారు ఒక్కొక్క మతమువారుగాని తెగవారుగాని ఐ యుండిరి అప్పుడు నీకు తప్పించుకొని పారిపోవుటకు సందు దొరికినది! ఇప్పుడట్లు కాదు సుమా! సర్వజన శ్రేష్ఠులును ఐకమత్యము పూని సోదరిసోదరుల భావముతో నీపై తీక్ష్ణములగు బ్రహ్మనిష్ఠయను మహాబ్రహ్మాస్త్ర మారణప్రయోగమునకు కడంగి దాడివెడల సన్నద్ధులై యున్నారు ఈతూరి నీవు తప్పించుకొనజాలవు ఈ సారి ధ్యాన యోగముచే ఉత్తరదిక్కును, జ్ఞానయోగముచే తూర్పు దిక్కును, భక్తి యోగముచే దక్షిణదిక్కును, నిష్కామకర్మయోగముచే పశ్చిమదిక్కును,

నిర్వాణయోగముచే ఊర్ధ్వదిశను, నిర్వికల్ప సమాధి యోగమును సాంఖ్యయోగముచే అధోభాగమును బంధించి అలంఘనీయ మగు కోటను వీరు కట్టియున్నారు ఇంతవరకెవరును ఈలాగున కట్టియుండలేదు ఒక్కొక్క మహాపురుషుడు ధ్యాన, జ్ఞాన, భక్తి,కర్మ, నిర్వాణ, నిర్వికల్ప, సాంఖ్య, యోగములనెడు వేర్వేరు యోగములచేత ఒక్కొక్క దిక్కును మాత్రమే బంధింప జూచుచు వచ్చెను. అప్పుడు నీకు దాగియుండుటకును, తప్పించుకొని పారిపోవుటకును అవకాశము దొరికినది సుమా!

ఇప్పుడో అట్టియాశలు నీకు చిక్కవు. జనుల దైవరస మును హరించి చెఱకును నమలి నమలి దానియొక్క రసమును త్రాగిన తర్వాత పిప్పిని ఉమి యునట్లు, ఈదైవాత్మస్వరూపులగు జనులను దయ్యవు స్వభావులనుగా మార్చివేసిన అజ్ఞానరాక్షసుడా! నీయొక్క నాట్యనర్తనము చూచిన నవ్వు వచ్చుచున్నది నీపై నాకేలాటి విరోధమును లేదు. విచారింపగా వంధ్యాపుత్రుని వంటి నీవు ఓహో! యీమానవులను ఎట్టి హీనస్థితికి తెచ్చినావు! పర మాశ్చర్యము! నిన్నుగూడ దైవభావముతోనే చూచుచున్నాను. కావున నీవు నాకు ఆత్మమిత్రుడవు. ఈలాగున చూడనేర్చిన వారందరికిని నీవు మిత్రుడవే యని నేనెరుంగుదును. అయినను ఉత్తమ సంస్కారమును, పరిశుద్ధమైన దైవ బోధయు లేనివారిపై శత్రుత్వము వహించి నీవిట్టి ఘోరకృత్యము చేయు చున్నావు. అయినను నిప్పుడు నీపై యుద్ధమునకు పూనినవారలు దశదిక్కు లను బంధించి వేసిరని తెలిసి నీపై ప్రేమగలిగి సంధిచేయుటకు తలంచిన రాయబారివలె నీకు తెలుపుచున్నాను.

1. పూర్వదిక్కును యమముచేతను, 2 ఆగ్నేయమును నియమము చేతను, 3 దక్షిణమును ఆసనముచేతను, 4 నైరృతిని ప్రాణాయామము చేతను, 5 పశ్చిమమును ప్రత్యాహారముచేతను, 6 వాయవ్యమును ధారణ చేతను, 7 ఉత్తరమును ధ్యానముచేతను, 8 ఈశాన్యమును సమాధిచేతను, 9. ఆకాశమును అమనస్కముచేతను, 10 పాతాళమును శివరాజయోగము చేతను బంధించియున్నారు సుమా! అంతేగాక పరమనిగూఢతత్త్వ మొకటి

మరల తెలుప తలంపు కలుగుచున్నది అదేమన? పూర్వము భరతఖండము నుండి నిన్ను తరిమి పారద్రోలుటకు సన్నద్ధులైన మహాపురుషులలో ఒక్కొక్కరికి ఒక్కొక్క విధమగు భక్తి మాత్రమే యుండెను కొందరికి విష్ణు భక్తియు, మరికొందరికి శివభక్తియు, ఇంక కొందరికి శ్రీరామభక్తియు, వేరు కొందరికి శ్రీకృష్ణభక్తియు, కొందరికి దేవీభక్తియు, కొందరికి దేవ భక్తియు మాత్రమే యుండెను. వారిలో కొందరు తమకిష్టమైన భక్తియందు తృప్తి వహించి తక్కిన వానిని దూషించుచునుగూడ నుండిరి దోషమే నీకు స్థావర స్థల మగుటచే అప్పుడడవిలోనికి తరుమబడిన పెద్దపులివలె ఒక్క దిక్కు నుండి మరియొక్క దిక్కునకును, అచ్చటనుండి యింకొక దిక్కునకును పోవుటకును, దాగియుండుటకును స్థలము దొరకినది ఇప్పుడట్లుకాదు అందరును సహోదరభావముతోను ఆత్మబుద్ధితోను, పైనిజెప్పిన శివకేశవ శ్రీరామాదిమూర్తులయెడ ప్రత్యేక ప్రత్యేకముగ భక్తిగలవారైనను మరల, నేక దైవోపాసకులుగాను నున్నారు. కనుక నీకు ఇత్తరి నిలుచుటకు సూదిమోపని సందైనను లేదు సుమీ!

నీవు పెనుభూతమువలె ఖండాంతరములలోగూడ వ్యాపించియుండు కాలమున పశ్చిమఖండము నుండి శ్రీయేసుక్రీస్తు దేవుడు తరుమగా నప్పుడు అరేబియాప్రాంతమునకు వచ్చినావు. అచ్చటనుండి శ్రీమహమ్మదునబి ఆదేశము నందుండనీయక నిన్ను చీకాకుపరచి తరిమినప్పుడు ఈ దేశము నకు వచ్చినావు. పూర్వికులగు బుద్ధాది ఋషులు దేశము నందెక్కడను నీకు స్థలము లేకుండ చేసిరి. అయినను భారతదేశముయొక్క దురదృష్టదోషము చేత జనులు స్వార్థతత్పరు లగుటయు, కరుణారసము నశించి జనులు కఠిన హృదయు లగుటయు, వివేకము నశించుటయు వాటిల్లగా ఇప్పుడు నీకిచ్చట నిత్యము ఉత్సవములును, విందులును జరుగుచున్నవి

అయినను ఈ భారతదేశము పూర్వీక పరమ ఋషుల పుణ్య పాదరజముచే పవిత్రమైనది గాన భారతీయు లాఋషుల యనుగ్రహము గలవారై యిప్పుడు రంధ్రములోపల నుండు ఎలుకలను పొగ వేసి కాల్చి

చంపునట్లు బ్రహ్మనిష్ఠల బూని నిన్ను లయమొందింపగలుగుదురు ఇప్పుడుండు మహాత్ములకు క్రైస్తవ, మహమ్మదీయ, బౌద్ధ, హిందు – ఇత్యాది మతద్వేషములు లేవుసుమా! కావున ఇత్తరిని నీకు ప్రపంచములో నెచ్చోటను చోటు దొరకదు

అంతేగాక యుద్ధకాలములో పరరాజాలతో సంధిచేసికొనునట్లు ఊర్ధ్వ లోకములగు భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జన లోకము, తపోలోకము, సత్యలోకములందుగల దేవతలయొక్కయు, గంధర్వులయొక్కయు, యక్షకిన్నరులయొక్కయు, సన కాది ఋషుల యొక్కయు, బ్రహ్మదేవునియొక్కయు అనుగ్రహము బొంది నవారలై వీరలున్నారు కావున ఊర్ధ్వలోకములో నెచ్చోటికి వెళ్ళుటకును నీకు సందు దొరకదు అచ్చటివారందరున్ను మాపక్షమునెడ సుహృదయులై యున్నారు. వారందరి ఆశీర్వాదానుగ్రహముచేతనే వీరందరున్ను నీపై దాడివెడల దలంచి యున్నారు

ఇక అతలమును, వితలమును, సుతలమును, తలాతలమును, రసా తలమును, మహాతలమును, పాతాళము మున్నగు లోకము లున్నను అచ్చటి వారిని చక్రవర్తి రాష్ట్రములను స్వాధీనములో నుంచు కొనునట్లు ఆత్మభావ ముతో అనగా దైవభావముతో స్వాధీనపరచుకొని యున్నారు ఆయాలోక నివాసులగు జీవులును, దేవతలును, యక్షరాక్షసులును ఇచ్చటివారికి ఆత్మ మిత్రులై యున్నారు. కనుక అచ్చటెచ్చటను నీకు నిలువ నీడ దొరుకదు సుమా! కావున శాంతముతోను, కరుణతోను, సోదర ,భావముతోను మెలగుటకు చూడుమా! ఈ చతుర్దశభువనములను వీరు దేనిప్రభావమువలన వశపరచు కొన్నారో వినుము. తేజోబిందూపనిషత్తులో చెప్పబడిన పంచదశ యోగాంగములచే స్వాధీనము చేసికొన్నారు.

**యమో హి నియమస్త్యాగో మౌనం దేశశ్చ కాలతా ।**
**ఆసనం మూలబంధశ్చ దేహసామ్యం చ దృక్ స్థితిః ॥**
**ప్రాణసంయమనం చైవ ప్రత్యాహారశ్చ ధారణా ।**

## ఆత్మధ్యానం సమాధిశ్చ ప్రోక్తాన్యంగాని వై క్రమాత్

1.యమమును యోగాంగముచే పాతాళమును 2నియమ యోగాంగముచే మహాతలమును 3. త్యాగయోగాంగముచే రసాతలమును. 4,మౌనయోగాం గముచే తలాతలమును 5 దేశయోగాంగముచే సుతలమును 6 కాలయో గాంగముచే వితలమును, 7ఆసనయోగాంగముచే అతలమును, 8 మూల బంధ యోగాంగముచే భూలోకమును, 9 యోగసామ్య యోగాంగముచే భువర్లోకమును, 10 దృక్స్థితి యోగాంగముచే సువర్లోకమును, 11 ప్రాణాయామ యోగాంగముచే మహర్లోకమును,12.ప్రత్యాహారయో గాంగముచే జనలోకమును, 13 ధారణయోగాంగముచే తపోలోకమును, 14 ఆత్మధ్యాన యోగాంగముచే సత్యలోకమును వీరు జయించియున్నారు. అనగా స్వాధీనము చేసికొనియున్నారు ఆ లోకవాసు లందరిని వీరు ఆత్మ సమానులుగా చూచినందుచేత తమ ఆత్మలవలె వీరిని వారు ప్రేమించి రక్షించుచున్నారు ఇక పంచదశయోగాంగములలో సమాధి యనెడు ఒక అంశము గలదు దానివలన నిన్నుగూడ జయించుదురు సంకల్పమునుండి గదా నీవు జనింతువు! కనుక నిస్సంకల్పావస్థయగు సమాధియోగములో నీవు గూడ లయము నొందగలుగుదువు. అప్పుడు లోకములో నెచ్చట చూచినను విజయధ్వనులు మ్రోగుచుండును స్వస్తివాచకములు విన వచ్చును కరుణామతము, శాంతిమతము, సత్యమతము, దైవమతము, స్వాతంత్ర్యమతము, ఋషిమతము ప్రతిష్ఠితములు గాగలవు లోకాస్సమస్తా స్సుఖినో భవంతు.

ఆత్మస్వరూపులారా! ఇక మనము గ్రహించవలసిన విషయముపై మనస్సును ప్రవేశపెట్టుదము నవీనవేదాంతులలో కొందరి వేదాంత మేమన - ఇంద్రియములకు వృత్తులు స్వభావము లనియే ఇంద్రియములకు వృత్తులు స్వభావము లైనచో ఇంద్రియనిగ్రహము గలిగియుండవలయు ననియు, విషయవృత్తి రహితము చేసికొనవలయుననియు చెప్పెడు

సర్వోత్కృష్టతమమగు వేదాంతశాస్త్రమును, పరమ మునీంద్రుల నివృత్తి పరమగు అనుష్ఠానములును వ్యర్థమైపోవునుగదా? అంతేగాక ముక్తాత్మునికిని, బద్ధాత్మునికిని మరల ఏమి భేదము గలదు? ప్రాథమిక శిక్షయగు బ్రహ్మచర్యమును జపతపస్స్వాధ్యాయవ్రతాదులచే ఇంద్రియనిగ్రహము ద్వారా అంతఃక రణశుద్ధియు, కలుగునని విధించెడు వానప్రస్థమును, శమ దమాదులు కలిగిన తర్వాత సన్న్యాసముచే పొందతగిన ఆత్మసాక్షాత్కారమును తెలిపెడు తురీయాశ్రమమును నిష్ఫలమై పోవునుగదా? అంతేగాక విధినిషేధములు, బంధవిముక్తులు, పుణ్యాపాపములను తెలిపెడు వేదమునకే అప్రతిష్ఠత్వము గలుగుటలో సందేహమేమి గలదు?

ఈతత్త్వవిషయములో మరియొక అనర్థము గూడ కొందరు చెప్పుదురు అదేమన? ఒక్కొక్క యింద్రియమునకు ఒక్కొక్క అధిదేవత కలదనియు, ఆ యా అధిదేవతల ప్రేరణచే ఆయాయింద్రియముల కార్యములు జరుగు చున్నవనియు పలికెదరు. అట్లు వాదించువారితో "మీరెవ్వరైన అట్టి అధిదేవత లను చూచియున్నారా" అని మాత్ర మడిగిన చాలును సద్గురు శుశ్రూష, సత్య ధర్మనిష్ఠ చేసికొనకపోవుటచేతను, ఇంద్రియసుఖములను మరిపించు టకు దానికన్న అధికమగు దైవసుఖమును పొందకపోవుటచేతను, యథార్థ( బహ్మనిష్ఠులు తగ్గిపోవుటచేతను, సంస్కారజీవులు కాకపోవుట చేతను, దైవ కరుణ కలుగక పోవుటచేతను ఇట్టిభ్రమకును, ప్రమాదములకును లోనగుట తటస్థించుచున్నది

వారు ఒక్కొక్క యింద్రియమునకు ఒక్కొక్క అధిదేవత ఉన్నట్లు చెప్పు చున్నారే? సరే! జిహ్వేంద్రియమునకు వరుణుడు అధిదేవత గదా! ఈవరుణు డొక్కడా? లేక అనేకులా? అనేకులైనచో ఒకే రకము గలవారలా? లేక మంచి చెడు గుణములు గలవారలా? లేక ఒక్కడైనచో సదా ఏకరూపముతో గూడినవాడా? లేక వికారములు గలవాడా? ఒక్కడని చెప్పినచో అందరి జిహ్వేంద్రియము ఒకే రుచిని కోరుచుండవలయును అట్లు కనిపించుట లేదు వివిధములగు కోరికలు గలిగిన జనులు గలరు దీనికి

కారణమేమి? అనేకవరుణు లుండి వేర్వేరగు మంచిగుణములుగాని, చెడుగుణములుగాని కలవారైరేని మనకు మంచిది గ్రాహ్యమును, చెడ్డది అగ్రాహ్యమును అగును

అంతేగాక ఇంద్రియాధిదేవతల గుణములకు మార్పు లుండునా? లేదని చెప్పినచో ఒక్కనికే తమోగుణముతో నుండునప్పుడు వానికి ఆహారముపై గలుగుకోరిక ఒక విధముగాను, రజోగుణముతో గూడునప్పుడు మరియొక రుచిపైని అభిలాషయు, సత్త్వగుణము గలుగునప్పుడు వేఱువిధమగు ఆహార ప్రీతియు కలుగుటకు కారణమేమి? మరల అట్టివారికే శుద్ధసత్త్వము గలుగు నప్పుడు షడ్రసములలో దేనియందును ఇచ్ఛలేక అతడు సదా దైవరసా మృతమును పానముచేసి తన్మయాత్ముడై దైవాకారవృత్తిలో నుండుటకు కారణమేమి? ఈ విషయమై యెక్కువగ తెలిసికొన గోరువారు త్రిగుణము లను గురించి తెలిపెడు భగవద్గీత పదునాల్గవ అధ్యాయమును అవశ్యముగా చదువవలయును అందు గుణములయొక్కయు, గుణముల మార్పుల యొక్కయు, గుణత్రయాతీతుల యొక్కయు అవస్థను తెలుసుకొన వచ్చును ఇదేరీతిగా గుహ్యేంద్రియ మునకు ప్రజాపతి (బ్రహ్మ) అధిదేవత అనెదరు అప్పుడు విరక్త బ్రహ్మయు అరక్తబ్రహ్మయు, ఇద్దరుందురా? పైరెండింద్రియముల విషయములు బంధము గలుగచేయుటలో ముఖ్యములు.

**పృథివ్యాం యాంతి భూతాని జిహ్వోపస్థనిమి త్తకమ్ ।**
**జిహ్వోపస్థ పరిత్యాగే కో న ముచ్యేత బంధనాత్ ॥**

సమస్తప్రాణికోట్లు ప్రకృతియను వలలో చిక్కుకొని నశించుటకు జిహ్వ, ఉపస్థ అను రెండింద్రియములు కారణము ఈ యింద్రియ ద్వయమును జయించినవాడు మాయను జయించినవాడే ఇట్టివానికి ఇచ్ఛటే ముక్తి గలదు ఈశ్లోకమునం దొక పరమ రహస్యము కలదు. అదేమన చక్షుః శ్రవణ, ఘ్రాణాది ఇంద్రియములలో ఒక్కొక్కదానికి ఒక్కొక్క

వృత్తిమాత్రమే కలదు జిహ్వేంద్రియమందు వాగింద్రియమగు కర్మేంద్రియ మొకటియు, జ్ఞానేంద్రియమగు రసనేంద్రియ మొకటియు గలవు ఆలాగుననే గుహ్యేంద్రియమున కును రెండు వృత్తులు గలవు కావున తక్కిన యింద్రియముల కన్న వీనిలో అధికముగానుండు ఇంద్రియములను తొలగించినచో సమరసజ్ఞానము కలు గును అప్పుడే సర్వభూతములలోను తనను, తనయందు సమస్తభూతములను చూచెడు సమత్వజ్ఞానము కలుగును ఇదే ప్రతిబంధరహిత ప్రబోధాఖండైక రసజ్ఞాన మని యోగి పుంగవులు చెప్పెడు అద్వైతజ్ఞానము

ఈ రెండుద్వారములను మూయునప్పుడు దైవికమగు మరిరెండు ద్వారములు తెరవబడును అదే బ్రహ్మరంధ్ర మనియు, కుండలీ ఉద్బోధము లేక సుషుమ్నోద్బోధము అనియు పరమసిద్ధ మునీంద్రులు వచించెడు బ్రహ్మ ద్వారము సామాన్యశాస్త్రములలో దేహమునకు నవద్వారములే చెప్ప బడెను విశేషశాస్త్ర మగు కఠోపనిషత్తున పదునొకండు ద్వారములు చెప్పబడియున్నవి అజ్ఞానదశయందు నవద్వారములు తెరచియుండు ననియు, విజ్ఞాన దశలో పైజెప్పిన రెండు ద్వారములు తెరువబడుననియు గలదు. అప్పుడు మాత్రమే అతీంద్రియజ్ఞానమును, దైవికజ్ఞానమును మనకు గలుగును అంతవరకు ఇంద్రియజనిత జ్ఞానమును, మానవగమ్య జ్ఞాన మును మాత్రమే సిద్ధించును కనుకనే మహనీయులు చెప్పు విషయము అతీం ద్రియజ్ఞానమనియు, అమానుషిక విషయమనియు లోకులు చెప్పు రహ స్యమై యున్నది

ఇచ్చట ప్రకృతియొక్క తెరను దహింప జేయవలెను ఇది జ్ఞానమార్గము. లేదా ప్రకృతియొక్క ముసుగును చింపి పారవేయవలయును ఇది యోగమా ర్గము ఇంక ప్రకృతియొక్క గోడను బ్రద్దలుగా గొట్టవల యును ఇది నిష్కామకర్మయోగము. లేదా ప్రకృతియొక్క ఆవరణమును త్రోసివేయ వలెను. ఇది భక్తియోగము పై జెప్పబడిన ప్రకారము, బుద్ధికి అధిదేవత బృహస్పతి యనియు గలదు కొన్ని శాస్త్రములలో బ్రహ్మయని

గూడ కాను పించుచున్నది ఎక్కువమంది బృహస్పతినే అంగీకరించి యున్నారు సరి అట్లైన మందబుద్ధికిని, సూక్ష్మబుద్ధికిని, మూఢబుద్ధికిని కారణమేమి? ఇట్లే మన స్సుయొక్క అధిదేవత చంద్రుడందురు క్రూరచంద్రుడును, శాంత చంద్రుడును, మూఢచంద్రుడును ఉందురా? ఒక్కరికి శాంతమనస్సును, మరియొకరికి దయతోగూడిన మనస్సును, ఇంకొకరికి ప్రేమమయ మనస్సును కలుగుట వారివారియొక్క దోషమా? చంద్రునియొక్క దోషమా? మరియు ఒక్కరి మనస్సే ఒక్కరి బుద్ధియే తమోగుణము, రజో గుణము, సత్త్వగుణము, కలుగు ఒక్కొక్క కాలమున పరిణామము పొంది మారుటకు కారణ మేమి? ఈ లాగుననే అన్ని యింద్రి యములయొక్కయు, ఇంద్రియాధిదేవతల యొక్కయు విషయమును పరిశీలించుకొనవలయును ముముక్షువులారా! ఈలాటి మాటలతో మోసము నొందక సత్య, ధర్మ, సదాచారరతులై యింద్రియములకు గలుగుచుండు మార్పులన్నియు సత్త్వ, రజ, స్తమోగుణములను అనుసరించి కలుగుచుండునని గ్రహించి, గుణ త్రయా తీతులగుటకు తగిన ప్రయత్నము చేయువలయును గుణములతో గూడి యుండువరకు ఆత్మ ప్రకృతి బంధనముననుండి, వలలో చిక్కుకొనిన చేప చందంబున విముక్తి నొందజాలదు

ఈవిషయమై శ్రీజగద్గురు శంకరాచార్యులవారు ఆత్మబోధమున ఉపదేశించినది చూడుడు

**జీవన్ముక్తిస్తు తద్విద్వాత్పూర్వోపాధి గుణాం స్త్యజేత్ ।**
**స సచ్చిదాది ధర్మత్వాద్భజే భ్రమరకీటవత్ ॥**

లోకమందు పురుగును తుమ్మెద తీసికొనివచ్చి ఝుంకారము చేసిన మాత్రము చేతనే ఈ పురుగు తన్ను చంపుచున్నదను భయము కలదై, తన తలంపును చలించకుండ ఈఝుంకారమందుంచిన మాత్రము చేత, తన యందు పూర్వమున్న కీటక (పురుగు) ధర్మమును వదలి భ్రమరస్వ

ఆరోపింపబడుచున్నదో ఆలాగే ముందు చెప్పబడిన నానావిధములైన శరీర ముల సంబంధమువలన, పరిశుద్ధమైన ఆత్మయందు బ్రాహ్మణత్వాది జాతిభేదములును, దేవదత్తయజ్ఞదత్తాదిసంజ్ఞలును, బ్రహ్మచర్యాద్యాశ్రమ ములును, మరియు విలోమాదిజాతులును అన్నియు అవివేకముచే కల్పింపబడునవి గాని వాస్తవములు కావు

**శ్రవణాదిభిరుద్దీప్త జ్ఞానాగ్ని పరితాపితః ।**
**జీవస్సర్వమలాన్ముక్తస్స్వర్ణవద్ద్యోతతే స్వయమ్ ॥**

లోకమందు బంగారు సమస్తలోహములతో గూడి వాని మాలిన్యముచేత కప్పబడి తెలియరాక యున్నప్పటికిని దానికి జేయవలసిన పుటాదిసంస్కా రములచేత దానియందుండు మాలిన్యము నివర్తింపబడి బంగారు తనకు తానై ప్రకాశించుచున్నట్లు జీవుడును శ్రవణాద్యభ్యాసమువలన వాడుకపడి సంసారహేతుభూతమైన మూలాజ్ఞానము నివర్తింపబడగా తనకు తానై ప్రకాశించుచున్నాడనుట ఈవిషయమై శ్రీకృష్ణపరమాత్ముండు గీతపదు నాల్గవ అధ్యాయమున ఉపదేశించిన విషయము చూడందగును

**సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః ।**
**నిబధ్నన్తి మహాబాహో । దేహే దేహినమవ్యయమ్ ॥** 14-5

ఓ అర్జునా ! గుణములనవెవ్వి? అవి యెట్లు బంధించునను సంగతి వినుము సత్త్వము, రజస్సు, తమస్సు, ఈ మూడు గుణముల పేర్లు అవి అవిద్యా స్వరూపము లగుటం జేసి గుణములవలె క్షేత్రజ్ఞునికి నెప్పుడును స్వాధీన ములై దేహమందుండి దేహమే ఆత్మ యని తలంచినట్లు అవ్యయుడగు క్షేత్రజ్ఞుని బంధించుచుండును ఇవి అంతఃకరణములో నుండువరకు భ్రమప్రమాద జ్ఞానమును గలుగజెయును. ఎరుపు నలుపు, పసుపు రంగులతో అద్దిన వస్త్రము నైజమగు తెలుపును కనపరచక, రంగులవర్ణమై యున్నట్లు ఆత్మను మోసపరచి దృశ్యములో బంధించును

**గుణానేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మమృత్యుజరాదుః ఖైర్విముక్తోఽమృతమశ్నుతే ॥**

మాయవలన పుట్టినవి కావున అనర్థరూపము లైనవియు, దేహోద్భుత్పత్తి

రూపమును చెందునట్లు, శ్రవణాదులచే నాత్మను విచారించగా తాను జీవ, ధర్మమును వదలి, సచ్చిదానందరూపమైన బ్రహ్మస్వరూపమును బొంది, వృత్తిరహితుడై యుండుటే జీవన్ముక్తి యని ముముక్షువు తెలిసికోవలసిన దనుట

**నానోపాధివశాదేవ జాతినామాశ్రమాదయః ।**
**ఆత్మన్యారోపితాస్తోయే రసవర్ణాదిభేదవత్ ॥**

స్వభావముచేతనే మధురమైన జలమునందు చేదు, పులుపు, తీపు, ఎఱుపు, పచ్చన మొదలైన గుణములు గల పదార్థములయొక్క సంబంధములచేత, ఆయాపదార్థములయొక్క రుచియును, రూపమును ఏలాగున ఆరోపింపబడుచున్నదో ఆలాగే ముందు చెప్పబడిన నానావిధములైన శరీరముల సంబంధమువలన, పరిశుద్ధమైన ఆత్మయందు బ్రాహ్మణత్వాది జాతిభేదములును, దేవదత్తయజ్ఞదత్తాదిసంజ్ఞలును, బ్రహ్మచర్యాద్యాశ్రమములును, మరియు విలోమాదిజాతులును అన్నియు అవివేకముచే కల్పింపబడునవి గాని వాస్తవములు కావు

**శ్రవణాదిభిరుద్దీప్త జ్ఞానాగ్ని పరితాపితః ।**
**జీవస్సర్వమలాన్ముక్తస్స్వర్ణవద్ద్యోతతే స్వయమ్ ॥**

లోకమందు బంగారు సమస్తలోహములతో గూడి వాని మాలిన్యముచేత కప్పబడి తెలియరాక యున్నప్పటికిని దానికి జేయవలసిన పుటాదిసంస్కారములచేత దానియందుండు మాలిన్యము నివర్తింపబడి బంగారు తనకు తానై ప్రకాశించుచున్నట్లు జీవుడును శ్రవణాద్యభ్యాసమువలన వాడుకపడి సంసారహేతుభూతమైన మూలాజ్ఞానము నివర్తింపబడగా తనకు తానై ప్రకాశించుచున్నాడనుట ఈవిషయమై శ్రీకృష్ణపరమాత్ముండు గీతపదు నాల్గవ అధ్యాయమున ఉపదేశించిన విషయము చూడందగును

**సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః ।**
**నిబధ్నన్తి మహాబాహో । దేహే దేహినమవ్యయమ్ ॥**

ఓ అర్జునా ! గుణములన నెవ్వి? అవి యెట్లు బంధించునను సంగతి వినుము సత్త్వము, రజస్సు, తమస్సు- ఈ మూడు గుణముల పేర్లు అవి అవిద్యా స్వరూపము లగుటంజేసి గుణములవలె క్షేత్రజ్ఞునికి నెప్పుడును స్వాధీనములై దేహమందుండి దేహమే ఆత్మ యని తలంచినట్లు అవ్యయుడగు క్షేత్రజ్ఞుని బంధించుచుండును ఇవి అంతఃకరణములో నుండువరకు భ్రమప్రమాద జ్ఞానమును గలుగజేయును ఎరుపు, నలుపు, పసుపు రంగులతో అద్దిన వస్త్రము నైజమగు తెలుపును కనపరచక, రంగులవర్ణమై యున్నట్లు ఆత్మను మోసపరచి దృశ్యములో బంధించును

**గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మమృత్యుజరాదుః ఖైర్విముక్తోఽమృతమశ్నుతే ॥**

మాయవలన పుట్టినవి కావున అనర్థరూపము లైనవియు, దేహోద్యుత్పత్తి మూలములునగు ఇట్టి సత్త్వ, రజ, స్తమోగుణములను తాను శరీరముతో నుండినప్పుడే బ్రహ్మజ్ఞానానుభవమువలన అనగా ఆత్మ యీ మూడు గుణములకు విలక్షణుడను జ్ఞానమును సంపాదించుటవలన అతిక్రమించిన వివేకి జన్మ, మృత్యు, జరాది దుఃఖములనుండి నివృత్తి బొందినవాడై నిత్య శాంతియగు అమృతపదవిని పొందును.

**భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్ ।**
**వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే ॥**

ఇంద్రియాదివిషయ భోగములయందును, ఐశ్వర్యాదులయందును ఆసక్తి గలిలి, అట్టి భోగైశ్వర్యములచేత అపహరింపబడిన మనస్సు గలవానికి ఆత్మస్వరూప జ్ఞానమందు అనగా నిర్విషయ నిర్వికల్ప సమాధియందు, ప్రవృత్తియే కలుగదు జనులారా! పామరులు తాము ఇంద్రియాది ప్రపంచ సౌఖ్యముల ననుభవించి కృతార్థు లగుచున్నారమని మాయామోహముచే తలంతురు. కృష్ణపరమాత్ముడు చెప్పినది అట్లు గాదు ఇంద్రియార్థ విషయములతో గూడిన మాయయగు దయ్యము మిమ్ములనే పీల్చి పిప్పి చేయుచు

న్నదని చెప్పుచున్నాడు కావున ఈవిషయమై సచ్ఛాస్త్రము సహస్రముఖము లతో దీనినే ఉద్ఘోషించుచున్నది వ్యాసవిస్తర కారణముచే నిట్లు క్లుప్తముగ తెలుపబడినది

మరియు ప్రస్తుతము పరమపావనమగు వేదాంతమునకు చెరుపు గల్గుటకు మూడు కారణములు కలవు ఒకటి వృత్తులు ఇంద్రియములకు స్వభావ ములని చెప్పుటయు, దానియొక్క నివృత్తికి ప్రయత్నింపక పోవుటయు ఇది చాల అపాయకరమగు బాధాకరమైన బోధయై పరిణమించెను. ఇది యెటు వంటిదనగా, ఒక దొంగపని చేయువానితో అది వాని కులవృత్తియనియు, స్వధర్మవృత్తిలో దోషము లేదనియు చెప్పినట్లుండును అతడు ఎప్పుడైన బంధీకృతుడు కాకపోవునా?

రెండవది ఇంద్రియముల నిరోధించు విషయమై మన ప్రయత్న మేమియును అక్కర లేదు అదే పరిపక్వదశలో స్వయముగా నిలిచిపోవును అని బోధించుట ఇది ముందు చెప్పిన ఉపదేశముకన్న కొంచెము మేలైనది. ఏలయన పరిపక్వదశలో వృత్తిరహితము కాగలదని చెప్పినందుచే ఇంకను పరిపక్వము కాలేదే అని కొంచెము విచారము గలవాడు తలంచును కావున నివృత్తిపరమగు ప్రయత్నమునకు అవకాశ ముండును కాని ఇదియు మంచిది కాదు ఏలయన, రోగియైనవానికి పథ్యము అంతగా అక్కరలేదు ఔషధసేవ చేయుచు రాగా రాగా క్రమముగా రోగశాంతి కలిగి సౌఖ్యము నొందవచ్చునని చెప్పినట్లుండును లేక కళాశాలలో జదు వుచుండు విద్యార్థితో పరీక్షలో ఉత్తీర్ణుడవగు విషయమై నీ ప్రయత్న మక్కరలేదు అని చెప్పినట్లైన చక్కగా జదివెడు బుద్ధి కలుగదు గదా? దీనివల్ల త్వరలో పురోవృద్ధికి మార్గము లేదు. కావున ఇదియు శ్రేష్ఠము కాదు

మూడవమార్గము మరియొకటి కలదు అదేమన, అంతయును బ్రహ్మము దాని కన్యమైన దేదియు లేదు. కావున గుణములును గుణియును కూడ, అనగా ఆత్మనుగూడ దైవభావము చేసికొనుము అని తెలిపెదరు ఇది సరియైనను, మందమతులకు చెప్పవలసినది గాదు ఇది అతీత వైరాగ్యనిష్ఠ

గలవారిని గురించి ఉపదేశించవలసిన విషయము, ఇట్టి సాధన చేయువారు పరిపక్వ హృదయులైనచో "దైవము నిర్విషయము, నిత్యము, శుద్ధము, అఖండము, ఆనందము గదా! విషయమును, అశుద్ధబుద్ధియు కలుగ రాదు" అని తలంచి నివృత్తిమార్గములో ప్రవేశింతురు అట్టి యోగ్యత లేని వాడైనచో అతడు తప్పక విషయమోహములో మునిగిపోవును. కావున ఈమూడింటికి విలక్షణమైన ఆత్మైకబోధయును, తగిన యోగసాధనయు బోధించుట యుచితము ఒకవేళ పూర్ణపరిపక్వస్థితి లేనిచో అట్టిస్థితిని పొంద వలయుననియు, లేనిచో ముక్తి కలుగదనియు మాత్రముపదేశించిన చాలును అట్లైన చెడుటకు మార్గము లేదు

ఈవిషయమై ఒక కథ శ్రీ వివేకానందస్వాములు తెలిపియున్నారు అదేమన దైవస్వభావమును, అసురస్వభావమును గల ఇద్దరు ఆత్మతత్త్వము తెలిసికొన నభిలాషగలవారై పూర్ణప్రజ్ఞులగు ఒక మహామునివద్దకు వెళ్లిరి ప్రేమతో వారువచ్చిన కార్యమునుగూర్చి ముని అడిగెను. ఆత్మసాక్షాత్కా రము బోధింపుడని ఆ ముముక్షువు లిద్దరును తెలిపిరి అప్పుడు ఆపర మునీంద్రుడు అది మీ యొక్క స్వరూపము, ఆనందముగా నుండుడు అని సెలవిచ్చి పంపెను

అసురస్వభావము గలవాడు తనకోరిక త్వరలో ఫలించి నందుచే సంతోషభరితుడై కావలసినంత భక్ష్యములు, భోజ్యములు, పాన ములు, స్త్రీలు, సేవకులు మొదలయినవి సమకూర్చుకొని అనుభవించు చుండెను మరి యేమియును విచారింపకపోయెను.

దైవగుణము గలవాడు విచారశీలు డగుటచే దేహమే ఆత్మయని చెప్పిరి ఇది యెట్లు నిజమగును? షడూర్ములతోను, షడ్విధవికారములతోను కూడిన యీ దేహమెట్లు ఆత్మ యగును? అంతేగాక దీనివలన జర, నర మొదలైనబాధలు గలుగుచుండునే? సదా దీనిలో ఆనందము గలుగుట లేదే? అను తలంపు గలవాడై దేహమును ప్రేరింపజేయు నింద్రియములు ఆత్మగా

న్నదని చెప్పుచున్నాడు కావున ఈవిషయమై సచ్ఛాస్త్రము సహస్రముఖము లతో దీనినే ఉద్ఘోషించుచున్నది వ్యాసవిస్తర కారణముచే నిట్లు క్లుప్తముగ తెలుపబడినది

మరియు ప్రస్తుతము పరమపావనమగు వేదాంతమునకు చెరుపు గల్గుటకు మూడు కారణములు కలవు ఒకటి వృత్తులు ఇంద్రియములకు స్వభావ ములని చెప్పుటయు, దానియొక్క నివృత్తికి ప్రయత్నింపక పోవుటయు ఇది చాల అపాయకరమగు బాధాకరమైన బోధయై పరిణమించెను. ఇది యెటు వంటిదనగా, ఒక దొంగపని చేయువానితో అది వాని కులవృత్తియనియు, స్వధర్మవృత్తిలో దోషము లేదనియు చెప్పినట్లుండును అతడు ఎప్పుడైన బంధీకృతుడు కాకపోవునా?

రెండవది ఇంద్రియముల నిరోధించు విషయమై మన ప్రయత్న మేమియును అక్కర లేదు అదే పరిపక్వదశలో స్వయముగా నిలిచిపోవును అని బోధించుట ఇది ముందు చెప్పిన ఉపదేశముకన్న కొంచెము మేలైనది. ఏలయన పరిపక్వదశలో వృత్తిరహితము కాగలదని చెప్పినందుచే ఇంకను పరిపక్వము కాలేదే అని కొంచెము విచారము గలవాడు తలంచును కావున నివృత్తిపరమగు ప్రయత్నమునకు అవకాశ ముండును కాని ఇదియు మంచిది కాదు ఏలయన, రోగియైనవానికి పథ్యము అంతగా అక్కరలేదు ఔషధసేవ చేయుచు రాగా రాగా క్రమముగా రోగశాంతి కలిగి సౌఖ్యము నొందవచ్చునని చెప్పినట్లుండును లేక కళాశాలలో జదు వుచుండు విద్యార్థితో పరీక్షలో ఉత్తీర్ణుడవగు విషయమై నీ ప్రయత్న మక్కరలేదు అని చెప్పినట్లైన చక్కగా జదివెడు బుద్ధి కలుగదు గదా? దీనివల్ల త్వరలో పురోవృద్ధికి మార్గము లేదు. కావున ఇదియు శ్రేష్ఠము కాదు

మూడవమార్గము మరియొకటి కలదు అదేమన, అంతయును బ్రహ్మము దాని కన్యమైన దేదియు లేదు. కావున గుణములును గుణియును కూడ, అనగా ఆత్మనుగూడ దైవభావము చేసికొనుము అని తెలిపెదరు ఇది సరియైనను, మందమతులకు చెప్పవలసినది గాదు ఇది అతీత వైరాగ్యనిష్ఠ

జడమనియు, సుషుప్తిలో విలీన మొందుచున్నదనియు, బుద్ధిని ప్రకాశింప జేసెడు ప్రజ్ఞయగు ఆత్మ దీనికి విలక్షణమై త్రికాలాబాధ్యమై, నిత్యమై, శివమై, వెలుగుచుండుననియు తుదకు కనుగొనెను

పట్టరాని సంతోషము గలవాడై పరుగెత్తుకొనిపోయి గురుపాదములపై బడి తన అనుభవమును తెలిపెను అప్పుడును గురువు ముందు చెప్పిన ప్రకారమే ''అదే నీస్వరూపము అదే ఆత్మ, ఎల్లప్పుడు సుఖముగా నుండుము'' అని బోధించి పంపెను దైవగుణము గలవాడగుటచే ఈశిష్యుడు తనలో తాను విచారణ చేసికొని నిత్యాత్మను గనుకొని ధన్యు డయ్యెను

పైని జెప్పబడిన అసురగుణము గలవాడు విషయసుఖముల ననుభవించి, ఇంద్రియము లన్నియు క్షీణించిపోవ, రోగగ్రస్తుడై, ధనమంతయు కోల్పోయిన తర్వాత తనపరివారము వారందరును తనను విడిచిపెట్టినందున బహువిధములగు దుఃఖములలో చిక్కుకొని, తుదిని మరణవేదన సహింపజాలక దుఃఖించి దుఃఖించి చచ్చెను.

కావున ఆత్మస్వరూపులారా! పుణ్యపురుషవంశములో బుట్టిన వారలారా! పుణ్యాత్ముల అనుగ్రహము పొందినవారలారా! అంతయు బ్రహ్మమని బోధించుటలో నిట్టి అపాయము కలదని జ్ఞప్తిలో నుంచుకొనుట కొరకు ఈకథ యిచ్చట ఉద్ధరింపబడినది. మరియు ఇంద్రియముల యొక్కయు, ఇంద్రియవృత్తుల యొక్కయు, ఇంద్రియాధి దేవతల యొక్కయు విషయమై పరమరహస్య మొకటి గలదు. ఇదే సాంఖ్య మందుగల మర్మము.

సమష్టిలో వ్యష్టిని ఐక్యపరచవలసియుండును, లేనిచో బ్రహ్మాత్మైక్యభావము కలుగదు మరియు పిండ, అండములను ఏకము చేయుటకును అండాండములో గలది పిండాండములోను కలదని చూపించుటకొరకును ఇంద్రియాధిదేవతలను తిలకించవలసివచ్చినది. ఈ పరమరహస్యము తెలియకపోవుటచేతనే వేదాంతులలో కొందరు భ్రమనొంది తాము చేయు

కార్యముల భారమును ఇంద్రియాధిదేవతలపై నుంచి బద్ధులగుచున్నారు ఇంద్రియాధిదేవతలే కార్యములు చేయునది నిజమైనచో దానివల్ల కలిగెడు సుఖదుఃఖములును, స్వర్గనరకములును, బంధవిముక్తులును అనుభవించు వారెవరని ప్రశ్న గలుగును గదా! బంధమును విముక్తియును కూడ భ్రాంతి యని తెలిపెడు పదవి యొక్కటి గలదని పలుకుట కలదు అయితే అచ్చట ఇంద్రియములును, ఇంద్రియార్థములును, ఇంద్రియాధి దేవతలును సయి తము భ్రమయని యేల పలుకకూడ దను ప్రశ్నకు అవకాశ మేర్పడుచున్న దనికూడ పైరీతిని తర్కించువారు జ్ఞప్తిలో నుంచవలసియుండును. గోపు రము కనబడనివారికి మూలవిగ్రహ మేలాగున గోచరింపజాలదో అదేప్రకా రము స్థూలభూతములను ఐక్యముచేయు శక్తిలేనిచో సూక్ష్మభూతములను ఐక్యపరచెడు శక్తి కలుగదు.

ఒకటి రెండు దృష్టాంతములచే దీని రహస్యము చెప్పెద. నేత్రముల కధిదే వత సూర్యుడు అనగా ప్రకాశము ఈసూర్యునియొక్క అంశమగు ప్రకా శమే నేత్రములలోకూడ కలదు ఇది అగ్నితత్త్వము నేత్రములలోను, సూర్యు నియందును నుండుశక్తి ఒకేవిధముగా నుండును. అదే ప్రకారము జిహ్వేం ద్రియము జలాంశము, దీనికి అధిదేవత వరుణుడు అనగా ఈవరుణుడే సముద్రాధిదేవతగా నుండును గనుక సముద్రములోను, రసనేంద్రియ ములోను గల జలతత్త్వ మొక్కటి యని గ్రహించి ఐక్యము చేయుటకొరకు ఈవిషయము చెప్పబడినది అంతేగాని మరియేమియును గాదు. ప్రత్యగాత్మ పరమాత్మలను ఐక్యము చేయు శక్తిగలవారు, అనగా తత్త్వమస్యాది మహావాక్యముల కైక్యము చేకూర్చగలవారు ఈపరమతత్త్వ మును చక్కగా శ్రవణ, మనన, నిదిధ్యాసనలను చేయవలసియుండును కావున పృథివీ తత్త్వముతో గంధాంశమును, జలతత్త్వముతో రసాంశమును, అగ్ని తత్త్వముతో రూపాంశమును, వాయుతత్త్వముతో స్పర్శాంశమును, ఆకాశ తత్త్వముతో శబ్దాంశమును, ధ్యానకాలమున ఐక్యపరచినమాత్రమున జీవాంశ మును శివాంశములలో గలుపు శక్తిగలుగును లేనిచో అండ, పిండ,

బ్రహ్మాండములను అతిక్రమించు జ్ఞానము కలుగజాలదు అనగా శరీరములో గల కఠినాంశమును పృధివితోను, ద్రవాంశమును జలముతోను, ప్రకాశాంశ మును అగ్నితోను, చలనాంశమును వాయువుతోను, శబ్దాంశమును ఆకాశము తోను ఐక్యపరచెడు ధ్యానమును పరిశీలించ వలయును అట్లైన మాత్రమున దైవాంశమగు ఆత్మను పరమాత్మలో ఐక్యము చేయగల్గుదుము అనగా ఉపాధిద్వయ రహితావస్థ గలిగి పూర్ణప్రజ్ఞను బొందగల్గుదుము ఈతత్త్వము తెలిసికొనుటకు మాత్రమే పంచీకరణము అనగ సాంఖ్యము ఏర్పడినదని గ్రహించవలయును.

పంచభూతములచే ఏర్పడిన అన్నపానాదులవలన కలిగిన శుక్లశోణితములవలనగదా ఈదేహ మేర్పడినది ! దీనియందు ప్రతిబింబించి యుండు అనగా ప్రత్యగాత్మయై యుండు చైతన్యవస్తువుగదా ఆత్మ స్వరూపము! కావున ఈపంచభూతములచే ఏర్పడిన దేహేంద్రియాది వస్తువు లను పృధివ్యాది భూతాంశములుగా పృధక్కరణము చేసి వానిని తొలగించిన యెడల ఉపాధులన్నియు తొలగి, నిరావరణ ప్రచండ భాస్కరునివలె ఆత్మైక్య బోధము వెలుగుచుండును పంచీకరణములో మనము గ్రహించవలసిన ముఖ్యాంశము ఇదియే యని జ్ఞప్తినుంచు కొనవలయును పరమరహస్య మును బ్రహ్మవేత్తలవలన గ్రహించి, యింద్రియములుగాని యింద్రియార్థ ములుగాని ఉన్నచో అవి అనాత్మ స్వరూపములని గ్రహించి, అట్టి వృత్తులను తొలగించి, దగ్గర చేరనీయక చూచుటయే సాంఖ్యయోగముయొక్క లక్ష్యమని మనము గ్రహించవలయును.

ఈ విషయమై అనేక ముఖములతో వేదవాణి ఉచ్చస్వరముతో ఉద్ఘోషించు చున్నది వ్యాసము పెరుగునని తలంచుటచేతను వివేకవంతులకు ఒక దానిగుణము తెలిసినయెడల అసంఖ్యాకములను గణనము చేయుశక్తి గల్గునని తలంచుటచేతను ఈవిషయము ముగింపు చేయుటకు తలంచు చున్నాను దీనిని పూర్తి చేయుటకు పూర్వము ఇంకొక మాటనుగూడ మీకు తెలుపదలంచితిని ముందు చెప్పిన పంచభూతాంశములు ధ్యానకాలమున

పంచభూతములలో స్పష్టముగా ఐక్యపడినట్లు కనపడకపోయినచో జీవ బ్రహ్మైక్యానుభవమను ప్రకాశము దగ్గరకు, చీకటిని పట్టుకొనిపోయి ఐక్య పరచుటకు చూచులాగున నుండును తెల్లకిరసనాయలును మంచినీళ్లను యెంత ఐక్యపరచ చూచినను అవి యెట్లు కలియవో వీరియొక్క శివజీవైక్య సంధానమును అట్లే యుండును లేక చక్రవర్తితో భిక్షకారుడు బాంధవ్య సంబంధము కుదుర్చుకొనుటకు చూచిన నెట్లు పొసగునో యిదియు అట్లే యుండును అనంతాత్మతో ఐక్యము కావలసియుండిన మీరును అనంతా కారము నొందవలయును సుమా! శుద్ధాత్మతో నేకత్వము నొందవలసి యుండిన మీరును శుద్ధాత్ములు కావలయును సత్యాత్మతో కలియవలసి యుండిన మీరును సత్యాత్ములు కావలయును కరుణాత్మతో కలసి కొనవలసి యుండిన మీరును కరుణాత్ములు కావలయును.



# పంచీకరణము

ఈ క్రింద కనపరచెడు పంచీకరణ విధానమును అందరును తెలిసికొనవలసి యుండును

ఈపంచీకరణమున గల ముఖ్యవిషయము మాత్రమే యిచ్చట వ్రాయ బడును లేనిచో గ్రంథము పెరుగును. పూర్తిగా చక్కగా గ్రహింప దలంచు వారు అనుభవజ్ఞులయొద్దనుండి పంచీకరణ ప్రకరణమును తెలిసికొనవచ్చును

## స్థూలపంచీకృతభూతవివరణము.

**పృథివ్యాదీని భూతాని ప్రత్యేకం విభజేద్ద్విధా ।**
**ఏకైకభాగమాదాయ చతుర్ధా విభజేత్పునః ॥**

**ఏకైకం భాగమేకస్మిన్ భూతే సంవేశయేత్క్రమాత్ ।**
**పంచీకరణమేతత్స్యాదిత్యాహుస్తత్త్వవేదినః ॥**

భూమ్యాది పంచభూతములలో (పంచీకరణము చేయవలసినట్టి భూతములలో) ప్రతిభూతమును సమముగా(రెండుగా) జేసి, వానియందు ప్రతిభూతముయొక్క అర్ధభాగమును వేరుగా నుంచి, ప్రతిభూతములోను మిగలియుండు ఒక్కొక్కభాగమును నాలుగుగా విభజించి, వానివాని నిజభూతముతో జేర్పక తక్కిన నాలుగుభూతములతో జేర్చినయెడల పంచమహాభూత పంచీకరణమగునని తత్త్వవేత్తలు చెప్పుదురు

## పృథ్వీతత్త్వ పంచకవివరణము

**1. అస్థిమాంస త్వచోనాడీ రోమం చైవ యథా తథా ।**
**క్షితిః పంచవిధః ప్రోక్తాః సమాంశాః పరికీర్తితాః ॥**

అస్థి, మాంసము, త్వక్కు, నాడి, రోమము, ఇవి పృథ్వీ తత్త్వములు

## జలతత్త్వ పంచకము

**2. లాలామూత్రం తథాస్వేదః శుక్లం శోణితమేవ చ ।**
**ఆపః పంచవిధః ప్రోక్తాః సమాంశాః పరికీర్తితాః ॥**

చొంగ, మూత్రము, చెమట, రక్తము, శుక్లము అనునివి జలతత్త్వములని చెప్పబడును.

## అగ్నితత్త్వ పంచకము

**3. క్షుధా తృష్ణా తథా నిద్రా ఆలస్యం సంగమ స్తథా ।**
**అగ్నిః పంచవిధః ప్రోక్తాః సమాంశాః పరికీర్తితాః ॥**

క్షుత్తు, దప్పి, నిద్ర, సోమరితనము, సంగమము అనునివి అగ్ని తత్త్వము లనబడును.

## వాయుతత్త్వ పంచకము.

**4. ధావనం వల్గనం చైవాకుంచనం చ ప్రసారణమ్ ।**

**వాయుః పంచవిధః ప్రోక్తాః సమాంశాః పరికీర్తితాః ॥**

పరుగిడుట, కదలుట, సంకుచిత మగుట, ప్రసరించుట, వ్యాపించుట ఇవి వాయుతత్త్వములని చెప్పబడును

## ఆకాశతత్త్వ పంచకము.

**5. రాగద్వేషభయం లజ్జా మోహం చైవ యథా తథా ।**
**నభః పంచవిధః ప్రోక్తాః సమాంశాః పరకీర్తితాః ॥**

రాగము, ద్వేషము, భయము,లజ్జ, మోహము అనునివి ఆకాశ తత్త్వము లనబడును

వీటియొక్క పంచీకరణ విభాగములు ఒక్కొక్కటిన్ని వేరు వేరుగా భాగించి తెలిసికొనందగినది పంచీకరణ విషయమున కొందరు తత్త్వ ములు ఇరువదినాల్గనియు, మరికొందరు ముప్పది ఆరు అనియు, ఇంక కొందరు తొంభై ఆరనియు పలికెదరు ఇవి అన్నియు రాజధాని,రాష్ట్రము, తాలూకా, గ్రామము అని విభజించినట్లుండును అన్నిటికి అవిద్యయే మూల కారణము ఇవి అన్నియు దానియందు ఇమిడియున్నవి ముఖ్యములుగా చెప్పునప్పుడు ఇరువదినాల్గుతో పూర్తియగును మరింత పెంచిన ముప్పది ఆరున్ను, ఎక్కువ విస్తరించిన తొంబదియారుతో పూర్తి అగును ఇకను పరిశీలించిన రోమములు, నాడులు, కీళ్ళు, చక్రములు, శ్వాసనిశ్వాసములు మొదలయి నవి యెన్నియో కలవు అవన్నియు వృక్షములయొక్క ఆకులు, పుష్ప ములు, పుష్పదళములు, కేసరములు అని యీలాగున పెంచినట్లుండునే గాని యెక్కువ ప్రయోజన మేమియు లేదు వృక్షము, శాఖలు, ఉపశాఖలు, శాఖో పశాఖలు వీనిని గ్రహించినచాలును ఆలాగున పంచభూతములును, పంచకర్మేంద్రియములును పంచజ్ఞానేంద్రియములును, పంచతన్మాత్రలును, అంతఃకరణ చతుష్టయమును కూడిన చతుర్వింశతి(24) తత్త్వములను గ్రహించిన చాలును. ఇంకను ఎక్కువ కావలసిన పంచకోశమును అవస్థా త్రయమును జీవత్రయమును – స్థానత్రయమునుకూడ గ్రహింపవచ్చును

6. చతుర్వింశతి తత్త్వాని కేచిదిచ్ఛంతి వాదినః।
కేచిత్ షట్త్రింశత్తత్త్వాని కేచిత్ షణ్ణవతీని చ॥
7. తేషాం క్రమం ప్రవక్ష్యామి సావధానమనాశ్శృణు ॥

తత్త్వములు 24అని కొందరున్ను, 36 అని మరికొందరున్ను, 96 అని ఇంక కొందరున్ను చెప్పుదురు. వానిక్రమమును చెప్పెదను సావధానచిత్తులరై వినుడు

## చతుర్వింశతితత్త్వములు.

8. జ్ఞానేంద్రియాణి పంచైవ శ్రోత్రత్వగ్లోచనాదయః।
కర్మేంద్రియాణి పంచైవ వాక్పాణ్యంఘ్ర్యాదయః క్రమాత్।
ప్రాణాదయస్తు పంచైవ పంచ శబ్దాదయ స్తథా ॥
9. మనోబుద్ధి రహంకార శ్చిత్తం చేతి చతుష్టయమ్।
చతుర్వింశతి తత్త్వాని తాని బ్రహ్మవిదో విదుః ॥

శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము అను జ్ఞానేంద్రియ పంచ కమున్ను, వాక్కు, పాణి, పాదము, ఉపస్థ, పాయువు అను కర్మేంద్రియ పంచకమున్ను, సమాన, వ్యాన, ఉదాన, అపాన, ప్రాణ–అను పంచప్రాణ వాయువులున్ను, శబ్ద, స్పర్శ, రూప, రస గంధములనెడి పంచతన్మాత్రలున్ను, మనస్సు, బుద్ధి, చిత్తము అహంకారములను అంతఃకరణ చతుష్టయమున్ను, ఇవి ఇరువది నాల్గు తత్త్వములని వేదాంతవేత్తలు చెప్పెదరు.

## షట్త్రింశత్తత్త్వములు.

10 ఏతైస్తత్త్వైస్సమం పంచీకృతభూతాని పంచ చ।
పృథివ్యాపస్తథా తేజో వాయురాకాశ ఏవ చ ॥

11. దేహత్రయం స్థూలసూక్ష్మ కారణాని విదుర్బుధాః।
అవస్థాత్రితయం చైవ జాగ్రత్స్వప్న సుషుప్తయః ॥

12. ఆహత్య తత్త్వజాతానాం షట్త్రింశన్మునయో విదుః ॥

మున్ను వచించిన ఇరువదినాల్గు తత్త్వములతోగూడ పృథ్వి, అప్పు, తేజ స్సు, వాయువు, ఆకాశము అనుపంచీకృత మహాపంచభూతములున్ను, స్థూల సూక్ష్మ కారణములను శరీరత్రయమున్ను, జాగ్రత్, స్వప్న, సుషుప్తులను అవస్థాత్రయమున్ను చేరి ముప్పదియారు తత్త్వములని యోగీశ్వరు లెరింగియున్నారు

13. పూర్వోక్తైస్సత్త్వజాతైస్తు సమం తత్త్వాని యోజయేత్ ।
షడ్భావవికృతిశ్చాస్తి జాయతే వర్ధతేఽపి చ ॥

14. పరిణామం క్షయం నాశం షడ్భావవికృతిం విదుః ।
అశనా చ పిపాసా చ శోక మోహా జరామృతీ ॥

15. ఏతే షడూర్మయః ప్రోక్తాష్షట్కోశస్తదనంతరమ్ ।
త్వక్చ రక్తం మాంసమేదో మజ్జాస్థి వినిబోధతజ॥

16. కామక్రోధౌ లోభమోహౌ మదో మాత్సర్య మేవ చ ॥
ఏతేఽరిషట్కా విశ్వశ్చ తైజసః ప్రాజ్ఞ ఏవ చ ॥

17. జీవత్రయం సత్త్వరజస్తమాంసి చ గుణత్రయమ్ ।
ప్రారబ్ధాగా మ్యార్జితాని కర్మత్రయమితీరితమ్ ॥

18. వచనాదానగమన విసర్గానందపంచకమ్ ।
సంకల్పోఽధ్యవసాయశ్చాప్యభిమానోఽవధారణా ॥

19. ముదితా కరుణా మైత్రీ ఉపేక్షా చ చతుష్టయమ్ ।
దిగ్వాతార్క ప్రచేతాశ్వి వహ్నీంద్రోపేంద్రమృత్యుకాః ॥

20. ధాతా చంద్రశ్చతుర్వక్త్రో రుద్రః క్షేత్రజ్ఞ దేవతాః ।
ఆహత్య తత్త్వజాతానాం షణ్ణవత్యస్తు కీర్తితాః ॥

మున్ను వివరించిన ముప్పదియారు తత్త్వములతో గూడ షడ్భావవికారములు షడూర్మ్ములు, షట్కోశములు, అరిషడ్వర్గములు, జీవత్రయము, గుణత్రయము, కర్మత్రయము, కర్మేంద్రియ వ్యాపారములు అంతఃకరణ

వృత్తులు, మైత్ర్యాది చతుష్టయము, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, అంతః కరణ దేవతలు-అనునివి చేరి తొంబది యారు తత్త్వములని చెప్పబడు చున్నవి ఈతొంబదియాఱు తత్త్వముల నతిక్రమించినవాడే పరమాత్మ యగును

## షణ్ణవతి(96) తత్త్వార్థవివరణము.

1 ౧. శ్రోత్రము- ఇది సర్వశబ్దములను గ్రహించును. ఆకాశాంశము దిక్కు అధిదేవత

2 ౨ త్వక్కు- ఇది స్పర్శంబును గ్రహించును వాయ్వంశము వాయువు అధిదేవత

3 ౩. చక్షువు- ఇది సర్వరూపంబులను గ్రహించును అగ్న్యంశము సూర్యుడు అధిదేవత

4 ౪. రసనము- ఇది సకలరసంబులను గ్రహించును జలాంశము వరుణుడు అధిదేవత

5. ౫ ఘ్రాణము- ఇది సర్వగంధమును గ్రహించును పృథ్వ్యంశము అశ్వినీదేవతలు అధిదేవతలు

## జ్ఞానేంద్రియములు.

**జ్ఞానేంద్రియాణి శ్రవణం స్పర్శనం దర్శనం తథా ।**
**రసనం ఘ్రాణమిత్యాహుః పంచ తేషాం తు గోచరాః ॥**
**శబ్దః స్పర్శస్తథా రూపం రసో గంధ ఇతి క్రమాత్ ॥**

6 ౧. వాక్కు – వచించుట, పృథ్వ్యంశము. బ్రహ్మ అధిదేవత.

7 ౨ పాణి- ఇచ్చుట,పుచ్చుకొనుట జలాంశము. ఇంద్రుడు అధిదేవత

8 ౩ పాదము –వచ్చుట, పోవుట, తేజోంశము, ఉపేంద్రుడు అధిదేవత.

9 ೪ గుదము- మలవిసర్జనము చేయునది వాయ్వంశము మృత్యువు అధిదేవత

10 ೧೦ ఉపస్థము- శుక్ల, శోణిత, మూత్ర విసర్జనము చేయునది ఆకాశాంశము ప్రజాపతి అధిదేవత

## కర్మేంద్రియములు.

**వాక్పాణ్యంఘ్రిగుదోపస్థాన్యాహుః కర్మేంద్రియాణి చ ।**
**వచనాదానగమనవిసర్గానందదాః క్రమాత్ ॥**

11 ೧ ప్రాణము- ఉచ్ఛ్వాసము చేయునది పృథ్వ్యంశము హృదయము స్థానము రక్తవర్ణము, విష్ణువు అధిదేవత

12 ೨ అపానము - నిశ్శ్వాసము చేయునది జలాంశము గుదము స్థానము ఇంద్రగోపవర్ణము విశ్వకర్త అధిదేవత

13 3 సమానము- ఆహారమును పచనంబు చేసి పోషించునది ఆకాశాంశము నాభిస్థానము గోక్షీరవర్ణము జయుడు అధిదేవత

14 ೪. ఉదానము - సుషుప్త్యవస్థ యందు సకలేంద్రియములను ఉపసంహరించుకొని జాగ్రదవస్థయం దాయా యింద్రియములను ఆయాగోళకము లందుంచుకొనుచుండి ప్రాణోత్క్రమణ కాలంబున నూర్ధ్వగతిని బొందునట్టిది అగ్న్యంశము. కంఠము స్థానము కృష్ణవర్ణము. అజాడు అధిదేవత.

15 ೫ వ్యానము- శరీరమునంతయు వ్యాపించియుండి యింద్రియాదులకు బలమిచ్చి యుద్ధరించునది వాయ్వంశము సర్వాంగము స్థానము విద్యుత్కాంతి విశ్వయోని అధిష్ఠానదేవత

ఇవి ఐదును పంచప్రాణవాయువులు

**ప్రాణోఽపానస్సమానశ్చోదానవ్యానౌ చ పంచకమ్ ।**

**ప్రాణ ఆద్యో హృది స్థానే అపానస్తు పునర్గుదే।**

**సమానో నాభిదేశే తు ఉదానః కంఠమాశ్రితః ।**

**వ్యానస్సర్వేషు చాంగేషు వ్యావ్య తిష్ఠతి సర్వదా ॥**

**అథ వర్ణాస్తు పంచానాం ప్రాణాదీనామనుక్రమాత్ ।**

**రక్తవర్ణో మణిప్రఖ్యః ప్రాణవాయుః ప్రకీర్తితః ।**

**అపాన స్తనమధ్యేతు ఇంద్రగోప సమప్రభః ।**

**సమానస్తు ద్వయోర్మధ్యే గోక్షీరధవళప్రభః ।**

**ఆపాండర ఉదానశ్చ వ్యానో హ్యర్చిస్సమప్రభః ॥** అని ప్రమాణము

16 ౧ శబ్దము – శ్రోత్రముచే సకల శబ్దములను గ్రహించును. ఆకాశమునందు మాత్రముండునది ఆకాశాంశము.

17 ౨ స్పర్శము – చర్మముచే స్పర్శమును గ్రహించునది పృథివ్యప్తేజో వాయువులయందు మాత్ర ముండునది వాయ్వంశము

18. ౩ రూపము– నేత్రముచే రూపములను గ్రహించునది పృథివ్యప్తేజస్సులందు మాత్రముండునది అగ్న్యంశము

19 ౪ రసము – నాలుకచే రుచులను గ్రహించునది పృథివీజలములందు మాత్రముండునది జలాంశము.

20 ౫ గంధము – నాసికచే వాసనలను గ్రహించునది పృథివియందు మాత్రముండునది ఇవి ఐదును విషయములనియు, తన్మాత్రలనియును, శ్రోత్రాదీంద్రియములకు లేక ఆకాశాది పంచభూతములకు గుణము లనియును జెప్పంబడును

21 ౧ మనస్సు – సంకల్ప వికల్పములను జేయునది కంఠము స్థానము, చంద్రుడు అధిదేవత వాయ్వంశము

22 ౨ బుద్ధి– నిశ్చయించునది ముఖము స్థానము చతుర్ముఖుడు

అధిదేవత. అగ్న్యంశము

23 3 అహంకారము- అభిమానించునది హృదయము స్థానము రుద్రుడు అధిదేవత, పృథ్వ్యంశము

24 ४ చిత్తము- ధారణచేయునది నాభిస్థానము. జీవుడు (వాసుదేవుడు) అధిదేవత, జలాంశము

ఈ చెప్పినవి నాలుగును అంతఃకరణ చతుష్టయ మనబడును

**మనోబుద్ధిరహంకారశ్చిత్తం చేతి చతుష్టయమ్ ।**
**సంకల్పోఽధ్యవసాయశ్చాప్యభిమానోఽవధారణా ॥**

**మనః స్థానం గళాంతం చ బుద్ధిస్థానం ముఖం తథా।**
**అహంకారం తు హృదయం చిత్తం నాభౌ యథాక్రమమ్॥**

25 ౧ ఆకాశము- ఆకాశ పంచీకరణ చక్రమును జూడుము

26 ౨ వాయువు వాయుపంచీకరణ చక్రమును జూడుము.

27 3 అగ్ని- అగ్ని పంచీకరణ చక్రమును జూడుము

28 ४ అప్పు- జల పంచీకరణ చక్రమును జూడుము.

29 ౫ పృథ్వి-పృథివీ పంచీకరణ చక్రమును జూడుము

**ఖానిలాగ్ని జలపృథ్వీ మహాభూతాని మన్యతే ।**

ఐదును ఆకాశాదిపంచభూతము లనంబడును

30 ౧ స్థూలశరీరము - ఇదే అన్నమయకోశము ఇది పృథివ్యాది తత్త్వపంచకముతో గూడినది అనగా అస్థిమాంస చర్మ నాడీ రోమములనెడు పృథ్వీతత్త్వములును, లాలా మూత్ర స్వేదరక్త శుక్లము లనెడు జలతత్త్వ ములును, క్షుత్తృష్ణా నిద్రాలస్య సంగమములనెడు అగ్నితత్త్వములును, భావన వల్ల నాకుంచన ప్రసారణ చలనము లనెడు వాయుతత్త్వములును, రాగద్వేష

భయ వ్రీడా మోహములనెడు ఆకాశతత్త్వములును జేరి ఈయిరువదియైదు తత్త్వములు స్థూలశరీర మనంబడును

31 ౨ సూక్ష్మశరీరము - ఇదే లింగశరీరము మనబడును అపంచీకృత పంచమహాభూతములయొక్క పదునేడు తత్త్వములు సూక్ష్మశరీర మనబడును

32 3 కారణశరీరము - అవిద్య లేక అజ్ఞానమే కారణశరీరము స్థూల సూక్ష్మశరీరములకు హేతువు అజ్ఞానమై యున్నది ఆ హేతువు ఇదియే యగుటచేత కారణశరీర మనంబడెను మరియు దీనికి అహంకారత్వము, అవిద్య, అజ్ఞానము, బీజము, తమస్సు, భ్రాంతి, అనిర్వాచ్యము, అసదాది అను నీమొదలగు నామములును కలవు అనాద్యవిద్యాఽనిర్వాచ్యాకార ణోపాధిరుచ్యతే॥ అని ప్రమాణము ఈమూడును శరీరత్రయ మనబడును శరీరత్రయమునకంటె విలక్షణుడైనవాడే పరమాత్మం డనంబడును ''ఉపాధిత్రితయా దన్యమాత్మానమవధారయేత్'' అని ప్రమాణము

33 ౧ జాగ్రదవస్థ - చతుర్దశేంద్రియములు, చతుర్దశేంద్రియా ధిదేవతలు, చతుర్దశేంద్రియ విషయములు అను నీనలుబదిరెండు (42) తత్త్వములు జాగ్రదవస్థ యనంబడును ఇంద్రియములు అధ్యాత్మము, దేవతలు అధిదైవము, విషయములు అధిభూతములు అని తెలియందగినది 1. అధ్యాత్మ, 2 అధిదైవ, 3 అధిభూతములను నివి మూడును చేరినవి త్రిపుటి యనంబడును

34. ౨ స్వప్నావస్థ - జాగ్రదవస్థయందు శ్రోత్రాదీంద్రియములచే నను భవింపబడిన విషయజ్ఞానముచే తోచునట్టి వాసన లెవ్వియో అవి రోమాగ్రము (రోమము నందు వేయింట నొకపాలు, లేక నూరింట నొకపాలు) వలె సూక్ష్మముగా కంఠమందుండు హితాయనెడి నాడియం దుండును సంస్కార స్వరూపవాసనయొక్క శబ్దాదివిషయమును, వాని యొక్క జ్ఞానమును అగు నీద్వివిధ స్వరూపములును ఏనిద్రాకాలమునందు

కలుగుచున్నవో దానిని స్వప్నావస్థయని చెప్పవలయును

35. ౩ సుషుప్త్యవస్థ - నిద్రయందుండి లేచి ''నేనీసమయమున ఏదియు నెరుంగను, సుఖముగా నిదురించితిని'' అనినిద్రాకాలమునం దనుభవిం పబడినట్టి అజ్ఞానస్మరణ స్వరూపజ్ఞానమే (గాఢనిద్రయే) సుషుప్త్యస్థ అనంబడును బుద్ధ్యాదుల విలయావస్థయే సుషుప్త్యవస్థ ఈమూడును త్రివిధావస్థ లనబడును

36 అజ్ఞానము- ఇది ముక్తికి ప్రతిబంధక మైనది

37 ౧ జాయతే- పుట్టుట

38 ౨ అస్తి- ఉండుట

39 ౩ వర్ధతే- పెరుగుట

40 ౪ విపరిణమతే- మార్పు చెందుట

41 ౫ అపక్షీయతే - తగ్గుట

42 ౬ వినశ్యతి- మరణము నొందుట

ఈ ఆరును షడ్భావ వికారము లనంబడును

43. ౧ అశనము-( ఆకలి) ఇది ప్రాణధర్మము.

44. ౨ పిపాస-(దప్పి) ఇది ప్రాణధర్మము.

45 ౩. శోకము- ఇది మనోధర్మము

46. ౪. మోహము - ఇది మనోధర్మము

47. ౫. జర (వృద్ధత్వము) ఇది దేహధర్మము

48. ౬ మరణము- ఇది దేహధర్మము

ఈ ఆరు షడూర్ము లనబడును అనగా సంసారసముద్రమునకు అలలవంటివని తెలియునది కొందఱిమతంబున జననము, మరణము, క్షుత్తు, తృష, హర్షము, శోకము అనునివి ఆఱును షడూర్ములని చెప్ప బడియున్నవి

49 ౧. చర్మము-(తోలు)

50. ౨. రక్తము-(నెత్తురు)

51. 3. మాంసము-(కండ)

52 ४. మేదస్సు-(క్రొవ్వు)

53 ౫ మజ్జ-(మూలుగు)

54. ౬ అస్థి - ( ఎముక)

ఈ ఆరును షట్కోశ మనబడును కోశము అనగా ఒరవలె నుండునది యని యర్థము అనగా మూలుగునకు ఎముక ఒరవలె నున్నది. ఇట్లన్నిటిని తెలియునది

55. ౧ కామము- ప్రాప్తవస్తువు నందలి భోగేచ్ఛ

56 ౨ క్రోధము- ద్వేషము

57 3 లోభము- అప్రాప్తవస్తువు లభింపవలయు ననెడి యిచ్ఛ

58 ४ మోహము- ఆత్మానాత్మముల యొక్క లేక శుభాశుభకర్మముల యొక్క అవివేకము అనగా భ్రమ

59 ౫. మదము- గర్వము

60 ౬. మత్సరము- పరోత్కర్షాసహనము అనగా ఇతరుల మేలును జూచి యోర్వమి.

ఈ ఆరును అరిషడ్వర్గము అనబడును.

**కామక్రోధస్తథా లోభో మదో మాత్సర్య మేవ చ ।**
**మోహం చేత్యరిషడ్వర్గ మహంకార గతం విదుః ॥**

అరిషడ్వర్గము అహంకారమును బొందినదని తెలియదగినది

61 ౧ విశ్వుడు- జాగ్రత్తయందు దేహత్రయాభిమానియైన జీవుడు

62 ౨ తైజసుడు- స్వప్నమునందు స్థూలదేహాభిమానమును విడిచి

సూక్ష్మదేహకారణ దేహములను శరీరద్వయాభిమానియైన జీవుడు

63 3 ప్రాజ్ఞుడు-సుషుప్తియందు కారణదేహమను ఏకశరీరాభిమానియైన జీవుడు

ఈ మూడును త్రివిధజీవు లనబడును

64 ౧ సత్త్వగుణము-జ్ఞానము,

65 ౨ రజోగుణము- రాగద్వేషములు

66 3 తమోగుణము- అజ్ఞానము

ఈ మూడును త్రిగుణము లనబడును ఇవి ప్రకృతి జన్మములు, ''సత్త్వంరజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః'' అని భగవద్గీతయందు చెప్పబడియున్నవి

**అనిర్వాచ్యా మహాఽవిద్యా త్రిగుణాపరిణామినీ।**
**రజస్సత్త్వం తమశ్చేతి తద్గుణాః పరికీర్తితాః॥**

అనగా ఇట్టిదని వచించనలవి గానిదియును, మహత్తైనదియును అగు అవిద్య(ప్రకృతి)త్రిగుణములుతో గూడినదై వికారములు గలదై యున్నది. దాని గుణములు సత్త్వరజస్తమములని చెప్పబడుచున్నవి అని శివగీతయందును చెప్పబడుచున్నది

67 ౧ సంచితము- జన్మాంతరములయందు కూడబెట్టిన కర్మము.

68 ౨. ఆగామి- వర్తమాన జన్మమందలి క్రియమాణకర్మము

69 3 ప్రారబ్ధము- వర్తమానజన్మముయొక్క ఫలానుభవకర్మము

ఈ మూడును త్రివిధకర్మము లనంబడును.

70 ౧. వచనము- పలుకుట

71.౨. ఆదానము- ఇచ్చుట, పుచ్చుకొనుట

72 3 గమనము- పోవుట, వచ్చుట

73 ౪ విసర్జనము- మలోత్సర్జనము చేయుట

74 ౫ ఆనందము=కామవిషయసుఖము నొందుట

ఈ అయిదును కర్మేంద్రియ వ్యాపారములు

75 ౧ సంకల్పము- ఇది మనస్సుయొక్క వృత్తి

76 ౨ అధ్యవసాయము- ఇది బుద్ధియొక్క వృత్తి

77 3 అభిమానము- ఇది అహంకారముయొక్క వృత్తి

78 ౪ అవధారణము- ఇది చిత్తముయొక్క వృత్తి

ఈ నాలుగును అంతఃకరణ వృత్తులనబడును

**స్మృతిర్భీతిర్వికల్పాద్యాః బుద్ధిస్స్యాన్నిశ్చయాత్మికా ।**
**అహంమమేత్యహంకారశ్చిత్తం చేతయతే యతః ॥**

అనగా స్మరణము, భయము, వికల్పము అనునివి మనోవ్యాపారములు నిశ్చయజ్ఞానము బుద్ధివ్యాపారము నేను నాది అనునివి అహంకార వ్యాపారము విచారరూపము, చిత్తవ్యాపారము.

79 ౧. ముదిత- దేవునియందును, పుణ్యవంతులయందును ఉత్కృష్టమైన గుణముగలవారియందును ముముక్షువునందును గల ప్రీతి

80 ౨ కరుణ- దుఃఖవంతునియందును. నికృష్టగుణము గలవాని యందును, అజ్ఞానియందును జిజ్ఞాసువునందును గల దయ

81 3 మైత్రి- ఈశ్వరభక్తులయందును, ఉపాసక పురుషుల యందును, కర్మిష్ఠులయందును, సమానగుణ యుక్తులయందును భాగ్యవంతులయం దును వీరు మావారు అనెడి బుద్ధి.

82 ౪ ఉపేక్ష-పాపిష్ఠులు, ద్వేషులు, పామరులు, అల్పగుణయుక్తులు అగు వీరియందలి రాగద్వేష రహితమైన ఉదాసీనత్వము.

ఈ నాలుగును మైత్ర్యాది చతుష్టయ మనంబడును.

88 ౧ దిక్కు– శ్రోత్రేంద్రియాధిష్ఠాన దేవత

84 ౨ వాయువు– త్వగింద్రియాధిష్ఠాన దేవత

85. 3 సూర్యుడు– చక్షురింద్రియాధిష్ఠాన దేవత

86. ౪. వరుణుడు– రసనేంద్రియాధిష్ఠాన దేవత.

87 ౫ అశ్వినీ దేవతలు– ఘ్రాణేంద్రియాధిష్ఠాన దేవతలు

88 ౬ అగ్ని– వాగింద్రియాధిష్ఠాన దేవత

89 ౭ ఇంద్రుడు– పాణీంద్రియాధిష్ఠాన దేవత

90 ౮ ఉపేంద్రుడు–(వామనుడు) పాదేంద్రియాధిష్ఠాన దేవత

91 ౯ యముడు– గుదేంద్రియాధిష్ఠాన దేవత.

92 ౧౦ చతుర్ముఖబ్రహ్మ– గుహ్యేంద్రియాధిష్ఠాన దేవత.

93 ౧౧ చంద్రుడు–(ప్రద్యుమ్నుడు) హృదయాధిష్ఠానదేవత

94 ౧౨ బ్రహ్మ– (వాసుదేవుడు) బుద్ధ్యధిష్ఠానదేవత.

95 ౧3 రుద్రుడు–(అనిరుద్ధుడు) అహంకారాధిష్ఠానదేవత

96 ౧౪ జీవుడు– (సంకర్షణుడు) చిత్తాధిష్ఠానదేవత.

ఈ పదునాలుగును జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, అంతఃకరణాధి దేవతలు

**సర్వగం సచ్చిదానందం జ్ఞాన చక్షుర్నిరీక్షతే ।**
**అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వంతం భానుమంధవత్ ।**

పైజెప్పబడిన తొంబది ఆరుతత్త్వములకు విలక్షణుడయ్యు చరాచరములలో వ్యాపించియు జ్ఞానస్వరూపుడైయుండు ఆత్మస్వరూపమును జ్ఞానదృష్టిగల వాడు చూచి ఆనందించును ప్రకాశమైన సూర్యోదయమును గ్రుడ్డివాడు ఏలాగున చూడజాలడో ఆలాగున జ్ఞానదృష్టి గలుగనివాడు దైవమహిమను జూడజాలడు

**ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే ।**

ఎవండు త్రిగుణాతీతావస్థను పొందియుండునో వాడుగుణముల యొక్కయు; గుణవిషయములయొక్కయు వృత్తులయందును ఉదాసీనుడై, అనగా సాక్షియై గుణములచేత చలింపకయుండునో, గుణములుగాని, గుణవిషయములుగాని గలిగినచో, అవి త్రిగుణముల యొక్క స్వభావముచేత జరుగుచుండునని తలంచి వానితో కలియక విలక్షణుడై యుండునో, గుణము లచేత ఎవనికి చలనము గలుగదో, అనగా వికారము కలుగదో, వాడు ముక్తా త్ముడు, అనగా తురీయుడు అని భగవంతుడు గుణత్రయ వివరణములో ఉపదేశించియున్నాడు కావున సాంఖ్యము అనగా పంచీకరణ ముచే మనము గ్రహించవలసిన తత్త్వమియ్యదని తెలిసి నిత్యశాంతిని, చలింపని ఆత్మసౌఖ్యమును, బొందవలసినదేగాని విషయములతోను, గుణ ములతోను గలిసి బంధావస్థ నొందకూడదు

**కొందఱాత్మతత్త్వము నెరుంగుదు మటంచు**
**గర్వులై నిక్కి చిత్తనిగ్రహము లేక**
**యుపరతి సుఖంబు గానక విపులవిషయ**
**రాగలోలత జెడుదు రూరక మహాత్మ.**

**జ్ఞానవిజ్ఞానయుతుడయ్యు సంతతంబు**
**నాత్మభావన లేకున్న నతని యింద్రి**
**యంబులు మనంబు తమకు వశంబుజేసి**
**విషయసుఖముల జవిజూపి వెతలబెట్టు.**

అని సీతారామాంజనేయామనస్కము ఆత్మసోదరులారా! సాంఖ్య విషయమై మనము అత్యవసరముగా గ్రహించవలసిన విషయము దీనితో పూర్తి చేయడమైనది

# సాంఖ్యవిచారణ

ఇంక ప్రస్తుతసాంఖ్య విచారకులు పొరపాటుబడు భాగమును సంగ్రహముగా తెలిపెద ప్రభువుయొక్క ఆజ్ఞ లేక భృత్యులు ఏలాటి కార్యమును చేయరు గదా, ఆలాగున ఆత్మయొక్క సంకల్పము లేక యింద్రియములు గాని, యింద్రియాధిదేవతలుగాని యేలాటి కార్యమును చేయజాలవు. మరియు పంచభూతాత్మకములగు పృధివ్యాదులతో సంబంధించిన యింద్రియాదికములు జడములు అవి చైతన్యావలంబనము లేక స్వయముగా ఏకార్యమును చేయజాలవు కనుక సూర్యచంద్రవరుణాది దేవతలుగూడ సర్వశక్తుడగు సర్వేశ్వరుని యాజ్ఞానుసారముగా జగద్వ్యాపారము చేయుచుండునని ప్రబలమైన శ్రుతి చెప్పుచుండగా అవిచారపూర్వకమై అవివేకసంకులమైన ఈ బుద్ధి యేలాగున గలిగినదో విచారింపజాలను

**భయాదస్యాఽగ్ని స్తపతి భయాత్తపతి సూర్యః ।**
**భయాదింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః ॥**

(కఠోపనిషత్తు)

సర్వశక్తుడగు సర్వేశ్వరాజ్ఞ ననుసరించి అగ్ని ప్రకాశించుచున్నది సర్వే శ్వరుని యాజ్ఞకు భయపడి సూర్యుండు జ్యోతిశ్చక్రరేఖను తప్పక యుండి ప్రకాశించుచున్నాడు సర్వేశ్వరాజ్ఞకు భయపడి యింద్రుడు స్వర్గాది లోక పరిపాలనము చేయుచుండును. అదేప్రకారము సర్వేశ్వరునాజ్ఞకు భయపడి మృత్యువును తన కార్యము చేయుచున్నది ఈలాగున పంచభూ తాత్మకమగు జగత్తును తత్తద్దేవతలును నియతికి లోబడియున్నవి సమష్టిలో నేలాగున నుండునో వ్యష్టిగతమగు ఆత్మకును ఆలాగున ఇంద్రియములును, ఇంద్రియాధిదేవతలును ప్రవర్తించేలాగున చేయుటయే మోక్షమనియు, చేయకపోవుటయే బంధమనియు గ్రహించవలయును

సత్యాత్ములారా! సత్యస్వరూపమగు బ్రహ్మము నుపాసించువారలారా! మరియు మీకొక సంగతి చెప్పెద మీ శరీరములో జరుగు

ఇంద్రియవ్యాపారము లన్నియు నియతి ననుసరించి ప్రవర్తించినచో మీకు సుఖమును అనీతిగా ప్రవర్తించినచో దుఃఖమును గలుగుచున్నది గదా! అనగా మీ యుచ్ఛ్వాస నిశ్శ్వాసముల గతి సరిగాలేక ఆగిపోయినచో లేక అధికరించినచో మీరేలాగున జీవింపజాలరో, అదేరీతిగా మూత్రాశయము మలాశయము సరిగా పనిచేయక తమకృత్యము నిర్వహింపనిచో మలమూత్రములు స్తంభించినచో, మీరు ఏలాగున ప్రాణసంకటమునకు లోబడుదురో అదేరీతిగా అతిమూత్ర మును అతివిరేచనమును కలిగినచో జీవయాత్ర యేలాగున జరుపజాలరో, అదేరీతిగా జీర్ణాశయము చక్కగ పనిచేయకగాని యెక్కువ పనిచేసినగాని యే లాగున జీర్ణశక్తి లేక దుఃఖము నొందుదురో, అదేరీతిగా మీయొక్క నియమిత కృత్యము నతిక్రమించి యింద్రియములు ప్రవర్తించినచో తప్పక బద్ధులై నరకము నొందుట నిక్కము,

మరియు రాజాజ్ఞను ఉల్లంఘించి దుష్టజనులు విజృంభించిన లోక మేలాగున అరాజక మొందునో, రాజునుగూడ ఏలాగున హతమొనర్తురో ఆలాగున ఆత్మయైన ప్రభువునకు బాహ్యాభ్యంతరమున గల ఇంద్రియములు, ప్రజలు అనగా సేవకులు వీరు సత్యాత్మస్వరూపమగు ఆత్మయొక్క ఆజ్ఞను అతిక్రమించి స్వేచ్ఛాప్రవృత్తి నొందిరేని ఆత్మకును, దేహ మునకును హాని కలుగుట సిద్ధము. సత్యస్వరూపుడగు రాజాజ్ఞలో ప్రజ లుండిన ఏలాగున రాజ్యము సర్వమంగళకరమై యుండునో, ఆలాగున వశ ములైన ఇంద్రియములు గలవారి జీవితము, సౌఖ్యప్రదముగా నుండును.

ఇక బ్రహ్మాండమును గురించి విచారింతము, భూమి, చంద్రుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు, శని, సూర్యుడు మొదలగు గ్రహము లన్నియు వారివారి నియమము ననుసరించి జ్యోతిశ్చక్రములో తిరుగుచుం డుటచేతనే ఈ ప్రపంచము సుఖముగా నిలుచుచున్నది ఆయాగ్రహములు వానివాని నియమమును ఉల్లంఘించి నడచుచుండిన ఒక్కొక్క గోళమును మరొక దానితో ఢీకొని బ్రహ్మాండ మంతయు ధ్వంసమైపోవును నియమము తప్పి నడచిన రైల్ ఇంజనులు ఒక్కొక్కటిని ఢీకొనిన ఏలాగున తుక్కు

తుక్కులై పోవునో, అండపిండ బ్రహ్మాండముల స్థితియు అటులే యగునని గ్రహించవలయును కావున సర్వేంద్రియములను సర్వకాలములలో సంయమము చేయు మహాత్ముండు నిత్యసుఖమును పొందును

**ఇంద్రియాణాం ప్రసంగేన దోషమృచ్ఛత్యసంశయమ్ ।**
**సన్నియమ్య తు తాన్యేవ తతస్సిద్ధిం నియచ్ఛతి॥**

మనోధర్మమగు సంకల్పమువలననే తరచుగా నింద్రియములు ప్రవర్తించుచున్నవి. కావున ఇంద్రియనిగ్రహము చేయవలయునని చెప్పబడుచున్నది ఇంద్రియములు విషయములందు జేరుటవలన మానవుడు సందియము లేక యిహలోకమున గష్టమును, బరలోకమున బాపమును నొందును గావున, నట్టి ఇంద్రియములను బంధించిననే, మోక్షాది సంసిద్ధి గలుగును కావున నింద్రియములను జయింపవలయును

**ఇంద్రియాణాం విచరతాం విషయేష్వపహారిషు ।**
**సంయమే యత్న మాతిష్ఠేద్విద్వాన్ యంతేవ వాజినామ్ ।**

విద్వాంసుడైనవాడు అనగా జ్ఞాని, సకలదైవిక గుణములను నశింపజేయు నవి యగు విషయములలో ప్రవర్తించెడు ఇంద్రియములను మంచి సారథి రథ ములకు గట్టియుండు గుఱ్ఱములను స్వాధీనములో నుంచికొని నడుపుటకు చక్కని ప్రయత్నము చేయులాగున నియమించుటకు ప్రయత్నించవలయును

**ఇంద్రియాణాం తు సర్వేషాం యద్యేకం క్షరతీంద్రియమ్ ।**
**తేనాస్య క్షరతి ప్రజ్ఞా దృతేః పాత్రాదివోదకమ్ ॥**

సర్వేంద్రియములలో ఒక్క యింద్రియ మైనను విషయాసక్తితో నుండినచో అట్టివాని దైవికజ్ఞానము, బెజ్జముపడిన పాత్రలోని ఉదకము కారిపోవునట్లు నశించిపోవును

ఆత్మసోదరులారా! ఒక్కరంధ్రముగల పాత్రలోగల జలమే నశిం

చునప్పుడు చాలరంధ్రములు గల పాత్రలోగల జలము విషయమై చెప్పవల యునా? ఆలాగున ఒక్క యింద్రియము వశపడకపోయినను జ్ఞానము దాని వలన నశించునని చెప్పుచుండగా, బొత్తిగా ఇంద్రియనిగ్రహమే అక్కరలేదని చెప్పువారి స్థితినిగురించి యేమి తలంచవలయును?

**శ్రుత్వా స్పృష్ట్వా చ దృష్ట్వా చ భుక్త్వా ఘ్రాత్వా చ యో నరః ।**
**న హృష్యతి గ్లాయతి వా స విజ్ఞేయో జితేంద్రియః ॥**

ఏ మేధాసంపత్తి గలవాడు స్తుతివచనములచేగాని, నిందావచనములచే గాని దుఃఖవచనములచేగాని, సుఖవచనములచేగాని హర్షశోకముల నొందడో, మృదు, కఠిన, శైత్య, రూక్ష – మొదలైన స్పర్శములున్ను, స్త్రీ పురుషుల శరీరస్పర్శమున్ను గలిగినను వికారము నొందడో, సురూపమును గాని కురూపమునుగాని ఎట్టి దృశ్యమును గాని చూచి భ్రమత నొందడో, రుచికర పదార్థమునుగాని అరుచికర వస్తువునుగాని భుజించియు సుగంధ మును దుర్గంధమునుగాని గ్రహించియు సుఖములందు సంతోషము నొందడో, కష్టములందు దుఃఖపడడో, వాడే జితేంద్రియు డనంబడును అని మనుస్మృతి

ఓ కరుణాత్ములారా! దివ్యవిజ్ఞానఘనీభూతులారా! యికను ఈ సాంఖ్యవిషయమై మనము గ్రహించవలసిన విషయము కొంత గలదు దీనిపై ఆధారపడియే శ్రీమధ్వాచార్యులు తనయొక్క ద్వైతమతమును ప్రతిష్ఠిం పగలిగిరి అయితే యిదిన్ని యింతవరకు మనము వచించిన భావములన్ని యున్ను జడములనుగురించిన సంగతియేకాని చైతన్యాత్మయను ఆత్మను గురించినదిగాని, దైవమును గురించినదిగాని కాదని మాత్రము మనము జ్ఞప్తి లోనుంచి వర్తింపక పోయినచో ద్వంద్వమహాసంసార చక్రమునుండి తప్పించు కొనజాలము. కాని జడములో శుద్ధి పొందనిచో మలినజలమున సూర్యప్రతి బింబము కనబడజాలని చందంబున చైతన్యాత్మలో ఒకప్పుడున్ను మనము ప్రవేశింపజాలము

శ్రీమధ్వాచార్యులు ద్వైతమతము స్థాపించుటకు కారణము అక్కాలమున నుండెడి నివృత్తి మార్గస్థులలో నెక్కువమందిన్ని యిప్పుడుండెడి కొందరు శుష్క వేదాంతులవలె సత్య ధర్మ దయాది దైవగుణములకు దూరులై యుండవచ్చునని తోచుచున్నది బుద్ధిర్బుద్ధి మతామస్మి అనగా బుద్ధిమం తులలో దైవికవిషయమగు నెక్కువ బుద్ధిగల వారు భగవదంశులని శ్రీకృష్ణ పరమాత్మ గీతయందు ఉపదేశించియున్నారు కావున మతకర్త లందరును దైవాంశ సంభూతులై యుండవలయును తత్కాలానుసారముగా దైవసం కల్పము చేతనే దివ్యపురుషుల జన్మము గలుగుచుండును ఆత్మజ్ఞాని యైన వాడు ఈతత్త్వమును కనుగొన గలుగును శ్రీమధ్వసిద్ధాంతమున ఐదు భేదములు గలవు, 1 జీవజడ భేదము, 2 జడజడభేదము, 3 జీవజీవ భేదము, 4 జీవేశ్వరభేదము, 5 జడేశ్వర భేదము – ఇవియే పంచ విధము లగు భేదములు ఇది నిత్యమని గూడ వారు వచింతురు

అయితే విశిష్టాద్వైతస్థాపకులగు శ్రీరామానుజాచార్యులున్ను, అద్వైత మత స్థాపకులగు శ్రీశంకరాచార్యులున్ను ఇట్టి భేదమును అంగీక రించినవారలైనను ఇది ముముక్షు అవస్థలో నుండునేగాని ముక్తావస్థలో లేదని మాత్రము సిద్ధాంతీకరించిరి అంతేగాక వ్యవహారదశలో కానుపించినను పారమార్థిక దశలో లేదని దృఢీకరించిరి అంతేగాక అట్టి భేదము నిత్యము కాదనియు, గుణముల పరిణామముచే గలుగుచుండుననియు, కావున ఆగంతుక మనియు స్థిరపరచిరి మనకు ఈమూడు మతములున్ను సేవ్యమానములు స్థూలదేహ సంస్కరణ పరమగు శుద్ధికొరకు శ్రీమధ్వ మతమున్ను, సూక్ష్మదేహనిర్మలత్వము కొరకు శ్రీరామానుజమతమున్ను, పరబ్రహ్మసాక్షాత్కారసిద్ధి కారణ మహాకారణ శుద్ధివలన గలుగవలసి యుండుటచే అద్వైతమతమగు శ్రీశంకరమతమున్ను మనకత్యవసరములు

మొదటిది నిష్కామకర్మయోగపరమగు అనుష్ఠానమున్ను, రెండవది నిర్మలభక్తి సమన్వయ పరమగు భక్తితత్త్వమున్ను కాగా మూడవది

బ్రహ్మాత్మైక్య జ్ఞాన సాక్షాత్కారముకొరకు ఉపయోగపడునని శ్రీభగవాన్ రామకృష్ణ పరమహంసలవారు వచించియున్నారు ఈ త్రిమతస్థులున్ను ఈమూడింటిలోను సదా ప్రయత్నము గలవారలై యున్నారు. ఇప్పుడు గల వేదాంత వైపరీత్య సంగతిని అనుసరించి మనమున్ను ముక్తావస్థ గలుగువరకు నీ మధ్వమత మవలంబించి మార్గప్రయాణము చేయుట శుభదాయకము.

కాని అంతరాత్మయందు ఏకత్వదృష్టిని ప్రాథమిక దశనుండి అలవాటు వరచుకొనక పోయినచో చుక్కానులేని పడవ చందంబున గమ్యస్థానము చెందక స్థూలములగు నామరూప గుణ సంకలిత ఘోరసంసారసాగర మధ్యమున సుడిగుండములో చిక్కుకొని మునిగిపోవుట మాత్రము నిక్కము. ఇప్పుడు సామాన్యు లందరున్ను వాక్కుతో అభేదము చెప్పువారలేగాని క్రియ యందు భేదము పోగొట్టినవారరుదు ఇట్టి విషయములో శ్రీమధ్వాచార్యుల దివ్యపాదకమలము మనకు వందనీయము.

ఇక మనయొక్క ఉద్యమము లోనికి మెల్లమెల్లగా ప్రవేశించెదము. ఇంద్రియములకు గుణములు స్వాభావికములు అని గదా వేదాంతులలో కొందరు చెప్పుచున్నారు

**రాగద్వేషభయం లజ్జా మోహం చైవ యథా తథా ।**
**నభః పంచవిధః ప్రోక్తాస్సమాంశాః పరికీర్తితాః ॥**

భాగానుక్రమప్రకారము ఆకాశతత్త్వములలో పృథ్వ్యంశము రాగము జలాంశము ద్వేషము అగ్న్యంశము భయము, వాయ్వంశము లజ్జ ఆకాశాంశము మోహము. సరి అట్లైన ముక్తాత్ములగు మహనీయులకు రాగము గాని, ద్వేషముగాని, భయముగాని, మోహముగాని, లజ్జగాని కనబడుట లేదు వారి శరీరములో పృథివీ, జల, అగ్ని, వాయు, ఆకాశములనెడి తత్త్వములు లేవా? బద్ధాత్ములకు మాత్రము అట్టి దోషములు కనబడుచున్నవి ముక్తాత్ములలో కనుపడుట లేదు దీనికి కారణమేమి? మరియు అంతయు పంచభూతాత్మకమైనదే అనినచో అంతయు నొకేవిధముగా నుండవ లయునే

గాని వేరువేరుగా కనబడుటకు కారణమేమి? ఒక్కొక్కరున్ను లోతుగా విచారించవలసియుండును

దృష్టాంతముగా పంభూతాత్మకమైన పృధివీతత్త్వమగు మాణిక్యాది రత్న ములకున్ను, వట్టి బండకున్ను గుణములు వేరువేరుగా కనుపించుటకు కా రణమేమి? సువర్ణమునకున్ను, తామ్రమునకున్ను, ఇనుమునకున్ను ఏకార ణముచే వేరువేరు గుణములు గలిగినవి? మధుర ఫలములకున్ను, పులుపు ఫలములకున్ను, చేదు ఫలములకున్ను ఎందువలన మార్పు గలిగినది ? ఇవి పృధివీతత్త్వాంశముతో కూడినవి, ఆలాగున జలతత్త్వములో రుచి అరుచి గలుగుట, అగ్నితత్త్వములో నీల, రక్త, పీత వర్ణములతోగూడి ప్రకాశించుట ఎందువలన గలిగియుండును? వాయ్వంశములో సుగంధ దుర్గంధము లున్ను, ఉష్ణశీతలములున్ను, ఏకారణమువలన గలుగుచున్నవి? అదే ప్రకారము మృదు, కఠిన, కరుణ ప్రేమాది వచనములున్ను జనులలో కాను పించుటకు కారణమేమి? ఇది ఆకాశతత్త్వము. మానవులలో పరమ సాధు మూర్తులున్ను, కఠినాత్ములున్ను దేనివలన కలుగుచున్నారు? బద్ధావస్థలో నుండు కఠినాత్ములు ముక్తావస్థలో కరుణాళువులుగా మారుటకు కారణ మేమి? గోవున్ను, పులియున్ను భిన్నభిన్నగుణములతో నేల యుండ వలయును? విషమునకున్ను అమృతమునకున్ను ఎందువలన మార్పు గల్గు చున్నది? అసురులును దేవతలున్ను దేనివలన భిన్నులైరి? కావున దీనిపై విచారణ సలిపినచో సత్వ రజస్తమో గుణములయొక్క పరిణామమే కారణమని అంగీకరించియే తీరవలయును ఒక్క మామిడి కాయను చూడుడు. లేతగానున్న కాలమున వగరుగాను మధ్యకాలమున పులుపు గాను, పండుగానున్న కాలమున మధురముగాను మారుచుండును ఇదే గుణములయొక్క మార్పని గ్రహింపవలయును

ఇంతవరకు విచారము చేసినది జడమును గుఱించినదేగాని దైవమును గురించినది కాదు. ఇది మనము విడిచిపెట్టవలసిన విషయమే అయితే సత్యా సత్యముల నరయక ఇదమిత్థమని న్యాయాధిపతి యేలాగున

తీర్పు చేయజా లడో అదే ప్రకారము జడజీవ ఈశ్వరుల భేదము నరయక దైవత్వము నొంద జాలరని వేదాంతశాస్త్రము చెప్పుటచేతనే సాంఖ్యమున విచారము చేయ వలయునని యేర్పడినది ఈ మూడు గుణములను దాటి త్రైగుణ్యా తీతావస్థ గల్గునప్పుడే మనకు నిర్మలాకాశమున భాస్కరుడు కనుపించునట్లు దైవత్వము గోచరించును అంతవరకు తెల్లవస్త్రమైనను రక్త, పీత, కృష్ణ వర్ణములతోగూడిన వస్త్రముయొక్క తెలుపు కనపడక రంగులవర్ణము మాత్రము ఏలాగున కనుపించునో ఆలాగున గుణములతో గూడియుండు వరకు శుద్ధాత్మ తత్త్వము గనుగొనజాలము అదే పరిపూర్ణము, అచలము, శివము, అద్వైతము, దైవము, సత్తు కావుననే గుణ త్రయాతీతుడు గావలయునని సచ్ఛాస్త్రము నిష్కర్షగా బోధించుచున్నది

కావున నీవిషయమై గీత పదునాల్గవ అధ్యాయమును జదివి తదర్థమును మనన నిదిధ్యాసనముల చేసిన నీసంగతు లన్నియు మనకు సుస్పష్టముగా గోచరము గాగలవు అట్లు కానిచో శ్వేత, రక్త, కృష్ణ పుష్ప ములకున్ను అట్టిగు ణములు గల వస్తువులకున్ను మధుర, ఆమ్ల, కటు, తిక్త రసములకున్ను, సత్త్వ రజస్తమోగుణములకున్ను కారణ ముండజాలదు దీనిలో గల పరమరహస్యమేమన? ఒక్కరికి తమోగుణము ఉండగా పృథివీ, జల, అగ్ని, వాయు, ఆకాశములలోగల తమోగుణాంశము ఒక్కచోట గూడు చుండును రజోగుణము గలుగునప్పుడు పై జెప్పిన పంచభూతములలో గల రజో గుణాంశము వానియం దధికరించి యుండును సత్త్వగుణము గలిగి నప్పుడు పంచభూతములయొక్క సాత్త్వికాంశము వానిలో వచ్చి చేరు చుండును. కను కనే పృథివి సర్వరసయుక్తమైనను చెరకు మధురాంశమును, చింతచెట్టు ఆమ్లాంశమును, ముష్టిచెట్టు చేదు అంశమున్ను తీసికొని వృద్ధి నొందు చుండును దీనికి కారణము వాటివాటి బీజానుగుణమై యుండును

అదే ప్రకారము మానవులున్ను సత్త్వ, రజస్తమోగుణముల ననుసరించి ఆయాగుణములలో రమించుచుందురు అయితే మానవుడు నిజమైన దైవబీజము గలవాడగుటచే అది నిత్యముగాను, తక్కినగుణములు

అగంతు కములుగా నుండును. మానవుని జడములగు, వృక్షాదులతో ఉపమించుట కడుంగడు పాతకమే యగును. వానిని చైతన్యాత్మయగు దైవముతోనే ఉపమిం పవలెను. అప్పుడే గుణములనుండి విముక్తి పొందుటకున్ను, గుణరహితము చేసికొనుటకున్ను అతని ప్రయత్నము జరుగును. కనుకనే వేదము 'అసత్య మసి' అని ఉపదేశింపక 'తత్త్వమసి' అని దివ్యభావమును ఉపదేశించినది. ఈవేదాను గుణ ఉపదేశము లోక మంతటను విచ్చలవిడిగా వ్యాపించునప్పుడే యీ జనులయొక్క దెయ్యపు స్వభావము పోయి దైవపు స్వభావము వర్ధిల్లును. గుణములకు సదా పరిణామము గల్గుచుండును. ఇందుకు మామిడికాయ దృష్టాంతము. ఈ మూడు గుణములను అతిక్రమించు నప్పుడే పంచకోశాతీత తురీయజ్ఞానము గల్గును.

**రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత।**
**రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా ॥**

రజస్తమోగుణములను అణచివేసి సత్త్వగుణావిర్భావ కాలమున సాత్త్వికము నిలిచియుండును. అలాగున సత్త్వగుణమును, తమోగుణమును అణగ ద్రొక్కి రజోగుణము నిలిచియుండును. అదేరీతిగా సత్త్వగుణమును, రజోగుణమును లీనపరచి తమోగుణము అధికరించి నిలుచును. అనగా ఈ మూడు గుణములు శాశ్వతములు కావు. సదా మారుచుండునని భావము. మరల ఈయొక్కొక్కగుణములోను మూడేసిగుణములు మిశ్రమములై యుండును. అనగా సత్త్వగుణములో, సత్త్వగుణము సత్త్వగుణములో, రజోగుణము. సత్త్వగుణములో తమోగుణము – ఈలాగున రజో గుణములో సత్త్వగుణము, రజోగుణములో రజోగుణము, రజోగుణములో తమోగుణము.–ఈలాగున తమోగుణములో సత్త్వగుణము, తమో గుణములో రజోగుణము, తమోగుణములో తమోగుణము, మరల ఈమూడింటిలో మూడుగుణములు అంతర్లీనములై యుండును. ఈమూడుమూళ్ళు తొమ్మిదిన్ని 9 మూళ్ళుతోకలసి 27గుణములతో గూడియుండును.

చతుర్విధప్రాణికోట్ల స్థూలసూక్ష్మకారణ శరీరత్రయములోను కేవలము సత్త్వముగాని, కేవలము రజస్సుగాని, కేవలము తమస్సుగాని గల శరీర ముండదు కేవలము సత్త్వము సిద్ధపురుషులకు మాత్రమే యుండును తక్కినవారికి హెచ్చుతగ్గులతో మిశ్రమమై యుండును సత్త్వగుణము గల వారికి గూడ ఒకానొక్కప్పుడు కొంచెము రజస్స్వభావముగాని, తామస స్వభావముగాని కానుపించుటకు కారణము పైజెప్పినదే అదే ప్రకారము కేవలము రజోగుణము గలవారికిగూడ ఒకానొక్కప్పుడు కొంచెము సత్త్వగుణముగాని తమోగుణముగాని కానుపించు రహస్యమును నిదే అదే ప్రకారము కేవలము తమోగుణ ప్రధానునికిగూడ ఒకానొకప్పుడు కొంచెము సాత్త్వికభావమున్ను, ఒకప్పుడు రాజసభావమున్ను కానుపించుటకు కారణము పైజెప్పినదే కాని యేగుణము ఎక్కువ యుండునో అది శాశ్వతముగాను, తక్కినవి మెరుపువలె అప్పుడప్పుడు కనుపించియు మాయమై పోవుచుండును

ఈ రహస్యము నుద్దేశించియే యజ్ఞోపవీతము మొదట మూడు పోగులతో గూడినదై, మరల మూడుమూళ్ళు తొమ్మిదిచేసి, తొమ్మిది మరల మూడుగా చేయు రహస్యమై యున్నది. కావున ఈజగత్తంతయు త్రిగుణాత్మకమని తెలిసికొనుటకొరకే బ్రహ్మచారికి మూడుపోగులు గల యజ్ఞోపవీతము ధరింపచేయబడు రహస్యమై యున్నది యజ్ఞోపవీతమునకు సూక్ష్మములై 27పోగులు గలవు మరియు పుట్టునప్పు డిది లేదు సన్న్యసించునప్పు డిది తీసివేయబడును కావున సృష్టికి ముందు ఆత్మప్రకృతి రహితముగా నుండునని యు, ముక్తావస్థలో మరల ప్రకృతి రహిత మగుచున్నదనియు ఆయజ్ఞోపవీతము మనకు తెలియజేయుచున్నది సృష్టినిగురించి చెప్పెడు శాస్త్రములలో ఈ 27తత్త్వములను గురించి విస్తారముగా గనందగును దీని ననుసరించియే 27నక్షత్రము లేర్పడి యీ జగజ్జాలము నడుచుచున్నది. ఈతత్త్వమును గోచరింపజేయుకే లలాటమందు త్రిపుండ్రము ధరించెడు పరమరహస్యమై యున్నది త్రిమూర్తులున్ను, త్రిగుణములున్ను, త్రిగుణా

త్ములున్ను, దేహత్రయమున్ను, కాలత్రయమున్ను, లోకత్రయమున్ను, జీవత్రయమున్ను, వేదత్రయమున్ను, అవస్థాత్రయమున్ను, కర్మత్రయమున్ను, సృష్టిత్రయమున్ను, సంధ్యాత్రయమున్ను, అక్షరతయమున్ను ఏర్పడి యీజగత్కార్యము నడుచు చున్నది వ్యాహృతిత్ర యమున్ను, వర్ణత్రయ మును, ధ్యానత్రయమున్ను,గలుగుటకున్ను ఇదే కారణము ఇవన్నియు క్షరముతో గూడినవే అక్షరుడగు ఆత్మ, అనగా బ్రహ్మము దీని కావల నుండును ముక్తియు పైచెప్పిన మూడింటికి విలక్షణమై యుండునని ముముక్షువులు సదా గ్రహింపవలసియుండును అప్పుడు మాత్రమే లోకాతీతజ్ఞానము ననుభవింపవచ్చును

కావున ముముక్షువులారా! భక్తులారా! సాధకులారా! దైవనిష్ఠులారా! ఋషిసంతానములారా! దైవాత్మస్వరూపులారా! గుణత్రయ రహితమై, శివమై, అమృతమై, అద్వయమై, ఆనందమై, నిత్యమై, అచలమై, పూర్ణమై యుండు నేయొక్కదైవత్వము గలదో దానిని పొంది నిత్యము శాశ్వత సుఖము నొందుదురుగాక!

ఈగుణత్రయవిషయమై వివేకచూడామణిలో చెప్పినవిషయము చూడందగినది

**అజ్ఞానమాలస్య జడత్వ నిద్రా ప్రమాద మూఢత్వ ముఖాస్త మోగుణాః ।**
**ఏతైః ప్రయుక్తో న హి వేత్తి కించిన్నిద్రాళువత్ స్తంభవదేవ తిష్ఠతి ॥**

ఇంక దీనియందు దమోగుణముల నన్నిటిని వానియొక్క బలమును నూహించుకొననగును శిష్యా! జ్ఞానశూన్యము, జాగు, జడభావము, నిదుర, జాగరూకత లేకుండుట, మౌర్ఖ్యము మొదలుగాగలవి తమస్సుయొక్క గుణములు వీనితో గూడినవాడు కించిత్తైనను దెలియలేడు నిద్రించు వానివలెను స్తంభమును బోలియు నుండును

**సత్త్వం విశుద్ధం జలవ త్తథాఽపి తాభ్యాం మిళిత్వా సరణాయ కల్పతే ।**
**యత్రాత్మబిమ్బః ప్రతిబిమ్బితస్సన్ ప్రకాశయత్యర్క ఇవాఖిలం జగత్॥**

ఏ సత్త్వగుణము జడాత్మునియొక్క బింబము ప్రతిఫలించినదై సమస్తమైన జడ పదార్థమును, సూర్యునివలె బ్రకాశింపజేయుచున్నదో? అట్టి సత్త్వ గుణము జలమువలె పరిశుద్ధమైనది, అట్లయ్యు నా సత్త్వము రజస్తమో గుణములతో గూడి చిదాత్మ ప్రతిబింబ రక్షణము కొరకు గల్పించబడు చున్నది

**మిశ్రస్యసత్త్వ భవన్తి ధర్మా స్త్వమానితాద్యా నియమా యమాద్యాః ।**
**శ్రద్ధా చ భక్తిశ్చ ముముక్షుతా చ దైవీ చ సంపత్తి రసన్నివృత్తిః ॥**

శిష్యా! అమానిత్వము మొదలగు ధర్మములు సత్యాహింసా బ్రహ్మచర్యాది దశవిధ యమములు, నియమములు, శ్రద్ధయు, ననురాగము, మోక్షేచ్ఛయు, దైవికసంపత్తి, అసద్వస్తువులనుండి మరలుట మొదలగు నన్నియు రజస్తమో మిళితమగు సత్త్వముయొక్క ధర్మములు,

**విశుద్ధ సత్త్వస్య గుణాః ప్రసాదః స్వాత్మానుభూతిః పరమా ప్రశాన్తిః ।**
**తృప్తిః ప్రహర్షః పరమాత్మనిష్ఠా యయా సదానందరసం సమృచ్ఛతి ॥**

నైర్మల్యము, స్వాత్మానుభవము, మహోత్కృష్టమగు నంతరింద్రియ నిగ్రహము, నిత్యతృప్తి, నిత్యసంతుష్టి, ఇంక నెల్లప్పుడు దేనిచే నాత్మానం దరసమును బొందగలడో! అట్టి పరమాత్మనిష్ఠయు ననునివి రజస్తమోగుణ సంపర్కములేని సత్త్వముయొక్క గుణములు ఇదే గుణత్రయాతీత స్థితియొక్క నిజావస్థ ఇదే మహాపురుషులయొక్క లక్షణమై యుండును ఇచ్చటికి వెళ్లనప్పుడు అతివేగముగా తిరుగుచుండు ప్రకృతి చక్రము ఆగిపో వును అప్పుడు ఈయాత్మ విముక్తి నొంది నిత్యసుఖమగు శాశ్వతపదవిలో నుండును



# పంచరత్నములు

(బ్రహ్మ శ్రీకవిసార్వభౌమ శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రులు గారిచే రచియింపబడి శ్రీసద్గురుస్వాములవారికి సభలో సమర్పింపబడిన పంచరత్నములు)

శ్రీమలయాళస్వామినే నమః

**ఓమిత్యేకాక్షరం యత్ప్రణవమభిహితం బ్రహ్మతత్త్వం సమస్తం**
**తద్ధ్యానైకాగ్ర చిత్త స్తదభవదమలం యస్తవత్త దేహః।**
**జ్ఞానానందస్వరూపం ఘనతరకరుణాసాగరం సర్వగమ్యం**
**మల్యాళస్వామినం తం మహితగుణయుతం మంత్రమూర్తింభజేఽహమ్॥1**

**బ్రహ్మాంశాత్సంప్రభూతస్సదసదవరగో వ్యాసభట్టారకోఽస్మి**
**న్నాంధ్రే గోగర్భనామ్నో గిరవరవివరాదద్య భక్తావనార్థమ్।**
**సంజాతః కాశిబుగ్గప్రథితమునినుత క్షేత్రవాసీ పునర్యో**
**మల్యాళస్వామినం తం మహితగుణయుతం మంత్రమూర్తింభజేఽహం2**

**సాధూనాం పాలనాయ ప్రబలదురితవిధ్వంసనాయాంధ్రభూమౌ**
**ధర్మాణాం రక్షణాయ ప్రభురఖిలజగన్నాయకోఽద్యావిరాసీత్।**
**బ్రహ్మశ్రీ శంకరార్యః పునరితి చ యతిం యం వదంతీహ సాధుం**
**మల్యాళస్వామినం తం మహితగుణయుతం మంత్రమూర్తిం భజేఽహమ్ ॥3**

**సన్న్యస్యేహస్థితానాం గృహధనవనితావాహనానాం సుసంగం**
**సోఽహం బ్రహ్మేతి వాచా శ్రుతిషు కలితయా వ్యాహరన్యో రరాజ।**
**తం సాక్షాచ్ఛంకరం సంయమిజనవరమం వ్యాసనామాశ్రమస్థం**
**మల్యాళస్వామినం తం మహితగుణయుతం మంత్రమూర్తిం భజేఽహమ్॥4**

**అహమస్మి బ్రహ్మసోఽస్మీత్యనువదమవరం బ్రహ్మసాక్షాదభూద్యో**
**విలసన్మూర్తిర్హతార్తిర్నిజ పదకమలధ్యాన సక్తోత్తమానామ్।**
**లలితం విజ్ఞాన తేజో బలకలితమహం నిర్మలం నిర్వికారం**
**మల్యాళస్వామినం తం మహిగుణయుతం మంత్రరూపం భజేఽహమ్॥5**

శ్రీపాద కృష్ణకవినారచితం పరమార్థదమ్।
మల్యాళస్వామినస్తోత్రం జీయాదాచంద్రతారకమ్ ॥ 6



# పద్యరత్నములు

(శ్రీమతి నందివాడ శేషమాంబగారిచే రచియింపబడిన
శ్రీ సద్గురు స్వాములవారికి సభలో సమర్పింపబడినవి.)

శ్రీదమై తతజనాహ్లాదమై వినుతహృ
ద్భేదమై యధికవినోద మగుచు
పంచమై వినుతి గావింపమై స్త్రీ లేగు
దెంచమై మది సంతసించ నగుచు
అందమై యానందకందమై సుందరీ
బృందమై యొకపెండ్లి చంద మగుచు
మాన్యమై భువి నసామాన్యమై దుర్వృత్తి
శూన్యమై యన్నిట ధన్య మగుచు
ప్రవిమలామోదభరితమై ప్రబల మగుచు
హృద్యమై కండ్లకత్యంత చోద్య మగుచు
వెలయు నీసభామండలి వినుతిసేయ
దరమె యేరికినైన భూస్థలిని లలిని. 1

చిత్రాసనమె రత్నసింహాసనంబని
యేమహామహుడు దానెంచె మదిని
కటికిరానేల జిక్కని మృదుశయ్యగా
నే మహామహుడు దానెంచె మదిని
కోరి ఖద్దరును దుకూల వస్త్రంబుగా
నేమహామహుడు దానెంచె మదిని
భూతిని మణిమయభూషణతతులుగా
నేమహామహుడు దానెంచె మదిని

అమరులకు మౌనితతులకు నలవిగాని
బ్రహ్మచర్య వ్రతముబూని వరగువాని
భువియశోవిశాలుండయి పొల్చు ఘనుని
విమలు మలయాళస్వామిని వినుతిసేతు. 2

అలనాటి శ్రీశంకరాచార్యుడే నేడు
మలయాళస్వామియై మహి జనించె
అలనాటి బుద్ధుడే యజ్ఞానమును బాప
మలయాళస్వామియై మహి జనించె
అలనాటి భీష్ముడే యచలబోధ నొనర్ప
మలయాళస్వామియై మహి జనించె
అలనాటి సద్వివేకానందమూర్తియే
మలయాళస్వామియై మహి జనించె

ననుచు జనులెల్ల బొగడంగ నాత్మధర్మ
రక్షణం బొనరింపంగ దీక్షబూని
యవతరించిన యీమలయాళస్వామి
దనరు గావుత మాచంద్రతారకముగ. 3

రేయింబవళులొక్కరీతిని శ్రమకోర్చి
తపమొనర్చిన మహాధన్యచరిత!
వారణాశినిబోలు వ్యాసాశ్రమంబును
నిర్మించి మించిన నిర్మలాత్మ!
ధర నెల్లరకు యథార్థంబు నిరూపింప
పత్రికల్ పంపు పవిత్రమూర్తి!
నిష్కామబుద్ధితో శుష్కవేదాంతముల్
ఖండించి విడిచిన కలుషరహిత!

హంసమంత్రార్థ మెరిగి యహింస పరను
ధర్మనుని బోధనముల సంతత మొనర్చి

భక్తజనులకు సుజ్ఞాన భాగ్య మొసగు
స్వామి గైకొను నానమస్కారశతము. 4

అడుగుటే తడవుగా నభయప్రదానంబు
లిచ్చియుంటివి గదా సచ్చరిత్ర!
చూచుటే తడవుగా సుగుణవంతుల జేసి
ప్రోచియుంటివిగదా పుణ్యసాంద్ర!
తలచుటే తడవుగా ధర్మకార్యము లెన్నొ
సలిపియుంటివి గదా సాధువంద్య!
వేడుటే తడవుగా విజ్ఞానఫలముల
వెదజల్లితివి గదా సదయహృదయ!

సకల దుష్కృతములను నాశన మొనర్ప
మహి నసాధారణోన్నత మహిమ గలిగి
దర్శనీయమౌ నూత్నావతారమెత్తి
యలరుచుంటివి గద మలయాళస్వామి ॥ 5

అజ్ఞానజనిత మోహాంధకారము బాపి వరల నివ్వసుధ నెవ్వరితరంబు?
అతికామమనెడు ఘోరాటవిం దహియించి వరల నివ్వసుధ నెవ్వరితరంబు?
సంసారదుఃఖ సంచయమను కరి నొంచి వరల నివ్వసుధ నెవ్వరితరంబు?
గర్వంబనెడు మహాపర్వతంబును గూల్చి వరల నివ్వసుధ నెవ్వరితరంబు?
మతము లన్నిట సర్వసమ్మతము జూపి వరల నిమ్మహిలోన నెవ్వరితరంబు?
రహిని మలయాళస్వామి తరంబుగాక అన్యులకు దరమౌనె యీయవనిలోన? 6

ఎందరువచ్చి రీసభను నీక్షణసేయ మహాత్ములున్ సుధీ
బృందము నేను తచ్చరణ రేణువు బోలుదునే మహాత్మ నీ
యందలి భక్తిచేత ముదమంది రచించితిగాన ప్రీతిమై
క్రందుగ దప్పులన్ విడిచి కైకొను మీయెడ గల్గునొప్పులన్॥ 7

మంగళమ్



# శ్రీగురుశ్శరణమ్

పరిశుద్ధజ్ఞానస్వరూపులగు ప్రియమైన ఆత్మసోదరీ సోదరులారా!

గీతాచార్యులగు శ్రీకృష్ణపరమాత్మయొక్క హృదయమే శ్రీమద్భగవద్గీత ఆగీతయే శ్రీగురుదేవులకు ప్రాణము శ్రీవారి సకల ప్రబోధములు, ప్రవచన ములు, రచనలు గీతాప్రమాణములతో నిండియుండును. నోరు తెరచినచో గీతా శ్లోకమే ప్రమాణము. జగద్గురు వాక్కగు గీతయే శ్రీసద్గురువాణిగా ప్రకటితమగు చుండెడిది గీతాతత్త్వప్రచారమే శ్రీవారి జీవితధ్యేయము శ్రీవారు ఎన్నిరీతులు గానో గీతా ప్రచారమొనర్చిరి. గీతార్థమును వ్యక్తపఱచుటకై యెన్నియో ప్రయత్న ములు గావించిరి పలురీతుల గీతాప్రచురణల గావించి గీతా ప్రచారమొనర్చిరి శ్లోక-తాత్పర్యములతో గీతను ప్రకటించిరి. కాని గీతార్థము ఇంకను స్పష్టము కానందుచే ప్రతిపదార్థ, తాత్పర్య, విశేషార్థములతో లోకవిఖ్యాతమగు శ్రీవారి గీతను ప్రచురించిరి దానితోను తృప్తిజెందక దానిలోనే సంపూర్ణగీతాశయమును ఒక్కొక్క అధ్యాయసారమును సంగ్రహించి శ్రీకృష్ణాశయము అనుపేరుతో ప్రకటించిరి అప్పటికిని తృప్తి లేదు కనుకనే గీతాగమనము(లక్ష్యము) అను గ్రంథము రచింపబడినది. అదియు తృప్తిజనకముగా లేదు అపుడు గీతాశయము అనీ గ్రంథము రచింపబడినది.

దీనియందు కర్మ, భక్తి, యోగ, జ్ఞానములను నాలుగు మార్గములు సమ న్వయపూర్వకముగా ప్రతిపాదింపబడినవి. మోక్షసౌధమున కీనాలుగును నాలుగు స్తంభముల వంటివనియు, వీటిలో ఏ ఒక్కటి లోపించినను మోక్షసౌధము నేల గూలిపోవుననియు యుక్తియుక్తముగా సప్రమాణముగా అనేక దృష్టాంతములతో శ్రీవారిందు గీతాభిప్రాయమును వ్యక్తపఱచిరి మఱియు ఈ నాలుగు యోగములు సమానముగా గలవారే పూర్ణపురుషులు, లోకోద్ధారకులు,

ఉత్తమోత్తములనియు, తక్కినవారు అంగవైకల్యము గలవారనియు నిరూపింపబడినది అయితే అధికార-సంస్కారభేదములను బట్టి ఒక్కొక్కరు వేరువేరు మార్గముల నవలంబించి దానినే ప్రధానముగా బోధించినను, గమ్యమును జేరుకొనుటలో మాత్రము అందరును సమానులే యనియు ఇందు ప్రతిపాదింపబడినది.

గీతాతత్త్వజిజ్ఞాసువుల కియ్యది పరమోపయోగకరమైన గ్రంథము గీతానురక్తులు గీతాభక్తులు దీనిని శ్రద్ధతో పఠించి ఆనందింతురుగాక! ఓమ్.

శ్రీసద్గురు సప్తమ పుణ్యారాధన,
శ్రీవ్యాసాశ్రమము, 25-7-69 విమలానందస్వామి.

ఓం

# శ్రీగీతాశయము

**సంసారసాగరం ఘోరం తర్తుమిచ్ఛతి యో నరః ।**
**గీతానావం సమాసాద్య పారం యాతి సుఖేన సః ॥**

ఏ నరుడు ఘోరమగు సంసారసముద్రమును దాటగోరుచున్నాడో, అతడు గీత యను నావ నాశ్రయించిన యెడల సుఖముగా దాటగలడు

గీతయొక్క ఆశయమేమి యని అనేకులు అనేకస్థలములలో నడుగు చున్నారు అనగా గీత నిష్కామకర్మయోగమును బోధించుచున్నదా? లేక భక్తియోగము నుపదేశించుచున్నదా? లేక ధ్యానయోగమును చెప్పుచున్నదా? లేక కేవలము జ్ఞానయోగమునే తెలుపుచున్నదా? యని పైప్రశ్న లన్నిటికిన్ని గల తాత్పర్యము మఱికొందఱు శ్రీభగవద్గీత గృహస్థాశ్రమము ముఖ్యమని యానతిచ్చుచున్నదా? లేక కేవల సన్న్యాసమునే పరమలక్ష్యముగా నాదర్శ మని యుపదేశించుచున్నదా! యని యడుగువారుగూడ గలరు ఇవన్నియు గాక ఇంకను అనేకవిధములగు సందేహములు కలవారు గలరు.

జాతి గుణములను బట్టియా? లేక కులమును బట్టియా? గీత యుపదేశించు చున్న దని యడుగువారు కొందఱు కలరు ఈ ప్రశ్నలన్నిటిని ఆధారము చేసికొని యొక్కొక్కరున్ను గీతకర్థము వ్రాసియున్నారు కావున ఎవరెవరికి ఏది ఇష్టమో దానిని వారు గ్రహించుకొనవచ్చును గీతయొక్క యాశయము ఇదమి ధ్ధమని నేటివఱకెవ్వరున్ను సర్వజనులకు సమ్మతిగా జెప్పినవారు లేరు వారి వారి యాశయము మాత్రము వ్రాయుచు ఇదే గీతయొక్క యభిప్రాయమని మాత్రము తమకిష్టము గలదానిని తెలుపుచూ వచ్చిరి శ్రీశంకరులకు పూర్వమే గీతకు తాత్పర్యము వ్రాసినవారు గలరని శ్రీశంకరులే తమ గీతాభాష్యమున తెలిపియున్నారు అప్పటినుండి శ్రీరామానుజాచార్యుల వారు ఉపాసనా ప్రపత్తి పరముగాను, శ్రీమధ్వా

చార్యులు కర్మోపాసనా పరముగాను అర్థమును వ్రాసినారు వారిలో శంకరులు అద్వైతపరముగాను, రామానుజాలు విశిష్టాద్వైతపరముగాను, మధ్వాచార్యులు ద్వైతపరముగాను గీతాభాష్యము చేసియున్నారు వీరి అనుయాయు లనేకభావములతో గీతకు భావమును రచించియున్నారు ఇంతేగాక శ్రీకంఠశివాచార్యులును గీత శివపరత్వమునే యుపదేశించు చున్నదని గొప్ప భాష్యము నొనర్చియున్నారు ఈ విషయములన్నియు విజ్ఞుల కెఱుకయే

ఈ విషయమై ఇపుడెవరికిన్ని సందేహము లేదు గాని గీత గృహస్థాశ్రమము నుపదేశించుచున్నదా! లేక సన్న్యాసాశ్రమమును బోధించు చున్నదా? యను నీ రెండు ప్రశ్నలపై నాధారపడి వాదప్రతివాదములు చేయుచున్నారు మఱికొందఱికి ఈ రెండింటియొక్క తత్త్వములను తెలిసికొనుటకుగూడ మిక్కిలి యభిలాష గలిగియున్నట్లు లోకములో గన్పించు చున్నది కావున ఆ విషయమై ఇచట తెలిపెలాగున సంకల్పము కలుగు చున్నది అయితే ఈ వాక్యము లన్నిటికిన్ని గీతలో ప్రమాణ వాక్యములు కలవు దీనియొక్క జయాపజయములకు వారి వారి బుద్ధి శక్తియు, విద్యాబలమున్ను మాత్రమే కారణము గాని, మఱియేలాటి యాధారమున్ను కన్పింపదు సర్వజ్ఞుడైన జ్ఞాని యైనచో జనులు చెప్పెడు అన్ని భావములున్ను గీతలో గలవనియు, మార్గము లన్నియు వారివారి మనస్సుయొక్క పరిపక్వత ననుసరించి యుండుననియు, సర్వజ్ఞుడగు శ్రీభగవానుని యభిప్రాయ మాలాగుననే యుండుననియు మాత్రమే చెప్పును.

ఈలోకములో అనేక వస్తువు లేలాగున సృష్టియందు కలవో, అవి యన్నియు నాకొక్కదాని కెట్లుపయోగపడునో యాలాగున సర్వజ్ఞుడగు శ్రీకృష్ణభగవానుని యుపదేశమున్ను నుండును వీటితో మనకేలాటి సంబంధము లేదుగాని పైజెప్పిన గృహస్థ, సన్న్యాసములనెడి రెండు వాక్యములే మనకిప్పుడు కావలసియున్నవి. అనగా మనుజుడు యావత్కాలము సంసారములో నుండి నిష్కామకర్మయోగము ననుష్ఠించుచుండవలయునా?

లేక సర్వసంగ పరిత్యాగియై సన్న్యాసిగా నుండవలయునా? యను విష యమును గుఱించి జనులకు సందేహము కలుగుచున్నది ఆవిషయమై ఈదేహోపాధియొక్క యాశయమును సంగ్రహముగా నీ క్రింద తెలిపెద

1 గురువుయొక్క ఆశయమంతయు శిష్యునియొక్క ఆచరణ మూలముననే యెఱుంగదగినది అయితే ఇచట దుష్టశిష్యునియొక్క వర్తనమును గుఱించి ఎవరున్ను తెలిసికొన నవసరము లేదు ఆ వాక్య మిచట ప్రస్తావింప యోగ్యము కాదు ఇచ్చోట శాస్త్రోక్తప్రకారము గల గురుశిష్యులయొక్క ధర్మమే గ్రహింపదగినది మఱియు నాచార్యుడు ఏ శిష్యుని గుఱించి ఏమి చెప్పునో ఆ శిష్యునియొక్క ధర్మమే గురువుయొక్క యుపదేశసారమై యుండును అపుడు గదా! గురువర్యుని యుపదేశము నాచరణలో పెట్టినవా డగును గురునియొక్క యాజ్ఞను పాలించుటగదా శిష్యునియొక్క ధర్మము! వారిరువురు బింబ ప్రతిబింబములవలె నుందురు గొప్ప నిలువు టద్దపు పురో భాగమున నొకరు నిలిచినచో తనయొక్క ప్రతిబింబము ఏలాగున దర్ప ణములో ప్రతిబింబించునో, యాలాగున గురునియొక్క ప్రతిబింబము శిష్యు నియొక్క స్వరూపమై యుండును మఱియు గురువరేణ్యుడు తనయొక్క యాశయము శిష్యునియందు బ్రవేశపెట్టి దానిని లోకమున నుపదేశించు లాగున చేయుచుండును భ్రమర మేలాగున క్రిమిని తన రూపముగా మార్పు చేయుచున్నదో యాలాగున గురువరుడు శిష్యునియొక్క యుపాధిని తొలగించి తనయొక్క స్వరూపముగా జేయుచుండును కావున శ్రీకృష్ణ భగవానులచే నుపదేశము పొందిన తరువాత అర్జునుడు తన జీవితాంతము వఱకె ట్లాచరించెనో అదే గీతాచార్యుని యాశయమని విజ్ఞు లెఱుంగ వలయును ఇదే గీతయొక్క అభిప్రాయమని గ్రహించదగినది

ఇచటనే గీతను గుఱించిన విషయములో సందేహము కలుగుచున్నది అదేమన అర్జునుడు యుద్ధము చేయ నొల్లననియు, యుద్ధములో హతులైనవారి రక్తముతో తడిసిన రాజ్యభోగముల ననుభవించి జీవించుటకన్న యాచనావృత్తితో జీవితము గడపుటయే మేలనియు, అంతేగాక ఇట్టి పాపకర్మ

మగు యుద్ధకార్యములో ప్రవేశించుటకు కారణమైన మనస్సుయొక్క పాపము నుండి ఎట్లు విముక్తి పొందగలుగుదునా! యనియు దుఃఖాక్రాంతుడై వ్యాకుల హృదయముతో విలపించినట్లు ప్రథమాధ్యాయమున కన్పించు చున్నది

**అహో బత! మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్ ।**
**యద్రాజ్యసుఖలోభేన హన్తుం స్వజనముద్యతాః ॥**

ఏకారణముచేత మనము రాజ్యసుఖేచ్ఛచే బంధుజనులను చంపుటకు సిద్ధమయితిమో, ఆ కారణముచేత మహాపాతకములను చేయుట కుద్యుక్తులమైతిమి కటా ఏమి యాశ్చర్యము!

**కథం న జ్ఞేయమస్మాభిః పాపాదస్మాన్నివర్తితుమ్ ।**

ఈ పాపమునుండి మఱలుటకు ఏ యుపాయమేని కలదా యని తెలిసికొన ఎకు శక్తి లేకపోయినదిగదా యని విలపించుచు దుఃఖరోదనము చేయుచుండెను సంధులన్నియు సడలిపోయి , శరీరమునకు వణకు గలిగి, చేతులనుండి బాణములన్నియు జారిపోయి, నిలుచుటకు శక్తి లేనివాడై రథమందు గూలబడెను

ఇట్టి విరక్తియు, భక్తియుగల యర్జునుని శ్రీకృష్ణభగవానుడు తనయొక్క దివ్యమగు ధర్మబోధచేత సర్పవిషముచే మూర్ఛ నొందినవానిని గారుడమంత్ర ప్రయోగముచే విషరహితునిగా జేసివేసినట్లు బోధామృత మంత్రముచేత స్వధర్మనిర్వహణమున కన్న యుత్తమమార్గము మఱియొకటి లేదనియు, మానవుడు తన స్వధర్మమగు గృహస్థాశ్రమమునే అవలంబించ వలయునని యుద్బోధించి యర్జునుని లోకకార్యములనుండి మరల నివృక లోకములోనే బంధించి నిలుకడ కలుగజేసిన కారణముచే గృహస్థాశ్రమమే సరియైన మార్గమని శాస్త్రజ్ఞులు తలంచుచున్నారని చెప్పుదురు ఆలాగున గృహస్థాశ్రమ ములోనుండి స్వధర్మనిర్వహణము చేయుటలో బంధము కలుగకుండుట కొఱకే ఫలాభివాంఛ విడిచి కర్మము చేయుట కుపదేశించి

నదని గీతను గుఱించి ఈలాటి అభిప్రాయముల ననేకులు చెప్పుచుందురు

మఱియు గృహస్థాశ్రమ కార్యములు చేయక పోయిన, ఇంద్రియములు విషయములలో నొకవేళ ప్రవర్తింపకపోయినను మనస్సులో మాత్రము విషయవాంఛ కలిగి యుండును ఆలాగున నుండుట యాత్మవంచనమని గీతలో అనేకస్థలముల నొక్కి వక్కాణించబడియుండుటవలన గృహస్థాశ్రమములో ఉండి పరమేశ్వరార్పణముగా కర్మలు చేయుచుండుటయే సరియని యనేకులు తలంచుచున్నారు దీనికి సంబంధించిన ప్రమాణములు గీతలో అనేకములు కలవు అవి యన్నియు నిచట నుదాహరించిన వ్యాసము పెరిగి పోవునని తలంచి చేర్చకపోవడమైనది

ఇకను నొక గొప్ప అభిప్రాయముగూడ లోకములో కలదు అదేమన గీతోపదేశము నొందిన తరువాత అర్జునుడు స్వధర్మనిర్వహణమందే నిర తుడయ్యెనే కాని అన్నిటిని విడిచి ఎచ్చటికో అడవిలోనికిగాని, గుహలోనికి గాని పోయియుండలేదు ఇదియే దీనికి తార్కాణము కావున సంసారములో నుండి తామరాకు నీటిలో నుండియు తడవనట్లును, కుమ్మరపురుగు బురదలో నుండియు బురద నంటనట్లున్ను బంధనమును పొందకుండు టను భగవంతు డుపదేశించెనని తలంచుచున్నారు సంసారములో నుండి బం ధనము పొందక యుండుట యెట్లు సాధ్యమగు నని తలంచినచో నిష్కామకర్మ యోగమువల్ల సాధ్యమగునని పైజెప్పిన పద్మపత్రమును, కుమ్మరపురుగును దృష్టాంతముగా చూపియున్నారు కావుననే భగవద్గీత యాశయమిది యని యనేకులు చెప్పుచుందురు దీనికి కావలసిన ప్రమాణములనేకము లీగీతలో గలవు ఇంతటితో గృహస్థాశ్రమమే గీతాచార్యు లుపదేశించినదని చెప్పువారి యభిప్రాయము సంక్షిప్తముగ పూర్తిచేయవచ్చును

ఇక గృహస్థాశ్రమ మొకటియే యావత్కాలము జీవులకు శరణ్యముగా శ్రీకృష్ణభగవాను లుపదేశించి యుండలేదని తలంపు గలవారి యభిప్రాయ

మున్ను తెలిసికొనదగినది అయితే గృహస్థాశ్రమము నికృష్టమనిగాని, బంధనమనిగాని ఈయభిప్రాయము గలవారు చెప్పుట లేదు జీవిత యాత్రలో గృహస్థాశ్రమము రెండవ మజిలీ మాత్రమనియు, దీనివల్ల జీవుని యొక్క యాత్ర పూర్తి కాలేదనియు, ఇకను అవలికి నెట్టుకొని వెళ్లవలసి యుండుననియు, లేనిచో జీవితముయొక్క గమ్యమగు పరమ లక్ష్యమును, నిరతి శయ సౌఖ్యమును, జీవుడు చేరజాలడనియు వీరు తలంచుచున్నారు ఇదిన్ని శ్రీభగవానుని యాశయమే కాని మనుజాల కృత్రిమము కాదనియు తెలుపుచుందురు దీనికి సంబంధించిన ప్రమాణములు గీతలో నసంఖ్యాక ములు కలవు అని వారు నిరూపించుచున్నారు

నిష్కామకర్మయోగ మొకటి మాత్రము గీత యాశయమైనచో, గృహస్థా శ్రమముతో జీవితలక్ష్యమున్ను పూర్తియైనచో మూడవ అధ్యాయములో నుపదేశించిన కర్మయోగ మొకటి మాత్రము చాలును గదా! అయితే యొకే అధ్యాయములో ఆ విషయము లన్నియు పూర్తియగుటకు సాధ్యము కాక పోయిన ఎన్ని అధ్యాయములైనను ఆకర్మయోగ వాక్యములతోనే యుపదే శింపరాదా? శ్రీమద్రామాయణము, శ్రీమద్భాగ వతము మొదలగు ననేక మహాగ్రంథములు అనేకకాండములతోను, స్కంధములతోను, పర్వముల తోను, సర్గములతోను వ్రాసియుండేలాగున భగవానుడు ఏల అట్లు గీత నుపదేశింపరాదు? ఇదేరీతిగా అనేక కావ్యములు అనేకసర్గములతోను, అధ్యాయములతోను పూర్తిచేయుచున్నారు.

కావున కర్మయోగ మొకటి మాత్రము కాదనియు, ఇకను పైపై తరగతులకు జీవులు వెళ్లవలసి యుండుననియు దీని వల్లనే యర్థమగు చున్నది. కావుననే ద్వితీయాధ్యాయ మున సాంఖ్యయోగ మును, చతుర్థా ధ్యాయమున జ్ఞానయోగమును, పంచమాధ్యాయమున కర్మసన్న్యాస యోగమును, షష్ఠాధ్యాయమున ఆత్మసంయమయోగమును, సప్తమా ద్యాయమున విజ్ఞానయోగమును, అష్టమాధ్యాయమున అక్షరపర బ్రహ్మ యోగమును, ద్వాదశాధ్యాయమున భక్తియోగమును త్రయోదశా

ధ్యాయమున క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగమును, చతుర్దశాధ్యాయమున గుణ త్రయ విభాగయోగమును, షోడశాధ్యాయమున దైవాసుర సంపద్విభాగ యోగమును, అష్టాదశాధ్యాయమున మోక్ష సన్న్యాసయోగమునున్నూ ఉపదేశించుటకు కారణమైనది గీతయొక్క అంత్యమున మోక్షసన్న్యాస యోగము నుపదేశించుటచే ఆఖరున సన్న్యాసముతో సమాప్తి యగునని తెలియదగియున్నది

అయితే వర్తమానయుగమున సన్న్యాసమని చెప్పినచో కోపము, హేయ బుద్ధియున్నూ గలుగని వారు కలరా యని సందేహము కలుగుచున్నది దానికి వర్తమానకాలములో గల కొందఱు సన్న్యాసుల వర్తనమే కారణము గాని, నిజమైన సన్న్యాసము కాదు దీనినందఱున్నూ అంగీకరించుచునే యున్నారు సన్న్యాసముయొక్క విధిని చక్కగా నిర్వహించు సన్న్యాసుల కొఱత గలిగిన దగుటచేతనే దానియొక్క పవిత్రతకు హాని కలిగినదేకాని, యథార్థస్థితిలో అట్టి పవిత్రత యుండిన దానికి సమానమగు పుణ్యము, పావనత్వము మూడు లోకములందున్నూ లేదు జీవుడు విశ్రాంతి పొందవలసి యుండిన ఈ తాగ్యములో యాత్రచేసిన మాత్రమే కలుగును. బంధనము లన్నియు తెగిపోవలసియుండిన ఈయతిపవిత్ర మగుస్థితిలోనికి అందరు రావలసియుండును ఆ నిజమగు నిష్కామకర్మయోగమును నిజమైన సన్న్యాసిమాత్రమే చేయగలుగును అతడు మాత్రమే ఆ పునీతమగు, పుణ్యమగు, సంయమమగు, నిస్సంగమగు ఆ నిష్కామ కర్మయోగము నాచరింప గలుగును

సన్న్యాసమనగా బాహ్యవేషమని మాత్ర మెవ్వరున్ను తలంచగూడదు అవిద్యయొక్క త్యాగమే సన్న్యాసము సంకల్ప రాహిత్యమే సన్న్యాసము అజ్ఞాన రాహిత్యమే సన్న్యాసము అనాత్మభావములన్నియు విడిచి నిజమైన యాత్మభావములో నిలుచుటయే సన్న్యాసము అది బ్రహ్మచర్యాది ఏయా శ్రమములో నుండినను అనగా బ్రహ్మచర్యమందుగాని, గృహస్థమందుగాని వానప్రస్థమందుగాని యుండినను గలుగవచ్చును బాహ్యవేషము ఆశ్రమ

ముయొక్క చిహ్నము మాత్రమే యగును ఈ సన్న్యాసము బ్రాహ్మణాది జాతులలో నెందుండువారికైనను అజ్ఞాననాశదశలో గలుగును అట్టి దశలో కర్మలేమియు మిగిలియుండవు కాని నిష్కామ కర్మయోగము చిరకాల మాచ రించుటచే అంతఃకరణశుద్ధి గలుగునప్పుడు మాత్రమే అట్టి దశ కలుగును అట్టి ధర్మబోధమాత్రమే ఆముక్తజీవుడు చేయగలుగును ఆదివ్యపురుషుని ధర్మోపదేశముచే అనేక కోట్ల జనులు నిష్కామకర్మయోగు లగుదురు, త్యాగులగుదురు, నిర్మలభక్తు లగుదురు, మంచి సంయము లగుదురు, వైరాగ్యనిధు లగుదురు

ఈ యనుష్ఠానములు చిరకాలము చేయుటచే వారి అంతఃకరణము లోగల సంస్కారము లన్నియు నశించును అప్పుడు శుద్ధజీవు లగుదురు అపుడు వారున్ను సర్వకర్మపరిత్యాగు లగుదురు ఆ పవిత్రదశ యందు వారున్ను ధర్మోపదేష్టలు కాగలరు ఆ పావనదశలో కర్మలు చేసెడు కరణములు వారినుండి వదలిపోవును పరిపక్వదశకు వచ్చునపు డందఱికిన్ని అట్టిస్థితి కలుగునని సృష్టి రహస్యమే మన కుపదేశించుచున్నది అట్టి పరిపక్వ దశ గలుగనివారు కర్మలను విడుచుటచేతనే లోకము విపరీతస్థితిలోనికి వచ్చినది. పరిపక్వదశ కలుగునపుడు ప్రకృతిని తాను తొలగింప నక్కఱలేదు అదే స్వయముగా తొలగిపోవును అపుడు ముక్తజీవు డగును అట్లు కానిచో పతనము కలుగును అతి పవిత్రమగు మానవజన్మము నపుడు నష్టపఱచిన వారే యగుదురు. శ్రీకృష్ణభగవానులు గీతలో ఈరహస్యమునే యుపదేశించి యున్నారు

సృష్టిలో గల ఏ ధాన్యములుగాని, ఫలములుగాని, పత్రములుగాని, పరిపక్వదశలోనికి వచ్చునపుడు గడ్డినుండి, ప్రానునుండి స్వయముగానే జారిపడిపోవుచుండును అట్టి స్థితియే సన్న్యాస మనబడును ఏధాన్యములైనను పండునపుడు వాటి తృణమునుండి స్వయముగానే విత్తనము రాలు చుండును అలాగుననే ఏఫలమైనను ప్రగ్గునపుడు చెట్టు నుండి జారి క్రింద పడిపోవును అదేరీతిగ ఏపత్రమైనను పండునపుడు ప్రానునుండి

విడి(రాలి) పోవును పండిన ధాన్యమేలాగున చెడదో, భోజనమున కుపయో గపడునో, పండినఫలము లేలాగున మధురములై భోజనార్థము లగునో ఆలాగున స్వయముగా జ్ఞానపరిపక్వదశలో సన్న్యసించిన జీవియొక్క జన్మము ధన్యమగును అపుడు పండిన ఫలములవలెను, పండిన ధాన్య ములవలెను ఆ పుణ్యజీవి లోకమున గొప్ప యుపయోగకారి యగును జీవకోట్ల తాపత్రయమును శమింపజేయ శక్తిగలవా డగును అట్టివారే పూర్వ కాలపు సన్న్యా సులగుటచే వారికి ప్రపంచములో గొప్ప బహుమానము కలిగినది

లేత్రాయములో చెట్టునుండి బలాత్కారముగా కోయబడిన లేతకా యలుగాని, లేత్రాయువములో పెరకబడిన ధాన్యములు కాని ఎట్లు ఉపయోగము లేకపోవునో, ఆలాగున పరిపక్వత లేని సన్న్యాస మున్ను పతనహేతు వగును అందఱున్ను దీనిని అంగీకరించియున్నారు ఈ విధి తృణవృక్షాదులకు మాత్రము కాదు మనుష్యాదులకు, జంతువులకు కూడ కలదు గర్భములో శిశువులు పరిపక్వదశకు వచ్చునపుడు ఆ ప్రకృతి మాతయే యేలాటి యపాయమున్ను కలుగజేయక బైటికి నెమ్మదిగ పంపు చుండును కాలము పరిపక్వదశకు వచ్చిన, ఏజీవులున్ను తమ గర్భములో శిశువు నుంచజాలవు ఆలాగుననే పైర్లు పండునపుడు, కాయలు మ్రగ్గునపుడు ఎవరున్ను వాటిని కసువునగాని, వృక్షమునగాని నిలుపజాలరు ఇది ప్రకృతియొక్క నియమము పద్మము వికసించినపుడు పత్రము లన్నియు ఒక్కొక్కటే వదలిపోవునట్లు, అరటిచెట్టు గెలవేయునపుడు హస్తమునకు గల యొక్కొక్కపట్ట జారిపోవునట్లు జీవుడు ప్రబోధమునకు వచ్చునపుడు వాని ఇంద్రియములు, ఇంద్రియార్థములు, ఆవరణములు, కరణములు వదలిపోవుచుండును

అట్టి స్థితి జీవులకు కలుగకనే మేము గృహస్థాశ్రమమును విడువుమ నుట లేదు దీనిలోనే యుండుట ధర్మమనియు చెప్పుచున్నాము ఫలముల కున్ను, ధాన్యములకున్ను ఏలాగున వృక్షములతోను, పైర్లతోను సంబంధము

కలిగియున్నదో, అదేరీతిగా గర్భములోగల సర్వజీవరాసుల యొక్క మావియు, గర్భాశయముతోగూడి శరీరముతో సంబంధము కలిగి యుండును. ఫలములకు తొడిమ ఎటువంటిదో, జీవులకు నాభినాళమున్ను అటువంటిదే ఏలాటిభేద మున్ను లేదు ఓహో! సృష్టికర్తయొక్క మహిమయు, కరుణయు నెట్టిదో ఏమని చెప్పవచ్చును! పక్షుల గ్రుడ్లున్నూ ఈలాగుననే యుండును కావున జ్ఞానము పరిపక్వదశకు వచ్చునపు డందఱున్ను గృహస్థాశ్రమమను ప్రకృతివృక్షమునుండి విముక్తు లగుదురు

ఒకవేళ కారణపురుషులలో నెవరైన ఒకడు జీవన్ముక్తు డైనను, యావ జ్జీవితము బ్రహ్మచర్యమందుగాని, గృహస్థాశ్రమమందుగాని, వానప్రస్థమం దుగాని యుండవచ్చును అయినను ఆస్థానము లన్నియు నిమిత్త మాత్రము లగునని గ్రహించవలెను ప్రకృతిగుణములనుండి అతడు తప్పక విముక్తుడయ్యే యుండును ఇట్టివారు అరుదు టెంకాయలోగల జలము నశించునపుడు టెంకినుండి కొబ్బరి స్వయముగా వేఱుపడి యెట్లు కురిడి యగుచున్నదో, చింతకాయ పండునపుడు గుజ్జు తొక్కునుండి యేలాగున విముక్తి బొందుచున్నదో, ఆలాగున జ్ఞానపరిపక్వదశలో అందఱున్ను అజ్ఞానము నుండి విముక్తు లగుదురు

అట్లు పక్వముకాని దశలో సంసారమునున్ను, నిష్కామకర్మ యోగమునున్ను విడిచిపెట్టిన, చెట్టునుండి కోసిన లేత టెంకాయ వంటిదిగాను, పండని చింత కాయవంటిదిగాను నగును ఈ రహస్యమునే గీతాధర్మము మనకుపదేశించుచున్నది ఈ సన్న్యాసమిపు డీలాగుననే పరిణమించినది రాజనీతిలో జనులను నడుపుట లేకపోవుటచేతనే ఇట్టి దుఃస్థితి యేర్పడినది గొల్లవాడు లేని గొఱ్ఱెలగతి ఇపుడు భారతదేశమునకు పట్టినది అందువల్లనే బిచ్చకారులు అధికరించుట కున్ను, అనర్హులు సాధువులగుటకున్ను కారణమైనది సాధనరహితులు పూర్వకాలము సాధువులై యుండియుండలేదు సాధనాపరు లగుటచేతనే సాధువులను పేరుకలిగినది సాధనాత్సాధవః అని శాస్త్రము చెప్పుచున్నది

మఱియు దీనికి ముందు చెప్పిన గీతలోఁగల సాంఖ్యయోగాదులున్ను, ఆత్మసంయమ యోగాదులున్ను, భక్తియోగాదులు మొదలుగా గలవన్నియు నొకే నిష్కామకర్మయోగమునే బోధించుచున్నవా? లేక వేఱు వేఱు అనుష్ఠానముల నుపదేశించుచున్నవా? యని విచారణ చేయవలసి యుండును ఒక్కొక్క యధ్యాయము వేఱువేఱు యోగముల తెలుపుచున్నది అయితే అన్నిటియొక్క లక్ష్యము బంధవిముక్తియు, దైవప్రాప్తియు నగును ఇందువల్లనే శ్రీకృష్ణ భగవానుడు సర్వజ్ఞుడని తెలిసినది ఒక్క కర్మ యోగమును మాత్రముపదేశించిన భగవానుని నెవ్వరున్ను సర్వజ్ఞుడని చెప్పజాలరు అంతేగాక వేదముయొక్క సారమే గీతయని చెప్పినది నిజమైనచో వేదములలో నుపదేశింపబడిన కర్మ, ఉపాసనా, జ్ఞానములని యెడు వేదము యొక్క కాండత్రయము దీనియందుగూడ నుండియే తీరవలయును యోగము ఉపాసనలో అంతర్భూత మగుటచే కర్మోపాసనా జ్ఞానములని మూడుమాత్రము చెప్పబడినవి అంతేగాక వేదముయొక్క అంత్య సందేశమగు నుపనిషత్తను వేదాంతము లేనిచో నే విద్యకున్ను ప్రాణము లేదు. కనుకనే గీత ప్రతి అధ్యాయాంతమున ''ఉపనిషత్సు బ్రహ్మ విద్యాయాం'' యని యుపదేశించిరి

ఇచట జిజ్ఞాసువులకొక సందేహము కలుగుట కవకాశము కలదు అదేమన, ఒక నిష్కామయోగముచేతనే మోక్షము కలుగుచుండగా మఱల భక్తియోగము, ధ్యానయోగము, జ్ఞానయోగము మొదలగునవి యేల చెప్పవలయును? అని దీనికి సమాధానము కలదు ఆయుర్వేదములో అనేక ఔషధముల ప్రయోగములు కలవు. అట్లు ఏర్పడుటకు కారణమేమని యాలోచించిన, రోగము లనేకము లగుటచే అనేక ఔషధములు గూడ నుండవలసివచ్చెను అదేరీతిగా జీవుల సంస్కారము లనేకము లగుటచే అనేకయోగము లుపదేశింపబడవలసివచ్చినది

గీత అన్ని సామాను లమ్మెడు దుకాణము వంటిది ఎవరెవరికి నేయే సామానులు కావలయునో, అవి యన్నియు అచట దొరకును ఒకడు తనకు

కావలసిన యొక సామానును తీసికొని వెళ్ళునపుడు మఱియొక డది చూచి ఆ యంగడిలో ఆ ఒక్క సామాను మాత్రమే కలదని తలంచుట ఎంత పొర బాటో, ఆలాగున గీత కర్మయోగమునే యుపదేశించుచున్నది, – కాదు, గీత భక్తియోగమునే తెలుపుచున్నది, కాదు–కాదు గీత ధ్యానయోగమునే బోధిం చుచున్నది, అట్లు కాదు– గీత జ్ఞానమునే ఉపదేశించుచున్నదని చెప్పుటయు పొరబాటే యగును ఈ వాక్యము లన్నియు పైన తెలిపిన వచనములవంటివి మోక్షమును పొందవలసినచో జీవుల సంస్కారముల ననుసరించి నాలుగు యోగములున్ను గీతలో గలవు కనుకనే గీతకు ఇంత మహిమాతిశయము కలిగినది ఈ యోగము లన్నిటికి కావలసిన ప్రమాణములు గీతలో గలవు

ఎవరెవరి హృదయము ఏ రూపముగా నుండునో వారి దృష్టిలో అదే కనుపించును ఇదే దీనిలోగల రహస్యము నీలరక్తపీతాది వర్ణములుగల సులో చనముల ద్వారా చూచువారికి లోకమంతయు తమ అద్దపురంగువలెనే కను పించును కనుకనే కొందఱు గీత సాక్షాత్ ప్రపత్తినే యుదేశించుచున్న దనియు, కొందఱు– కాదు, కర్మయోగమునే తెలుపుచున్నదనియు, ఇంకొక రది సరి కాదు–గీత భక్తియోగమునే వెల్లడి చేయుచున్నదనియు, వేఱొకరు గీత ధ్యాన యోగమునే యుద్బోధించుచున్నదనియు, మఱియొకరు గీత గృహస్థాశ్రమ మునే ఎలుగెత్తి చెప్పుచున్నదనియు, అట్లుకాదు గీత సర్వసంగ పరిత్యాగరూప సన్న్యాసమునే యుపదేశించుచున్నదనియు చెప్పుదురు ఇవియన్నియుగాక అనేకు లనేక విధాభిప్రాయములను గీతను గుఱించి తెలుపుచుందురు. ఇవి యన్నియు దర్పణముయొక్క వర్ణము ననుసరించి దృశ్యమగపడు చుండునట్లు ఉండునని జ్ఞాని తెలుసుకొనుచుండును ఆదివ్యపురుషుని హృదయ సంస్కారము లన్నియు నశించినవగుటచే, శుద్ధస్ఫటికవర్ణ దర్పణమువలె తెల్లగనుండుటచే అన్నిరంగులున్ను వేఱువేఱుగా ఆ మహనీయుడు చూడగలుగుచున్నాడు ఇదియే దీనిలో గల రహస్యము, సత్యముగూడ నగుచున్నది

గీతయొక్క యాశయము బాగుగా నాలోచించిన, అంతఃకరణశుద్ధి

గలు గువలకు నిష్కామకర్మయోగము, దైవభక్తి గలిగియుండుటయు, తరువాత సర్వసంగ పరిత్యాగరూప సన్న్యాసమును గలుగచేసుకొనుటయు నగు చున్నది ఇచట సర్వకర్మ ఫలత్యాగము మాత్రము కాదు సర్వకర్మలను గూడ త్యజించి యేకాంతమున బ్రహ్మనిష్ఠ చేయవలయుననియే యగును. భగవద్గీత నుపదేశించిన పిమ్మట నుపదేశించిన యుత్తరగీత ఈతత్త్వమునే తెలుపుచున్నది అయితే అంతఃకరణముయొక్క సంపూర్ణశుద్ధి కలుగక సర్వకర్మ పరిత్యాగమగు బ్రహ్మనిష్ఠ చేయకూడదని గీత నొక్కి వక్కాణించు చున్నది

గీతోపదేశము పొందిన అర్జునుడున్నూ, పంచపాండవులున్నూ దీనికి తార్కాణము కనుకనే ధర్మరాజార్జునాదులు అయిదుగురున్నూ, ద్రౌపదియు నిష్కామకర్మయోగమును బాగుగా ననుష్ఠించి, అంతఃకరణశుద్ధి గలిగినపుడు సర్వసంగములను, గృహారామపుత్ర పౌత్రాదులన్నిటిని త్యజించి పరమత్మా గులై సాధువులై సన్న్యాసులై పాదచారులై తీర్థయాత్రలు చేసుకొని, ఋషుల పుణ్యాశ్రమమములను, పుణ్యతీర్థములను, పుణ్యక్షేత్రములను దర్శించుకొని, అచ్చటచ్చట నేకాంతస్థలముల బ్రహ్మనిష్ఠ చేసుకొని, క్రమముగ పూర్వ దిక్కునుండి భూప్రదక్షిణము చేయుచు, తుదకు హరి ద్వారములో కొంత కాలముండి, హృషీకేశమున చాలకాలము తపస్సు చేసి అంత్యకాలమున స్వర్గారోహణము గావించిరి హృషీకేశములో గల స్వర్గాశ్రమము మొదలగు అనేక పుణ్యతీర్థముల తీరములలో, వనములలో, నేకాంత ప్రదేశములలో, గుహలలో పాండవులు నివసించినట్లు నిదర్శనము ఇపుడు గూడ కనబడుచున్నది ఇదే దీనికి దృష్టాంతము భారతము మహా ప్రస్థానికపర్వము చూడుడు ఇదే యథార్థమైన గీత యొక్క యుపదేశమగును

అట్లు కానిచో సదా సంసారములోనుండిన ఆత్మశుద్ధి కలుగుటకు న్నూ, నిర్వాణమార్గములోగల సంకల్పము లనియెడు ప్రతిరోధములు తొలగుట కున్ను, నిర్వాసనాస్థితి కలుగుటకున్ను, బ్రహ్మనుసంధానము

లభించుట కున్నూ, జ్ఞేయమగు తురీయ పదములో నిరంతరము నిలుచుటకున్నూ తరము కాదు జనుల హృదయ ములందు కాలక్రమముగా పవిత్రత, యేకాగ్రత తగ్గిపోయి నందుచే జీవితము వ్యర్థమై పోగూడదని తలంచి గృహస్థాశ్రమములో నుండినను, కొంతవఱకు నాత్మశుద్ధి కలుగుట కొఱకు నిష్కామ కర్మయోగమున్నూ, దైవచింతనయు, పరోపకారమున్నూ చేసే లాగున వర్తమాన కాలమునకు తగినట్లు పెద్దలు నిశ్చయించిరి

నాలుగు ఆశ్రమములు వేదమందు విధింపబడియుండ ఒక్క గృహస్థాశ్రమము మాత్రమే యావత్కాలము నిర్వహింపబడుచుండ వలయునని శ్రీకృష్ణభగవానుడెట్లు ఉపదేశించియుండును? క్షత్రియ ధర్మమును గుఱించి చెప్పునపుడు రఘువంశమున కాళిదాసు ఈలాగున వర్ణించెను-

**శైశవేఽభ్యస్తవిద్యానాం యౌవనే విషయైషిణామ్ ।**
**వార్ధకే మునివృత్తీనాం యోగేనాంతే తనుత్యజామ్ ॥**

శైశవకాలమున బ్రహ్మచర్య వ్రతపాలనముతో విద్య నభ్యసించుటయు, యౌవనకాలమున గృహస్థాశ్రమమును నిర్వహించుటయు, వార్ధక్యము వచ్చినపుడు మునివృత్తి గలిగి తపస్సు చేయుటయు, అంత్యకాలమున యోగమార్గమునుండి శరీరమును విడుచుటయే ధర్మమగును ఈ విధి నెవ్వరు కాదని చెప్పగలరు? ఇదే నిజమైన సత్యమున్ను, శుద్ధమైన జీవితమున్ను అగును



## భారతము - మహా ప్రస్థానికపర్వము

ఆక్షితిపతి పౌరజానపద ప్రవరజనంబుల రావించి,

**ఆ పార్థపౌత్రుని జూపి మాయేపుర మాఱుగా మీరిక్కుమార వరుని**
**గైకొని తగనెల్ల కార్యజాతంబును నడుపుచు ననురక్తి నాడునాటి**
**కెక్కుడగుచు నుండ నీతని యుల్లము రంజిల సమ్యగారాధనంబు**
**నందు సంప్రవణుల రగుడయ్య యని పల్కి తమ నిశ్చయంబు నుదాత్తభంగి**

**చెప్పుటయు వారు మొగములు చిన్నవోవ మము నుపేక్షించి యిటు సేత నముచితంబె**
**వీడు చిత్తంబు కారుణ్యనిలయ మేము దరతరంబ యాశ్రితులము ధర్మశీల.**

అని గద్గదకంఠులగుచు నాడిన మాటలకు నమ్మనుజేంద్రుండు తగు తెఱంగున మఱు మాటలాడి తమ గమనంబులకు సజ్జనంబులకినియ్యకొల్పి నప్పుడందులోనన్ కొందఱు కొంద నివేశనంబు లధికాభిలాషంబున నొత్తి కొనుట కారణంబుగా వివాదంబు పుట్టిన సహదేవుండు కలియుగంబు ప్రవేశించుటం జేసి కాదే ఇట్టివి పుట్టెడునని తలంచి నవ్వి నరనాథునకు జెప్పిన అప్పౌరవోత్తముండు నవ్వుచు మన మనువులు సాలునని పలికి సర్వాభరణంబుల నూడ్చి వల్కాజినంబులన్ ధరియించిరన్ దమ్ములు ద్రౌపదియు నట్ల చేసి రందఱును తత్కాలోచితంబులగు నిష్టావిధానంబు లాచరించి యగ్నుల నంబుగతంబులు చేసి మొగంబుల తెలివగ్గలింప గృహంబు వెలువడి రప్పుడు ద్రౌపది షష్ఠత్వ నిష్ఠం బోవ సప్తమంబై యొక్క సారమేయంబు వారల వెనుక జనియె నప్పుడు

**పౌర జనంబు లాబాలవృద్ధంబుగా వచ్చి రక్కురువంశవరుల జూడ**
**తత్సమయంబు జూదము నాడు వెడలి వా రరిగెడు నయ్యవసరమువోలె**
**భటసమేతముగ నప్పాండుతనూజాల తో నయ్యుయుత్సుండు దాను నరిగె**
**భవదీయ జనకు డభ్యంతర సతులెల్ల ననుగమించిరి వారి నవనినాథ**

**ఇట్లు కరిపురి వెలువడి యేగి ధర్మ తనయుడందరు నెంతయు దవ్వుగాగ,**
**సొలయ కేగి రొక్కలను జూచి నిలువు మనడు తలవంచి యా రాజా జనుచునుండె.**

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

**అటధర్మజాండు ముందట జనక్రమమున ననుగమించిరి పవనాత్మజాండు అర్జునుడు నకులుండు తదనుజాండు ద్రౌపదియునిట్లు ననుచుండ దగిలివారి వెనుక విడువక శునకము జనియె నవ్వి దమునవారు మహాపథగమనమునకు.**

పూని యుపవాసవ్రతపరులై భాగీరథిపొంతకుం జని యంత నుండియు ప్రాఙ్ముఖవర్తనంబు గైకొని యోగబలంబున నరిగి గిరిసరి దరణ్యంబు లనేకంబులు గడచి పూర్వసముద్ర తీరంబు చేరిరి – ఇది భారతవచనము

ఇట్లు జీవించిన మాత్రంబుననే జీవునియందుగల దృశ్య వాసన లన్నియు నశింప నాతడు శుద్ధజ్ఞానప్రకాశుడై నిర్వాణము నందగలడు ఈ సత్యము తెలిసికొనకయే యేదైన ఒక్కటియే గీతయొక్క యాశయమని యెవరు చెప్పుదురో, అది వారియొక్క హఠవాద మనిమాత్రమే తలంచవలసి యుండును అట్టివారు తమ యొక్క పిడివాదమును నిలువ బెట్టుటకొఱకు శ్రీకృష్ణునియొక్క సర్వజ్ఞత్వమును మరుగు పరచినవారే యగుదురు అంతేకాదు, ఇది వితండవాదమని గూడ తప్పక తలంచదగినది ఏలన, దైవనిర్మితమగు వేదమునందు బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసా శ్రమము లనియెడు నాలుగువిధు లుండగా ఆలాగున కర్మయోగ, భక్తియోగ, ధ్యానయోగ, జ్ఞానయోగముల నియెడు మార్గచతుష్టయము ముక్తికొఱ కేర్పడియుండగా ఒక గృహస్థాశ్రమమే గీతయొక్క సారమనిగాని లేక కర్మయోగము నొక్కదానినే గీత ఉపదేశించుచున్నదనిగాని చెప్పబూనినవారి యొక్క సాహస మేమనవచ్చును!

జీవులకు సంస్కార భేదముచే మల, విక్షేపావరణము లనియెడు మూడు దోషము లంతఃకరణమందు గలవు నిష్కామకర్మయోగముచే మలపాపని వృత్తియు, ఉపాసన లేక భక్తివల్ల విక్షేపనివృత్తియు, బ్రహ్మచింతనమువల్ల ఆవ రణ( అజ్ఞాన) నివృత్తియు కలుగ వలసియుండును

ఉపాసనయందు యోగ మంతర్భూతము కావున నాలుగుయోగము లిచట గ్రహించదగినది

**కర్మాణి చిత్తశుద్ధ్యర్థమైకాగ్ర్యార్థముపాసనమ్ ।**
**మోక్షార్థం బ్రహ్మవిజ్ఞానమితి వేదాంతడిండిమః ॥**

అని వేదాంతభేరి మ్రోగించుచున్నదని శ్రీశంకరు లుపదేశించిరి ఇదే వేదాశయము ఈవేదాశయమే గీతాశయము అయితే గీతయొక్క యాశయము కర్మయోగము మాత్రము గాదు భక్తియోగము మాత్రము కాదు, ధ్యానయోగము మాత్రమున్నూ గాదు, జ్ఞానయోగము మాత్రమూ కాదు ఈ నాలుగున్నూ కలిసినదే గీత యగును అయితే పైజెప్పబడిన యోగములు నాలుగున్నూ ముక్తియను సౌధమునకు నాలుగు దిక్కులలో గల నాలుగు ద్వారము లనియే గ్రహించవలయును పైజెప్పబడిన యోగచతుష్టయములో నొక్కొక్కటియే గీతయొక్క యాశయమని చెప్పినవారు సాధారణమానవులు కారు సుమీ! వారందఱున్నూ గొప్ప దైవావతారులని జనులచే తలంపబడువారే, అతీతజ్ఞానులే, గొప్ప మతప్రవక్తలే, వారికిగూడ హరవాదము కలుగు నాయని సందేహింపబనిలేదు అట్టి దివ్యపురుషులు గీతయొక్క యాశయము సంపూర్ణముగా తెలియనివారని శంకింపబనిలేదు దానియందొక గొప్ప రహస్యము నిగూఢమై యున్నది ఇదే ఈశ్వరుని యొక్క మహిమాతిశయము

అదేమన ఒక్కొక్క కాలమున, కర్మ, భక్తి, ధ్యాన(అష్టాంగ)యోగ, జ్ఞానయోగములలో నొక్కొక్కదానికి పతనము కలుగును అపుడు దాని నుద్ధరించుటకొక దివ్యపురుషుడు భూలోకమునకు వచ్చును అతని దృష్టిలో ఉద్ధరించవలసినదే గోచరించును దానివల్లనే ఆత్మశుద్ధి గలుగునని అపుడత డుద్బోధించును అది సత్యమని అతని హృదయమున బాగుగా నమ్మకము కలిగియుండును అట్లు కానిచో పతనమైన ఆయోగమును పునరుద్ధరింప సాధ్యము గాదు ఇదే దీనిలోగల రహస్యము దానినుద్ధరించుటకు తగిన

దైవబలమున్నూ కొన్ని సిద్ధులున్నూ, ఆ దివ్యపురుషున కుండును అట్లు లేనిచో అత డాకార్యమును నిర్వహింపజాలడు ఇదివఱలో ఆ యోగములో ప్రవర్తించి యుండెడు జీవులు కొందఱు పరలోకమునుండి ఆ సమయమున జన్మమెత్తుచుందురు ఆ కార్యమును నిర్వహించుటకు ఎవరెవరి సహాయము కావలసి యుండునో వారు రాజులుగాని, పండితులుగాని, భక్తులుగాని, తపస్వులుగాని, స్త్రీలుగాని, మఱియెవరుగాని కావలసియుందురో వారందఱున్నూ ఆ నాయక పురుషుని యాజ్ఞను శిరసావహించి నిర్వహించు వారలుగా నుందురు ఇదే లోకములోగల ఒక గొప్పరహస్యము శ్రీ రామచంద్రు లవతరించుటకు ముందుగా దేవతలందఱు వానరరూపులై భూమిపై నవతరిం చినట్లు శ్రీమద్రామోదంతమున కలదు

**ఆత్మాంశైశ్చ సురాః సర్వే భూమౌ వానరరూపిణః ।**
**జాయేరన్మమ సాహాయ్యం కర్తుం రావణనిగ్రహే॥**

దీని యర్థము పైన తెలిపినదే ఇదే రీతిగా శంకరు లవతరించినపుడు బ్రహ్మ, ఇంద్రుడు మొదలగువారలు, మండనమిశ్రుడు(పండితుడు), ఉదన్వుడను రాజు మొదలగువారు జన్మించినట్లు తెలియుచున్నది అట్లు గానిచో వారు ఎందుకు జన్మమెత్తిరో ఆ కార్యము నెట్లు నిర్వహింపగలుగుదురు?

ఇది గొప్పవారికి మాత్రమే కాదు సామాన్యముగ నొక దివ్య పురుషుడు భూలోకమునకు వచ్చినపుడు అతని కార్యమును నిర్వహింపదగిన పుణ్యజీవులు, ముక్తజీవులు, లోకములో జన్మింతురు వారెచటెచట జీవించినను నా నాయకపురుషునితో కలిసి కొనియెదరు యథార్థముగా విచారించిన వారందఱు పుణ్యజీవులే అందఱు ముక్తులే ఇతర సంప్రదాయకులు ఎంత మహిమ కలవారైనను వారిపై వీరికి విశ్వాస ముండదు వీరి నాయకుడు చెప్పిన వాక్యమే వేదవాక్యముగా నమ్ముదురు అదే సత్యమని గూడ వారు విశ్వసింతురు ఈ కార్యమునే ముఖ్యముగా చేయుదురు తక్కిన యే సంప్రదాయ కార్యమునైనను గౌణముగా తలంతురు లోకముయొక్క గతి ఈలాగుననే పోవుచుండును పైచెప్పిన

విధముగా బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసములనెడు నాలుగింటిలో దేనికి పతనము కలుగునో దానిని పునరుద్ధరించి యున్నత స్థానములో ప్రతిష్ఠించుటకొక మహాపురుషుడు భూలోకమునకు వచ్చును అతని దృష్టిలో అది యొకటియే గోచరించును దానిని సాధించుటకు తగిన దైవబలము వారి యందుండును ఇదియే యిందులో గల రహస్యము

పరమ కారుణికుడగు సర్వేశ్వరుడు కల్పాంతమువఱకు లోకము నీలా గుననే నడుపుచుండును ఈతత్త్వమును పరమజ్ఞానులు మాత్రమే ఎఱుంగగలరు గీత నాలుగవ యధ్యాయమున ఈ విషయమును శ్రీకృష్ణభగవాను లుపదేశించియున్నారు ప్రపంచములో నొక కార్యము నిర్వహించుటకు వచ్చెడు సేనాధిపతి, జిల్లా కలెక్టరు, సూపరింటెండెంటు ఎట్లు గవర్నమెంటు అధికారమును బొంది వచ్చెదరో, అలాగుననే ఈముక్త జీవులున్నూ దైవ మహిమ గలిగియుందురు

**ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్ ।**
**వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥**

**ఏవం పరంపరాప్రాప్తమిమం రాజర్షయో విదుః**
**స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప ! ॥**

**స ఏవాయం మయాతేఽద్య యోగః ప్రోక్తః పురాతనః ।**
**భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్ ॥**

నాశములేనట్టి (మోక్షరూపఫలము నిచ్చునట్టి) ఈయోగమును నేను సృష్టియొక్క యాదికాలమందు సూర్యునికి చెప్పిన వాడనైతిని సూర్యుడు తన పుత్రుడగు వైవస్వతమనువునకు జెప్పెను ఆ మనువు, తన కుమారుడగు ఇక్ష్వాకుమహారాజునకు జెప్పెను సూర్యుడు మొదలుకొని పారంపర్యముగా పొందబడిన యీ యోగమును నిమి మొదలగు రాజర్షులు తెలిసికొనిరి అధిక కాలము గడచినందున ఈలోకమం దీయోగము నశించెను నాయొక్క భక్తుడవును, స్నేహితుడవును నైతివి గాన ఈయోగమే

మఱల నాచే నీకు ఇప్పుడు చెప్పబడినది శ్రేష్ఠమైన ఈ యోగము బహుగోప్యమైనది

చూచితిరా! సృష్టియొక్క రహస్యము అవతారములే దీనికి నిదర్శనములు శ్రీరామావతారము గృహస్థాశ్రమ ధర్మతత్త్వము నుపదేశించెను కృష్ణావతారము భక్తియోగము నుపదేశించెను బుద్ధావతారము సన్న్యాసము నుపదేశించెను పరశురామావతారము బ్రహ్మచర్యమును, తపస్సును యోగమును నుపదేశించెను బుద్ధదేవుడు ఆరు సంవత్సరములు వానప్రస్థాశ్రమమున నుండియే మఱల సన్న్యసించిరి వానప్రస్థమున 12గాని, 8గాని, 6గాని, 4గాని సంవత్సరము లుండవలయు ననియే శాస్త్రము నిరూపించుచున్నది అచట తపశ్చర్య బ్రహ్మచర్యము మొదలగు వానివల్ల ఆత్మశుద్ధి గలిగిన తరువాత తురీయాశ్రమమును పొందవలసియుండును శ్రీకృష్ణ చైతన్యులు భక్తియోగమునే మనకుపదేశించిరి శ్రీశంకరులు జ్ఞానమే ముఖ్యమని యుద్ఘోషించిరి. ఆలాగున మధ్వాచార్యులు కర్మానుష్ఠానముతో గూడిన భగవ దుపాసనను తెలిపిరి. శ్రీరామానుజాచార్యులు శ్రీకృష్ణ చైతన్యులవలె నుపాస నారూపమగు భక్తిని, ప్రపత్తిని లోకములో స్థాపించిరి కావున ఇవి యన్నియు ఈశ్వరాజ్ఞవల్లనే జరుగుచున్నవి సర్వేశ్వరుడొక్కడే సర్వజ్ఞుడు ప్రభువు అతని కివన్నియు బాగుగా తెలియును తక్కినవారి కెవరికన్ని ఇది సంపూర్ణముగ తెలియసాధ్యము గాదు గీతలో ఈ రహస్యము అర్జునున కుపదేశింపబడెను

**బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।**
**తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరం తప॥**

ఓ యర్జునా! నాకును నీకును ననేకములైన జన్మలు గడచినవి ఆ జన్మముల నన్నిటిని సర్వజ్ఞుడను గాన నేనెఱుగుదును, నీవెఱుగవు

ఇపుడు త్రిగుణములతోగూడిన ప్రకృతియొక్క పరిణామము తెలియదగినది ఇది తమోగుణమునుండి రజోగుణములోనికి, రజస్సునుండి సత్త్వ

గుణములోనికి, సత్త్వమునుండి విశుద్ధములోనికి పరిణామము బొందుచుం డును వృక్షమునుండి కాయ కలుగుట ప్రారంభించినపుడు మొదట పిందెయై అదే మఱల లేతకాయయై, పిమ్మట ముదురుకాయయై, తరువాత పండై, ఎట్లు పరిణామము నొందుచుండునో, అది పండునపుడు స్వయముగా వృక్ష మునుండి యెట్లు విడుదల పొందుచుండునో, ఆ పరిపక్వఫలమును మఱల వృక్షమున అంటించుట కెవరికిని ఎట్లు సాధ్యము కాదో, యాలాగుననే పరిణామము కలుగుచుండి సత్త్వగుణము కలిగిన పిమ్మట విశుద్ధగుణము కలుగవలసియుండును అపుడాజీవి ప్రకృతినుండి విముక్తి నొందును ఆ స్థితి అమృత మనంబడును అది నిర్వాణమని బౌద్ధులున్ను, బ్రహ్మైక్యమని యద్వైతులున్నూ, బంధ విముక్తి గలిగిన శుద్ధచైతన్య స్వరూపుడగు జీవుడని ఇతరమతస్థులున్ను చెప్పియున్నారు ఇది కపిలమహర్షియొక్క సాంఖ్య యోగమున గల రహస్యము ఇది విజ్ఞాన(సైన్సు) శాస్త్రమువలె ప్రత్యక్షముగా గనుగొనవచ్చును

పంచీకరణ కపిలసాంఖ్యశాస్త్రము ననుసరించి సృష్టియొక్క వర్ణన కలదు. అపంచీకృత భూతసూక్ష్మాంశములయొక్క పంచీకరణము ననుసరించి పంచ భూతాత్మకమగు ప్రపంచ మేర్పడుచుండును దానిలో గల తమోగుణాం శముచే స్థూలదేహమున్నూ, రజోగుణాంశముచే కర్మేంద్రియ ములున్నూ, సత్త్వగుంశముచే జ్ఞానేంద్రియములున్నూ ఏర్పడుచుండును. ఈసత్త్వ గుణాంశ సమష్టియే అంతఃకరణ మనబడును విశుద్ధగుణము గలుగునపుడు అంతఃకరణసాక్షి చైతన్యమగు ఆత్మ యుదయమగును దేహము తమోగు ణాంశమగుటయే యచేతనమై, జడమయమై యుండుటకు కారణము సుషుప్తియే యిందులకు దృష్టాంతము వాక్పాణి పాదపాయూపస్థలు, రజోగుణాంశము లగుటవల్లనే వానికి క్రియలు చలనతయు, విషయభోగములున్నూ కలుగుచున్నవి అవి ఎల్లప్పుడు క్రియాపరములై యుండును కనుకనే రజోగుణము క్రియా పర మయినది కర్ణత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణేంద్రియము లైదున్ను సత్త్వ గుణాంశము లగుటవల్లనే సమస్తవిషయములను తెలిసికొనెడి జ్ఞానము కలిగినది వీటికి చలనము

లేదు ఇవి సుస్థిరములు కనుకనే సత్త్వగుణములోనికి వచ్చునపుడు చపలత్వము, వికృతి, విషయభోగము లేకపోయినవి ఈ జ్ఞానేంద్రియముల యొక్క సమష్టియే అంతరింద్రియమగుట వల్లదానికి అతిసూక్ష్మ విషయములను గ్రహించెడు శక్తి కలిగినది కనుకనే తమోగుణమగు దేహ, ధర్మమును, రజోగుణమగు కర్మేంద్రియవృత్తులు, సత్త్వగుణమగు జ్ఞానేంద్రియ స్వభావమును నంతరింద్రియములు తెలిసికొనుటకు కారణ మగుచున్నవి ఈ చెప్పిన వన్నియు త్రిగుణములకు సంబంధించినవి విశుద్ధగుణము తురీయాత్మను ప్రకాశింపచేయును కావున దానిని గుణత్రయాతీతమని చెప్పిరి ఈ నాలుగవస్థలు స్వభావముగా ప్రతిజీవునకున్నూ ప్రతి వస్తువునకున్నూ కలుగుచుండును

మనుజాన కేలాగున బాల్యము, కౌమారము, యౌవనము, వార్ధక్యము అను నాలుగవస్థలు కలవో, ఇవి యేలాగున ప్రకృతి ననుసరించి గమనము చేయున్నవో, ఆలాగున వృక్షాదులకు పుష్పము, పిందె,దోరకాయ, పండు ఇట్టి ప్రకృతి పరిణామము ఒకే నియతి ననుసరించి యెట్లు జరుగుచున్నదో, జీవునియొక్క విశుద్ధాది గుణపరిణామములున్నూ ఆలాగుననే జరుగును దీని నిచట నిరూపించుటకు కారణమేమన-మామిడికాయ మొదలగునవి లేత్రాయమున చేదు, వగరు గలవిగాను, మధ్యకాలమున పులుపుగాను, ముదురునపుడు భక్షించుటకు యోగ్యముగాను, పండినపుడు మధురముగాను నెట్లు పరిణామము బొందినవో, పండినపుడు స్వయముగా చెట్టునుండి ఎట్లు క్రిందపడునో, ఆలాగున విశుద్ధగుణము కలుగునపుడు జీవుడు గృహస్థాశ్రమమునుండి, సమస్త స్వార్థమునుండి విముక్తు డగును

సత్త్వగుణము కలుగునపుడే గృహకృత్యములకున్నూ, తనకున్నూ సంబంధము గలుగ ప్రయాసముగా నుండును ఆ తరుణమందే గృహస్థాశ్రమ మునుండి విడుదల పొంది ప్రత్యేకముగ ఆశ్రమము నేర్పఱచుకొనుటగాని, గృహకృత్యములనుండి విలక్షణుడై దైవకార్యము లాచరించుటలో నిమగ్నుడై యుండుటగాని సంభవించుచుండును.

తమోగుణములో నుండునపుడు ఆ జీవి దేహసుఖమునే గొప్పదిగా తలంచును దానికి కావలసిన భోజనములు, విషయములు, అలంకారములు మొదలగునవి కలిగియుండును నిద్రాహారాది విషయములు ముఖ్యము లని తలంచుచుండును అట్టి తామసగుణులతో బంధుత్వము, మిత్రత్వము గలిగి యుండును దానికి సంబంధించిన వార్తాపత్రికలను, పుస్తకముల నున్నూ చదువుచుండును కొంతపుణ్యవిశేషముచే తమోగుణమునకు క్షయము గలుగుచు, రజోగుణములోనికి పరిణామము పొందునపుడు యశస్సు, గౌరవము, ఆడంబరము, అధికారము, లోకవిలాసము మొదలగు వానికిసంబంధించిన కర్మేంద్రియములలో ప్రవేశించులాగున మనస్సు ప్రేరణ చేయుచుండును అపుడు పూర్వముండిన బంధువులు గాని, మిత్రులుగాని రుచింపరు పూర్వ ముండిన దృశ్యమంతయు మార్పుచేయక అతనికి విశ్రాంతి గలుగదు. అపు డాకాలము ననుసరించి చుట్టములను, చెలిమి కారులను నతడేర్పఱచు కొనును అపుడు ఉద్యోగస్థులు మిక్కిలి ప్రాణ మిత్రులై యుందురు వారితొఱకెంతైన ఖర్చుపెట్టును పూర్వము చదువు చుండిన వార్తాపత్రికలనుగాని, పుస్తకములనుగాని ముట్టడు. నూతనము లగు రాజసగుణములను గలిగించెడు సామగ్రుల నన్నిటిని సమకూర్చును భోజనాదులున్నూ రాజసగుణము ననుసరించి యుండును

ఇట్లు ఆ గుణములో కొంతకాలముండి పుణ్యవిశేషముచే రజస్సున్ను క్షయముకాగా, సత్త్వగుణములోనికి పరిణామము కలుగునపుడు దానికి పూర్వముండిన స్నేహితుల నందటిని విడిచి పెట్టును. అతఃపూర్వముండిన బంధువులపై ప్రీతి తగ్గును ఇదివఱలో ప్రీతి గలిగియుండిన రజోగుణాహారములపై అరుచి జనించును పూర్వముండిన విలాసములు, ఆడంబరములు, విషయభోగములు, భార్యాభర్తలు గలిగియుండు వృత్తులు అన్నిటిని తగ్గించుకొనును అపుడు పూర్వము చదువుచుండిన లోకవ్యవహార వార్తాపత్రికల గాని, అట్టి గ్రంథములగాని, అట్టి శృంగారమగు ఇతర సామగ్రినిగాని చేతి తోనైనను ముట్టుకొనుట కిష్టము గలుగదు అపుడు సదా శాంతి కావల

యునని కోరుచుండును భోజనము లన్నియు సాత్త్వికములు వస్త్రాదు లన్నియు నిరాడంబరములు

ఆత్మశాంతి ఎట్లు కలుగునా యని హృదయములో పరితపించు చుండును ఎల్లప్పుడు ఏకాంతస్థలములో నుండుటకు మనస్సు కోరు చుండును అపుడు బాహ్యాభ్యంతరశుద్ధియు, వినతియు, ప్రసన్నతయు గలుగుచుండును అత్తటి కన్నతల్లియైనను, తోడబుట్టువైనను, భార్య యైనను, భర్తయైనను సాత్త్విక గుణములు గలిగియుండిన మాత్రమే వారిని ప్రేమించును. వారందఱు సాత్విక స్వభావము కలిగియుండుటకున్నూ, నిరాశ, విషయవైరాగ్యము, జీవకారుణ్యము, నిశ్శబ్దము గలిగియుండుటకు కోరుచుండును వారికి కొన్ని ధర్మబోధనలను గూడ తెలుపుచుండును ఇదియే సత్త్వగుణ సాత్త్విక స్వభావము అపుడు ధర్మనిష్ఠులు, పరమసాధువులు స్నేహితు లగుదురు వారికి ధర్మకార్యమున కెంతైన వినియోగపఱచ బుద్ధి గల్గును మిక్కిలి పుణ్యవిశేషము గలిగి రాగా రాగా సత్త్వగుణమునకు క్షయము గలుగగా విశుద్ధగుణములోనికి జీవుడు ప్రవేశించును

ఇది సామాన్యులకు లభించునది కాదు. విశేషపుణ్యము చేతను గురుకృపచేతను, ఈశ్వరకరుణచేతను, తపస్సు యొక్క ఫలముచేతను ఈ స్థితిలోనికి పరిణామము పొందవలసియుండును అధిక భక్తులున్నూ, యోగులున్నూ, తపస్వులున్నూ ఆ సత్త్వగుణములోనే నిలిచిపోవుదురు ఇచట కొంత శాంతియు, కొంత ప్రసన్నతయు, కొంత యానందమున్ను కలుగుచుండును అయితే దీనికి నిలుకడ లేదు గాలిచే దీపము కదలునట్లు దృశ్యవృత్తులచే ఆసుఖమునకు , శాంతికిని మార్పు గలుగుచుండును గాలి దోలినను రత్నముయొక్క(మణియొక్క) ప్రకాశమునకు నెట్లు మార్పు కలుగదో, అట్లనే తురీయాత్ముడు ద్వంద్వములచే చలింపడు ఈ తత్త్వమునే ముముక్షువులు బాగుగ విచారించి తెలిసికొనవలయును విశుద్ధసత్త్వములో ప్రవేశించిన, తురీయములో నిలుకడ కలిగియుండును అపుడు ప్రకృతి

ప్రకోపము లన్నియు శమించును సత్త్వగుణ సుకుమారత్వము గూడ అంత ర్ధానము నొందును నిరంతరధ్యానము, జ్ఞానోపదేశము చేయుట, ధర్మబోధ మొదలగునవి కలవాడగును సర్వేంద్రియముల వృత్తులు నశించి శరత్కాలపు ఆకాశమువలె హృదయము స్వచ్ఛముగా నుండును ఈ స్థితి ప్రతివారికిన్ని వరుసగా కలుగుచుండును

సామాన్యముగా గ్రంథములలో మూడుగుణములు, మూడవస్థలు మాత్రమే చెప్పబడుచుండును వేదాంతశాస్త్రములో మాత్రము నాలుగవ స్థలు గలవు మూడు గుణములు, మూడవస్థలు ప్రకృతితో సంబంధించినవి వేదము వీనిగూర్చి ఎక్కువగ చెప్పుచుండును వేదముయొక్క శిరస్సగు ఉపని షత్తు ప్రపంచమున కతీతమగు విషయమును జెప్పుటచే, అది గుణత్ర యాతీతమును బోధించుచుండును ఇట్టి మూడుగుణములను గుఱించియు, గుణత్రయాతీతమును గుఱించియు ఇచట సంక్షిప్తముగా నిరూపించడమైనది గీత 14వ అధ్యాయమున ఇది విశదముగా గనందగును మూడు గుణముల స్వభావమున్నూ, విశుద్ధసత్త్వ స్వభావమున్నూ వివేక చూడామణిలో శ్రీశంకరులు వ్రాసినది చూడుడు అనేక గ్రంథములలో మూడు గుణముల లక్షణములు కాన్పించుచున్నవేగాని విశుద్ధసత్త్వగుణము ఈవివేక చూడామణియందు మాత్రమే కన్పించుచున్నది

**అజ్ఞానమాలస్యజడత్వనిద్రా ప్రమాదమూఢత్వముఖాస్తమోగుణాః ।**
**ఏతైః ప్రయుక్తో న హి వేత్తి కించి న్నిద్రాలువత్ స్తంభవదేవ తిష్ఠతి ।।**

జ్ఞానశూన్యత్వము, జాగు, జడభావము, నిదుర, జాగరూకత లేకుండుట, మౌర్ఖ్యము మొదలుగాగలవి తమస్సు యొక్క గుణములు వీనితో గూడిన వాడు కించిత్తైనను తెలియలేడు నిద్రించువానివలె స్తంభమును బోలి యుండును

**గర్వం క్రోధ మహఙ్కారః సతీసంగః ప్రలాపనమ్ ।**
**అప్రియం దంభమాత్సర్యం రాజసం గుణలక్షణమ్ ॥**

గర్వము, క్రోధము, అహంకారము, విషయలంపటత్వము, వాగా డంబరత, అప్రసన్నత, డాంబికము, మాత్సర్యము-ఇవి యన్నియు రజోగుణుని లక్షణములు

**మిశ్రస్య సత్త్వస్య భవన్తి ధర్మా -**
**స్త్వమానితాద్యా నియమా యమాద్యాః ।**
**శ్రద్ధా చ భక్తిశ్చ ముముక్షుతా చ**
**దైవీ చ సంపత్తిరసన్నివృత్తిః ॥**

అమానిత్వాది వ్రతములు, దశవిధ నియమములు, తపస్స్వాధ్యాయాది నియమములు, శ్రద్ధయు, అనురాగము, మోక్షేచ్ఛయు, దైవికసంపత్తి, అస ద్వస్తువుల నుండి మరలుట మొదలగునవి మిశ్రసత్త్వముయొక్క ధర్మములు

**విశుద్ధసత్త్వస్య గుణాః ప్రసాద-**
**స్స్వాత్మానుభూతిః పరమా ప్రశాన్తిః ।**
**తృప్తిః ప్రహర్షః పరమాత్మనిష్ఠా**
**యయా సదానన్దరసం సమృచ్ఛతి ॥**

నైర్మల్యము, స్వాత్మానుభవము, మహోత్కృష్టమగు అంతరింద్రియ నిగ్రహము, నిత్యతృప్తి, నిత్యసంతుష్టి, ఇంక నెల్లప్పుడు దేనిచే నాత్మానుభవరసమును పొందగలడో అట్టి పరమాత్మనిష్ఠయు విశుద్ధసత్త్వ లక్షణములు.

దీనియందు మూడుగుణములయొక్కయు, గుణత్రయాతీతుని యొక్క లక్షణమున్నూ తెలిసికొనవచ్చును ఇక తరువాత 17వ అధ్యాయమునను, 18వ అధ్యాయమునను ఈ విషయమును వివరముగా శ్రీకృష్ణభగవానులు తెలిపియున్నారు వర్షఋతువు అవసాన మగునపుడు ఆ వర్షము, మేఘా దులు ఎట్లు అంతర్థానములగునో, హేమంతఋతువు దాటునపుడు ఘనమైన మంచు, మిక్కిలి శీతలత్వము ఎట్లు విలయమందునో, గ్రీష్మఋతువు ప్రవేశిం చునపుడు తీక్ష్ణమైన ఎండలు ఎట్లు వచ్చుచుండునో,

ఆలాగున ఒక్కొక్క గుణము పరిణామమును పొందునపుడు జీవునియొక్క స్వభావమున్నూ మారుచుండును ఇదే ప్రకృతియొక్క అంతర్భాగములో అతి రహస్యముగా జరుగుచుండెడు స్వభావము ఈ స్థితి గలుగ కుండుటయే గృహస్థాశ్రమము మంచిదనిగాని, నిష్కామకర్మయోగము నిజమని గాని, లేక భక్తియే సరియైన దనిగాని, లేక యోగమే సత్యమైన దనిగాని, లేక తపస్సే శ్రేష్ఠమైనదనిగాని, లేక వానప్రస్థమే సరియైనదనిగాని జీవులు తలంచుటకు కారణమైనది

అయితే ఈ విషయమై వర్తమానయుగము ననుసరించి కొందఱు ఈలాగున అడుగుదురు ఇపుడుండు సన్న్యాసు లందఱు ఇట్టి విశుద్ధ సత్త్వము కలిగినవారా! శ్రీమహాత్మాగాంధీ మొదలయినవారు గృహస్థా శ్రమములో నుండియు, సన్న్యాసవేషము వేయకయు, లోకమునకెంతో మేలు చేయు చున్నారు అట్టివారికి సమానులైన సన్న్యాసు లెవరు గలరని చెప్పుదురు? దీనికి సమాధానము కలదు బాల్య కౌమార యౌవన వార్ధక్యాద్యవస్థలు సన్న్యాసులకుగాని, సన్న్యాసులు కానివారికిగాని, ఏలాగున అందఱికి నొకే విధముగా నెట్లు కలుగుచుండునో, ఆలాగున పైజెప్పిన గుణపరిణామ మందఱికిని తప్పక ఒకే విధముగానే కలుగు చుండును శ్రీగాంధిగారి ఆత్మ సత్త్వగుణమునుండి విశుద్ధసత్త్వము లోనికి వచ్చిన దగుటవల్లనే వారున్నూ గృహస్థాశ్రమమును వదలిరి వారికి గృహస్థాశ్రమము లేదు కేవలము ఋషులయొక్క జీవితమే వారియొక్క జీవితము గృహస్థాశ్రమ చిహ్నములగు యజ్ఞోపవీతము గాని, శ్రాద్ధ తర్పణాదులుగాని, వర్ణాశ్రమములుగాని వారికి లేవు కాషా యవస్త్రమొకటి మాత్రము ధరించలేదు గాని తక్కిన యన్ని విషయముల లోను వారు గొప్ప యతీశ్వరులే ఏలాటి సందేహమును లేదు

ఋషులలో గూడ నందఱును కాషాయధారణ కలిగియుండ లేదు. సాధువులలోగూడ కొన్ని శాఖల వారికి సర్వసంగ పరిత్యాగమే సన్న్యాస ముగాని కాషాయాదులను వారు ధరింపరు ఋషులలో అవధూతలలో ఎవ

రికిన్ని కాషాయాది చిహ్నములు లేవు అది ముఖ్యమని ఎవరున్నూ తలంపరు అది ఆశ్రమధారణకొరకు బాహ్యచిహ్నముగా నుండును గృహారామ పుత్ర దారాదు లన్నిటిని పరిత్యజించుటయే సన్న్యాసము తరువాత తన జీవితమును లోకముకొఱకు వినియోగపఱచుటయే త్యాగమగును ఆలక్షణము లన్నియు శ్రీగాంధీగారికే గాక వారియొక్క ముఖ్య అనుయాయుల కందఱికిన్ని యున్నవి వారందఱున్ను పవిత్రములగు నేకాంత స్థలములలో పుణ్యాశ్రమముల నిర్మించుకొనియే నివసించుచున్నారు అచ్చోటి నుండి ధర్మచింతనము, దైవచింతనము చేయుచున్నారు జనులను ధర్మ మార్గము లోనికి నడుపుచున్నారు. దీనికన్న సన్న్యాసమేమి కావలయును! అధికముగ వారందఱున్ను బ్రహ్మచర్యవ్రతము, ఆహార నియమము, సంయమనిష్ఠ గలవారలే నిష్కామ కర్మయోగముయొక్క స్వరూపమును వారు బోధించుచున్నారు మఱియొకరు అదే ప్రకారము సర్వమును విడిచి విజనప్రదేశమున నాశ్రమము నిర్మించుకొని భక్తియోగమును జనుల కుపదేశించుచున్నారు. ఇంకొకరు పవిత్రస్థలమున నిర్మలోదకముగల ప్రదేశమున ఆశ్రమ మేర్పరచుకొని దైవజ్ఞానమునుగాని, యోగసాధనమును గాని లోకమునకు తెలుపుచున్నారు వారువారు చేయు పనులుమాత్రమే వేఱు వేఱుగా కనిపించినను తక్కిన వృత్తులలో అందఱున్నూ యొకే విధముగానే యుంటు న్నారు. అందఱున్నూ యొకే క్షేమవిచారము గలవారే అందఱున్నూ జీవకోట్ల సౌఖ్యమును తలంచువారే కొందఱు జీవుల అంతఃకరణ శుద్ధికొఱకున్నూ, మఱికొందఱు జీవకోట్ల యిహలోక సౌఖ్యమునకున్నూ ప్రయత్నించుచున్నారు దీనియందేలాటి భేదమున్నూ లేదు

దేహస్థుడైన జీవునియొక్క సుఖముకొఱకే నేత్రము పనిచేయుచున్నది ఆ జీవునియొక్క యానందముకొఱకే కర్ణము మఱియొక పనిలో ప్రవేశించు చున్నది ఘ్రాణమింకొక కార్యములో యత్నించుచున్నది రసనేంద్రియము వేఱొక కార్యములో మగ్నమై యున్నది అదేరీతిగ పాయూపస్థలున్నూ జీవుని యొక్క క్షేమముకొఱ కొక్కొక కార్యమును చేయుచున్నవి కావున వీటిలో

ఏవి శ్రేష్ఠములు ఏవి నికృష్టములని నిర్ణయించుటకెట్లు వీలు లేదో, త్యాగము యొక్కయు, సన్న్యాసముయొక్కయు, సేవయొక్కయు విధానమున్ను ఈలాగుననే యుండును

ఇంద్రియములన్నియు తత్తత్కార్యములు చేయుటచే శరీరము సుఖముగా నుండి ఆత్మ యానందము ననుభవించుచున్నది ఆలాగున ఎవరెవరికేయే కార్యము లేర్పడియున్నచో వాటిని వారు చేయుచుండిన మాత్రమే ఈ లోకములో గల జీవులున్నూ సౌఖ్యము నొందగలుగుదురు అట్లుగాక అందరున్నూ ఒకేకార్యమునే చేయవలయునని చెప్పుట యెట్లుండు ననగా దేహములోగల చక్షురాదీంద్రియములన్నియు నేత్రముయొ క్క పని యగు చూచే కార్యమును మాత్రము గలిగియుండవలయును లేక నేత్రాదీంద్రియము లన్నియు కర్ణముయొక్క పనిమాత్రమే కలిగియుండవల యును లేక జ్ఞానేంద్రియము లన్నియు జిహ్వయొక్క వృత్తియగు రుచిని మాత్రము గ్రహించే వృత్తి గలిగియుండవలెనని చెప్పేలాగున నుండును ఇది యే కాలమందును సంభవింపదు సృష్టియున్నూ ఆలాగున లేదు కావున నెవరున్నూ సోమరిదేవత నారాధింపక స్వయంభువగు సర్వేశ్వరుని నారాధించుకొని లేక స్వయంప్రకాశమగు నాత్మ నుపాసించుకొని వారి వారి కేర్పడియుండు ఆశ్రమ ధర్మములను చక్కగా నిర్వహించెడు స్వభావము గలిగి యుండిన చాలును అట్లుచేయక పరుల అన్నమును మాత్రము భుజించి ద్రిమ్మరులై జీవించువారి జీవితము కడుంగడు నీచమైనది అట్టివా రేదేశమందైనను నుండదగరు కాని అట్టివారికి తగిన పనిని కల్పించి సంరక్షించెడు భారము గవర్నమెంటు వహించవలసియుండును అట్టి నియమము నతిక్రమించువారిపై సరియైన చర్యను తీసికొనవచ్చును

దేశసౌభాగ్యముకొఱకు ఒక్కొక శాఖవారున్నూ వారివారి నియమిత కృత్యములను నిర్వహించే లాగున నుండిన మాత్రముననే సౌఖ్యము కలుగును వీరిలో విద్యాశాఖవారు శ్రేష్ఠులని తలంచి మేమే అందఱిని విద్వాంసులనుగా చేయుచున్నామని గాని, ఆరోగ్యశాఖవారు మేమే రోగములు లేకుం

డునట్లు దేశమును సంరక్షణము చేయుచున్నామని గాని, రక్షకభటులు మేమే శత్రువుల బాధ గలుగ నివ్వక దేశసేవ చేయుచున్నామనిగాని, కర్షకులు మేమే దేహకష్టమును చేసి అందఱికిన్ని అన్నమిడు చున్నామనిగాని, వ్యాపారస్థులు మేమే సమస్తపదార్థములు శ్రమపడి దేశదేశాంతరములనుండి తెప్పించి అందఱికి సమకూర్చు చున్నామనిగాని తలంచక పరస్పరము వీరందఱున్నూ చేయు కార్యము లందఱికిన్ని సమానముగా సౌఖ్యమునకే హేతువగుచున్నవని తెలసికొనుటయే నిజమైన సమరసజ్ఞాన మగును. కనుకనే గీతాచార్యులు విశ్వవిశాలభావముతో ఈలాగున నుపదేశించడమైనది

**స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః ।**

తనకేర్పడిన యనుష్ఠానమందు శ్రద్ధగల మనుజాడు స్వధర్మా నుష్ఠానముచే జ్ఞానయోగ్యతను పొందుచున్నాడు అని యుపదే శించిరి అయితే దీనికి సంకుచితార్థము నుపదేశించి దేశమును పాడు చేయ గూడదు ఇది కేవల వర్ణాశ్రమములను గుఱించి తెల్పినదని విచారింపక ఎవరెవరేయే కార్యములందు ప్రవర్తించుచున్నారో వారు ఆయా అనుష్ఠాన మును చక్కగ చేసికొనవలయునని యర్థము గ్రహించవలెను. అట్లు గాక బ్రహ్మచర్యా శ్రమమున నుండువారు యావత్కాలమున్ను బ్రహ్మచర్య మందుండ వలయునని యర్థము గాదు ఎంత వఱకు గృహస్థాశ్రమముగాని, వానప్రస్థాశ్రమముగాని, యత్యాశ్రమము గాని అవలంబించలేదో అంతవఱకు బ్రహ్మచర్యవ్రత మనుష్ఠించుచుండవలయు ననియే యర్థము

గృహస్థులకుగాని, వానప్రస్థులకుగాని వారి యాశ్రమములో నుండు వఱకు మాత్రమే యాధర్మము సంబంధించి యుండును. పైయాశ్రమము నకు వెళ్లునపుడు దానికి సంబంధించిన యాచరణ గలిగి యుండవల యును ఆలాగున నిపుడెవరెవరు ఏయే యనుష్ఠానములను చేయుచుందురో వాటికి సంబంధించిన యాచరణలు కలిగియుండ వలయును అపుడే అవి శోభించును లేనిచో మందు ఒకటి, పథ్యాహారము మఱియొకటి అయినచో

నేలాగున రోగముకుదురదో, యాలాగున సాధకుని భవరోగమున్నూ శాంతి నొందదు గీతలో ద్వాదశాధ్యాయమున పరమభక్తులయొక్క స్వరూపమును గుఱించి యుపదేశింపబడియున్నది ఇది భక్తులకు మాత్రము గాదు సాధనపరులగు నందఱికిన్ని సంబంధించినది దీనికే అద్వేష్ట్రుత్వాది గుణములని పేరు ప్రతిబ్రహ్మనిష్ఠునకున్ను ఈ గుణములు ఉండవలయును

ఈయధ్యాయము న 13వ శ్లోకమునుండి అద్వేష్టా సర్వభూతానాం అని ప్రారంభించి 19వ శ్లోకము వఱకు నేడు శ్లోకములలో దీనినిగూర్చి శ్రీకృష్ణ లుపదేశించి యున్నారు దానియందు కడపటి యుపదేశమున 'అనికేతస్థ్సిర మతిర్భక్తిమాన్ మే ప్రియో నరః' అని కలదు అనగా గృహస్థాశ్రమమునుండి విడుదల పొందిన వాడును, తానాచరించు ననుష్ఠానమందు సుస్థిరబుద్ధి గలవాడును, పరమేశ్వరునియం దచంచలమైన భక్తిగలవాడును అగు నరు డెవడు గలడో వాడు నాకు ప్రియుడు- అని భగవంతు డుపదేశించి యున్నాడు ఇదివఱలో పరిపక్వ కాలము వచ్చినపుడు చెట్టునుండి పండు స్వయముగా విడుదల పొంది నట్లుండునని చెప్పిన రహస్యము ఇదియే

ఈ సందర్భముననే మఱియొక్క యుపదేశమున ''శుభాశుభ పరిత్యాగీ భక్తిమా యస్సమే ప్రియః'' అని కలదు శుభాశుభముల గలుగజేసెడు కర్మల నన్నిటిని విడచినవాడును, పరమేశ్వరార్పిత హృదయము గల్గినట్టి భక్తి గలవా డును నెవ్వడో వాడు నాకు ప్రియుడు కేవలము ఆత్మనిష్ఠలో నిలుకడ కలుగు నపుడు శుభాశుభ కర్మల నుండి గూడ విముక్తి గలుగును రజోగుణ, తమో గుణము లున్నప్పుడే కర్మేంద్రియ దేహములకు సంబంధించిన క్రియ లుండుననియు, సత్త్వ గుణము కలుగునపుడు జ్ఞానేంద్రియమునకు సంబంధించిన శుభ కర్మలుండుననియు, విశుద్ధసత్త్వములో ప్రవేశించినపుడు కేవలము ధర్మబోధలు, జ్ఞానోపదేశములు మాత్రమే గలిగియుండుననియు నిదివఱలో చెప్పిన రహస్యము

మఱియు గుణత్రయాతీతుని లక్షణము 14వ అధ్యాయమున చెప్పునపుడు సర్వారమ్భపరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతే అని వచింపబడినది బ్రహ్మాత్మైక్యజ్ఞానము గలిగిన సంయమియై, బాహ్యకర్మలనన్నిటిని విడిచినవాడై ఏ ఆత్మనిష్ఠుడుండునో అతడు సత్త్వాదిగుణముల నతిక్రమించిన వాడని చెప్పబడుచున్నాడు. అనగా తురీయమగు ద్వంద్వాతీతస్థితిలో సమస్తకర్మలున్నూ వదలిపోవును అని భగవంతుడే తెలిపియున్నాడు ఇది సత్యము అట్టి జీవన్ముక్తుడు దైవబోధపరుడైయుండి ఏవైన స్వల్పమగు పనుల జేయుచూ ఇతరులచేత చేయించుచూ ఉండును ఆ స్థితిలో నంతయే సాధ్య పడును శ్రీబుద్ధదేవుడు, శ్రీ ఏసు, శ్రీశంకరులు, శ్రీమహమ్మదు మొదలగు ప్రవక్తల చరిత్రమే దీనికి సాక్ష్యము

ఒకడు జపమాచరించుటగాని, పుస్తకములు చదువుటగాని చేయుచుండిన నిద్ర వచ్చినపుడు అవి చేతినుండి యెట్లు స్వయముగా జారిపోవునో, తురీయపదములో ప్రవేశించినపుడు కర్మేంద్రియాదుల బలముగూడ అట్లు తగ్గిపోవును భగీరథుడు గంగా ప్రవాహమును భూలోకమునకు తెచ్చినట్లు మహాత్ములు మాత్రమే దైవజ్ఞానప్రవాహమును ప్రపంచములోనికి తీసికొని రాగలుగుదురు అట్టి దివ్యపురుషులు మాత్రము భక్తి, కరుణ, ప్రేమ, విరక్తి, జ్ఞానము మొదలగు దైవగుణప్రవాహములను లోకమునకు తెచ్చి సర్వజనుల హృదయక్షేత్రములలో నింపగలుగుదురు శ్రీబుద్ధదేవుడు, శ్రీ ఏసు, శ్రీమహమ్మదు, శ్రీ గురునానక్, శ్రీకృష్ణ చైతన్యులు, శ్రీశంకరులు మొదలగు ప్రవక్తలు దైవసందేశమును మానవులకు అందజేయువారుగా నుండిరి ఇట్టివారు అప్పుడప్పుడు ప్రపంచములో నవతరింపకపోయిన ''వృష్టి హీనా కృషిర్యథా'' యను రీతిగా వర్షము లేని కృషివలె జనుల హృదయక్షేత్రము కారుణ్యశూన్యమై, భక్తిరసవర్జితమై మరుభూమివలె నుండును

జ్ఞానము లేని హృదయమును శ్మశానభూమివలె ఋషులు వర్ణించియున్నారు కరుణలేని యంతఃకరణమును ఊషరక్షేత్రమువలె మునులు చెప్పి

యున్నారు కావున పరమభక్తులు, ధ్యాననిష్ఠులు లోకములో నెపుడును మిక్కుటముగా నుండవలయుననియే మనము సర్వేశ్వరుని కోరవలయును లేనిచో ప్రపంచము వెన్నెలలేని వర్షాకాలపు అమావాస్యనాటి కారుచీకటిగల రాత్రివలె వ్యామోహపరమ్మైపోవును అయితే ఈలాగున చెప్పుటచే నివుడు ప్రపంచములో నుండు అనేక సోమరులవలె భక్తులు, సాధువు లుండవల యునని భావము కాదు ఈ విషయమ్మై యిదివఱలో యెన్నియో సారులు తెలుపబడియున్నది ఈ పరమతత్త్వమునే శ్రీకృష్ణభగవానులు తన యంతరం గభక్తులలో ముఖ్యుడగు నుద్ధవునకు అంత్యకాలమున నుపదేశించిరి ఇది శ్రీకృష్ణపరమార్థతత్త్వోపదేశమను పేరు గలిగి ప్రసిద్ధికెక్కియున్నది భాగవతము ఏకాదశ స్కంధము చూడుడు –

## భాగవతము – ఏకాదశ స్కంధము.

శ్రీకృష్ణుండు ఉద్ధవునకు బరమార్థోపదేశము చేయుట –

''ఇట్లు నుతియించి దేవా! నీవు యదుక్షయంబు గావించి చనిన మేమే విధంబున నిర్వహింతుము? నీ సహచరులమై జరిపిన మజ్జన, భోజన శయ నాసనాది కృత్యంబులు మఱువవచ్చునే'' యని యుద్ధవుండాడిన వాసు దేవుండిట్లనియె– బ్రహ్మాది దేవతా ప్రార్థనంబునం జేసి ధాత్రీభారంబు నివారించితి నింక ద్వారకానగరంబు నేటికి సప్తమదివసంబున సముద్రుండు ముంపగలవాడు, యదుక్షయంబును గాగలదు

అంతట కలియుగంబును ప్రాప్తంబయ్యెడి నందు మానవులు ధర్మరహితులు, నాచారహీనులు, నన్యాయపరులును, నతిరోషులు, మంద మతులు, అల్పతరాయువులు, బహురోగపీడితులు, నిష్ఫలారంభులు, నాస్తి కులునై యొండొరులను మెచ్చక యుందురు కావున నీవు సుహృద్బాంధవ స్నేహంబు వర్జించి యింద్రియ సౌఖ్యంబుల బొరయక క్షోణితలంబునం గల పుణ్యతీర్థంబుల నవగాహనంబు చేయుచు, మానసవాగక్షి శ్రోత్ర ఘ్రాణేం ద్రియ గృహ్యమాణంబగు వస్తుజాతం బెల్ల నశ్వరంబుగా నెఱుగుము పురు

షుండు నానార్థకామంబుల నంగీకరించి నిజగుణదోషంబుల మోహితుండై యుండు గావున హస్తిపకుండు గంధనాగంబుల బంధించు చందంబున నింద్రియంబులను మనోవికారంబులను నిగ్రహించి, ఈషణత్రయమును వర్జించి, మోదఖేదంబుల సమంబుగా వర్తింపుచు నీజగంబంతయు నాత్మాధిష్ఠితముగా నెఱింగి మాయాదు లాత్మతత్త్వాధీనంబులుగా నెఱుంగుచు, జ్ఞానవిజ్ఞాన యుక్తుండవై ఆత్మానుభవ సంతుష్టుండవై విశ్వంబును నన్నుగా భావించి వర్తింపవలయునని వాసుదేవుం డానతిచ్చిన నుద్ధవుండు భక్తివినయంబుల కరంబుల మొగిడ్చి 'మహాత్మా! సన్న్యస్తలక్షణంబు దుష్కరంబు, పామరులగువార లాచరింపలేరు నీమాయచేతు భ్రాంతులైన సాంసారికులు భవాబ్ధిం గడచి ఎట్లు ముక్తి నొందెదరు? భృత్యుండనైన నామీద ననుగ్రహముంచి యానతిమ్ము బ్రహ్మాది దేవతా సముదాయంబును బాహ్యవస్తువుల భ్రాంతులై పర్యటనంబు సేయుదురు నీ భక్తులైన పరమభాగవతులు అమ్మాయా నిరసనంబు సేతురు గృహిణీ గృహస్థులకైన, యతులకైన నిత్యంబు నీ నామ స్మరణంబు మోక్షసామ్రాజ్యప్రదంబు గావున పరమేశా! నీదు పదంబుల శరణంబు నొందెద కృపారసంబు నాపై నిగిడింపు' మని ప్రియసేవకుండైన యుద్ధవుండు పలికిన నతనికి కంసమర్దనుం డిట్లనియె

'పురుషునకాత్మకు నాత్మరూపెగురునని ఎఱుంగుము కుపథంబులం జనక సన్మార్గవర్తివై పరమంబైన మన్నివాసంబునకుం జనుము సర్వమూలశక్తి సంపన్నుండనైన నన్ను సాంఖ్యయోగపరులు నిరంతర భావంబులందు పురుషభావంబు గావించి తలంచుచుందురు మఱియు నేక ద్వి త్రి చతుష్పాద బహుపాదాపాదంబులునై యుండు జీవజాలంబులలోన ద్విపాదంబులు గల మనుష్యులు మేలు వారలలోన నిరంతర ధ్యానగరిష్ఠులైన యోగీంద్రు లుత్తములు వారలలో సందేహపరులచే నగ్రాహ్యుండగు నన్ను సత్త్వగుణ గ్రాహ్యునిగా నెఱింగి, నిజచేతః పంకజంబునందు జీవాత్మ పరమాత్మల నేకంబుగా జేసి శంఖ చక్ర గదా ఖడ్గ శార్ఙ్గ కౌమోదకీ కౌస్తుభాభరణ యుక్తుంగా నెఱుంగుచు నుండువారలు పరమయోగీంద్రు

లనియును పరమజ్ఞానులనియునుంజెప్పి-

అయితే యుద్ధవుండు అంత్యకాలమున భగవత్సేవ చేసెనో లేక యంత్యకాలమున నిష్కామకర్మయోగము ననుష్ఠించెనో, ఎంతకాల మేకాంతస్థలములో తపస్సు చేసెనో, ఎంతకాలము సర్వసంగ పరిత్యాగియై పుణ్యాశ్రమ, పుణ్యతీర్థముల సంచరించెనో యవి యన్నియు యోచించుకొనవలయును. అట్టి యనుష్ఠానములు చిరకాలము చేసిన తరువాత సర్వసంగ పరిత్యాగియై, కేవలమాత్మధ్యాననిష్ఠ గలవాడై, సకలవాసనా రహితుడై బ్రహ్మైక్యైక సంధానపరుడై పరమ నిర్వాణమును పొందుటకొఅకు మాత్ర మీపరమతత్త్వమును శ్రీకృష్ణు లుపదేశించిరి ఇదే కృష్ణాశయము ఇదియే దీనిలో గల రహస్యము

పాండవులయొక్క మహాప్రస్థానిక యాత్రయు, శ్రీకృష్ణభగవానుడు దేహము విడువ నిశ్చయించి నపుడు అంతరంగభక్తుడగు ఉద్ధవునకేది యుప దేశించెనో అదియే గీతయొక్క సారమగును తక్కిన గాధలన్నియు జీవుని యొక్క మధ్యకాల అవస్థలే యగును ఇట్టి సర్వసంగ పరిత్యాగము లేనిచో నిశ్చింత గలిగి బ్రహ్మనుసంధానసరుడై యుండుటకు సాధ్యము గాదు అంతే గాక సమత్వబుద్ధి గలిగి, సర్వజనులకు ధర్మము నుపదేశించుటకున్ను శక్తి గలుగదు జీవితమంతయు లోకమునకు సమర్పించుటకున్నూ అనుకూల ముండదు వర్ణాశ్రమములందుండి వానిచే బంధింపబడవలసినవాడుగా నుండును ఒకవేళ తనకు త్యాగము గలిగినను, తన దేహసంబంధులను గుఱించియైన నతడు తప్పక వర్ణమనెడు గొలుసుచే బద్ధుడు కావలసియుండును లేనిచో గృహస్థాశ్రమ కార్యములు వారికి జరుగవు అట్లాచరింపక పోయిన వారిని సాంఘికులు కులమునుండి వెలివేయుదురు ఇచ్చి పుచ్చుకొనుటయు, సాంసారిక కార్యములు జరుగుటయు ప్రయాసముగా నుండును కనుకనే యుత్తమజ్ఞానము కలుగు నప్పుడందఱున్ను సంసారమునుండి విముక్తు లగుచుందురు

ఈ ధర్మము స్వరాజ్యపరులకుగాని, స్వారాజ్యపరులకుగాని సమానముగానే యుండును అట్లు చేయని కారణముచేతనే స్వరాజ్యప్రవర్తకులలో కొందఱియందు కొన్ని లోపములు కనిపించుచున్నవి ఆలాగున స్వారాజ్య నిష్ఠ గలవారలలో గూడ కొందఱు కొన్ని దుర్గుణములు, మమకారములు గలిగిన వారు భ్రష్టులగుటకు కారణ మగుచున్నది అందువల్లనే గృహస్థాశ్రమములో నుండుకొందఱికి సాధువులపై, సన్న్యాసులపై హేయబుద్ధి కలుగుట ఇట్టి పాపము భరతఖండములో లేకుండ జేయుటకు ముముక్షువగు ప్రతి స్త్రీపురుషుడున్నూ యత్నించవలయును. జిజ్ఞాసువులున్ను, సాధకులున్నూ ఇట్టి దోషనివృత్తి కొఱకు మంచిదగు యత్నము చేయనగును అట్లైన మాత్రముననే పతనమైన స్వారాజ్యమును (జ్ఞానమును) ఉద్ధరింప గలుగుదురు అప్పుడు మాత్రమే పతనమైన బ్రహ్మనిష్ఠను పునరుద్ధరించి అగ్రస్థానములో ప్రతిష్ఠింప జేయగలము ఇదియే దీనిలో గల సారము

జీవన్ముక్తులుగూడ కర్మయోగము ననుష్ఠించుచుండ వలయునని గీతలో శ్రీకృష్ణభగవాను లుపదేశించి యుండలేదు కాని జీవన్ముక్తి కలుగుటకు అంఃకరణశుద్ధి కావలసియుండును అది నిష్కామకర్మయోగమువల్లనే కలుగునని శ్రీకృష్ణులు నొక్కి చెప్పియున్నారు అట్లు అంతఃకరణ నిర్మలత్వము కలుగనిచో బ్రహ్మవిచారమునకు అర్హత కలుగదు వస్త్రములకు రంగు అద్దవలసియుండిన దానియందుగల మురికిని తొలగించి శుద్ధపఱచిన మాత్రముననే అది యంటుకొనును క్రొత్త వస్త్రమైనను దానియందు గంజి, పిండి మొదలగు పదార్థముండిన రంగు నిలువజాలదు జలములో తడిపి నపుడు రంగు వదలి పోవును కారణమేమన! వస్త్రమునకున్నూ, రంగునకున్నూ మధ్య ఇతర పదార్థము లుండినచో నీటిలో తడుపునపుడు రంగును నెట్టివేయును మఱియు వస్త్రములో మాలిన్యముండి నందుచే రంగు వస్త్రమును పట్టుకొనుట కవకాశము లేకపోవుచున్నది అదే రీతిగా ఇత్తడి, రాగి మొదలగు లోహనిర్మితములగు దేవాలయ కలశములకు గాని, ధ్వజస్తంభములకుగాని బంగారుపూత

వేయవలసియుండిన ఆ రేకులను శుద్ధముగా తోమి శుభ్రపఱచవలయును లేనిచో సువర్ణమంటుకొనజాలదు వెయ్యేల! మీరు వాడుచుండెడు తామ్రాదిభాజనములకు కళాయి వేయవలసి యుండిన ఎట్లు ముందుగా బాగుగా తోమి నిర్మల మొనర్చెదరో, అట్లు కానిచో కళాయి ఏలాగున నిలువజాలదో, అదేరీతిగా ఈశ్వరార్పణబుద్ధితో నిష్కామకర్మయోగము, దైవోపాసన చిరకాలమాచరింపనిచో జీవునియందు గల పాపసంస్కారములు, విషయవాసన లుండుటచే, బ్రహ్మమునకున్ను జీవునకున్నూ మధ్య దృశ్య వృత్తు లుండుటవల్ల ఏకత్వము, ఐక్యసంధానము కలుగదు కాని యెల్లప్పుడున్నూ నిష్కామకర్మయోగమే యాచరించు చుండిన జీవునియందు గల విక్షేపావరణము లెట్లు నశించును?

ఒకడు ఎల్లప్పుడున్నూ మొదటి తరగతిలోనే చదువుచుండిన పైపై తరగతిలోని కెట్లు వెళ్లగులుగును? బ్రహ్మనిష్ఠలో మూడంతస్తులు కలవు అవి నిష్కామకర్మయోగము, దైవోపాసన, బ్రహ్మచింతనము ఈ దైవోపాసన సగుణ, నిర్గుణములనెడు(సాకార, నిరాకారములు) రెండు భాగములు బ్రహ్మచింతనము శ్రవణ మనన నిదిధ్యాసము లనెడు మూడు భాగములు వీని యన్నిటిలోను జీవుడు ప్రవేశించవలసియుండును మఱియు బాల్యా వస్థలో గల యాహారమే యెల్లప్పుడును పెట్టుచుండిన యౌవనకాలమున కది యెట్లు సరిపడగలదు? యౌవనారంభమున దానికితగిన యాహార ముండవలసియుండునుగదా! ఆలాగున జీవుల పరిణామావస్థ ననుసరించి ఉన్నతోన్నతములగు నాచరణలుగూడ నుండవలయును ఒకవేళ యావజ్జీవితము నిష్కామకర్మయోగపరుడై యుండినను కాలపరిణామము ననుసరించి అతడున్నూ ఆత్మచింతనలో(ధ్యానములో) నెక్కువ కాలము గడపును జీవన్ముక్తి స్థితిని గుఱించి శ్రీకృష్ణులు గీతలో చెప్పినది చూడుడు

**యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః ।**
**ఆత్మన్యేవ చ సన్తుష్టస్తస్య కార్యం న విద్యతే ॥**

ఎవడైతే తన యాత్మయందే ఆసక్తి కలవాడును, తన యాత్మయందే తృప్తిని బొందుచున్నవాడును అగునో ఆయాత్మ విదుని కిక చేయదగినది లేదు కర్మము చేయవలయునని విధి లేదు ఇట్లు భగవంతుడు చెప్పక పోయినచో జీవన్ముక్తులను, విదేహముక్తులను, నిర్వికల్పసమాధిలో నుండు యోగులను, సిద్ధపురుషులను, ధ్యాననిష్ఠలోనుండు మహర్షులను, బంధవి ముక్తులగు అవధూతలను, భగవదర్పిత హృదయము గల భక్తులను, బ్రహ్మ జ్ఞానులను తిరస్కరించినవాడగును గదా! అపుడు తన ప్రతిజ్ఞను తాను భంగపఱచినవాడగును 'పరిత్రాణాయ సాధూనాం' అను భగవద్వాక్యమే మిథ్యావాక్యమైన ఇక లోకము నిలుచునా! 'తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్' అని ఎలుగెత్తి చాటిన భగవద్వచనము మృషావచన మగునా! 'కౌన్తేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి అని భేరి వాయించి యుద్ఘోషించిన పరమాత్మ వాక్య మసత్యమగునా ఇవి యన్నియు నిష్కామ కర్మపరులుగూడ యోచించుకొనవలసి యుండును.

మఱియు ఆత్మనిష్ఠుడగు పైజెప్పిన దివ్యపురుషుడు కృతకృత్యు డైనందుచే చేయవలసినది మఱియొకటి లేదు అయితే కృతకృత్యుడు అనగా కృతము-చేయబడిన కృత్యము పనిగల వాడు అనగా తనయొక్క విధిని నిర్వహించినవాడని భావము అపుడుగూడ ముందుగా నిష్కామకర్మ యోగా నుష్ఠానముచే ఆత్మశుద్ధి కలుగవలసియున్నది అట్టికృతకృత్యుడగు మహాత్ముడు కర్మయోగము నాచరించిన బంధము గలుగదు ఆచరిం పకపోయిన ప్రత్యవాయదోషమున్నూ లేదు ప్రత్యవాయదోషమనగా చేయ వలసిన దానిని చేయకపోవుటచే కలిగెడు దోషము అట్టి దోషమున్నూ ఆత్మ జ్ఞానికి లేదు ఎందుకన, తన విధిని నిర్వహించియే ఆతడు కృతకృత్యు డయ్యెను కావున వానికది అవసరము లేదు. చేసినచో బంధమున్నూ లేదు ఈ రెండింటిలో ఏది గ్రాహ్యమని విచారించిన, చేయక యుండుటకన్న చేయు టయే మేలు ఏలన తనకు మేలు కీడులు లేకపోయినను చేయుటవల్ల లోకము నకు మేలు కలుగుచున్నది అదువల్ల చేయుటయే మేలని చెప్పడమైనది

మఱియు జ్ఞానులగునపుడు సర్వజీవరాసులలోను స్వభావముగానే దయ గలుగుచుండును అప్పుడు జీవుల కుపకారము చేయ దలంపు కలుగును ఆ యుపకారము అన్న వస్త్ర విద్యౌషధములు మాత్రములు గావు ఆత్మశుద్ధి కలుగుటకు తగిన దైవప్రార్థన, ధ్యానాద్యనుష్ఠానములుగూడ వారు బోధించుచుందురు ఆత్మశుద్ధి లేనిచో నెంత ధనముండినను శాంతియు, భూతదయయు గలుగవు కావున నిష్కామయోగముతో తప్పక ధ్యానయోగమున్నూ చేయుచుండవలయును లేనిచో రాజ్యము వచ్చినను, రాజాధిరాజైనను జీవుడు నిత్యశాంతిని, నిరతిశయానందమును, నిర్మలభావమును పొందజాలడు

జీవన్ముక్తుడు కర్మచేసిన దానివల్ల బంధింపబడడనియు, చేయనిచో ప్రత్యవాయదోషము లేదనియు, ఆ పుణ్యజీవి బంధమునుండి విడుదల పొందినవాడనియు తెలిపి, చేయకుండుటకన్న చేయుటయే లోకమునకు మేలని చెప్పినదాని కొక దృష్టాంతమును తెలిపెద ఒకడు చక్కగా చదివి యున్నతపరీక్షలో నుత్తీర్ణుడై గొప్ప యుద్యోగము నిర్వహించి కాలపరిసమాప్తి యందు పెన్షన్ తీసికొనుచున్నాడు మఱల అతడు ఉద్యోగము చేయవలసిన విధి లేదు అయితే శరీరబలము ఉంటున్నందువల్ల మఱియొక సంస్థానములో నొక యుద్యోగమును నిర్వహించవలయునని తోచినచో తన కాలాగున చేయవలయుననెడి విధి లేనప్పటికిన్నీ చేసినందుచేత వానికి గాని, లోకమునకుగాని యెంత మేలు గలుగునో ముక్తజీవునియొక్క స్థితియు నాలాగుననే యుండును కనుకనే భగవాను డిట్లుపదేశించినది

**నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన।**
**న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః॥**

ఆ బ్రహ్మనిష్ఠునకు ఈ లోకమునందు కర్మము చేసినందుచే ప్రయోజనము లేదు అనగా తాను కర్మము చేసి పొందవలసిన పదవి యేదియు లేదు కర్మము చేయనందుచేత నేలాటి దోషమున్ను(అనగా ప్రత్యవాయ

మున్ను) లేదు ఈబ్రహ్మనిష్ఠునకు బ్రహ్మ మొదలు స్థావరపర్యంతమగు సమస్తభూతములయందున్ను ప్రయోజన నిమిత్త మాశ్రయింపవలసిన పదార్థ మొకటియున్నూ లేదు మఱియు గీతయొక్క సారము ప్రపత్తి యనియే వైష్ణవుల నమ్మకము వారికి తిరుమంత్ర మెటువంటిదో ఈ ప్రపత్తి వాక్యమున్ను అటువంటిదే ఇది గీతయొక్క అంత్యోపదేశము. తరువాత మఱియొక యుపదేశము లేదు. గ్రంథ సమాప్తిని గుఱించిన విషయము మాత్రము చెప్పి పూర్తిచేయడమైనది

**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥**

సమస్త ధర్మాధర్మములను (అనగా కర్మముల చేతనే ధర్మాధర్మములు కలుగును గనుక సర్వధర్మము లనగా సమస్తకర్మము లనుట) విడిచి సమస్తమునకు ఆత్మను, సమస్తభూతములలోను సమముగా నుండువాడను నగు ఈశ్వరుడైన నొక్కనినే శరణమును పొందుము సర్వేశ్వరునికన్న అణుమాత్రమైనది మఱియొకటి లేదని దృఢముగ నమ్ముమని భావము అట్టి నిశ్చయముగల నిన్ను నేను బంధరూపములగు సమస్తపాపములనుండి విడిపించెదను. దుఃఖింపకుము ఇదియే గీతయొక్క అంతిమ సందేశ మగును అనెడు దృఢవిశ్వాసమే ప్రపత్తి యనబడును ఇదియే పరమభక్తులయొక్క పారమార్థికమగు ధర్మము కావున ఈశ్వరార్పణబుద్ధితో నిష్కామకర్మయోగము ననుష్ఠించుకొని, ఆఖరున కేవలము ఆత్మార్పణము గూడ చేసికొనవలయును అపుడే సంపూర్ణత్యాగ మొనర్చె ననబడును అదియే నిజమైన సన్న్యాసము, దీనితో గీతోపదేశము పూర్తి అయినది

**నియతం కురు కర్మ కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।**
**శరీరయాత్రాఽపి తే న ప్రసిద్ధ్యేదకర్మణః ॥**

వేదమందు జేయదగినదిగా నియమింపబడెడు అనుష్ఠానమును నీవు విధిప్రకారము చేయుము అనుష్ఠానము లేకయుండుటకన్న అనుష్ఠానము

కలిగియుండుట శ్రేష్ఠము ఆచరణ లేకుండిన నీయొక్క దేహనిర్వహణ కార్యముగూడ జరుగదు అనగా నియతమగు అనుష్ఠానము లేనిచో జీవితయాత్రకూడ జరుగదని భావము

**న కర్మణామనారమ్భాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే।**
**న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥**

పురుషుడు సకల పాపములను పోగొట్టి, చిత్తశుద్ధిని గలుగచేసి జ్ఞాననిష్ఠకు హేతువైన సత్కర్మముల నిష్కామకర్మబుద్ధితో ఆచరింపకపోవుటవలన, జ్ఞాననిష్ఠచే గలిగెడు నైష్కర్మ్యసిద్ధిని పొందడు సత్కర్మము, నిష్కామకర్మయోగముతో ననుష్ఠింపక కేవలము పుణ్యకర్మానుష్ఠానము విడుచుటచేతగాని, లేక వేషము ధరించిన సన్న్యాసము చేతగాని, నైష్కర్మ్యలక్షణ జ్ఞానసిద్ధిని పొందనే పొందడు గదా! ఈ రెండు శ్లోకములు నిష్కామ కర్మయోగమును గురించి చెప్పిన విషయమునకు చాలును ఇక జ్ఞాననిష్ఠను గురించి కొంచెము తెలిపెద.

**వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః।**
**బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥**

దృశ్యవిషయములో గల రాగమున్నూ, భయమున్నూ, కోపమున్నూ, పోగొట్టిన వారున్నూ, ఈశ్వరుని వలె శుద్ధమైనవారును, నన్ను ఆశ్రయించిన వారునగు అనేకులగు సత్పురుషులు బ్రహ్మైక్యానుసంధానమనెడి జ్ఞానతపసు చేత పరిశుద్ధులై, బ్రహ్మాత్మైక్యస్థితి గలవారైరి

**శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప।**
**సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే ॥**

ఓ అర్జునా! ద్రవ్యసాధన సాధ్యమైన యజ్ఞము కంటె ఆత్మచింతనా ధ్యానమగు జ్ఞానయజ్ఞము మిక్కిలి శ్రేష్ఠమైనది. ఈశ్వరార్పణముగా జేయబడెడు సకలకర్మము నాశము కానిదగుచు బ్రహ్మజ్ఞానమందు అంత

ర్భూత మగుచున్నది  అనగా ఈశ్వరార్పణ బుద్ధితో చేయు నిష్కామ కర్మయోగము జ్ఞాన ప్రాప్తిలోనికి తీసికొనివెళ్ళి జ్ఞానమునకు సహాయపడి జ్ఞానమందేకత్వము పొందుచుండును

**అపిచేదసి పాపేభ్యస్సర్వేభ్యః పాపకృత్తమః।**
**సర్వం జ్ఞానప్లవేనైన వృజినం సన్తరిష్యసి ॥**

పాపులందఱికంటె నీవు మిక్కిలి పాపములను చేసిన వాడవైనను ఆ సమస్తమైన పాపమను సముద్రమును జ్ఞానమనెడి తెప్పచేతనే లెస్సగా దాటగలవు.

**యథైధాంసి  సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున।**
**జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా॥**

ఓ అర్జునా! అగ్నిహోత్రుడు సమిధలను( నవ ధాన్యములను, నవవిధ సమిధలను, హోమద్రవ్యముల నన్నిటిని) ఏలాగున భస్మము చేయు చున్నాడో, ఆలాగున జ్ఞానమనెడు అగ్ని సమస్తకర్మముల సంపూర్ణముగా భస్మము చేయును

**న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।**
**తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి ॥**

ఈ లోకమునందు జ్ఞానముతో తుల్యమైనదియు, పాపములను పోగొట్టి శుద్ధిని కలుగచేయు నట్టిదియు నగు పుణ్యము మఱియొకటి లేదుగదా! నిష్కామకర్మ యోగనిష్ఠ గలవాడు ధ్యానయోగము పరిపక్వావస్థకు వచ్చినపుడు తనయందు ఆత్మస్వరూపజ్ఞానము స్వయము గానే పొందు చున్నాడు ఓహో! జ్ఞానవిషయమై భగవంతు డుద్ఘోషించిన ఈ వాక్యము లన్నియు స్మరించెడువారు లేకపోయిరి గదా? అట్టి పుణ్యసంస్కార జీవులు భారతదేశములో పుట్టకపోవుటచే గదా దేశమునకునూ, జ్ఞానమునకునూ ఇంతటి దీనదశ గలిగినది! దివ్యజ్ఞాన సమాజమువా

రీలాగున చెప్పుదురు అదేమన-అనేకదివ్యపురుషులు, పుణ్యజీవులు భూలోకమున జన్మమెత్తుటకు తలంపు గలవారై యున్నారనియు, వారు పవిత్రులగు తల్లిదండ్రుల గర్భములో జన్మించవలసియుందురనియు, పవిత్రముగ జీవితము గడపెడు తల్లిదండ్రులు లేనందుచే వారు జన్మమెత్తక యున్నారనియు, పరిశుద్ధులగు మాతాపితరుల గర్భములో వారు జన్మింతురనియు వచింతురు

కావున భారతదేశమున పావనులగు ఋషివంశములో జన్మించిన నారీమణులారా! మీరు దివ్యపురుషులను కని మీ జన్మమును సార్థక మొన రింప దలచుకొన్నారా? దేశము నుద్ధరింప దలచుకొన్నారా? పుణ్య పురుషు లగు బిడ్డలను కని మీవంశమును పావనము చేయదలచుకొన్నారా? అట్లైన, మీ జీవితమును శుద్ధపఱచుకొనుడు దంపతులగు మీరు గృహస్థబ్రహ్మచర్య మును గలిగియుండుడు సర్వజీవరాసులయందు దయగలిగి యుండుడు ధర్మవిరుద్ధ విషయములో వైరాగ్యము గలిగియుండుడు. పరమఋషులను హృదయములో స్మరింపుడు పరమకారుణికుడగు సర్వేశ్వరుని మనస్సులో స్మరింపుడు అట్లయిన మీవంశములో పుణ్యజీవులు జన్మింతురు

ఈవిషయములో పురుషునికంటె స్త్రీ అతిజాగరూకత గలిగి యుండ వలయును. అట్టి మాతృదేవియొక్క నిర్మలమగు ఉదరమందే ఆ దివ్య పురుషులు 9నెలలు, 10నెలలవఱకు నివసించవలసియుందురు కావున మీ గర్భము అతిపావనముగా చేసికొనుడు శ్రేష్ఠమైన వస్తువును నికృష్టమగు పాత్రలో ఎట్లు ఉంచరో, ఆలాగున మలినస్వభావము గలవారి గర్భమున పుణ్యాత్ములు జన్మింపరు ఇపుడుగూడ నొకగ్రామమునకు పుణ్యపురుషు డగు నొక అతిథి వచ్చినచో, ఆ గ్రామములో పుణ్యాత్ములగువారి గృహమును వెదకి(విచారించి) ఆచ్చోటికి వెళ్లెదరేగాని పాపాత్ముల ఇంటికి వేంచే యుదురా? ఈ తత్త్వమును గ్రహించిన చాలును తల్లులారా! మీరే మాకు భిక్షము పెట్టవలసియుండును బ్రహ్మనిష్ఠులగు బిడ్డలను కని జ్ఞానోద్ధరణ, లోకోద్ధర ణములు చేయించు భారము మీపై నున్నది మాతృదేవతయొక్క

మహిమను గుఱించి ధర్మశాస్త్ర కర్తయగు మనుమహర్షి చెప్పినది చూడుడు

**ఉపాధ్యాయాన్ దశాచార్యః ఆచార్యాణాం శతం పితా।**
**సహస్రం తు పితౄన్ మాతా గౌరవేణాతిరిచ్యతే ॥**

విద్య చెప్పెడు పదిమంది యుపాధ్యాయులకన్న- ధర్మాధర్మములను తెలిపి ఆత్మసంస్కారము చేసెడు నాచార్యు డధికుడు అట్టి నూరుమంది ఆచార్యులకన్న తండ్రి అధికుడు అట్టి వేయిమంది తండ్రులకన్న కన్నతల్లి అధికురాలు

తల్లి గౌరవముచేతను, పవిత్రతచేతను అధిక్యము గలిగియున్నదని తలంచవలయును ఇట్టి మహిమ తల్లియందు గలదు ఈ పవిత్రభావము ఏ పుత్రులకు మాతయందు నుండునో, వారుగూడ అంత పవిత్రు లగుదురు శివాజీమహారాజునకు కలిగిన మహిమాతిశయ మంతయు తల్లివలననే గలిగినట్లు చెప్పిరి

ఆలాగుననే శంకరులు, ఏసుక్రీస్తు మొదలగు ప్రవక్తల తల్లులు మహాతపస్వినులుగా నుండినట్లు చరిత్రలు సాక్ష్య మిచ్చుచున్నవి గాంధీగారు తన ఆత్మకథయందు తనతల్లి యొక్క మహిమనుగూర్చియు, తపస్సును గూర్చియు, వర్ణించుచు సూర్యనమస్కారము చేయక తల్లి భోజనము చేయదని, వర్షాకాలమున మేఘాచ్ఛాదనముచే రెండు, మూడు రోజు లైనను సూర్యుడు కనిపించకపోయిన, ఉపవాసముండి, ఎపుడు సూర్యుడు కనపడునో అపుడు సూర్యనమస్కారములు జేసి భుజించిన రోజులు ఎన్నియో గల వని చెప్పిరి ఇటువంటి పుణ్యస్వభావముగల స్త్రీలచేతనే భారతదేశపు ఉద్ధరణ కావలసియుండును తల్లియందు పవిత్రభావము గలిగిన పుత్రుడే పవిత్రు డగును తల్లిని హీనముగా చూచెడు కుమారుడు నీచస్థితిని పొందగలుగును ఏలన మానవుని జీవితమంతయు భావమునకు లోబడి యుండును భావశుద్ధి గలిగిన మాత్రమే జ్ఞానసిద్ధి గలుగును

ఇక జ్ఞాననిష్ఠావిషయమై అధికముగా వ్రాసి వ్యాసమును పెంచదలచ

లేదు గీతలో అక్షరపరబ్రహ్మమును తెలిపెడు అష్టమాధ్యాయమున జీవునియొక్క ప్రయాణకాలమున చరమాత్మను ఎట్లు ధ్యానించినచో పరమపదము కలుగునో ఆ విషయమై శ్రీభగవాను లేమి యుపదేశించిరో, వానిని చూడుడు అదేమన! ఈభగవదుపదేశము అంత్యకాల ప్రయాణమునకు కావలసి యుండు దారిబత్తెమని మఱువకుడు అంతేగాదు ఇదే మీయొక్క గమ్య స్థానమని గూడ యోచించుకొనుడు ఇట్టి పరమతత్త్వమును లోకములో బోధించువారు లేకపోవుటచేతనే దేశము అజ్ఞాన దశలో, ఇంతటిక్షీణదశకు రావడమైనదని తలంచినచో, ఋషివంశములో పుట్టిన ఎవరి హృదయము కరుగకయుండును?

**యదక్షరం వేదవిదో వద న్తి విశ న్తి యద్యతయో వీతరాగాః ।**
**యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చర న్తి త త్తేపదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥**

వేదార్థము నెఱింగినవారు దేనిని నాశము లేని దాని గా చెప్పుచున్నారో, కామక్రోధాదుల జయించిన సన్న్యాసులు, ఏ నాశరహితమైన పదమును పొందుచున్నారో, ఏ అక్షరపదమును తెలియగోరుచున్న వారలగుచు బ్రహ్మచర్య వ్రతము ననుష్ఠించుచున్నారో, అ అక్షరాఖ్యస్థానమును నీకు సంక్షేపముగా చెప్పెదను భగవంతుడే "సంగ్రహేణ ప్రవక్ష్యే" అతి సంగ్రహముగా చెప్పుచున్నా నని చెప్పెను. దానినే పూర్తిగ వ్రాసిన విస్తారమగునని తలంచి ఆ సంగ్రహములోనే మిక్కిలి సంగ్రహించి ఈ వాక్యమును చెప్పడమైనది భగవంతు డుపదేశించ దలంచిన దానియందు అర్జునున కేదైన సందేహము కలుగునని మొదటనే ముగ్గురిని సాక్ష్యముగా చూపినారు వారు ముగ్గురు సామాన్యులు కారు వారెవరన-

1 వేదము కడవఱకు చదివి వేదార్థము నెఱింగిన బ్రహ్మనిష్ఠులును, 2 రాగద్వేషములు నశించిన యతీశ్వరులును, 3 బ్రహ్మచర్య వ్రతనిష్ఠగల ఋషులును- దీనివల్లనే ఉపదేశింపబోయెడు దానియొక్క మహిమ తెలిసికొనవచ్చును

**సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।**
**మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్ ॥**
**ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మా మనుస్మరన్ ।**
**యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్॥**

ఎవ్వడు తనయొక్క సమస్తేంద్రియ ద్వారములను చక్కగ నియమించి మనస్సును హృదయకమలమందు నిలిపియు, మూర్ధస్థానమందు ప్రాణ వాయువును ఉంచి యోగధారణమును పొందినవాడై, పరబ్రహ్మ ప్రతిపాద కమగు ఓంకారమనెడు ఏకాక్షరమును ఉచ్చరించుచూ నన్ను ధ్యానించు చున్నవాడై, శరీరమును విడచుచూ బయలు వెడలునో, అతడు శ్రేష్ఠమైన గతిని పొందుచున్నాడు

ఇకను 6వ అధ్యాయములో ఆత్మసంయమ యోగమును గుఱించి శ్రీకృష్ణుడుపదేశించినది చూడుడు కావుననే గదా! యోగీశ్వరుడని భగవంతునకు పేరుగలిగెను, అట్టి యోగశక్తి లేనిచో కృష్ణావతారమున అట్టి మహిమలను జూప గలుగునా! అట్టి యోగమునుండి మానవులు వియోగము కలిగినవా రగుటచేతనే ఇపుడు దేనికిన్ని ఉపయోగము లేని స్థితికి వచ్చిరి

**యోగీ యుఞ్జీత సతతమాత్మానం రహసి స్థితః।**
**ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః॥**

మనస్సును, దేహమును, ఇంద్రియములను స్వాధీనపఱచుకొన్న వాడును, ఆశ లేనివాడును, పరుల సొమ్మును పరిగ్రహింపని వాడును నగు యోగి ఒంటరిగా ఏకాంతస్థల మందున్నవాడై మనస్సు నెల్లప్పుడును ఐక్యానుసంధానము చేయవలసినది

**శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః ।**
**నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్ ॥**
**తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియ క్రియః ।**

**ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగమాత్మవిశుద్ధయే ॥**

పరిశుద్ధమైన స్థలమున మిక్కిలి యెత్తుగా లేనిదియు, మిక్కిలి పొట్టిగా నుండనిదియు, దర్భుల పైన కృష్ణాజినము– ఆపైన వస్త్రము కలదియునగు స్థిరమైన ఆస్తరణమును తన ధ్యాన నిమిత్తము వేసికొని, ఆ స్థిరాసనమందు కూర్చుండి మనస్సును నిశ్చలముగా చేసి మనస్సుయొక్క, ఇంద్రియముల యొక్కయు వ్యాపారములు లేనివాడగుచు, ఆత్మశుద్ధికొఱకు బ్రహ్మ ధ్యానము నభ్యసింప వలెను ఇక నెక్కువ విషయములు వ్రాసి మీ మనస్సునకు విసుగు పుట్టింప దలచుకొనలేదు ఇపుడు వ్రాసినదిగూడ మిక్కిలి సంక్షిప్తము ఇంత మా త్రము లేనిచో చెప్పబూనిన దానియొక్క స్వరూపము గోచరము కాదు

ఇక గీతోపదే శాంతమున 18వ అధ్యాయములో గీతయొక్క సంక్షిప్త సారమును గుఱించి శ్రీకృష్ణభగవాను లుపదేశించినది చూడుడు ఈ విషయమునుగూడ సాక్షాద్భగవంతుడే సమాసేనైవ అని సెలవిచ్చిరి అనగా మిక్కిలి సంక్షిప్తమని భావము

**సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే ।**
**సమాసేనై వ కౌన్తేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥**

ఓ అర్జునా! బ్రహ్మజ్ఞానముయొక్క పరిసమాప్తి ఏదియో, నిష్కామ కర్మ యోగము చేత చిత్తశుద్ధిని పొందిన వాడు ఎట్టి జ్ఞాననిష్ఠచేత బ్రహ్మమును పొందుచున్నాడో, ఆ బ్రహ్మజ్ఞాననిష్ఠను పొందు విధమును సంక్షేపముగా నావలననే తెలిసికొనుము

**బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ ।**
**శబ్దాదీన్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ॥**

**వివిక్త సేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।**
**ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥**

మిక్కిలి శుద్ధమైన బుద్ధితో కూడినవాడును, ధైర్యముచేత మనస్సును స్వాధీనపఱచుకొనియును, శబ్దాదివిషయములలో రాగద్వేషములను విడిచి పెట్టియును ఏకాంతస్థలమందు నివసించువాడును, సాత్త్వికపదార్థమును మితముగా భుజించువాడును, వాక్కును, శరీరమును, మనస్సును స్వాధీనము చేసికొనినవాడును, ఎల్లప్పుడును ధ్యానము నభ్యసించువాడును, ఇహపర భోగములందు వైరాగ్యము గలవాడున్నూ అగువాడు బ్రహ్మైక్యమును పొందుటకు సమర్థు డగుచున్నాడు ఇపుడు గీతను గుఱించి చెప్పవలసిన భాగము నతిసంగ్రహముగా తెలుసుకొనులాగున చెప్పడమైనది గీత అర్జునునికి యౌవనకాలమున అంతఃకరణశుద్ధి నిర్విషయస్థితి పూర్తిగ గలుగని స్థితిలో చెప్పబడినది

గీతాచార్యులు నిష్కామకర్మయోగము ఏ తరగతిలో నుండువారికి బోధించెనో, యాతత్త్వము ఈద్వాదశ త్రయోదశాధ్యాయములలో స్పష్టముగా నిరూపించియున్నారు యతులకు బ్రహ్మవిచారమున్ను, వానప్రస్థులకు యోగమున్నూ, గృహస్థులకు నిష్కామకర్మ యోగమున్నూ ఉపదేశించియున్నారు కనుకనే గృహస్థాశ్రమము ఆత్మయాత్రలో రెండవ మజిలీయని చెప్పుట అచట పంచయజ్ఞపరులై, నిష్కామకర్మ యోగపరులై యుండిన మాత్రమే అట్టివారికి వనములో ప్రవేశించి చిత్తైకాగ్రతారూపమగు ధ్యానయోగము ననుష్ఠించుటకు అర్హత కలుగును ఇదే యథార్థమైన సత్యము

వేదాంతశాస్త్రములో ఉత్తమ, మధ్యమ, కనిష్ఠాధికారులను మూడు తర గతులు కలవు వీరికి తీవ్ర, మధ్యమ, మంద అధికారులనిగూడ పేర్లు గలవు మఱల నొక్కొక్కరిలోను తీవ్ర, తీవ్రతర, తీవ్రతమములని మూడు ప్రభేద ములు గలవు అవి యన్నియు ఇచట వివరింప బూన లేదు అయితే ఇచట గృహస్థాది మూడాశ్రమములు చెప్పిరేగాని బ్రహ్మచర్యము నేల చెప్పలేదని శంకింప బనిలేదు ఏలన, గృహస్థాశ్రమములో నుండు అర్జునుని నుండియే ఈ ధర్మము బోధింపబడినందుచే బ్రహ్మచర్యమును ప్రత్యేకముగా చెప్ప నక్క రలేదు ''బ్రహ్మచారివ్రతే స్థితః'' యని యాఱవ అధ్యాయములో

**ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగమాత్మవిశుద్ధయే ॥**

పరిశుద్ధమైన స్థలమున మిక్కిలి యెత్తుగా లేనిదియు, మిక్కిలి పొట్టిగా నుండనిదియు, దర్భల పైన కృష్ణాజినము- ఆపైన వస్త్రము కలదియునగు స్థిరమైన ఆస్తరణమును తన ధ్యాన నిమిత్తము వేసికొని, ఆ స్థిరాసనమందు కూర్చుండి మనస్సును నిశ్చలముగా చేసి మనస్సుయొక్క, ఇంద్రియముల యొక్కయు వ్యాపారములు లేనివాడగుచు, ఆత్మశుద్ధికొఱకు బ్రహ్మ ధ్యానము నభ్యసింప వలెను ఇక నెక్కువ విషయములు వ్రాసి మీ మనస్సునకు విసుగు పుట్టింప దలచుకొనలేదు ఇపుడు వ్రాసినదిగూడ మిక్కిలి సంక్షిప్తము ఇంత మా త్రము లేనిచో చెప్పబూనిన దానియొక్క స్వరూపము గోచరము కాదు

ఇక గీతోపదే శాంతమున 18వ అధ్యాయములో గీతయొక్క సంక్షిప్త సారమును గుఱించి శ్రీకృష్ణభగవాను లుపదేశించినది చూడుడు ఈ విషయమునుగూడ సాక్షాద్భగవంతుడే సమాసేనైవ అని సెలవిచ్చిరి అనగా మిక్కిలి సంక్షిప్తమని భావము

**సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే ।**
**సమాసేనై వ కౌన్తేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥**

ఓ అర్జునా! బ్రహ్మజ్ఞానముయొక్క పరిసమాప్తి ఏదియో, నిష్కామ కర్మ యోగము చేత చిత్తశుద్ధిని పొందిన వాడు ఎట్టి జ్ఞాననిష్ఠచేత బ్రహ్మమును పొందుచున్నాడో, ఆ బ్రహ్మజ్ఞాననిష్ఠను పొందు విధమును సంక్షేపముగా నావలననే తెలిసికొనుము

**బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ ।**
**శబ్దాదీన్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ॥**

**వివిక్త సేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।**
**ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥**

**అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ ।**
**మదర్థమపి కర్మాణి కుర్వన్సిద్ధిమవాప్స్యసి ॥**

యమనియమ ప్రాణాయామ ధ్యాన ధారణాది యోగానుష్ఠానము చేయుట కశక్తుడ వైతివేని, ఈశ్వరప్రీతిపరమగు నిష్కామకర్మయోగము నాచరింపుము నానిమిత్తము కర్మలను (అనగా దైవార్పితబుద్ధితో చేయు ఉపాసన, అనన్యభక్తి, భగవత్సేవాపరమగు కైంకర్యము మొదలగునవి) జేసి వాటివల్ల అంతఃకరణ శుద్ధిగలిగి, తద్వారా భగవత్ప్రాప్తిని పొందగలవని తెలిపిరి ఇది నిష్కామకర్మ యోగముతో గూడిన గృహస్థ ధర్మమగును భక్తియోగముగూడ దీనిలో అంతర్భూతము ఇక పదమూడవ అధ్యాయములో బోధించినది చూడుడు.

**ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా ।**
**అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥**

కొందఱు ధ్యానముచేత ప్రత్యగాత్మస్వరూపమగు ఆత్మనే పరమాత్మగా దర్శించుచున్నారు ఇది జ్ఞానయోగమునకు సంబంధించినది మఱికొందఱు అభ్యాసయోగమునకు సంబంధించినవారు తత్త్వాతీతమగు ఆత్మను సాంఖ్య యోగము చేత తెలిసికొనుచున్నారు ఇది అభ్యాసయోగముతో గూడినది మఱికొందఱు నిష్కామకర్మయోగముచేత విశుద్ధాంతఃకరణులై ఆత్మయందు పరమాత్మను చూచుచున్నారు ఇది నిష్కామకర్మ యోగమును గుఱించినది ఈశ్లోకములో గూడ నిష్కామకర్మ యోగమును మూడవస్థానములో నిరూపించియున్నారు ఇట్లు చెప్పుటచే నిష్కామకర్మ యోగము ఉత్తమ పక్షము కాదని నాతలంపు కాదు. నిష్కామకర్మ యోగము ఒకదానివల్లనే జీవితము పూర్తియని తలచక ధ్యానయోగము నుపదేశించి జ్ఞానయోగమువఱకు వెళ్ల వలయునని మాత్రమిచట తెలుపడమైనది ఆలాగున గృహస్థాశ్రమముతోనే జీవితయాత్ర అంతమైనదని తలచక వానప్రస్థము నుపదేశించి, తపశ్చర్యకు గడంగి జ్ఞానయోగమగు

తురీయాశ్రమములో ప్రవేశించుటకు మాత్రమిది వ్రాయడమైనది ఇది దేహముతో సంబంధించినది మాత్రముగాదు అనుష్ఠానముతో గూడినదని తలంచవలయును

# ఉత్తరగీత

**యథాఽమృతేన తృప్తస్య పయసా కిం ప్రయోజనమ్ ।**
**ఏవం తత్పరమం జ్ఞాత్వా వేదైర్నాస్తి ప్రయోజనమ్ ॥**

అమృతపానముచే తృప్తినొందిన వానికి నుదకముచే నేమి ప్రయోజనము? అటులనే పరమాత్మసాక్షాత్కారము చేసికొనిన తరువాత వేదశాస్త్రములలో జెప్పిన కర్మకాండముచే నేమి ప్రయోజనము?

**తావదేవ నిరోధస్స్యాద్యావత్తత్త్వం న విన్దతి।**
**విదితే తు పరే తత్త్వే ఏక మేవానుపశ్యతి ॥**

ఎంత పర్యంతము అపరోక్షజ్ఞానము కలుగుకుండునో, అంత పర్యంతము సమాధిస్థుడై ఇంద్రియ నిరోధము కలవాడు కావలయును అఖండానందైక బ్రహ్మమపరోక్షమైన మీదట దేహేంద్రియాది సాధనా రహితుడై బ్రహ్మమునే చూచుచుండును

**జ్ఞానేన దీపితే దేహే బుద్ధిర్బ్రహ్మసమన్వితా।**
**బ్రహ్మజ్ఞానాగ్నినా విద్వాన్నిర్దహేత్కర్మబంధనమ్ ॥**

ఆత్మజ్ఞానము గలవాని దేహము ఆత్మజ్ఞానముచే ప్రకాశింపబడు చుండగను, నిశ్చయాత్మకమైన బుద్ధి బ్రహ్మముతో గూడిన దగుచుండగను, బ్రహ్మజ్ఞాన మనెడు నిప్పు కర్మమనెడి పాశమును దహించును.

**ప్రణవస్య శిరో హ్యాత్మా తల్లక్ష్యం బ్రహ్మ ఉచ్యతే ।**
**అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్ ॥**

శిరస్సుతో కూడిన ప్రణవము బ్రహ్మమగును ఆ ప్రణవమునకు

లక్ష్యమే బ్రహ్మము బాణసంధానము చేయునపుడు లక్ష్యమునం దేమరుపాటు లేక ఎటుల దృష్టి నిలుపుదురో ఆలాగున బ్రహ్మమునందు దృష్టిని నిలుపవల యును

**నివర్తన్తే క్రియా స్సర్వా స్తస్మిన్దృష్టే పరావరే।**
**ఓంకార ప్రభవా వేదా ఓంకారప్రభవాస్స్వరాః ॥**

**ఓంకార ప్రభవం సర్వం త్రైలోక్యం సచరాచరమ్ ।**
**ఓమిత్యేవ పరం రూపం హృత్పద్మే చ వ్యవస్థితమ్ ॥**

**తస్మాత్తదభ్యసేదేకం సర్వగం పరమేశ్వరమ్ ।**
**హ్రస్వో దహతి పాపాని దీర్ఘో మోక్షప్రదాయకః ॥**

ఓంకారవాచ్యుడును, కార్యకారణ రూపమును అగు ఆ పరమాత్ము నెఱుంగగా సమస్తక్రియలు నిలిచిపోవుచున్నవి. వేదములు, స్వరములు అనునవి యన్నియు ఓంకారమువల్లనే పుట్టినవి చరాచరాత్మకమగు ఈలోకత్రయము ఓంకారమువల్లనే పుట్టినది హృదయకమలమందు ఓం అను అక్షర స్వరూపము కలదు కావున అంతట వ్యాపించియుండు నదియు, పరమేశ్వరస్వరూపమును, ఒక్కక్కొటియునగు ప్రణవము నభ్యసింప వలయును ఆ ప్రణ వము హ్రస్వము అగునెడల పాపములను దహించును దీర్ఘమైన మోక్షదాయకము

గీతను గుఱించి చెప్పవలసిన విషయములను సంక్షిప్తముగా నిపుడు తెలుపడమైనది. యోగము, తపస్సు, భక్తి, జ్ఞానములను గుఱించి శాస్త్ర ములలో చెప్పెడు మహిమను ఇచట ఏమియు నిరూపించియుండలేదు గీతలో గల యాశయములను మాత్రమే కొంచెము తెలుపడమైనది వర్తమాన యుగములో పరమభక్తులు, సిద్ధపురుషులు తగ్గిపోయినందుచే ఆ విషయము విస్తరింప బూనలేదు. అయితే ఈ యుపాధికి నిష్కామకర్మ యోగమందు గాని, దేశమందుగాని ప్రీతియు, విశ్వాసమున్నూ లేకపోలేదు అయితే దైవ భక్తియు, బ్రహ్మనిష్ఠయు అత్యవసరముగా నుండవలయునని మాత్రమే

చెప్పుచుందును దేహముతో ఎంత సంబంధము గలదో, దేశముతోను అట్టి సంబంధము గలిగియుండవలయును ప్రాణముతో (ఆత్మతతో) ఎంత సంబంధమున్నదో అంత సంబంధము దైవముతోగూడ గలిగియుండ వలయునని మాత్రమే చెప్పుచుందును అట్లయిన మాత్రమే రాజ్యము వచ్చినను జీవుడు సుఖమును పొంద గలుగును అట్లుగానిచో రాజ్యాభిలాషచే పాశ్చాత్త్యు లేలాగున నిప్పులోని మిడతలవలె దగ్ధు లగుచున్నారో అట్టి దురవస్థ, నరకాగ్ని మధ్య జీవితము, ఆత్మశాంతి కలుగుకపోవుటచేతను, హృదయనైర్మ ల్యము లేకపోవుటచేతను, సర్వేశ్వరుని యందు విశ్వాస ముంచకపోవుట చేతను గలుగుచున్నది

ఒకరికపకారము చేయుట కాదు నాగరికతా చిహ్నము అది అనాగరికమే యగును ఉపకారము చేయుటలోనే నాగరిక చిహ్నము నిలచి యుండును దీనిని బాగుగా నాగరికతాభిలాషగల జనులందఱున్నూ జ్ఞాపకము చేసికొన వలయును శ్రీభగవంతుడు నాలుగవ అధ్యాయమున ఈ గీతాశాస్త్రము సృష్ట్యారంభమున సూర్యున కుపదేశింపబడిన దనియు, సూర్యుడు తన పుత్రుడగు మనువున కుపదేశించె ననియు తెలిపియున్నాడు. కావున ఈ విద్య యొక్క పరంపర యెచటినుండి ప్రారంభమైనది? ఈ గురుపరంపర యెటు వంటిది? అని తెలిసికొనదగినది అందువల్ల గీతయొక్క మూలతత్త్వమును మనువుయొక్క ధర్మము ననుసరించి తెలిసికొనవలయును మనుమహర్షి నిష్కామకర్మ యోగమే సూర్యుడు తన కుపదేశించెనని చెప్పియున్నారా? లేక గృహస్థాశ్రమమే జీవితాంతమువఱకు శరణ్యమని తెలిపియున్నారా? ఈతత్త్వమును గ్రహించుకొన్న తనకు గల సందేహము వీడిపోవును మను మహర్షి నాలుగాశ్రమములను బోధించియున్నారు దానియందు బ్రహ్మ చర్యా శ్రమమునకున్నూ, వానప్రస్థాశ్రమమునకున్నూ మిక్కిలి గౌరవమును చూపి యున్నారు వనములో నుండి తపస్సు చేయనిచో బ్రహ్మప్రాప్తి గలుగదనియే మనువుయొక్క సిద్ధాంతము దీనికి మన ఋషులే నిదర్శ నము

**ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్ ।**
**వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవే ఽబ్రవీత్ ॥**

**ఏవం పరంపరాప్రాప్తమిమం రాజర్షయో విదుః ।**
**స కాలేనేహ మహతా యోగో నష్టః పరన్తప!**

**స ఏవాయం మయాతేఽద్య యోగః ప్రోక్తః పురాతనః।**
**భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్ ॥**

నాశము లేని ఈ జ్ఞానయోగమును నేను సృష్టియొక్క ఆదికాలమందు సూర్యునికి చెప్పితిని సూర్యుడు మనువునకు చెప్పెను ఆ మనువు తన కుమారుడైన ఇక్ష్వాకు మహారాజునకు చెప్పెను. ఓ అర్జునా! సూర్యుడు మొదలుకొని పారంపర్యముగా పొందబడిన ఈజ్ఞానయోగమును నిమి మొదలగు రాజర్షులు తెలిసికొనిరి. అధికకాలము గడిచినందున ఆజ్ఞానయోగ మీలోకమందు విచ్ఛిన్న సంప్రదాయము గలదైనది నాయొక్క భక్తుడవును, స్నేహితుడవు నైతివిగాన నీకు ప్రాచీనమైన ఈ జ్ఞానయోగమే నాచేత ఇప్పుడు చెప్పబడినది శ్రేష్ఠమైన ఈ జ్ఞానము బహుగోప్యమైనది గదా!

మనుస్మృతియందు నుపదేశింపబడిన కొన్ని వాక్యముల నిచట నిరూపించెద

**షట్ త్రింశదాబ్దికం చర్యం గురౌ త్రై వేదికం వ్రతమ్ ।**
**తదర్థకం పాదకం వా గ్రహణాంతికమేవ వా॥**

మూడు వేదములను సాంగముగా నధ్యయనము చేయుటకై గురుకులంబున ముప్పదియాఱు సంవత్సరము లుండవలయును లేదా అందు సగము (అనగా పదునెనిమిదెండ్లు) గాని, అందు సగము (అనగా తొమ్మిదేండ్లు) గాని కనీసము బాగుగా నేర్చుకొను నంతవఱకుగాని బ్రహ్మచర్య వ్రతము ననుష్ఠింపవలయును నాలుగంతస్తులతో కట్టెడు సౌధమునకు పునాది ఎంత దృఢముగా నుండవలయునో, పునాది దుర్బలమైన సౌధ మేలా

గున కూలునో, యాలాగున నాలుగాశ్రమము లను జీవితసౌధమునకు బ్రహ్మ చర్యాశ్రమము పునాదివంటిది ఇది సుస్థిరత గలిగియుండిన తక్కిన గృహస్థ వానప్రస్థ సన్న్యాసాశ్రమముల మూడింటిని ధరింప శక్తి గలిగియుండును

**వేదానధీత్య వేదౌ వా వేదం వాఽపి యథాక్రమమ్ ।**
**అవిప్లుత బ్రహ్మచర్యో గృహస్థాశ్రమమావసేత్ ॥**

మూడు వేదములనుగాని, రెండు వేదములనుగాని తుదకు తన శాఖావేదమునుగాని, గురునికడ బ్రహ్మచర్యవ్రతుడై తప్పక అభ్యసించి బ్రహ్మచర్యాశ్రమములోను ఏకాంతముగానుండి బ్రహ్మచింతన చేయవల యును అపుడే బ్రహ్మచర్యము పూర్తియగును

**ఏకాకీ చింతయేన్నిత్యం వివిక్తే హితమాత్మనః ।**
**ఏకాకీ చింతయానో హి పరం శ్రేయోఽధిగచ్ఛతి ॥**

అట్లు వనము నాశ్రయించి ఏకాంతమున నుండి తనకు హితంబగు బ్రహ్మభావము నొందగోరి వేదాంత శాస్త్రవిచారము చేయవలయును. అట్లేకాంతమున నుండి పరతత్త్వ చింతనమువల్ల మోక్షము నొందుచున్నాడు ఇక గృహస్థాశ్రమమును గుఱించి తెలుపబడుచున్నది.

**అనేన విధినా నిత్యం పంచయజ్ఞాన్న హాపయేత్ ।**
**ద్వితీయమాయుషో భాగం కృతదారో గృహే వసేత్ ॥**

ఈ విధానముచే పంచయజ్ఞములను ముఖ్యముగా విడువక భార్యతో గూడినవాడై రెండవదియగు గృహస్థాశ్రమమును గడుపవలయును

**ఏవం గృహాశ్రమే స్థిత్వా విధివత్స్నాతకో ద్విజః ।**
**వనే వసేత్తు నియతో యథావద్విజితేంద్రియః ॥**

విద్యావ్రత స్నాతకుడగు జిజ్ఞాసువు ఇత్తెరంగున గృహస్థాశ్రమమును నడిపి నియమములను గైకొని శాస్త్రవిధి చొప్పున విజితేంద్రియుడై వనమున

వానప్రస్థాశ్రమములో నుండవలయును

**గృహస్థస్తు యదా పశ్యేద్వలీపలితమాత్మనః ।**
**అపత్యస్యైవ చాపత్యం తదారణ్యం సమాశ్రయేత్ ॥**

ఎప్పుడు గృహస్థుడు తన మోమున ముడుతలను, శిరమున నెఱయు టను చూచునో, ఎపుడు తన పుత్రుని యొక్క పుత్రుని చూచునో, ఆ వెంటనే గృహస్థాశ్రమము వీడి వానప్రస్థాశ్రమమూని వనమునకు పోవలయును

**సంత్యజ్య గ్రామ్యమాహారం సర్వం చైవ పరిచ్ఛదమ్ ।**
**పుత్రేషు భార్యాం నిక్షిప్య వనం గచ్ఛేత్సహైవ వా ॥**

ఊరిలో దొరకు ధాన్యములు, శాకములు మున్నగు నాహారములను వదలి యడవిలో చిక్కు కంద మూలఫలముల నాహారముగా గొనుచు, పరిజ నము నంతటిని వీడి, భార్యను పుత్రుల యధీనమున వదలిగాని లేక బ్రహ్మ చర్యవ్రతముతోను, వైరాగ్యముతో నుండి తపస్సు చేయుట కిష్టమున్నచో నామెతోగూడనుగాని వనమునకు పోవలయును

**వసీత చర్మచీరం వా సాయం స్నాయాత్ప్రగే తథా।**
**జటాశ్చ బిభృయాన్నిత్యం శ్మశ్రు లోమ నఖాని చ ॥**

కృష్ణాజినములనుగాని, నారబట్టలనుగాని ధరింపవలయును. తెల్లవారు జామునను, సాయంకాలమునను స్నానము జేయవలయును. జడలను, గడ్డమును, మీసములను, రోమములను భరించవలయును.

**స్వాధ్యాయే నిత్యయుక్తస్స్యాద్దాన్తో మైత్ర స్సమాహితః ।**
**దాతా నిత్యమనాదాతా సర్వభూతానుకమ్పకః ॥**

వేదాధ్యయన మందెల్లప్పు డాసక్తి గలవాడును, ఎండవాన చలి మొదలగునవి యోర్చుకొనువాడును. అందఱకు మేలొనగూర్చువాడును మనస్సును వశపఱచుకొన్నవాడును, ఎల్లవేళల దాతయు, జనులకడనుండి

ప్రతిగ్రహము చేయనివాడును, సకల జీవములయందు దయగలవాడునై యుండవలయును

**వనేషు తు విహృత్యైవం తృతీయం భాగమాయుషః ।**
**చతుర్థమాయుషో భాగం త్యక్త్వా సంగాన్పరివ్రజేత్ ॥**

ఇత్తెఱగున నాశ్రమములందు ఆయువునందలి మూడవభాగమును గడిపి, కళత్రాది సంబంధములను తొలగించుకొని యాయువు, నాలుగవ, భాగమున సన్న్యాసమును స్వీకరింపవలయును

**యో దత్వా సర్వభూతేభ్యః ప్రవ్రజత్యభయం గృహాత్ ।**
**తస్య తేజోమయా లోకా భవన్తి బ్రహ్మవాదినః ॥**

ఏజిజ్ఞాసువు భూతములకెల్ల నభయంబొసంగి గృహస్థాశ్రమమునుండి సన్న్యసించుచున్నాడో, అట్టి బ్రహ్మ ప్రతిపాదకములగు నుపనిషత్తులందు శ్రద్ధ గలవానికి బ్రహ్మతేజస్సుచే హిరణ్యగర్భ లోకములు గలుగుచున్నవి

**ఏక ఏవ చరేన్నిత్యం సిద్ధ్యర్థమసహాయవాన్ ।**
**సిద్ధిమేకస్య సంపశ్యన్న జహాతి న హీయతే ॥**

ఒంటరియై తోడులేక మోక్షసిద్ధికొఱకు సంచరింపవలయును మోక్షప్రాప్తి యొంటరిగా నున్నవారికే కలుగునని తెలిసి అట్లాచరించునేని దాని మూలమున దుఃఖము ననుభవింపడు కనుక అన్నిటియందును మమత లేక సుఖముగా ముక్తి పొందును

**కపాలం వృక్షమూలాని కుచేలమసహాయతా ।**
**సమతా చైవ సర్వస్మిన్నేతన్ముక్తస్య లక్షణమ్ ॥**

భిక్షకై మంటిమూకుడును, ఉనికికై చెట్లమూలమును, కౌపీనమునకై చింపిరి పేలికయు, ఇతరులపై ఆధారపడకుండుట అన్నిటియందును బ్రహ్మ, భావనచే సమత్వబుద్ధియు– ఇవియెల్ల పరివ్రాజకున కుండవలసిన లక్షణములు

**ఏకకాలం చరేద్భైక్షం న ప్రసజ్జేత విస్తరే ।**
**భైక్షే ప్రసక్తో హి యతిర్విషయేష్వపి సజ్జతి ॥**

దినమున కొకపూటయందే యతి భిక్షాటనము చేయవలయును. అదియు విస్తరముగా సంచయము చేయవలయునని కోరరాదు అట్లు ఎక్కువ భిక్షాటనమందే శ్రద్ధ గలవాడు ఇంద్రియము అభివృద్ధినొంద విషయములందు ప్రవర్తించును

**ఇంద్రియాణాం నిరోధేన రాగద్వేషక్షయేన చ।**
**అహింసయా చ భూతానామమృతత్వాయ కల్పతే ॥**

ఇంద్రియముల నిగ్రహించియు, దేనియందు రాగద్వేషము లూనకయు, జీవులను హింసింపకయు నున్న సన్న్యాసి మోక్షము నొందును.

**అలాభే న విషాదీ స్యాల్లాభే చైవ న హర్షయేత్ ।**
**ప్రాణమాత్రికమాత్రస్స్యాన్మాత్రాసంగాద్వినిర్గతః॥**

భిక్షాదులు దొరకనపుడు విచారపడరాదు దొరికినపుడు పొంగరాదు ప్రాణసంరక్షణకు వలసినంత మాత్రమే భిక్ష గొనవలయును వస్తువులం దేమాత్రము సంగము గలిగియుండరాదు

**సమ్యగ్దర్శనసంపన్నః కర్మభిర్న నిబధ్యతే।**
**దర్శనేన విహీనస్తు సంసారం ప్రతిపద్యతే ॥**

జ్ఞానముతో గూడినవాడు పుణ్యపాపములచే కట్టబడడు అట్టి జ్ఞానము లేనివాడు జననమరణ రూప సంసార మును బొందును

**సర్వేషామపి చైతేషామాత్మజ్ఞానం పరం స్మృతమ్ ।**
**తద్ధ్యగ్ర్యం సర్వవిద్యానాం ప్రాప్యతే హ్యమృతం తతః ॥**

ఈ వేదాధ్యయనాదులలో నన్నింటను నుపనిషత్ప్రతిపాద్యమగు బ్రహ్మనుగూర్చిన జ్ఞానమే శ్రేష్ఠము. ఆ జ్ఞానము వలననే మోక్షము గలుగు

నుగాన అది అన్ని విద్యలలో ప్రధానమును, సంపాద్యమునై యున్నది

**తపో విద్యా చ విప్రస్య నిఃశ్రేయసకరం పరమ్।**
**తపసా కిల్బిషం హన్తి విద్యయాఽమృతమశ్నుతే॥**

తపస్సు, బ్రహ్మజ్ఞానమున్ను విప్రునకు మేలొసంగును తపస్సుచే చేసిన పాపము పోవును బ్రహ్మజ్ఞానము నొందుటచే అమృతత్వము బొంద నగునని శ్రుతియే వివరించెను

**సర్వమాత్మని సంపశ్యేత్సచ్చాసచ్చ సమాహితః।**
**సర్వం హ్యాత్మని సంపశ్యన్నాధర్మే కురుతే మనః ॥**

సత్పదార్థము, అసత్పదార్థము నెఱింగి అది యంతయు బ్రహ్మ స్వరూపమనియు, పరమాత్మ స్వరూపమగు తనయందది యెల్ల నున్నద నియు నెఱిగినవాడయి, అట్టియాత్మ స్వరూపమును ధ్యానప్రకర్షమున ప్రత్య క్షము చేసికొనవలయును తన్ను దానెఱుంగవలయునని తాత్పర్యము అట్లు తన్ను దానెఱిగినవాడు అసత్కర్మమునందు మనంబు ద్రిప్పజాలడు

**ఏవం యస్సర్వభూతేషు పశ్యత్యాత్మానమాత్మనా।**
**స సర్వసమతామేత్య బ్రహ్మాభ్యేతి పరం పదమ్ ॥**

ఎవడివ్విధమున సర్వభూతములయందు నున్న యాత్మను బ్రహ్మజ్ఞాన ముతో చూచునో, అతడు బ్రహ్మసాక్షాత్కారము వలన నుత్తమస్థానమగు బ్రహ్మమును పొందుచున్నాడు అనగా ఆబ్రహ్మమునందు లీనుడై ముక్తు డగు చున్నాడని భావము.

పరమఋషుల సంతానములారా! మానవుల కందఱకు మూలపురుషు డగు మనుమహర్షి చెప్పినది వింటిరా! మనవుయొక్క సంతతిలో పుట్టినవా రగుటచేతనే మనుష్యులందఱకున్ను మానవులని పేరు వచ్చినది. కావున మనుష్య లందఱున్ను మనువంశీయులే. ఈతత్త్వమును మీరు మరువ కుందురుగాక! అపుడే మీరు మనుష్యులచేత పొందవలసిన

బ్రహ్మపదమును పొంద గలుగుదురు

అయితే యిపుడు నాలుగాశ్రమములను విధిగా చెప్పినందుచే అందఱున్ను బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థము లనెడు మూడు ఆశ్రమముల ధర్మములను విధి ప్రకార మాచరించి తురీయాశ్రమము పొందవలసి యుండునని తలంచ పనిలేదు ఇది క్రమపద్ధతి ననుసరించి చెప్పడమైనది సోపాన మార్గము నను సరించి ఇది యుపదేశించడమైనది దీనికి సామాన్య మార్గ మనియు, గౌణ పద్ధతి యనియు పేరు గలదు విశేషమార్గమనియు, ముఖ్యపద్ధతి యనియు మఱియొక ధర్మము కలదు అది బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థాశ్రమములలో దేనియందున్నప్పటికిన్ని జన్మాంతర సంస్కారముచే విషయవాసనలు నశించి తీవ్రముముక్షుత్వము కలిగెనేని అచ్చోటనుండియే తురీయాశ్రమములో ప్రవేశింపవచ్చు ననుట ఇచ్చోట విహంగ మార్గ మనియు, పిపిలీకామార్గమని యు రెండు త్రోవ లేర్పడుచున్నవి శ్రుతి యీలాగున నుపదేశించుచున్నది ఈవిధి పురుషులకున్నట్లు స్త్రీలకుకూడ గలదు. గార్గి బ్రహ్మచారిణి యనియే బృహదారణ్యకములో చెప్పబడినది సులభాయోగిని బ్రహ్మచర్య వ్రతనిష్ఠ గలవారనియే భారతమున కనబడుచున్నది

**యదహ రేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్ ।**
**వనాద్వా గృహాద్వాబ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్ ॥**

ఏదివసమందు సర్వవిషయములలో విరక్తి కలిగెనో, ఆదివసమందే సన్న్యసింపవచ్చును అది వానప్రస్థ మందుగాని, గృహస్థమందుగాని, బ్రహ్మ చర్యమందుగాని యుండినను విరోధము లేదు అయితే అంతఃకరణము అత్యంతశుద్ధమై యుండవలయును. లేనిచో పతితుడగునను సంగతి మాత్రము మఱువకూడదు ఇదే దీనిలో గల మర్మము

**యదా మనసి వైరాగ్యం జాతం సర్వేషు వస్తుషు।**
**తదైవ సన్న్యసే ద్విద్వానన్యథా పతితో భవేత్ ॥**

ఎపుడు సమస్తవస్తువులలో వైరాగ్యము కలుగునో అపుడు ఆ బ్రహ్మజ్ఞాన సంపన్నుడు సన్న్యసింపవచ్చును అట్లుగాక సన్న్యసించెనేని తప్పక పతితు డగును

**కర్మత్యాగాన్న సన్న్యాసో న ప్రేషోచ్చారణేన తు।**
**సంధౌ జీవాత్మనోరైక్యం సన్న్యాసః పరికీర్తితః ॥**

విహితకర్మములను మానుటవలన సన్న్యాసము సిద్ధింపదు ప్రేషోచ్చారణ సహితమగు సన్న్యాససంస్కారములను చేయుటచేతనే సన్న్యాసము కలుగదు ప్రత్యగభిన్న బ్రహ్మాత్మైక జ్ఞానసాక్షాత్కారమే సన్న్యాస మనబడును

**ద్రవ్యార్థమన్న వస్త్రార్థం యః ప్రతిష్ఠార్థమేవ వా।**
**సన్న్యసేదుభయభ్రష్టః స ముక్తిం నాప్తుమర్హతి॥**

ధనమార్జించుటకుగాని, అన్నవస్త్రములకుగాని, తనను అందఱు గౌరవింతురనిగాని తలంచి సన్న్యసించిన యెడల ఉభయలోక భ్రష్టత్వమేగాని ముక్తి గలుగదు( అని మైత్రేయ్యుపనిషత్తు )

ఇదే సృష్టికాలమందు సూర్యుని ద్వారా మన్వాది ఋషులకు భగవంతుడు ఉపదేశించిన ధర్మము. కర్మ, భక్తి, యోగ, జ్ఞానములనెడు నాలుగు పాదములతో ముక్తియనెడు కామధేనువు సంచరించుచుండును ఈ నాలుగున్నూ కలవారే నాలుగు పాదములు గల గోవువలె మోక్షమార్గములో సుఖముగా సంచరింపగలరు ఈ నాలుగింటిలో ఏది కొఱత గలిగినను ఒక పాదము చెడినట్లే తలంచవలయును. కనుకనే గీతలో గోరూపముగా గీతను వర్ణించడమైనది ''సర్వోపనిషదో గావో'' అని ధ్యానశ్లోకములో చెప్పుట కిదే కారణము

మఱియు నాలుగు స్తంభములపై ప్రతిష్ఠింపబడిన సౌధమెటు వంటిదో, యాలాగున నిష్కామకర్మయోగ, భక్తియోగ, ధ్యానయోగ, జ్ఞాన

యోగము లనెడు నాలుగు స్తంభములపై మోక్షసౌధము నిర్మింపబడి యున్నది ఏ స్తంభము విరిగినను, శిథిలమైనను సౌధము సరిగా నిలువనట్లు ఈ నాలుగు అనుష్ఠానములు సరిగా లేనివారి మోక్షనిలయమున్ను సరిగా నిలువజాలదు. కావుననే గీతలో ''గీతా మే చోత్తమం గృహం'' అని సాక్షాద్భగవంతు డుపదేశించినది ఇదియే దీనిలో గల పారమార్థికసత్యము

ఈ నాలుగును అనాది సిద్ధములు ఎవరు తొలగించినను పోవునవి కావు. అయితే ఈ నాలుగింటిలో దేనికి శిథిలత్వము కలుగునో దాని నుద్ధరించుట కొక దివ్యపురుషుడు ప్రపంచమున నవతరించును సౌధము యొక్క చెడిన స్తంభమును ఇంజనీరు వచ్చి ఏలాగున చక్కపఱచునో లేక గోవుయొక్క ఏ పాదము విరిగెనో దానిని కట్టుగట్టి సంరక్షించుటకు డాక్టరు(పశువైద్యుడు) వచ్చి ఏలాగున పని చేయుచుండునో, పైజెప్పిన నాలుగు యోగములయొక్క స్థితి ఆలాగుననే యుండును ఈ నాలుగు యోగములు పూర్తిగ గలవారు బ్రహ్మవేత్తలలో ఉత్తమోత్తము లనబడుదురు మూడు యోగములు గలవా రుత్తములు రెండు యోగములు గలవారు మధ్యములు ఒక యోగము గల వారు సామాన్యులు ముక్తివిషయములో అందఱున్ను సమానులు అధికార విషయములో నిట్టి భేదముండును ఇది గ్రహించినచో సంశయముల కవకాశము కలుగదు

గీతయొక్క యాశయము సంక్షిప్తముగా తెలుపబడినది ఇపుడు జనక మహారాజును గుఱించి కొంచెము చెప్పవలసియున్నది జనకుడు సంసార ములో ఉండి మోక్షము నొందలేదా! యని సామాన్యజనులుగూడ చెప్పుచుం దురు. మోక్షము నొందుటకు సంసారము ప్రతిబంధకమని యెవరున్నూ చెప్పరు అయితే ముక్తుడు నిర్వహించవలసిన కృత్యములను సంసారములో నుండి చేయుటకు ప్రతిబంధములు లేకుండిన చాలును దీనిని మాత్రము ఆత్మవంచనము లేక చూచుకొనుచుండవలయును అంతే చాలును గృహము విడిచియే అనుష్ఠానమున్ను లేక సంచరించెడు ఈ సన్న్యాసులందఱు ముక్తు లేనా? అని యడుగవలదు జీవుడు తన యొక్క అవిద్యాబంధమునుండి

విడుదల నొందుటయే ముక్తి యనబడును ఈస్థితి యెట్లు గలుగునో అట్లా చరించిన చాలును అయితే జనకునియొక్క జీవితము చదివినచో జనకుండె టువంటి వైరాగ్యము గలవాడు, ఎంత కాలము వనములో తపమొనర్చెను? ఎంత సునిశ్చితమైన వ్రతనిష్ఠ గలవాడు? ఎందఱు మహర్షులవల్ల బోధను పొందెను? ఇవి యన్నియు అపుడు తెలిసికొనవచ్చును జనకునియొక్క జీవిత మెంత పవిత్రమైనదో గోచరము కాగలదు

జనకునియొక్క ఆ జీవిత చరిత్రమంతయు యోగవాసిష్ఠ ఉపశమ ప్రకర ణమందు గనదగును ఇంత వ్యక్తముగా మఱియే గ్రంథమందైనను గాన్పించదు వసిష్ఠమునీంద్రునివల్ల గృహస్థాశ్రమమునకు సంబంధించిన ధర్మము లన్నియు జనకుడు గ్రహించినట్లు అనేక గ్రంథములలో గలదు పద్మపురాణాంతర్గత మాఘపురాణము జూడుడు మఱియు కపిలముని శిష్యుడగు పంచశిఖుడను పేరు గల మహర్షివలన సాంఖ్యము తెలిసికొన్నట్లు భారతమందు గలదు యాజ్ఞవల్క్యమహర్షి శ్రేష్ఠునివల్ల వేదాంత తత్త్వో పదేశము నొందినట్లు బృహదారణ్యకోపనిషత్తునందు గన్పించు చున్నది. అష్టావక్రమునివల్ల అమనస్క సాక్షాత్కారము పొందినట్లు అష్టావక్రగీత తెలుపుచున్నది ఇవి యన్నియు సామాన్యసంగతులా! సామాన్యగృహస్థు డాచరింపనగునా! జనకునియొక్క నిస్సంగత్వము, నిస్స్పృహత్వము, జగన్మిథ్యాత్వ భావన మొదలగు అమోఘగుణములు శుకబ్రహ్మకైవల్యము చదివిన బోధపడగలవు

మఱియు జనకుని జీవితము త్రేతాయుగము నాటిది. అపుడు సత్య ధర్మములు మూడు పాదములు గలిగియుండెను అట్లుండిగూడ జనకుడు నిమిత్తమాత్రముగ రాజ్యపరిపాలన జేసికొనిరేగాని సమస్తకార్యములను మంత్రులే నిర్వహించుచుండిరి జనకుడు నిరంతరము బ్రహ్మనిష్ఠాసంబంధ కార్యములలో కాలము గడుపుచుండెను అట్లుండియు, జనకుని ప్రారబ్ధము నికృష్టమనియే శాస్త్రములలో వర్ణింపబడినది ఏలన! జనకుడు యావత్కా లము గృహస్థాశ్రమములో నుండెను అందువల్ల జనకుడు అనేక సమయము

లలో క్లేశములను బొందినట్లు గన్పడుచున్నది. రోగియైనవాడు విధిలేక చేదైన మందును భుజించవలసివచ్చినట్లు, సంసారములోనుండి విషతుల్యములగు ఈ భోగములను, విధిలేక అనుభవింప వలసివచ్చినట్లును, తనయొక్క ప్రారబ్ధ మీలాగున నీచమై పరిణమించినట్లును, వ్యాకుల హృదయముతో జనకుడు చెప్పినట్లు గలదు

యాజ్ఞవల్క్యుని ప్రారబ్ధము మధ్యమమనియే చెప్పబడినది ఏలన! యాజ్ఞవల్క్యుడు కొంతకాలము గృహస్థాశ్రమములోనుండి మఱల విరక్తుడై సన్న్యాసాశ్రమమును పొందియున్నాడు త్యాగియై గృహస్థాశ్రమము వదలి పోవునపుడు మైత్రేయితో నీసంగతినే తెలిపినాడు గృహస్థాశ్రమములో నుండిన స్వాతంత్ర్యము గలుగదనియు, వాసనారాహిత్యము కలుగుట ప్రయాసమనియు, సంకల్పములు నశించుటదుస్తర మనియు చెప్పినట్లు బృహదారణ్యకోపనిషత్తునందు గాన్పించుచున్నది

శ్రీ శుకసనకాదుల ప్రారబ్ధము శ్రేష్ఠమైనదనియు, ఉత్తమమైన దనియు శాస్త్రముద్ఘోషించుచున్నది ఏలన! వీరలు సంసార మాలిన్యమున తగులుకొ నకనే యుండిరి కావుననే వీరిని నిత్యముక్తులని చెప్పిరి యాజ్ఞవల్క్యమహర్షి సంసార మాలిన్యమును త్వరలోనే కడిగి శుద్ధచేసికొనిరి జనకుడు కుమ్మ రపురుగు బురదలో నుండినను అంటుకొననట్లు జీవితము గడిపెను. జనకుని తపస్సు, వైరాగ్యమున్ను చాలా గొప్పవి శ్రీయోగ వాసిష్ఠములోగల సిద్ధగీతయే దీనికి తార్కాణము ఇది జనకుడు వనమున తపస్సులో సమాధి నిష్ఠ గలిగియున్నప్పుడు, నవసిద్ధులు ఆకాశమందు జనకు నుద్దేశించి ఆకాశవాణి రూపముగా నుపదేశించినది.

గీతలో భగవంతుడు మూడవ అధ్యాయమున జనకాదులు నిష్కామకర్మ యోగముచేతనే జ్ఞానసిద్ధిని పొందినట్లు తెలిపియున్నారు ''కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః''– జనకుడు మొదలగువారు నిష్కామకర్మ యోగముచేతనే చిత్తశుద్ధిని పొందిరిగదా! యని గలదు

దానివల్ల కర్మయో గమున కాధిక్యము తెలుపడమైనది అందుచే బ్రహ్మనిష్ఠ కేమియు విరోధము లేదు నిష్కామకర్మయోగముచే అంతఃకరణశుద్ధి గలిగి తద్వారా బ్రహ్మని ష్ఠాబలమువల్ల జ్ఞానమును పొందెనని చెప్పుటలో నెవరును ఆక్షేపించరు నిష్కామకర్మయోగము మాత్రము చేసి జీవన్ముక్తు డాయెనో, లేక బ్రహ్మవిచా రము గూడ చేసెనో, ఏకాంతమున తపశ్చర్య గలిగియుండెనో యని మాత్రమే యిచట తెలిసికొనిన చాలును అనగా నిష్కామకర్మ యోగము ద్వారా అంతఃకరణశుద్ధి గలుగునపుడు విషయ వైరాగ్యము, జీవకారుణ్యము గలిగి బ్రహ్మవిచారముగూడ చేయుచుండవలయునని మాత్రమే ఇచట నిరూపించవలసి యుండును ఇదియే యథార్థమైన సత్యము

శుద్ధమైన గృహస్థాశ్రమముగాని, పవిత్రమైన లోకసేవ గాని ఎవరున్నూ శ్రేష్ఠములు కావని చెప్పజాలరు మఱియు గీతలో నిష్కామకర్మయోగముచే జనకాదులు ఆత్మశుద్ధిని పొందిరి యని చెప్పినది నిజమేగాని, దశమాధ్యా యములో విభూతియోగమున ''మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేక మక్షరమ్'' మహర్షులలో భృగుమహర్షిని నేను, వేదములలో నేను ఓంకారస్వ రూపుడనుగా నుంటున్నాను అని భగవంతుడే యుపదేశించియున్నాడు మఱియు, ''దేవర్షీణాం చ నారదః''- తాను దేవఋషులలో నారదుడనని, భగవ త్స్వరూపుడననియు,''మునీనా మప్యహం వ్యాసః''- మునులలో శ్రీవేద వ్యాసులు సాక్షాన్నారాయణావతారులని శ్రీకృష్ణులు స్వయముగా నుప దేశించియున్నారు ''అధ్యాత్మ విద్యా విద్యానాం''- విద్యలన్నిటిలోను బ్రహ్మవిద్య సాక్షాద్భగవ త్స్వరూపమని భగవంతుడే తెలిపినాడు ఈ ఋషులు చేసిన తపస్సు, ధ్యానయోగము, బ్రహ్మవిచారము, బ్రహ్మచర్య వ్రతము, ఏకాంతవాసము శాస్త్రసమ్మతమనియు, భగవత్ప్రీతికరమనియు, తెలిసికొనిన చాలును వీరున్నూ నిష్కామకర్మయోగము ఆచరింపక పోలేదు కాని వారి సేవలన్నియు జీవకోట్ల అంతఃకరణశుద్ధి పరములై, జ్ఞానప్రాప్తి లక్ష్యములై యుండెను

కొందఱు స్థూలమైన ఈలోకక్షేమము కొఱకు యత్నించుచున్నారు మఱికొందఱు సూక్ష్మలోక( మనోలోక) శుద్ధికొఱకు ప్రయత్నించుచున్నారు ఇవి రెండున్నూ జీవకోట్ల కత్యవసరములు అపుడే జీవుడు దుఃఖశాంతిని పొంది నిరతిశయానందమును పొందగలుగును ఇది పరమార్థసత్యము. అట్లుగాక ఈలోకక్షేమమే ముఖ్యమని తలంచి పాశ్చాత్య నాగరికతయే శ్రేష్ఠ మని యుద్దేశించి పశ్చిమ దేశ విజ్ఞానమే లోకశ్రేయస్కరమని నిశ్చయించి ప్రవ ర్తించినచో పాశ్చాత్యు లిపుడు పడియుండు మహాఘోరమగు సంగ్రామ దుఃఖ మునే జీవకోట్లు పొందవలసియుండును విజ్ఞానమంతయు జీవకోట్ల రక్షణ కొఱ కుండవలసినదే గాని శిక్షణకొఱకు తగదు అది రాక్షస విజ్ఞానమేగాని దేవతల విజ్ఞానము కాజాలదు దేహబలము, దేశము, దేశస్వాతంత్ర్యము, దేశసౌభాగ్యము సమస్తము కలిగినను,ఆత్మశుద్ధియు,ఆత్మశాంతియు, ఆత్మ ప్రసన్నతయు కలుగనిచో జీవులు ఏమి సుఖమును పొందగలుగుదురు? మఱియు ఈ దేహము ఎంత దృఢత్వము గలిగి సర్వసౌభాగ్యము లనుభ వించుచుండినను కొలది కాలములోనే వీడిపోవలసి యుండును మనోలో కముచే గలిగెడు శుద్ధి,ఆనందము జీవులు అనంతకాలమువఱకు అనుభవిం చేలాగున నుండునని మఱువకూడదు కావున అట్టి యాత్మశాంతి యాత్మ శుద్ధిని పొందుటలో ప్రతివారున్ను నిరంతరము ప్రయత్నశీలురై యుండవల యును అపుడే మానవజన్మయొక్క పని పూర్తియైనదని నిశ్చయించుకొన వలయును అది నిత్యసౌఖ్యము

ఇచట జనకుడు చెప్పిన వైరాగ్య బోధకములగు కొన్ని వాక్యముల నిరూపించెద

**హా! కష్టమతికష్టాసు లోకలోలదశాస్వయమ్ ।**
**పాషాణేష్వివ పాషాణా లుఠామి బలాదహమ్॥**

ఆహా! ఎట్టి ఖేదకరమైన విషయము! జన్మజరా మృత్యుభయాదులచే మిగుల కష్టప్రదమగు చంచల జీవదశలందు రాతిపై రాతివలె బలాత్కా రముగా నేను దొర్లుచున్నాను.

**అపర్యన్తస్య కాలస్య కోఽవ్యంశో జీవ్యతే మయా ।**
**తస్మిన్ భావం నిబధ్నామి ధిగ్మామధమచేతసమ్ ॥**

ఈయనంతకాలమున నా జీవిత మతిస్వల్పమైనది అట్టి అల్పకాలిక జీవనమందాశ గలిగయున్న యధముడనగు నాకు ధిక్కారమగు గాత!

**కియన్మాత్రమిదం నామ రాజ్యమాజీవితం మమ।**
**కిమేతేన వినా దుఃఖం తిష్ఠామి హతధీర్యథా॥**

నా జీవితపర్యంత ముండు నీ రాజ్యము మిగుల అల్పమైనది దీనితోడనే సంతుష్టిజెంది నశించిన బుద్ధి గలవానివలె భావిదుఃఖ వినాశముకొఱకై చింతింపక యేల యుంటిని?

**ఆదావన్తేఽప్యనన్తోఽహం మధ్యే పేలవజీవితః ।**
**బాలశ్చిత్రేన్దునేవాహం కిం ముధా ధృతిమాస్థితః॥**

అనాది అనంతస్వరూపుడనగు నాకీయల్పజీవితము శరీర సంబంధముచే మధ్య గల్గినది కాన చిత్రమందలి చంద్రుని నిజచంద్రునిగ భావించి గ్రహింప నుద్దేశించు బాలుని చందమున అనాత్మరూపమగు దేహాదులను ఆత్మరూపముగ దలంచుచు నేనేల వ్యర్థముగ ధైర్య మొందుచుంటిని?

**ప్రపంచరహితేనాహ మింద్రజాలేన జాలినా।**
**హా! కష్టమతిముహ్యామి కేనాస్మి పరిమోహితః॥**

హా! కష్టము! ఏఇంద్రజాలికుని యింద్రజాలముచే నేను పరిమోహితుడనైతిని!

**యద్వస్తు యచ్చ వా రమ్యం యదుదారమకృత్రిమమ్ ।**
**కించిత్తదిహ నాస్త్యేవ కింనిష్ఠేహ మతిర్మమ ॥**

సత్యమై సుఖరూపమై అపరిచ్ఛిన్నమైనట్టి వస్తు వీప్రపంచమున నెద్దియును లేదు అట్టివానిచే నాకు చిత్తవిశ్రాంతి ఎట్లు లభించును?

**పరామృష్టం విశిష్టం హి దృష్టం నష్టం న భావితమ్ ।**
**అత్రష్ఠం న తదస్తీహ సతాం యత్రాస్తు సంస్థితిః ॥**

ఈ ప్రపంచమున గల ప్రతి వస్తువున్నూ శీఘ్రముగ వినాశము నొందుచున్నది కాన నా రాజ్యాదులున్నూ తుచ్ఛములే యగును ఏలన! ప్రసిద్ధములగు నింద్ర బ్రహ్మాదుల పదములున్ను తత్త్వదృష్టిచే నశ్వరములుగనే గన్పట్టుచున్నవి కాన వివేకుల చిత్తమువలె నిరంతరము విశ్రాంతి బొందునట్టి పదార్థమెద్దియు నీ ప్రపంచమున లేదు

**అద్య యే మహతాం మూర్ధ్ని తే దినైర్నిపతన్త్యధః ।**
**హతచిత్తమహత్తాయాం కైషా విశ్వస్తతా బత ॥**

నేడు మహామహుల శిరంబుల నలంకరించినవే కొలదికాలములో అధః పతనమును పొందుచున్నవి కాన నశ్వరమగు నీ చిత్తముయొక్క మహత్త్వమందు, అనగా రాజ్యాదివిభవమందు నేల విశ్వాసము గలుగును?

**అరజ్జు రేవ బద్ధోఽహమపంకోఽస్మి కలంకితః।**
**పతితోఽస్మ్యుపరిస్థోఽపి హా! మమాత్మన్హతా స్థితిః॥**

ఆహా! త్రాడులేకయే నేను బంధింపబడితిని పంకము లేకయే కళంకితుడనై తిని సర్వోపరిస్థానమందున్నను క్రిందబడితిని ఆహా! నాయాత్మస్థితి నశించినది!

**క ఇమే మే మహాభోగాః క ఇమే మమ బాంధవాః।**
**బాలో భూతమయేనేవ సంకేతేనాహమాకులః॥**

ఈ నా మహాభాగ్యములేమి? ఈ నా బాంధవు లెవరు? ఆహా! బాలునివలె వ్యర్థముగ మమత్వకల్పనచే నేను వ్యాకులుడ నగుచున్నాడను!

**క్వ ధనాని మహీపానాం బ్రహ్మణః క్వ జగన్తి వా।**
**ప్రాక్తనాని ప్రయాతాని కేయం విశ్వస్తతా మమ॥**

గొప్పగొప్ప రాజుల ధనమంతయు నేమైనది? పూర్వపు బ్రహ్మదేవునిచే రచింపబడిన నయ్యనేక బ్రహ్మాండము లిపుడెట కేగినవి? ఇక నీ ధనాదులందు నాకేల యపేక్ష?

**బ్రహ్మణాం కోటయో యాతా గతాః సర్గపరంపరాః ।**
**ప్రయతాః పాంసువద్భూపాః కా ధృతిర్మమ జీవితే ॥**

అనంతకోటి బ్రహ్మదేవులు గతించిరి అనేక సృష్టి పరంపరలు గడచినవి ధూళికణమువలె నెందరో రాజులు వినష్టులైరి ఇక నాజీవితమం దాశయేల?

**అజస్రముపయాన్త్యేతే యాన్తి చాద్యాపి వాసరాః ।**
**అవిన ష్టైకసద్వస్తు ర్దృష్టో నాద్యాపి వాసరః ॥**

దినములు నిరంతరము వచ్చుచున్నవి పోవుచున్నవి కాని దోషరహితమ గునానందరూపమైన సద్వస్తువు లభించిన దినయొక్కటేని నేటివఱకు చూడబడలేదు

**ఆపదోఽపి విచిత్రా యాస్తాశ్చేన్మనసి సంమతాః ।**
**తత్తా అపి మహారంభా మన్యే మనసి సంపదః ॥**

దారిద్ర్య బంధువినాశాదులగు ఆపదలు సాధుసంగతీర్థ తపాదులకు కారణములై వివేకవైరాగ్యాదులకు సాధన భూతము లగుటచే వాటిని సంపదలుగా నేను భావించుచున్నాను

**వరమేకాన్తదాహేషు లురనం రౌరవాగ్నిషు।**
**నత్వాలూనం వివర్తాను ష్ఠితం సంసారవృత్తిషు॥**

అగ్నియందు బడి భస్మమగుట మేలు. రౌరవమున బడి దొర్లుట మేలు కాని సుఖదుఃఖ రూపమగు ఈ సంసార దశయందుండుట యుత్తమము కానే రదు

**ప్రబుద్ధోఽస్మి ప్రహృష్టోఽస్మి దృష్టశ్చోరోఽయమాత్మనః।**
**మనో నామ నిహన్మ్యేనం మనసాఽస్మి చిరం హతః॥**

నేనిపుడు ప్రబుద్ధుడనైతిని ప్రసన్నుడనైతిని పారమార్థిక ధనమగు ఆత్మ నపహరించునట్టి చోరుని గనుగొంటిని అత డీమనస్సే ఆతడు చోరుడే కాదు శత్రువు గూడ నగును ఏలన వీనిచే నేను చిరకాలము పీడింపబడితిని ఇక నేను వీనిని హతమార్చెద

**మనస్తుషారకణికా వివేకార్కాతపేన మే।**
**చిరప్రవృత్తయే నూన మవిలాల్లయమేష్యతి॥**

ఇక నా మనస్సను మంచుబిందువు వివేకసూర్యతాప ప్రభావమున అనాదిబ్రహ్మత త్త్వమున ప్రతిష్ఠింపబడి చిరకాలము ప్రశమన మొందగలదు

**వివిధైః సాధుభిః సిద్ధైరహం సాధు ప్రబోధితః ।**
**ఆత్మానమనుగచ్ఛామి పరమానన్దసాధనమ్ ॥**

సాధువులచేతను, మహాత్ములగు సిద్ధపురుషులచేతను, పలువిధముల నుపదేశము నొందిన నేనిక నిరతిశయానందమునకు సాధనభూతమగు పర బ్రహ్మమును శరణుజొచ్చుచున్నాను

ఈ వాక్యముల నన్నిటిని బాగుగా విచారణచేసిన, జనకమహారాజా ఎంత వైరాగ్యము గలవాడో గోచరము గాగలుగును. అష్టావక్రగీతయందు జనకుని యొక్క వైరాగ్య భావము, తపస్సు, విశేషముగా చూడదగును ఇంతటితో.ఈ వ్యాసము సమాప్తి చేయడమైనది. ★

ఓమ్ తత్ సత్



★ పూర్వముద్రిత గ్రంధములో చివర గల 'సదుపదేశములు' అన్న విషయము 'శ్రీమలయాళ సద్గురు గ్రంథావళి' పదునొకండవ సంపుటమైన ఉపదేశామృతములో ఉన్నదిగాన ఇటనుండి తొలగించమైనది (స ల)

# మున్నుడి

పరిశుద్ధజ్ఞాన స్వరూపులగు ఆత్మసోదరీ సోదరులారా!

శ్రీగురుదేవులు బ్రహ్మీభూత మహర్షి సద్గురు శ్రీమలయాళ స్వాముల వారు అమోఘమగు జ్ఞాన ధనమును ఆంధ్ర భూతలమున భక్తజనావళికి, ప్రబోధరూపమున, పత్రికాముఖమున, ఉత్తరగ్రంథ రాజములద్వారా విరి విగా పంచిపెట్టిన విషయము జిజ్ఞాసులోకమునకు సువిదితమే తలిదండ్రులు కష్టించి ఆర్జించిన ధనమును బిడ్డల కప్పగించి చనుట సహజము అట్లే సద్గు రువు తన జీవిత కాలమున ప్రబోధించిన ప్రబోధములనేగాక, తాను త్యాగము నర్పిన పిదపగూడా గురువుల బిడ్డలు మననము చేయదగిన అక్షయజ్ఞాన ధనమును నిక్షేపరూపముగ విడచిపోదురు

అట్లే శ్రీ గురుదేవుడును నిర్యాణ సమయమున ఐహిక సంపదతో బాటు విజ్ఞానసంపత్తినిగూడ అనంతముగ భక్తులకొసగి పోయెను శ్రీవారు తమ నిర్యాణానంతరముగూడా రెండు సంవత్సరముల పర్యంతము చాలినన్ని వ్యాసరాజములను ముందుగానే సంగ్రహపఱచి ఉంచిరి కంటికి కాన్పించిన వానితోనే తృప్తిజెందితిమి అంతటితో సరి అనుకొని వానినన్నిటిని ప్రకటించి తిమి కాని తరువాత మఱి యొకవ్యాసము మారుమూలన గుప్తముగానుండి బహిర్గతమైనది.

ఇయ్యది 1962సం॥ ఫిబ్రవరినెలలో వ్రాయబడిన వ్యాసము దీనిని రేపర్‌తో చుట్టించి దానిపై–దీనిని క్రమముగా యథార్థభారతిలో ప్రచురించి తరువాత గ్రంథరూపముగా ముద్రించవలయు–నని శ్రీవారు వ్రాయించి భద్రపరచియుంచిరి. శ్రీవారి ఆజ్ఞానసారము ఇది యథార్థభారతిలో ప్రకటిం పబడెను ఇయ్యదియే శ్రీవారి చిట్టచివరి వ్యాసమనవచ్చును ఇది కాలాను గుణమైన వ్యాసముగా కనిపించుచున్నది ప్రస్తుతయుగము ప్రచారబహు ళమైనది నేడు ఏదేని ఒక సంస్థగాని, వ్యక్తిగాని ప్రచారము లేనిదే వ్యాపకమగుట అసంభవమని తోచుచున్నది

వస్తుతః శ్రీ గురుదేవులు ప్రచారవిముఖులు, దైవవిశ్వాసపరులు నగుటచేతనే పత్రికాప్రచారము లేక గుప్తముగా నుండియే అపారమగు లోకసేవ చేసిరి ఇపుడిపుడు భక్తకోటి శ్రీవ్యాసాశ్రమ మహిమను, శ్రీగురుశక్తిని గ్రహింపగలుగుచున్నది కాని గురుదేవుని దివ్యమహిమ యింకను వ్యక్తము కావలయునన్న ప్రచారము గూడ అవసరమని కొందఱి భక్తుల సంకల్పము తత్సంకల్పమునకు దోహదముగా ప్రేరకముగా నీ వ్యాసము ఉపకరించవచ్చు అయితే శ్రీవారు గీతారామాయణాది గ్రంధ ముల ప్రచారమునకై తన్మాహాత్మ్యము పూర్వగ్రంధములలో నెటుల స్తుతింప బడెనో అద్దానిని మాత్రమే ఇందు సోదాహరణముగా ప్రతిపాదించిరి గురు భక్తులకు ప్రచారకులకు నియ్యది ఉద్బోధకము, ఉత్ప్రేరకము కాగలదని విశ్వాసము గురుభక్తులు, గురు పుత్రులు అందఱును గురుదేవుని దివ్యానం తమహిమను ప్రబోధప్రచారముల ద్వారా, పవిత్ర సదాచరణద్వారా, అను ష్ఠానముద్వారా దిగ్వ్యాప్త మొనర్చెదరు గాక!

శ్రీ గురుదేవుల విశుభ్రయశఃప్రభ భక్తజన జేగీయమానమై నలుదిశల వ్యాపించుగాక! శ్రీవారి నిర్యాణానంతరము శ్రీవారి నూతన కృతిని భక్తకోటికి సమర్పించు సదవకాశమును పరమేశ్వరుడు ప్రసాదించినందుకు పరమసంతోషము గురుభక్తు లెప్పటివలె నీ అంతిమ రచనను భక్తితో సమాదరింపగలరనియే విశ్వాసము

కరుణామూర్తి యగు సర్వేశ్వరుని కృపచే లోకములో శాంతియు, కరుణయు, సద్భక్తియు, విరక్తియు, విజ్ఞానబోధయున్ను వర్ధిల్లును గాక!

లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు – ఓం శాంతిః శాంతిః శాంతిః

శ్రీవ్యాసాశ్రమము,
సాధారణ కార్తిక పూర్ణిమ, ప్రకాశకులు
13–11–1970

# పీఠిక

ఫలశ్రుతిని గుఱించి ఒక చిన్న గాధను మీకు తెలిపెద ఒక గ్రామము ప్రాసాదప్రహరీలతో గొప్పదిగా నుండెను కాలాంతరమున అది క్షీణించి, శిథిలమైపోయెను, ఆ గ్రామవాసులు చాలామందిన్నీ దానికి సంబంధించిన ఇతర స్థలములలో ప్రత్యేక గృహములను నిర్మించుకొని నివసించుచుండిరి పాడుబడిన పాతగ్రామములో జనసంచారము లేక పోవుటవల్ల పాములు విశేషముగా చేరెను విషసర్పముల బాధచే ప్రక్కల నివసించుచుండు వారికిగూడా చాల బాధ కలిగి మరణించుచుండిరి ఇట్టి సమయములో ఒక గృహాధిపతి యువకుడు పాముకాటుచే మరణావస్థలో ఉండగా, అతని దేహసంబంధులు చాలా దుఃఖితులై ఏడ్చుచుండిరి

ఆ సమయమున విషమూలికలు తెలిసిన ఒక సాధువు గారు అచ్చట విడిదిచేసిరి జనులయొక్క దుఃఖమునకు కారణమడుగగా పాముకాటుచే ఈ గృహాధిపతి మరణావస్థలో ఉంటున్నాడు ఇతని తల్లి, భార్య, సోదరీ సోదరులు మొదలైనవారు అరందఱున్నూ ఇతని మరణభీతిచే మహా దుఃఖముతో, వ్యాకుల హృదయులై మరుగతి కానకపోవుటచే రోదనము చేయుచున్నారని జనులు తెలిపిరి వెంటనే కరుణార్ద్రహృదయము గల ఆ యతివరుడు భయపడనక్కర లేదు ఇతడు మరణించడు, బ్రతుకగలడు నాకు విషమూలికలు కొన్ని తెలుసును ఐతే అవి ఇచ్చట నుండునో లేదో తెలి యదు ముఖ్యముగా పాడుపడిపోయిన ఇటుకగోడలు ఎచ్చట నుండునో, అచ్చట ఆ మూలిక లుండవచ్చునని ప్రేక్షకులకు తెలుపగా అయ్యా! స్వామీ! అదుగో, ఈ వూరి ప్రక్కన పాడుబడిన ఇళ్లు, గోడలు గలవు, రండి, మేము కూడా వచ్చెదము అని చెప్పి ఆ సాధుపురుషుని పిలుచుకొని వెళ్ళి చూడగా అచట గరుడమూలిక తీగ కనుపడెను వెంటనే ఆ సాధువుగారు అదుగో! ఇదే గారుడ మూలిక. ఇది ఎటువంటి కాలకూట విషమును కూడా అగ్ని దూదిని భస్మము జేయునట్లు దహింప చేయగలుగును అని చెప్పి వెంటనే సమూ లముగా దానిని తీసికొని వచ్చి, ప్రాణాపాయస్థితియందుండు సర్పదష్టుని నేత్రములలోను, నాసికారంధ్రములలోను ఆ మూలిక పసరు పిండిపోయగా,

వెంటనే సర్పదష్టుడు విషరహితుడై లేచి కూర్చుండి మాట్లాడుట ప్రారంభించెను అంతవఱకు ఆ యూరిలో అట్టి విషమూలిక ఉండియు, ఎవరికిని తెలియకపోవుటవల్ల పాముకాటుచేత అనేకులు చనిపోయిరి ఈ విషమూ లిక తెలిసికొన్న తరువాత పాముకాటుచే ఎవ్వరున్ను ఆ గ్రామమున మరణించలేదు

కావున ప్రతిమంత్రము, శాస్త్రము, వ్రతము మొదలగువాని మాహాత్మ్యము ప్రతివారున్నూ తెలిసికొనవలెను అప్పుడే దానియొక్క ప్రభావము తెలిసికొని, అనుష్ఠించి, దుఃఖమునుండి తరించి, శాశ్వత సుఖమగు దైవమును, మోక్షము పొందగలరు ఓమ్

ఇట్లు చరాచర సుఖాభిలాషి,

శ్రీ మలయాళస్వామి

ఓం

# ప్రచార ప్రాశస్త్యము

**పరోపకృతికైవల్యే తులయిత్వా జగద్గురుః ।**
**గుర్వీం చోపకృతిం మత్వా అవతారాన్దశాగ్రహీత్ ॥**

శ్రీమన్నారాయణమూర్తి కైవల్యపదవియగు వైకుంఠమందు ఎల్లప్పు డుండుట గొప్పదా? లేక పరప్రాణుల సంరక్షణ చేయుట గొప్పదా? యని ఈ రెండింటిని త్రాసులోబెట్టి తూచినారట! నిజస్వరూపమగు ముక్తి యందుండుటకన్న పరప్రాణుల కుపకారముచేయుట గొప్పదని కనుగొనియే దశావతారము లెత్తి సజ్జనద్రోహులగు దుష్టులను శిక్షించి ధర్మమును సంరక్షించిరి

అనగా పై అంశములలో స్వస్వరూపమునందుండి ఆనందించుటచే కలిగెడు మహిమను త్రాసుయొక్క ఒక తట్టలోను, పరోపకార ఫలితమును మఱియొక తట్టలోను పెట్టి తూచినప్పుడు పరోపకారమే యెక్కువ తూగినట్లు కనుగొనెనని భావము కావుననే మహాత్ములందఱునూ ఆత్మవిముక్తి కలిగి నిరతిశయానంద స్థితి గలుగువఱకు సర్వసంగ పరిత్యాగులై, వైరాగ్యపరులై, యేకాంతమున తపోనిష్ఠులయ్యో, యోగాభ్యాస రతులయ్యో, శ్రవణ, మనన, నిదిధ్యాసాది బ్రహ్మవిచార తత్పరులయ్యో ఉండి జీవన్ముక్తి కలిగిన పిమ్మట పరోపకారముకొరకు శేషించిన జీవితమును వినియోగపరచిరి కావుననే గీత 3-వ అధ్యాయములో ఇట్లు చెప్పడమైనది

**యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః ।**
**ఆత్మన్యేవ చ సన్తుష్టస్తస్య కార్యం న విద్యతే ॥**

ఎవడైతే జీవన్ముక్తి పదవిని పొంది, తనలో తానే యానందించు

వాడును, తనలో తానే తృప్తిపొందినవాడును, తనయందే సంతోషపడుచుం డువాడును అగునో, అట్టి మహాత్మునికి చేయవలసిన పని యొకటియు లేదు

విశే॥ జీవన్ముక్తుడనగా సమస్తబంధములనుండి, సమస్తకర్మముల నుండి విడుదల పొందినవాడు అట్టి ఆత్మవేత్తకు ఇంకొకటి చేయవలసి యుండునని చెప్పినచో, అతడు సమస్తకర్మములనుండి, విధులనుండి విముక్తుడైనాడని చెప్పుటకు వీలు లేదు అట్టి యవస్థగల మహనీయాత్ములు కరుణాస్వరూపు లగుటవల్లను, ఈశ్వరసదృశులగుటవల్లను, వారికి ఊరకుండే స్వభావము లేదు ఈశ్వరునివలె పరప్రాణులకు మేలు కలుగ జేయుచునే యుందురు

**నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన ।**
**న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః ॥**

అట్టి యాత్మానందభరితుడగు బ్రహ్మవేత్తకు ఈలోకమునందు కర్మము చేయుటచేత పొందవలసిన దేమియును లేదు కర్మను చేయకపోవుటచేత కలిగెడు నష్ట మేమియును లేదు వీనికి త్రిమూర్తులు మొదలు ఏ భూతములనుండియు పొందవలసిన దేమియును లేదు అనగా ఎవరివల్లను ఏదియు పొందవలసినది లేదు పొందవలసినదుండినచో గదా పొందే ప్రయత్నము చేయవలయును? కర్మచేసిన బంధమున్ను లేదు, చేయక పోయిన నష్టమున్నూ లేదు ఐతే అట్టివారు కరుణాస్వరూపులగుటవల్ల ఇతర ప్రాణుల దుఃఖమును చూచి, సహింపజాలక వారి క్షేమముకొఱకు మిగిలిన జీవితమును వినియోగపఱచుదురు దానికి కారణము వారి కరుణ యనియే చెప్పవలయునుగాని, మఱి యేమియు చెప్పుటకు లేదు

**సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।**
**సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥**

సర్వభూతాంతరాత్ముడగు నన్ను ఎవడు జీవేశ్వరుల ఏకత్వ జ్ఞానము

కలవాడై సేవించుచున్నాడో, ధ్యానించుచున్నాడో, అట్టి జ్ఞానయోగి ఎల్లప్పుడున్నూ లోక హితార్థముగ పనులు చేయుచుండినను, లేక ఏమియు చేయకయుండినను నాయందుండువాడే యగుచున్నాడు

విశేషార్థము – అట్టి జీవేశ్వరుల ఏకత్వజ్ఞానము గలిగిన మహనీయాత్ముడు బ్రహ్మచర్యమందుగాని, గృహస్థమందుగాని, వానప్రస్థమందుగాని, సన్న్యాసమందుగాని ఉండినను ఆయా ఆశ్రమములకు తగిన కృత్యములు చేయుచుండినను, లేక సర్వసంగ విముక్తులై అవధూతవృత్తి యందుండినను, లేక గృహమందుండినను, వనమందుండినను, ఎల్లప్పుడు బ్రహ్మమందు, భగవంతునియందు ఉండువాడే యగను

**య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ ।**
**సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే ॥**

ఎవడు త్రిగుణాత్మికమైన ప్రకృతికి పరమగు ఆత్మను ఎఱుంగుచున్నాడో, వాడు ఏయే ఆశ్రమములలో నెట్లుండినను మఱల జన్మించడు. ఇదే ప్రకృతి పురుషుల లక్షణము తెలిసికొని వర్తించెడు మహాత్ముని స్థితి యని గ్రహించేది పై శ్లోక, విశేషార్థములలో చెప్పినది చూడుడు ఇదే మొట్టమొదట శ్రీనారాయణమూర్తి యుపదేశించిన ధర్మము గీతయొక్క సారమంతయు దీనియం దిమిడియున్నది

**యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే ।**
**సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే ॥**

సుగంధ దుర్గంధాది సమస్తవస్తువులలోను వ్యాపించియున్న యాకాశము సూక్ష్మమైనదగుటవలన, దేనితోను అంటబడునట్లు సకల దేహముల యందును గల పరమాత్మ దేహేంద్రియములతో నంటబడడు

ఈ సత్యమును తెలిసికొనుటయే సాంఖ్యయోగముయొక్క సత్యమని గ్రహించేది అట్టి ఆకాశస్థితిలో నుండుటయే ప్రకృతికి పరమగు ఆత్మస్థితిలో

ప్రకృతి యను విషసర్పముయొక్క రాగద్వేషములు, కర్మఫలాసక్తి అను విష దంతములను తీసివేసిన మహనీయాత్ముడు మాత్రమే అట్టి కార్యమును చేయ గలుగును అట్టి స్థితి కలుగనివాడు కర్మలో ప్రవేశించినచో ప్రకృతి విషయ విషముచే బద్ధుడై పోవును మఱియు గారుడమంత్రము తెలిసినవాడుగూడా విషసర్పమును పట్టి ఆడింపగలుగును కంఠములో, హస్తములలో, శిరస్సు లో చుట్టి పరమశివునివలె సభలో, వీధులలో ఆడగలుగను సూతసంహిత యందు అష్టాంగయోగవిధిలో మహేశ్వరుడు తెలిపినది చూడుడు

**యద్వన్మంత్రబలోపేతః క్రీడన్సర్పైర్న దశ్యతే ।**
**క్రీడన్న లిప్యతే జ్ఞానీ తద్వదిన్ద్రియపన్నగైః ॥**

ఏలాగున గారుడమంత్ర బలముతో గూడినవాడు నాగసర్పములను పట్టి ఆడించినను వాటిచేత కరువబడడో, ఆలాగున ఆత్మవేత్తయగు జ్ఞాని ఇంద్రి యములచే లోక పవిత్రకార్యములు చేయుచున్నప్పటికిని బద్ధుడు కాజాలడు

ఇచ్చట గ్రహించవలసిన సూక్ష్మవిషయములు చాలా గలవు మంత్ర బలము లేనివాడు కాలసర్పములనుబట్టి ఆడింపజూచిన వాటివల్ల హతుడగును మంత్రబలయుక్తుడాడించినట్లు తదితరులు పట్టి ఆడింప జూచిన ఎంత అపాయకరమో, అట్లే అఖండ బ్రహ్మవేత్తల స్థితియు నుండును ఈ రహస్యమును తెలియ శక్తి లేక బ్రహ్మవేత్తలవలె నటించుట అపాయ కరము గీతయందు ధర్మోపదేశము ప్రారంభించిన ద్వితీయాధ్యాయము మొదలు అంత్యమగు మోక్షసన్న్యాసము వఱకు గల అన్ని అధ్యాయ ములలోను, నిష్కామకర్మయోగము, భక్తియోగము, ధ్యానయోగము, జ్ఞానయోగము బోధించినది చూచిన శ్రీకృష్ణభగవానుని అనంతశక్తిని తెలిసికొనగలరు ఈ నిష్కామకర్మయోగమును మాత్రమే భగవాను డుపదేశించెనని తలంచ వలదు భక్తి, ధ్యాన, జ్ఞానయోగములగూడా భగవానుడు జీవకోట్ల సంస్కారము ననుసరించి వేదముయొక్క మార్గము

నుండుటయని ఆత్మవేత్తలగుటకు యత్నించువారు తెలిసికొనుట యగును ఈ విషయమై సాంఖ్యయోగమగు రెండవ అధ్యాయమున భగవంతు డుపదేశించినది చూడుడు

**నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః ।**
**న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః ॥**

**అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ ।**
**నిత్య స్సర్వగతస్థాణురచలోఽయం సనాతనః ॥**

ఈ యాత్మను శస్త్రములు ఛేదింపలేవు అగ్నిహోత్రుడు ఈ యాత్మను కాల్పజాలడు ఉదకము ఈ యాత్మను తడుపజాలదు వాయువు ఈ యాత్మను ఎండింపజాలదు ఈయాత్మ ఛేదింపదగినది కాదు ఈ యాత్మ దహింపదగినది కాదు తడుపదగినది కాదు ఎండింప చేయదగి నదియు కాదు ఈయాత్మ త్రికాలములయందు నేకరీతిగా నుండునది సర్వ వ్యాపకమైనది, నిశ్చలమైనది, చలింపనిది, అనాదియైనది

పై జెప్పిన శ్లోకభావమునే తరువాతను చెప్పుటకు కారణమేమన, అగ్రాహ్య విషయము బోధపడేలాగున చెప్పునప్పుడు రెండు సార్లు చెప్పుట శాస్త్రమర్యాదయై యున్నది ఈ విషయములో ద్విరుక్తి దోషము లేదు సనాతనమత ప్రచారకులు భగవంతు డుపదేశించిన ఈ సనాతనము యొక్క అర్థమును గ్రహించిన లోకమున కెంతో మేలు కలుగును అట్లు గాక దేహమును గుఱించిన వర్ణాశ్రమములు సనాతనధర్మములని చెప్పుట వలన దేశమింతటి హీనస్థితికి వచ్చినది ఈ విషయమై అష్టావక్రగీతయందు అష్టావక్రమునీంద్రుడు విదేహుడగు జనకమహారాజున కుపదేశించినది చూడుడు

**నివృత్తిరపి మూఢస్య ప్రవృత్తిరుపజాయతే ।**
**ప్రవృత్తిరపి ధీరస్య నివృత్తిఫలభాగినీ ॥**

ఆత్మజ్ఞానములేని మూఢునియొక్క నివృత్తి ప్రవృత్తి రూపముగా నగుచున్నది ఆత్మబోధ గల ధీరునియొక్క ప్రవృత్తి నివృత్తి రూపమగు ఫలమును గలుగజేయుచున్నది

ఇది చాల అగాధార్థముతో కూడినది

**సమాధిమథ కర్మాణి మా కరోతు కరోతు వా ।**
**హృదయే నాస్తి సర్వాస్థా ముక్త ఏవోత్తమాశయః ॥**

ఆత్మజ్ఞానైకబోధగల మహాత్ముడు నిరంతరము సమాధినిష్ఠ యందుండినను, లేక లోకహితార్థముగ కర్మలు చేసినను ఎల్లప్పుడున్ను ఆత్మైక్య స్థితిలోనే యుండేవాడగును ఎవరి హృదయమునందుగల సర్వ సంకల్పములు, వాసనలు, సంస్కారములు నశించిపోయినవో వాడెల్లప్పుడును ముక్తుడే వాడు ఉత్తముడే, సంశయము లేదు అనగా హృదయములో అనేక సంకల్పములు పెట్టుకొని, సోమరితనము గలిగి, దేహాభిమానముతో గూడియుండువాడు కర్మము చేయకపోయినను బద్ధుడే యగుచున్నాడు హృదయమునందేలాటి సంకల్పములును లేనివాడై ఫలాపేక్షా రహితుడై, లోకహితార్థముగా కర్మలు చేసినను కర్మలు చేయనివాడే, ముక్తుడే యగుచున్నాడు ఈ విషయమై గీతలో భగవంతుడుపదేశించినది చూడుడు

**కర్మణ్యకర్మ యః పశ్యేదకర్మణి చ కర్మ యః ।**
**స బుద్ధిమాన్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥**

ఎవడు కర్మమునందు అకర్మను, అకర్మమునందు కర్మమును చూచు చున్నాడో, వాడే మానవులందటిలోను బుద్ధిమంతుడు అనగా వాడే విజ్ఞాన వంతుడు. ఆత్మయొక్క నిస్సంగస్థితి తెలిసినవాడు వాడు సకల కర్మముల నాచరించినవాడగుచున్నాడు అనగా ముముక్షువు చేయవలసిన అన్ని అనుష్ఠానములను చేసినవాడే అట్టి ముక్తావస్థను పొందగలుగునని భావము

**గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః ।**
**యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥**

దేనియందు సంగము లేనివాడును, అనగా రాగద్వేషాది బంధముల నుండి విడుదల బొందినవాడును, అనగా ఆత్మజ్ఞానమునందే నిలుకడ గలవాడునునై భగవత్ప్రీత్యర్థముగా గాని పరప్రాణి హితార్థముగా గాని కర్మము నాచరించువానియొక్క కర్మము యావత్తున్ను నశించుచున్నది అది మండుచున్న హోమగుండములో హోమించు నవధాన్యములవలె భస్మమై పోవుచున్నది అట్లుగాక కర్తృత్వబుద్ధియు, ఫలాసక్తియు గలిగి రాగ ద్వేషములతో కూడినవాని కర్మలు అనుకూల వర్షము ననుసరించి భూమిలో పెట్టిన విత్తనమువలె అంకురించి ఫలమును గలుగజేయు చుండును ఈ సత్యమును సామాన్యులు తెలిసికొనజాలరు

**త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః ।**
**కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః ॥**

కర్మఫలమునందలి యాసక్తిని విడిచిపెట్టి, యెల్లప్పుడును తృప్తి బొందిన మనస్సు గలవాడును, దేనిని ఆశ్రయింపనివాడు నగుచు కర్మమునందు ప్రవర్తించినవాడైనను కొంచమైనను ఏకర్మమునైనను చేయనివాడే యగును

ఈలాటి శ్లోకములు గీతలో అనేకములు గలవు మచ్చునకు మాత్రము నిరూపించడమైనది ఇది సామాన్యమైన యవస్థ యని తలంచరాదు త్రాచుపామును పట్టి ఆడించెడు పాములవానివంటివానికే సాధ్యపడును అట్లు కానివాడైనచో పాముచే కరవబడి విషమెక్కి మరణించునట్లుండును పాముల వాడు సర్పముయొక్క విషపు కోరలను తీసివేసియుండును ఆలాగున ప్రకృతి యను విషసర్పముయొక్క రాగద్వేషములు, కర్మఫలాసక్తి అను విష దంతములను తీసివేసిన మహనీయాత్ముడు మాత్రమే అట్టి కార్యమును చేయ

గలుగును అట్టి స్థితి కలుగనివాడు కర్మలో ప్రవేశించినచో ప్రకృతి విషయ విషముచే బద్ధుడై పోవును మఱియు గారుడమంత్రము తెలిసినవాడుగూడా విషసర్పమును పట్టి ఆడింపగలుగును కంఠములో, హస్తములలో, శిరస్సులో చుట్టి పరమశివునివలె సభలో, వీధులలో ఆడగలుగను సూతసంహిత యందు అష్టాంగయోగవిధిలో మహేశ్వరుడు తెలిపినది చూడుడు

**యద్వన్మంత్రబలోపేతః క్రీడన్సర్పైర్న దశ్యతే ।**
**క్రీడన్న లిప్యతే జ్ఞానీ తద్వదింద్రియపన్నగైః ॥**

ఏలాగున గారుడమంత్ర బలముతో గూడినవాడు నాగసర్పములను పట్టి ఆడించినను వాటిచేత కరువబడడో, ఆలాగున ఆత్మవేత్తయగు జ్ఞాని ఇంద్రి యములచే లోక పవిత్రకార్యములు చేయుచున్నప్పటికిని బద్ధుడు కాజాలడు

ఇచ్చట గ్రహించవలసిన సూక్ష్మవిషయములు చాలా గలవు మంత్ర బలము లేనివాడు కాలసర్పములనుబట్టి ఆడింపజూచిన వాటివల్ల హతుడగును మంత్రబలయుక్తుడాడించినట్లు తదితరులు పట్టి ఆడింప జూచిన ఎంత అపాయకరమో, అట్లే అఖండ బ్రహ్మవేత్తల స్థితియు నుండును ఈ రహస్యమును తెలియ శక్తి లేక బ్రహ్మవేత్తలవలె నటించుట అపాయ కరము గీతయందు ధర్మోపదేశము ప్రారంభించిన ద్వితీయాధ్యాయము మొదలు అంత్యమగు మోక్షసన్న్యాసము వఱకు గల అన్ని అధ్యాయ ములలోను, నిష్కామకర్మయోగము, భక్తియోగము, ధ్యానయోగము, జ్ఞానయోగము బోధించినది చూచిన శ్రీకృష్ణభగవానుని అనంతశక్తిని తెలిసికొనగలరు ఈ నిష్కామకర్మయోగమును మాత్రమే భగవాను డుపదేశించెనని తలంచ వలదు భక్తి, ధ్యాన, జ్ఞానయోగములగూడా భగవానుడు జీవకోట్ల సంస్కారము ననుసరించి వేదముయొక్క మార్గము ననుసరించి యుపదేశించెను ఇట్టి మహోన్నత గ్రంథము సృష్టిలో మఱియొకటి లేదనియే చెప్పవచ్చును ఇది అనంతముఖములతో కూడినది

అనేక నదీముఖములతో ప్రవహించెడు జలమంతయు సముద్రమునందే లాగున చేరుచుండునో, ఆలాగున పైనుదాహరించిన కర్మ, భక్తి , ధ్యాన, జ్ఞానయోగములలో దేని నవలంబించినను, అనంతమగు బ్రహ్మములో ఆత్మలో చేరవచ్చును ఈ సత్యమును తెలిసికొన శక్తిలేనివారు తానవలం బించిన కర్మయోగమో, భక్తియోగమో, ధ్యానయోగమో, జ్ఞానయోగమో ఏదో ఒకటియే గీతాశయ మని పలుకుటకు సాహసించెదరు ఇది ఎటువంటి దనగా ఒక్కడు సూర్యుని చూచి సూర్యుడు నాప్రక్కనే చూచుచున్నాడు మఱి యెవరిని చూచుచుట లేదు, అని చెప్పిన వాక్యములో ఎంత అర్థము గలదో, వారిమాటలున్నూ అటు వంటివే ఐతే వారు చెప్పెడిదానిలో అసత్యము లేదు వారి ప్రక్క చూచినట్లు, చుట్టు అందఱి ప్రక్కను చూచుచున్నట్లు గ్రహింపక పోవుటలోనే పొరపాటు గలుగుచున్నది

గీతా పచారముయొక్క ప్రభావమునుగుఱించి స్వయముగా శ్రీకృష్ణ భగవాను డుపదేశించినది చూడుడు.

**య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।**
**భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః ॥**

ఎవడీపరమరహస్యమగు గీతాశాస్త్రమును నాభక్తులకు చెప్పు చున్నాడో, వాడు సంశయరహితుడై నాయందు సర్వోత్కృష్టమైన భక్తిని చేసి (మత్సాయుజ్యమునే) నన్నే పొందగలడు సంశయము లేదు

దీనియందు మద్భక్తేషు అని ప్రయోగించుటవల్ల భగవంతుని యందు భక్తిగలవా రెవరు గలరో వారికని అర్థము ఇందువల్ల ఒకజాతిని గుఱించిగాని, వర్ణమునుగూర్చిగాని, స్త్రీని గురించిగాని, పురుషునిగురించిగాని చెప్పలేదని గ్రహించుకొనవలయును, కావుననే గాంధీగారు మొదలగు మహనీయు లందఱున్నూ అగ్రజాతినుండి అంత్యజాతివఱకుగల సర్వ స్త్రీ పురుషులకు గీత నుపదేశించడమైనది

**న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।**
**భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి ॥**

మనుష్యులలో నాభక్తులకు గీతను చెప్పువానికంటె అధిక ప్రియమును చేయువాడు మఱియొకడు లేనే లేడు భూమియందు వానికంటె ఇతరుడు మిక్కిలి ఇష్టుడు కలుగనుగూడా కలుగడు

ఇట్టి వాక్యమును ఆధారముచేసికొనిగదా శ్రీశంకర, శ్రీరామానుజ, శ్రీకృష్ణచైతన్య, శ్రీమధ్వ, శ్రీగాంధీగారు – మొదలగు అవతారపురుషులు పాదచారులై హిమాలయ సేతుపర్యంతము సంచరించి గీతాప్రచారము చేయుటకు కారణమైనది మఱియు చాతుర్మాస్య మాహాత్మ్యమున తెలిపినది చూడుడు

**భారతే భగవద్గీతా తథా నామసహస్రకమ్ ।**
**గాయత్ర్యాస్సమ్మితం ప్రోక్తం పుణ్యే పాపక్షయే తథా ॥**

**పాఠేన యత్ఫలం ప్రోక్తం అర్థజ్ఞానాచ్చతుర్గుణమ్ ।**
**మద్భక్తేభ్యశ్శ్రావణాచ్చ పుణ్యం దశగుణం స్మృతమ్ ॥**
**వ్యాఖ్యానాచ్చాపి శిష్యేభ్యః పుణ్యం శతగుణం స్మృతమ్ ॥**

మహాభారతమునందు భగవద్గీతయు, విష్ణు సహస్రనామమున్నూ కలవు ఈ గీతయో గాయత్రీ మంత్రమునకు సమానమైనది. గాయత్రి పుణ్య ప్రాప్తికిన్నీ పాపక్షయమునకున్నూ ఎంత మహిమ గలిగియున్నదో గీతయున్నూ అటువంటిదే పారాయణముచే నెంత పుణ్యము కలదో, అర్థముతో గూడ పఠించినచో నంతకంటె నాల్గు రెట్లు అధికఫలము గలుగును భగవద్భక్తులకు శ్రవణము చేయించిన పదిరెట్లధికపుణ్యము గలుగును ఈ గీతకు వ్యాఖ్యానము చేసి భక్తులచే పఠింపజేసినచో నూరురెట్లు అధికఫలము (పుణ్యము) గలుగును ఇట్టి ప్రమాణ ముండుటయే గదా శ్రీశంకర, శ్రీరామా నుజ, శ్రీమధ్వాచార్య, శ్రీకృష్ణచైతన్యాదులు, తిలక్

మహాశయుడు, గాంధీగారలు గీతకు భాష్యము, వాఖ్యానము చేసి, ప్రజలకు బోధించుటకు కారణమైనది దీనియందుగూడా మద్భక్తేభ్యః అని ప్రయోగించడము వలన భగవంతునియందు భక్తి గలిగి గీత పఠించుటకు ఇష్టము గలవారెవరు గలరో వారం దరిన్ని అని అర్థము ఇక దీనికన్న పరమప్రమాణమేమి కావలయును? పద్మపురాణమునందు గీతామాహాత్మ్య మును గుఱించి నైమిశారణ్యవాసులగు శౌనకాదిమహర్షులకు సూతమహర్షి తెలిపినది చూడుడు ఇది మహాభగవద్గీతయందు గలదు

ఋషిరువాచ –

**గీతాయాశ్చైవ మాహాత్మ్యం యథావత్సూత । మే వద।**
**పురాణమునినా ప్రోక్తం వ్యాసేన శ్రుతిచోదితమ్ ॥**

అనేక విధములైన కథలను వినుచు శౌనక ఋషి సూతునిట్లు ప్రశ్నించెను ఓ సూతమహర్షీ! వేదోక్తమగు శ్రీవ్యాసమహర్షిచే చెప్పబడిన ప్రకారము శ్రీమద్భగవద్గీతా మాహాత్మ్యమును నాకు చెప్పుము

సూత ఉవాచ–

**పృష్టం వై భవతా యత్తన్మహద్గోప్యం పురాతనమ్।**
**న కేన శక్యతే వక్తుం గీతా మాహాత్మ్యముత్తమమ్॥**

శౌనకమహర్షియొక్క ప్రశ్నను విని సూతుడిట్లు వచించెను ఓ శౌనక మహర్షీ! నీవు ఏ గీతామాహాత్మ్యమునుగుఱించి, అడిగితివో అయ్యది అతిగో ప్యమై ప్రాచీనమైనదిగా నుంటున్నది అందువలన గీత యొక్క అత్యుత్త మమైన మాహాత్మ్యమును ఎవ్వడును చెప్పుటకు సమర్థుడు కాడు

**కృష్ణో జానాతి వై సమ్యక్ క్వచిత్కౌన్తేయ ఏవ చ ।**

**వ్యాసో వా వ్యాసపుత్రో వా యాజ్ఞవల్క్యోఽథ మైథిలః॥**

ఈ గీతామాహాత్మ్యమును బాగుగా శ్రీకృష్ణభగవానుడే యెఱుంగుచు

న్నాడు మఱియు అర్జునుడు కొంచెముగా నెఱుగుచున్నాడు అటులనే శ్రీవ్యాసమహర్షి, శ్రీశుకమహర్షి, శ్రీయాజ్ఞవల్క్యమహర్షి, శ్రీజనక చక్రవర్తులు నెఱుంగుచున్నారు వీరందఱున్ను కొంచెము మాత్రమే యెఱుంగుచున్నారు

**అన్యే శ్రవణతః శ్రుత్వా లోకే సంకీర్తయన్తి చ।**
**తస్మాత్కించిద్వదామ్యద్య వ్యాసస్యాస్యాన్మయా శ్రుతమ్ ॥**

మఱియు ఇతరజనులు ఈ గీతామాహాత్మ్యమును కర్ణేంద్రియములచే విని లోకమునందు వర్ణించుచున్నారు కాని నిజమెఱుంగరు అందువలన నేను ఎవ్విధముగా శ్రీ వ్యాసమహర్షియొక్క ముఖారవిందమునుండి వింటినో, అటుల కొంచెము వచించెదను

**సంసారసాగరం ఘోరం తర్తుమిచ్ఛతి యో జనః ।**
**గీతానావం సమారుహ్య పారం యాతు సుఖేన సః ॥**

ఎవడైతే ఘోరమగు సంసారసాగరమును దాటుటకు కోరుచున్నాడో, వాడు గీత యనెడు నావనెక్కి సుఖముగా ఒడ్డును చేరుగాక!

**యే శృణ్వన్తి పఠన్త్యేవ గీతాశాస్త్రమహర్నిశమ్ ।**
**న తే వై మానుషా జ్ఞేయా దేవా ఏవ న సంశయః ॥**

ఎవరైతే దివారాత్రములు గీతను చదువుచున్నారో, మఱియు వినుచున్నారో, వారలు కేవలము మనుష్యులు కారు మరెవరనగా వారు దేవతలే, ఇందులో సంశయ మేమియును లేదు

దైవాంశములో పుట్టినవారికే దైవకార్యములో ప్రీతి గలుగును

**దేవకీనన్దనః కృష్ణో గీతాపాఠేన తుష్యతి।**
**యథా న వేదైర్దానైశ్చ యజ్ఞతీర్థవ్రతాదిభిః॥**

ఎటుల దేవకీనందనుడైన శ్రీకృష్ణభగవానుడు గీతాపఠనముచే

సంతుష్టు డగుచున్నాడో, అటుల వేదాధ్యయన దాన యజ్ఞ తీర్థ వ్రతాదులచే సంతుష్టు డగుట లేదు

**పితౄనుద్దిశ్య యః శ్రాద్ధే గీతాపాఠం కరోతి వై।**
**సన్తుష్టాః పితర స్తస్య నిరయాద్యాన్తి సద్గతిమ్ ॥**

ఎవడు శ్రాద్ధమునందు పితృదేవతలగూర్చి గీతాపఠనము చేయునో, అతనియొక్క పితృదేవతలు సంతుష్టు లగుచున్నారు మఱియు నరకవిముక్తులై పుణ్యలోకమును పొందుచున్నారు

**గీతాపాఠేన సన్తుష్టాః పితరః శ్రాద్ధతర్పితాః ।**
**పితృలోకం ప్రయాన్త్యేవ పుత్రాశీర్వాదతత్పరాః ॥**

ఇవ్విధముగా పితృదేవతలు శ్రాద్ధముచే మఱియు గీతాపఠనముచే ప్రసన్నులై పుత్రునికి ఆశీర్వాదము నిచ్చుచు, పితృ(పుణ్య) లోకమునకు పోవుచున్నారు

**శతపుస్తకదానం చ గీతాయాః ప్రకరోతి యః ।**
**పితృలోకం ప్రయాత్యేవ పుత్రాశీర్వాదతత్పరః ॥**

ఎవడు నూరు భగవద్గీతా పుస్తకములను దానము చేయుచున్నాడో, వాడు తమ పుత్రులను ఆశీర్వదించువారడై అనగా పుత్రులకు సర్వశుభములు కలుగునట్లు ఆశీర్వదించుచున్నవాడై పుణ్యలోకమును గూర్చి పోవుచున్నాడు.

**గీతాదాన ప్రభావేన సప్తకల్పావధీః సమాః ।**
**విష్ణులోకమవాప్నోతి విష్ణునా సహ మోదతే ॥**

గీతాదానముయొక్క ప్రభావముచే విష్ణులోకమునందు ఏడు కల్పముల సంవత్సరముల పర్యంతము విష్ణువుతోగూడా ఆనందమును పొందు చున్నాడు

**మోక్షస్థానం పరం పార్థ! సగుణం వాఽథ నిర్గుణమ్।**

**సోపానాష్టాదశై రేవం పరం బ్రహ్మాధిగచ్ఛతి॥**

ఓ అర్జునా! సగుణమైన లేక నిర్గుణమైన మోక్షస్థానమునకు పదునెనిమిది అధ్యాయములను సోపానములుగా చేసికొని, మనుష్యుడు పరబ్రహ్మమును పొందుచున్నాడు ఈ శ్లోకమునందు సగుణమున్ను, నిర్గుణమున్ను ఉపదే శించడమైనది అట్టి బ్రహ్మప్రాప్తికరమగు సౌధమునకు భగవద్గీత పదునెమిది అధ్యాయములు, పదునెనిమిది మెట్లుగా వర్ణిం చడమైనది మఱియు గీతా ప్రభావమును గుఱించి, ఇతరగీతా మాహాత్మ్య ములో గల కొన్ని ధ్యాన శ్లోకములను క్రింద నిరూపించెద, పఠించుడు

**సర్వశాస్త్రమయీ గీతా సర్వవేదమయో హరిః।**
**సర్వతీర్థమయీ గంగా సర్వతేజోమయో రవిః॥**

ఏలాగున గంగ సర్వతీర్థమయమై యున్నదో, సూర్యుడు సర్వ తేజోమయుడై యుంటున్నాడో, హరి సర్వవేదమయుడై యున్నాడో, ఆలాగున గీతయు సర్వశాస్త్రమయమై యున్నది

**మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినే దినే।**
**సకృద్గీతామ్భసి స్నానం సంసారమలనాశనమ్॥**

ప్రతిదినము జలస్నాన మాచరించుటచే శరీరమాలిన్యము రహిత మగునట్లు ఒక్క పర్యాయము గీతాజలమున స్నాన మొనర్చుటచేతనే సంసార మలము నశించుచున్నది

**గీతాశాస్త్రమిదం పుణ్యం యః పఠేత్ప్రయతః పుమాన్।**
**విష్ణోః పదమవాప్నోతి భయశోకాదివర్జితః॥**

పవిత్రమగు నీ గీతా శాస్త్రము నెవడు నియతచిత్తుడై పఠించునో, అతడు భయశోకాది రహితుడై మోక్షమును బొందగలడు

**గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రవిస్తరైః।**

**యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిస్సృతా ॥**

సాక్షాత్ కృష్ణభగవానుని ముఖారవిందమునుండి వెలువడిన గీతను లెస్సగా జదివిన చాలును తదితర శాస్త్రవిస్తారముతో పనిలేదు

**భారతామృతసర్వస్వం విష్ణోర్వక్త్రాద్వినిస్సృతమ్ ।**
**గీతాగంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే ॥**

విష్ణుముఖమునుండి బయలువెడలినదియు, భారతామృత సర్వస్వ మున్ను ఆగు గీత యను గంగోదకమును పానము జేసినవారికి పునర్జన్మము గలుగక మోక్షము గలుగును

**ఏకం శాస్త్రం దేవకీపుత్రగీత మేకో దేవో దేవకీ పుత్ర ఏవ ।**
**ఏకో మన్త్రస్తస్య నామాని యాని కర్మాప్యేకం తస్య దేవస్య సేవా ॥**

దేవకీనందనుడగు కృష్ణభగవానుడు చెప్పిన గీతాశాస్త్రమే శాస్త్రము దేవకీ పుత్రుడగు కృష్ణపరమాత్మ యొక్కడే దేవుడు ఆదేవుని నామములే మంత్రములు ఆదేవుని సేవారూపమగు కర్మ యొక్కటే కర్మ యగును

## సూతసంహిత

సూతసంహితయందు సమాధియోగమును ఉపదేశించినది విని, మునులందఱును తన్మయస్థితిని పొంది, మౌనులై బ్రహ్మానంద భరితులై యుండుట చూచి మహేశ్వరుడు ఉపదేశించినది చూడుడు దీనిని గ్రహించినచో బ్రహ్మవిద్యయొక్క ప్రచారప్రాశస్త్యము నెఱుంగగలరు

**యస్య దేవే పరాభక్తిర్యథా దేవే తథా గురౌ ।**
**తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే న సంశయః ॥**

పరమభక్తునికి సర్వేశ్వరునియందు ఎటువంటి భక్తియుండునో, అటువంటి భక్తి గురుదేవునియందును గలిగియుండు పరమభక్తుడైన వానికి మాత్రమే ఇట్టి వేదాంతజ్ఞానము ప్రకాశించును దీనియందు సంశయము

నుంచకుడు

**ఇత్యేవముక్త్వా భగవాం స్తూష్ణీమాస్తే మహేశ్వరః ।**
**వక్తవ్యాభావమాలోక్య మునయః కరుణానిధిః ॥**

**బృహస్పతిశ్చ మునయో వేదాన్త శ్రవణాత్పునః ।**
**ఆనన్దాక్లిన్న సర్వాంగ ఆత్మానన్దవశో ఽభవత్ ॥**

కరుణానిధియగు పరమేశ్వరుండు ఈలాగున అష్టాంగయోగమును బోధించినవాడై వక్తవ్యాభావమును ఆలోకనము చేసి మౌనముగా నుండి పోయెను మునులారా! బృహస్పతి వేదాన్త శ్రవణమువలన పులకాంకితుడై ఆత్మానందమునందు పరవశుడై యుండెను

**భవన్తోఽపి మహాత్మానో మత్తః ప్రాప్తాత్మవేదనాః ।**
**అభవన్కృతకృత్యాశ్చ మా శంకిధ్వం కదాచన ॥**

మహాత్ములగు మహర్షులారా! నావలన మీరందఱున్ను జ్ఞానమును, యోగమును కలిగిన ఈ వేదాంతసారమును విని, ఆత్మవేత్తలైతిరి మీరందఱు కృతకృత్యత్వము నొందితిరి దీనియందు సంశయము లేదు బ్రహ్మప్రాప్తి గలిగిన తర్వాత కృతకృత్యుడైన యోగి అట్టి ఆత్మానుభవ జ్ఞానమును భక్తులకు బోధించవలసినదని ఈ క్రింది శ్లోకముచేత చెప్పబడుచున్నది

**స్థాపయధ్వమిమం మార్గం ప్రయత్నేనాపి హే ద్విజాః ।**
**స్థాపితే వైదికే మార్గే సకలం సుస్థితం భవేత్ ॥**

బ్రహ్మవేత్తలారా! మీరు ప్రయత్నపూర్వకముగ నిట్టి మార్గమును ప్రపంచములో స్థాపించవలెను వైదికమగు ఇట్టి పుణ్యమార్గమును స్థాపించి తిరేని, ప్రపంచమంతయు సౌఖ్యము నందగలుగును

**యో హి స్థాపయితుం శక్తో న కుర్యాన్మోహితో నరః ।**
**తస్య హన్తా స పాపీ స్యాదితి వేదాన్తనిశ్చయః ॥**

ఇట్టి ఆత్మజ్ఞానము బొందినవాడు ప్రపంచములో ఆశ్రమములు నెలకొల్పి దైవమార్గమును జనులకు బోధింపగల శక్తి గలిగియుండియు, ఏదైన కారణాంతరముచే మోహితుడై అట్లు చేయక పోయినచో, అట్టిదైవ మార్గమును నశింపజేసిన పాపి యగుచున్నాడు ఇది వేదాన్తశాస్త్రముయొక్క నిశ్చయమని మరువకుడు

ఈశ్లోకము బ్రహ్మనిష్ఠాపద్ధతిని ప్రపంచములో బోధించెడు వారిని గుఱించి పామరజనులకు గల భిన్నాభిప్రాయమును తొలగించుచున్నది అనగా విశాలహృదయములేని సామాన్య జనులకు బ్రహ్మవేత్తలయందు గల దుష్టాభిప్రాయమును తొలగించుచున్నది

**యస్థాపయితుముద్యుక్తః శ్రద్ధయైవాక్షమోఽపి సన్ ।**
**సర్వపాపవినిర్ముక్తస్సాక్షాద్జ్ఞానమవాప్నుయాత్ ॥**

ఎవడు అట్లు స్థాపించుటకు శ్రద్ధయు, క్షమయు గలిగియుండునో అట్టివాడు సర్వపాపములనుండి విముక్తుడై సాక్షాద్జ్ఞానమును పొందుచున్నాడు

**యశ్చ విద్యాభిమానేన వేదమార్గప్రవర్తకమ్ ।**
**ఛలజాత్యాదిభిర్జీయాత్స మహాపాతకీ భవేత్ ॥**

ఏమానవుడు విద్యాగర్వముచేతగాని, కుతర్కముచేతగాని, మఱి యేదైన మోసకృత్యముచేగాని వైదికమార్గ ప్రవర్తకుని భంగపరచునో అట్టివాడు మహాపాతకు డగును

**య ఇమం జ్ఞానయోగాఖ్యం ఖండం శ్రద్ధాపురస్సరమ్ ।**
**పఠతే సుముహూర్తేషు న స భూయోఽభిజాయతే ॥**

**జ్ఞానార్థీ జ్ఞానమాప్నోతి సుఖార్థీ సుఖమాప్నుయాత్ ।**
**వేదకామీ లభేద్వేదం విజయార్థీ జయం లభేత్ ॥**

**రాజ్యకామో లభేద్రాజ్యం క్షమాకామః క్షమాం లభేత్ ।**

**తస్మాత్సర్వేషు కాలేషు పఠితవ్యో మనీషిభిః ॥**

ఏ మానవుడు భక్తిశ్రద్ధలతో గూడి జ్ఞానయోగాఖ్యమగు దీనిని మంచి సమయములందు పఠించునో, వాడు మఱల సంసారమున జన్మము నెత్తి దుఃఖము నొందడు దీనియొక్క పఠనమువలన జ్ఞానాభిలాషగలవానికి జ్ఞానమును, సుఖమును గోరువానికి సుఖమును లభించును వేదములను తెలియ గోరువానికి వేదమును, విజయమును గోరువానికి విజయమున్ను సిద్ధించును రాజ్యమును గోరువానికి రాజ్యమును, శమదమాదులు గోరువానికి శమదమాదులును సిద్ధించును కావున మేధాసంపన్నులందఱిచేతను సర్వకాలములలోను నిది పఠింపదగినది ఇక నిట్టి బ్రహ్మవిద్య నెవరికి చెప్పవలెనో, ఆ విషయమును గుఱించి క్రింద చెప్పబడుచున్నది

**గుణాన్వితాయ శిష్యాయ ప్రదేయోఽయం ప్రయత్నతః ।**

శమదమాది గుణాన్వితుడైన శిష్యునికి ప్రయత్నపూర్వకముగా ప్రేమతో ఈబ్రహ్మవిద్య నుపదేశించవలయును ఇట్లు చెప్పుటచే సుగుణము గలవారు ఏ జాతివారైనను, బ్రహ్మచర్యాది ఏ యాశ్రమములోనుండు వారైనను, ఏదేశవాసులైనను, స్త్రీలైనను, మరి యెవ్వరైనను వారికి ఉపదేశించవచ్చునని భావము ధర్మశాస్త్రములలో వివాహమును గుఱించి చెప్పునప్పుడు తండ్రి యనుష్ఠించి వచ్చిన వైదిక ధర్మమార్గములను, చెడనీయక నిలబెట్టుటకు పుత్రులున్ను, తల్లి యనుష్ఠించి వచ్చిన పుణ్యకర్మలను సంరక్షించుటకు పుత్రికయు నుండవలసినందుచే వివాహధర్మము ఏర్పడినదని తెలుపడమైనది కుమార్తె పతియొక్క ఇంటికి వెళ్ళుట అత్తగారు నడిపిన పుణ్యకర్మలను నిలబెట్టుటకొఱకని చెప్పడమైనది ఆలాగున గురుదేవుడు శిష్యులను, ఆశ్రమములను ఏల చేయువలెనని తెలుపునప్పుడు గురుదేవుడు అనుష్ఠించి ఇచ్చిన బ్రహ్మమార్గమును, బ్రహ్మవిద్యను నిలబెట్టుటకని వచించడమైనది. అట్లు చేయనిచో, ఒకడు వంతెనచే అనగా వారధిచే నదిని దాటిపోయిన తర్వాత ఆవంతెనను

విరుగగొట్టినవానివలె పాపి యగునని నిరూపించడ మైనది ఆలాగున సంసారసాగరమును దాటుటకు జ్ఞానము సేతువు వంటిది దానిని సుస్థిరము చేయుటయే శిష్యులయొక్క ధర్మము అది సంరక్షిం చుటయే శిష్యధర్మమగు నని మరువకూడదు కనుకనే సూతసంహితలో ''తస్య హన్తా స పాపీస్యాదితి వేదాన్తనిశ్చయః'' అని చెప్పబడెను

ఇక కఠోపనిషత్తున బ్రహ్మ విద్యాప్రచారమును గుఱించి తెలిపినది చూడుడు

**య ఇమం పరమం గుహ్యం శ్రావయేద్బ్రహ్మసంసది ।**
**ప్రయతశ్శ్రాద్ధకాలే వా తదానన్త్యాయ కల్పతే తదానన్త్యాయ కల్పత ఇతి॥**

నచికేతసుడా! అతి రహస్యమై శ్రేష్ఠమగు నీయుపనిషత్తు బ్రహ్మ సభయందుగాని, శ్రాద్ధకాలమందుగాని, భోక్తలకు ఎవడు వినిపించునో, ఆ శ్రాద్ధము అనంత ఫలముకొఱకు సమర్థ మగుచున్నదని శ్రుతి స్మృత్యర్థమై పలికెనని యముడు చెప్పెను ఇందువల్ల బ్రహ్మవిద్యను ప్రచారము చేయుటయే వేదముయొక్క ఆశయమని విజ్ఞులు గ్రహింతురుగాక! ఇచట శ్రాద్ధకాలము యజ్ఞకాలము తెలుపుటకు కారణమేమన, ఆ సమయమున అనేకమంది జనులు చేరుదురు. అందఱున్నూ వినుట కొఱకని భావము దేవాలయములలో ఉత్సవములు జరుపుటకున్నూ, సప్తాహములు చేయుట కున్నూ, యజ్ఞములు చేయుటకున్నూ, చాతుర్మాస్యవ్రతము సలుపుట కున్నూ ఏర్పాటు చేయబడినది అచ్చోట్లలో అనేక జనులు చేరుదురు వారందరున్నూ వినగలరను భావముతో నిట్లేర్పడినది కావుననే అట్టి సమయ ములలో అన్నదానములు చేయుట మహాపుణ్యమని శాస్త్రము నిర్ణయించినది భోజనానుకూలత లేనిచో ఎక్కువ జనము చేరరు



# ప్రచారప్రభావము

శ్రీమన్నారాయణునినుండి, శ్రీపరమశివునినుండి, శ్రీబ్రహ్మదేవుని నుండి పరంపరగా ప్రతిఋషి సంప్రదాయకులున్నూ ప్రచారకులే

## శ్రీమద్భాగవతము ప్రథమస్కంధము.

"------ అని యడిగిన శౌనకాది ముని శ్రేష్ఠులకు సూతుండిట్లనియె,

**పైలుండు ఋగ్వేద పఠనంబు దొరకొనె**
**సామంబు జైమిని సదువుచుండె**
**యజువు వైశంపాయనాఖ్యుండు గైగొనె**
**దుది నథర్వము సుమంతుడు పఠించె**
**నఖిలపురాణేతిహాసముల్ మా తండ్రి**
**రోమహర్షణుడు నిరూఢి దాల్చె**
**తమ తమ వేద మాతపసులు భాగించి**
**శిష్యసంఘములకు జెప్పిరంత**

**శిష్యులెల్లను నాత్మీయశిష్యజనుల**
**కంత బహుమార్గముల ద్రుంచి యనుమతింప**
**బెక్కు శాఖలు గలిగి యీ పృథివిలోన**
**నిగమ మొప్పారె భూసుర నివహమందు.**

ఇప్పుడు చెప్పినది వ్యాసపరంపర యని గ్రహించేది ఇక శ్రీ దక్షిణామూర్తి పరంపర వినుడి

**సనకస్సనాతనశ్చైవ ప్రభుర్యశ్చ సనన్దనః ।**
**విభుస్సనత్కుమారశ్చ నిర్మలో నిరహంకృతిః ॥**
**సనకశ్చ సనన్దశ్చ సనాతనమునిస్తతః ।**
**సనత్సుజాత ఇత్యేతే యోగివర్యాశ్శివప్రియాః ॥**

1 సనకుడు, 2 సనాతనుడు, 3 సనన్దనుడు, 4 సనత్కుమారుడు – వీరు ప్రభువులుగాను, నిర్మలులుగాను, నిరహంకృతులుగాను నుంటు న్నారు అని పైశ్లోకమున కర్థము రెండవ శ్లోకమున సనత్కుమార స్థానములో సనత్సుజాత యని గలదు వీరు నలువురును మహాయోగి వర్యులును, ఈశ్వర ప్రియులుగాను నుంటున్నారు సనత్కుమారులవారికే సనత్సు జాతులని నామాన్తరము గలదు కావున వీరుభయులును నొకరేగాని, వేరువేరు గాదని గ్రహించవలయును

వామదేవ పరంపర –

**అగస్త్యశ్చ పులస్త్యశ్చ పులహః క్రతురేవ చ ।**

**తవ శిష్యా మహాత్మానో వామదేవ మహామునే! ॥**

అగస్త్యముని, పులస్త్యముని, పులహముని, క్రతుముని – వీరు నలువురున్ను మహాత్ములు, వామదేవ మహామునియొక్క శిష్యులు

బ్రహ్మవిద్యా పరంపర –

**ఓం నారాయణం పద్మభవం వసిష్ఠం శక్తిం చ తత్పుత్ర పరాశరం చ ।**
**వ్యాసం శుకం గౌడపదం మహా న్తం గోవిన్ద యోగీంద్ర మథాస్య శిష్యమ్ ॥**
**శ్రీ శంకరాచార్య మథాస్య పద్మపాదం చ హస్తామలకం చ శిష్యమ్ ।**
**తం తోటకం వార్తికకారమన్యా నస్మద్గురూన్ సంతత మానతోఽస్మి ॥**

మూలములోనే అర్థమగుటవల్ల ప్రత్యేకతాత్పర్యము వ్రాయలేదు.

శివపరంపర –

**సదాశివ సమారంభాం శంకరాచార్య మధ్యమామ్ ।**
**అస్మదాచార్యపర్యన్తాం వన్దే గురుపరమ్పరామ్ ॥**

విష్ణు పరంపర –

**లక్ష్మీనాథసమారంభాం నాథయామునమధ్యమామ్ ।**
**అస్మదాచార్యపర్యన్తాం వన్దే గురుపరమ్పరామ్ ॥**

మహర్షులు, మహాత్ములు, మతకర్తలు అందరున్నూ ప్రచారకులే

జైనమతమునుండి ఇప్పటి వఱకుగల మతకర్తలందఱున్నూ, వారి అను యాయులున్నూ ప్రచారకులై యుంటున్నారు కండ్లార మనము చూచు చున్నాము. చెవులార మనము వినుచున్నాము జైనముని కాలములో తానున్ను, తన భక్తులున్ను మతము నెంతో ప్రచారము చేసినారు ఇప్పుడు గూడా ఆమతములో విశ్వాసము గల స్త్రీ పురుషులు ప్రచారము చేయుచునే యున్నారు తరువాత నేర్పడినది శ్రీబుద్ధమతము బుద్ధదేవుని కాలములో తానున్ను, తన్ననుసరించిన బౌద్ధసన్న్యాసులున్నూ మహాగౌతమి, సంఘమిత్ర మొదలగు సన్న్యాసినులున్ను పాదచారులై మతవ్యాప్తిని చేసినారు

శ్రీ అశోకచక్రవర్తి కాలమునందు తూర్పుదేశమున జపాను వఱకున్నూ పశ్చిమదేశమున కొంతవరకున్నూ బౌద్ధమతప్రచారము చాల బహుళముగా జరిగెను తరువాత నేర్పడినది శ్రీశంకరమతము ఇది అద్వైతప్రబోధముగా నుండెను శ్రీశంకరాచార్యుల కాలమున తానున్ను సురేశ్వరాచార్య, తోటకా చార్య, పద్మపాదాచార్య, హస్తామలకా చార్యులున్నూ ఇక అనేక మహాపండితు లున్ను అద్వైతమతమును భారతదేశ మంతయు వ్యాపింపజేసిరి పిమ్మట నేర్పడినది విశిష్టాద్వైతమతము దీనికి కర్త శ్రీరామానుజాచార్యులు వీరున్నూ తన జీవితములో శిష్యులతో సహా పాదప్రయాణము చేసి, భారత దేశమందంతటను వైష్ణవమతమును వ్యాపింపజేసిరి పిమ్మట నేర్పడినది ద్వైత మతము దీనికికర్త శ్రీమధ్వా చార్యులు వారున్ను శిష్యులతో సహా భారత భూమి నంతయు కాలినడకతో సంచరించి ద్వైతమతమును విస్తరింపజేసిరి

మఱల కొంత కాలమునకు ఆర్యమత మావిర్భవించెను ఇది వేదమతము దీనికి కర్తశ్రీదయానంద సరస్వతీ స్వాములవారు వీరున్ను శిష్యులతో సహా ఆసేతుహిమాచలపర్యంతము ఆర్యసమాజ వ్యాప్తికొఱకు ప్రయత్నించిరి పైచెప్పిన మతకర్తలేగాక, మఱికొన్నికొన్ని చిన్నచిన్న

మతములు గూడా ఏర్పడినవి. వారున్ను తమతమ మతముల వ్యాప్తికొఱకు ప్రచారములు చేసినవారలే

కట్టకడపట నేర్పడినది కాంగ్రెసుమతము దీనికి మూలకర్త శ్రీగాంధీ గారు, వీరు పైజెప్పిన వారివలె కేవలము దైవమును గుఱించియు తమతమ మత సిద్ధాంతములను గుఱించియు యావచ్ఛక్తిని వినియోగపఱచి, జీవి తాంతమువఱకు మతప్రచారము చేసినవారు గాంధీగారి కాలమునందు భార తము పరాధీనముగా నుండుటవల్ల స్వాతంత్ర్యము లేనిచో మతము నిలువ జాలదని తలంచి, పరరాజులనుండి భారతదేశము విముక్తిపొందుటలోను, దైవజ్ఞానము ననుభవించుటలోను రెండింటిలోను ప్రయత్నము జరిగెను గాంధీగారి దేశస్వాతంత్ర్య కార్యములోను, ఆత్మస్వాతంత్ర్యములోను అనేక మంది స్త్రీలు, పురుషులున్ను ప్రవేశించి ప్రచారముచేసి వారు తలంచిన సిద్ధిని పొందిరి కాన మహనీయాత్ములందఱును తమ ఆత్మసౌఖ్యమును మాత్రము అనుభవించి ఊరకయుండినవారు కారనియు, పరులకుగూడా అట్టి ఆత్మానందమును, ఆత్మస్వాతంత్ర్యమును కలుగజేయుటలో యత్నించిన ప్రచారకు లనియు ఇప్పుడు మీకు అర్థమైనదిగదా! దీనికి కారణము లన్నియు మొదటనే మీకు తెలుపడమైనది

ఇప్పుడున్ను అనేకులు తమతమ మతములను ప్రచారము చేయుచునే యున్నారు బౌద్ధమతప్రచారకులు, వేదమతప్రచారకులు, శివమతప్రచార కులు, వైష్ణవమతప్రచారకులు , భక్తిమత ప్రచారకులు, యోగాసన మతప్రచా రకులు, వ్యాయామకళాప్రచారకులు, ప్రాణాయామసాధన ప్రచారకులు, అహింసా ప్రచారకులు, కాంగ్రెసు ప్రచారకులు ఉండియే యున్నారు కండ్లార మనము రోజురోజు చూడకపోయినను అప్పడప్పుడు చూచుచున్నాము గదా! ఇదంత ఎంత సంతోషకరము! ఆనందదాయకము! యోచించుకొనుడు

ఈలాగున క్రైస్తవమత ప్రచారములోగల సోదరీసోదరులను, మహ మ్మదీయత ప్రచారములో గల ఆత్మమిత్రులను మనము దర్శించుచున్నాము

వీటన్నిటియొక్క సారమేమన, మతప్రచారకులు కానివారెవ్వరున్నూ లేరు ఇట్టి ప్రచారముచేయుట పరమపావనమనియు, మహాపుణ్యమనియు వీరందఱున్ను తలంచుచున్నారు నిజముగా అటులనే యుండవలయును అదియే నిజమైన భక్తియు, విశ్వాసమున్ను అగును అట్టి తనగురుదేవుని పవిత్రవాక్యమును ఇతరులకు తెలుపుటకు అనగా ప్రచారముచేయుటకు మహాభాగ్యము కలిగినదిగదా! యని సంతోషించవలయును

ఐతే వీరందఱున్ను ఒక్క విషయమును మాత్రము మఱచిపోక జ్ఞప్తి యందుంచవలయును అదేమన ఎంతో పవిత్రమై, ప్రశాంతమై, ప్రసన్నమై యుండు వికసించిన తమ హృదయపద్మమును మతకలహములతో, వాదప్రతి వాదములతో మలినపరచి, దూషిత మొనర్చి చీకాకు కలుగజేసికొని రాక్షస కృత్యమునకు దిగకయుండేలాగున చూచినచో, వారందఱున్నూ ధన్యాత్ములే, జన్మసాఫల్యమును కలుగజేసిన వారలేయని మరువనీయక చూచుకొన్నచాలును ఇక భౌతికదృష్టితో చూచిన ఎందరో మందుల ప్రచార కులనుండి, వారివారి సామానులను విక్రయించెడు కంపెనీ ప్రచారకుల నుండి, కట్టకడపట తాంబూలము మొదలగు కిల్లీప్రచారకుల వఱకు గల జనులందఱిని చూచుచునే యున్నాము లోకమంతయు ప్రచారమే కనబడు చున్నది ఈ విషయమై కఠోపనిషత్తున గల ఒక్క వాక్యమును వినుడి

**భయాదస్యాగ్ని స్తపతి భయా త్తపతి సూర్యః ।**
**భయాదింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః ॥**

పరమేశ్వరుని శిష్యులలో ఐదుగురిని మాత్రము మనమిప్పుడు చూచు చున్నాము తక్కిన భగవద్భక్తులు, యోగులు, జ్ఞానులు, సిద్ధపురుషులు, మహాత్ములు ఉంటున్నారో లేదో మనకు తెలియుట లేదు ఆ పరమేశ్వరు నియొక్క ఆజ్ఞ ననుసరించక ఆజ్ఞోలంఘనము చేసినచో సర్వేశ్వరుండు కోపిం చును సర్వేశ్వరకరుణకు దూరులమై పోదుమేమో యనుభయముచేత అగ్ని ప్రజ్వలించి, సర్వజనులకు పక్షపాతము లేక పచన క్రియాదుల నిర్వహించు

చున్నది ఆలాగున సూర్యుడు ఒక్క కనురెప్పపాటు కాలముగూడా తప్పక ప్రకాశించి లోకమునకు ప్రకాశమును కలుగజేయుచున్నాడు ఆలాగున ఇంద్రుడున్ను త్రిలోకములను, పరమేశ్వరుని యందు భయముగలిగి పాలించుచున్నాడు ఆలాగుననే పరమేశ్వరాజ్ఞను సరిగా పాలించుచున్నానా? లేదా యను భయముతో ఒక నిమిషకాలమైనను వ్యర్థముచేయక వాయువు వీచుచున్నది అదేరీతిగా ఐదవదగు మృత్యువు అనగా యముడున్నూ పరమేశ్వరుని ఆజ్ఞను సరిగా పాలించవలెనని భయముతో ఒక్కొక్కరున్ను వారివారి బంధుసమూహ మంతయు ఎంతో దుఃఖముతో నేడ్చినను, లేక యెన్నెన్నో క్షమాపణలు కోరుచు ప్రార్థనలు చేయుచు, దేవతలకు మ్రొక్కులు మ్రొక్కినను లక్ష్యము చేయక తన లోకమునకు జీవకోట్లను రాత్రి పగలు అనుభేదము లేక తీసుకొని పోవుచునే యున్నాడు ఇదే ప్రతిమానవుని యొక్క ధర్మమనీ మరువకుడు, మఱియు చూడుడు

**రవిర్వాయుర్యథా వృష్టిర్లోకానాం హితకారణమ్ ।**
**తథా భవ న్తి వేదాశ్చ సర్వేషాం మోక్షసిద్ధయే ॥**

సర్వేశ్వరునకు నిజమైన భక్తులు ఐదుగురు మాత్రమే యుంటున్నారు తక్కిన ఋషులు, మునులు, యోగులు, భక్తులు అందఱున్నూ కనుపట్టుట లేదు గురువుయొక్క ధర్మమును లోకములో బోధించుటయే నిజమైన శిష్యులయొక్క ధర్మము పరమేశ్వర భక్తులు ఐదుగురే యుంటున్నారు వారు ఒక నిర్ణయము చేసికొన్నారు మన గురుదేవుడగు పరమేశ్వరుడు ఎట్లు ప్రవర్తించుచున్నాడో, మనుమున్నూ ఆలాగుననే ప్రవర్తించవలయును మనలో చేరదలంచు వారెవరైనను మనవలెనే ప్రవర్తించవలయును అట్టివారిని మాత్రమే మనలో చేర్చుకొన్న చాలును అని నిశ్చయించుకొన్నారు ఆ శిష్యులైదుగు రెవరనగా 1 ఆకాశము, 2 వాయువు, 3 సూర్యుడు అనగా అగ్ని, 4 వృష్టి, 5 భూమి వీరలలో స్త్రీలున్నూ, పురుషులున్ను ఉంటున్నారు దీనినిబట్టి ఆలోచించిన అనాది నుండియే ఋషి పరంపరనుండియే ఆత్మజ్ఞాన మునకు స్త్రీలకున్నూ, పురుషులకున్ను అధికారము కలదని

అర్థమగుచున్నది

ప్రతిసమాజమునకున్ను ఒక్కొక్క నియమము గలదు దానిని అంగీకరించిన వారినిమాత్రమే ఆ సంఘమువారు తమలో చేర్చుకొందురు పరమేశ్వరుడు ఏలాగున ఫలాపేక్షను కోరక పరప్రాణుల కుపకారము చేయుచున్నాడో, మనమున్నూ ఆలాగున చేయవలెనని వారు నిర్ణయించుకొన్నారు 1 ఆకాశము - అకారాంత పుల్లింగ ప్రథమైక వచనము పురుషుడు, 2 వాయువు - ఉకారాంత పుల్లింగ ప్రథమైక వచనము, ఇదిన్నీ పురుషుడు, 3 అగ్ని -(సూర్యుడు) ఇది ఇకారాంత పుల్లింగ ప్రథమైకవచనము వీరు ముగ్గురున్నూ పురుష వాచకశబ్దముతో కూడినవారు 4 వృష్టి -(వర్షము) ఇది ఇకారాంత స్త్రీలింగ ప్రథమైకవచనము స్త్రీవాచక శబ్దము 5 భూమి - ఇదిన్నీ ఇకారాంత స్త్రీలింగ ప్రథమైక వచనము

ఇక వీరి యొక్క కార్యక్రమవిధానము వినుడి ఆకాశముయొక్క గుణము శబ్దము మనము ఒక వాక్యము చెప్పిన ఆకాశము ఏ ప్రతి ఫలమున్నూ కోరక బ్రాహ్మణ, బ్రాహ్మణేతర, స్త్రీ, పురుష భేదములను పాటించక, అందటి చెవిలోనికి ఆ శబ్దమును తీసికొనివెళ్లి అంతయు చేయుచున్నది ఆలాగుననే వాయుదేవుడు అందరియొక్క వేడిమిని పోగొట్టి చల్లదనమును కలుగజేయుచున్నాడు ఆకాశమువలె పక్షపాతములేక అందటికిని విసురు చున్నదని భావము 3 అగ్ని(సూర్యుడు) అందటికిని ప్రకాశము కలుగ జేయుచున్నది అగ్ని సర్వజనులకును ప్రతిఫలమును కోరకనే పచనక్రియాది సేవను చేయుచున్నది

ఈ మూడున్ను పురుషులయొక్క పనులు ఇక ఇద్దరు అమ్మ గారలున్నారు వారి సేవ మహత్తరము, 4 వాన కురియునప్పుడు ఏకదేశ మున అన్ని జాతులవారికిని సమానముగానే వర్షించుచున్నది 5 భూదేవ తమ్మగారు, వీరియొక్క సేవమహత్తరము భూమియందు నెవరెవరు ఏ విత్తన

మును పెట్టెదరో, పోషణము ననుసరించి యేలాటి పక్షపాతము లేక అందఱికిన్ని సమానముగానే ఫలమును కలుగజేయుచున్నది ఓహో! ఎంత! మహత్తరమైన సేవ!

ఈలాగున సేవచేయువారిని మాత్రమే ఆ ఈశ్వరునియొక్క పరమభక్తుల సంఘములో చేర్చెదరు సేవమాత్రము చాలదు బోధగూడా నుండ వలయు నని ఆ ఐదుగురు భక్తులున్నూ, ఆ ఓంకార మంత్రము నుపదేశించియు న్నారు ''ఓం తద్బ్రహ్మ'' పరబ్రహ్మమంత్రము ఓంకారము పతంజలి మహర్షి ''తస్య వాచకః ప్రణవః'' అని యోగమాత్రములో తెలిపిరి అనగా సర్వేశ్వరు నియొక్క పరమేశ్వరునియొక్క నామము అనగా మంత్రము ప్రణవమని భావము శ్రీకృష్ణభగవానుడున్నూ గీతలో ''ప్రణవస్సర్వ వేదేషు'' అని వచించెను సర్వవేదములలోను ప్రణవమే పరమాత్మ స్వరూపమని నిర్ణయించినారు కావుననే, గీత అష్టమాధ్యా యమున అర్జును నకు ప్రణవోపదేశము ''ఓమిత్యేకాక్షరం బ్రహ్మ'' అని యుపదేశించిరి వేదము లన్నియు, ఉపనిషత్తులన్నియును ఈ ఓంకారమునే పరబ్రహ్మమంత్రముగా నుపదేశించుచున్నవి విస్తారముగా చూడదలంచు వారు ఓంకారమను గ్రంథమున చూడవచ్చును

ఇక ఓంకారమును అందఱున్నూ జపించవచ్చునా? లేదా అని విచా రించవలసియున్నది దానికి పరమహంస పరివ్రాజక సన్న్యాసులకు మాత్రమే అధికారము కలదని ఒక వాదము కలదు ఇదిన్నీ ఓంకారమను పుస్తకమున చూడవచ్చును మచ్చునకు మాత్రము నాలుగువాక్యములు తెలిపెద అర్జునుడు సన్న్యాసియా? గృహస్థుడా? శ్రీకృష్ణభగవానుడు గీత అష్టమా ధ్యాయమున ఏమి ఉపదేశించెను? కఠోపనిషత్తునందు యమధర్మరాజు నచికేతసుడను ఋషి కుమారునికి నేమంత్రోపదేశము చేసెను నచికేతసుడు బ్రహ్మచారియా? సన్న్యాసియా? పరమశివుడు కాశిలో మార్కండేయుల తల్లులకు ఏమంత్రము నుపదేశించెను? వారున్నూ గృహస్థులా? సన్న్యాసినులా? వైకుంఠమందు శ్రీవిష్ణుభగవానుడు గరుత్మంతునికి

నేమంత్ర ముపదేశించెను? గరుడపురాణమున చూడుడు అది ఓంకారమా? మఱి యొకటియా? గరుడపురాణసారమున గనందగును

ఇక వ్రాసిన విస్తారమగును పంచభూతములు చేసెడు మహోన్నత మగు సేవను మనము తెలిసికొన్నాము వీరి సర్వోత్కృష్టమగు ఈ సేవ లేనిచో మనుష్యులేగాక, మఱియొక్క ప్రాణియైన జీవించగలుగునా? ఇక వారు చేసెడు బోధలు, మంత్రోపదేశములను వినుడి వర్షాకాలమున ఆకాశము ఉపదేశించెడు మేఘధ్వనిని ఏకాగ్రముగా వినినచో ఆ ఓంకారమునే మీరు తెలిసికొనగలరు దీర్ఘో మోక్షప్రదాయకః –అని శ్రుతి చెప్పినట్లు ఎంత గొప్పగా ప్రణవధ్యానము చేయుచున్నదో విన్నారుగదా! ఓంకారమును అందఱున్నూ వినరాదు అది అతి రహస్యము అని చెప్పువారియొక్క వాక్యమునకు నెంత అర్థము గలదో విజ్ఞులు తెలిసికొందురుగాక!

రెండవవాడు వాయుదేవుడు పెద్దగాలి వచ్చినప్పుడు ఏకాగ్రముగ చూచిన, ఆ ఓంకారమునే ఉపదేశించుచున్నదని తెలియుచున్నది శంఖము, భేరి మొదలగు శబ్దములు ఓంకారమునే పలుకుచున్నవి

మూడవ శిష్యుడు అగ్నిహోత్రుడు హోమగుండము దగ్గర కూర్చుండి చిత్తైకాగ్ర్యముతో వినిన అగ్నిదేవుడు కూడా ప్రణవమునే ఉచ్చరించుచున్నాడని తెలియుచున్నది హోమాగ్నినుండి వెలువడెడి శబ్దము ననుసరించి ఆ యజ్ఞముయొక్క ఫలితమును గ్రహించుకొనవచ్చునని మీమాంసాశాస్త్రము పలుకుచున్నది

నాల్గవది వర్షము వానవచ్చుటకు ముందుగా ప్రణవనాదముతో ఆరంభ మగుచున్నదని మీరు గ్రహించగలరు లేక సముద్రమునకు కొలదిదూరమున ఏకాంతమున కూర్చుండి అవలోకనము చేసిన ఆ సముద్రఘోష ఓంకారమని మీరు తెలిసికొనగలరు లేక పర్వతము పైభాగమునుండి జలపాతము గలుగుచుండు స్థలములోను, గోదావరి మొదలగు ఆనకట్టలనుండి నీరు ప్రవహించెడు సమీపప్రదేశములలో

ఏకాంతమున కూర్చుండిన ఓంకార మును మీరు బాగుగా అర్థము చేసికొనగలరు

ఐదవవారగు భూదేవమ్మగారు ఏమి ప్రచారము చేయుచున్నారో, అదిన్నీ వినుడి, తిరుపతి మొదలగు గొప్ప దేవాలయములలో పెద్దగంట వాయించునప్పుడున్నూ, పూరీజగన్నాథములో తయారుచేసిన జాగంట వా యించునప్పుడున్నూ ఏశబ్దము గలుగుచున్నదో అదిన్నీ ఓంకారమే. భూకం పము ఎచ్చట గలుగునో దానికికొన్ని గంటలు ముందుగా భూమినుండి పెద్ద ఓంకారధ్వని గలిగినట్లు అట్టి ప్రదేశజనులు చెప్పుచుందురు

కావుననే ఉపనిషత్తులలో ఓంకారధ్యాన మెట్లు చేయవలయునో, నిర్ణయిం చినప్పుడు ఘంటానాదమువలె ఉండవలయునని తెలుపడమైనది

**తైలధారామివాచ్ఛిన్నం దీర్ఘఘంటానినాదవత్ ।**
**ఉపాస్యం ప్రణవస్యాగ్రం యస్తం వేద స వేదవిత్ ॥**

అవిచ్ఛిన్నమనగా విచ్ఛిన్నముగాని తైలధారవలెను, పెద్దఘంటా నినాదము వలెను ప్రణవముయొక్క నాల్గవపాదమగు అర్ధమాత్రా స్వరూపము నుపాసన చేయవలయుననియు, దీనిని అనగా ప్రణవముయొక్క నాల్గవ పాదము నెవ్వడెఱుగుచున్నాడో వాడే వేదార్థము నెఱిగిన వాడనియు, అట్టివాడు వేదము చదువకపోయినను వేదవేత్త యనియు, దానిని తెలిసికొని ఉపాసించనివాడు వేదము చదివినను చదువనివానితో సమానుడనియు శాస్త్రము తెలుచున్నది

మాండూక్యోపనిషత్తునందు గౌడపాదకారికలందు ఈ ప్రణవార్థమును ఉపాసించు విధానము చక్కగా తెలిసికొనవచ్చును. ఏ యేగ్రంథములలో దానియొక్క మాహాత్మ్యము తెలుపబడినదో అది ప్రచారము కొఱకని మాత్రము మరువకూడదు దానియొక్క మాహాత్మ్యము అనగా ప్రభావము తెలిసినప్పుడుగదా! దాని నుపాసించుటకు ప్రీతి

కలుగును లేనిచో ఎవరు పాసించెదరు? దానిని గురించి యెవరు ప్రచారము చేయుదురు? చేయరని భావము సామాన్యముగా ఒక్కొక్క ఔషధమును గురించి దాని ప్రయోజన మును గుఱించి ఎన్నెన్నియో ప్రభావములు ప్రకటించుచున్నారు ప్రచారము చేయుచున్నారు లోకమంతయు ప్రచారమయముగానే యుంటున్నది ఈ విషయము ఇదివరలోనే తెలుపడమైనది

ఇపుడు గురుగీతయందు పరమశివుడు పార్వతీదేవికి ఉపదేశించినది చూడుడు ఇదిన్నీ ప్రచారమనియే గ్రహించవలయును

ఈశ్వర ఉవాచ –

**ఇమాం తు భక్తిభావేన పఠేద్వై శృణుయాదపి ।**
**లిఖిత్వా యత్ప్రదానేన తత్సర్వం ఫలమశ్నుతే ॥**

ఏ ధన్యాత్ము డీగురు గీతను శ్రీ గురుస్వరూపభావముతో పరమ భక్తితో చదువుచున్నాడో, లేక శ్రవణము చేయుచున్నాడో అట్టి మహాభక్తుడు (పఠిం చువాడు, శ్రవణము చేయువాడును) శ్రీగురుగీతను ఏక మనస్కుడై భక్తిభా వముతో వ్రాసి, పరమభక్తునకు ఇచ్చినచో, నెట్టి ఫలమును పొందునో అట్టి సర్వఫలమును బడయుచున్నాడు

**గురుగీతామిమాం దేవి! హృది నిత్యం విభావయ ।**
**మహావ్యాధిగతైర్దుఃఖై స్సర్వదా ప్రజపేన్ముదా ॥**

ఓ పార్వతీదేవీ! ఈ గురుగీతను హృదయమునందు గురుస్వరూప మును దెలిసి నిత్యము ధ్యానించుము. సర్వశుభములు గలుగును గురుస్వరూప బ్రహ్మతత్త్వము మిగుల ప్రకాశించును ఒకవేళ మహావ్యాధులచే దుఃఖములు సంభవించినను, గురుధ్యానము చేయనగును ఏది నశించినను గురు స్వరూపము నాశనము గాదు.

**గురుగీతాక్షరై కైకం మంత్రరాజమిదం ప్రియే!।**

**అన్యే చ వివిధా మంత్రాః కలాం నార్హన్తి షోడశీమ్ ॥**

ఈ గురుగీతయందున్న శ్లోకములలోని ఒక్కొక్క అక్షరమున్ను మంత్రములలో శ్రేష్ఠమైన మహామంత్రమునుగా ఓ పార్వతీ! తెలియుము అట్టి ఏకైకాక్షర మహామంత్రములో నానావిధములగు యంత్రముద్రాదులతో గూడిన మంత్రము లన్నియును పదియారవదగు నంశమును పొందజాలవు సాటిరావు

**అన స్తఫలమాప్నోతి గురుగీతాజపేన తు ।**
**సర్వపాపహరా దేవి! సర్వదారిద్ర్యనాశినీ ॥**

గురుగీతను సర్వదా జపించువాడు పరిమితిలేని, యింత యని వచింప సాధ్యముగాని ఫలమును జెందుచున్నాడు అంతమాత్రమే కాదు శ్రీ గురుతత్త్వము కనుగొని నిరంతరము జపమాచరించు వాడెప్పుడును నాశ ములేని జ్ఞానఫలము నవశ్యముగా బడయుచున్నాడు ఈ గురుగీత దారిద్ర్య బాధతో దుఃఖించునానియొక్క దారిద్ర్యమును పూర్తిగా నశింపజేసి, వాని తీవ్రవేదనను బాపుచున్నది

**అకాలమృత్యుహరణా సర్వసంకటనాశినీ ।**
**యక్షరాక్షసభూతాది చోరవ్యాఘ్రవిఘాతినీ ॥**

మఱియు నీ గురుగీత అకాలమృత్యు భయమును హరించునదియు నెట్టికష్టములు సంభవించినను స్మరించినంత మాత్రమున వాని నన్నింటిని నశింపజేయునదియు, పఠించినంత మాత్రమున యక్షులను, రాక్షసులను భూత, ప్రేత,పిశాచాదులను తస్కరులను, వ్యాఘ్రాదులను దరిజేరనీయ నిదియు వాని భయముల నెల్ల పారద్రోలునదియు నగుచున్నది

**సర్వోపద్రవకుష్ఠాది దుష్టదోషనివారిణీ ।**
**యత్ఫలం గురుసాన్నిధ్యాత్తత్ఫలం పఠనాద్భవేత్ ॥**

మఱియు నీ గురుగీతాశాస్త్ర పఠనాదులవలన భక్తుని సర్వకష్టములు

నాశము లగుచున్నవి కుష్ఠు, బొల్లి మొదలైన మహావ్యాధులయొక్క దుర్నివార ములగు ప్రబలదోషములున్నూ హరింపబడుచున్నవి శ్రీగురు సన్నిధాన మున నివసించుటచే నెట్టి పవిత్రజ్ఞానము, భక్తి, వైరాగ్యము మొదలగునవి కలుగునో, అట్లే ప్రతిదిన మీ గురుగీతను శ్రద్ధతో పఠించిన వైరాగ్యాదులు గలుగును

**మహావ్యాధిహరా సర్వవిభూతేస్సిద్ధిదా భవేత్ ।**
**అథవా మోహనే వశ్యే స్వయమేవ జపేత్సదా ॥**

మఱియు నీ గురుగీతాశాస్త్రము, మహాపుణ్యక్షేత్రాదులు సేవిం చియు, ఔషధములు పుచ్చుకొనియు, తీరని తీవ్రవ్యాధులనుగూడా భక్తితో పఠించినంతమాత్రమున హరించుచున్నది సకలైశ్వర్యము నొసగునదియుగా నున్నది మఱియు నీగీతాశాస్త్రము మోహనమందును, వశీకరణమందును ఉపయోగపడుచున్నది దీనిని జపించినంత మాత్రమున మోహన వశీకరణాది కార్యములు నెరవేరుచున్నవి

## శ్రీ సీతారామాంజనేయ సంవాదము

## రామనామప్రభావము

**ఆది పరబ్రహ్మ ప్రతి పాదక మత్యంత పరమపావనము సుమీ**
**యీ దివ్యమంత్రరాజము మోదిత ధర్మార్థ కామ మోక్ష ప్రదమున్.**

**సత్యజ్ఞానానంద ప్రత్యగ్భిన్నాత్మునందు బ్రహ్మాది బుధుల్**
**నిత్యము రమించుచుండగ గాత్యాయని రామపదము గలిగె బరునకున్**

**రామపద వాచ్యుడాది నారాయణుండె యతనికిని నాకు భేదమింతైన గలుగ**
**ద ద్వయబ్రహ్మమయుల మట్లగుటవలన నింతి నాయంద నేను రమింతు నెపుడు.**

**రామతారక పావన రామనామ మెంత పావంబు నడగించు నంత యఘము**
**శ్వపచుడైనను జేయగా జాలడనగ దత్ప్రభావంబు నెన్నంగ దరమె నాకు.**

ఈరేడు జగములందును నారీమణి విమల రామనామముచేతం
జీరబడని ఘనదుర్భర ఘోర మహోఘంబు లేదు కోరి వెదకినన్.

బ్రహ్మహత్యాయుతము మద్యపానదశ శతమును గుర్వంగ నాకోటి గమనదురిత
మపరిమిత హేమచౌర్యంబు లనవరతము రామనామాభిహతములో రాజవదన!

బ్రహ్మ హత్యాఖ్య పాపతమోఽర్కబింబంబు మధుపానదోషా భ్రమారుతంబు
తపనీయ చౌర్యపాతకశైల భిదురంబు గురువధూగమనాఘ కుంజర హరి
జననీ పితృభ్రాతృవని తార్భకాచార్య గోవధారణ్యోరుదావవహ్ని
పరసతీసంగమ పరధనాహరణాది ఘోరపంకోరగ క్రూరబర్హి
యనృతభాషణవల్లీ మహోలవిత్ర మార్యదూషణపంకేరుహద్విపేంద్ర
మఖిలకలుషాంబునిధిబడ బానలంబు రామనామంబు హిమశైల రాజతనయ!

రమణి! యవశముచేనైన రామనామ మమర వర్తింపబడుచుండ నఖిలపాత
కములచే విడ్వబడు నుమ్మ సుమతి యపుడె సింహమతి భీతమృగముల చేతబోలె.

అనవరత రామనామ కీర్తనపరుండు వెనుకటి యఘంబుల దలంచి వెఱవవలదు
ఘనత నేనుగునెక్కి కుక్కలను గాంచి భయపడగ నేల? మనుజాడో పంకజాక్షి!

ఇలలోన రామనామము, సులభంబై వెలుగుచుండ జాలకగ బలుకం
గల నాలుక కలుగ గ న, ల్పులు మిన్నక నరకములను బొందెద రకటా.

ప్రాపుగ రామనామము నిరంతరమున్ భజియించువారికిన్
బాపము లేదటంచు బెనుపామును బట్టగవచ్చు నగ్ని సం
దీపిత లోహఖండము నతి త్వరితంబుగ మ్రింగవచ్చు బ
ల్కోపము బెంచు పెద్దపులి కోఱలు దీయగవచ్చు నిద్దరన్.

ఏ పాపమునైన దగం, బాపగలదు రామనామ భజనపరునకున్
బాపము గలదని పలుకు మ, హాపాతకి యఘము నడప నది యోపదిలన్.



# శ్రీమద్రామాయణ మాహాత్మ్యము

**రాశబ్దోచ్చారణే జాతే వక్త్రాత్పాపం వినిగచ్ఛతి।**
**మకారశ్రవణే జాతే భస్మీభావం గమిష్యతి । (ఉమాసంహిత)**

'రా' అను శబ్దము నుచ్చరించగానే పాపము వదనమునుండి బయలు వెడలును పిదప మకారమును వినుటతోడనే భస్మమైపోవును

**రామేతి రామచంద్రేతి రామభద్రేతి వా మనుమ్ ।**
**యావజ్జీవం జపన్ మర్త్యో జీవన్ముక్తో న సంశయః ॥ (ఉమాసంహిత)**

రామ, రామచంద్ర, రామభద్ర అను నీమంత్రములలో దేనినైనను జీవితాంతమువరకు జపించు మనుజుడు జీవన్ముక్తుడు గాగలడు సంశయము వలదు

**యః కర్ణాంజలి సంపుటైరహరహస్సమ్యక్పిబత్యాదరాత్**
**వాల్మీకేర్వదనారవిందగలితం రామాయణాఖ్యం మధు ।**
**జన్మవ్యాధి జరావిపత్తిమరణైరత్యంతసోపద్రవం**
**సంసారం స విహాయ గచ్ఛతి పుమాన్ విష్ణోః పదం శాశ్వతమ్ ॥**
**(ఉమాసంహిత)**

ఏ మనుష్యుడు, వాల్మీకిమహర్షియొక్క ముఖపద్మమునుండి లభించిన రామాయణమను మధువును తన కర్ణపుటమనెడు దోసిలితో ప్రతిదినము సాదరముగా గ్రోలుచుండునో, అతడు జననమరణ జరావ్యాధులతో మిగుల నుపద్రవకరమగు సంసారమును వీడి శాశ్వతమగు మోక్షధామమును జేరుచున్నాడు

**శతకోటి ప్రవిస్తీర్ణమేతద్రామాయణం మహత్ ।**
**మర్త్యలోకే విష్ణులోకే చ సత్యలోకే పరన్తప ॥ (బహ్మాండపురాపుణము)**

పరమశివుడు నారదమహర్షికి చెప్పినది పరంతపుడవగు నారదా!

పరమ పావనమగు నీ రామాయణము నేనుండు కైలాసమునందును, వైంరమునం దును, సత్యలోకమునందును శతకోటి శ్లోకములతో ప్రఖ్యాతమై యున్నది

**నందీశ్వరాదశృణవమహం రామాయణం పురా ।**
**విష్వక్సేనా త్తథా విష్ణుః శృణోతి చరితం సదా ॥**
**మార్కండేయాత్ పద్మజో ఽపి శృణోతీమం మహామనుమ్ ॥**

**(బ్రహ్మాండ పురాణం)**

పూర్వము నే నీ రామాయణమును నందీశ్వరునివలన వింటిని, అట్లే విష్ణువు విష్వక్సేనునివలన సదా రామాయణమును వినుచుండును బ్రహ్మ గూడా మార్కండేయునివలన ఈ రామాయణ మహామంత్రమును శ్రవణము జేయుచుండును

**సంసారతాపయుక్తానాం జంతూనాం హతచేతసామ్ ।**
**శ్రీమద్రామాయణాఖ్యాన పీయూషం భేషజం స్మృతమ్ ॥**

సంసారమనెడు జ్వరముతో గూడుకొన్నవారై వికలమనస్కులగు జీవులకు శ్రీమద్రామాయణమను అమృతము ఔషధముగా బేర్కొనబడినది

**న వేదైర్న తపోభిః స్నానతీర్థాచరణైరపి ।**
**న కృచ్ఛ్రై, ర్నాశ్వమేధైశ్చ న యజ్ఞైర్న వ్రతైరపి ॥**

**రామాయణై కశ్లోకస్య శ్రవణాద్యా గతిస్స్మృతా ।**
**నాస్తి నా స్త్యేవ సా విప్ర! ఇత్యాజ్ఞా పారమేశ్వరీ ॥ (బ్రహ్మాండ పురాము)**

శ్రీమద్రామాయణమునందలి ఒక్కశ్లోకమును భక్తితోడ శ్రవణము చేయుటవలన గలిగెడు సద్గతి వేదాధ్యయనముచేగాని, తపస్సులచేగాని, తీర్థస్నానాదులచేగాని, కృచ్ఛ్రచాంద్రాయణాదులచేగాని, అశ్వమేధములచే గాని, క్రతువులచేగాని, వ్రతములచేగాని కలుగనేరదు, కలుగనేరదు అనునది పరమేశ్వరుని యాజ్ఞయై యున్నది

**శృణ్వన్ రామాయణం భక్త్యా యః పాదం పదమేవ వా ।**
**స యాతి బ్రహ్మణః స్థానం బ్రహ్మణా పూజ్యతే సదా ॥**

**(ఉమాసంహిత)**

ఏ నరుడు రామాయణమునందలి శ్లోకపాదమునుగాని, పదము నైనను భక్తితో శ్రవణము జేయుచున్నాడో అతడు బ్రహ్మలోకమును బొందును. బ్రహ్మదేవునిచే పూజింపబడును

**రామాయణస్య వాక్యం వా పదం వా పదమేవ వా ।**
**భుక్త్వాన్తే తు ప్రయుంజానో బ్రహ్మభూయాయ కల్పతే ॥**

రామాయణములోని వాక్యమునుగాని, శ్లోకపాదమునుగాని, భోజనాంతమున పఠించు నతడు బ్రహ్మత్వమును బొందుట కర్హు డగుచున్నాడు

**శ్రీరామప్రాతిపదికమవశేనాపి సంగృణన్ ।**
**ముక్తిం ప్రాప్నోతి మనుజః కిం పునర్బుద్ధిపూర్వకమ్ ॥**

**(ఉమాసంహిత)**

శ్రీరామ అను ప్రాతిపదికమును తెలియక ఉచ్చరించినను మనుజుడు ముక్తినొందుననగా తెలిసి యుచ్చరించిన ముక్తినొందు ననుటలో సందేహమేమి?

**చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్ ।**
**ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్ ॥**

రఘురాముని చరిత్రము శతకోటి శ్లోకములతో విస్తరిల్లినది అందలి యొక్కొక్క యక్షరమున్ను మహాపాతకములను నశింపజేయును

**వాల్మీకిగిరి సంభూతా రామసాగరగామినీ ।**
**పునాతి భువనం పుణ్యా రామాయణమహానదీ ॥**

పావనమైన రామాయణమను మహానది, వాల్మీకిముని యనెడు పర్వతము నందు సంభవించినదై రామభద్రుడనెడు సముద్రమును గుఱించి ప్రవహించుచూ లోకమును పవిత్రము చేయుచున్నది

**వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే ।**
**వేదః ప్రాచేతసాదాసీత్సాక్షాద్రామాయణాత్మనా ॥**

వేదవేద్యుడగు పరమపురుషుడు దశరథపుత్రుడై జన్మించగా, వేదము వాల్మీకిమహర్షివలన శ్రీ మద్రామాయణరూపముగా నావిర్భవించెను

**వాల్మీకేర్మునిసింహస్య కవితావనచారిణః ।**
**శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్ ॥**

కవితావన విహారియగు వాల్మీకిముని సింహముయొక్క రామకథానాదమును వినుచు పరమగతియగు మోక్షధామమును జేరనివారెవరు?

**రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే ।**
**రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః ॥**

శ్రీరాముని కౌసల్యాదేవి రామ యనియు, దశరథుడు రామభద్ర యనియు, వసిష్ఠమహర్షి రామచంద్ర యనియు, మహర్షులు, రామబ్రహ్మమనియు, రాజులు రఘునాథ యనియు, సీతాదేవి నాథ యనియు, భక్తులు సీతాపతి యనియు సంబోధింతురు అట్టి సీతారామునకు నమస్కారము

## శ్రీమహాభారతప్రశస్తి

**ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని యధ్యాత్మవిదులు వేదాంతమనియు**
**నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని కవివృషభులు మహాకావ్యమనియు**
**లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని యైతిహాసికు లితిహాసమనియు**
**పరమపౌరాణికుల్ బహుపురాణ సముచ్చయంబని మహిగొనియాడుచుండ**
**వివిధ వేదతత్త్వవేది వేదవ్యాసు డాదిముని పరాశరాత్మజుండు**

విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై పరగుచుండ జేసె భారతంబు.

ఆయురర్థులకు దీర్ఘాయుర వాప్తియు నర్థార్థులకు విపులార్థములును
ధర్మార్థులకు నిత్యధర్మసంప్రాప్తియు వినయార్థులకు మహావినయమతియు
పుత్రార్థులకు బహుపుత్రసమృద్ధియు సంపదర్థుల కిష్టసంపదలును
గావించు నెప్పుడు భావించి వినుచుండువారలకిమ్మహాభారతంబు.
భక్తి యుక్తులైన భాగవతులకు శ్రీవల్లభుండు భక్తవత్సలుండు
భవభయంబు లెల్ల బాపి యిష్టార్థ సంసిద్ధి గరుణతోడ జేయునట్లు

అమల సువర్ణశృంగఖురమై కపిలంబగు గోశతంబు ను
త్తమ బహువేదవిప్రులకు దానము సేసిన తత్ఫలంబు, త
థ్యము సమకూరు భారత కథా శ్రవణాభిరతిన్, మదీయ చి
త్తము ననిశంబు భారతకథాశ్రవణ ప్రవణంబ కావునన్.

అమలిన తారకాసముదయంబుల నెన్నను, సర్వ వేదశా
స్త్రముల యశేషసారము ముదంబున బొందను, బుద్ధి బాహు వి
క్రమమున దుర్గమార్ణజల గౌరవ భారత భారతీ సము
ద్రము దటియంగ నీదను విధాత్రున కైనను నేరబోలునే.

బహుభాషల బహువిధముల,
బహుజనములవలన వినుచు భారత బద్ధ
స్పృహులగువారికి నెప్పుడు,
బహుయాగంబుల ఫలంబు పరమార్థమగున్.

## శ్రీమద్భాగవతమాహాత్మ్యము

స వై పుంసాం పరో ధర్మో యతో భక్తి రధోక్షజే।
అహైతుక్యప్రతిహతా యయాఽఽత్మా సుప్రసీదతి ॥

ఏ ధర్మమువలన జనులకు భగవంతునియందు న్నిర్హేతుకము, నిర్విఘ్నము నగు భక్తి గలుగునో, ఏ యనన్యభక్తిద్వారా అంతఃకరణము

నిర్మలమగునో, అదియే భక్తులకు సర్వోత్కృష్టమగు ధర్మము

**వాసుదేవే భగవతి భక్తియోగః ప్రయోజితః ।**
**జనయత్యాశు వైరాగ్యం జ్ఞానం చ యదహైతుకమ్ ॥**

భగవంతుడగు వాసుదేవునియందలి భక్తియోగము శీఘ్రముగా వైరాగ్యమును, జ్ఞానమును గలిగించుచున్నది

**శ్రుతమప్యౌపనిషదం దూరే హరికథామృతాత్ ।**
**యన్న సన్తి ద్రవచ్చిత్త ప్రేమాశ్రుపులకోద్గమాః ॥**

ఏ మనుజునకు భగవత్కథామృతము నాస్వాదించుచుండగా హృదయము ద్రవించుట, ఆనందబాష్పములు రాలుట, రోమాంచము గలుగుట లేదో, అట్టివాని యుపనిషద్విద్య అనుభవరహితమైన పరోక్షజ్ఞానమే యగుచున్నది (ఆనంద బాష్పాదులు గల్గించు హరికథామృతముకంటె అవి లేని ఉపనిషదాది శ్రవణము మేలైనది గాదు)

**వద న్తి తత్తత్త్వవిద స్తత్త్వం యజ్జ్ఞానమద్వయమ్ ।**
**బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి కథ్యతే ॥**

ఏ యద్వితీయమగు జ్ఞానము బ్రహ్మమనియు, పరమాత్మ యనియు, భగవానుడనియు చెప్పబడుచున్నదో, ఆ జ్ఞానమునే తత్త్వదర్శులగు జ్ఞానులు పరతత్త్వముగా జెప్పుచున్నారు

**తచ్ఛ్రద్దధానా మునయో జ్ఞానవైరాగ్యయుక్తయా ।**
**పశ్యన్త్యాత్మని చాత్మానం భక్త్యా శ్రుత గృహీతయా ॥**

బ్రహ్మము పరమాత్మ, భగవానుడు మున్నగు శబ్దములచే వ్యవహరింపబడు పరతత్త్వమునందు శ్రద్ధధానులగు మునులు జ్ఞానవైరాగ్య యుక్తము, భగవత్కథాశ్రవణ ప్రాప్తము నగు పరమభక్తితో అంతరాత్మయందుగల పరమాత్మను దర్శించుచున్నారు

**తస్మాదేకేన మనసా భగవాన్ సాత్వతాం పతిః ।**
**శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ ధ్యేయః పూజ్యశ్చ నిత్యశః ॥**

భక్తిహీనమగు ధర్మము నాచరించుట కేవలము శ్రమయే యగును కావున భగవంతుడగు కృష్ణపరమాత్మను గుఱించి ఏకాగ్రచిత్తులై వినవలయును కీర్తించవలయును ధ్యానము చేయవలయును, ప్రతిదినము పూజ చేయ వలయును

**వాసుదేవపరా వేదా వాసుదేవపరా మఖాః ।**
**వాసుదేవపరా యోగా వాసుదేవపరాః క్రియాః ॥**
**వాసుదేవపరం జ్ఞానం వాసుదేవపరం తపః ।**
**వాసుదేవపరో ధర్మో వాసుదేవపరా గతిః ॥**

వేదములు, యజ్ఞములు, యోగములు, క్రియలు, జ్ఞానము, తపస్సు, ధర్మము, సద్గతి మొదలగువాని కన్నింటికిన్ని పరమలక్ష్యమగు గమ్యస్థానము వాసుదేవుడగు భగవాను డొక్కడే యగుచున్నాడు

**నిగమకల్పతరోర్గలితం ఫలం శుకముఖాదమృత ద్రవసంయుతమ్ ।**
**పిబత భాగవతం రసమాలయం ముహురహో రసికా భువి భావుకాః ॥**

**వేదకల్పవృక్షవిగలితమై శుక ముఖ సుధాద్రవమున మొనసియున్న**
**భాగవత పురాణ ఫలరసాస్వాదన పదవి గనుడు రసిక భావవిదులు.**

వేదమనెడు కల్పవృక్షమునుండి గళితమైనది, శుకముఖ సుధారస సంయుతమైనదియు నగు భాగవత ఫలరసమును రసజ్ఞులు, భావుకులు నగు భక్తులు మోక్షసిద్ధి కలుగువఱకు యావజ్జీవము నాస్వాదింపుడు

**ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రన్థా అప్యురుక్రమే ।**
**కుర్వన్త్యహైతుకీం భక్తిమిత్థంభూతగుణో హరిః ॥**

ఆత్మానుసంధానపరులగు మునులు శాంతాత్ములయ్యును భగవంతుని యందు నిష్కామభక్తి గలిగియుంటున్నారు. విష్ణువిట్టి కళ్యాణగుణ

విశిష్టుడై యున్నాడని యెఱుంగవలయును

**శృణ్వతాం స్వకథాః కృష్ణః పుణ్య శ్రవణకీర్తనః ।**
**హృద్యంతస్థో హ్యభద్రాణి విధునోతి సుహృత్సతామ్ ॥**

పుణ్యశ్రవణకీర్తనుడు, సజ్జనహితకారియగు కృష్ణభగవానుడు తన కథలను వినువారియొక్క హృదయములలో నుండి కామాదివిషయ వాసనలను నశింపజేయుచున్నాడు

**ధర్మస్స్వనుష్ఠితః పుంసాం విష్వక్సేనకథాసు యః ।**
**నోత్పాదయేద్యది రతిం శ్రమ ఏవ హి కేవలమ్ ॥**

భగవత్కథలయందు నిచ్చను గలుగజేయజాలనియెడల అట్టి ధర్మము నెంత యనుష్ఠించినను కేవలము శ్రమయే మిగులునుగాని, ప్రయోజనము గలుగదు

**విష్ణునామా స వేదేషు వేదాన్తేషు చ గీయతే ।**
**ఏష ఏవ మహాన్ శబ్దో మైత్రేయ! భగవానితి ॥**

విష్ణునామముతో భగవానుడు వేదములయందును, వేదాంతములయందును కీర్తింపబడుచున్నాడు ఓ మైత్రేయా! భగవాన్ అనబడు నీశబ్దమే సర్వోత్తమమై యొప్పుచున్నది

**ఏవం ప్రసన్నమనసో భగవద్భక్తి యోగతః ।**
**భగవత్త త్త్వవిజ్ఞానం ముక్తసంగస్య జాయతే ॥**

భక్తియోగమువలన శాంతచిత్తుడైన ముక్తసంగునకు భగవత్సాక్షాత్కారము గలుగును

**అతో వై కవయో నిత్యం భక్తిం పరమయా ముదా ।**
**వాసుదేవే భగవతి కుర్వన్త్యాత్మ ప్రసాదినీమ్ ॥**

కావుననే తత్త్వవిదులు నిరంతరము పరమానందముతో భగవానుడగు

వాసుదేవునియందు అంతఃకరణమును పరిశుద్ధము చేయునట్టి భక్తి గలిగియుంటున్నారు

**భేజిరే మునయోఽథాగ్రే భగవన్తమధోక్షజమ్ ।**
**సత్త్వం విశుద్ధం క్షేమాయ కల్పన్తే యేఽను తానిహ ॥**

పూర్వము మునులు విశుద్ధసత్త్వమూర్తియు, అధోక్షజుడునగు భగవంతుని సేవించిరి కావున ఎవరు పురాతన మహర్షుల ననుసరింతురో వారీసంసారమున శ్రేయస్సును బొందగలరు

**శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రమునందలి**

## ఉత్తర పీఠిక

**ఇతీదం కీర్తనీయస్య కేశవస్య మహాత్మనః ।**
**నామ్నాం సహస్రం దివ్యానామశేషేణ ప్రకీర్తితమ్ ॥**

కీర్తింపదగిన పరమాత్ముడగు విష్ణుమూర్తియొక్క దివ్యమగు సహస్రనామస్తోత్రము సంపూర్ణముగా కీర్తింపబడినది

**య ఇదం శృణుయాన్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్ ।**
**నాశుభం ప్రాప్నుయాత్కించిత్సోఽముత్రేహ చ మానవః ॥**

ఏ మనుజు డీసహస్రనామస్తోత్రము నెల్లప్పుడు వినుచుండునో, ఏ మానవుడు పఠించుచుండునో, వారిరువురు ఇహలోకమునందును, పరలోకమునందును ఎట్టి అశుభమును పొందరు.

**వేదాంతగో బ్రాహ్మణస్స్యాత్ క్షత్రియో విజయీ భవేత్ ।**
**వైశ్యో ధన సమృద్ధస్స్యా చ్ఛూద్రస్సుఖమవాప్నుయాత్ ॥**

బ్రాహ్మణుడు(బ్రహ్మనిష్ఠుడు) వేదాంతార్థజ్ఞు డగును క్షత్రియుడు విజయసంపన్నుడగును వైశ్యుడు ధనసమృద్ధిని బొందును శూద్రుడు సుఖము నొందును

**దుర్గాణ్యతితరత్యాశు పురుషః పురుషోత్తమమ్ ।**
**స్తువన్నామసహస్రేణ నిత్యం భక్తిసమన్వితః ॥**

పురుషోత్తముడగు భగవానుని భక్తియుక్తుడై సహస్రనామస్తోత్రముతో నిత్యము నుతించు పురుషుడు దాటనలవిగాని దుర్గములను ( ఆపదలను) సైతము శీఘ్రముగా దాటిపోగలడు

**వాసుదేవాశ్రయో మర్త్యో వాసుదేవ పరాయణః ।**
**సర్వపాప విశుద్ధాత్మా యాతి బ్రహ్మ సనాతనమ్ ॥**

వాసుదేవు నాశ్రయించి, వాసుదేవునే పరమదైవతముగా భజించు మనుష్యుడు సమస్తపాపములనుండి విముక్తుడై పరిశుద్ధాత్ముడై సనాతనమగు పరబ్రహ్మమును బొందుచున్నాడు

**న వాసుదేవభక్తానామశుభం విద్యతే క్వచిత్ ।**
**జన్మమృత్యు జరావ్యాధిభయం నైవోపజాయతే ॥**

విష్ణుభక్తుల కెచ్చటను అశుభము గలుగదు జననమరణములవలన, జరావ్యాధులవలన భయము గలుగదు

**ఇమం స్తవమధీయానశ్శ్రద్ధా భక్తి సమన్వితః ।**
**యుజ్యేతాత్మా సుఖక్షాంతి శ్రీధృతి స్మృతి కీర్తిభిః ॥**

శ్రద్ధాభక్తులతో నీ వాసుదేవ సహస్రనామస్తవము నధ్యయనము జేయునతడు తాను సుఖమును, క్షమను, శ్రీని, ధైర్యమును, స్మృతిని, కీర్తిని జెందును.

**న క్రోధో న చ మాత్సర్యం న లోభో నాశుభా మతిః ।**
**భవ న్తి కృతపుణ్యానాం భక్తానాం పురుషోత్తమే ॥**

కృతపుణ్యులగు భగవద్భక్తులకు క్రోధము, మాత్సర్యము, లోభము, అశుభమతి మొదలగు మలిన గుణములు గలుగనేరవు

**ద్యౌస్సచంద్రార్క నక్షత్రం ఖం దిశో భూర్మహోదధిః ।**
**వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః ॥**

స్వర్గము, సూర్య చంద్ర నక్షత్రములతో గూడిన యాకాశము, దిక్కులు, భూమి, సముద్రము అనునివి మహాత్ముడగు వాసుదేవుని మహిమచే నిలిచియుంటున్నవి

**ససురాసుర గంధర్వం సయక్షోరగరాక్షసమ్ ।**
**జగద్వశే వర్తతేఽదః కృష్ణస్య సచరాచరమ్ ॥**

దేవతలు, అసురులు, గంధర్వులు, యక్షులు, ఉరగులు, రాక్షసులు, గలయీ చరాచరప్రపంచము కృష్ణపరమాత్ముని వశమునందు జీవించు చున్నది

**ఇంద్రియాణి మనోబుద్ధిస్సత్త్వం తేజో బలం ధృతిః ।**
**వాసుదేవాత్మకాన్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవ చ ॥**

ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, సత్త్వము, తేజస్సు, బలము, ధృతి, క్షేత్రము, క్షేత్రజ్ఞుడు అనునివి వాసుదేవ స్వరూపములని చెప్పుదురు

**సర్వాగమానామాచారః ప్రథమం పరికల్పితః ।**
**ఆచారప్రభవో ధర్మో ధర్మస్య ప్రభురచ్యుతః ॥**

సర్వశాస్త్రములకు నాచారము ప్రధానముగా విధింపబడినది ఆచారమునుండి ధర్మమేర్పడినది ధర్మమున కధిపతి విష్ణువు

**ఋషయః పితరో దేవా మహాభూతాని ధాతవః ।**
**జంగమాజంగమం చేదం జగన్నారాయణోద్భవమ్ ॥**

ఋషులు, పితృదేవతలు, దేవతలు, పంచభూతములు, సప్తధాతువులు, స్థావరజంగ మాత్మకమగు నీ జగత్తు నారాయణునివలన గలిగినది

**యోగో జ్ఞానం తథా సాంఖ్యం విద్యాశ్శిల్పాది కర్మ చ ।**

**వేదాశ్శాస్త్రాణి విజ్ఞాన మేతత్సర్వం జనార్దనాత్ ॥**

యోగము, జ్ఞానము, అట్లే సాంఖ్యము, విద్యలు, శిల్పము మున్నగు కళలు, వేదములు , శాస్త్రములు మొదలగు నీ విజ్ఞానమంతయు జనార్దనుని వలన ఉద్భవించినది

**ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః ।**
**త్రీన్ లోకాన్ వ్యాప్య భూతాత్మా భుంక్తే విశ్వభుగవ్యయః ॥**

కేవలుడు, సర్వభూతాత్ముడు,విశ్వరక్షకుడు, అవ్యయుడు నగు విష్ణు మూర్తి మహాభూతములు, మఱియు ననేక జీవరాసులుగల మూడు లోకము లను వ్యాపించి పరిపాలించుచున్నాడు

**ఇమం స్తవం భగవతో విష్ణోర్వ్యాసేన కీర్తితమ్ ।**
**పఠేద్య ఇచ్ఛేత్పురుషః శ్రేయః ప్రాప్తుం సుఖాని చ ॥**

ఏ పురుషుడు సుఖములను, శ్రేయస్సును బొందగోరునో, అతడు వ్యాసమహర్షిప్రోక్తమగు నీ విష్ణుభగవానుని స్తోత్రమును పఠింపవలయును

**విశ్వేశ్వర మజం దేవం జగతః ప్రభుమవ్యయమ్ ।**
**భజన్తి యే పుష్కరాక్షం న తే యాన్తి పరాభవమ్ ॥**
**న తే యాన్తి పరాభవమోన్నమ ఇతి ॥**

లోకాధిపతి, నాశరహితుడు, అజుడు, విశ్వేశ్వరుడు నగు వాసుదేవుని సేవించువారు పరాభవమును జెందరు పరాభవమును చెందరు ఓంకారస్వరూపుడగు భగవానునకు నమస్కారము

## అథేశ్వరస్తుతి ప్రార్థనా

యాచనా సమర్పణోపాసనా విద్యావిషయః ।
స్తుతి విషయస్తు యో భూతం చేత్యారభ్యోక్తో వక్ష్యతే చ ।
అథేదానీం ప్రార్థనా విషయ ఉచ్యతే ॥

**తేజోऽసి తేజో మయి దేహి, వీర్యమసి వీర్యం మయి దేహి**
**బలమసి బలం మయి దేహి, ఓజోऽస్యోజో మయి దేహి।**
**మన్యు రసి మన్యుం మయి దేహి, సహోऽసి సహో మయి దేహి**
**(యజు. అ.౧౯. మం౯)**

**మయీదమింద్ర ఇంద్రియం దధాత్వస్మాన్ రాయో మఘవానః స చంతామ్।**
**అస్మాకం సంత్వాశిషః సత్యా నః సంత్వాశిషః॥**
**యాం మేధాం దేవగణాః పితరశ్చోపాసతే। (యజు. అ. ౨. మండ. ౧౦)**
**తయా మామద్య మేధ యగ్నే మేధావినం కురుస్వాహా ॥**
**(యజు. అ. ౩౨.మం.౧౪.)**

గణిత విద్యాసూచనానంతరము ఈశ్వరప్రార్థన, యాచన, సమర్పణ, ఉపాసనావిషయము, తేజోऽసీత్యాది మంత్రములందలి విశేషము–ఆ సందర్భ ములెల్ల ముందర లిఖింతము కాని, యో భూతం చ అను మంత్రములందు ఈశ్వరస్తుతి కలదు ఆ యంశము వెనుక కొంత వ్యాఖ్యానించితిమి శేషించినభాగము ముందు వ్యాఖ్యానింతుము ప్రకృతము ప్రార్థనావిషయము నుల్లేఖించెదము

తేజోऽసి –హే పరమాత్మా! నీవు ప్రకాశ స్వరూపుడవు మా హృదయములందును విజ్ఞానరూపమగు వెలుగును కృపతో నిలుపుము వీర్యమసి –జగదీశ్వరా! నీ వనంతపరాక్రమవంతుడవు మమ్మును సంపూర్ణ పరాక్రమ శాలుర జేయుము బలమసి –ఈశ్వరా! నీవు బలయుతుడవగుట, అనుగ్రహించి మా శరీరములను, ఆత్మను, పూర్ణబలవంతముల సలుపుము, ఓజోऽసి – ఓ సర్వశక్తిమాన్! నీవు సకల సామర్థ్యములకు నివాసస్థానము యథోచిత సమర్థతను మా యందు నిలుపుము మన్యురసి –దుష్టత్రాసకరదుష్టజీవులయెడ, దుష్కర్మల దెస నీవు క్రుద్ధుడవు మాయందిరెంట క్రోధస్వభావము నిలుపుము సహోऽసి పరమేశా! –ఈవు సర్వమును సహించు స్వభావము కలవాడవు నాస్తికుల దౌష్ట్యవ్యవహారములను సహించుచున్నావు అట్టిదే సహనశీలము మాకిమ్ము సుఖ, దుఃఖ, హాని, లాభ, శీత, ఉష్ణ, క్షుధా, తృషలను, యుద్ధాదులను, సహింపగల సహనము మాకిమ్ము

శుభగుణములను దయచేయుము ఆశుభగుణములకు దూరముగ మమ్ముంచుము మయాదమింద్ర! –ఉత్తమైశ్వర్యయుక్త, పరమాత్మా! మా మనస్సును సుస్వభావమిళత మొనర్చి స్థిరపరపుము శ్రోత్రాదీంద్రియములు దౌష్ట్యవృత్తాంతముల కొగ్గని యట్టు లుత్తమముల నొనర్పుము ఉత్తమేంద్రియముల నిమ్ము ఇచ్చి సర్వోత్తమగుణముల సైతము జంటింపుము అస్మార్ రాయే అపారధనవాా! –భగవంతా! మమ్ము శ్రేష్ఠధనవంతుల జేయుము ( నిందనీయమగు సంపద అవాంఛనీయము.) అట్టి రాజ్యము శాశ్వతముగ ప్రసాదింపుము

'సచంతా' మ్మనునది మనుష్యుల కిశ్వరాజ్ఞ హేమనుష్యులారా! మీరు సర్వకాలములం దుత్తమగుణములను గ్రహింపుడు ఉత్తమ కర్మలనే సర్వదా చేయుడు

అస్మాకం –హే పరమకారుణికా! మాకాంక్షలు సర్వకాలములందు సత్య ములే యగునట్లనుగ్రహింపుము సత్యకర్మలనే కావింప నిచ్ఛలు పుట్టునట్లు ప్రసాదింపుము భూరిరాజ్య మేర్పరచుకొని చక్రవర్తిపదవీ భారవహన యోగ్యత మాయెడ స్థిరపరపుము. యాం మేధామ్ –హే పరమాత్మా! అత్యం తము ఉత్తమమైనది సత్యవిద్య, దానిని ధరించుటకు బుద్ధి మొదట యోగ్యము కావలెను ఆ మేధాబుద్ధిని మాకిడుము దాని ప్రతాపముచే మేము విద్వాంసుల(దేవతల) మగుదుము జ్ఞానుల (పితరుల)మయి, సర్వకాల సర్వావస్థల మేము నిన్నును పాసింతుము

అత్యంతము దివ్యులుచ్చరింపదగి లోకక్షేమ కరార్థ గర్భితమైనది స్వాహా–శబ్దము ఈ శబ్దముపట్ల నిరుక్తకారుని మతమిది ఈయనకే యాస్కముని యనిపేరు స్వాహా – శబ్దమున కనేకార్థములు చూపెను ఇటవానిని చూపుదుము

సు ఆహేతీ వా – ఎల్లవేళల సర్వులకు మేలై, ఇంపైన కల్యాణకరమైన ప్రియవచనము నుచ్చరింపవలెను భిన్నవచనము వెడలరాదు స్వావాగా

హేతీవా - తమ తమ జ్ఞాన మధ్యమున స్ఫురించుచుండు, స్వకీయవాక్యమునే మనుష్యులు వాగింద్రియముతో వచింపవలెను తద్విరుద్ధము తగదు స్వం ప్రాహేతీవా - స్వకీయ పదార్థములనే స్వత్వములని చెప్పవలెను

అన్యముపట్ల కాదు అనగా ధర్మ సమ్మతమైన యత్నమున పదార్థమెంత తమకు ప్రాప్తించునో, దాననే తృప్తికలుగువలెను స్వాహుతం -సుగంధ ద్రవ్యముల చక్కగ సవరించి, దినప్రతిదినము హోమము సలుపవలెను మిధ్యావాదము విడచిపెట్టి, నిరంతరము సత్య మునే సముచ్చరింపవలయునని సయితము స్వాహా -శబ్దము నిర్ణయించు చున్నది.

**యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః**
**బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయ స్వాయ చారణాయ ॥**

ఈ వేదావాణి బ్రాహ్మణులకు వలెనే క్షత్రియులకు, క్షతియుల కెట్టట్ల వైశ్యులకు, శూద్రులకు, తమ తమ పుత్రులకు, భృత్యులకుఅతిశూద్రులకు సైతము సమానముగ వర్తించును ఇది శుక్ల యజార్వేదము నందు కలదు

**శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్ ।**
**క్షత్రియాజ్జాతమేవం తు విద్యాద్వైశ్యాత్తథైవ చ ॥ (మనుస్మృతి)**

ఏ వర్ణమునకు తగినగుణముండునో, ఆ వర్ణమున కతడుచెంది, తదధికారమునుకూడా పొందుచున్నాడు ఇట్లు బ్రాహ్మణుడు శూద్రుడు, శూద్రుడు బ్రాహ్మణుడు కాగలరు

**ఆపస్తంబ సూత్రము**

**ధర్మచర్యయా జఘన్యో వర్ణః పూర్వం**
**పూర్వం వర్ణమాపద్యతే జాతి పరివృత్తౌ ।**
**అధర్మచర్యయా పూర్వో వర్ణో జఘన్యం**
**జఘన్యం వర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ ॥**

శూద్రుడు సత్యధర్మాచరణమువలన క్షత్రియు, వైశ్యబ్రాహ్మణ

వర్ణములందుపవిష్టు డగుచున్నాడు ఆయా వర్ణముల సమస్తాధికారము లతని కుండును పూర్వము బ్రాహ్మణ వర్ణస్థుడైనవా డధర్మాచరణము చేత శూద్రవర్ణమున పరిగణించబడును క్రియాపరివర్తన విధిచేత, ధర్మాచరణ ముత్తమవర్ణమున నిలుపును జాతి, పరివర్తనముతో కూడినది

**రవిర్వాయుర్యథా వృష్టిః లోకానాం హితకారణమ్ ।**
**తథా భవ న్తి వేదాశ్చ సర్వేషాం మోక్షసిద్ధయే ॥ (బ్రహ్మవిద్య)**

సూర్యుడు,వాయువు, అగ్ని,జలము, భూమి, ఆకాశము ఈ పంచభూ తములు సమస్త మానవులయొక్క దేహ సుఖమునకు ఎట్లు ఏర్పడియున్నవో, ఆలాగున వేదములున్నూ సమస్త మానవులయొక్క ఆత్మసుఖముకొఱకు అనగా మోక్షముకొఱకు సమానముగానే ఏర్పడి యున్నవి.

**ఏక వర్ణమిదం పూర్ణం విశ్వమాసీద్యుధిష్ఠిర ।**
**కర్మక్రియా విశేషేణ చాతుర్వర్ణ్యం ప్రతిష్ఠితమ్ ॥ (మహాభారతము).**

ఓ ధర్మరాజా! మొట్టమొదట ఆర్యజాతి ఒకటిమాత్రమే యుండెను తరువాత సత్త్వ రజోమిశ్రతమో గుణములచే చాతుర్వర్ణ్యము ఏర్పడెను

**చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః ।**
**తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్ ॥ (గీత)**

బ్రహ్మ, క్షత్రియ, వైశ్య శూద్రాది వర్ణచతుష్టయము సత్త్వరజోమిశ్ర తమో గుణములయొక్కయు, తపస్స్వాధ్యాయ శమోదమ అసత్యహింసాది కర్మము లయొక్కయు విభాగముచేత సృజింపబడినది అటువంటి సృష్టికి నేను కర్తను కాని వేరువిధముగా నన్ను కర్తనుకాని వానినిగాను, నాశము లేనివానినిగాను తెలిసికొనుము

**శూద్రోఽపి శీలసంపన్నో గుణవాన్ బ్రాహ్మణో భవేత్ ।**
**బ్రాహ్మణోఽపి క్రియాహీనః శూద్రాత్ప్రత్యవరో భవేత్ ॥**

**(భాగవతము).**

శూద్రజన్మమందు జన్మించినవాడైనను, శమదమాది సద్గుణ సంపన్నుడై యుండినచో, వాడు బ్రాహ్మణుడే బ్రాహ్మణకులమందు బుట్టినవాడైనను, సదాచార సద్గుణ దూరుడైనచో శూద్రునికన్న నీచుడని తలంపవలయును

**జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః ।**
**వేదపారాత్తు విప్రస్స్యాత్ బ్రహ్మజ్ఞానాత్తు బ్రాహ్మణః ॥**

ఎవడుగాని జననముచే శూద్రుడును, ఆత్మసంస్కారాది కర్మముచే ద్విజుడును, వేదాధ్యయనముచే విప్రుడును బ్రహ్మజ్ఞానము కలుగునప్పుడు బ్రాహ్మణుడును అగుచున్నాడు మానవులందఱున్ను శైశవావస్థలో శుచి, ఆచార సంస్కారము లేనందుచే శూద్రులని చెప్పడమైనది మఱల సంస్కార, వేదాధ్యయన, ఆత్మజ్ఞానములచే బ్రాహ్మణత్వము నొందుచున్నారు ఇట్టి సంస్కారముండిన ఈ మానవులందఱు ఎంతో ఉచ్ఛస్థితిలోనికి రావలసినవారలుగా నుండిరి అట్టి సంస్కారము చేయువారు లేనందుచే ఇంతదీనావస్థ కలిగెను

**జ్ఞానయజ్ఞోడుపేనైవ బ్రాహ్మణోవాஉన్త్యజోஉపి వా ।**
**సంసారసాగరం తీర్త్వా ముక్తి పారం హి గచ్ఛతి ॥**

ఏలాగున నావచేత బ్రాహ్మణుడుగాని, అంత్యజుడుగాని, సాగరమును దాటి అవలి ఒడ్డు చేరుచున్నారో, ఆలాగున ఆత్మజ్ఞానమనెడు ఓడలో బ్రాహ్మణుడుగాని, అంత్యజుడుగాని ప్రయాణముజేసి సంసారసాగరమును తరించి మోక్షమనెడు దరిని జేరగలుగును

# పరోపకారలక్షణము

**పిబన్తి నద్యస్స్వయమేవ నామ్భః**
**స్వయం న ఖాదన్తి ఫలాని వృక్షాః ।**

**నాదన్తి సస్యాని చ వారివాహాః**
**పరోపకారాయ సతాం విభూతయః ॥**

నదులు జలమును వహించుకొనిపోయినను పానము చేయుటలేదు వృక్షముఫల పుష్పములను వహించుచున్నప్పటికిన్ని అనుభవించుటలేదు మేఘములు వర్షములను వహించి జలమును వర్షించుచున్నప్పటికిని క్షేత్రఫలమును తినుటలేదు ఆలాగుననే మహాత్ముల విద్యాధనము పరోపకారముకొఱకే అగుచున్నది

మనుష్యులలో మూడు తరగతులు గలవారున్నారు 1 దేవ మనుష్యులు, 2 మనుష్యమనుష్యులు, 3 అసుర మనుష్యులు లేక పశుజన్మ గలవారు దేవమనుష్యుడు తన సకలమున్నూ పరోపకారముకొఱకే వినియోగపరచును అందువల్లనే అట్టివారిని దేవతలవలె పూజింపుదురు రెండవవాడు ఒక్కరికి ద్రోహమున్ను, ఉపకారమున్నూ కలుగ జేయడు ఉండేదానిలో కొంచము మాత్రము పరోపకారము చేయును మూడవవాడు ఒకరికుపకారము చేయక పోవుటయేగాక, అపకారమే చేయుచుండును. ఇట్టి వారిని దైత్యరాక్షస, మృగవర్గములలో చేర్చుడమైనది శ్రీబుద్ధదేవుడు, శ్రీఏసుక్రీస్తు, శ్రీశంకరాచార్య, రామానుజ, మధ్వాచార్య ప్రభృతులు, గాంధీగారున్నూ దేవమనుష్య శ్రేణిలో చేరినవారు కావుననే అట్టివారలను దేవతలవలె పూజింపుదురు



**అమరకోశము – గురుబాలప్రబోధిక**

## సన్న్యాసి లక్షణము

సమ్యక్ న్యాసః=సన్న్యాసః, బాగుగ త్యజించుట, లెస్సగా సమస్తమును త్యజించువాడు సన్న్యాసి యగును బాగుగ ఉంచుట. పరమాత్మయందు మనస్సును బాగుగ నుంచువాడు సన్న్యాసి యగును

భిక్షుః పరివ్రాట్ కర్మన్దీ పారాశర్యపి మస్కరీ ॥

1 భిక్షతే ఇతి భిక్షుః = భిక్ష - భిక్షాయాం = భిక్షాన్నముచే జీవించువాడు

2 పరిత్యజ్య సర్వం వ్రజతీతి పరివ్రాట్ = వ్రజ - గతౌ, అన్నిటిని పరిత్యజించి పోవువాడు

3 కర్మందబుషిప్రోక్త మాత్రమధీత ఇతి కర్మన్దీ = కర్మందుడను బుషి చెప్పిన సూత్రముల నధ్యయనము చేయువాడు

4 పారాశర్యప్రోక్తసూత్రమధీతే పారాశరీ = వేదవ్యాసమహర్షులవారు చెప్పిన సూత్రముల నధ్యయనము చేయువాడు

5 మస్కరో వేణుదండః సోఽస్యాస్తీతి మస్కరీ = మస్కరమనగా వెదురుగడ ఇదిగలవాడు (మాకరణశీలః కామ్యకర్మ ప్రతిషేధపరో వా మస్కరీ) కామ్యకర్మములను ప్రతిషేధించు స్వభావము గలవాడు అనగా దండిసన్యాసి ఇవి ఐదు సన్న్యాసిపేర్లు

పరివ్రాట్ - అని సన్యాసికి పేరుగలదు సమస్తమును పరిత్యజించి, లోకములో ధర్మమును బోధించి, తిరుగువాడని అర్థమ

1 తపోఽస్యాస్తీతి తపస్వీ = తపస్సుగలవాడు తాపసః

2. పరంబ్రహ్మజ్ఞానం కాంక్షత ఇతి పారికాంక్షీ = పరమనగా పరబ్రహ్మజ్ఞానము దానిని గోరువాడు ఇవి తపస్సుగలవాని పేళ్లు

1 వాచం నియచ్ఛతీతి వాచంయమః = యమ ఉపరమే = వాక్కును నిలుపువాడు

2 మన్యతే ఇతి మునిః = మన = జ్ఞానే, జ్ఞానముగలవాడు, ఇవి మౌనవ్రతముగలవాని పేర్లు

ఓమ్ తత్ సత్





# మంగళమ్

ఓమ్ గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్ ।
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః ॥

ఓమ్ హరలీలావతారాయ శంకరాయ వరౌజసే ।
కైవల్యకలనాకల్ప తరవే గురవే నమః ॥

ఓమ్ కృష్ణద్వైపాయనం వ్యాసం సర్వలోకహితే రతమ్ ।
వేదాబ్జభాస్కరం వందే శమాదినిలయం మునిమ్ ॥

ఓమ్ బ్రహ్మణే మూర్తిమతే శ్రుతానాం శుద్ధి హేతవే ।
నారాయణయతీంద్రాయ తస్మై శ్రీగురవే నమః ॥

ఓమ్ నమశ్శ్రీ వేంకటేశాయ శుద్ధజ్ఞాన స్వరూపిణే ।
వాసుదేవాయ శాంతాయ శ్రీనివాసాయ మంగమ్ ॥

## 1. కర్మనిర్ణయము

మోక్షేచ్ఛ గలవారు తమకు గలుగు సుఖదుఃఖాదులయందు మోదఖేదములను జెందక అవి కర్మాధీనులమని తలంచి మలిన వాసనావశమై విషయములతోగూడి ప్రవర్తించెడు మనస్సును జ్ఞానవైరాగ్యములచే వానినుండి మరలించి పరమాత్మధ్యానమందుగాని, లేక భగవత్ చరణార విందములయందుగాని లేక సద్గురు స్వరూప ధ్యానమందుగాని నిలుప వలెను కర్మాధీనములని తలంచి ఇంద్రియాది విషయములకు లోబడినవారు కోటిజన్మ లెత్తినప్పటికిని బహుదుఃఖ కరమైన జనన మరణ ప్రవాహము నుండి శాశ్వత సుఖకరమైన మోక్షమనెడి దరిని జేరి జన్మరాహిత్య మను పదవిని బొంద నేరరు

అనగా కర్మమునకు లోబడకూడదు కర్మ శబ్దమునకు మాయ, అవిద్య, అజ్ఞానము, వాసన, వృత్తి, మనస్సు – మొదలైన పేర్లుగలవు కర్మము యొక్క గతి అతిసూక్ష్మము దానియొక్క రహస్యమేమి యన వర్తమానకాల మందు జరుగు సుఖముగాని, దుఃఖముగాని, కలిగినను ప్రారబ్ధకర్మముచే కలిగినదని తలచుకొని దానికి లోబడి యుండవలెను (అనగా కర్మమున కధీనముగా నుండవలెను) కాని ఇప్పుడు చేయు కర్మముమాత్రము తన కధీనముగా నుండవలెను అనగా, చెడువిషయములలో సంచరించెడి మనస్సును అనుగమింపగూడదు ఇది ప్రవృత్తి మార్గస్థులకు కష్టముగా తోచినను, నివృత్తిమార్గస్థులలో జితేంద్రియులగు ధీరలకు కష్టము కానేరదు

ఎట్లన? జీవులు సంగ్రహముగా చెప్పునపుడు ప్రవృత్తి మార్గస్థులనియు, నివృత్తిమార్గస్థులనియు ఇరుతెగలు ప్రవృత్తిమార్గస్థులు విషయ భోగాభిలాష గలవారగుటచే ఆ విసయవాసన నశించెడి పర్యంతము జనన మరణ రూపమగు సంసారచక్రమున తిరుగుచుందురు నివృత్తిమార్గస్థులు విషయవాసనారహితు లగుటచే జననమరణ రహితమగు శాశ్వతమోక్షమును అతిత్వరలో పొందుదురు ఎట్లన? ఒక నదీప్రవాహమునకు లోబడియుండు కొయ్యలు వగైరా అన్ని వస్తువులను ఆ నదీప్రవాహము ఏలాగున కొట్టుకొని పోయి సముద్రమునందు చేర్చునో, ఆలాగుననే అనేక జన్మములనుండి వచ్చుచున్న విషయవాసన యను నదిలో మనస్సనెడి కొయ్యననుసరించినచో జననమరణ రూపమగు దుఃఖ సాగరమే గతి నదీప్రవాహమునకు వ్యతిరేకముగా ( ఎదురుగా) పడవను గాని, బోటునుగాని నడుపుకొని నిశ్చితస్థలమున జనులు చేరునట్లు జన్మాంతర విషయవాసననుండి వివేక జ్ఞానశక్తిచే మనస్సును మరలించి పరమాత్మ చరణారవింద ధ్యానమగు శాశ్వత సుఖమైన గమ్యస్థానమును ముముక్షువు చేరవలెను

పడవనేలాగున తెడ్లచేతను, చుక్కానిచేతను, జలప్రవాహమును తప్పించి తీసికొనిపోవుదురురో ఆలాగుననే వైరాగ్య ధ్యాన ములను తెడ్లున్ను జ్ఞాననిష్ఠ యను చుక్కానియున్ను నిశ్చయముగా ముముక్షువుల కుండ

వలయును కర్మములనగా, జ్ఞానమార్గమగు మోక్షమునకు ప్రతిబంధములు ఇవి పాపకర్మములు పుణ్యకర్మములు మోక్షమున కనుకూలము కలుగును పాపకర్మబలము మోక్షమార్గమున ప్రవేశించెడి బుద్ధి నడ్డగించి విషయములలో త్రిప్పును ఈ సంగతిని గ్రహించి కర్మము నతిక్రమించుటకై తగు ప్రయత్నము అవశ్యముగా చేయవలయును

కర్మమనగా ప్రతిబంధము ఇది స్థూల ప్రతిబంధమనియు, సూక్ష్మ ప్రతిబంధమనియు ఇరుతెగలు స్థూల ప్రతిబంధమనగా రైలుబండి మార్గ మధ్యమున తటస్థించెడి నదులు, పర్వతములు, మొదలైనవి రైలుమార్గమున కడ్డముగా వచ్చునప్పుడు తొలిచి పర్వతములను తొలగించునట్లున్ను, నదులను వంతెనలచే దాటునట్లును, మోక్షమార్గమున ప్రయాణము చేయువారిని కర్మము ప్రతిబంధించినచో, వైరాగ్యనిష్ఠయను తొలుచుట చేతను, ఇంద్రియ సంయమమను సేతువుచేతను దాటవలెను ఇది మందమతులై విషయాసక్తు లైనవారికి సాధ్యము కాదు

మనుజాలలో సంక్షిప్తముగా చెప్పునప్పుడు మూడు తరగతుల వారున్నారు 1 మృగమనుజాడు, 2 మనుజమనుజాడు, 3 దేవమనుజాడు ఈ అవస్థాభేదములు అందరికిన్ని గలవు మనుజాడు మృగావస్థయందుండు కాలమున కర్మమును అనుభవించవలయునేగాని, దానిని నివర్తించుటకు మనుజాలకు సాధ్యముగాదను బుద్ధి దృఢముగా ఏర్పడి కర్మనివృత్తికొఱకు ఏలాటి యుపాయమున్ను యోచింపడు వానికి ఎన్ని జ్ఞానములు మహాత్మ్యలు చెప్పినను మనస్సున పట్టవు మందమతులకొఱకు కర్మ మనుభవించవలెనని శాస్త్రమెచ్చటనో చెప్పియుండినచో, ఆ శాస్త్రములను వెతకికొని ఉదాహరణముగా సాక్ష్యమిచ్చును ఇది వానియొక్క తప్పు గాదు అది వానియొక్క అవస్థాభేదము జ్వరముచే జిహ్వా చెడిన వానికి క్షీరాన్న మిచ్చిన ప్రత్యక్షముగా చేదుగానే కనుపించును వీడు దేహబుద్ధి గలవాడు, కేవలము మృగ ప్రాయతయందుండు మనుజాడు

రెండవవాడగు మనుజుడు స్వబుద్ధిచే ఈలాటి విచారము చేయును ఏమి? కర్మము జయించుటకు గదా! మానవజన్మమువచ్చినది కర్మము జయింపగూడనిదని విధి యుండినచో ఈశ్వర, ధ్యానము, యోగము, జపము మొదలగు తరణోపాయములగు పుణ్యకార్యము లేల ఏర్పడ వలయును? మఱియు పాపకర్మముచే రోగము గలుగు చున్నది. ఆ కర్మము నతిక్రమింప సాధ్యము కానిచో, ఆయుర్వేదమగు వైద్యశాస్త్రమేల ఏర్పడ వలయును? మఱియు మనోజయము కొఱకు గదా యోగశాస్త్రమేర్పడి నది? కావున కర్మము నతిక్రమింప సాధ్యము కానిచో ఈ శాస్త్ర ములు నిష్ప్రయోజనము గదా! కర్మమును జయించుటకు సాధ్యము కానిచో సముద్రము ఓడచే దాటుటకు వీలుండదు అట్లు కనబడుట లేదు కనుక కర్మమను సముద్రమును జ్ఞానమనెడి ఓడచే దాటవచ్చును కనుక కర్మము నతిక్రమించి ముక్తినొందుటకు మానవజన్మ మెత్తినదని వాని హృదయమున తనంతటనే విచారము గలుగుచుండును. ఈలాటి పవిత్రవిచారము గలుగు నప్పుడు మృగజన్మమునుండి మానవ జన్మములో ప్రవేశించినవాడగును

కర్మము జయింప సాధ్యము కానిచో మార్కండేయ మహర్షి ఏలాగున పదునాఱు వత్సరముల వయస్సున ఈశ్వరునిగూర్చి తపస్సుచేసి చిరాయు స్సుగల వాడయ్యెను? ఈ విషయమై శ్రీశంకరభగవత్పాదాచార్యులు శివానం దలహరిలో ఇట్లు చెప్పిరి అదేమన? కర్మమును లిఖించెడి బ్రహ్మదేవుని శిర స్సును ఈశ్వరుడు ద్రుంచి పాఱవేసినపుడు, బ్రహ్మలిఖితమగు కర్మమును మార్పుచేయుటకు కరుణానిధియగు నా ఈశ్వరునకు అసాధ్యమా? కనుక పరమదయాళువగు ఈశ్వరునియందు భక్తి యుండినచో, కర్మము నిశ్చ యముగా తొలగిపోవును

ఇక మూడవవాడు దేవమానవుడు. వీనికి మనఃపరిశుద్ధత గలిగి జ్ఞానశక్తి ఎక్కువగా నుండుటచే తాను జననమరణములు లేనివాడననియు, కర్త కానప్పుడు కర్మ మెచ్చటనుండి వచ్చుననియు, తాను శుద్ధుడననియు, ముక్తుడననియు, నిత్యుడననియు, స్వయంజ్ఞానమే గుణముగ గలవాడ

ననియు దృఢాపరోక్షజ్ఞాన ముండును వీడు కర్మిలగు జనులు కర్మమని చెప్పునప్పుడు ఆహా! ఎంత ఆశ్చర్యము! త్రాడును చూచి సర్పమని భయప డుచున్నారే! శుద్ధబోధ స్వరూపమగు ఆత్మయైన తన్ను తెలియక అయ్యో! బద్ధులని భ్రమించుచున్నారు! అని లోకులను చూచి చింతించును కనుక వివేకజ్ఞానము లేనివారుమాత్రమే కర్మపాశమున తగిలి దుఃఖింతురు.

పై నిజెప్పిన మూడవస్థలున్ను తమకు తామే కలుగును శాస్త్రము చదువ నక్క అలేదు ఒకరు చెప్పినది కూడ వినపని లేదు పరిపక్వ కాలముమాత్రము గలుగవలెను ఎట్లన స్త్రీ పురుషులకు యౌవన కాలారంభమున రతిక్రీడాది విషయోద్రేకమనోవృత్తులు తెలిసికొనుటకై శాస్త్రమున్ను, గురూప దేశమున్ను అవసరము లేకయే యెట్లు విషయోద్రేక మనోవృత్తి తనకుతానే గోచరమగునో అటు పైజెప్పిన మూడవస్థలున్ను కాలపరిపక్వత ననుసరించి తమకుతామే గోచరమగును అనగా బ్రహ్మనిష్ఠ చేయుచు రాగా రాగా హృదయమున సమస్త వేదరహస్యములును ప్రకాశించును

అనగా బ్రహ్మ శివోఽహం, సోఽహం- అని జపము చేయకయే కాలము పరిపక్వమగు నప్పుడు, వృక్షము పుష్పించునట్లు అదే నీతో శుద్ధుడనియు, ముక్తుడనియు, స్వయంప్రకాశుడనియు చెప్పును పాడుబావి యందుండు పూడు(బురద) తీసినప్పుడు శుద్ధ జలముత్పత్తి యగునట్లు హృదయ మందుండు అనాది విషయవాసనలను వివేకవైరాగ్యము లను బుద్ధిచే పాఱద్రోలునప్పుడు జ్ఞానానందము స్వయముగా గలుగును దీనికి శ్రీవాల్మీకిమహర్షియే దృష్టాంతము ఆయన ఒక బోయవాడై యుండియు, మనస్సును ఆత్మతో సంఘర్షణము చేయుటచే ప్రవహించిన అమృతధారలు శ్రీమద్రామాయణ మున్ను, శ్రీజ్ఞానవాసిష్ఠమున్ను మనము చెప్పు సూర్యచంద్రులవలె లోకపావనము చేయు పవిత్ర గంధములైనవి

**శుభాశుభాభ్యాం మార్గాభ్యాం వహంతీ వాసనాసరిత్ ।**

**పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభే పథి ॥**

అనేక జన్మములనుండి వచ్చుచుండు విషయవాసన యనునది, శుద్ధమార్గ మనియు, అశుద్ధమార్గమనియు రెండుత్రోవలుగా పాఱు చుండును కావున ముముక్షువు లైనవారు తమ హృదయమందు స్ఫురించు మనోవృత్తి సన్మార్గమా? లేక అసన్మార్గమా? అని బుద్ధిచే గమనించి కనిపెట్టి చెడుమా ర్గవశమై మనస్సు పోవుచుండినచో, అభ్యాసధ్యాన యోగములచే మనస్సును చెడుమార్గము నుండి త్రిప్పి, శుద్ధవాసనయగు మోక్షమార్గములో ప్రవేశపెట్ట వలెను లేనిచో నదియందు పడియుండు కొయ్యలు సముద్రమునకుపోయి చేరునట్లు సంసారసాగరమున పోయి ప్రవేశించును

**వాసనా ద్వివిధా ప్రోక్తా శుద్ధా చ మలినా తథా ।**
**మలినా జన్మహేతుస్స్యాత్ శుద్ధా జన్మవినాశినీ ॥**

సమస్తమనుజాలకును, మనోవృత్తులు రెండు తరగతులు ఒకటి సంసారవిషయభోగముతో గూడిన మలినవాసన రెండవది మోక్షోపాయము కోరు పరిశుద్ధవాసన యనబడును మలినవాసనావశమై పోయెడి మనస్సు జననమరణ రూపమగు సంసారమునకు కారణమగును మోక్షోపాయ ధ్యాననిష్ఠా, వేదాంత శ్రవణ, మనన, నిదిధ్యాసనావశమై పోయెడి మనస్సు ముక్తికి కారణమై మోక్షముననుండి సుఖించును అని శ్రీ వసిష్ఠభగవానులు శ్రీరామచంద్రుని కుపదేశించిరి

**యస్త్వవిజ్ఞానవాన్ భవత్యమనస్కస్సదాఽశుచిః ।**
**న స తత్పదమాప్నోతి సంసారం చాధిగచ్ఛతి ॥**

ఎవడు వివేకజ్ఞాన శూన్యుడై మనసును విషయవాసన నుండి మరలించి, పరమాత్మ ధ్యాననిష్ఠయందు నిలుపజాలక మహాఅశుచియగు విషయమల మను గుంటలోబడి ఊరబందివలె పొరలాడునో, వాడు మనోనిరోధముచే పొందదగిన పరమపదమగు ముక్తినొంద జాలనివాడై, జననమరణ రూప మగు దుఃఖసాగరమున ప్రవేశించి బహువిధములగు

కష్టముల పాలగును

**యస్తు విజ్ఞానవాన్ భవతి సమనస్కస్సదా శుచిః ।**
**స తు తత్పదమాప్నోతి యస్మాద్భూయో న జాయతే ॥**

ఎవడు వివేకజ్ఞానము గలవాడై మనసును సాంసారిక విషయముల నుండి వశీకరించి పరమాత్మ ధ్యానమున నిలిపి సర్వదా శుద్ధమగు ఆచారనిష్ఠ గలవాడై, సదా బ్రహ్మచింతన చేయుచుండునో, వాడు శాశ్వతసుఖమగు మోక్షమునొంది మరల జననమరణరూప దుఃఖసాగరమగు ఈ సంసారమునకు రానేరాడు అనగా నిత్యముక్తు డగును అని కఠోపనిషత్తు

**యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరమ్ ।**
**తత స్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్ ॥**

అతి చంచలమున్ను, అస్థిరమున్ను అగు మనస్సు ఆత్మసుఖమునుండి బహిర్ముఖముగా పోయి యింద్రియ విషయములగు ఏయే విషయములలో సంచరించుచుండునో, ఆయావృత్తినుండి ధ్యానబలముచే వశీకరించి పరమాత్మ ధ్యానమున స్థిరముగా నిలిపి అభ్యసింపవలెను

**అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।**
**వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః ॥**

అభ్యాస యోగధ్యాన వైరాగ్యములచే మనస్సును స్వాధీనము చేసికొనుటకు సాధ్యముకాని వానికి ధ్యానయోగాభ్యాసమువలన పొందదగిన బ్రహ్మ నిష్ఠ సిద్ధింపనే సిద్ధింపదని నాయొక్క (శ్రీకృష్ణస్వామియొక్క) ముఖ్యాభిప్రాయము కాని ప్రతిదినము ధ్యానయోగాది వైరాగ్యములతో గూడి నిష్ఠచేయువాడు, మనసును స్వాధీనము చేసికొని పరబ్రహ్మధ్యానమున నిశ్చల బుద్ధిగలిగి జీవన్ముక్తుడగును అని శ్రీకృష్ణస్వామి తనయొక్కముఖ్యాభిప్రాయమును వెల్లడిచేసెను

**ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।**

**తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి ॥**

ఎవనియొక్క మనస్సు విషయవాసనలతో గూడి ఇంద్రియములకు లోబడి తిరుగుచుండునో, వానియొక్క జ్ఞానము సముద్రములోనుండు పడవను గొప్పగాలి నియతస్థానము చేరనీయక, అలలచే ముంచివేయునట్లు ఆత్మను నాశనము చేయును కనుక విషయవాసనలనుండి మనస్సును అవశ్యముగా త్రిప్పవలెను లేనిచో సంసారసాగరమున మునిగిపోవునని శ్రీవాసుదేవు డుపదేశించెను (భగవద్గీత) కావున బుద్ధిమంతుడైనచో నింతేచాలును

**వేదశాస్త్రంబులు వివరించి బుధులచే జదివింపవచ్చు దా జదువవచ్చు**
**యజ్ఞదానతపంబు లధికారిజనముచే జేయింపవచ్చు చ దాజేయవచ్చు**
**నిలలోన గలతీర్థముల కేగ నన్యుల బోధింపవచ్చుదా బోవవచ్చు**
**నష్టాంగ యోగవిద్యల నార్యులకు నుపదేశింపవచ్చు సాధింపవచ్చు**

**గాని యెవ్వారికైన విజ్ఞానయోగ**
**గతిని దేహేంద్రియము లరికట్టి మనము**
**నాగి యంతర్ముఖముజేసి యనవరతము**
**నిశ్చలసమాధి నిష్ఠచే నిలువరాదు.**

## ౨. యుగనిర్ణయము.

కృత, త్రేతా, ద్వాపర కలియుగములను నాల్గు యుగములలోను సర్వదా నాలుగు నాలుగు యుగము లున్నవి వాని భేదగతులు కాలదేశముల ననుస రించి కాదు సత్య, దాన, తపముల ననుసరించి యున్నవి అనగా అహింసా, సత్య, దాన, తపో, జ్ఞాన, విజ్ఞానములలో గూడి కృతకృత్యులై సదా బ్రహ్మ నిష్ఠయుం దున్నవారు ఏకాల మందుండినను వారు కృతయుగమునం దున్న వారే పైనుదాహరించిన అహింసాది గుణములతో మూడు భాగములు చేరి యజ్ఞాదులయందు అభిలాషగలవారు త్రేతాయుగమం దున్నవారు. అహిం సాది గుణములలో రెండు భాగములు చేరి ధర్మాధర్మ మిశ్రగుణములు గలిగి అర్చన పూజాదులయందు

ఆసక్తిగలవారు ద్వాపరయుగ మందున్న వారే, దైవభక్తి, జీవకారుణ్య, ఆధ్యాత్మజ్ఞానశూన్యులై, దేహాత్మబుద్ధితో గూడి కలుషహృదయులై వర్తించువారు సదా కలియుగ మందున్నవారు ఇదియే యుగములయొక్క రహస్యము

యుగభేదములచే మనోవృత్తులకు భేదము గలుగవలసి యుండినచో, కృతయుగమున హిరణ్యాక్ష, హిరణ్యకశిపులును, ప్రహ్లాదుండును ఉండిరి కృతయుగ మాహాత్మ్యము హిరణ్యకశిపుని హృదయమున ప్రకాశించి యుండినచో ఏల క్రూరకృత్యములు చేయవలయును? కనుక యుగ, బేదములు మనఃపరిపక్వభేదములే కాని కాలభేదము కాదు

హిరణ్యకశిపుడు కృతయుగ మందుండినవాడైనను, హృదయము విషయాసక్తిచే కల్మషమై యుండుటచే కలియుగ స్వభావమే కలిగినది శ్రీ ప్రహ్లాదుడుమాత్రము నిత్యనిష్ఠా భగవద్భక్తులతో గూడి యుండుటచే నిజముగా కృతయుగమందుండినవాడే ఈలాగున త్రేతాయుగమున రావణకుంభకర్ణాదు లుండినను రాగోద్రేకముచే కల్మషహృదయము గలవారగుటచే కలియుగస్వభావమే యుండెను శ్రీ విభీషణుడు ధర్మనిష్ఠుడును భగవద్భక్తి గలవాడగుటచే త్రేతాయుగమం దుండినను కృతయుగమందున్న వాడే ఆలాగుననే దుర్యోధనాదులు ద్వాపర యుగమందుండిన వారైనను, రాగద్వేషలోభములకు లోబడి స్వదేహాభిమానులును కల్మషహృదయులు నగుటచే కలిగియుమం దుండువారే ఆ ద్వాపరయుగముననే ధర్మరాజాదులు సత్యనిష్ఠులును, భగవద్భక్తి గలవారు నగుటచే పరిశుద్ధ హృదయము గలవారే, కృతకృత్యు లైనందున కృతయుగమం దుండువారే

ఈ లాగుననే కలియుగమున జన్మించిన వారిలో శ్రీబుద్ధదేవులు, శ్రీశంకరాచార్యులు, శ్రీరామానుజాచార్యులు, శ్రీమధ్వాచార్యులు, శ్రీ చైతన్యస్వాములు, శ్రీగురునానక్కువారు, శ్రీక్రీస్తుదేవులు మొదలు గాగల యెందఱో మహాత్ములు జన్మించిరి వీరిని కలియుగమేమైన బాధించెనా?

కనుక, ఈదృష్టాంతములచే కలియుగముగాని, ద్వాపరయుగముగాని, త్రేతాయుగముగాని కృతయుగముగాని, వారివారి మనః పరిపక్వత ననుసరించి యుండును గాని మఱియొక విధముగా నుండునని తలంచుట విచారశూన్యము

శర్కర (చక్కెర) కృతయుగమందును మధురముగానే యున్నది ముసాంబరము కృతయుగమందును చేదుగానే యున్నది ముష్టికాయ అప్పుడున్ను, ఇప్పుడున్న, చేదుగాను, నిమ్మపండు కృతయుగమందును కలియుగమందును పులుపుగానే యున్నది సూర్యుడు అప్పుడున్ను, ఇప్పుడున్ను ఉష్ణముగాను, ఆలాగుననే చంద్రుడు శీతలముగానే యున్నాడు

కనుకనే శ్రీ మద్భాగవతమున పరీక్షిత్తు మహారాజుతో కలి వచ్చియుం డుటకు స్థలమడిగినపుడు ప్రాణిహింసకుని యందును, సురాపాయి యందును, వ్యభిచారిణి యగు స్త్రీయందును, అసత్యములాడు వానియం దును, జూదమాడు వానియందును, దైవభక్తి లేనివానియందును నికృష్ట కృత్యములు చేయు వారియొద్దను ఉండుటకై యాజ్ఞాపించినట్లు కనబడు చున్నది

మఱియు భగవద్భక్తులును, జీవకారుణ్య పరులును, సత్య ధర్మనిష్ఠులు నగు వారి సమీపమునగూడ ప్రవేశింప గూడదని కలితో చెప్పినట్లు కనబడుచున్నది అమావాస్యరాత్రి కటికచీకటి లోకమంతయు నిండియుం డినను, ఒకయింటిలో చిన్నదీప మొకటి వెలిగించి యుండినచో, ఆ చీకటి ఆయింటిలోపల ప్రవేశింప సాధ్యము గానట్లు కలిగాని, మాయగాని, అజ్ఞా నముగాని, లోకమున నిండియుండినను యెవరి హృదయమున పరమా త్మధ్యానమను దీపము ప్రజ్వలించియుండునో వారిహృదయములో కలిగాని, మాయగాని ఇతరములగు నేయొక్క దుష్టవృత్తులు గాని ప్రవేశింపజాలవు

# ౩. వర్ణనిర్ణయము.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగు జాతులలో సర్వదా నాలుగువర్ణములు గలవారున్నారు అనగా జాతులనునవి వారివారి మనః పరిపక్వతారతమ్యములే గాని మఱియొకటి గాదు అనగా శుక్ల, శోణిత రూపమై, అపరిశుద్ధమై, అశాశ్వతమైన, పంచభూత సమ్మేళనమైన శరీరమును విచారించినచో దాని కొకజాతి లేదు ఆలాగుననే పరిశుద్ధమై సత్యజ్ఞానా నందములతో గూడి శాశ్వతమైన పరమాత్మకును జాతిలేదు మఱి వారివారి శమ, దమ, తప, శ్శౌచములను , సత్త్వ, రజస్తమోగుణములను అనుసరించి జాతిగలదు అనగా శమ, దమ, సత్య, జ్ఞాన, విజ్ఞానములతోగూడి, జన్మముచే బ్రహ్మజ్ఞానమందు నభిలాషగలవారై నితాంతాపార సర్వభూత దయాస్వరూపులై, సమస్త జీవరాసులయందును, సహోదర భావముతో గూడినవారై, సర్వసంగపరిత్యాగులై, సర్వదా బ్రహ్మనిష్ఠయుం దున్నవా రెవరైననువారు బ్రాహ్మణోత్తములే

శౌర్య, తేజఃపరాక్రమములతో స్వభావముగానే లోకసంరక్షణయం దభిలాష గలవారై, సత్య, ధర్మ, ప్రతిష్ఠల కొఱకు, స్వదేహత్యాగమునుగూడ చేయువారై, రాజ్యతంత్ర ప్రవర్తకులైనవారు ఏ కులమందు జన్మించిన వారైనను వారు క్షత్రియులే

దాన, ధర్మపరులై, గురు , దైవ, సాధు, సజ్జన సేవకులై కృషి వాణిజ్యాది క్రియలయం దభిలాషగలవారు ఏకులమం దున్నవారైనను వారు వైశ్యులే

సత్య, దాన, ధర్మములందు పూర్ణాసక్తి లేనివారై, శిశ్నోదరపరులై, స్వబుద్ధిచే జీవనోపాయము జరుపదగు మనోబలము లేనివారై, శౌచార హీనులై, మద్యమాంసాది భోజనప్రియులై సేవావృత్తిచే జీవించువారెవరైనను వారే శూద్రులు ఇవి సాధారణ ధర్మములు

ప్రారబ్ధకర్మవశముచే, ఏయే పనియందుండిన వారైనను బ్రహ్మ జ్ఞానముతోను, జీవకారుణ్యముతోను, దైవభక్తితోనుగూడి సత్యనిష్ఠులై ప్రకాశిం చుచున్నవారు బ్రాహ్మణులే ఇదియే వర్ణభేదములయొక్క రహస్యము అనగా బ్రహ్మజ్ఞానులే బ్రాహ్మణులు జ్ఞానహీనులు, దయా శూన్యులును, శౌచాచా రదూరులును, సత్యరహితులును అగువారెవరైనను వారే శూద్రులు

**శూద్రోఽపి శీలసంపన్నో గుణవాన్ బ్రాహ్మణో భవేత్ ।**
**బ్రాహ్మణోఽపి క్రియాహీనశ్శూద్రాత్ప్రత్యవరో భవేత్ ॥**

శూద్రకులమందు జన్మించినవాడైనను శాంత, శమ, దమాది సంపన్నుడైనచో వాడే బ్రాహ్మణుడు బ్రాహ్మణకులమం దుద్భవించిన వాడైనను, తపో, ధ్యాన, నిష్ఠాది బ్రహ్మవిచారము [illegible], శూద్రునికంటె హీనుడని శాస్త్ర సమ్మతము మహాభారతములో–

**సత్యం బ్రహ్మ తపో బ్రహ్మ బ్రహ్మ చేంద్రియనిగ్రహః ।**
**సర్వభూతదయా బ్రహ్మ ఏతద్బ్రాహ్మణ లక్షణమ్ ॥**

సత్యము చెప్పువాడు బ్రాహ్మణుడు తపస్సే బ్రాహ్మణత్వము జితేంద్రి యత్వమే బ్రాహ్మణత్వము సమస్త జీవరాసులయందును దయాస్వరూపుడై యుండువాడు బ్రాహ్మణుడు. ఈ పైనిజెప్పిన గుణములే బ్రాహ్మణుని లక్షణ ములు– అని యున్నది

**సత్యం నాస్తి తపో నాస్తి నాస్తి చేంద్రియనిగ్రహః ।**
**సర్వభూతదయా నాస్తి ఏతచ్చండాలలక్షణమ్ ॥**

సత్యము లేకుండుట, తపస్సు లేకుండుట , ఇంద్రియనిగ్రహము లేకుండుట, సర్వభూతములయందును దయ లేకుండుట, ఏది గలదో అదే చండాలుని లక్షణము

# 4. ఆశ్రమనిర్ణయము.

బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసములను నాలుగు ఆశ్రమములలో ఒక్కొక్క దానియందు సంతతము నాలుగు ఆశ్రమము లున్నవి వాని భేదాదులు, జటాముండనకాషాయ ధారణాదుల ననుసరించి గాదు యమ, నియమములు మొదలగు సాధనచతుష్టయ సంపత్తియగు సాధనముల ననుసరించియున్నవి అనగా అనాదియై అజ్ఞానాంధకారమైన శిఖాచ్ఛేదన మును, సత్త్వ, రజస్తమోగుణాతీతమను దండమును, పాత్రాపాత్ర భేదములే కయే పరమాత్మ సర్వత్ర గలడను కమండలమును, ఈషణత్రయ, వాసనా త్రయత్యాగమైన యజ్ఞోపవీత విసర్జనమును, అహంశబ్దార్థమైన జీవత్వము నశించి పరమైన పరమాత్మస్వరూపానుభవము గల పరమహంసస్థి ఏయాశ్రమములో గలిగి సర్వవాసనానాశమై, బుద్ధికి సాక్షియైయుండు స్థితి తటస్థించునో అదియే సన్న్యాసము

ఇంద్రియసంయమియై యేకాంతమగు హృదయ గుహయందు విరక్తియను ముక్తికాంతతో గూడ ప్రవేశించి, అధ్యాత్మజ్ఞానమైన జ్ఞానాగ్ని యందు మనోవృత్తులను సమిధలను, విషయవాసనయను ఆజ్యముతోను, సోహంభావనయను అజపామంత్రముతోను, సంతతము హోమము చేయువాడు వానప్రస్థుడే

ధర్మశాస్త్రముల ననుసరించి అధియజ్ఞములైన పంచ యజ్ఞముల తోను, ధర్మమునకు విరోధములేని కామముతోనుగూడి, దైవభక్తి, జీవకారుణ్యము, అధ్యాత్మనిష్ఠ, వేదాంతశాస్త్ర విచారముగలవారు గృహస్థులు

సద్గురుని సమీపించి మోక్షప్రదవేదాంతశాస్త్రాభ్యాసియై, ఇహపర సౌఖ్యమునకు కారణమగు వేదాధ్యయనమం దాసక్తుడైనగాని, లేక ప్రణవాది మంత్రజప సక్తుడై, కర్మముచేతను, మనస్సుచేతను, వాక్కుచేతను, బ్రహ్మ

చర్యనిష్ఠతో పరబ్రహ్మమునందు సంచారశీలుడై బ్రహ్మాకార వృత్తిగలిగి, సర్వ సాక్షిత్వమును పొందినచో అదే సన్న్యాసము వాసనాత్యాగము ఏయాశ్రమ మందైనను సంపూర్ణముగా గలుగనిచో అదే సంసారము

**మౌనా న్న మునిర్భవతి నారణ్యవసనాన్మునిః ।**
**సల్లక్షణం తు యో వేత్తా స మునిశ్రేష్ఠ ఉచ్యతే ॥**

మాటలను బందుచేసిన మాత్రముచే వాడు ముని కాడు సంసారము విడిచి అరణ్యమున నివసించు కారణముచే ఋషి కానేరడు మఱి యెవడు సత్తామాత్రమగు బ్రహ్మము నెఱింగియుండునో వాడెచ్చోటనుండినను మునిశ్రేష్ఠుడే

**ఏకమేవాద్వితీయం యద్గురోర్వాక్యేన నిశ్చితమ్ ।**
**ఏతదేకాంతమిత్యుక్తం న మఠో న వనాంతరమ్ ॥**

ఎవడు పరిశుద్ధాంతఃకరణుడై, బ్రహ్మనిష్ఠుడగు సద్గురువును ఆశ్ర యించి, వారి వాక్యములచేత నిశ్చయింపబడినదియు, శ్రవణ, మనన, నిదిధ్యాసనముల ద్వారా తెలిసికొనబడినదియు, ఏకము, అద్వితీయము అయినదియు అగుబ్రహ్మ మేదిగలదో అదే యేకాంతమని చెప్పబడినది అంతేగాని, మఠముగాని, వనాంతరముగాని కాదు బ్రహ్మనిష్ఠాదిధ్యాన తపస్సులు లేనివాడు మఠములోగాని, వనములోగాని యుండినను సంసా రమధ్యమం దున్నవాడే అని ఉపనిషద్వాణి సన్న్యాసం నిర్మలం జ్ఞానం సన్న్యా సమనగా మల, అజ్ఞాన, విక్షేప రహితమయిన స్వరూపజ్ఞానమే

**గుహాయాం గేహే వా బహిరపి వనేవాఽద్రిశిఖరే**
**జలే వా వహ్నౌ వా వసతు వసతేః కిం వద ఫలమ్ ।**
**సదా యస్యైవాంతఃకరణమపి శంభో తవ పదే**
**స్థితం చేద్యోగోఽసౌ స చ పరమయోగీ స చ సుఖీ ॥**

కొండగుహయందుండినను సరే, లేక తన యింటిలో నుండినను

సరే, లేక కాశ్యాది దూరదేశమందుగాని, నిర్జనస్థలమగు అరణ్యమందుగాని, పర్వతోపరిభాగమందుగాని, గంగాతీరమునందుగాని, పంచాగ్ని మధ్య మందు గాని, నివసించినమాత్రముచే గొప్ప ప్రయోజన మేమియును లేదు సంసారమం దుండినను సదా పరమేశ్వర ధ్యాననిష్ఠయందు మనస్సును లయపఱచినచో వాడే సన్న్యాసియు, వాడే యోగియు, వాడే పరమానంద పరమసుఖియునని ( ముక్తుడని) శివానందలహరి

# 5. జననమరణనిర్ణయము.

మోక్షమునకు అనేక జన్మములు జరుగవలయు ననుట శరీరపు మార్పులు గాదు అనగా పుట్టుట గిట్టుట గాదు శుద్ధాశుద్ధ సాత్త్వికాది జ్ఞానాజ్ఞానముల యొక్క త్యాజ్య స్వీకారములతోగూడి యున్నవి అనగా, జనన మరణాదులు స్థూలదేహ సంబంధమైనవి శుద్ధాశుద్ధవృత్తులు సూక్ష్మదేహ సంబంధములు, స్థూలదేహమునకు మార్పు వచ్చినప్పటికిని జీవునికి మార్పు లేదు ఒకనికి పదికవచములు(చొక్కాయలు) జీర్ణమై క్రొత్తక్రొత్త కవచములు, స్వీకరించిన ప్పటికిని ఏలాగున వానికి నాశము లేదో, ఆలాగుననే జీవదేహములయొక్క స్థితులును

మాయాసంబంధమైన రాగద్వేషాదుల నణచి, భక్తి, జ్ఞానవైరాగ్యాది సాధన చతుష్టయ సంపత్తిని సంపాదించి, ధ్యానమందు మనఃస్థిరత గలు గుటకు తగు ప్రయత్నము చేసినయెడల నొక జన్మములోనే అనేక జన్మములు గతించును ఈస్థితిని బడయక మనోవృత్తులకు ఏలాటిమార్పు లేనియెడల అనేక జననమరణాదులు జరిగినప్పటికిని అదే జన్మములోనే యుండును ఏలయనగా, ఒకడొకతరగతి యందు జదువవలసిన గ్రంథములు చదువక యుండినయెడల పదిసంవత్సరములైనను అదే తరగతిలోనే యుండును గదా!

మహాప్రజ్ఞాశీలురు అత్యంత శ్రద్ధాస్వభావముతో గూడి, ఒకసంవత్స

రములోనే నాలుగయిదు సంవత్సరములు చదువ వలసిన గ్రంథములు చదివి విజయము పొందుచున్నారు లేక ఒకడు గంగాస్నానమునకు పాదచారియైపో యినచో, సుమారు ఆఱుమాసములు పట్టును. రైలుబండిని ఆశ్రయించిన ఆఱుదినములుగూడ నవశ్యము లేదుగదా? దీని రహస్య మేమియన, హృద యమందుండు మాయావిషయములను విడిచి శమదమాదులగు జ్ఞానసం పత్తును పొందినదే జననమరణ మనంబడును అనగా హృదయమందుండు ప్రాపంచికమగు నొకవృత్తిని విడిచినచో అప్పుడే ఒక్క జన్మము పైకెక్కిన వాడగును ఆలాగున ఎన్ని దుర్గుణములను విడుచుటకు సాధ్యమగునో అన్ని జన్మములు అప్పుడే పైభాగమున కెక్కిన వాడగును

**యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।**
**తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥**

ఓ అర్జునా! ఏ సమయమున నీయొక్కబుద్ధి విషయమోహమను అజ్ఞాన మును దాటునో, అనగా ఎప్పుడు వివేకబుద్ధిచే హృదయ మందుండు అనాది యైన ప్రాపంచిక కాలుష్యమను దుర్వృత్తులను విడుచునో, ఆ సమయమున నీవు ఇంతవఱకు గురుముఖమునుండి వినిన వేదాంతార్థమును ఇంకమీద వినుటకై కోరికగల సమస్త వేదాంతవిషయములును గోచరమగును అనగా బుద్ధి యెప్పుడు ప్రకృతి నతిక్రమించునో, అప్పుడుమాత్రమే వేదాంత విషయము గోచరమగును విషయవాసనతోగూడి యుండునంత వఱకును, శ్రవణము యొక్కయు, మననముయొక్కయు అర్థము స్ఫురింపదు. బుద్ధి అంతర్ముఖముగా తిరుగునప్పుడు బ్రహ్మము గోచరమగును ఆ బుద్ధియొక్క తిరుగుటయే శరీరపు మార్పని గ్రహింపదగినది అని భగవద్గీత అధ్యాయము 2

**యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృది శ్రితాః ।**
**అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥**

ఏ సమయమున ముముక్షువైనవాని హృదయమందుండు సమస్త

ప్రాపంచిక విషయములను కామములు వీడిపోవునో అప్పుడే వాడు జననమరణ రహితమగు అమృతత్వము(ముక్తి) నొందుచున్నాడు వాడు శరీరముతో గూడియుండినను బ్రహ్మస్వరూపుడే(ముక్తుడే) అనగా, ఎప్పుడు హృదయమందుండు ఒక్కొక్క వృత్తుల నతిక్రమించి ధ్యానభక్తిచే పైభా గమునకు వెళ్లునో, అప్పుడే ఒక్కొక్క జన్మముచే పొందదగిన అవస్థలను పొందిపొంది ముక్తుడగును- అని కఠోపనిషత్తు

కనుకనే చిన్నస్థితియం దుండువారుగూడ ధ్యానశక్తిచే ఒక్కొక్క అవస్థను దాటిదాటి ఒక జన్మముననే గొప్ప మహాత్ము లగుచున్నారు. దీనికి వేమన యో గీంద్రులే దృష్టాంతము కనుక ప్రయత్నపూర్వకముగా వృత్తిరాహిత్యము చేసికొనదగినది ప్రాపంచికవిషయ మొకదానిని కోరినచో ఆ సంకల్ప మనుభవించుకొనుటకు మఱియొక జన్మమెత్తవలెను అదే జననము హృదయ మందుండు ప్రాపంచిక మగు నొకవృత్తిని విడిచినచో ఆ సంకల్పముయొక్క ఫలము ననుభవించుటకు తగిన జన్మము నశించినది ఇదే మరణము కనుకనే విస్సంకల్పుడై ప్రారబ్ధవశముచే వచ్చెడి భోగముల ననుభవించి యుండవలయునని శాస్త్రము చెప్పు రహస్యము ఇది చాల సూక్ష్మమైన సంగతి

## 6.బాల్యయౌవనాది నిర్ణయము.

బాల్యము, యౌవనము, వార్ధక్యములను అవస్థలు మూడింటిలోను సదా మూడవస్థలు గలవు వాని తారతమ్యములు వయస్స్వరూపాదుల ననుస రించి గాదు జ్ఞాన, విజ్ఞాన, భక్తి, వైరాగ్యాదులు పక్వాపక్వస్థితుల ననుసరించి యున్నవి అనగా శాంతులై, దాంతులై, భక్తి వైరాగ్య జ్ఞానములతోగూడి, పరిపక్వహృదయులై, శరత్కాలమందు మేఘములు వదలిపోయిన నిర్మలా కాశమువలె, రాగద్వేషాదులు నశించి నిర్మలాంతఃకరణులై పరిపక్వమయిన పండువలె, మధుర స్వభావముతో గూడి సర్వసంసార విషయవిముక్తులై, అహోరాత్రములయందును, దైవభక్తిచే సాత్త్వికగుణముతోగూడి కరుణా

స్వరూపులైన వారు బాలురైనను వారే వృద్ధులు

ఇంద్రియాది విషయములలో ఆసక్తులై, ఆశచే పూరితులై, రజోగుణ స్వభావము గలవారై, ధర్మమార్గములో ప్రవృత్తి మార్గస్థులైనవారు యౌవన దశయం దున్నవారు

సదా ఆహారనిద్రాదులయందు ఆసక్తులై, ఆటపాటలయందు కాలము వ్యర్థముగా గడిపి దేహవాసన, లోకవాసన, శాస్త్రవాసనల యందు తృప్తిలేక జ్ఞానహీనులై, ఆయుస్సంతయును అనావశ్యక విషయములలో ఖర్చుపెట్టి మోక్షమార్గ మొకటిగలదను విచారము చేయనివారు వృద్ధులైనను వారే బాలురు

**న తేన వృద్ధో భవతి యేనాస్య పలితం శిరః ।**
**యో వై యువాఽప్యధీయానస్తం దేవాః స్థవిరం విదుః ॥**

ఒకనికి ముసలితనము వచ్చి వెంద్రుకలు తెల్లగానైనను, శరీరము జీర్ణత్వము (అనగా మధిమి) నొందినను, విషయవిరక్తియు, బ్రహ్మనిష్ఠయు లేనిచో నతడు వృద్ధుడు గాడు మఱియు నెవండయితే, బాలుడైనను విషయ వైరాగ్య ముగలిగి బ్రహ్మనిష్ఠుడై యుండునో వానిని దేవతలును, మహాత్ములును ముస లివాడని తలంతురు- అని మనుస్మృతి అనగా చిన్నతనమందు బ్రహ్మనిష్ఠ గలిగినచో, జన్మాంతరమందు బ్రహ్మనిష్ఠ యందుండిన పరిశుద్ధాత్ముడు ఆజన్మమందు ముక్తిపొందక శేషముకొఱకు జన్మమెత్తిన పుణ్యపురుషుడు

## 7.చతుర్విధ జీవుల నిర్ణయము.

స్వేదజ, ఉద్భిజ్జ, అండజ, జరాయుజములను నాలుగు విధములైన జీవరాసులలోను ఒక్కొక్క దానియందు నాలుగు విధములయిన జీవరాసులున్నవి వాని భేదములు కరచరణాద్యవయవముల ననుసరించి గాదు మైత్రీ కరుణాముదితోపేక్షాదుల ననుసరించి యున్నవి అనగా

జీవకారుణ్యము, దైవభక్తి, అధ్యాత్మ ధ్యాననిష్ఠ గలిగి సర్వసహోదర బావముతో ధర్మ మార్గమందు సత్త్వగుణ ప్రవర్తకులైనవారు జరాయుజులైన మనుష్య జన్మమునందు చేరినవారే

పరవిత్తాపహారులై, శిశ్నోదర ప్రీణనపరులై, ఆహార నిద్రామైధునాదు లనే పరమపురుషార్థములని నమ్మువారై, ప్రాణిహింసకులై, పరజనుల పీడించి, అధర్మముచే ధనము సంపాదించి యింద్రియాదిసుఖముల ననుభవించువారు అండజములైన మకరి మొదలుగాగల జంతువర్గములో చేరినవారు

సదా పరద్రోహశీలురై, క్రూరకృత్యములందు తాత్పర్యము గలవారు, తేలు, నల్లి, మొదలైన స్వేదజములగు విషజంతువులలో చేరినవారు

ధర్మమార్గ ప్రవర్తనముచేనగు స్వదేహపోషణము తెలియక తమోగుణ ప్రధానులై, సోమ రులై, పరాధీనతతో జీవించువారై, జడస్వభావము గలవారు ఉద్భిజములైన వృక్షజన్మమునుండి పైకెక్కినవారు గారు.

**ఆహార నిద్రా భయ మైథునాని సామాన్య మేత త్పశుభిర్నరాణామ్ ।**
**జ్ఞానం నరాణామధికో విశేషః జ్ఞానేన హీనాః పశుభిస్సమానాః ॥**

ఆహారము, నిద్ర, భయము, మైధునము, మొదలుగాగల యింద్రియ సుఖములును, శరీరసంరక్షణమును, పుత్రసంరక్షణాది క్రియలన్నియును మానవులకు వలెనే పశుపక్ష్యాది సమస్తజంతువులకును సమానధర్మములు అనగా శరీరపోషణాదులు, ఇద్రియ సుఖములును మనుజాల కున్నట్లే మృగ ములకును గలవు కావున జీవకారుణ్యము, దైవభక్తి, ఆత్మచింతనము మొద లుగాగల పవిత్రగుణములు మానవులకు విశేషలక్షణములు ఈజ్ఞానము లేనిచో, మానవుడై యుండినను ద్విపాదపశువే- అని శ్రీభగవద్వచనము- ఉత్తర గీత.

# 8. దేవమానవుల నిర్ణయము.

ఒక్క మనుష్యజన్మములోనే దేవ, మానవ, రాక్షస, అసురులను నాలుగు విధములయిన జన్మము లున్నవి అనగా మనుష్యమనుష్యుడు, మనుష్య దేవుడు, మనుష్యరాక్షసుడు, మనుష్య – అసురుడు వీరియొక్క భేదములు జనన, మరణ, స్థూల, సూక్ష్మ, శ్వేత, కృష్ణాదులైన దేహ ధర్మముల ననుసరించి కాదు శ్రవణ, మనన, నిదిధ్యాసనముల ద్వారా స్థూల, సూక్ష్మ కారణ శరీరములయొక్క పోషణ దూషణములను వారిచే లోకమందు జరుగు నపకారోపకార గుణములనుబట్టి కనుగొనవచ్చును అనగా, సూర్యుడేలాగున ప్రతి ఫలమును గోరక, జీవులకు ప్రకాశ మిచ్చుచున్నాడో, యేలాగున ప్రత్యుప కారము నపేక్షింపక మేఘము వర్షించుచున్నదో, అట్లు పరోపకారముకొఱకై స్వార్థమును గోరక సమస్త జీవరాసులయందును కరుణగలవాడై వారి మేలు కొఱకు పాటుపడి బ్రహ్మనిష్ఠాబలముచే దేహత్రయము నతిక్రమించి సాక్షిమాత్రుడగు పరమాత్మ తానను అపరోక్షానుభవమునొందిన పరమపురుషుడు మానవాకారుడగు దేవుడు

మైత్రి, కరుణ, ముదములతోగూడి సత్య, దాన, ధర్మముల తప్పక ధర్మ పత్నీసమేతుడు, సంతానోత్పత్తికొఱకు మాత్రము కామరతుడై, దైవభక్తి అధ్యాత్మ నిష్ఠల యందు ప్రవర్తించువాడై, యౌవనకాలమందు మాత్రము గృహస్థధర్మమందుండి తదనంతరము విరక్తుడై, బ్రహ్మనిష్ఠావలం బియైనవాడు మనుష్యులలో మనుష్యుడు స్వార్థపరుడై, దేహాత్మబుద్ధి గలవాడై, శిశ్నోదర ప్రీణనము కొఱకు మనస్సుచేతను, కర్మముచేతను, వాక్కు చేతను పరప్రాణిపీడకుడై, క్రూరకృత్యమందు భయములేని వాడై, కఠినోక్తు లాడు స్వభావము గలవాడై, అహంకార మమకారములతో జంతువులను హింసించి తినుటయందుత్సుకుడై, దానిచే పాపములేదని చెప్పువాడు మానవ రాక్షసుడు

దేవ, వేద, సాధు, సజ్జన దూషణములచే పరమానంద భరితుడై, మద్యపాన నీచభోజనప్రియుడై, నాస్తిక బుద్ధితో దేహాత్మస్వభావము గలవాడై, దంభాహంకారయుక్తుడై, అధర్మము లన్నియును ధర్మములను వివాదశీలుడై, మరణమువఱ కింద్రియసుఖము ననుభవించుటయే మనుష్య జన్మము యొక్క ముఖ్యప్రయోజనమని చెప్పువాడు మానవజన్మమెత్తిన యసురుడు

వీరిని గనిపెట్టుటకు అనుమాన ప్రత్యక్ష దృష్టాంతము ఎట్లన ఒక పాత్రమును శోధించునపు డింగున వాసన యున్నచో ప్రస్తుత మింగువ గను పడనప్పటికిని ఆపాత్రమందు పూర్వమింగువ యున్నట్లును, ఆలాగుననే ఒక పెట్టెను తెఱచునపుడు సుగంధవాసన గ్రాహ్యమౌనెడల దానియందు సుగంధమునకు గారణమగు వస్తువు గలదని నిశ్చయించ వచ్చునుగదా? ఆలాగుననే ఒక్కొకరి మనోవాసనా వృత్తిగుణముల ననుసరించి వారి జన్మమును కనుగొనవచ్చును

మద్యపానరతో దైత్యః-అనగా సురాపానమందాసక్తిగలవాడు, మానవవేషధారియగు అసురుడు మాంసాశీ చ నిశాచరః – అనగా జంతువుల హింసించి తినుటలో ప్రీతిగలవాడు మానవరాక్షసుడు సత్యధర్మరతో మర్త్యః-అనగా సత్య, ధర్మ, నిష్ఠలతో వర్తించువాడు నిజమగు మానవుడు బ్రహ్మనిష్ఠాపరో దేవః అనగా బ్రహ్మనిష్ఠయం దత్యంతా సక్తిగలవాడు, మానవదేవుడు- అని నారాయణస్మృతి ఇంకను ఈ విషయమున శ్రీభగవద్గీత 16–వ అధ్యా యములో విశదముగా గనందగును

# 9. అవస్థాత్రయ నిర్ణయము.

జాగ్రత్, స్వప్న, సుషుప్తులను అవస్థలు మూడింటిలో సదా మూడవస్థలు గలవు వానిభేదములు నిద్రాహారాదులు మొదలైన క్రియలకొఱకు దినరాత్రుల ననుసరించి గాదు పరిపూర్ణమై యవిచ్ఛిన్నమైన పరమాత్మ యొక్క బోధా బోధల ననుసరించి యున్నవి. అనగా ప్రణవార్థమై,

సచ్చిదానందమయమై, దేహత్రయ విలక్షణమై, అవస్థాత్రయ సాక్షియైన పరమాత్మయందు స్థిరమైన నిలకడ యెవరికి గలిగియుండునో వారిది సదా జాగ్రదవస్థ యనంబడును. వీరు యోగశాస్త్రరీతిగా నారూఢులని పిలువబడుదురు

అభ్యాసకాలములోను, వేదాంతశాస్త్రము వినునప్పుడును, మహనీయులతో సంసర్గసమయములలోను, ధ్యాననిష్ఠాసమయములలోను, ఈ దేహాదిప్రపంచము స్వప్నమువలె మిథ్యయగును నేను ప్రపంచాతీతుడను పరిశుద్ధస్వరూపుడను అనెడి భావము గలిగి ప్రపంచముఖమై మనసు పోయి నవెంటనే స్వప్నము కన్నవానివలె విస్మృతి యెవరికి గలదో, వారు స్వప్నావ స్థయం దున్నవారు వీరిని అభ్యాసులని చెప్పుదురు

సాధుసజ్జన సాంగత్యమునకును, మోక్షదాయకములైన గ్రంథావ లోకమునకును, సర్వానర్థ నివృత్తియైన ముక్తిపదమునకును సాధనములైన భక్తి, ధ్యాన, పుణ్యకర్మములలో నభిలాష యెప్పుడు గలుగునో, అప్పు డజ్ఞాననిద్రనుండి మేల్కొనుటకు ప్రారంభించిన వారగుదురు

ఆజన్మ మరణపర్యంతము పరమాత్మ నెవ్వరెఱుంగక యున్నారో, వారాహోరాది దినచర్యలు చేయుచున్నప్పటికిని మహామోహమగు గాఢసుషు ప్తియం దున్నవారు లేక మరణపర్యంతము పుత్ర, మిత్ర, దారాది, ధన, ధాన్యము లందు కాలమును వ్యర్థపఱచి ఆత్మజ్ఞానవిషయముననను, సంసార సాగర దుఃఖనివృత్తికొఱకును, ఈశ్వర కరుణకొఱకు నేదైన నొక పుణ్య కర్మానుష్ఠానము చేయక విషయానందమందు మగ్నులైనవారును మహామోహ మైన నిద్రయందుండువారు కేవల మజ్ఞానముచే దేహాత్మబుద్ధియే వీరిస్థితి అల్పమైన జ్ఞానముచే జీవుడే తానను బుద్ధిగలవారు స్వప్నావస్థయం దుండువార ధ్యానబలముచే, పంచకోశములను దాటి అచలమైన శుద్ధబోధ స్వరూపమైన పరమాత్మయే తానను దృఢప్రజ్ఞయే జాగ్రదవస్థ యనంబడును ఇవియే అవస్థాత్రయము యొక్క తారతమ్యములు

**దేహో౽హమిత్యేవ జడస్య బుద్ధి ర్దేహే చ జీవే విదుష స్త్వహంధీః ।**
**వివేకవిజ్ఞానవతో మహాత్మనో బ్రహ్మాహమిత్యేవ మతిస్సదా౽౽త్మని॥**

కేవలము తెలివి విహీనుడై జడప్రాయుడైన వానికి దేహమే తానను బుద్ధి దృఢపడి యుండును వీడు చేయుపని యంతయును దేహసుఖము కొఱకుం డునేకాని మనః పరిశుద్ధతకొఱకు కొంచెమైనను పుణ్యకార్యము చేయడు కొంచెము తెలివి గలిగి కొంత శాస్త్రవిచారమును, పుణ్యకర్మముచే కొంత మనఃపారిశుద్ధ్యమును గలిగినవానికి దేహాభిమానము కొంత తొలగి జీవుడే తానను బుద్ధిగలిగి యుండును నిశ్శేషహృదయ పారిశుద్ధ్యము గలిగి జితేం ద్రియుడై, ఆత్మానాత్మ విచారమును జేసి తత్త్వమస్యాది మహావాక్యార్థమును శ్రవణ, మనన, నిదిధ్యాసనములు చేసి అపరోక్షానుభవముగల మహాత్మునకు సదా శుద్ధబోధమగు బ్రహ్మమే తానను భావము ప్రబలమై యుండును– అని వివేకచూడామణి

# 10.స్త్రీ పురుషుల నిర్ణయము.

స్త్రీలలో పురుషులును, పురుషులలో స్త్రీలును గలరు వారి భేదములుస్తన కేశాద్యవయవముల ననుసరించి కాదు దేహేంద్రియాది మనోవృత్తులైన ఇంద్రియముల యొక్క అధీన అనధీన, వృత్తుల ననుసరించి యున్నవి. అనగా స్త్రీ యొక్క స్వభావము అబలాత్వముచేత పురుషాధీన మనియు, పురుషలక్షణము బలముచే స్త్రీ తన స్వాధీనమనియు కొందఱు విషయలంపటులగు మందశాస్త్రజ్ఞులు చెప్పుదురు అది చాల తప్పు, అధ్యాత్మవిచారణచే గలుగు దీని రహస్యార్థమేమి యన సర్వసాక్షియై, పంచకోశాతీతమై, శుద్ధబోధమే రూపముగాగల నాకు లింగభేద మెట్లు గలుగును? స్త్రీ వేషధా రియైన పురుషుడేలాగున స్త్రీ కానేరడో ఆలాగున దేహత్రయ విలక్షణుడై, స్వయం ప్రకాశుడైన నాకు లింగభేదము లంట వని నిశ్చయించుకొని ఇంద్రియాది మనోవృత్తులను జ్ఞాన, వైరాగ్యాభ్యాసములతో గూడిన ధ్యాన యోగముచే నిగ్రహించుకొని ఈ ప్రపంచమంతయు

మాయావిలాస మని దృఢబోధ గలిగి, అన్ని వృత్తులను తన కధీనము చేసికొనినవా రెవరైనను వారే పురుషులు ధ్యానాభ్యాస వైరాగ్యహీనులై విషయచేష్టలగు నింద్రియములకు లోబడి కామపరవశులై తిరుగువా రెవ్వరైనను వారే నిజముగా స్త్రీలు, అనగా, మాయా విషయమైన కామవిషయముల కధీనలు అబలలు

**నైవ స్త్రీ న పుమానేష నైవ చాయం నపుంసకః ।**
**యద్యచ్ఛరీరమాదత్తే తేన తేన స యుజ్యతే ॥**

ఈ యాత్మ స్త్రీయును గాదు, పురుషుడును గాడు, ఆత్మ నపుంసక మును గాదు మఱి యెట్లుండునన ఏయే శరీరము నాత్మ స్వీకరించునో, ఆయారూపముతో గూడి ప్రకాశించును అనగా ఆత్మ స్వయంజ్యోతి స్వరూ పమైనది అది సూక్ష్మమైనది అగ్ని యేలాగున ఉపాధులననుసరించి వర్ణభేద ములతోను, స్థూలసూక్ష్మముగాను ప్రకాశించునో ఆలాగున నాత్మయును, ఉపాధుల ననుసరించి ప్రకాశించును – అని తేజోబిందూపనిషత్తు

**యథా చ నటకః కశ్చిద్వేషాంతర సమీహయా ।**
**గృహ్ణాతి వివిధం వేషం వస్తుత్వే నట ఏవ సః ॥**
**దేహీ వస్త్రాణ్యనేకాని దధాతి వివిధేహయా ।**
**వస్త్రాణి వివిధానీహ ధారక స్త్వేక ఏవ సః ॥**

ఏలాగున వేషధారియగు నొకడనేకవిధములగుస్త్రీ వేషములను, పురుషవేషములను మఱియు ననేకవిధములగు వేషములను ధరించినను, డ్రస్సులు తీసివేయుటకు ముందుగాన, దుస్తులతో గూడియుండునపుడును పురుషుడొకడే యగుచున్నాడో, ఆలాగున నాత్మ యనేక విధముగు స్త్రీ పురుషుల శరీరములను ధరించియుండినను, ఆత్మకు స్త్రీ పురుషాది భేద ములు లేవు ఎట్లన? వేషము లన్నియును, వస్త్రాభరణాదులను తీసివేయు నప్పుడు పురుషు డొక్కడే మిగులును గదా? ఎట్లన కొన్ని కొన్ని స్థలములలో జాతరజరుగు కాలములలో పెద్దపెద్ద స్త్రీ పురుషరూపములగు బొమ్మలను

జేసి వానిలోపల మనుష్యులు ప్రవేశించి యాడించునప్పుడు చూచువారికి భయం కరముగా గనుపించినను, లోపల నున్నవాడు మనుష్యుడే ఆలాగున ఆత్మానాత్మ విచారణముంజేసి ఆనాత్మయగు స్థూల, సూక్ష్మకారణములు అను దేహములను విడిచియు అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞాన మయానందమయ కోశములను విచారణచేసి విడిచినచో సాక్షియగు నాత్మ, శుద్ధప్రజ్ఞారూపుడై కనబడును - అని గరుడపురాణము

**అన్నకోశ విహీనాత్మా ప్రాణకోశ వివర్జితః ।**
**మనఃకోశ విహీనాత్మా విజ్ఞానాది వివర్జితః ॥**

ఆత్మ అన్నకోశమునకు పైనున్నవాడు, ఆత్మ ప్రాణకోశము నతిక్రమించినవాడు, ఆత్మ మనోమయ కోశమున కెగువ నున్నవాడు, ఆత్మ విజ్ఞానమయ కోశమునకును, ఆనందమయకోశమునకును, విలక్షణుడై సాక్షిగా నుండువాడు

**జ్ఞప్తిరేవ వరం బ్రహ్మ జ్ఞప్తిరేవ వరం పదమ్ ।**
**జ్ఞప్తిరేవ వరో మోక్షో జ్ఞప్తి రేవ వరం సుఖమ్ ॥**

సాక్షియై యుండు ప్రజ్ఞయే (బోధయే) పరబ్రహ్మము ఆ సాక్షియగు బోధము తానై యుండుటయే పరమపద మనబడును ఆ ప్రజ్ఞామాత్రమగు బోధము తానగుటయే మోక్షమని చెప్పుదురు ఆ సాక్షియగు జ్ఞప్తిమాత్రమై శేషించి నిలుచుటయే పరమానందమగు పరమసుఖము - అని ఋభుగీత

# సంగ్రహము

ఓ ప్రాజ్ఞులైన ప్రియసోదరీ సోదరులారా! సర్వవేద, శాస్త్ర, పురాణేతిహాసాదులయొక్క ఆంతర్య రహస్యమేమన? తత్త్వమస్యాది మహావాక్యములయొక్క మహత్తైన సారార్థమై నేతి నేతీతి వాక్యములచే ప్రకృతి యొక్క వికృతులను లక్ష్యపెట్టక దైవానుగ్రహమును బొంది సద్గురుకృపకు బాత్రులై, దేహేంద్రియ మనోబుద్ధ్యతీతమై, సర్వాధిష్ఠానమై యుండు

ఏయొక్క కేవల బోధస్వరూపము సత్తామాత్రమై యున్నదో, దానిని జ్ఞాన ధ్యానము లనెడు శౌర్యపరాక్రమములచే బొంది, సత్తామాత్రమగు పరబ్రహ్మమే నేనను అపరోక్షానుభవమును బొంది, మల, అజ్ఞాన, విక్షేప, సంశయ రహితులై ఈ ప్రపంచమంతయు నాచే కల్పితమని దృఢప్రజ్ఞులై, పావన పవిత్రమైన పరమసమాధిని ఎవరు పొందుచున్నారో వారే ధన్యాత్ములు వారే బ్రాహ్మణోత్తములు వారే జీవన్ముక్తులు వారే అవధూతలు వారే ఆచలులు వారే పరిపూర్ణులు, వారే అమనస్కులు, వారే రాజయోగులు వారే సన్న్యాసులు, వారెవ్వరైనను వారుగదా మహనీయులు !

ఓ ఆర్యోత్తములైన పావనులగు సోదరీసోదరులారా! ఈ మహావస్థను పొందగోరువారు ఉత్తమ, మధ్యమ, కనిష్ఠాధికారుల ననుసరించి హృదయ గ్రంధి భేదనమునకై, పుణ్యకర్మములు నిష్కామముగా జేసి మలనివారణమును, దైవోపాసనచే మోహనివృత్తియును, సద్గురు హస్తమస్తక సంయోగముచే విక్షేపనివృత్తియును, స్వప్రయత్నబ్రహ్మనిష్ఠానుభవముచే సంశయ, విపర్యయ నివృత్తియును పొందవలయును

అనగా యజ్ఞ, దాన, తపములైన పుణ్యకర్మములు, శ్రద్ధాభక్తులతో గూడి ఈశ్వరార్పణముగా జేయుచు రాగా రాగా క్షారవస్తువులచే మలినవస్త్రములో నుండు మాలిన్యము పోయి నిర్మల మగునట్లు సర్వపాపములును నశించి మనఃపరిశుద్ధత గలుగును తద్ద్వారా విషయవైరాగ్యము గలిగి నిత్యానిత్య వస్తు వివేకము స్థిరపడును దానిపైని పవిత్రమైన దైవభక్తిచే ప్రకృతి దోషములు క్షయించి గాలి లేనిచోట నుండు దీపమువలె స్వస్వరూప ధ్యానమందు మనఃస్థిరత గలుగును తదుపరి సద్గురు కటాక్ష వీక్షణామృతముచే దృక్, దృశ్య, దర్శన ములైన త్రిపుటి నశించి భేదబుద్ధియైన యజ్ఞానము క్షయించి అద్వితీయ మైన బ్రహ్మాకారవృత్తి గలిగి పరిపూర్ణానంద సుఖస్వరూపు లగుదురు

**ధ్యాతృధ్యానం పరిత్యజ్య క్రమాద్ధ్యేయైకగోచరమ్ ।**

**నివాత దీపవచ్ఛిత్తం సమాధిరభిధీయతే ॥**

ధ్యానము చేయువాడు ధ్యాతృధ్యానము లను వీనిరెంటిని విడిచి క్రమముగ ధ్యేయాకారమగు వస్తువు తానై, గాలి లేనిచోట నుండు దీపమువలె చలనరహి తుడై, స్వస్వరూపుడై, ప్రజ్ఞామాత్రుడై నిలుచుటయే సమాధి యనంబడును క్రమాత్ అని ప్రయోగించియుండుటచే ప్రపంచము, దేహము, ఇంద్రియ ములు, మనస్సు, ఇవియన్నియును బుద్ధిచే ఒక్కొక్కటిని విడిచి విడిచి తుదకు బుద్ధినిగూడ విడుచునప్పుడు సాక్షియగు తానుమాత్రము శేషించును ఈ స్థితి గలుగుటకై యింద్రియార్థములనుండి మనస్సును అంతర్ముఖముగా జేసి గంభీరమగు ధ్యానము చేయవలయును

ఓ పరిశుద్ధాత్మ స్వరూపులైన, సోదరీ సోదరులారా! మహాదుఃఖ కరమగు సంసారసాగరమును దాటుటకును, శాశ్వతసుఖమైన మోక్షమునకును, సుల భమై, కష్టనష్టములు లేనిదై, వేదసారమై, సర్వమత సమ్మతమై, సజ్జనహి తమగు నొక సుక్ష్మోపాయము గలదు అదేమన? పరమనీచవృత్తియం దున్నవా డైనను, లేక అంత్యజాతి సంభూతుడై, దురాచారపరుడై యున్నను ప్రతిదినమును అన్నపానాది క్రియలచే, నశాశ్వతమగు నీస్థూలదేహ పోషణకొఱకు సమయము(అనగా స్నానమునకును, శౌచమునకును, భోజనమునకును, ఇతర కృత్యములకును కాలనిర్ణయము) లేర్పఱచినట్లు శాశ్వతమైన తనయాత్మను దైవభక్తి, ధ్యాన, జప, ప్రార్థనలచేతను, జీవ కారుణ్యముచేతను, ఆధ్యాత్మవిచారములచేత నెవరు ప్రతిదినమును పోషించె దరో వారే ధన్యాత్ములు

ఒక్కదినము (అహోరాత్రములు) అఱువది ఘడియల కాలములో తక్కువపక్షము సూర్యోదయమునకు ముందుగా నొక ఘడియకాలమును ఆలాగుననే సంధ్యాకాలముగాని, లేక రాత్రిలోనెప్పుడైనన నొక ఘడియ సమయమందైనను ఏకాగ్రచిత్తము గలవారై ప్రేమతోగూడి దైవప్రార్థన, ధ్యానజపముల చేసినయెడల నీజన్మములోనే భగవత్కరుణ గలిగి

మనఃపరిశుద్ధతను పొంది పరమపదమైన మోక్షమును పొందవచ్చును పగలు ధ్యానము చేయుటకై ప్రతిబంధ మున్నవారికి రాత్రికాలము చాలమంచిది అప్పుడేయొక్క విచారముండదు వీరు రాత్రిలో ఆహారము తక్కువగా భుజిం చవలెను మఱియు నితరప్రతిబంధములు లేక సమయ మెక్కువగా దొరకున ప్పుడు మఱియు నొకింత యధిక సమయము ధ్యాననిష్ఠ చేయువారికి శీఘ్రముగా మాయావిముక్తి గలుగును ప్రతిదినమును ఆలాగున చేయుచు రాగా రాగా దివ్యరసాయనముచే గొప్పరోగము శాంతమగునట్లు రాగద్వే షాదులైన పాపసంఘములు నశించి పరిశుద్ధాత్ము లగుదురు

దీనికి వారివారి యిష్టదేవతా ధ్యానము శ్రేష్ఠము పరమాత్మ అనంతకోటి నామరూపములతో ప్రకాశించుచున్నాడు దీనికి మోక్షదాయక మహా మంత్రములైన శ్రీ అష్టాక్షరినిగాని, పరిశుద్ధమైన శ్రీ శివపంచాక్షరిని గాని, సంసారతారకమైన శ్రీరామతారక మంత్రమునుగాని, ఆత్మానాత్మల నైక్యముజేయు నజపా మంత్రముగాని, వేదసారమై యతిపవిత్రమగు నోంకారమునుగాని అనుష్ఠానము చేయవచ్చును ఈ మంత్రములు గూడ తెలియనివారు నిర్మలభక్తితోగూడి కృష్ణా! నారాయణా! గోవిందా! శివా! శంభో! మహాదేవా! పరమాత్మా! సర్వేశ్వరా! శ్రీరామ, రామ, రామా! అను మొదలగు దివ్యనామములను జపింపవచ్చును పైనిజెప్పిన యన్నిటికిని వైరాగ్యశ్రద్ధలే ప్రధానములుగాని, మంత్రములు ప్రధానములు గావు

మహానీచుడుగూడ జ్ఞానమార్గావలంబి యైనయెడల నీజన్మములోనే మోక్షము నొందవచ్చునని పైనిచెప్పిన విషయమున కొకదృష్టాంతము చెప్పెదను ఒక తియ్యని మామిడిపండు లేతకాలములో(అనగా కసుగాయ) చేదుగాను, వగరుగాను, మధ్యకాలమునందు పులుపుగాను, పరిపక్వకాల మున తేనెతో సమానముగ మధురముగాను ఎట్లు మాఱుచున్నదో ఆలా గునను, శుక్లపక్ష చంద్రుడేలాగున దిన దినమును వృద్ధిపొందునో ఆ రీతిగా నీ భక్తులును బ్రహ్మధ్యాన నిష్ఠాభ్యాసముచే తమోగుణ, రజోగుణములు నశించి సత్త్వగుణ ప్రధానులై జ్ఞాను లగుదురు మఱియు రసవాదముచే

తామ్ర మేలాగున బంగారమగు చున్నదో, మఱియు నగ్నిసంయోగముచే కట్టె లెట్లు భస్మమగునో, ఆలాగుననే వీరును జ్ఞానాగ్నిచే సమస్త పాపసంఘములను భస్మము చేసి కొన్నవా రగుటవలన పరిశుద్ధస్వరూపు లగుదురు

దీనికి కరుణానిధులైన శ్రీ కృష్ణభగవంతులు జీవుల పైనికరుణ గలిగి వీరియొక్క అల్పాయుస్సును, స్వల్పబుద్ధిని పరీక్షించి పరిపూర్ణదయతో శ్రీ భగవద్గీతయందు రాజయోగ రహస్యమను తొమ్మిదవ యధ్యాయమున ప్రమాణము చేసి సెలవిచ్చియున్నారు పరమాత్ములైన శ్రీకృష్ణస్వాముల వారి వచన మసత్యమగునా?

ఆర్యశిరోమణులైన సోదరీసోదరులారా! అందఱును ఈ భగవ ద్వచనమును విశ్వాసముతో నమ్మి భగవద్భక్తిపరులై సర్వదుఃఖ నివృత్తి కరమైన శాశ్వతానంద నిర్వాణసుఖమును పొందుదురుగాక!

**అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।**
**సాధురేవ స మంతవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః ॥**

ఎంత దురాచారము గలవాడైనను నన్ను ( భగవంతుని) అనన్యభక్తితో సేవించుచుండినచో, వాడు పరమ శ్రేష్ఠుడనియే తలంపవలెను ఏలననగా, వాడు పరమేశ్వర ధ్యానముచేత సమస్తపాపములు నశించి పరిశుద్ధాత్ముడై యుండును వాడును పరమాత్మ ధ్యానానందముచే శుద్ధుండనైతినని మంచి నిశ్చయము గలవాడు గదా? అనగా, మలినవస్త్రము సబ్బువేసి యుతుకు నప్పుడు నిర్మల మగునట్లు ఎంత పాపాత్ముడైనను పరిశుద్ధాత్మ డగును

**క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।**
**కౌంతేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥**

ఓ యర్జునా! అతిదురాచారుడైనను నిర్మలభక్తితో నన్ను ధ్యానించు వాడు అతిశీఘ్రముగా మహాత్ముడగును మఱియు వాడు శాశ్వతమగు ముక్తిని బొందును నాభక్తుడెప్పటికిని దుఃఖమున బడువాడు గాడు ఇట్లు

నీవు జనమధ్యమున భేరిని వాయించి ప్రతిజ్ఞజేసి చెప్పుము

**మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।**
**స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిమ్ ॥**

ఓ అర్జునా! అంత్యజాతి సంభూతులైన నీచ జన్మము గలవారిలో నెవరైె ననుసరే అట్టివారును, స్త్రీలును, వైశ్యులు మొదలుగాగల వీరందఱును నన్నుసేవించి ధ్యానించినచో నిశ్చయముగా నుత్తమగతియగు పరమపదమును పొందుదురు

**అపిచేదసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః ।**
**సర్వం జ్ఞాన ప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥**

మహాపాపాత్మ్ము లందఱికంటెను మిక్కిలి పాపాత్ముడవై యుండిన వాడవైనను పరమాత్మ ధ్యాననిష్ఠాపరుండవైనచో ఆ పాపసంఘమగు సాగరమును జ్ఞానమను తెప్పచే సుఖముగా దాటుదువు

**యథైదాంసి సమిద్ధోఽగ్నిర్భస్మ సాత్కురుతేఽర్జున ।**
**జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥**

ఓ యర్జునా! మండుచుండెడి యగ్ని సమిధలను (కట్టెలను) భస్మముచేయునట్లు బ్రహ్మనిష్ఠునియొక్క జ్ఞానాగ్ని కర్మము లన్నింటిని భస్మము చేయును

**తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।**
**భవామి న చిరాత్పార్థ! మయ్యావేశిత చేతసామ్ ॥**

ఓ యర్జునా! నాయందు చిత్తము స్థిరముగా నిలిపి ధ్యానించువా రెవరైనను వారిని నేను జననమరణరూప దుఃఖసంసారమునుండి అతిశీఘ్రముగా నుద్ధ రింతును అనగా నీచయోనియందు జన్మించిన వారైనను సరే లేక యితర జాతులయందు జన్మించి యధికపాపముచేసిన

వారైనను సరే, నాభక్తులను నేనుద్ధరింతును తెలివిలేని బాలుడెంత తప్పుచేసినను పశ్చాత్తాపముతో తల్లిని పిలిచి యేడ్చునపుడు ఆమె ప్రేమతో పరుగెత్తివచ్చి యాలింగనము జేసి స్తన్యమి చ్చునట్లు, అల్పబుద్ధిగల జీవులు చేసిన తప్పులను పశ్చాత్తాపముతో ప్రార్థించు నపుడు కరుణానిధియై జగన్మాతయు, పితయునైన పరమాత్మ క్షమించి జ్ఞానసుధామృతము నిచ్చి కృతార్థునిగా జేయును

**విధినాఽవిధినా వాపి భక్త్యా యే మాముపాసతే ।**
**తేభ్యః ఫలం ప్రయచ్ఛామి ప్రసన్నోఽహం న సంశయః ॥**

ఎవరైనను విధిప్రకారముగాని, విది తెలియకయేగాని భక్తితో మాత్రము నన్ను(శివుని) సంసేవింతురో అట్టివారికి నేను ప్రసన్నుడనై వారి యభిలాషను పూర్తి చేయుచున్నాను దీనియందు సంశయము లేనేలేదు అని శ్రీ పరమశివులవారు శ్రీశివగీతయం దానతిచ్చిరి. అనగా భగవద్భక్తి చేయువారికి తాము చేయు భజనధ్యానములు విధిప్రకార ముండునా లేదా? యను సంశయము పనిలేదు

**భక్తిర్హ్యష్టవిధా హ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేఽపి వర్తతే ।**
**స విప్రేంద్రో మునిశ్శ్రీమాన్ సయతిః స చ పండితః ।**
**తస్మై దేయం తతో గ్రాహ్యం స చ పూజ్యో యథా హ్యహమ్ ॥**

అష్టవిధములగు భక్తి యేయొక్క మ్లేచ్ఛునియం దుండునో, వాడే బ్రాహ్మణోత్తముడు, వాడే సన్న్యాసి, వాడే పండితుడు వాని కన్ని బ్రహ్మవిద్యలను చెప్పవచ్చును వాడు భగవంతునివలె పూజార్హుడు అని వామనపురాణము అన్త్యాదపి పరో ధర్మః– అనగా, పరమధర్మమగు బ్రహ్మవిద్య చండాలుని వద్దనుండికూడ గ్రహింపవచ్చునని మనువులవా రుపదేశించిరి

ఓ సోదరీసోదరులారా! కరుణామూర్తులైన శ్రీవాసుదేవుల వచనమును, శ్రీ పరమశివుని వచనమును ఆస్తిక బుద్ధితో నమ్మి

ధన్యులగుదురుగాక! పైనిజెప్పిన యీ దశోపదేశములు వజ్రసూచికోపనిషద్రీతిగా దూషణం జ్ఞాన హీనానాం భూషణం జ్ఞానచక్షుషామ్॥"ఇ

అనగా ఈవిషయము అవివేకులై, దేహాత్మబుద్ధి గల జ్ఞానహీనులకు దూషణము గాను, ఆత్మబుద్ధులగు వివేక జ్ఞానులకు భూషణముగాను ఉండును

ఇది శ్రీ మలయాళస్వామి యాశయము
లోకాస్సమస్తా స్సుఖినో భవంతు
ఓం శాంతిః శాంతిః శాంతిః



# ప్రమాదము నొందకుడు

## అవతారిక

ఈ చిన్నపొత్తము 'తత్త్వమసి' మహావాక్యమును ఒకసారి శ్రవణము చేసిన చాలుననియు, మరల మరల శ్రవణమనన నిదిధ్యాసములు చేయవలసిన అవసరములేదనియు చెప్పువారిని గురించి వ్రాయడమైనది

ఒకానొకడు పూర్వజన్మ తపో, ధ్యానములచే అంతఃకరణము శుద్ధమై వాసనాక్షయము, మనోనాశము కలిగి ఆత్మజ్ఞానోదయము మాత్రము దృఢముగా గలుగకపోయిన ఈ జన్మములో తత్త్వమసి మహావాక్యము గురుదేవునివలన ఒకసారి శ్రవణముచేసిన చాలును అట్టివాడు ఎల్లప్పుడు ఆత్మస్థితిలోనే యుండగలుగును అట్టివాడు అరుదు ఆవిషయమంతయు దీనియందు గానవచ్చును వాసనాక్షయ, మనోనాశములు సిద్ధించుటకొరకే శ్రవణ, మనన, ధ్యానాదులు చిరకాలము చేయవలెనని చెప్పుట. వాసనాక్షయ మనోనాశములుగలవారు లోకములో ముముక్షువు లెంతమం దిగలరో బుద్ధిమంతులు తెలిసికొనగలరు

రోగము గలిగి బాధపడువాడు తనకు రోగము లేదనియు, ఆరోగ్యవం తుడనై ఉన్నాననియు, ఆలాగున ఆకలిబాధచే తపించువాడు తనకు క్షుద్బాధ లేదనియు, తృప్తుడనై ఉన్నాడననియు చెప్పినచో వాడేగతి పొందగలుగునో, ఆలాగున వాసనాక్షయ మనోనాశము గలుగని వారియొక్క స్థితియునుండునని విజ్ఞులు గ్రహింతురుగాక! మరియు పర్వత గహ్వరములలో అనేక సంవత్సరములనుండి నిబిడమై యుండు అంధకారము దీపము వెలిగించి నంతనే పటాపంచలైపోవుననియు, ఆలాగున అనేక జన్మ ములనుండి హృద యగహ్వరములో నుండు అజ్ఞాన తమస్సు ఒక మహావాక్య శ్రవణముచేతనే నశించుననియు, ఇనుము పరుసవేది సంబంధముచే అప్పుడే సువర్ణము కాగల దనియు, ఆలాగున కీటకము భ్రమరమును భావించి తుమ్మెదగా మారు నట్లున్ను ఈతత్త్వమసి మహావాక్యమును ఒకేసారి శ్రవణము చేసిన చాలునని చెప్పు వాక్యములో గల

సత్యమును ఈ గ్రంథము నిర్ణయించుచున్నది అయితే పర్వతబిలములో దీపము ప్రకాశించిన వెంటనే చీకటి నశించవలెను గదా! ఇనుము పరుసవేదిచే బంగారమైనచో మరల ఇనుము గుణము లేకపోయి సువర్ణము కావలెను గదా! ఆలాగున కీటకము భ్రమరమైనచో రెక్కలు ఏర్పడి యెగిరిపోవలెను గదా! పురుగురూపముగా నుండి గూటిలో నుండ కూడదు గదా యని ఈలాటి విషయములగురించి ఈ చిన్న గ్రంథము నిర్ణయించుచున్నది ఇదే దీనిలో గల సారము

ఈలాటి యుక్తులు సరికావనియు, భవరోగము అస్థిగతమగు పురాతన దీర్ఘవ్యాధివంటిదనియు, ఒకరోజు చేయు ఔషధముచే నశింపజాలదనియు, వ్యాధి నయము అగువరకు, ఔషధపథ్యసేవ లుండవలెననియు ఈ గ్రం థము నిరూపించుచున్నది దానికి కావలసిన శాస్త్రములున్ను, మహనీయుల అనుభవవాక్యములున్ను దీనియందు నిరూపించడమైనది

మననేత్రము చిన్నదైనను మహోన్నతములగు పర్వతములను, విశాలమైన మహారణ్యములను, అపారమైన సముద్రమునెట్లు చూపగలుగుచున్నదో, ఈ చిన్న గ్రంథమున్ను ఆలాగున విస్తీర్ణమగు అనేక వేదాంతశాస్త్రముల సార మును సంక్షిప్తముగ చూపగలుగును కీటకము భ్రమరమగుట కెంతకాలము భ్రమరమును భావన చేయవలెనో, గుహలోగల చీకటి నశించుటకు దీపము వెలుగవలసి ఉండిన ప్రమిద, తైలము, వత్తి యెట్లు అవసరమో యోచించు కొనవలెను. ఆలాగుననే పరుసవేది సంయోగముచే ఇనుము బంగారమగును పరుసవేది యిప్పుడెచ్చట ఉండును? ఎవరికి దొరకును? దీనిని జ్ఞాపక ముంచుకొనవలెను అప్పుడు సత్యము గోచరము కాగలుగును ఓం

ఇట్లు
మీ చరాచర సుఖాభిలాషి
మలయాళస్వామి

ఓం

# ప్రమాదము నొందకుడు

## బ్రహ్మనిష్ఠులలో గల ప్రమాదము

బ్రహ్మనిష్ఠా విషయమున ప్రమాదములో పడిపోకూడదని శ్రీశంకర భగత్పాదులు హెచ్చరించుచున్నారు

**ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం న కర్తవ్యః కదాచన ।**
**ప్రమాదో మృత్యురిత్యాహ భగవాన్బ్రహ్మణస్సుతః ॥**

బ్రహ్మనిష్ఠులు ఎల్లప్పుడును జాగ్రత్త గలిగి ప్రమాదములో పడకుండ చూచుచుండవలయును ప్రమాదము గలుగుట మరణము వంటిదని తలంచవలెనని బ్రహ్మమానస పుత్రుడగు సనత్సుజాతుడు చెప్పెను

ఈప్రమాదవిషయమై శుష్కవేదాంత తమోభాస్కరములో విస్తారముగా తెలుపడమైనది అయితే దానిలో విద్యావిహీనులున్ను, నీచాచారపరులున్ను, హింసాపరులున్ను, మద్యపానరతులున్ను, ఆచరణ శూన్యులున్ను, మాదక పదార్థములగు గంజాయి నల్లమందు, బంగి మొదలగు దుష్టపదార్థములను సేవించుకొని వేదాంతము చెప్పుచుండు వారునగు వారిని గురించియే యెక్కువగా తెలుపడమైనది మరియు రజోగుణము, తమోగుణము గలవారిని గురించియే వివరించడమైనది సూర్యోదయమైన వెంటనే లోకములో గల తమస్సు నశించునట్లున్ను, చీకటిలో సంచరించెడు గుడ్లగూబ మొదలగు జంతువులు పారిపోయి స్వస్థానమగు పర్వత గహ్వరములో చేరునట్లును నేటి పరిస్థితి ఏర్పడెను

**సర్వే బ్రహ్మ వదిష్యంతి సంప్రాప్తే తు కలౌ యుగే ।**
**నానుతిష్ఠంతి మైత్రేయ శిశ్నోదర పరాయణాః ॥**

ఓమైత్రేయ మహర్షీ! కలియుగమునందు అందరును వేదాంతు

లగుదురు సర్వదా బ్రహ్మమే తామని చెప్పుదురు. బ్రహ్మనిష్ఠులు చేయవలసిన అనుష్ఠానము కొంచెమైనను చేయరు మరియు నెట్లుందురనగా శిశ్నోదరపరాయణులై( జిహ్వోపస్థలను తృప్తిపరచువారు) ప్రబలముగ తిరుగుదురని పరాశరవచనము అట్టి కాలము దాటిపోయినది భాస్కరోదయమున సర్వజనులున్ను భూలోకమున మంచి ప్రకాశములో సంచరించుటకున్ను, మార్గము బాగుగా గోచరించుటకున్ను, దారి తప్పక సంచరించుటకును అవకాశమేర్పడి కంటకాదులలో కాలు పెట్టకను, మలమూత్ర పంకిలమాలిన్యములు త్రొక్కకను ఎట్లు విహరింప గలుగుచున్నారో అట్టి స్థితి ముఖ్యముగ పావన మగు ఆంధ్రదేశమునకు దైవానుగ్రహమువలన గలిగెను

ఇట్టి ప్రమాదము తొలగిపోయినను మరియొక ప్రమాదము గూడ ముము క్షువులు, జిజ్ఞాసువులు, విద్యావంతులు దాటవలసియున్నారు అదేమన? చాలావరకు సత్త్వ గుణము గలవారున్ను, విద్యావంతులును, బోధనాశక్తి గలవారును, ఉన్నత కులములో జన్మించినవారును, మేధా సంపన్నులును అగు వేదాంతులలో కొందరిని గుఱించి జాగ్రత్తపడవలసియున్నది.

సత్త్వగుణముకూడా ప్రకృతిలో నిదే, ఇది సుకుమారముచేత తీవ్రవైరాగ్యనిష్ఠ కలుగనీయక, బ్రహ్మసాక్షాత్కారము రూఢి కలుగువరకు ధ్యానాదులు చేయనీయక, శ్రవణము మత్రము చేయించి మనన నిదిధ్యాసనాదుల పైకి పోనీయక అడ్డు పరచుచుండును. ముముక్షువులు, విద్యావంతులు దీనిని కూడ తొలగించి అపరోక్ష సాక్షాత్కారము వరకు ధ్యాన, నిష్ఠా తపస్సు లొనరించిన ధన్యులు కాగలరు గీత పదునాల్గవ అధ్యాయమున ఈ గుణత్రయమును గురించియు, గుణత్రయాతీతుని గురించియు మీరు చక్కగ తెలిసికొనగలరు ఈ మూడుగుణములును ప్రకృతి సంబంధము లైనవి అనియు, జీవునకు బంధనములనియు శ్రీకృష్ణభగవాను డుపదేశించెను బంగారుగొలుసైనను, రాగిగొలుసైనను, ఇనుపగొలుసైనను బంధించుటలో సమానములే

**సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః ।**
**నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్ ॥**

భగవన్మాయవలన గలిగినవి సత్త్వము, రజస్సు, తమస్సు అనునట్టి మూడు గుణములు ఈ గుణములకంటె వేరైన నాశరహితుడైన యాత్మను ఇవి దేహమునందు బంధించుచున్నవి

అనగా ఆత్మను విముక్తి గలుగజేయనీయక ప్రకృతిలో బంధించునని తాత్ప ర్యము అది యెట్లు బంధించునో క్రింద తెలుపబడుచున్నది

**సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత ।**
**జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత ॥**

ఓ అర్జునా! త్రిగుణముల వ్యాపారము సంక్షిప్తముగా తెలిపెద సత్త్వగుణము బలవత్తరమై ఇంద్రియ సుఖసాధనములైన విషయముల యందాత్మను ప్రవర్తింపజేయును రజోగుణము బలవత్తరమై భోగములను అనుభవించుటకు సాధనములైన కర్మల యందాత్మను ప్రవర్తింపజేయును తమోగుణము ఆత్మకు చేయదగిన కార్యములను, చేయ నీయక ప్రమాదా దులయందు ప్రవేశమును కలుగజేయును త్రిగుణములను గుఱించి, దానిచే కలిగెడు ఫలములను గురించి ఈ అధ్యాయమున బహుళముగా చెప్పడమై నది కావున ముముక్షువులు, జిజ్ఞాసువులు ఈ మూడు గుణములను గురించి విశేషముగ గ్రహించుకొనవలయును ఏలన ఈ త్రిగుణములే సంసార పాశము కాన వీనినుండియే ముముక్షువులు ముక్తులు కావలసియున్నారు గదా! ఈ త్రిగుణములనుండి విడుదల పొందుటయే మోక్షమని ఈ అధ్యాయమున కడపట తెలుపడమైనది

**గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మమృత్యు జరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్ను తే ॥**

జీవుడు దేహోత్పత్తికి(పునర్జన్మమునకు) కారణభూతములైన సత్త్వ

రజస్తమోగుణములను వైరాగ్యముచేతను, వివేకజ్ఞానముచేతను అతిక్రమించి (త్యజించి) పుట్టుక, చావు, ముసలితనము, దుఃఖములు మొదలగువానిని చెందక ప్రకృతినుండి విముక్తుడై నాలో నైక్యమును పొందుచున్నాడు అనగా మృత్యువును దాటి అమృతు డగుచున్నాడు మోక్షమును పొందుచున్నాడని భావము

ఇచ్చట చెప్పిన ఈ సత్త్వగుణము మలినసత్త్వ మనండును ఏలయన ఇది త్రిగుణములతో కూడినది త్రిగుణములు ప్రకృతి సంబంధములు వ్యావహారికమందు ఈ మూడుగుణములను మాత్రము వ్యవహరింతురు ప్రకృతిలోనుండు మానవులకు ఈ సత్త్వగుణము గొప్పది అయితే విశుద్ధసత్త్వము మరియొకటి గలదు అది అవ్యవహారము ఇది జీవన్ముక్తుల కుండవలసినది ఇది కలుగపోయిన మోక్షము సిద్ధించదు ముక్తుడున్ను కాజాలడు పైజెప్పిన సత్త్వగుణమే సామాన్యముగా బ్రహ్మనిష్ఠులని చెప్పువారికి పూర్తిగ కనుపడుటయే అరుదై యుండగా, రజోగుణము కొంత, తమోగుణము కొంత కనబడునప్పుడు వారు ఇక నెంత కాలము వైరాగ్యముతో ఏకాంతప్రదేశ మందుండి బ్రహ్మవిచారము, ధ్యానము చేయవలసియుండునో వారిలో వారే యోచించుకొనుట బాగుండును లేనిచో వారిని నిందించినట్లు తలంచగలరు

## విశుద్ధసత్త్వము

ఇప్పుడు విశుద్ధసత్త్వముయొక్క తత్త్వమును శంకరుడు చెప్పినది చూడుడు

**విశుద్ధసత్త్వస్య గుణాః ప్రసాదః స్వాత్మానుభూతిః పరమా ప్రశాన్తిః ।**
**తృప్తిః ప్రహర్షః పరమాత్మనిష్ఠా యయా సదానన్దరసం సమృచ్ఛతి ॥**

విశుద్ధసత్త్వముయొక్క లక్షణములు ఎల్లప్పుడున్ను ప్రసన్నతయు, ఆత్మానుభవమున్ను, మిక్కిలి శాంతియు, అనగా సర్వేంద్రియ వ్యాపార ఉపరమ రూపశాంతియు, మిక్కిలి తృప్తియు, అత్యధిక సంతోషము, దేనివల్ల సదానందరసమును లెస్సగా పొందుచున్నాడో, పరమాత్మయందు నిష్ఠయు

గలుగుచున్నదో, అదే విశుద్ధసత్త్వములో నుండు ముక్తాత్మునియొక్క స్వభావమని తెలిసికొనవలయును

ప్ర – జ్ఞాన మొకటియే ముఖ్యమైన దనియు, అదొకటియే ముక్తిని గలుగజేయునదనియు, తక్కిన జప, ధ్యానాదులు అముఖ్యములనియు, క్రింది మెట్టులో నుండేవారికి చెప్పబడినవనియు, దానివలన ప్రయోజనము లేదనియు, కొందరు వేదాంతులు చెప్పుచున్నారే?

ఉ – అది నిజము, జ్ఞానమే ముఖ్యమైనది అయినను, అది ధ్యానము లేక ఈశ్వరానుగ్రహము కలుగక అంతఃకరణశుద్ధి యేర్పడక శమదమాది గుణము లలవడక శ్రవణ, మనన, నిధిద్యాసలు చేయక యెట్లు సిద్ధించునో, ఏశాస్త్రము గాని, యే ఋషిగాని చెప్పియుండలేదే అందువల్లనే సనత్కుమారమహర్షి యిట్లు తెలుపుచున్నాడు

**న ప్రమాదోఽత్ర కర్తవ్యో విదుషా మోక్షమిచ్ఛతా ।**
**ప్రమాదే జృంభతే మాయా సూర్యాపాయే తమో యథా ॥**

మోక్షమును కోరెడు విద్యావంతు డెప్పుడున్ను ప్రమాదమును పొందకూడదు అనగా బ్రహ్మసాక్షాత్కార స్థితి కలుగువరకు అనుష్ఠానములో అజాగ్రత్త చెందరాదు అజాగ్రత్త గలిగి స్వరూపస్థితి నుండి బహిర్దృష్టి కలిగినచో సూర్యు డస్తమించినపుడు చీకటి లోకమును ఆవరించునట్లు హృదయమున మాయ ప్రవేశించును రాత్రికాలములో ఇంటిలోగల దీపము ఆరిపోయిన వెంటనే చీకటి ప్రవేశించి గృహమును అంధకారము చేయున దేగాక, దేనినికూడ కనుపడకుండ చేయునుగదా!

ఉన్నతోద్యోగము లభించుటయే గొప్పకార్య మయినను దానికి తగిన ఉన్నత పరీక్షలో ఉత్తీర్ణుడు కానిచో నెట్లు సిద్ధించును? జ్ఞానమే గొప్పదైనను నిరంతర ధ్యానము లేనిచో అది లభించునది కాదు రాజ్యమునకు మహారాజ గుట గొప్పసంగతి, అయినను మహారాజు లేక సార్వభౌముడు కావలసి యుండిన నేమి చేయవలెనో, ఆ విషయమై శంకరుడు తెలిపినది చూడుడు

**అకృత్వా శత్రుసంహారమగత్వాఽఖిల భూశ్రియమ్ ।**
**రాజాఽహమితి శబ్దాన్నో రాజా భవితు మర్హతి ॥**

శత్రువులను జయింపక, సకలరాజ్య పట్టాభిషిక్తుడుగాక తాను రాజాను రాజానని చెప్పుచుండిన రాజు కాగలుగునా? అదే ప్రకారము అంతఃకరణ వృత్తులను, వాసనలను జయింపక, తాను బ్రహ్మనని, బ్రహ్మాఽస్మి యని యెన్నిసార్లు చెప్పినను, అది నిష్ప్రయోజనము బ్రహ్మము కాజాలడు. హృద యములో అధివసించియుండు అవిద్యారాజును, తనపరివారములగు ప్రకృతి గుణములను నిశ్శేష మొనర్చి మహావాక్యశ్రవణ, మనన, నిదిధ్యాసములచే బ్రహ్మాకార వృత్తి గలుగ జేసికొనవలయును

పగటి వేషధారి రాజలాంఛనములను వేసికొని, వీధిలో పరివారములతో కూడి తాను రాజానని చెప్పుచు, తిరుగుచుండినను రాజు కాగలుగునా? అని జనక భూపాలుడు సులభాయోగినిని అడిగెను భారతమున సులభా జనక సంవాదమున నిది కనందగును ఆలాగున పరమపావనులగు మహాత్ముల పవిత్ర వేషమును వేసికొని, పరమపవిత్రమగు బ్రహ్మాత్మైక్యజ్ఞానమును పొందనిచో జన్మసాఫల్యము పూర్తికాజాలదు ఈ విషయమై గీతాచార్యు డుపదేశించినది చూడుడు

**యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్ ।**
**యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః ॥**

జ్ఞానసిద్ధికొఱకు ప్రయత్నపరులై యుండువారు జ్ఞానులయొక్క అనగా యతులయొక్క లేక ఋషులయొక్క వేషములు ధరించి దానికి తగిన ధ్యాన నిష్ఠాపరులై ఉండువారు తనయందుగల ఆత్మను లేక ఈశ్వరుని లేక బ్రహ్మ మును దర్శించుచున్నారు పైజెప్పిన విధముగ మహనీయాత్ముల చిహ్నము లను ధరించి అట్టి మహనీయాత్ములవలె అనుష్ఠానము చేయక, ఆత్మసంస్కారము చేసికొనక విషయవాసనాదులచే దూషితమైన హృదయము గలవారు అట్టి ఆత్మను, బ్రహ్మమును పొందజాలరు.

మరియు శంకరులు తెలిపినది చూడుడు

**న గచ్ఛతి వినా పానం వ్యాధిరౌషధశబ్దతః ।**
**వినాஉపరోక్షానుభవం బ్రహ్మశబ్దైర్న ముచ్యతే ॥**

ఆయుర్వేదములో గల గొప్పగొప్ప ఔషధముల పేర్లు మాత్రము రోగి యైనవాడు చెప్పుచు కూర్చుండిన, రోగశాంతి కలుగునా? ఆరోగమునకు తగిన ఔషధసేవయు పథ్యమును గలిగి యుండిన మాత్రము రోగము శమించును. ఆలాగుననే భవరోగ సంబంధ విషయములు వాసనలు రహిత మొనర్చక, నియమనిష్ఠలలో నిలువక నేను బ్రహ్మము ననుచు కూర్చుండిన ముక్తి కలుగదు వ్యాధి నశించువరకు ఔషధ, పథ్యసేవలు విడువక యుండే వాని రోగము రహితమగును గాని, తదితరుల భవరోగ మెట్లు శాంతించును?

ఈ విషయమై శ్రీశంకరభగవత్పాదులు ఆత్మబోధ మున తెలిపినది చూడుడు

**ఏవం నిరంతర కృతా బ్రహ్మైవాస్మీతివాసనా ।**
**హరత్యవిద్యావిక్షేపాన్ రోగానివ రసాయనమ్ ॥**

దివ్యరసాయనమును పథ్యముతో సహా సేవించుటవలన రోగము నశించునట్లు, ఎల్లప్పుడును బ్రహ్మానుసంధానాభ్యాసము చేయుటవలన కలిగిన సంస్కారరూపమైన సద్వాసన ఆవరణ విక్షేపశక్త్యాత్మకమైన అవిద్యను బొత్తిగా పోగొట్టునని దృఢముగా నమ్మవలయును బ్రహ్మైవాస్మి అను నిరంతరా భ్యాసమువల్ల ఆత్మానుభవము దృఢముగా గలుగును

## 4. నిరంతరాభ్యాసము

ప్ర – 'బ్రహ్మైవాస్మి' అని ఒకసారి శ్రవణముచేసిన మాత్రము చాలదా? అదే మనన, నిదిధ్యాసములై పరిణమించి యెల్లప్పుడున్ను బ్రహ్మాకారస్థితిలో నిలుకడ గలుగును మరల నెల్లప్పుడును ధ్యానమేల చేయవలెను?

ఉ - మహానుభావా! అట్టివారు లోకములో అరుదు ఉండిన ధన్యాత్మలే సంశయము లేదు అయితే తనకు లేని మహిమను ప్రకటింపజూచిన ఏదో కాస్త మహిమ ఉండిన అది పోవునదేగాక భావికాలమున రానున్న మహిమాతి శయము రాకనే పోవును ఇదిన్ని బ్రహ్మనిష్ఠులు జ్ఞాపకముంచవలెను బ్రహ్మా కారస్థితి యెవరికి గలుగునో వారికి సదా బ్రహ్మాకారభావనయే యుండును మనో వాక్కాయ కర్మలచే నెల్లప్పుడును అట్టి విషయములనే వారు చెప్పుచుం దురు సూర్యోదయమైన పిమ్మట చీకటి యుండకూడదు గదా! చీకటి నశింపకయుండిన సూర్యోదయము కాలేదని నిశ్చయింపవచ్చును గదా! ఒక తేనె అమ్మెడివాడొక పాత్రలో మంచితేనె తెచ్చియుంటినని చెప్పినచో దానిని పరిశోధించి కొనేవారు క్రిందను పైనను, ప్రక్కలను రంధ్రమువేసి చూచిన అంతటను మధురమైన తేనె మాత్రము కనుపించును అట్లుగాక ఒక ప్రక్క చేదు, మరియొక ప్రక్క కారము, ఇంకొకప్రక్క ఉప్పు, వేరొకప్రక్క పులుపు కనుపడుచుండిన అది అసలు తేనె కాదనియు, కల్తీ అనియు యెట్లు తెలుసుకొనుచున్నామో, అలాగున అమృతమయమగు ఆత్మను, దైవమును, బ్రహ్మమును పొందినవారి మనోవాక్కాయ కర్మలన్నియు అమృతమయములై బ్రహ్మానందమయములై, ఆనందమయములై సత్యమయములై ఉండును అదే దానికి గురుతు

ఈవిషయమై జగద్గురువు శంకరులు ఏమి చెప్పిరో చూడుడు

**శ్రుతేశ్శతగుణం విద్యాన్మననం మననాదపి ।**
**నిదిధ్యాసం లక్షగుణమనన్తం నిర్వికల్పకమ్ ॥**

నిర్వికల్ప సమాధికి (బ్రహ్మసాక్షాత్కారమునకు) అంతరంగ సాధనములను తెలుపుచున్నారు శమదమాదులు, యమనియమాదులు బహిరంగ సాధనములని తెలియవలెను వేదాంతవాక్యశ్రవణముకంటెను, వేదాంతశాస్త్రముల పఠనములకంటెను, మనన మనునది నూరింతలు మేలగును ఆ మననముకంటెను నిదిధ్యాసము లక్షరెట్లు ఫలము కలది యగును ఆ

నిదిధ్యాసముకన్నను నిర్వికల్పసమాధి (పరమాత్మానుభవము) పరిమితి లేని ఫలము గలది అని తెలియవలెను

ఇట్లు వేదాంతాచార్య శ్రీశంకరాచార్యులవారు తెలుపుచుండగా, శ్రవణ మొక్కటియే చాలుననియు, మనన ధ్యానము లవసరము లేదనియు చెప్పువారి జ్ఞానమెటువంటిదో విజ్ఞులు తెలిసి కొందురుగాక!

## 5. శ్రవణము

నిదిధ్యాసమనగా ధ్యానమని గ్రహించునది ఇట్లు ధ్యానము చేయువారు తక్కువస్థితిలో నుండువారనియు, ధ్యానముకూడ లేనివారై ఉండువారే గొప్ప వారనియు బోధించువారు ఎట్టి స్థితిలో నుండువారో ముముక్షువులు తెలిసి కొందురు గాక! అయితే ధ్యేయాకారస్థితి పొందినవారికి ధ్యానమవసరము లేదు పొందువరకున్ను తప్పక ధ్యానము చేయవలయును పొందినచో అట్టి జీవన్ముక్తునియందు సదా బ్రహ్మాకారవృత్తి తప్ప తక్కిన వృత్తులు విషయ ములు, వాసనలు, సంకల్పము లుండవు ఈలాగున ధ్యానము తపస్సు, ఇంద్రియ నిరోధము, ఏకాగ్రత లేకపోవుటవల్లనే పూర్విక ఋషుల స్థితి వీరికి కలుగకపోవుచున్నది అంతేగాదు ఒక సంకల్పసిద్ధిగాని, వాక్శుద్ధిగాని వీరికి లేకపోవుట కిదే కారణము మరియు మహాత్ముల దర్శనమునకు సమిత్పాణులై( ఫలపుష్పాదులు తీసికొని) జనులు వెళ్ళకపోవుట కున్ను కారణమైనది దీనివల్ల అణిమాది అష్టసిద్ధులను సంపాదించవలెనని తలంపుకాదు పరమ ఋషులు గలిగియుండు భావము ఉండవలెనని భావము ఈవిషయమై కపిలమహర్షి వచించినది చూడుడు

**ప్రథమం శ్రవణం కృత్వా ద్వితీయం మననం తథా ।**
**నిదిధ్యాసనకం పశ్చాత్ సాక్షాత్కార స్తదా భవేత్ ॥**

మొదట గురుముఖము ద్వారా తత్త్వమస్యాది మహావాక్యమును

శ్రవణము చేయవలయును తదుపరి శ్రవణము చేసిన దంతయు, నితర చింతలు మాని ఏకాగ్రచిత్తముతో మననము చేయవలయును తర్వాత మననము చేసిన పరబ్రహ్మమందు నిలుకడ కలిగి స్వరూపస్థితినుండి చలింపక ఉండెడు నిదిధ్యాసమున ధ్యానము గావించవలెను ఇది పూర్వీక ఋషులయొక్క పద్ధతి అని ముముక్షువులు గ్రహించెదరుగాక! అట్లు చేయకపోవుటే ఆపరమ ఋషులయొక్క స్థానమును పొందక పోవుటకు హేతువని ఉత్తమ జిజ్ఞాసువులు గ్రహించేది ఒక ఉద్యోగమునకు మూడు గ్రంథములు(అనగా మూడు భాగములు) చదువవలసి యుండిన, ఆ మూడింటిలో ఉత్తీర్ణులైని వారికి ఆ యున్నతోద్యోగము లభించును ఒక్క భాగములో మాత్రము ఆరితేరినవారికి ఉద్యోగమెట్లు లభింపదో, ఆలాగున పై జెప్పినశ్రవణ, మనన, నిదిధ్యాసములు మూడింటిలోను ఆరితేరిన వారికే జీవన్ముక్తి యను బ్రహ్మపద ప్రాప్తియగు ఉద్యోగము లభ్యపడును

ఈవిషయమై పతంజలి మహర్షి యోగశాస్త్రములో వచించినది చూడుడు

**స తు దీర్ఘ కాల నైరంతర్య సత్కారాసేవితో దృఢభూమిః ।**

అభ్యాసము తపముతోడను, బ్రహ్మచర్యముతోడను, శ్రద్ధతోడను, జపరూపవిద్యలతోడను కూడి చిరకాలము నిరంతరము అనుష్ఠింపబడునేని దృఢమై బాహ్యసంస్కారములచే తిరస్కరింపబడ కుండుటయేగాక, ఆ బాహ్యసంస్కారములను తానే తిరస్కరించును అనగా హృదయసంస్కార వాసనావృత్తులను రహిత మొనర్చి బ్రహ్మాకారస్థితియగు ఆరూఢస్థితిలో నిల బడును

మరియు వేదవ్యాస మహాముని బ్రహ్మసూత్రములలో నిరూపించి నది చూడుడు ఇచ్చట బ్రహ్మవిచార ఫలమును గురించి విచారింపబడును అందు శ్రవణాదులు ఒక్కమారు అనుష్ఠించిన చాలునా లేక మరల మరల (అనగా ఫలము వచ్చునంతవరకు) ఆచరించుచుండవలయునా అను సంశయమును

ఈ మొదటి అధికరణమున విచారించుచున్నాడు

చతుర్థాధ్యాయము - ప్రథమపాదము

**1. ఆవృత్తి రసకృ దుపదేశాత్ ॥**

బ్రహ్మజ్ఞాన సాధనములగు శ్రవణాదులను పలుమారు అనుష్ఠింప వలయును ఈ శ్రవణాదులవలన కలుగు ఫలము దృష్ట ఫలము ఆ ఫలము (సగుణ బ్రహ్మముయొక్కగాని, నిర్గుణ బ్రహ్మముయొక్కగాని సాక్షాత్కారము) కలుగునంతవరకు ఆ ఉపాసనలను ఆచరించుచునే యుండ వలయును ఉపాసన యనగా పలుసార్లు ధ్యానము చేయుటయే. మరియు ఏదైన సూక్ష్మార్థ ప్రతిపాదకమగు ఒక శ్లోకము హృదయస్థము చేయవల సియుండిన ఒకసారి చదివిన చాలదు గదా పలుమార్లు వల్లించి యెట్లు కంఠస్థము చేయవలెనో, అట్లు సూక్ష్మాతిసూక్ష్మమై, మనోబుద్ధుల కతీతమైన బ్రహ్మమును సాక్షాత్కరించుకొనవలసియుండిన నెంత కాలము ధ్యానము చేయ వలెనో తీవ్రతర, తీవ్రతమ ముముక్షువులు గ్రహించెదరుగాక! ఏకసంథా గ్రాహులు ప్రపంచములో నెంతమంది ఉన్నారో యోచింతురుగాక!

బృహదారణ్యకమందు యాజ్ఞవల్క్యమహర్షి మైత్రేయికి బోధించినది చూడుడు

# ౬. యాజ్ఞవల్క్యమహర్షి

**ఆత్మావాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యో। మన్తవ్యో నిదిధ్యాసితవ్యః ।**

ఓ మైత్రేయీ! ఈ ఆత్మ దర్శింపదగినది, శ్రవణము చేయదగినది, మన నము చేయందగినది నిదిధ్యాసలు చేయందగినది ఇట్లు ఉపనిషత్తులు తెలుపు చుండ శ్రవణ మొకటియే చాలునని వీరు వచించుట యెంత ఆశ్చర్యకరమో ముముక్షువులే తెలిసికొందురుగాక! ఒకవేళ శ్రవణ మొకదానివల్లనే, మనన నిదిధ్యాసల సాక్షాత్కారము తనకు కలిగినదని

చెప్పినచో బ్రహ్మాకారవృత్తికన్న అన్యవాసనలుగాని, స్వభావములుగాని తమలో ఉండకూడదు గదా! పరుసవేది సంయోగముచే నినుము బంగారమైనచో మరల నినుము సంబంధ లోహగుణము,దానియందుండక పోవునుగదా! బంగారమే కావలయును గదా! పరుసవేది గలదని శాస్త్రములో విన్నాముగాని చూచినవారెవరున్ను లేరు ఆలాగున శ్రవణ మొక్కదానిచేతనే మనన నిదిధ్యాసన సాక్షాత్కారము పొందినవారిని ఎవరును చూడలేదు ఈలాటి విచారము చేయకపోవుటయే ప్రమాదము కలుగుటకు కారణము

ఒక్కొక్క గురువు దగ్గరలోను, మఠములలోను, ఆశ్రమములలోను, ఏకాంతప్రదేశములలోను, కొండగుహసమీపములలో నిప్పుడు వందలాది ముముక్షువులు, వేలాది జిజ్ఞాసువులు ఇంకను అనేక భక్తులు శ్రవణము చేయుచున్నారు శ్రవణముచేతనే మోక్షమైనచో వారందరును జీవన్ముక్తులు కావలసి ఉన్నారు గదా! ఆలాగున నెచ్చటను కనుపించుట లేదు ఎవ్వరైన గురుముఖమున శ్రవణము చేసినదానిని మనన నిదిధ్యాస లొనర్చి, సాక్షాత్కారము గలిగినవారు కొందరు మాత్రమే కనబడుచున్నారు ఇది ప్రత్యక్షానుభవము గదా!

రాగిని స్ఫుటము చేసి సువర్ణమైనచో మరల తామ్రసంబంధపు చిలుముం డురాదు ఈ విషయమై యోగవాసిష్ఠమున వసిష్ఠమునీంద్రుడు చెప్పినది చూడుడు

**యథైకం చ సువర్ణాది మిళితం రజతాదినా ।**
**అల్పమూల్యం ప్రజాయేత తథా జీవోఽవ్యహంయుతః ॥**
**యథైవ హి సువర్ణాది క్షారాదేః శోధితం శుభమ్ ।**
**పూర్వవన్మూల్యతాం యాతి తథా జీవోఽపి సంస్కృతేః ॥**

ఏలాగున శుద్ధమగు అపరంజి బంగారమునందు వెండి రాగి యిత్తడి మొదలగు చెడు లోహములు చేరినచో అది స్వల్పమగు విలువగల

దగుచున్నదో, ఆలాగున ఆత్మ శుద్ధపరబ్రహ్మము లేక ఈశ్వర స్వరూపముగా నున్నప్పటికిన్ని , ప్రకృతిసంబంధములగు అహంకారాది గుణములతో చేరునప్పుడు కించిద్జ్ఞుడైన ప్రాకృతగుణములతో గూడిన జీవుడగుచు న్నాడు అట్లైనను మలినబంగారము స్ఫుటము చేసిన తరువాత ఎట్లు అప రంజి బంగార మగుచున్నదో, అప్పుడు దానికి పూర్వముండెడు విలువ యెట్లే ర్పడుచుండునో ఆలాగున ఈ బద్ధజీవుడుగూడ ఆత్మసంస్కారము చేసికొని, శ్రవణ, మనన, నిదిధ్యాసములచేత ఈశ్వరత్వమును, బ్రహ్మత్వమును పొందుచున్నాడు ఇదే శ్రవణాదిత్రయముచే గలిగెడు ప్రయోజనము

ప్రత్యక్షముగా చూడుడు ఒక్కొక్క మానవుడు తపస్సుచే శుద్ధమై బ్రహ్మవిచారముచే దైవత్వము పొందునపుడు అట్టివారిని ఈశ్వరస్వరూపము గా తలంచుటయు, పూజించుటయు చూడటము లేదా! శ్రవణవిషయమై కఠోపనిషత్తున తెల్పినది చూడుడు

**శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః శృణ్వంతోఽపి బహవో యం న విద్యుః।**
**ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధా ఽఽశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః॥**

ఓనచికేతసుడా! ఏ యాత్మ శ్రవణము చేయుటకును, శ్రవణము చేసినను తెలిసికొనుటకును అలవి గానిదో, అట్టి ఆత్మను గురించి చెప్పువాడును, తెలిసి కొనువాడును అరుదై యున్నాడని యముడు పలికెను మరియు ఒక వేళ చెప్పువాడు దొరికినను అతడు బ్రహ్మనిష్ఠాపరుడగు గురువరేణ్యునిచేత సుశిక్షితుడై యుండుటయు అరుదు ఒకవేళ గురువైనవాడు సుశిక్షితుడైనను శమదమాది గుణములు గలిగి బ్రహ్మచర్య వ్రతనిష్ఠగలవాడును, చిత్తైకాగ్రత సిద్ధించినవాడునగు శిష్యుడు దొరకుట యున్ను మహాప్రయాసము అట్లు దొరికినచో అది పరమాశ్చర్యము ఈ విషయమే శ్రీభగవద్గీతలో కృష్ణభగవానుడున్ను ఏడవ అధ్యాయమున తెలిపెను

**మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।**

**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥**

వేలకొలది మనుష్యులలో నొకానొకడు ఆత్మజ్ఞానసిద్ధి కొఱకు (ఈశ్వరప్రాప్తికొరకు) యత్నించుచున్నాడు అలాగున వేలకొలది యత్నపరులలో ఒకానొకడు మాత్రమే సరిగా అనుష్ఠానము గలవాడుగ ఉండును అట్టి అనుష్ఠానముగల వేలకొలది జనులలో ఒకానొకడు మాత్రమే గ్రంథివిముక్తిని పొంది నన్ను అనగా పరమాత్మను పొందుచున్నాడు

ఈ విషయమై అష్టావక్రమునీంద్రుడు జనకమహారాజా గారికి అష్టావక్రగీతయం దుపదేశించినది చూడందగును

## 7. అష్టావక్ర మహాముని.

**శైలే శైలే న మాణిక్యం మౌక్తికం న గజే గజే ।**
**సాధవో నైవ సర్వత్ర చందనం న వనే వనే ॥**

రాళ్ళుగుట్ట లనేకములు అచ్చటచ్చట విస్తారముగా నుండినను వానిలో మాణిక్యరత్న మెంత దుర్లభమో, గజసమూహములు ఎన్నియో ఉండినను ముత్యములుగల యేనుగెటుల అరుదో, వృక్షము లెల్లెడలను అనేకములుగా నుండినను వానియందు శ్రీగంధవృక్ష మెటుల దుర్లభమో ఆలాగున సాధువులు, సన్న్యాసులు అనేకులు అంతటను కనుపించుచుండినను నిజమైన సాధనానుష్ఠాన పరుడైన సాధువు గానుపించుట మహాదుర్లభముగా నుండును

**భిద్యతే హృదయ గ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః ।**
**క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥**

పరబ్రహ్మము సాక్షాత్కరించునపుడు హృదయగ్రంథులు అన్నియు, భేదింపబడుచున్నవి ఈ బ్రహ్మనిష్ఠునియొక్క సర్వసంశయములు తీరును ఈతనియొక్క సమస్తకర్మములు క్షయించునని కఠశ్రుతి పలుకుచున్నది

హృదయగ్రంథులనగా ముడులు, ఏముడులన అనాత్మ స్వరూపము

లగు విషయవాసన, ప్రకృతిగుణములతో బంధింపబడిన ఆత్మయొక్క బంధములు నశించును జీవాత్మ పరమాత్మ అగునా యను సంశయము తొలగును సమస్త కర్మములును విలయము నొందును దీనియొక్క అర్థమును బాగుగా చింతన చేసినచో తాను ముక్తాత్ముడైనాడా? లేక యింకను ప్రాకృతవిషయ పాశములచే బద్ధుడై యున్నాడా? అని తెలిసికొనవచ్చును కావుననే శ్రవణ మొక్కటి చాలదు మనన నిదిధ్యాసములచే బాగుగా చింతన చేయవలెనని శాస్త్రము చెప్పుట సిద్ధము

**ప్రమాదినో బహిశ్చిత్తా పిశునాః కలహోత్సుకాః ।**
**సన్న్యాసినోఽపి దృశ్యం తే దేవసందూషితాశయాః ॥**

కొందరు సంన్యాసాశ్రమమును గ్రహించియు, వేదాంత విచారాదుల యందు శ్రద్ధలేనివారును, బాహ్యావిషయములయం దాసక్త మగు చిత్తము గల వారును, ఇతరజనులయొక్క దోషములను, తదితర జనులతో చెప్పు స్వభావము గలవారును, ఒకరితో నొకరు కలహించువారుగా నున్నారు కారణము దేవతలచే దూషితములైన హృదయము గలవారగుట ఇట్టివారు అదృష్టములగు విఘ్నదేవతలు మానవశరీరము గ్రహించినవారని గ్రహించుకొనవలెను వీరున్ను విఘ్నదేవతలలో ఒకతరగతిలో చేరినవారే అయితే మొట్ట మొదట చెప్పిన శిశ్నోదర పరాయణులగు మలినవిఘ్న దేవతలు కారు గొప్ప ప్రజ్ఞయు, మేధాశక్తియు గలవారే యని విద్యారణ్యగురుడు జీవన్ముక్తి ప్రకాశికయందు తెలిపెను

## 8. శుష్కవేదాంతులు

**శుష్కవేదాంతినః కేచిత్ భిక్షుకా విఘ్న దేవతాః ।**
**చర న్తి బ్రహ్మవిద్యాయాం మా గచ్ఛన్తు ముముక్షవః ॥**

వేదాంతము చదివినవారు కొందరు సన్న్యాసులు, మరికొందరు శుష్కవే దాంతులై బ్రహ్మవిద్యకు విఘ్న దేవతలై భూలోకములో

సంచరించుచున్నారు కావున ఓ ముముక్షువులారా! వారి చెంతకు జనకుడు, వారు మిమ్ములను అనుష్ఠానరహితులను చేయుదురు

సరియైన సన్న్యాసులచెంత చేరినచో జీవుడగు మిమ్ములను శివుడుగా జేయుదురు అట్లు కానివారిచెంత చేరినచో శివుడగు మిమ్ములను పశువుగా మార్చివేయుదురు ఇది బాగుగా జ్ఞప్తియందుంచుకొనుడు అట్టిస్థితి, అట్టి ఆపత్తు ఇప్పుడు ప్రపంచమునకు వచ్చినది భిక్షువులై యుండువారలలో చాలా మందిన్ని బిచ్చకారు లగుచున్నారు ఇది కడుంగడు శోచనీయము 'భి' యొక్క వత్తు లోపించినపుడు 'బి' అగుచున్నదికదా! ఆలాగుననే 'క్ష' కారము భ్రష్టమ గునపుడు 'చ' కారమగుచున్నది అనగా భిక్షువులలో కొందరు బిచ్చకారులగుచున్నారు ఈ ప్రమాదమునుండి ముముక్షువులను రక్షించుటకు భిక్షువులందరున్ను, బ్రహ్మనిష్ఠులందరున్ను, విద్యావంతు లందరున్ను, వీరికి సహాయముగా శ్రీమంతులందరును ప్రయత్నము చేయవలసిన కాలమాసన్న మైనది

స్వరాజ్యమును పరరాజులు ఆక్రమించెడు కాలము తటస్థించినపుడు దేశీయులందరున్ను ఒకే మనస్సు గలవారై ధైర్యసాహసములతో పరరాజులను వారిసైన్యముల నెదుర్కొని పరాజితులుగా చేసి ఎట్లు ఓడించవలసి యున్నారో, అట్టి విపద్దశ, స్వారాజ్యమగు ఆత్మరాజ్యమునకు కలుగుకాలము ఆసన్నమైనది. కావున ముముక్షువు లందరు జాగ్రత్త గలిగి యుండుడు తస్మాత్ జాగ్రత జాగ్రత

**శ్రవణం గురుశాస్త్రాభ్యాం మననం తు స్వయుక్తిభిః ।**
**విజ్ఞానం స్వానుభూత్యేతి శ్రవణాదేరసంకరః ॥**

గురువువల్లను, శాస్త్రములవల్లను వినుట శ్రవణము విన్నదానిని తన యుక్తులతో ఆలోచించుట మననము తన అనుభవమువలన విజ్ఞానము కలుగును ఆలాగున వరుసగా మూడున్ను చేయుచున్నప్పుడే శ్రవణము సంపూర్ణమగును లేనిచో అసంపూర్ణమని గ్రహించేది

**శ్రవణం తు గురోః పూర్వం మననం తదనంతరమ్ ।**
**నిదిధ్యాసనమిత్యేత త్పూర్ణబోధస్య కారణమ్ ॥**

ప్రథమమున గురుముఖమున తత్త్వమస్యాది మహావాక్యమును శ్రవణము చేయవలెను తరువాత శ్రవణము చేసిన దానిని బాగుగ మననము ఏకాంత మున చేయవలెను. పిమ్మట నిదిధ్యాసనము ( అనగా ధ్యానము) చేసి ధ్యేయా కారస్థితిపొందుట పూర్ణబోధముయొక్క పద్ధతి యగును ఆలాగున చేయనిచో ఆశ్రవణము అసంపూర్ణమే యగును సంపూర్ణబోధము గాజాలదు

# 9. యోగతత్త్వోపనిషత్తు

ఈవిషయమై యోగతత్త్వోపనిషత్తునందు శ్రీ నారాయణమూర్తి చతుర్ముఖ బ్రహ్మదేవుని కుపదేశించినది చూడుడు బ్రహ్మదేవుని ప్రశ్న యోగము చేత మోక్షము గలుగునా? లేక జ్ఞానము చేత మోక్షము సంభవిం చునా? అను ప్రశ్నకు శ్రీ నారాయణమూర్తి బోధించినది చూడుడీ!

**యోగహీనం కథం జ్ఞానం మోక్షదం భవతి ధ్రువమ్**
**యోగోఽపి జ్ఞానహీనస్తు న క్షమో మోక్షకర్మణి ।**
**తస్మాజ్ఞ్జానం చ యోగం చ ముముక్షుర్దృఢమభ్యసేత్ ॥**

యోగములేని జ్ఞానమెట్లు మోక్షము నొసంగును? అట్లే జ్ఞానము లేని యోగమున్ను మోక్షము నొసంగదు కాబట్టి మోక్షమును గోరువాడు జ్ఞానమును, యోగమును చక్కగా అభ్యసింపవలయును

ఇది శ్రీనారాయణమూర్తి బ్రహ్మదేవునకు ఉపదేశించిన వాక్యమని మరువకుడు యోగమనినను, తపస్సనినను ఒకటే యని గ్రహించేది జ్ఞానము ఆత్మస్వరూపమును స్పష్టముగా తెలుపును యోగము అంతఃకరణ ములో గల విషయవాసనలను, ప్రాకృత సంస్కారములను శుద్ధపరచి బుద్ధి నేకాగ్రముగాను నిర్మలముగాను చేయును. ఇదే యోగమందుగాని, తప

స్సునందుగాని, జ్ఞానమునందుగాని గల రహస్యము కావుననే యిప్పుడు జ్ఞానము నొకదానిని మాత్రము శాస్త్రములద్వారా శ్రవణము చేసినవారై యుండినను, హృదయములోగల వాసనాక్షయము, మనోనాశము కలుగ కున్నది గీతయందు శ్రీకృష్ణభగవానుడు దీనినే ఉపదేశించెను

**సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః ।**
**యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి ॥**

ఓ అర్జునా! సంన్యాసయోగము(జ్ఞానము) యోగానుష్ఠానము లేకయే (అంతఃకరణశుద్ధి లేకయే) పొందుటకు సాధ్యముగానిది యోగనిష్ఠాపరు డగు ముని (మననశీలుడు) బ్రహ్మమును శీఘ్రముగా పొందుచున్నాడు

**అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।**
**వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ॥**

ఈయోగమును అభ్యాస వైరాగ్యములచేత నిగ్రహింపబడని మనస్సు గలవాడు బొందజాలడు మాటిమాటికి నెడతెగక ప్రయత్నించుచు అభ్యాసవై రాగ్యములతో గూడిన మనోనిగ్రహ మనునట్టి ఉపాయముగల యోగి ఈ ఆత్మయోగమును పొందగలడు

## 10పంచదశి. ధ్యానదీపము

**అనాత్మబుద్ధిశైథిల్యం ఫలం ధ్యానాద్దినే దినే ।**
**పశ్యన్నపి న చేద్ధ్యాయేత్కోఽపరోఽస్మాత్పశుర్వద ॥**

ఏ పురుషుడు బ్రహ్మధ్యానమువలన ప్రతిదినమందును అనాత్మబుద్ధి శైథిల్యరూపమగు ఫలమును జూచుచున్న వాడగుచుండియు ధ్యానమును చేయడో, వీనికంటె ఇతరమైన పశువెద్దియో చెప్పుమా? అనగా నిట్టివాడు పశు ప్రాయుడని అభిప్రాయము ఇది విద్యారణ్య గురుం డుపదేశించి

నదేగాని, నేను చెప్పినట్లు తలంప కుందురుగాక!

**బోధాదూర్ధ్వం చ తద్ధ్యేయం జీవన్ముక్తి ప్రసిద్ధయే ।**
**కామాది క్లేశబంధేన యుక్తస్య న హిముక్తతా ॥**

వేదాంతశాస్త్ర విచారణబలముచే తత్త్వబోధము గలిగినను జీవన్ముక్తి దృఢపడుటకొరకు మరల మరల బ్రహ్మచింతనము, తదేకధ్యానము అవశ్యముగా జేయవలెను రాగద్వేషములను విషయాది దోషములు గలవాడు యోగి అయినను ముక్తి గలుగదు ఇదిన్ని శ్రీవిద్యారణ్య గురువాక్యమని మరువకుడు

**యథా సౌధాది నిర్మాణం గగనే వితథం భవేత్ ।**
**తథా యోగాదికం త్యక్త్వా జ్ఞానసిద్ధిం సువిస్థత ॥**

ఏలాగున సౌధము నిర్మించువారు చారువ మొదలైనవి కట్టక ఒకటి రెండు మూడు అంతస్తులు నిర్మింపక, ఆకాశమందు నాల్గవ అంతస్తు కట్టదలంచిన తాను పెట్టిన ఇటుక, సున్నము మొదలైనవి నిలువక క్రిందకు జారిపోవు చుండునో, అలాగున యోగ, ధ్యానాదులు చేయక నాలుగవ అంతస్తగు మోక్షహర్మ్యమును నిర్మించ తలంచు వానిగతియు నుండునని మరువకుడు అది నిలువజాలదు

**మణిమంత్రౌషధైర్వహ్నిః సుదీప్తోఽపి యథేద్ధనమ్ ।**
**ప్రదగ్ధుం నైవ శక్తః స్యాత్ప్రతిబద్ధస్తథైవ చ ॥**
**జ్ఞానాగ్నిరపి సంజాతః ప్రదీప్తః సుదృఢోఽపి చ ।**
**ప్రదగ్ధుం నైవశక్తః స్యాత్ప్రతిబద్ధస్తు కిల్బిషమ్ ॥**

అగ్నిహోత్రుడు గొప్పగా ప్రజల్వించు చుండినను మణి, మంత్ర, ఔషధములచే కట్టుబడిన యేలాగున కట్టెలనుగాని, కట్టకడపట శుష్కతృణమును గాని దహింపజేయ శక్తి లేకపోవుచుండునో, అలాగున ఆత్మజ్ఞానబోధము చెప్పుటకు గొప్ప సమర్థత గలవాడైనను విషయాది

దోషము కలిగియుండిన ప్రతిబంధమును, అవిద్యా, కామాదులను భస్మీకరింపజాలడు దీనికన్న ఇక నెక్కువ చెప్పంబనిలేదు గదా। అంతఃకరణములో గల వాసన, వృత్తి, అవిద్య, గుణములు నశించుటకే ధ్యానము చెప్పడమైనది

## 11. అనుభూతిప్రకాశము

**యాగజ్ఞానమనుష్ఠానాద్వినా న స్వర్గదం తథా ।**
**బ్రహ్మజ్ఞానమనుష్ఠానా ద్వినా సర్వాప్తిదం కథమ్ ॥**

యజ్ఞములనుగూర్చి తెలిసికొన్నంత మాత్రమున, బహుళముగ వివరించి చెప్పకలిగినంత మాత్రమున స్వర్గప్రాప్తి యెట్లు కలుగును? యజ్ఞమును విధి ప్రకారము ఆచరించిన మాత్రమున గదా స్వర్గఫలము లభించును బ్రహ్మజ్ఞా నమును తెలిసికొనుటచేతను, బోధించుటకు శక్తి కలిగినంత మాత్రము చేతను అనుష్ఠానము లేనిదే సర్వాత్మకత్వమగు ఆత్మజ్ఞాన మెట్లు సిద్ధించునని అనుభూతిప్రకాశ మడుగుచున్నది.

**గృహత్యాగో వనేవాసః సన్న్యాసో మౌనమేవ చ ।**
**ఇత్యాది లక్షణై రేవ కృతార్థో నైవ జాయతే ॥**
**క్షణం వా న వృథాకాలం నయేద్యస్తు స ధన్యవాన్।**
**స ఏవ సుకృతీ లోకే పూర్ణవైరాగ్యభాగ్యవాన్ ॥**

గృహత్యాగముచేతను, వనమున నివసించుట చేతను, సన్న్యసించుటవలనను, మౌనముగా నుండుటవలనను ఇత్యాది లక్షణములచేత కృతార్థుడు కాజాలడు

ఒక క్షణకాలమైన వృథాచేయక బ్రహ్మభావములో లేక భగవచ్చింతనలో కాలము గడుపువాడెవడో వాడే ధన్యాత్ముడు. వాడే లోకములో మహాపుణ్యా త్ముడు వాడే పూర్ణవైరాగ్య భాగ్యవంతుడు

పైజెప్పినవన్నియు దేహసంబంధ గుర్తులేగాని దానికి తగిన

అనుష్ఠానము గలిగియుండినచో వాడు ధన్యాత్ముడే, సందేహము లేదు

## 12. సోఽహము

**యథా చ మలినే వస్త్రే రంగశ్శుభతరో న హి ।**
**క్షాళనే హి కృతే శుద్ధే సర్వో రంగః ప్రసజ్జతే ॥**

ఏలాగున మలినమైన వస్త్రము ఎంత మంచిరంగు అద్దినను ఎట్లు నిలువ జాలదో, శుద్ధముగా ఉతికిన తరువాతనే రంగు వేసినప్పటికిన్ని ఏలాగున పట్టుకొనునో, ఆలాగున అంతఃకరణములో విషయవాసనాది దోషముండిన మహావాక్యమగు బ్రహ్మాఽస్మి యని, సోఽహం అని, శివోఽహం అని యెన్ని సార్లు భావించినను అది ఫలింపజాలదు

**మలినోఽహి యథాఽఽదర్శో రూపాలోకస్య న క్షమః ।**
**తథాఽవిపక్వకరణ ఆత్మజ్ఞానస్య న క్షమః ॥**

ఏలాగున మలినమైన అద్దములో తనస్వరూపము స్పష్టముగా ప్రతిఫలింపజాలదో, ఆలాగుననే శుద్ధముగాని అంతఃకరణమున బ్రహ్మభావన నిలువజాలదు బ్రహ్మానుభవమునకు నిలుకడ గలుగదు

**ఫలం కతకవృక్షస్య యద్యప్యంబు ప్రసాదకమ్ ।**
**న నామగ్రహణాదేవ తస్య వారి ప్రసీదతి ॥**

ఏలాగున చిల్లగింజపేరు ఎన్ని సార్లు ఉచ్చరించినను జలము శుభ్రము కాదో, కతక రేణువును చక్కగా నూరి, నీటిలో కలిపిన మాత్రముచే నీరు శుభ్రమగునో ఆలాగున ''బ్రహ్మాఽస్మి' 'సోఽహం' 'శివోఽహం'' అని యెన్నిసార్లు జపించినను ఆత్మసాక్షాత్కారము కలుగదు నిదిధ్యాసన పరమగు ధ్యానము చేతనే అట్టిజ్ఞానము సిద్ధించును

**అంత స్తిమిరనాశాయ శాబ్దబోధో నిరర్థకః ।**
**న నశ్యతి తమోనామ కృతీయా దీపవార్తయా ॥**

గృహాంతరాళములో రాత్రి కాలమున నిబిడమైయుండు చీకటి పోవుటకు దీపము, దీపమని యెన్ని సార్లు ఉచ్చరించినను తమస్సు ఎట్లు నశించదో, శుద్ధముగా దీపము వెలిగించిన మాత్రముననే అంధకారమెట్లు పటా పంచలగునో ఆలాగున చక్కని ధ్యానపరమగు నిదిధ్యాసన చేయుటచేతనే అవిద్య నశించును దీనియం దొక రహస్యము గలదు దీపప్రకాశముచేతనే చీకటి నశించుననియు, ఆలాగున జ్ఞానప్రకాశము చేతనే అజ్ఞానము తొలగు ననియు కొందరు చెప్పుదురు అది నిజమే అయితే దీపము వెలుగుటకు సాధన ములగు తైలము, వత్తియును, ప్రమిదయున్ను లేనిచో నెవడు దీపము వెలిగించ గలుగును? ఎచ్చటైన వెలిగించ గలుగునా? కావున సాధనసంపత్తియు, వైరాగ్యబోధోపరతులు కలిగిన హృదయమందు మాత్రమే జ్ఞానజ్యోతి వెలుగును అదే యిప్పుడు ప్రపంచములో కొరత పడియున్నది

ప్రమిద, తైలము, వత్తి అను ఉపకరణములు లేనిచో నెన్ని అగ్గిపుల్లలు గీసి వెలిగించినను దీపము వెలుగజాలదు, కావుననే బహుకాలము వేదాంతశ్రవణము జేసియు ఆత్మజ్యోతి వెలుగకపోవుట అని విజ్ఞులు గ్రహింతురుగాక! తైలము, ప్రమిద, వత్తి అను ఉపకరణము లుండిన స్వగ్రామమున పూరిగుడిసెలో నుండు ముదుసలి అయినను దీపము వెలిగించును అట్టి సాధనలు లేనిచో బదరికాశ్రమాది పుణ్యభూమిలో మంచి మఠమున లేక కొండగుహయందు శాస్త్రపారంగతుడగు పండితుడైనను లేక సర్వసంగ పరిత్యాగియగు సన్న్యాసియైనను దీపమెట్లు వెలిగింపజాలడో అను సత్యమెరింగిన జాలును ఈ పరమ సత్యమును తెలుసుకొనజాలక పవిత్రులగు అనుష్ఠానము గలవారిని జూచి వీరందరు క్రింది మెట్టులో నుండువారు, దీనికన్న పరమైయుండు పరమసత్యముఎనింకను నెరుగ లేదని చెప్పువారి స్థితిని విజ్ఞులు తెలిసికొందురుగాక!

**దారుణగాఢాంధకారం బడంగునే వసుధపై ఘృతదీప వార్తవలన**
**నాకొన్న మనుజాని ఆకలి దీరునే ఘనసరసాన్నవర్ణనమువలన**

**నిఱుపేదవాని పేదఱికంబు వోవునే ద్రవ్యప్రభావ కీర్తనమువలన
రోగపీడితుని బల్ రోగంబు దీరునే కలితౌషధ ప్రసంగంబువలన
జండివడి బుద్ధిలో వెలినిండి మిగుల దట్టమైనట్టి యజ్ఞాన తమము దెగునె
తర్కిత విచిత్ర శబ్ద బోధంబువలన ఫలిత యోగానుభవ దృష్టివలనగాక!**

## 13. ప్రశ్న

ప్రశ్న  భగవద్గీతయందు జ్ఞానమే గొప్పదని చెప్పలేదా?

**న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి ॥**

ఉత్తరము  నాయనా! మీరు చెప్పిన వాక్యము సత్యము  అయితే మొదటిపాదము మాత్రమే చదివితివి  రెండవపాదము చదివియుండినచో నీ సందేహము కలుగదు  కావుననే పూర్వాపరములను తెలిసికొనియే సిద్ధాంతము చేయవలెనని శాస్త్రనిర్ణయము  లేనిచో వాది ప్రతివాదుల నుభయులను విచారింపక తీర్పు చెప్పిన న్యాయాధిపతివలె నుండునని గ్రహించుకొనవలెను  మొదటి పాదములో, లోకములో జ్ఞానముతో సమానమైనదియు, పవిత్రమైనదియు మరియొకటి లేదని శ్రీకృష్ణభగవాను  డుపదేశించెను , రెండవపాదమున అట్టిజ్ఞానమును యోగసిద్ధిని పొందినవాడు కాలము పరిపక్వమగునపుడు తనలో తానే పొందుచున్నాడని తెలిపినది  చూడుమా! అప్పుడు మీ సంశయము నివారణము కాగలుగును  ఈ అధ్యాయములోనే భగవానుడు తెలిపి నది చూడుడు

**యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురు తేఽర్జున ।
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥**

ఏప్రకారము చక్కగా రగులుచుండెడు అగ్నిహోత్రుడు సమిధలను అనగా కట్టెలను హోమద్రవ్యములను భస్మము చేయుచున్నాడో, ఆ ప్రకారముగానే జ్ఞానమనెడు అగ్ని సమస్తకర్మలను భస్మము చేయుచున్నది

నిర్మలాత్మా! దీనియందు ప్రజ్వలించుచుండు అగ్నిహోత్రుడు సమిధలను భస్మమొనర్చునని తెలుపడమైనది మండుచుండు అగ్నిలో హవన మొనర్చెడు హవిస్సు, సమిధలను భస్మ మొనర్చవలెను గదా! అది సత్యమే అయితే హోమించిన హోమద్రవ్యములు, హవిస్సు, నవధాన్యములు, నవవిధ సమిధలు అట్లే యుండినచో నిప్పు మండుటలేదని తెలుసుకొనవచ్చును గదా! ఆలాగుననే హృదయములో జ్ఞానాగ్ని ప్రజ్వరిల్లుచుండిన పైజెప్పిన విధముగా కర్మలన్నియు, వాసనలన్నియు ప్రాకృతవృత్తులన్నియు సమసిపోవలెను గదా! ఈవిషయవాసన వృత్తి గలిగియుండినచో దానియందు నిప్పు లేదని గ్రహించు కొనవలెను

# 14. జ్ఞానము

కావుననే పదమూడవ అధ్యాయమున శ్రీకృష్ణభగవానుడు 8-వశ్లోకము నుండి 12-వ శ్లోకమువరకు జ్ఞానికుండవలసిన అమానిత్వాది గుణములను వివరించిన తరువాత పదుమూడవ శ్లోకము నుండి 19-వ శ్లోకమువరకు జ్ఞేయస్వరూపమునుగూర్చి 'జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి' యని ఉపదేశించినది ఇది ఒకటి గ్రహించినచాలును మరియు 12-వ అధ్యాయమున 13-వ శ్లోకము 'అద్వేష్టాసర్వభూతానాం' నుండి 17-వ శ్లోకమువరకు ఐదు శ్లోకములచేత పరమభక్తుని లక్షణముపదేశించడమైనది దీనికన్న పరమభక్తులున్ను, జ్ఞాను లున్ను గ్రహించవలసినది లేదు ఇక ఆరవ అధ్యాయములో శ్రీభగవాను డుప దేశించిన పరమసత్యమగు ఒక శ్లోకమను నిరూపించి ఈ అధ్యాయమును నిలిపెద

**ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।**
**అనేక జన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్ ॥**

పట్టుదలతో యత్నించుచున్న యోగనిష్ఠుడు పాపరాహిత్యము గలవాడై అనేకజన్మములయందు అభ్యసించుటవలన పొందదగిన యోగసిద్ధిని పొందినవాడై జ్ఞానము గలిగి సర్వోత్తమమగు మోక్షమును పొందుచున్నాడు

7-వ అధ్యాయములో నీలాటి మరియొక శ్లోకముగూడ కలదు. ఇదంతయు శ్రీభగవానునియొక్క సర్వోపదేశమని గ్రహించవలెను

**బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే ।**
**వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥**

ఎవడు అనేక జన్మములలో నాచరించిన పుణ్యసంస్కారమువలన అంతః కరణము శుద్ధమై, కడపట సమస్తమును వాసుదేవమయమను జ్ఞానము గలవా డగుచు నన్ను పొందుచున్నాడో, అటువంటి మహాత్ముడు మిక్కిలి దుర్లభుడు

శ్రీభగవానుడు అటువంటివానిని మహాత్ముడనియు, మిక్కిలి దుర్లభుడనియు తెలిపెను దుర్లభుడని చెప్పక సుదుర్లభుడు అని ఉపదేశించెనే, వైష్ణవులు అంతయు విష్ణుమయమనియు, శైవులు అంతయు శివమయమనియు, వేదాంతులు అంతయు బ్రహ్మమయ మనియు చెప్పెడి వాక్యమిది గదా! కావుననే సర్వం ఖల్విదం బ్రహ్మ అని వేదాంతముయొక్క అంతిమ పదమని గ్రహింపుడు విష్ణుభక్తులైనను, శివభక్తులైనను, వేదాంతులైనను ఇట్టి అవస్థ తమకు కలుగవలెను అప్పుడే పూర్ణత్వము పొందిన వారగుదురు

## 15. జీవన్ముక్తికి సాధనములు

1 తత్త్వజ్ఞానము, 2 మనోనాశము, 3 వాసనాక్షయము అను ఈ మూడు జీవన్ముక్తికి సాధనములు.

ఈ విషయము యోగవాసిష్ఠమున ఉపశమప్రకరణముయొక్క అంతిమభాగమునందు తెలుపడమైనది

**వాసనాక్షయ విజ్ఞాన మనోనాశా మహామతే! ।**
**సమకాలం చిరాభ్యస్తా భవంతి ఫలదా ఇమే ॥**

వాసనాక్షయము, తత్త్వజ్ఞానము, మనోనాశము – ఈ మూటిని

నేకకాలమునందు చిరకాల మభ్యసింపవలెను ఇట్టి చిరకాలాభ్యాసము చేతనే యీ మూడు మోక్షఫలము నియ్యగలవని యర్థము.

**త్రయ ఏతే సమం యావన్న స్వభ్యస్తా ముహుర్ముహుః ।**
**తావన్న పదసంప్రాప్తిర్భవత్యపి సమాశతైః ॥**

ఈ వాసనాక్షయము మొదలగు మూడుసాధనములు ఎంత వరకు సమకాలమునందు మాటిమాటికి చక్కగా నభ్యసింపబడవో, యంతవరకు నూఱుసంవత్సరములకైనను మోక్షము కలుగనేరదు ఈ మూడున్ను ఏకకాలములోనే అనుష్ఠించవలయును కల్పశాస్త్రమందు త్రిఫలయోగము గలదు అనగా కరక్కాయ, తాండ్రకాయ, ఉసిరిక కాయ ఈ మూడు చూర్ణ ములను ఒకే కాలమున తేనెలో కలిపి సేవించవలెను ఒక్కొక్క కాలమున ఒక్కొక్క చూర్ణము సేవించిన నెట్లు ఫలమును కలుగజేయదో, అలాగున దీపము వెలిగి చీకటి నశించవలసి యుండిన ప్రమిద, తైలము, వత్తి యివి ఒకే సమయమున ఒకేస్థలమున నుండినమాత్రమే దీపము వెలుగును, భిన్న భిన్న కాలములలో కాని భిన్నభిన్న స్థలములలోగాని ఉంచిన దీపము ప్రకాశించి తమస్సును రహిత మొనర్పజాలదు కావున వాసనాక్షయ, మనోనాశ, తత్త్వ జ్ఞానములు మూడున్ను ఏక కాలములోనే అభ్యసించవలెను మనోనాశనమైన తరువాత వాసనాక్షయమునుగాని, వాసనాక్షయా నంతరము తత్త్వజ్ఞానా భ్యాసముగాని చేయవలెనని తలంచవలదు

కొందరు ఉద్యోగస్థులుగాని, గృహస్థులుగాని తమ పన్నులన్నియు పూర్తి అయిన పిమ్మట నేకాంత ప్రదేశమున, నిర్మలస్థలమున జేరి బ్రహ్మచింతన చేయువలెనని తలంతురు ఇది మాయచేసిన మోసమని జ్ఞాపకముంచుడు ఏలన మీరెంతకాలము జీవించ గలరని చెప్పగలరు? కావున నీసంసారకాలములోనే భగవత్స్మరణ, బ్రహ్మ నిష్ఠ చేసికొనేలాగున చూడవలెను లేనిచో మోసపోయెదరు సంసారములోనే కొంచెము కాలమును సంపాదించి, కొంచెము పవిత్రతను సంపాదించుకొని

అనుష్ఠానము చేయుచుండవలెను లేనిచో సేతుస్నానమునకు పోయిన వారు సముద్రములోగల అలలు అణిగిన తరువాత స్నానము చేయవచ్చునని తలంచి నట్లుండును వీరెంతకాలము కూర్చుండినను సముద్రమున్నంతవరకు కెరట ములు ఉండనే ఉండును కావున అలలు అణిగేది లేదు. వీరు స్నానము చేసేది లేదు కావున నీ క్షణములోనే జాగ్రత్త వహించుకొనుడు

వాసనాక్షయాదులను మూడింటిని సమకాలముగా స్వల్పకాలము అభ్యసించితే చాలదా? చిరకాలము ఏల అభ్యసించవలయునంటే చిరకాలా భ్యాసమునకు ప్రయోజనము వసిష్ఠమహర్షిచే చెప్పబడినది కొందరు వేదాం తులు తత్త్వమసి మహావాక్యమును ఒకసారి శ్రవణముచేసిన చాలదా? మరల నెల్లప్పుడున్ను ప్రతిరోజున్ను ఎందుకు ధ్యానము చేయవలెనని అడుగుదురు. ఇట్టివారే దీనియందు మొదట చెప్పబడిన విఘ్నదేవతలని మరువకుడు దీనికి వారు ఈ లాగున చెప్పుదురు మీపేరు రామకృష్ణుడు లేక కృష్ణమ్మ అని ఒక సారి వినిన చాలదా? మరల మరల రామకృష్ణుడు కృష్ణమ్మయని యెందుకు అనుకొనుచుండవలెను ఇట్టి వాక్యము విఘ్నదేవతలదని మరువకుడు వారు చెప్పేరీతి కాదు పూర్వతనమైన, ఆస్థిగతమైన దీర్ఘకాల వ్యాధికలవాడు ఒక్క సారి మందు ఎట్లు తిన్న చాలదో, వ్యాధి నశించువరకు ఔషధసేవ, పథ్యమెట్లు గలిగియుండవలెనో, ఇట్టిదే భవరోగమునకు బ్రహ్మజ్ఞా నౌషధమని మరువకుడు కనుకనే

**ఏవం నిరంతరకృతా బ్రహ్మైవాస్మీతి వాసనా ।**
**హరత్యవిద్యావిక్షేపాన్ రోగానివ రసాయనమ్ ॥**

అని ఆత్మబోధలో శంకరు లుపదేశించిరి దీని అర్థము ఇదివరలో వ్రాయబడినది

**త్రిభిరేతైశ్చిరాభ్యస్తైర్హృదయగ్రంథయో దృఢాః ।**
**నిశ్శంక మేవ త్రుట్యంతి బిసచ్ఛేదాద్గుణా ఇవ ॥**

ఈ వాసనాక్షయాదులు మూడు చిరకాల మభ్యసింపబడిన పక్షమందు దృఢములైన యవిద్యా కామ కర్మవాసన లన్నియు తామరకాడను త్రుంచితే దానియందుండు దారము లన్నియు తెగిపోవునట్లు నిస్సంశయముగా నశించును. ఇదియే చిరకాలాభ్యాసమునకు ప్రయోజనము స్వల్పకాలాభ్యాసమునకు ఇట్టి ప్రయోజనము కలుగనేరదని భావము దీనియందు ఒక రహస్యము గలదు తామరకాడగాని, అరటి వూసగాని విరిచినను దానిలోగల సూక్ష్మ మైన దారము తెగిపోదు విరిచి బలాత్కారముగా, లాగి కొంచెము దూరమునకు విసరివేయవలెను ఆలాగున సంసారవాసనా రూపమగు మాయాపాశమును, వైరాగ్యముచేత త్రుంచినను దానికి దగ్గర నుండరాదు దూరముగా వెళ్లవలెను

**జన్మాంతరశతాభ్యస్తా రామ సంసార సంస్థితిః ।**
**సా చిరాభ్యాసయోగేన వినా న క్షీయతే క్వచిత్ ॥**

ఓ రామచంద్రా! ఈ సంసారస్థితి అనేక సహస్రజన్మలనుండి యనుభవించబడి దృఢమూలమై యున్నందున విశేషకాలము తత్త్వజ్ఞానాదుల యొక్క యభ్యాసము లేక నశింపనేరదు

చింతచెట్టు మొలకెత్తిన వెంటనే గోటితో ద్రుంచి పారవేయవచ్చును అది యెంతకెంతకు ముదిరి పెద్దవృక్ష మగుచుండునో అంతకంతకు ఎక్కువ సేపు మంచిగొడ్డలిచేత నరకవలసియుండును ఇదే సంసారవృక్షముయొక్క స్వరూపము కావున నెంతెంత బాల్యావస్థల నుండి విముక్తి పొందదలచిన అంతంత సులభముగా నుండును మరియు మట్టిదుత్తయందు చిరకాలము నూనెగాని, నెయ్యిగాని ఉండినచో ఆ నూనెగాని, నెయ్యిగాని వెంటనే పారవేసిన ఆపెంకులో చిరకాలము నుండెడి చమురు నశింపదు ఆ మట్టి పాత్రను చాలసేపు నిప్పులో పెట్టి కాల్చవలెను అప్పుడే దానియందుగల చమురు నశించును సంసార వాసనలో తగులుకొనిన జీవి, క్రొత్తమట్టి పాత్రవలె నుండును. సంసారవాసనలో, విషయములో నెంతకాల

ముండునో, అది నశించుటకు చిరకాలము భగవత్ చింతనా, ధ్యాన, తపములు చేయవలసియుండును కావుననే శ్రీభగవద్గీత, పదిహేనవ అధ్యాయమున శ్రీకృష్ణభగవాను డిట్లుపదేశించెను

**న రూపమస్యేహ తథోపలభ్యతే నాన్తో న చాదిర్న చ సంప్రతిష్ఠా ।**
**అశ్వత్థమేనం సువిరూఢమూల మసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్వా ॥**

ఈ సంసారవృక్షముయొక్క రూపము తెలియబడదు ఆలాగున అంత మున్ను తెలియబడదు మొదలున్ను తెలియబడదు స్థితియున్ను తెలియబడదు అనగా దీనియొక్క ఆది, మధ్య, అంతములు సామాన్య జనులకు గోచ రము గావు లెస్సగ పారిన వేరులు గల యీ సంసారమనెడి అశ్వత్థ వృక్షమును దృఢమైన వైరాగ్యమనెడు గొడ్డలి చేత ఛేదించవలెను

అసంగమనియు, దృఢమనియు నీఖడ్గముయొక్క లక్షణము తెలుప బడినది అనగా మంచి ఉక్కుతో చేయబడిన గొడ్డలి బాగుగ నూరినదిగా నుండవలెను బలముతో నరుకవలెనేగాని లేనిచో నిది తెగదు

తళతళ మెరిసెడు తగరపుకత్తిచే నరికిన నిది తెగునది కాదు కనుక తీవ్ర వైరాగ్యనిష్ఠ గలవారిచేతనే ఈ సంసారవృక్షమును ఛేదించుటకు సాధ్యమ గును అందువల్లనే కొందరు స్వల్పస్వల్ప వైరాగ్యము కలిగియు, స్వల్పస్వల్ప భక్తిగాని, ధ్యానముగాని, తపస్సుగాని చేసియు అజ్ఞానమను సంసారవృక్ష మును ఛేదింపజాలక శ్రమపడుచుందురు

## 16. యోగవాసిష్ఠము

**తత్త్వజ్ఞానం మనోనాశః వాసనాక్షయ ఏవ చ ।**
**మిథః కారణతాం గత్వా దుస్సాధాని స్థితాని హి ।**

తత్త్వజ్ఞానము, మనోనాశము, వాసనాక్షయము – ఈమూడు నొకదాని కొకటి కారణములుగా నున్నందున ప్రత్యేకముగా కాలభేదముచేత నభ్యసించినయెడల సిద్ధింపనేరవు

**యావద్విలీనం న మనో న తావద్వాసనాక్షయః ।**
**న క్షీణా వాసనా యావచ్చిత్తం తావన్న శామ్యతి ॥**

ఎంతవరకు మనస్సు నశించదో అంతవరకు వాసనలు నశించవు ఎంత వరకు వాసనలు నశింపవో అంతవరకు మనస్సు కూడ నశించదని అర్థము

**యావన్న తత్త్వవిజ్ఞానం తావచ్చిత్తశమః కుతః ।**
**యావన్న చిత్తోపశమో న తావత్తత్త్వవేదనమ్ ॥**

ఎంతవరకు తత్త్వజ్ఞానము కలుగదో, అంతవరకు చిత్తనాశము కలుగదు ఎంతవరకు చిత్తనాశము కలుగదో అంతవరకు తత్త్వజ్ఞాన ముదయము కాదని భావము.

మనోనాశనమునకు మనస్సు నశించిపోవలెనని అర్థము కాదు మనస్సులోగల దృశ్యాది విషయములు నశించవలెనని గ్రహించవలెను మన స్సులో నేమియు తెలియకుండునట్టి అవస్థయే మోక్షమని కొందరు చెప్పు దురు అది వట్టి భ్రాంతి మాత్రము సువర్ణములోగల మలిన లోహములను స్ఫుటముచేసి శుద్ధమొనర్చులాగున బ్రహ్మవిచారముచే అనాత్మ భావనమును రహితమొనర్చి శుద్ధాత్మస్వరూపుడై యుండవలెను. ఇదే దీనియొక్క నిజా ర్థము అట్లు గాక బంగారమందుగల చెడు లోహములను స్ఫుటము చేసి శుద్ధ పరచవలసి యుండుదానికి బంగారమునుకూడ నశింపజేయవలెనని చెప్పిన ట్లుండునని మరువకుడు వేదాంతులలోను, తపస్వులలోను, యోగస మాధినిష్ఠ కలవారలలోను పైజెప్పిన ఒక దురభిప్రాయము గలదు దానియొక్క నిజము తెలిసికొనుడు

**శ్రవణాదిభిరుద్దీప్త జ్ఞానాగ్ని పరితాపితః ।**
**జీవస్సర్వమలాన్ముక్త స్స్వర్ణవద్ద్యోతతే స్వయమ్ ॥**

బంగారు మలినలోహములతో గూడి ఉన్నప్పటికిన్ని, వాటికి చేయవలసిన పుటాది సంస్కారములచేత వాటియందుండు మాలిన్యము నివర్తింపబడి బంగారు తనకు తానే ప్రకాశించుచున్నట్లు, జీవుడును శ్రవ

ణాద్యభ్యాసము వల్ల వాడుకపడి సంసారహేతుభూతమైన మూలా జ్ఞానము వల్ల నివర్తింప బడినవాడై తనకుతానే స్వయం జ్ఞానస్వరూపుడై ప్రకాశించుచున్నాడు అని శంకరులు ఆత్మబోధ యందు తెలిపినారు

# 17. విచారసాగరము

"శ్రవణాదిత్రయముచే గలిగెడు ప్రయోజనము" "విచారసాగరము"

1 యుక్తివలన వేదాంతవాక్యముయొక్కతాత్పర్య నిశ్చియంబును శ్రవణమందురు

2 జీవబ్రహ్మల అభేదమునకు సాధకము లయిన, భేదమునకు బాధకములయిన యుక్తులచేత అద్వితీయ బ్రహ్మచింతనంబును మనన మందురు

3 అనాత్మాకార వృత్తియొక్క పరిత్యాగముచేసి, వ్యవధాన రహితముగా, బ్రహ్మాకారవృత్తియొక్క స్థితిని నిదిధ్యాసన మందురు నిదిధ్యాసనమున యొక్క పరిపక్వావస్థనే సమాధియందురు ఈ శ్రవణాదిత్రయము జ్ఞానమునకు సాక్షాత్సాధనము గాదు అయినను బుద్ధిదోషములయిన అసంభావనా విపరీతభావనలకు నాశకముగా నున్నది

శ్రవణమువలన ప్రమాణాసంభావన, మననమువలన ప్రమేయా సంభావన, మఱియు నిదిధ్యాసనమువలన విపరీతభావన దూరమగుచున్నది ఈ ప్రకారముగా శ్రవణాదిత్రయము సంశయాదిత్రయమునకు నాశకముగ నున్నది

1 వేదాంతవాక్యములు అద్వితీయ బ్రహ్మప్రతిపాదికములా? లేక అన్యార్థప్రతిపాదకములా? ఇట్టి సందేహము ప్రమాణము నందగుచున్నది అది ప్రమాణాసంభావన 2. జీవబ్రహ్మల అభేదము సత్యమా?లేక భేదము సత్యమా? ఇట్టి సందేహము ప్రమేయమునందు గలుగుచున్నది అది ప్రమే యాసంభావన మఱియు, 3 దేహాదికము సత్యము, జీవబ్రహ్మల భేదము సత్యము – ఇట్టిజ్ఞానమును విపరీతభావన యందురు ఈ రీతిగా శ్రవణా

దిత్రయము అసంభావనా విపరీతభావనలకు నాశకరము అసంభావనా విపరీత ,బావనలు జ్ఞానమునకు ప్రతిబంధకములు కనుక జ్ఞానప్రతిబంధక నాశన ద్వారమున, శ్రవణాదికము జ్ఞానమునకు హేతువందురు కాని సాక్షాత్ హేతువుగాదు కనుక శ్రవణాదిత్రయమునకు పరంపరగా జ్ఞానహేతుత్వము జెప్పబడినది

దీనిముఖ్యమగు సారమేమనగా, 1 శ్రవణమువలన ప్రమాణగత సంశయనివృత్తియు, 2 మననము వలన ప్రమేయగత సంశయనివృత్తియు, 3 నిదిధ్యాసమువలన విపరీతభావనా నివృత్తియు గలుగుచున్నవి కావున శ్రవణ మొకటి మాత్రము చాలదు మనన నిదిధ్యాసములు ఉండవలయును లేనిచో ప్రమాణగత సంశయనివృత్తి మాత్రము గలుగును తక్కిన ప్రమేయ గతసంశయ విపరీతభావనలు తొలగవు ఇదియే దీనిలో తెలియదగిన విషయము,

జ్ఞానమునకు సాక్షాత్సాధనము శ్రోత్రసంబంధమైన వేదాంతవాక్యమే ఆ వేదాంత వాక్యము రెండువిధములుగా నున్నది ఒకటి అవాంతరవాక్యము రెండవది మహావాక్యము పరమాత్మయొక్క లేక జీవునియొక్క స్వరూపము బోధించునట్టి వాక్యము అవాంతరవాక్యము మఱియు జీవపరమాత్మల యొక్క ఏకత్వమును బోధించునట్టి వాక్యము మహావాక్యము అవాంతర వాక్యమువలన పరోక్షజ్ఞానము, మఱియు మహావాక్యమువలన అపరోక్షజ్ఞానము కలుగుచున్నది బ్రహ్మమున్నది అను నీ జ్ఞానము పరోక్షజ్ఞానమనియు, నేను బ్రహ్మము అను నీజ్ఞానము అపరోక్షజ్ఞానమనియు ఎఱుంగవలయును త్వం బ్రహ్మ అని ఆచార్యులు చెప్పిన వాక్యమునకు శ్రోత్రముతో సంబంధమయిన క్షణమే అహంబ్రహ్మ – అను అపరోక్షజ్ఞానము ద్యోతక మగుచున్నది శ్రోత్రముతో వాక్యసంబంధము లేనియప్పుడు అజ్ఞానము పోడమదు అందువలన శ్రోత్రసంబంధముగల వాక్యము జ్ఞానమునకు హేతువు గానున్నది దానిలో అవాంతరవాక్యము పరోక్ష జ్ఞానమునకు, మహావాక్యము అపరోక్షజ్ఞానమునకు హేతువు. ఇది సంక్షిప్తముగా చెప్పడమైనది విస్తారముగా విచారసాగరములో కనందగును.

# 19. అధికారి

అధికారిని గురించి ముందుగా నిర్ణయించవలసి యుండినను, ఈచిన్న పొత్తముయొక్క ఆశయము శ్రవణ మనన నిదిధ్యాసనములు తప్పనిసరిగా ఉండవలయునని నిరూపించుట యగుటచేతను, వాచావేదాంతులకు సాధన చతుష్టయసంపత్తిగల అధికారియే యుండవలయునని అభిప్రాయుము లేనందుచేతను ఇది కట్టకడపట చేర్చబడమైనది

1 వేదాంతమునకు బ్రహ్మసూత్రమే మకుటమగుటచేత శ్రీవ్యాసభగవానుడు మొట్టమొదట 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అని ఉపదేశించెను దీనిలో 'అథ' అనుపదమునకు శ్రీశంకరభగవత్పాదులు ఏమి యర్థమును నిర్ణయించిరో, దానిని తెలుపుటకు మచ్చుకు మాత్రముగ తెలుపడమైనది. అథ శబ్దమునకు అనంతరమనియే భాష్యకారులందరు భాష్యమును వ్రాసియున్నారు. అప్పుడు దేనియొక్క అనంతరము అను ఆకాంక్ష వచ్చుచున్నది సాధన చతుష్టయ సంపత్తి గలిగినపిమ్మట అని భాష్యకారులు సమాధానము చెప్పిరి సాధనచతుష్టయ సంపత్తి యనగా 1 నిత్యానిత్య వస్తువివేకము, 2 ఇహాముత్ర ఫలభోగమువిరాగము, 3 శమాదిషట్కసంపత్తి, 4 ముముక్షుత్వము ఇది వేదాంతబాలబోధమునుండి సూత్ర భాష్యము వఱకు గల అన్ని గ్రంథములలోను గలదు వేదాంతులకందఱికిని తెలిసిన విషయమే శమాదిషట్క సంపత్తిలో ఆరు లక్షణములు గలవు 1 శమము, 2 దమము, 3 ఉపరతి, 4.తితిక్ష, 5 శ్రద్ధ, 6 సమాధానము. ఇప్పుడు శ్రవణ మొకటియే చాలున నియు అదియే మనన నిదిధ్యాసములుగా మారుచున్నదనియు చెప్పువారికి పైనుదాహరించిన శమదమాదిగుణములు, సాధన చతుష్టయ సంపత్తి ఎంతవఱకు ఉండునో అను విషయము బుద్ధిమంతులకు వదలివేయడమైనది

3 ఆత్మబోధమందు శ్రీశంకరభగవత్పాదులు అధికారిని గురించి ఏమి చెప్పిరో చూడుడు

**తపోభిః క్షీణపాపానాం శాంతానాం వీతరాగిణామ్ ।**
**ముముక్షూణా మపేక్ష్యోఽయమాత్మబోధో విధీయతే ॥**

1) తపస్సులచేత క్షీణించిన పాపము గలవారును, అంతఃకరణము లోగల దోషములు శమించినవారును, ఐహికాముష్మిక ఫలభోగములందు ఇచ్ఛలేని వారును అగు తీవ్ర మోక్షాపేక్ష గల వారికి ఈ ఆత్మబోధ అపేక్షింప దగినది.

2) శ్రవణముమాత్రము చాలునని చెప్పువారికి పైచెప్పిన గుణములు ఎంతవఱకు గలవో తెలిసికొనుట తీవ్రముముక్షువులకు వదలి వేయడమైనది.

3 వివేక చూడామణియందు అధికారిని గురించి శ్రీ శంకరాచార్యులవారు ఏమి ఆనతిచ్చిరో అదియును తెలిసికోదగినదే

**వివేకినో విర క్తస్య శమాదిగుణ శాలినః ।**
**ముముక్షో రేవహి బ్రహ్మజిజ్ఞాసా యోగ్యతా మతా ॥**

వివేకము, విరక్తి, శమదమాది గుణములు గల ముముక్షువే బ్రహ్మవిచారము చేయుట కర్హుడగునని సమ్మతము దీనియొక్క భావమునుగూడ తెలిసికొనుట జిజ్ఞాసువులపై వేయడమైనది

4 ఇక అందఱును పారాయణము చేసెడు శ్రీమద్భగవద్గీతలో అధికారిని గురించి 5-వ అధ్యాయమున 7-వ శ్లోకమున నిరూపించినది చూడుడు

**యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః ।**
**సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥**

(1) శుద్ధాంతఃకరణుడును, (2) జయింపబడిన మనస్సు గలవాడును, (3) ఇంద్రియ నిగ్రహము గలవాడును, (4) సమస్త ప్రాణులు తమవంటివే యను సమభావము గలవాడును, (5) యోగనిష్ఠాపరుడు

నయినవాడు కర్మల నాచరించుచున్న వాడైనను, ఆ కర్మలచే బద్ధుడు గాడు.

ఇప్పుడు యోగులమని చెప్పుచు ఏ కర్మలు చేసినను మాకంటవు అని చెప్పు వా రెట్టిస్థితిలో నున్నారో దీని యొక్క అర్థముగూడ గీతాపారాయణ నిష్ఠగల భక్తులు గ్రహించులాగున వారిపై పెట్టడమైనది ఈలాగున సమస్త వేదాంత గ్రంథములలోను అధికారిని గురించి తెలుపబడియున్నది. అదంతయు వ్రాసిన ఈ గ్రంథము పెరుగును ఇది సంగ్రహముగ నిరూపించడమైనది బ్రహ్మనిష్ఠులకు గల ప్రమాదములను గూర్చియు, విఘ్నములను గుఱించియు నిర్విఘ్నయోగసిద్ధి అను గ్రంథమున విస్తారముగా గనందును.

**ఓంకారాది జపోఽప్యేవం భావగర్భో హ్యుదాహృతః।**
**ధ్యేయవస్తు స్వరూపస్య దార్ఢ్యాయ హి జపో మతః॥**

బ్రహ్మోపాసకులు, నారాయణోపాసకులు, శివోపాసకులు, కృష్ణోపాసకులు, రామోపాసకులు మొదలగు వారందఱును వారివారి యొక్క ఉపాసనా దైవసాక్షాత్కారము కొఱకును, జ్ఞేయమగు బ్రహ్మముయొక్క దృఢానుభవము కొఱకున్ను భావగర్భములగు తత్తదోంకారాది మంత్రములను జపించవలయునని శాస్త్ర సమ్మతము



ॐ

# శ్రీభగవద్గీతాష్టాదశాధ్యాయ

# ముక్తిసోపానము

## పీఠిక

**ఓం కృష్ణం కమలపత్రాక్షం పుణ్య శ్రవణకీర్తనమ్ ।**
**వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్ ॥**

**మోక్షస్థానం వరం పార్థ! సగుణం వాఽథ నిర్గుణమ్ ।**
**సోపానాష్టాదశైరేవం వరం బ్రహ్మాధిగచ్ఛతి ॥**

**(గీతా ద్వితీయ మాహాత్మ్యము)**

ఓ అర్జునా! సగుణమైనటువంటి లేక నిర్గుణమైనటువంటి మోక్షస్థానమునకు పదునెనిమిది యధ్యాయములను సోపానములనుగా జేసికొని మనుష్యుడు పరబ్రహ్మను పొందుచున్నాడు

**అంతరార్థము -**

**దృశ్యం దేహం చ వాగాది శ్రోత్రాదీన్ద్రియపంచకమ్ ।**
**ప్రాణాదిపంచకం చైవ తథాఽన్తఃకరణమేవ చ ॥**

**ముక్తిసాధన్య సోపానా అష్టాదశ ఇతీరితాః ।**
**ఏతాన్క్రమేణ చారుహ్య బ్రహ్మభూయాయ కల్పతే ॥**

1 దృశ్యము, 2 దేహము, 3 వాక్పాణి పాదపాయూపస్థలను పంచకర్మేన్ద్రియములు, 4 త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములను పంచజ్ఞానేన్ద్రియములు, 5 ప్రాణాపాన ఉదాన వ్యానసమానములను పంచప్రాణ

వాయువులు, 6 అన్తఃకరణము - ఈ పదునెనిమిదియు ముక్తియనెడు భవనమునకు మెట్లుగా జెప్పబడినవి మనోబుద్ధి చిత్తాహంకారములుతో నాలుగునుజేరి యొకే అంతఃకరణమని వ్యవహరింపబడును వీనిని క్రమముగాదాటి ముముక్షువు బ్రహ్మస్వరూపుడగుచున్నాడు. (ముక్తుడగుచున్నాడు )

గీతా నామధేయములు -

**గీతా గంగా చ గాయత్రీ సీతా సత్యా సరస్వతీ ।**
**బ్రహ్మవిద్యా బ్రహ్మవల్లీ త్రిసన్ధ్యా ముక్తగేహినీ ॥**
**అర్ధమాత్రా చిదానన్దా భవఘ్నీ భయనాశినీ ।**
**వేదత్రయీ పరానన్తా తత్త్వార్థజ్ఞానమఞ్జరీ ॥**

1 గీతా, 2 గంగా, 3 గాయత్రీ, 4. సీతా, 5 సత్యా, 6 సరస్వతీ, 7. బ్రహ్మవిద్యా, 8 బ్రహ్మవల్లీ, 9 త్రిసన్ధ్యా, 10 ముక్తగేహినీ, 11 అర్ధమాత్రా, 12 చిదానందా, 13 భవఘ్నీ, 14 భయనాశినీ, 15 వేదత్రయీ, 16 పరా, 17 అనంతా, 18 తత్త్వార్థజ్ఞానమంజరీ - అని భగవద్గీతకు పేర్లుగలవు ఇందువల్లనే 18 అధ్యాయము లేర్పడినవి ఈ విధి ననుసరించియే తృతీయాధ్యాయాన్తమున శ్రీకృష్ణ భగవానులిటుల నుపదేశించిరి.

**ఇన్ద్రియాణి పరాణ్యాహురిన్ద్రియేభ్యః పరం మనః ।**
**మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః ॥**
**ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా ।**
**జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్ ॥**

స్థూలదేహము 1, ప్రాణములు 5, కర్మేన్ద్రియములు 5, జ్ఞానేంద్రియములు 5, మనస్సు 1. బుద్ధి 1 చేరి పదునెనిమిది వీనికి పరమైనది పరమాత్మ స్వరూపము ఈ ముక్తిసోపానము రహస్యము నుపదేశించు చున్నది కఠోపనిషత్తున్ను ఈ సత్యమును తెలుపుచున్నది

**ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః ।**
**మనసశ్చ పరా బుద్ధిః బుద్ధేరాత్మా మహాన్పరః ॥**
**మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః ।**
**పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః ॥**

ఇంద్రియములకన్న విషయములు సూక్ష్మములు, వానికన్న మనస్సు సూక్ష్మము, మనస్సుకన్న బుద్ధి సూక్ష్మము, బుద్ధికన్న మహత్తత్త్వము సూక్ష్మమైనది అ మహత్తత్త్వముకన్న అవ్యక్తము సూక్ష్మమయినది అవ్యక్తముకంటె పురుషుడు (ఆత్మ) మహత్తరుడు ఆ యాత్మయే పరమాత్మస్వరూపము దానికన్న పరమైనది మఱియొకటి లేదు అదియే పరాకా ష్ఠ

**జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే ।**
**తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబన్ధైఃప్రముచ్యతే ॥**

జాగ్రత్స్వప్నసుషుప్తులను మూడు దేహములను, దేహధర్మములను ఏది ఎప్రకాశింపజేయుచు స్వయంప్రకాశమై యున్నదో, అదియే యాత్మ ఆ యాత్మయే బ్రహ్మమని యెవడెఱుంగుచున్నాడో, వాడు సమస్త సంసారబంధములనుండి ముక్తుడగుచున్నాడు అని కైవల్యోపనిషత్తు

**స్నానం దానం తపో హోమః పూజా సజ్జనసంగతి ః।**
**బ్రహ్మవిద్యా ప్రబోధశ్చ ముక్తిసోపానసప్తకమ్ ॥**

1 స్నానము, 2 దానము, 3 తపము, 4 హోమము, 5 పూజ, 6 సజ్జనసాంగత్యము, 7. బ్రహ్మవిద్యా ప్రబోధము ఈ ఏడును ముక్తియను సౌధము నెక్కుటకు సోపానములు శ్రీభగవద్గీతాష్టాదశాధ్యాయ ముక్తిసోపానములో జేరువారికి పైన నిరూపించబడిన యేడును అనుష్ఠేయములు

**సర్వశాస్త్రమయీ గీతా సర్వవేదమయో హరిః ।**

**సర్వతీర్థమయీ గంగా సర్వతేజోమయో రవిః॥**

ఏలాగున గంగ సర్వతీర్థమయమ్మైయున్నదో, ఏలాగున సూర్యుడు సర్వతేజోమయుడై యుంటున్నాడో, ఏలాగున హరి సర్వవేదమయుడై యున్నాడో, అలాగున గీతయు సర్వశాస్త్రమయమ్మై యున్నది

**సంసారసాగరం ఘోరం తర్తుమిచ్ఛతి యో నరః ।**

**గీతానావం సమాసాద్య పారం యాతి సుఖేన స ః ॥**

భయంకరమ్మైన సాగరమును దాటుటకు ఓడ యెట్టిదో, అలాగున సంసార సాగరమును దాటుటకు భగవద్గీత అట్టిది కాన ఏ మానవుడు అనేక దుఃఖములకు కారణమగు సంసారసాగరమును దాటగోరుచున్నాడో అట్టివాడు శ్రీభగవద్గీత యను నావను అవలంబించినచో యేలాటి ప్రయాసలేక సుఖముగా తీరమును జేరవచ్చును

**మహాపాపాది పాపాని గీతాధ్యానం కరోతి చేత్ ।**

**క్వచిత్స్పర్శం న కుర్వన్తి నలినీదళమమ్బుసా ॥**

ఎవరైతే గీతాధ్యానము జేయుదురో వారికి కమలపత్రమునకు నీరంటని చందమున, మహాపాపములుగాని, ఉపపాపములుగాని కొంచెమైనను అంటవు

ఓమ్ తత్ సత్



# శ్రీభగవద్గీతాష్టాదశాధ్యాయ

# ముక్తిసోపానము

## 1. ప్రథమ సోపానము

**అర్జున విషాద యోగము**

**ఏవముక్త్వాఽర్జునస్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।**
**విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః ॥ (1-47)**

అర్జునుడిట్లు చెప్పి దుఃఖముచేత చలించిన మనస్సు గలవాడై ధనుర్బాణములను విడిచి యుద్ధమునందు దిగులు నొంది రథముపై చతికిలబడెను

## 2. ద్వితీయ సోపానము

**సాంఖ్య యోగము**

**అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ ।**
**నిత్యస్సర్వగతస్స్థాణురచలోఽయం సనాతనః ॥ (2-24)**

ఈ యాత్మ ఛేదింప నలవిగానిది. దహింప నలవిగానిది. తడుప శక్యము గానిది. ఎండింప సాధ్యము కానిది సర్వవ్యాపక మైనది నిశ్చలమును అనాదియు నైనది ఇంద్రియములకు గోచరము గానిది, మనస్సుచేత చింతింప నలవిగానిది, సనాతన మైనది

## 3. తృతీయ సోపానము

**కర్మ యోగము**

**తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర ।**
**అసక్తోహ్యాచరన్కర్మ పరమాప్నోతి పూరుషః ॥ (3-19)**

కావున ఓ అర్జునా! ఫలమందాసక్తి లేక నిరన్తరము నియతమగు కర్మను జేయుము ఎందుకనగా ఫలాసక్తిలేక కర్మను జేయుచున్న పురుషుడు ముక్తిని బొందును

## 4. చతుర్థ సోపానము

**జ్ఞాన యోగము**

**వీతరాగ భయక్రోధా మన్మయా మాముపాశ్రితాః ।**
**బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥ (4-10)**

రాగద్వేషభయములను వదలినవారై ప్రపంచమంతయు భగవన్మయముగ జూచుచు నన్నాశ్రయించుటచే ననేకులు పవిత్రులై నా భావమును బొందిరి

## 5. పంచమ సోపానము

**కర్మ సన్న్యాస యోగము**

**సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ ।**
**తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే ॥ (5-2)**

జ్ఞానయోగమును, కర్మయోగమున్ను ముక్తిని గలుగజేయు నవియే అయినను కర్మను విడిచి యుండుటకంటె నిష్కామకర్మయోగమును నవలంబించి ప్రవర్తించుటయే శ్రేష్ఠము

## 6. షష్ఠ సోపానము

**ఆత్మసంయమ యోగము**

**యం సన్న్యాసమితి ప్రాహుః యోగం తం విద్ధి పాండవ ।**
**న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన ॥ (6-2)**

ఓ అర్జునా! దేనిని సన్న్యాసమని చెప్పుదురో అద్దానిని నీవు యోగమని తెలిసికొనుము. ఎవడు మనస్సుయొక్క సంకల్పములను రహిత మొనర్చలేదో వాడెన్నటికిని యోగి కాజాలడు

## 7. సప్తమ సోపానము

**విజ్ఞాన యోగము**

**రసోఽహమప్సు కౌన్తేయ ప్రభాఽస్మి శశిసూర్యయోః ।**
**ప్రణవస్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥ (7-8)**

ఓ అర్జునా! జలమందలి రసమున్ను, సూర్యచంద్రులయందలి ప్రకాశమున్ను, వేదము లందలి ఓంకారమున్ను, నరులందు కృతకృత్యతా రూపమగు పుణ్యస్వభావమున్ను నేనై యున్నాను

## 8. అష్టమ సోపానము

**అక్షర పరబ్రహ్మ యోగము**

**ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్ ।**
**యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్ ॥ (8-13)**

పరబ్రహ్మవాచకమైన "ఓం" యనెడి యేకాక్షరము నుచ్చరించుచు, ఓంకారస్వరూపుడైన పరబ్రహ్మమును (భగవానుని) ధ్యానించుచు నెవడు దేహమును విడుచునో అట్టివాడు సర్వోత్తమమైన ముక్తిని బొందును

## 9 నవమ సోపానము

**రాజవిద్యా రాజగుహ్య యోగము**

**అపి చేత్సుదురాచారో భజతే మామనన్య భాక్ ।**
**సాధురేవ స మన్తవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః ॥ (9-30)**

ఎడతెగని భక్తితో నన్నే సేవించువాడు మిక్కిలి దురాచారుడైనను పాపియైనను వానిని శ్రేష్ఠుడనియే తలంచవలయును ఏలయన నెల్లప్పుడు నితరచింతలు లేక నాయందే నిశ్చల బుద్ధిగల భక్తుడు పవిత్రుడే యగును

## 10. దశమ సోపానము

**విభూతి యోగము.**

**యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జిత మేవ వా।**
**తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసమ్భవమ్ ॥ (10-41)**

ఈశ్వర సంబంధమైనదియు, చైతన్య యుక్తమైనదియు, అత్యన్తోత్సాహముతో గూడుకొనినదియు నగు వస్తుసమూహ మేదిగలదో అది యంతయు నాతేజోఽంశమువలననే గలిగిన దానినిగా నీవు తెలిసికొనుము

## 11. ఏకాదశ సోపానము

**విశ్వరూప సందర్శనయోగము**

**మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః।**
**నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ! ॥ (11-55)**

అర్జునా! ఎవడీశ్వరార్పణబుద్ధితో సత్కర్మలను జేయుచు, నీశ్వరునే పరమశరణ్యమని నమ్మి భగవద్భక్తి గలవాడై దేనియందును సంగములేక యే ప్రాణియందును వైరబుద్ధిలేక యుండునో అతడే నన్ను బొందును గాని యితరులు పొందరు

## 12. ద్వాదశ సోపానము

**భక్తి యోగము**

**యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే।**
**శ్రద్ధధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః ॥ (12-20)**

ఎవరీశ్వరునే పరమగతి యని నమ్మి మోక్షప్రదములై ఈ అమృత వాక్యములను నేను చెప్పిన విధమున నాచరించి శ్రద్ధతో నడుచుకొనుచున్నారో అట్టి భక్తిగలవారు నాకు మిక్కిలి ప్రియులు

## 13. త్రయోదశ సోపానము

**క్షేత్ర క్షేత్రజ్ఞవిభాగ యోగము**

**సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।**
**వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥ (13-28)**

ఎవడు బ్రహ్మాది స్తంబపర్యన్తముగల సమస్తప్రాణులయందు సమానముగా నుండునో, వస్తు సముదాయము నశించుచుండినను నెవడు నాశమును బొందడో, అట్టి పరమేశ్వరుని సమస్తములోను సమానముగా జూచువాడే నిజముగా జూచువాడు

## 14. చతుర్దశ సోపానము

**గుణత్రయవిభాగ యోగము**

**గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే ॥ (14-20)**

దేహము వచ్చుటకు కారణభూతము లయిన సత్త్వరజస్తమో గుణములను దేహి ఎపుడతిక్రమించునో అప్పుడతడు జన్మ మృత్యు జరా దుఃఖములచే విడువబడి మోక్షము నొందును

## 15 పంచదశ సోపానము

**పురుషోత్తమప్రాప్తి యోగము**

**యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్ ।**
**యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః ॥ (15-11)**

ధ్యానాదులచే బ్రహ్మస్వరూపమును తెలియ ప్రయత్నము జేయుచున్న ధ్యానయోగులు (జ్ఞానులు) తమయందున్నట్టి యీ యాత్మను దర్శించు చున్నారు ధ్యానభజనాది ప్రయత్నములు జేయుచున్నను, చిత్తశుద్ధిలేని యవివేకులు ఈ యాత్మను తెలిసికొనజాలరు

## 16 షోడశ సోపానము

దైవాసురసంపద్విభాగ యోగము

**య శ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః ।**

**న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥ (16-23)**

ఎవడు శాస్త్రవిధి నుల్లంఘించి తన యిష్టానుసారముగా ప్రవర్తించునో అట్టివాడు కార్యసిద్ధిని బొందడు ఈ లోకమున సుఖము నొందడు మరణానన్తరము మోక్షమును బొందడు

## 17 సప్తదశ సోపానము

శ్రద్ధాత్రయవిభాగ యోగము

**సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత! ।**

**శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః ॥ (17-3)**

ఓ అర్జునా! సమస్త ప్రాణులకును వాని వాని పూర్వజన్మ సంస్కారములతో గూడిన అన్తఃకరణమునకు దగిన శ్రద్ధయే కలుగుచున్నది పురుషుడు (జీవుడు) శద్ధాస్వరూపు డగుచున్నాడు అనగా ఎవడెట్టి శ్రద్ధగలవాడో వాడట్టి శ్రద్ధతో గూడినవాడగును

## 18 అష్టాదశ సోపానము

మోక్షసన్న్యాస యోగము

**సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।**

**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥ (18-66)**

సర్వధర్మముల విడనాడి నన్నొకనినే శరణు పొందుము నేను నిన్ను అన్ని పాపములనుండి విడిపించెదను, శోకింపకుము ఓమ్ తత్ సత్



# జీవసమాధిచేయు విధానము

## అవతారిక

అనేకమంది భక్తులు సాధువులు, సన్న్యాసులు, యోగులు, మహనీయుల దేహవియోగానంతరము వారి పాంచభౌతిక శరీరము నెట్లు సమాధి చేయవలెనని అడుగుచుందురు అందువల్ల యంత్రములతో, బీజాక్షరముతో సంక్షిప్తముగా 'సమాధి చేయువిధానము' అను పేరుతో నీ చిన్నపొత్తము వ్రాయబడినది దీనియందు నిరూపించిన భూసమాధిగాక, జలసమాధి మరియొకటి గలదు. అది లోతైన పుణ్యనదిలో చేయుదురు అప్పుడు ఈ భూసమాధిక్రమము ననుసరించి చేయవలసిన పనిలేదు పూజాక్రమ ప్రకారము చేసికొని జలసమాధి చేయవచ్చును సమాధిక్రమము దేశమును, సంప్రదాయమును అనుసరించి అనేక విధములుగా నున్నది సంగ్రహముగా నిది వ్రాయబడినది ఇక నేదైన విపులముగా దీనియందు చేర్చవలసి యుండినచో వ్రాసిపంపిన పరిశీ లించి మరుముద్రణమునందు చేర్చబడును సజ్జనులు రాజహంసవలె క్షీర నీర విభాగము చేసి సారగ్రాహులై యుందురు గదా!

ఓం సత్యం శాన్తం దయ

ఇట్లు
తమ చరాచర సుఖాభిలాషి
శ్రీమలయాళస్వామి.

F37



# సమాధిచేయు విధానము

## ముఖం

1 దీనికిముందు ఆ స్థలములో ఏదియు లేనిచో, ఉత్తర ముఖముగా గాని, తూర్పుముఖముగా గాని యుండవచ్చును.

2. ఆ స్థలములో మఠముగాని, దేవాలయముగాని, గొప్పవారి యొక్కగాని లేక తమ గురువుయొక్క గాని సమాధి యుండినచో, అవి అన్నియు ఏ ప్రక్క ముఖములుగా నుండునో ఆలాగున చేయవచ్చును లేక పైజెప్పినవాని ముఖమునకు కుడిప్రక్కగాని, ఎడమప్రక్క గాని ముఖముగా నుండవలయును అనగా ఆ స్థలములో తూర్పుముఖముగా పైజెప్పిన వానిలో ఏదైన నుండినచో క్రొత్తగా సమాధి చేయువారి ముఖము ఉత్తరముగాని, దక్షిణము గానియుండవలెను ఉత్తరముఖముగా పైజెప్పిన వానిలో ఏదైన ఉన్నచో, క్రొత్తగా సమాధిచేయువారి ముఖము తూర్పుగాని, పడమటగాని పెట్ట వలయును ఈలాగున తక్కిన రెండు దిక్కుల ముఖములను గ్రహించుకొ నవలయును అనగా దేవాలయ మూలస్థానము నకు రెండుప్రక్కలను దర్శ నము చేయురీతిగా నుండవలయును లేక స్థలము ననుసరించి సమ్ముఖముగా (ఎదురు ముఖముగా) కొంచెము దూరముగా నుండవలయును. లేక కుడిప్రక్కగాని, ఎడమప్రక్కగాని యుండవచ్చును.

పృథివ్యాధి చక్రములున్ను, బీజాక్షరములున్ను చేయుటకు ఉప్పు, కర్పూరము మొదలగునవి పూర్తిగా వేయక అక్షరము లిఖించుటకుమాత్రము వేసి తక్కినవి శరీరము చుట్టు శిరస్సు వఱకు వేసి ప్రక్కల మట్టితో పూడ్చుకొనివచ్చి శిరస్సుపై మాత్రము సహస్రార చక్రము లిఖించి, ప్రణవమును వ్రాయవలయును. తర్వాత భూమికి సమముగా మట్టితో

ప్రతిష్ఠింపవచ్చును అట్లు ప్రతిష్ఠించినచో నిత్యమున్ను అభిషేకపూజాదులు జరుగవలెను. లేనిచో మంచిశిలలో గురువులయొక్క పాదుకలను చేసి ప్రతిష్ఠంచిన చాలును అట్లు గానిచో ఓంకారము శిలపై చెక్కించి స్థాపించవచ్చును సామాన్యముగా తులసికోట కట్టి తులసికూడ ప్రతిష్ఠింతురు ఏయే ప్రతిష్ఠ చేయుదురో దానికి సంబంధించిన ఆవాహనాది మంత్రములతో ప్రాణప్రతిష్ఠ చేసి దానికి సంబంధించిన పూజాదులు సలుపవలెను, మొదటినుండి అంతమువరకు మంగళవాద్య, భజన, నామసంకీర్తనము లుండవలెను

ఓం శివం శాంతమమృత మద్వైతమ్



---

(1) సమాధిస్థాపన చేసెడి విధానము

| | | |
|---|---|---|
| పృధ్వీచక్రం |  | పుణ్యస్థలమృత్తిక |
| పృధ్వీబీజం | | లేక |
| మూలాధారం | | శుద్ధమైన ఇసుక |



లం - పృధివ్యాత్మనే, గ్రంధతన్మాత్రానందాత్మనే శ్రీ గురుదేవాయ నమః పృధివ్యాత్మకం గంధం సమర్పయామి.

(2)

జలచక్రము

జలబీజం

స్వాధిష్ఠానము




ఉప్పు

వం - అబాత్మనే, రసతన్మాత్రానందాత్మనే-శ్రీగురుదేవాయ నమః
అబాత్మకం స్నానం సమర్పయామి.

---

(3)

అగ్నిచక్రము

అగ్నిబీజము

నాభిస్థానము




కరూర్పము

రం- తేజ ఆత్మనే, రూపతన్మాత్రానందాత్మనే శ్రీ గురుదేవాయ నమః.
తేజ - ఆత్మకం దీపం సమర్పయామి.

విధానము కలదు సమాధియైనవారి దేహసంబంధులు ఏదైన కర్మకాండ క్రియలు చేయ వలసియుండిన ఆపదవరోజులోనే పూర్తిచేసికొనవలయున ఆరాత్రిలో సమాధి చుట్టునున్న పదిదీపములకు తక్కువలేక ఎన్నైన పెట్టవచ్చును ఆదినము రాత్రియందు భజనలు హరికథలు శక్తికొలది జరుప వచ్చును సుండలు మొదలైన ఫలహారములు వినియోగపఱచవచ్చును పది టెంకాయలు కొట్టి హారతి చేయవచ్చును కర్మకాండతంతులన్నియు అంతటితో పూర్తి యగును. కర్మకాండక్రియలు లేనివారైనను పదవరోజున నారాయణబలి చేయవలయును అప్పుడు దీపములు, నైవేద్యములు, హరికథలు. ఉపన్యాసములు, శక్త్యమసారముగ చేయవలయును

మరల నలుబదవరోజున మండలాభిషేకము ఉదయమునుండి పూజ, గీతాపారాయణ మొదలైనవి చేసికొని, అనుకూలముండిన సాధుపూజలు గూడ చేసికొనవచ్చును (యతిపూజలు) మరియు సమారాధన, వస్త్రదానము, పుస్తకదానము శక్త్యనుసారముగా చేయవచ్చును ఆ దినమ, రాత్రిలో పదవరోజున చెప్పినట్లు భజనాదులు చేయవచ్చును

మండలాభిషేకవిషయమై కొన్ని సంప్రదాయములవారు సమాధి యైన నలుబదవరోజులోను, మరికొన్ని సంప్రదాయములవారు నలుబది ఒకటవ రోజులోను చేయుదురు మఱియు సమాధియైన ఆదినమునుండి పైచెప్పిన రోజుల ప్రకారముగాను, ఇంకను కొందఱు ఆ దినమే భూసమాధి చేసినచో ఆదినమునుండియు, మరికొందఱు పరమసమాధి చేసిన దినమునుండియు రోజులు లెక్క పెట్టుదురు. కొందఱు జలసమాధిగూడ చేయుదురు దానికి పుణ్యనది యుండవలయును మరికొన్ని సంప్రదాయములవారు అగ్ని సంస్కారము అనగా దహనము చేయుదురు వారికి భూసమాధిక్రమ మవసరము లేదు పూజమాత్రము చేసిన చాలును

సమాధి కట్టించ దలంచువారు సంవత్సరారాధన రోజునకు పూర్తి చేయవలయును సమాధిపైన మందిరముగాని, మఠముగాని కట్టదలంచు వారు ఎప్పుడైన చేయవచ్చును దానియందు జ్ఞాపకార్థము గురుదేవు

డుపయోగించెడు పుస్తకములుగాని, దండకమండలములుగాని, పాదుకలు గాని, వ్యాఘ్రాసనాదులుగాని, జపమాలగాని, యింకేదైన వారికి మిక్కిలి ప్రీతికరవములగు వారుపయోగించెడి వస్తువులుగాని యుంచవచ్చును వారుపదేశించెడి ముఖ్యవాక్యములు వ్రాయవచ్చును

## పూజాసంగ్రహము

1 ధూపం

**ధూపం నానాపరిమళం యక్షకర్దమ మిశ్రితమ్।**
**దశాంగద్రవ్యసంయుక్త మంగీకురు మయార్పితమ్॥**

2 దీపము

**దీపం కాంచనపాత్రస్థం నవగోఘృతసాధితమ్।**
**అర్పయామి మహాధ్వాంత గజపంచాస్యసన్నిభమ్॥**

3 నైవేద్యము

**నైవేద్యమన్నం సూపాది శాకపక్వాన్న సంయుతమ్**
**స్వర్ణపాత్రస్థితం స్వాదు భుక్త్వా త్వం తృప్తిమాప్నుహి॥**

4 హారతిమంత్రములు

**ఓం ఈశానస్సర్వవిద్యానామీశ్వరస్సర్వభూతానామ్।**
**బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోఽధిపతిర్బ్రహ్మా శివోమేఽస్తు సదాశివోమ్॥**
**అన్తర్జ్యోతిర్బహిర్జ్యోతిః ప్రత్యగ్జ్యోతిః పరాత్పరః।**
**జ్యోతిర్జ్యోతిస్స్వయం జ్యోతిరాత్మజ్యోతిశ్శివోఽస్మ్యహమ్॥**
**ఆత్మజ్యోతిర్మనోజ్యోతి ర్జ్యోతిశ్చక్షుస్స పశ్యతి।**
**స బాహ్యాభ్యన్తరజ్యోతిస్సా జ్యోతిశ్శివముచ్యతే ॥**

5 ప్రదక్షిణం

**యాని కాని చ పాపాని జన్మాంతర కృతాని చ।**
**తాని తాని వినశ్యంతు ప్రదక్షిణ పదే పదే॥**

**హరిః ఓమ్ తత్ సత్.**

విధానము కలదు సమాధియైనవారి దేహసంబంధులు ఏదైన కర్మకాండ క్రియలు చేయ వలసియుండిన ఆపదవరోజులోనే పూర్తిచేసికొనవలయున ఆరాత్రిలో సమాధి చుట్టునున్న పదిదీపములకు తక్కువలేక ఎన్నైన పెట్టవచ్చును ఆదినము రాత్రియందు భజనలు హరికథలు శక్తికొలది జరుప వచ్చును సుండలు మొదలైన ఫలహారములు వినియోగపఱచవచ్చును పది టెంకాయలు కొట్టి హారతి చేయవచ్చును కర్మకాండతంతులన్నియు అంతటితో పూర్తి యగును. కర్మకాండక్రియలు లేనివారైనను పదవరోజున నారాయణబలి చేయవలయును అప్పుడు దీపములు, నైవేద్యములు, హరికథలు. ఉపన్యాసములు, శక్త్యమసారముగ చేయవలయును

మరల నలుబదవరోజున మండలాభిషేకము ఉదయమునుండి పూజ, గీతాపారాయణ మొదలైనవి చేసికొని, అనుకూలముండిన సాధుపూజలు గూడ చేసికొనవచ్చును (యతిపూజలు) మరియు సమారాధన, వస్త్రదానము, పుస్తకదానము శక్త్యనుసారముగా చేయవచ్చును ఆ దినమ, రాత్రిలో పదవరోజున చెప్పినట్లు భజనాదులు చేయవచ్చును

మండలాభిషేకవిషయమై కొన్ని సంప్రదాయములవారు సమాధి యైన నలుబదవరోజులోను, మరికొన్ని సంప్రదాయములవారు నలుబది ఒకటవ రోజులోను చేయుదురు మఱియు సమాధియైన ఆదినమునుండి పైచెప్పిన రోజుల ప్రకారముగాను, ఇంకను కొందఱు ఆ దినమే భూసమాధి చేసినచో ఆదినమునుండియు, మరికొందఱు పరమసమాధి చేసిన దినమునుండియు రోజులు లెక్క పెట్టుదురు.కొందఱు జలసమాధిగూడ చేయుదురు దానికి పుణ్యనది యుండవలయును మరికొన్ని సంప్రదాయములవారు అగ్ని సంస్కారము అనగా దహనము చేయుదురు వారికి భూసమాధిక్రమ మవసరము లేదు పూజమాత్రము చేసిన చాలును

సమాధి కట్టించ దలంచువారు సంవత్సరారాధన రోజునకు పూర్తి చేయవలయును సమాధిపైన మందిరముగాని, మఠముగాని కట్టదలంచు వారు ఎప్పుడైన చేయవచ్చును దానియందు జ్ఞాపకార్థము గురుదేవు

డుపయోగించెడు పుస్తకములుగాని, దండకమండలములుగాని, పాదుకలు గాని, వ్యాఘ్రాసనాదులుగాని, జపమాలగాని, యింకేదైన వారికి మిక్కిలి ప్రీతికరవములగు వారుపయోగించెడి వస్తువులుగాని యుంచవచ్చును వారుపదేశించెడి ముఖ్యవాక్యములు వ్రాయవచ్చును

# పూజాసంగ్రహము

1 ధూపం

**ధూపం నానాపరిమళం యక్షకర్దమ మిశ్రితమ్।**
**దశాంగద్రవ్యసంయుక్త మంగీకురు మయార్పితమ్॥**

2 దీపము

**దీపం కాంచనపాత్రస్థం నవగోఘృతసాధితమ్।**
**అర్పయామి మహాధ్వాంత గజపంచాస్యసన్నిభమ్॥**

3 నైవేద్యము

**నైవేద్యమన్నం సూపాది శాకపక్వాన్న సంయుతమ్**
**స్వర్ణపాత్రస్థితం స్వాదు భుక్త్వా త్వం తృప్తిమాప్నుహి॥**

4 హారతిమంత్రములు

**ఓం ఈశానస్సర్వవిద్యానామీశ్వరస్సర్వభూతానామ్।**
**బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోఽధిపతిర్బ్రహ్మా శివోమేఽస్తు సదాశివోమ్॥**
**అన్తర్జ్యోతిర్బహిర్జ్యోతిః ప్రత్యగ్జ్యోతిః పరాత్పరః।**
**జ్యోతిర్జ్యోతిస్స్వయం జ్యోతిరాత్మజ్యోతిశ్శివోఽస్మ్యహమ్॥**
**ఆత్మజ్యోతిర్మనోజ్యోతి ర్జ్యోతిశ్చక్షుస్స పశ్యతి।**
**స బాహ్యాభ్యన్తరజ్యోతిస్సా జ్యోతిశ్శివముచ్యతే ॥**

5 ప్రదక్షిణం

**యాని కాని చ పాపాని జన్మాంతర కృతాని చ।**
**తాని తాని వినశ్యంతు ప్రదక్షిణ పదే పదే॥**

**హరిః ఓమ్ తత్ సత్.**